# తెలుగులో దేశిచ్ఛందస్సు

## ప్రారంభ వికాస దశలు

ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి
Ph. D. పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

డా॥ సంగనభట్ల నరసయ్య

ఆనందవర్ధన ప్రచురణలు
ధర్మపురి కరీంనగర్ జిల్లా



# తెలుగులో దేశిచ్ఛందస్సు - ప్రారంభ వికాసదశలు

Desi (indigenous) Metres in Telugu,
Its Origin & Evolution.



ప్రథమ ముద్రణ : మార్చి 1991

ప్రతులు : వేయి

ముఖ చిత్రాలంకరణ : బాలి

ప్రతులకు :

1) శ్రీమతి సంగనభట్ల సీతాలక్ష్మి
ఇంటి నెం. 11-137, బ్రాహ్మణవీధి,
ధర్మపురి (పో॥) 505 425
కరీంనగర్ జిల్లా, (ఆం.ప్ర)

2) క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి,
వి జ య వా డ - 2.

వెల రూ॥ 120/-

---

తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారి పాక్షిక ఆర్థిక సహాయముతో ముద్రితము.

# ముందుగా మూడు ముచ్చట్లు

పదకోశం, వాక్యనిర్మాణం, కావ్యశైలి, ఇతివృత్త గాథలు సంస్కృతము నుండి తెలుగులో చాలా విస్తృతంగా ప్రవేశించి, తెలుగు - సంస్కృత భాషా జన్యమా అనేటంత భ్రాంతిని కల్పించాయి. అన్ని శాఖల్లో ఈ సంస్కృత ప్రభావం అధికమైనట్టే తెలుగులోని ఈ ఛందశ్శాస్త్రంలోకూడా అదే భ్రాంతికి ఆస్కారం ఉంది. కావ్యాల జోలికి వెళితే ఏ పత్రం తీసినా వృత్తాలే దర్శనం. ఏ లాక్షణిక గ్రంథం విప్పినా షడ్వింశచ్ఛందో జాతాలైన కోట్లాది వృత్తాల లెక్కలే. వృత్తాల్లోని అక్షరసమక గణవ్యవస్థ, తద్వారా కలిగి శృంఖలత్వం పాండిత్య ప్రదర్శనకు నికషలైనాయి. గర్వకారణాలైనాయి. నిర్వచన కావ్యాలు పాండితీస్ఫోరకాలైనాయి.

ఐనా సంస్కృత ఛ్ఛందస్సంప్రదాయం ఒకెత్తుగా నిలిస్తే దేశీయమైన ఛ్ఛందస్సంప్రదాయం మరింత ఎత్తుగానిలిచింది. కావ్యసంప్రదాయానికి, గేయ సంప్రదాయం సమాంతర స్రోతస్విని ఐంది. పండిత శార్దూలాలకు, కవి మత్తేభాలకు, వేమన్న ఆట వెలదులు, తిక్కన్న కందాలు, పోతన్న తేటగీతులు పోటీ పడ్డాయి. ఒక పాల్కురికి సోమన్న, ఒక దోనేరు కోనయ్య ద్విపదలను అందలాలెక్కించారు

నన్నయ భారతం నుండి, నిన్నటి గిరతం వరకు ఏ కావ్యాలలోనైనా ఆరణాల మార్గి నడకలు, పదేశి దేశిసొంపులే. ఏ ఛందో గ్రంథంలోనైనా కందాల అందాలు, సీసాల వేషాలు, అక్కరల అక్కరలు, రగడల రగడలు, ఉత్సాహాల ఉత్సాహాలు, జాతులకు జోతలు, ఉపజాతుల తేజాలు సాధికారంగా చెప్పబడ్డాయి.

మూడింట రెండు వంతుల ప్రయోగ బాహుళ్యం కల్గి, విస్తృత పరిధి గల్గి, ఛందశ్శృంఖలాలు వీడిన, తెలుగు'వాడి' కోసం, తెలుగులో వెలుగులకోసం దేశీయతా ముద్ర భద్రపరచడం కోసం ఈ గ్రంథంలో ప్రయత్నించాను.

'దేశిచ్ఛందో గ్రంథసృష్టి జరుగుచో తెలుగు జాతి జీవము రాగము, తెలుగు తనము, తెలుగు వెలుగు కలకాలము నిలుచునని చెప్పవచ్చునన్న 'వడ్లమూడి

వారి మాటలు, 'దేశీయమైన అంశం పరిశోధిస్తే తెలుగు వారికి లాభం' అన్న కోరాడ వారి పలుకులు ఈ అంశంలో పరిశోధించడానికి తోవ నిర్దయించాయి.

సాహిత్య విద్యార్థిగా ఉన్న తొలి నాళ్ళనుంచే పరిశోధనా కాంక్ష నాలో అంకుర రూపంలో ఉన్నది. అభిమాన విషయాలైన ఛందో వ్యాకరణాల్లో పరిశ్రమించాలనిపించింది. అధ్యాపనదశలో ఛందో విమర్శ గ్రంథాలు పరిశోధింప ప్రేరేపించాయి.

ఛందస్సంబంధంగా భారతి వంటి పత్రికలు నా వ్యాసాలను ప్రచురించుట పెద్దల ప్రోత్సాహం, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు విభాగం ఇచ్చిన పరిశోధనావకాశం కృషికి సహాయకారులైనాయి.

దేశి చ్ఛందస్సుల పట్ల ఉన్న అనేక వివాదాస్పదమైన అంశాలు దృష్టిలో ఉంచుకొని చందస్సులో తెలుగుదనం కోసం ముఖ్యంగా 'పాట నుంచి ఛందస్సు' అన్న దృఢసంకల్పంలో దేశిచ్ఛందస్సుల ప్రారంభ వికాసాలను పరిశీలించాను గేయ చ్ఛందస్సులపట్ల పండితలోకమునకుగల అనాసక్తత, లక్షణగ్రంథాల గతానుగతికత్వం నా పరిశోధనలో ప్రతిఘటించినా - ఇంతకు పూర్వమే ఆధునిక ఛందో విమర్శకులు, పరిశోధకులు వేసిన బాటను ఆధారం చేసుకొని లక్ష్యసాధనకు ప్రయత్నించాను.

ఛందస్సు అనగా కేవలం అక్షర గణవ్యవస్థ, నిర్బంధత్వము గుర్తుకు వచ్చే వారికి, ఆధునిక వచన కవితాయుగంలో అనవసర శ్రమ అనుకునేవారికి, ఛందస్సంటే గేయ కాలాన్ని కొలిచే శాస్త్రమని, పాట బతికినన్నాళ్ళు ఛందస్సు బతుకుతుందని నిరూపించదలిచి శ్రమించాను.

సహృదయులే ఫల నిర్ణేతలు.

ప్రజోత్పత్తి
ఉగాది
17-3-1991

— సంగనభట్ల నరసయ్య

# ఛందోరంగాన శ్రీశ్రీ విన్యాస వైభవం

డా॥ కోవెల సంపత్కుమారాచార్య
రీడర్ తెలుగుశాఖ
కాకతీయ విశ్వవిద్యాలయం,
వరంగల్.

తాను డాక్టరేటు పట్టాకోసం పరిశోధన విషయంగా ఛందస్సు నెన్నుకున్నానని సంగనభట్ల నరసయ్యగారు నాతో మొదటిసారిగా అన్నప్పుడు— ఈ అనడంతోనే, నిజానికి మా పరిచయం మొదలయింది— నేను ఆ మాటల్ని సందేహించాను. అందుకు రెండు మూడు కారణాలున్నాయి. ప్రధానంగా ఆయన యువకుడు. కవితా రంగాన యువకులలో ఛందో వైరస్యం, ఛందోవైముఖ్యం తన ధోరణిలో తాను వ్యాపిస్తున్న కాలానికి చెందిన వాడాయన. ఈ వైరస్యానికీ, వైముఖ్యానికీ ఉద్దిష్టంగానో, అనుద్దిష్టంగానో; ప్రత్యక్ష పద్ధతిలోనో, పరోక్ష పద్ధతిలోనో శ్రీశ్రీ దోహదపడ్డారు. 'చందస్సుల సర్ప పరిష్వంగం' అనీ; గణబద్ధ ఛందస్సులు ఫ్యూడలిజమనీ, గేయాలు ప్రజాస్వామ్యమనీ, వచన కవిత్వం సామ్యవాదమనీ, కవిత్వానికి ఛందోరాహిత్యం లోపంకాదనీ; గ్రాంథిక భాషను వదిలినట్లు మన కవులు గేయాన్నికూడా ఎప్పటికి వదిలిపెడతారోనని;... ఈ విధమయిన రకరకాల అలవోక వ్యాఖ్యలతో ఛందోవైముఖ్యాన్ని ప్రోదిచేసిన పేరు ప్రతిష్ఠలు శ్రీశ్రీకే దక్కుతాయి. ఇంకెవరయినా ఆ తరువాతనే. (శ్రీశ్రీ ఈ వ్యాఖ్యలు ఆకరాలు చూపించాల్సినంత అప్రసిద్ధమయిన వేమీ కావు.) ఇట్లాంటి వ్యాఖ్యలను దృష్టిలో పెట్టుకొని కావచ్చు: శ్రీశ్రీ సాహిత్యం - షష్టిపూర్తి ప్రచురణ: కావ్యవిభాగం-3 భాగానికి 'లోక కుతూహలం' అంటూ సంతరించిన పీఠికలో కె.వి. రమణారెడ్డి— 'గతితార్కికవాదాన్ని Thesis, Antithesis, Synthesis ల లఘువ్యవహారంగా భావించి కవుల కవిత్వానికి శ్రీశ్రీ దీన్ని అనువర్తింపజెయ్యడం చిరునవ్వునైనా తెప్పించకపోదు. చారిత్రక మహాదశలకూ ఛందోరూపపరిణామాలకూ లంకె కలపడంకూడా శ్రీశ్రీ

సాహసానికి మరో ఉదాహరణ' అన్నాడు. 'శ్రీశ్రీ ఛందోన్వేషణ'—(సృజన 1980 జన—) అన్న వ్యాసంలో 'వచన కవిత్వం శ్రీశ్రీకి వాగా నలిగిన మార్గంలా కన్పించదు' అంటారు చేకూరి రామారావు. (శ్రీశ్రీ ఈ వ్యాఖ్యలను ఏమీ పట్టించు కున్నట్టులేదు.) చమత్కార మేమంటే, శ్రీ శ్రీ కవితలలో ఉత్తమమయినవి దాదాపుగా; అన్నీ ఛందోబద్ధమయినవే. గేయఛందస్సుల్లో ఆయన అనేకానేక 'ప్రయోగాలు' చేశాడు కూడా. శ్రీ శ్రీ స్వభావరీత్యా గేయ/మాత్రాఛందఃకవి. అయినా ఛందస్సును గూర్చి 'అట్లాంటి' వ్యాఖ్యలు చేసాడు. వాటిని ప్రామాణికంగా చాలామందీ ఉదహరిస్తూ ఉంటారు. కాగా ప్రస్తుతాని కదట్లా ఉంచి; ఎక్కడో మారుమూలన, కేవలం పుణ్యక్షేత్రంగా మాత్రమే సుప్రసిద్ధమయిన ధర్మపురి గ్రామంలో ఉంటూ; అక్కడే ప్రాచ్య కళాశాలకు అధ్యక్షుడుగా ఉద్యోగ బాధ్యతలను బీరుపోకుండా నిర్వర్తిస్తూన్న ఈ యువ పరిశోధకుడు ఛందస్సును గురించి పరిశోధన చేస్తా నంటున్నాడు. విషయ సేకరణకోసం, సమాచార సంపాదనకోసం, వివిధ గ్రంథాల కోసం, విషయ చర్చలకోసం, దూరదూర ప్రాంతాల గ్రంథాలయాలకూ, వ్యక్తుల దగ్గరికీ పరుగులు తీయవలసి ఉంటుంది. పైగా, ఇది ఒక శాస్త్రం విషయాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేసి, విశ్లేషించుకోవలసి ఉంటుంది.... ఇట్లా చాలా చాలా గొడవలున్నాయి. మరి, సందేహించకపోవటమెట్లా? తొలి పరిచయ సందర్భమే గదా అనయినా సంకోచించకుండా నా సందేహాన్ని స్పష్టంగానే వ్యక్తీకరించాను. అయితే, నా యీ ధోరణికి ఆయనేమీ ఇబ్బంది పడలేదు సరిగదా: చిరునవ్వుతో— ఆ చిరునవ్వు ఆయనకు సహజమయిందని ఆ తరువాతి కాలంలో క్రమంగా విస్తరించిన మా పరిచయ గాఢత్వంలో తెలిసి వచ్చింది— 'ఫరవాలేదు; చేస్తానండి' అన్నాడు. అనటమే కాదు; అన్నంతపనీ చేశాడు. ఆయన పరిశోధన కాలంలో ఎన్నోసార్లు కలుసుకొని ఎన్నో విషయాలు చర్చించుకొన్నాం. ఆ సందర్భాల్లో విషయంపట్ల ఆయనకున్న గాఢమయిన ఆసక్తి, చొరవ, తీవ్రమయిన నిష్ఠ, విషయ విశ్లేషణలో చురుకుదనం, అలుపెరుగని క్రియాశీలం స్పష్టపడ్డాయి. ఆయన పరిశోధనను అవే సఫలం చేసినయి. ఈ గ్రంథాన్ని పరిశీలిస్తే ఈ యథార్థం స్పష్టపడుతుంది. కాగా, తొలినాళ్ళ నా సందేహాన్ని పటాపంచలుచేసి ఇంతటి ఉపయోగకరమయిన సిద్ధాంత గ్రంథాన్ని వెలువరిస్తున్నందుకు ఆయనను మొదట మనసారా అభినందిస్తున్నాను. ఆనాడు అట్లా సందేహపడ్డందుకు పరిహారంగా ఇప్పుడీ గ్రంథానికి ముందు నాలుగు మాటలు రాయవలసి వస్తున్నది.

ఛందస్సు చాలా విస్తృతమయిన విషయమనేది ఇవాళ కొత్తగా ప్రత్యేకించి చెప్పవలసిన అవసరమేమీలేదు. కాగా, దాదాపు ముప్పయ్యేళ్ళ కిందట ఆనాటి (1960) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పుణ్యమా అని, గిడుగు సీతాపతిగారు 'తెలుగులో ఛందోరీతులు' గానీ, నేను 'తెలుగు ఛందోవికాసం' గానీ, రావూరి దొరసామిశర్మగారు 'తెలుగుభాషలో ఛందోరీతులు' గానీ రచించినప్పుడు ఛందః పరివేషంలోకి వచ్చే దాదాపు ప్రతి అంశమూ మాకు విచారణ విషయమే అయింది. ఈ మూడింటి రచనా ప్రణాళికలు భిన్నం కావచ్చు. వివిధాంశాలకు సంబంధించిన ప్రాధాన్యాప్రాధాన్యాలలో తేడాలుండవచ్చు. విషయ విశ్లేషణ విధానంలో దృక్పథాలు భేదించి ఉండవచ్చు; కాని, ఏదేమయినా; మొత్తంగా ఛందోవిషయాన్ని ఒడిసి పట్టాలనే అభిప్రాయం, అభినివేశం మాత్రం దాదాపుగా అన్నింటికీ భూమిక అనవచ్చు. తొలి పరిశోధన గ్రంథాల తీరుతెన్నులు దాదాపు అన్ని రంగాల్లోనూ ఇట్లాగే ఉంటాయనుకుంటాను. ఆ తరువాత క్రమక్రమంగా వివిధ విభాగాలనూ, విషయాలనూ ప్రత్యేకీకరించి 'విశేష' ప్రాతిపదిక మీద పరిశోధన, విశ్లేషణ విధానం విస్తరిస్తుంది. ఇందుకు ప్రస్తుత పరిశోధన గ్రంథం ఒక నిదర్శనం. ఛందస్సు మొత్తం అనిగాక తన పరిశోధనకు 'తెలుగులో దేశిచ్ఛందస్సు'ను మాత్రమే విషయంగా గ్రహించి దాని 'ప్రారంభ వికాసదశల'ను విశ్లేషించటంలో నరసయ్య సఫల కృషి నిర్వహించారు.

'తెలుగులో ఛందఃపరిశోధన' తీరు తీయాలను సమీక్షిస్తూ 1983లో ఒక వ్యాసం రాయవలసి వచ్చింది. (చూ. తెలుగులో పరిశోధన'— ఆం. ప్ర. సాహిత్య అకాడమీ రజతోత్సవ సంచిక: ఆగ. 1983.) ఆ వ్యాసంలో చివర తెలుగులో ఛందః పరిశోధనకున్న అవకాశ విస్తృతిని ప్రస్తావిస్తూ— 'దేశీయ చ్ఛందసులను గూర్చి ఇంకెంతో పరిశోధనకాస్కారం ఉం'దన్నాను. 'ఇంకెంతో' అనటానికి ప్రధాన కారణం ఆనాటికే డా. కె. సర్వోత్తమన్ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 'దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతులు: తులనాత్మక పరిశీలన'చేసి ఉండటం. ఈ తులనాత్మకత్వాన్నేగాక, అచ్చంగా దేశిచ్ఛందస్సునుగూర్చి పరిశోధించవలసిందింకెంతో ఉందని నా తాత్పర్యం. అయితే ఈ నా తాత్పర్యం ఆషామాషీ అభివ్యక్తి కాదనే అంశాన్ని నరసయ్య తన గాఢ పరిశోధన, నిశిత పరిశీలనద్వారా ఋజువు చేసారు. తన పరిశోధన గ్రంథాన్ని సమగ్రీకరించారు. ఎనిమిదధ్యాయాలుగా విస్తరించిన

ఈ గ్రంథంలో దేశిచ్ఛందస్సులకు సంబంధించి స్పృశించబడని అంశం దాదాపుగా ఏదీ లేదనటానికి వెనుకాడనక్కరలేదు.

దేశి అంటే ఏమిటో నిర్ధారించుకొంటూ, దేశిచ్ఛందోలక్షణాలను నిరూపించుకొని, వాటి స్వతంత్రప్రతిపత్తిని స్పష్టంచేస్తూ గ్రంథంలోని రెండవ అధ్యాయం సాగుతుంది. ఫలానాఫలానావి దేశిచ్ఛందస్సులని నిర్ణయిస్తుంది. సంగీతశాస్త్రంలో ప్రసిద్ధమయిన మార్గి-దేశి ప్రాతిపదికమీద గొడవలు పడుతున్నా, ఈ దేశంలో ఉద్భవించిన ఛందో విధానం దేశి అనుకోవటంలో సౌకర్యమేకాదు, యాథార్థ్యం కూడా ఉంది. తెలుగులో 'దేశం' అనేమాట మొత్తం భారతదేశానికీ, అందులోని వివిధ ప్రాంతాలకూ గూడా వ్యవహారంలో ఉంది. కాగా: ఇక్కడ 'దేశి'— దేశీయం అన్నప్పుడు దేశానికి సంబంధించింది; దేశంలో ఉద్భవించింది అనే తాత్పర్యంతో గమనిస్తే తెలుగు 'దేశా'నికి సంబంధించింది దేశి. ఈ విధంగా అన్ని ప్రాంతాలకూ సంబంధించి అన్ని దేశివిధానాలుంటాయి. మరి, ఏ దేశం (ప్రాంతం)లో నయినా అక్కడి ఛందస్సులకు మూలం ఆ ప్రాంతానికి చెందిన అతి ప్రాచీనతమ మయిన 'పాటలు' మాత్రమే. వీటినే ఈనాడు మనం తెలుగులో 'జానపద గేయాలు అని ప్రసిద్ధంగా వ్యవహరిస్తున్నాం. సాధారణంగా ఈ 'జానపద పాటల'లో తాళా నికీ, లయకూ సంబంధించి నికరమయిన కొన్ని 'మట్టు'లు ఉంటాయి. ఆ 'మట్టులు' కూడా పరిమితంగానే ఉంటాయి. అట్లాంటివి ఆధారంగా 'ప్రయోగాలు' సాగించి భిన్నభిన్న 'రూపా'లను ఆవిష్కరించటం ఆరంభమయినప్పటినుంచి 'దేశి చ్ఛందస్సు'లు అన్న వ్యవహారం వ్యాప్తిలోకి వస్తుంది. పాటలలోని సంగీత ప్రాధా న్యాన్ని క్రమక్రమంగా తగ్గించటంద్వారా, లేదా, దూరమవుతూ ఉండటం ద్వారా వ్యవస్థలో క్రమంగా మార్పు సాధించటంద్వారా దేశి 'పద్యాలు'అమలులోకి వస్తాయి. పాటల వ్యవస్థ లయ తాళానుగుణమయిన కాలఖండాలమీద ఆధారపడి ఉండగా, కాల ఖండ విధానాన్ని గౌణపరచి—అప్రధానంచేసి మాత్రాసంఖ్యకు ప్రాధాన్యమిచ్చే విధా నాన్ని అనుసరించినప్పుడు తొలితొలిగా నిష్పన్నమయిన 'పద్య'రూపాలు 'రగడ'లు. రగడలను 'పద్యా'లనే అంటారు తప్ప పాటలనరు. అంటే, పాదానికీ, పాదంలో ఉండవలసిన మాత్రా సంపుటులకూ, మాత్రాసంఖ్యకూ ప్రాధాన్యమన్నమాట. ఇట్లా తొలితొలిగా నిష్పన్నమయిన రగడలు ఆధారంగా సాగిన వివిధ 'ప్రయోగా'లలో మాత్రా విధానానికీ, అక్షర/వర్ణ భారానికీ సంబంధాన్ని సాధించే యత్నం మొద

నిరూపిస్తాయి. ఇక తమిళ ఛందోవ్యవస్థకీ, గణవిధానానికీ తెలుగు వ్యవస్థకీ సంబంధాలను పొసగించే ప్రయత్నం కేవలం మోజు మాత్రమే. ఇదిట్లా ఉంచి:

రెండు, మూడు, నాలుగు గురువులను ప్రస్తావించడంద్వారా ఏర్పడే గణాలను సూర్య-ఇంద్ర-చంద్ర గణాలుగా రూపొందించేందుకు ఆ గణాలలో లఘ్వాది గణాలముందు అదనంగా ఒక లఘువుసు చేర్చాలని లాక్షణికులు నిర్దేశించారు గదా! ఈ అదనంగా చేర్చాలనటానికి కారణం వాళ్ళేమీ చెప్పలేదు. అనేకానేక సందర్భాల్లో లాక్షణికులు కారణాలు చెప్పేపనిపెట్టుకోలేదు. ఆనాటి తీరు ప్రకారం చెప్పాల్సిన అవసరం లేదనుకొని ఉంటారు. అంతమాత్రాన వాళ్ళు నిష్కారణంగా ఆయా అంశాలను చెప్పారని, వాళ్ళకు అనేక విషయాలు తెలియక ఏదో తోచినట్టు రాసారని ఈనాడు మనం అనటం చాలా తేలికే కాని, ఆ కారణాలను అన్వేషించి తెలుసుకోవటం మాత్రం కష్టం. అయినా అందుకు ప్రయత్నించటం ఈనాటి మన పరిశోధకుల కనీస బాధ్యత. ఈ అదనంగా లఘువు చేర్చటానికి కారణాన్ని నరసయ్య గుర్తించారు. ఆయా గణవర్గాల్లోని మాత్రాసంఖ్యలో అసమత్వాన్ని తగ్గించటమే ఈ అదనంగా లఘువును చేర్చటానికి కారణం. అదనంగా లఘువును చేర్చటంవల్ల ఈ గణం దానిపైగణంలో మాత్రా సంఖ్య విషయంలో సమత్వం సాధిస్తుంది. దీని వివరాలు ఛందోఽంగంగా గణాన్ని గూర్చిన పరిశీలనలో చూడవచ్చు. ఇట్లాగే అక్షరం, పాదం మొదలయిన అంశాలుగూడా పరిశోధకుని పరిశీలన శ్రమను వ్యక్తం చేస్తాయి. నన్నయగారికి పూర్వపు శాసనాల్లో వ్యక్తమయ్యే దేశి పద్యాలను విస్తృతంగా మూడవ అధ్యాయం గుర్తించింది. నన్నయకు పూర్వపు అనేకానేక శాసనాల నుండి దేశి పద్యాలను సంపాదించటంలో పరిశోధకుని శ్రద్ధ, శ్రమ ప్రస్ఫుటమవుతుంది. అయితే, అనేక సందర్భాల్లో ఆనాటి పదాల స్వరూపం, వాటిని పలికేవిధానం మనకు అలవాటులోగానీ, అందుబాటులోగానీ లేకపోవటంవల్ల కావచ్చు: ఈనాడు మనకు పరిచితమయిన దేశి పద్యస్వరూపం వాటిల్లో కచ్చితంగాఉందా అనే సందేహం కలిగే అవకాశమూ ఉంది. ఈ అవకాశాన్ని గుర్తిస్తూనే, దేశి 'పద్యాలు' అలనాటి నుంచీ ఉన్నాయని అంగీకరించవలసి వస్తున్నది. పాల్కురికి సోమనాథుడు 'అనియత గణైః...' ఇత్యాదిగా ఉటంకించిన 'లక్షణాల'ను చెప్పే ఛందోగ్రంథం మనకు లభ్యం కాకున్నా, ఉండి ఉండేదని అంగీకరించక తప్పదు కాబట్టి, ఆనాటికే ఎంతో పూర్వం నుంచే దేశి పద్యాల ప్రయోగం ఉందని గూడా అంగీకరించవలసిందే.

ఈ పరిశోధన గ్రంథానికి ప్రాణభూతమయినవి నాల్గవ, అయిదవ, ఆరవ అధ్యాయాలు. తెలుగు ఛందో వ్యవస్థలో దేశి పద్యాలు జాతులు, ఉపజాతు లని రెండువర్గాలు. నిజానికి మొత్తంగా ఇవన్నీ 'జాతి' పద్యాలే. ('జాతి' అనేది మౌలికంగా 'దేశి'ని సూచిస్తుంది). అది ప్రాస నియమం ఉన్న పద్యాలు జాతులని, లేని పద్యాలు ఉపజాతులు అని లాక్షణికుల అభిప్రాయం. ఒక విధంగా అది ప్రాస నియమం లేకపోవటమనేదే మొదటి దశ. ఆ తరువాత ఆ నియమం వర్తించటం తరువాతి దశ. ఆ వర్తించటం కొన్ని పద్యాలకు మాత్రమే. ఈ దృష్టితో ఆలోచిస్తే ఉపజాతులనేవే అసలుకు జాతులు. అయితే, ఈ ప్రాసనియమం అన్ని పద్యాలకూ ఎందుకు వర్తించలేదనేది, అందుకు కారణమేమిటనేది ఇంకా పరిశోధించవలసిన అంశమే. ఈ సందర్భంలో మరొక అంశం గూడ గమనించవలసి ఉంది. కొన్ని పద్యాలకు అది ప్రాసనియమం లేనేలేదు. కొన్నింటికి మాత్రం నియతంగా ఉంది. మరికొన్నింటికి వికల్పంగా ఉంది. ఉదాహరణకు ద్విపదకు అది ప్రాసనియమం వికల్పం. ఈ నియమం లేనప్పుడు మంజరీ ద్విపద అని వ్యవహారం. రగడల విషయం కూడా — లాక్షణికులు చెప్పలేదు గాని — ఇంతే. అది ప్రాసనియమంలేని రగడను మంజుల రగడ అన్నాడు అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంస వింశతిలో. ఇక్కడ విశేషంగా గుర్తించవలసిన అంశం ఒకటి ఉంది. అది ప్రాస నియమం గలవిగా లాక్షణికులు చెప్పిన అనేక పద్యాలకు తెలుగు సాహిత్యంలో ప్రయోగమేలేదు. మధ్యాక్కర నన్నయగారి దగ్గరే ఆగిపోయింది. కందం, పాల్కురికి సోమన పుణ్యమా అని ద్విపద - ఈ రెండింటికే విస్తృత ప్రయోగం. తరువోజ ప్రయోగం చాలా స్వల్పం. ఉత్సాహ కొంతవరకు ఫరవాలేదుకాని, అది ప్రాసనియమంలేని పద్యాలకు మాత్రం విపరీతమయిన ప్రచారం ఉంది. ఈ ధోరణిలో ఆలోచిస్తే, ఉపజాతులని ఈనాడు మనం వ్యవహరించే పద్యాలే తెలుగుకు నప్పినవి అనిపిస్తుంది. ఈ పై విధ్యాన్నీ, ప్రయోగాన్నీ గురించి ఇంకా లోతుగా పరిశోధించవలసి ఉందనుకుంటాను.

నాల్గవ అధ్యాయంలో జాతి పద్యాలనూ, అయిదవ అధ్యాయంలో ఉప జాతి పద్యాలనూ నరసయ్య పరిశీలించి విశ్లేషించిన తీరు చాలా గొప్పగా సాగింది. ఒక్కొక్క పద్యాన్ని ఎన్నెన్ని కోణాల నుంచి పరిశీలించటానికి వీలుందని ఆయన భావించాడో అన్నన్ని కోణాలనుంచి విస్తర భీతిగానీ, అలుపు - విసుగు కానీ

లయింది. ఈ యత్న ఫలితంగా మాత్రాసంఖ్యా 'గణా'లు, మాత్రా గణాలు రూపొందినయి. 'గణా'లకు ప్రాధాన్యం వచ్చింది వివిధ గణాలను మిశ్రమం చేయటం కూడా ఒక విధమయిన 'ప్రయోగ'మే. ఈ విధమయిన ప్రయోగ రూపాలే ద్విపద సీస గీతాది 'పద్యా'లు. 'పాట'ల వ్యవస్థలో పాటలో ఉండే 'చరణాల' సంఖ్యకు ప్రాధాన్యంలేదు. సంఖ్యనుబట్టి పాటను గుర్తించే విధానంకూడా లేదు. కాని, రగడల తరువాత పాదాలనుబట్టి/పాదసంఖ్యనుబట్టి పద్యాన్ని గుర్తించే విధానం మొదలయింది. ద్విపద, త్రిపద, చౌపద మొదలయిన గుర్తింపు ఇందుకు దాఖలా. నాలుగు పాదాలే ఉండాలన్న నియతి ఆ తరువాత ఏర్పడింది. ఈ నియతి ఏర్పడ్డ తరువాత పద్యం గుర్తింపులో పాద 'సంఖ్యా' ప్రాధాన్యం తగ్గి కేవలం గుర్తింపు కోసం ఇష్టమయిన/అందమయిన/మరో విధమయిన 'పేర్లు'— మనం మనకు పెట్టు కున్నట్టే— పెట్టటం అలవాటులోకి వచ్చింది. తరువోజ, కందం, ఆటవెలది, తేట గీతి మొదలయినవన్నీ ఈ విధమయిన 'పేర్లు'. కాగా, ఈ విధమయిన ఛందో వ్యవస్థాపరిణామక్రమంలో ఈ పద్యాలకు మూలరూపాలయిన/మూలాధారాలయిన పాటల సంగీత ప్రాధాన్యం పరిణామక్రమ నిష్పత్తిలో తగ్గిపోతూ ఉండటం ప్రధా నంగా గమనింపవలసి ఉంది. ఇది దేశిచ్ఛందస్సుల పరిశోధన సందర్భంలో కీలక మయిన అంశం. ఈ కీలకాంశాన్ని గుర్తించిన తీరు ప్రస్తుత పరిశోధన గ్రంథంలో వ్యక్తమవుతుంది. దాదాపుగా ప్రతి దేశి పద్య పరిశీలన సందర్భంలోనూ 'పాట'ను ప్రాతిపదికగా చేసికొని వచ్చిన మార్పులను, అవి వ్యక్తమయిన తీరును వీలయినంత తార్కికంగా విశ్లేషించే ప్రయత్నం ఈ గ్రంథంలో స్పష్టంగా కన్పిస్తుంది.

అదట్లా ఉంచి, ఎనిమిదధ్యాయాలుగా రూపొందిన ఈ గ్రంథంలోని చివరి అధ్యాయం ఆధునిక యుగంలో దేశి చ్ఛందస్సుల రూప రేఖలను, నిజంగా, రేఖా మాత్రంగానే పరామర్శిస్తుంది. ఇందులోని ఈ సంక్షిప్త విధానానికి కారణమేదయినా గూడా, ఆధునికంగా దేశిచ్ఛందస్సులను గూర్చి ఇంకా విస్తృతంగా పరిశోధించ వలసిన/పరిశీలించవలసిన అవసరం/అవకాశం ఉండనేఉన్నదని ఛందోరంగాన ప్రవే శించబోయే పరిశోధకులకు/పరిశీలకులకు ఒక సూచన. మరి, ఏడవ అధ్యాయం దేశిచ్ఛందస్సుల్లో 'చిత్రకవితా' నిర్వహణను ఉద్దేశించింది. 'చిత్రకవిత' ఒక మేరకు ఛందస్సులో పరిశోధన, 'ప్రయోగా'లకు సంబంధించిందేననవచ్చు. చిత్రకవితా విభాగంలోని గర్భ, బంధ విధానాలు అచ్చంగా ఛందః పరిశోధన ఫలితాలే. ఇక

మొదటి అధ్యాయం ఛందోనిరుక్తి, ఛందః ప్రశస్తి వంటి వాటిని క్లుప్తంగానే ముగించి ఛందోఽంగాలను గురించి మాత్రం విస్తరించింది. వీటిని చూడగానే ఇంతకుపూర్వం చెప్పబడిన అంశాలనే మళ్ళీ చెప్పినట్టు అనిపించవచ్చుగాని, పూర్వం చెప్పబడిన విధంగా కాక ప్రత్యేకించి 'దేశి' విధానానికి అనుగుణంగా వీటిని విస్తరించటం గమనిస్తే, వీటి అవసరం స్పష్టపడుతుంది. 'గణ'వ్యవస్థ మరీ ముఖ్యంగా గమనించదగింది.

సంస్కృతంలో వృద్ధిపొందిన ఛందోవిధానంలోని గణ వ్యవస్థకు భిన్నం కావటమేకాదు; దేశియ గణవ్యవస్థ అంతకన్నా విస్తృతమయింది. సంస్కృతంలో య-ర-తాదులయిన అక్షర గణాలు ఎనిమిది మాత్రమే. మాత్రల విషయానికివస్తే ఒక్క చతుర్మాత్రాగణాలు మాత్రమే. ఇంతకు మించి ప్రసిద్ధమయిన గణవ్యవస్థ, సంస్కృతంలో లేదు. మరి తెలుగులో సూర్యేంద్ర చంద్ర గణవ్యవస్థ, వివిధ మాత్రా సంఖ్యాగణవ్యవస్థ— ఈ రెండు వ్యవస్థల సాన్నిహిత్య సంబంధాలు తెలుగు దేశిచ్ఛందో విధానంలోని గణవ్యవస్థయొక్క విస్తృతికి మూలం. తెలుగులోని ఈ గణవ్యవస్థకూ, కన్నడంలోని గణవ్యవస్థకూ స్థూలంగా చూస్తే ఏకత్వం కన్పిస్తుంది. అయితే, తెలుగులోకన్నా ముందే కన్నడంలో సాహిత్యమూ, లక్షణ గ్రంథాలూ లభిస్తూండటంవల్ల ప్రతిఅంశాన్ని కన్నడంతోపోల్చి చూసుకొని, ఫలానాది కన్నడ చ్ఛందస్సులోంచి తెలుగులోకి వచ్చిందనీ: ఫలానాది అక్కడ లేదు, ఇక్కడ ఉందని చెప్పుకోవటం మనకు అలవాటయిపోయింది. నిజానికి వేరువేరు భాషలుగా తెలుగు కన్నడం విడిపోవటం మొదలయినప్పటినుంచే ఛందోవ్యవస్థకూడా విడిపోయింది. ఈ రెండింటిలోని ఏకత్వ లక్షణాలు విడిపోవటానికి ముందు కాలానికి సంబంధించినవి కాగా, ఆ తరువాత స్వతంత్రంగా ప్రవర్తించటంవల్ల భేదాలు స్పష్టపడుతున్నాయి. గణాల/గణవర్గాల పేర్ల దగ్గరినుంచి మార్పులు గమనించవచ్చు. సూర్యాది గణాల్లో అన్ని గణాలను కొన్ని పద్యాలకు, కొన్ని గణాలు కొన్ని పద్యాలకూ నియతం చేయటం, వ్యావహారిక దృక్పథంతో సూర్యేంద్రాది గణవర్గాల్లో మొదటి రెండేసి గణాలను అనంతాదుల నాటికి పూర్తిగా తొలగించుకోవటం, చంద్రగణాల ప్రయోగాన్ని ప్రయోజన రాహిత్యం కారణంగా ఉపేక్షించటం తెలుగు ఛందోవ్యవస్థలోని హేతుబద్ధతను నిరూపించే కొన్ని అంశాలు మాత్రమే. రగడలలో మిశ్రగతి రగడను అంగీకరించటం, సీసపద్యాన్ని సృష్టించుకోవటం వంటివి స్వతంత్ర లక్షణాన్ని

లేకుండా పరిశీలించాడు; రకరకాలుగా విశ్లేషించాడు. ఉదాహరణకు కందపద్యం, సీసపద్యం గూర్చిన పరిశోధన, పరిశీలన చూస్తే చాలు, ఆయన నిష్ఠ, పరిశీలనలోని నైశిత్యం స్పష్టపడుతుంది కంద పద్యాన్నిగూర్చి – నాకు తెలిసినంతవరకు గిడుగు సీతాపతిగారి విశ్లేషణ ('తెలుగులో ఛందోరీతులు' 1961) విస్తృతమయింది. ఆ విస్తృతి వెన్నుదన్నుగా నరసయ్య మరో రెండడుగులు ముందుకువేసారు. ఒక విశేషం. గిడుగువారు ఊనికను గూర్చి చేసిన ఆధునిక విచారణకు పింగళుని 'ఛందశ్శాస్త్రం'లో ఉనికిని నరసయ్య గుర్తించటం (పు. 195). మరొకటి కొన్నాళ్ళ కింద సి. నారాయణరెడ్డి 'మాకందములు' అనే పేర కందపద్యంలోని పొట్టి పొడుగు పాదాలను ఇప్పుడు అమలులో ఉన్నట్టు ఒకదాని తరువాత మరొకటిగా కాక, రెండు పొట్టి పాదాలను మొదట, (పూర్వార్థంగా) రెండు పొడుగు పాదాలను ఆతరువాత (ఉత్తరార్ధంగా) కంద పద్యాన్ని 'ప్రయోగించారు.' ఈ తరహాను లాక్షణికంగా 'విషమకంద'మని నరసయ్య గుర్తించారు. గణస్థానాలను బట్టి వివిధ గణాల స్థలాల మార్పులనుబట్టి కంద పద్యభేదాలను విశ్లేషించారు. ఇట్లా చాలా విషయాలను వ్యక్తీకరించారు. సీసపద్య విషయంలో మరింతగా విజృంభించి ముందుకుసాగారు. సీసపద్యం తెలుగు ఛందో వ్యవస్థ సమకూర్చుకొన్న స్వంత ఆస్తి. ఆధునికంగా చందో విమర్శకులలో నాకు తెలిసినంతవరకు సీసపద్యం గూర్చి ఆలోచించిన వారిలో పాడి వెంకటనారాయణ మూర్తి అను వేంకటస్వామి గారు మొదటివారు. ఆయన 189'లో 'నన్నయభట్టారకుని కవిత్వములోని ఛందో విశేషములు' అనే వ్యాసం ('అముద్రిత గ్రంథ చింతామణి' 1897 జూన్-జులై) రచించారు. అందులో నన్నయగారి సీసపద్యాల్లో భేదాలను గుర్తించారు. ఆ తరువాత ఊటుకూరి రాజగోపాలరావుగారు. ఆ తరువాత గిడుగువారు. నరసయ్యగారి విచారణ వీరికి దీటుగా ముందుకుసాగింది. రెండుపద్యాల సంపుటి కావటమనేది సీసపద్యం ప్రత్యేకత. ఈ తరహాకు అటు ప్రాకృతంలోంచీ, ఇటు జానపద గేయాల్లోంచీ ఆకరాలనూ, ఆధారాలనూ నరసయ్య సంపాదించి, పొసగించి ప్రదర్శించారు. లాక్షణికులు ప్రదర్శించిన సీసభేదాలనూ గిడుగువారు విశ్లేషించిన నన్నయగారి సీసభేదాలను విశ్లేషించటమే కాక' పాదప్రతి గణాంత్య సీసం, మొదలయిన ఆరు భేదాలను వినూత్నంగా ప్రతిపాదించారు. గునుగు సీసాన్ని విశ్లేషించాడు. మరొక విశేషం ప్రతిపద్యం విషయంలో జానపద గేయాన్ని ప్రాతిపదికగా చేసి 'దేశి' త్వాన్ని నిరూపించటంఇంకొక విశేషం. ఆయా పద్యాల నడకలను ప్రదర్శించటమే

కాక, రీతి (శైలీ) శాస్త్రవిధానంలో పద్యాల ఎత్తుగడలను విస్తృతంగా వివిధ కవుల ప్రయోగాలనుంచి ప్రదర్శించారు. 'శిఖరారోహణ', సమాంతర, ద్వంద్వి, ప్రతిద్వంద్వి క్రియా-ప్రతిక్రియా విధానాలను ప్రదర్శించిన తీరు సమ్మోగ్ధుల్ని చేస్తుంది. కేవలం ఉదాహరణ ప్రాయంగా మాత్రమే ఇక్కడ కంద - సీసపద్యాల విషయం ప్రస్తావించానుగాని, దాదాపుగా ప్రతి దేశిపద్యం విషయంలోనూ ఇంచు మించుగా ఇన్నిన్ని అంశాల నేపథ్యంలో అన్నన్ని కోణాలనుంచి ఆయన పరిశీలన, విశ్లేషణ నిర్వహించాడు.

జానపదగేయ ఛందస్సులను గూర్చిన ఆరవ అధ్యాయం ప్రారంభంలో 'పాటలోని లయయే సంస్కరింపబడిన రూపములో సాహిత్యమున ఛందస్సు అగును' అన్నాడు నరసయ్య. దేశి చ్ఛందస్సులకు సంబంధించి ఆయన సాగించిన విచారణ కంతటికి ఈ అభిప్రాయం ప్రాతిపదిక అనేది సర్వత్రా స్పష్టపడుతుంది. ఈ 'సంస్కరింపబడ'టం ఎంత దూరమయినా, అసలు లయ అస్పష్టపడేంతదాక కూడా కావచ్చు. అదట్లా ఉంచి, 'జానపద పాట'లను ఛందస్సులనటం సామాన్య వ్యవహారంలో ఈనాడు ఉందిగాని, అట్లా అనటం, నిజానికి, సమంజసం కాదని నా విచారణలో నాకనిపిస్తున్నది. (తెలుగు ఛందో వికాసం రచించిననాడు నేనూ వీటిని 'ఛందస్సు' లన్నవాడినే మరి.) ఈ పాటలు, నిజానికి సంగీత వ్యవస్థకు సంబంధించి నవి. వాటిని ఛందో వ్యవస్థకు ముడిచుకోవటం గుర్తుంచుకోవలసిన అంశం. ఈ పాటలు లయ, తాళ, గతుల ప్రాధాన్యం గలవి. అందుకనే వివిధ చ్ఛందస్సులకు వివిధంగా గుర్తింపేందుకు పేర్కొన్నట్లు ఆ 'పాట'లకి నిర్మాణపరంగా పేర్లుండవు. పాటలోని విషయ ప్రాధాన్యాన్నిబట్టి పేర్లుంటాయి. ఊయల పాటలు, వెన్నెల పాటలు, చిలుకపదాలు, తుమ్మెదపదాలు వంటివాటి నెన్నింటినయినా ఉదాహరించు కోవచ్చు. ఇట్లాంటి రకరకాల పాటలను ప్రస్తావిస్తూ పాట నిర్మాణానికి సంబంధించి 'కాలఖండాల' పద్ధతిని విపులంగా నరసయ్య ప్రదర్శించాడు. (ఈ 'కాలఖండా'లనేవి లయ, తాళాలకు సంబంధించినయి) జానపద పాటల్లో ఈ కాలఖండాలు ప్రధానం కాబట్టి ఆ ప్రత్యేక కాలఖండానికి పదాలు సరిగా ఒదుగనప్పుడు వాటిని సాగదీయటం, కుదించటం సామాన్యం. అక్కడ కాలఖండాలకే తప్ప పదాల 'రూపసాధు'త్వానికి ప్రాధాన్యం లేదు. ఈ అంశాన్ని ఛందో లాక్షణికులు అంగీకరించరు. 'రూప సాధుత్వం' వీళ్ళకు అవసరం. ఈ తాత్పర్యాన్ని పరోక్షంగా నిర్దేశిస్తున్నదంటూ

నరసయ్య కవిజనాశ్రయం - దోషాధికారంలోని పద్యాన్ని ప్రమాణీకరించటం (అధ్యా VI పు. 17) గమనించదగింది. 'చెఱకు' అనటానికి బదులు 'చెఱాకు' అని మధ్యమాచ్చును దీర్ఘీకరించటం, 'విరహుల' అనటానికి బదులు 'విరాహుల' అని ద్వితీయాచ్చును దీర్ఘీకరించటం తప్పన్నాడు రేచన. ఈ సందర్భంలో చమత్కారంగా గుర్తుచేసుకోవలసిన సంస్కృతోక్తి ఒకటి ఉన్నది. ఛందోరంగంలో 'అపి మాషం మషం కుర్యాత్, ఛందో భంగం నకారయేత్' అనేది ఆ ఉక్తి. 'మాషం' అనే మాటను అవసరమయితే 'మషం' అని కుదించాలే తప్ప ఛందోభంగం మాత్రం చేయకూడదని ఆ ఉక్తి తాత్పర్యం. జానపదులు కాలఖండాల ప్రాధాన్యాన్నిబట్టి సాగదీయటం, కుదించటం చేస్తే ఛందః ప్రయోక్తలు గురు - లఘు వర్ణ క్రమానికి ప్రాధాన్యమిచ్చి అట్లా చేయవచ్చునని భావించారు. ఈ తరహా అరుదయితే కావచ్చుగాని, ఉభయత్రా ఈ తాత్పర్యం వ్యాప్తిలో ఉండిందనే అనిపిస్తుంది. ఇదిట్లా ఉంచి, ఈ సందర్భంలో ఈ పాటల గేయాల లేఖనం గూర్చి నరసయ్య ప్రతిపాదించిన విధానం పరిశీలించదగింది. మౌఖిక సంప్రదాయానికి చెందిన పాటలను లేఖన పద్ధతికి ఒదిగించటం కుదరదు. 'రాయ'బడిన పాటను మనం చదివితే — పాడాలనుకుంటే, ఏ అక్షరాలను సాగదీయాలో, కుదించాలో తెలియదు. సాధ్యమయినంతవరకు తెలుసుకోవటానికి వీలు కలిగించే సూచనలు ఆయన చేసారు. గేయాల నిర్మాణ రీతులను, 'గతు'లను: నడకలనుగూర్చి చేయబడిన ప్రతిపాదనలు గూడా ఆయన పరిశీలనలోని నైశిత్యానికి ఉదాహరించుకోదగినవి.

అయితే ఈ జానపదచ్ఛందస్సు'లను గూర్చి విచారించే సందర్భంలో గానీ, రగడలను, లేదా: షట్పదులను గూర్చి విచారించే సందర్భంలో గానీ నరసయ్య దృష్టి 'ముత్యాలసరం' మీదికి ఎందుకు పోలేదో స్పష్టంకాదు. అది 'ఆధునిక ఛందస్సు' కాబట్టి, ఆధునిక ఛందస్సులను తాను విస్తరించబోవటం లేదు. కాబట్టి ముత్యాల సరాన్ని ప్రస్తావించలేదని సరిపెట్టుకోవచ్చు. కాని దానికి జానపద రీతికి, రగడకు, షట్పదికి ఉన్న సంబంధాన్నిబట్టి పరిశీలన సాగిస్తే బావుండేదని నాకనిపించటం సహజం. ప్రస్తుతం అది తెలుగు ఛందో రంగానికి సంబంధించినంతవరకు 'ప్రజ్వల ద్విషయం' అదట్లా ఉంచినా —

ఈ పరిశోధనలో నరసయ్య సంపాదించిన సమాచారం చాలా విస్తృతం సంపాదించటంలో ఆయన పడిన శ్రమ కారణంగా దానిసేవ అభిమానం అధికంగా

ఉండటంలో అనౌచిత్యం ఏమీలేదు. ఆ సమాహారాన్నంతా ఏమాత్రం మిగిలిపోకుండానా అన్నట్టు ఈ గ్రంథంలో పిక్కటిల్లిపోతుందా అన్నంతగా ధట్టించాడు. నిజానికి తొలి అధ్యాయంలోని ఛందోనిరుక్తిలాంటివి లేకున్నా ఫరవాలేదు. కొత్త అంశాన్ని ప్రతిపాదించదలచినప్పుడు తప్ప, మనకన్నా పూర్వం స్పష్టమయిన అంశాలను వదిలి నేరుగా మనం విషయ ప్రవేశం చేయవచ్చు. దానివల్ల ఒక 'బిగింపు' వస్తుంది. అట్లాగే, తాను భావించిన, గుర్తించిన, ఆవిష్కరించిన ... అంశాలను ఒకటికి నాలుగుసార్లు, లేదా నాలుగు విధాలుగా చెప్పి పాఠకుల మనస్సుకు గట్టిగా హత్తుకొనేట్టు చేయాలనే ప్రయత్నం గూడా కొన్నిచోట్ల పునః పునరుక్తంగా అనిపించే సందర్భాలు గూడా కొన్ని గ్రందంలో కన్పిస్తాయి. ఇవి పరిశోధకుని ఆత్రానికి సూచనలు కావచ్చునేమోగాని, ఇట్లాంటి గ్రంథాలను రచిస్తున్నప్పుడు అంతటి ఆత్రం అక్కరలేదనిపిస్తుంది. అదట్లా ఉంచి:

పరిశోధకుడుగా, పరిశీలకుడుగా నిర్ణయాలు, ప్రతిపాదనలు వగైరాలు చేసేప్పుడు తాను స్పష్టపరచుకొన్న విషయాలకు సంబంధించి నరసయ్య ఎక్కడా రాజీపడినట్లు కన్పించదు. అభిప్రాయ భేదాలు ఉత్పన్నమయినప్పుడు తాను విశేషంగా గౌరవించే, అభిమానించేవారి అభిప్రాయాలనయినాసరే, మర్యాదాపూర్వకంగానే నిరాకరించటానికి ఆయన ఎక్కడా వెనుకాడినట్టు కన్పించదు. మరొకరెవరో ఎందుకు? ఇందుకు నా విషయమే ఉదహరిస్తాను. 'ఎత్తుగీతి' గణ నిర్ణయ సందర్భంలో నా విశ్లేషణను, వివేచనను ఆయన హేతుపురస్సరంగానే నిరాకరించాడు. (అధ్యా IV. పు. 318 - 321) ప్రాచీన లాక్షణికులు అభిప్రాయాల విషయంలోనూ ఇదే తరహా. ఇక్కడ ఒక చిన్న అంశం. ప్రాచీన లాక్షణికులు గూడా 'సర్వం' తెలిసి ఆకళింపు చేసుకొన్నారనలేము. వారి పరిశీలనలోనూ 'లోపాలు' ఉండవచ్చు. అయినా, ఆధునిక విమర్శలకు నా మనవి ఒకటి. వారు చెప్పిన వాటిని కాదనటానికి వెనుకాడనక్కరలేదు. కాదనే స్వాతంత్ర్యం వారికున్నట్టే మనకూ ఉంది. అయితే వారు 'ఆ' విధంగా ఎందుకు చెప్పి ఉంటారు అనేది మరొక్కింత గాఢంగా, తీవ్రంగా ఆలోచించి మాత్రం ముందుకు సాగటం ప్రయోజనవంతంగా ఉంటుంది. ఇదిట్లా ఉంచి: ఇన్నిన్ని విషయాలను ఇన్నిన్ని కోణాలనుంచి ఈ గ్రంథంలో పరిశీలన సాగిన సందర్భంలో కొన్ని అంశాలు జారిపోవచ్చు. కొన్ని సందర్భాల్లో అభిప్రాయ భేదాలు కలుగవచ్చు. కాగా, ఈ గ్రంథంలో

ప్రతిపాదించిన, నిర్ణయించిన అవశాలు కొన్నింటితో మనం ఏకీభవించ (లేక) పోవచ్చు. కాని, పరిశోధకుని నిజాయితీని, నిష్ఠను మాత్రం శంకించే అవకాశం ఈ గ్రంథంలో ఎక్కడా కలుగకపోవటం విశేషం. పరిశోధన రంగంలో నిజాయితీకి, నిష్ఠకూ అనితరమయిన ప్రాధాన్యం.

'మహత్త్వాత్ భారవత్త్వాచ్చ' అన్నట్టు ఈ గ్రంథం విషయ ప్రామాణికత్వం, విషయ విస్తృతినిబట్టి కూడా ఉత్తమశ్రేణినందుకొంది. దేశి చ్ఛందస్సులను గూర్చి కూలంకషంగా చర్చించి ఛందోరంగాన దేశి విన్యాస వైభవాన్ని మనకు అనుభవం లోకి తెచ్చింది. దేశి చ్ఛందస్సులను గురించి ఈనాడు ఎవరు మాట్లాడినా ఈ గ్రంథాన్ని ఉదాహరించక తప్పని పరిస్థితిని తన లోతయిన కృషిద్వారా నరసయ్య కల్పించాడు. అంతేకాదు. అనేకానేకంగా దేశి చ్ఛందస్సుల్లో అలనాటినుంచి సాగిన 'ప్రయోగా'లను రకరకాలుగా ప్రస్తుతీకరించటం ద్వారా అధునికంగా మరింతగా 'ప్రయోగాలు' చేసేందుకు ప్రేరణ కూడా కలిగించాడు. ఒకవైపు ఛందోవైముఖ్యం పరితర్జనం చేస్తున్న తరుణంలో ఈ విధమయిన ఉత్సాహకరమయిన ప్రేరణ ఎంతగానో ప్రయోజనవంతం కాగలదని విశ్వసిస్తున్నాను.

గాఢమయిన కృషిఫలంగా దేశి ఛ్ఛందో విన్యాస వైభవ ప్రదర్శకంగా ఈ గ్రంథాన్ని సహృదయుల అందుబాటులోకి తెచ్చినందుకు నరసయ్యను మనసారా అభినందిస్తున్నాను. అయితే, కేవలం ఈ అభినందించటంతో నేను ఆగిపోదలచు కోలేదు. ఈ కృషిని ఆపకుండా మరింత ముందుకు ఆయన సాగించినప్పుడే నా అభినందన సార్థకం కాగలదనే షరతును గూడా విధిస్తున్నాను.

15-3-91
వరంగల్

— సంపత్కుమారాచార్య

# ఇదొక విజ్ఞాన సర్వస్వం

చేకూరి రామారావు
Proffessor,
Dept. of Linguistics,
Osmania Univesity.

ఛందో వ్యాకరణాలపైన ఆసక్తి తగ్గిపోతున్న కాలమిది. కావ్యకళాను శీలమే ఛందో వ్యాకరణ పరిశీలనంకన్నా మేలైనదని ఒక దురభిప్రాయం ఈ నాటికీ ప్రబలంగా ఉన్నది.

నా మట్టుకు నాకు కావ్యానుశీలనం ఎంత ఆనందకారకమో ఛందో వ్యాకరణ పరిశీలనం అంతే హాయిగా ఉంటుంది

మరీ ముఖ్యంగా ఛందస్సును గురించి రాసే వాళ్ళూ, మాట్లాడేవాళ్ళూ కరువైపోయారు. గిడుగు సీతాపతిగారూ, రావూరి దొరస్వామిశర్మగారూ పోయిం తరవాత ఆ లోపం మరీ కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నది. ఎప్పుడన్నా సంపత్కుమార కలిసినప్పుడే ఛందస్సు గురించి కాసేపు హాయిగా మాట్లాడుకోవాలనిపిస్తుంది. అప్పుడప్పుడు కొంచెం గిల్లి తగువు పెట్టుకోవాలనిపిస్తుంది కూడా.

ఆ మధ్యన డా॥ చెన్నకేశవరెడ్డి ఆధునిక గేయ కవిత్వంమీద రాసిన పుస్తకంలో ఆధునిక గేయ ఛందస్సుల గురించిన సమగ్రంగా సమీక్షించారు. ఇదిగో ఇప్పుడీ డా॥ నరసయ్యగారి దేశి ఛందస్సులమీద పుస్తకం ఇంకోవిపులమైన పరి శీలక గ్రంథం.

జాతులు, ఉపజాతులు, అక్కరలు, రగడలు, కళికోత్కళిలు — ఇట్లా అన్ని రకాల దేశి ఛందస్సులమీద ఇది ఒక విజ్ఞాన సర్వస్వం. దేశి ఛందస్సులపై ఇంత వరకూ వచ్చిన విజ్ఞానాన్ని వడగట్టి తేల్చిన సమగ్ర గ్రంథం.

వివిధ వాద ప్రతివాదాలను విపులంగా చర్చించటం ఈ పుస్తకంలో ఒక సుగుణం. "అదియును సమంజసమే, ఇదియును సువితమే" అనే రాజీ ధోరణిలో కాకుండా ప్రతిచోటా నిష్కర్షగా తన అభిప్రాయాలు చెప్పారు నరసయ్యగారు. తన తీర్పును ధైర్యంగా ప్రకటించారు. మరిన్ని చర్చలకు తావిచ్చే ప్రతిపాదనలు చేశారు. నరసయ్యగారు నాకు తగిన వ్యవధి ఇయ్యలేదుగాని ఈ పీఠికలోనే తగాదా పెట్టుకొని ఉండేవాణ్ణి. ఆపని ఎప్పుడైనా చెయ్యొచ్చు, ఎక్కడైనా చెయ్యొచ్చు.

అనంతుని పూర్వం - అనంతుని అనంతరం అని ఛందశ్చరిత్ర విభాగం చెయ్యటం, తరువోజ - ద్విపదలలో ఏది ముందు ? ఏది వెనుక (చెట్టు ముందా ? విత్తు ముందా ? అన్నట్టు) అనే వాద పరిశీలనం. శాసనాలను రగడలుగా విభజించిన విధానం, కొన్ని గేయాల్లో షట్పదులను చూపించిన విధానం, కొన్ని రగడల్లో మరో రగడను దర్శించిన విధానం —— ఇట్లా ఎన్నింటి గురించో అర్థవంతమైన చర్చలు సాగించొచ్చు. శాశ్వత సత్యాలేవీ ఉండవు. చర్చల ద్వారా విజ్ఞానం పెరుగుతుంది. అందుకు అవకాశం ఇచ్చే పుస్తకాలే మంచి పుస్తకాలు. ఛందస్సు విషయంలో నరసయ్యగారి దేశి ఛ్ఛందోరీతుల గ్రంథానికి ఆ విలువ (status) ఉంది.

సమ మాత్రాకమైన గేయంలో అర్ధపాదంమీద గురువువేయటం ద్వారా పాదభేదం కల్పించొచ్చు. ఇట్లాంటి పాదభేదాన్ని మూడో పాదానికి తగిలించటం ద్వారా అర్ధ షట్పది ఏర్పడుతుంది. సీసంలో చివరి రెండు సూర్యగణాల్లో చివరి లఘువును గురువుగా రాగయుక్తంగా ఉచ్చరిస్తే ఏర్పడినదాన్ని ఇట్లాంటి పాదభేదంగా భావించటానికి వీలుంది. ముత్యాలసరంలోకూడా కనిపించేది ఈ నిర్మాణ స్వభావమే. ఈ రకమైన ఊహలు 1958లో మాత్రా ఛందస్సుల గురించి అభ్యుదయ పత్రికలో రాస్తూ ఒక సారి ప్రకటించాను. అయితే ఈ రకమైన "అర్ధం పాదంపై గురువు" అనే నిర్మాణ సూత్రానికి (Structural principle) ఏ భాషా, సాంస్కృతిక, మానసిక కారణాలు మూలమో నా కింకా అంతుబట్టని విషయమే.

ముత్యాలసరం అంటే గుర్తొచ్చింది. రగడలు గురించి ప్రస్తావించినప్పుడు నరసయ్యగారు ముత్యాలసరం గురించికూడా లోతుకు పోవల్సింది. పేజీలు ఎక్కువవుతాయని భయపడ్డారేమో (ఇప్పుడు మాత్రం ఏం తక్కువయినాయని ?)

తెలుగు ఛందస్సులో లయ గురించి పూర్వం సీతారామాంజనేయులు గారొక్కరే అర్థవంతంగా మాట్లాడారు. లయ నిర్మాణాన్ని గురించి పరిశీలించాల్సిన అంశాలు

చాలా ఉన్నాయి. లయ అర్థం కానిది చందస్సు అర్థం కాదు. లయ అంటే భావలయ, అంతర్లయ అని కాదు. శబ్దగుణం. మాత్రా విభజన, గణావృత్తి మాత్రమే లయస్ఫూర్తి నియ్యవు. తెలుగులో పదనిర్మాణం, ఊనిక ప్రవర్తనల గురించి చేసే పరిశోధన లయగు గురించి అర్థం చేసుకోటానికి పనికొస్తుంది. భాషా శాస్త్రం ఇందుకు ఉపయోగించే అవసరమైన పనిముట్టు.

సర్వజనంబులు చూచి భయంపడి (పే. 32) అనేచోట లయ ఊనిక ప్రవర్తనను బట్టి ఏర్పడిందే. పదంలో ఊనిక ఎక్కడెక్కడ పడుతుందో గుర్తుపడితే ఇది అర్థమవుతుంది

మాత్రా పరిగణన కేవలం భౌతిక పరిమాణంమీదనే ఆధారపడిలేదు. మానవుల గ్రహణపద్ధతి (Perception) కూడా ఒక కారణం. భిన్న పరిమాణాల అక్షరోచ్చారణలను సమంగా భావించే మానసిక గుణం ఒకటి ఉంది. విభేదించే అంశాలమధ్య సామ్యాన్ని దర్శించే మానవస్వభావం దీనికి కారణం. దీన్ని Abstraction అంటారు. లయ గ్రహణలో మనఃప్రవృత్తి గురించి సెయ్మూర్ ఛాట్మన్ The theory of Metreలో ఉపయోగకరమైన విషయాలు చెప్పాడు.

లయను గురించి నరసయ్యగారు మంచి విషయాలే చెప్పారు. ఆయన వదిలిన అంశాల ఆధారంగా వదిలినచోటునుంచి ముందుకు పోవాల్సిన అవసరం ఉంది. ఆ మార్గాన్ని స్థూలంగా ప్రదర్శించటంకోసమే పై విషయాలు ప్రస్తావించాను.

నరసయ్యగారి శైలి గురించి ఒకటి రెండు మాటలు చెప్పాలి. ఈ కాలంలో గ్రాంథిక భాషలో సిద్ధాంతవ్యాసం రాయటం కాలవైపరీత్యం (Anachronistic). గ్రాంథిక భాషమీద నాకు వ్యతిరేకత లేదు. కాని నేటికాలపు వచన రచనకు అనువైన శైలీరీతులు నేటిభాషనుంచే నిష్పన్నం అవుతాయని ఈపాటికే నిర్ణయం అయిన తరువాత ఇప్పుడు మళ్ళీ దాన్ని తిరగదోడాల్సిన అవసరం ఉందా ? గ్రాంధికంలో రాసినా శాస్త్రగ్రంథాల్లో జయంతిరామయ్య, దూసి రామమూర్తి, భాష్యకారాచార్యులు వంటివారు శాస్త్రసంక్షిప్తతను (Scientific Precision) సాధించారు. నరసయ్యగారు ఆ ఆదర్శాన్ని గ్రహించాల్సిఉంది. తెలుగు సిద్ధాంత వ్యాసాల్లో కనిపించే, సందర్భానికి అవసరంలేని ఊహామాత్ర విషయాలను వదిలేస్తే బాగుండేది. మొదటి అధ్యాయాల్లో అవి ఎక్కువున్నాయి. ఆదిమమానవులు, ఆటవికుల

గురించి ఇక్కడ చెప్పిన విషయాల అవసరం ఉందా? "ఆదిమానవుల ఆత్మ పాల కెరటమై పరవశ్య తొక్కినది" అంటూ సినారె గారెప్పుడో ముప్పయ్యేళ్ళ కిందట రాస్తే దాన్ని విపులంగా కోట్ చెయ్యకపోతే ఏమయింది?

అంతేగాక శాస్త్రవచనంలో ప్రశ్నలకు తావిచ్చే విధంగా రాయగూడదు. ఇది నరసయ్య గారికి పాఠం చెప్పటానికి రాయటంలేదు. ఆయన మీద చనువు కొద్దీ ముందు ముందు జాగ్రత్త పడతారని రాస్తున్నాను. ఉదాహరణకు ఈ పేరా (పే 23) చూడండి.

"అక్షరము స్వరవ్యంజన భేదముచే ద్వివిధము. ఛందశ్శాస్త్రములో స్వర మునకున్న ప్రాధాన్యము వ్యంజనమునకంతగాలేదు. స్వరమును బట్టియే ఇచ్చట గురు లఘు నిర్ణయము జరుగును. వ్యంజనమునకు విడిగా గణనము లేదు. స్వర యుతమైనప్పుడు (ప్రాణిగా) గణనము జరుగును."

అక్షర పరిగణనం స్వరాన్ని బట్టి జరుగుతుంది. (అక్షర సంఖ్య, సర్వ సంఖ్య ఒకటే) స్వరపరకం కాకుండా పరస్థానీయమైన వ్యంజనానికి పూర్వ హ్రస్వ స్వరాన్ని గురువుచేసే శక్తి ఉంది" అని అసలు చెప్పవలసిన విషయము. దీన్ని విశదీకరించబోయి "స్వరమును బట్టియే ఇచ్చట గురు లఘు నిర్ణయము జరుగును" అనే ప్రమాద కారకమైన వాక్యాన్ని రచించారు.

అయితే ఇవన్నీ అల్ప విషయాలు. తేలిగ్గా సవరించుకోగలిగినవి.

ఈ కాలంలో ఇంత వస్తు వైపుల్యంతో, ఇంత విషయ పరిశీలనతో ఛందస్సుమీద విజ్ఞాన సర్వస్వంలాంటి ఈ పుస్తకం అచ్చులో చూడటమే ఆనందంగా ఉంది. ఇంత పుస్తకం రాయటానికి ఎంత పరిశ్రమ కావాలి? అచ్చెయ్యటానికి (సుమారు 600 పేజీలు) ఎంత ధైర్యం కావాలి? ఈ సాహసానికి కూడా నరసయ్య గారిని అభినందిస్తున్నాను.

ఇది ప్రజారంజక గ్రంథం కాదు. విద్వత్పరిశ్రమ ఫలితం. దీనికి విద్వల్లోకంలో తగిన ఆదరణ లభిస్తుందని నా నమ్మకం.

10.3.91,
విజయవాడ.

— చే. రా.

# కృతజ్ఞుణ్ని

పరిశోధనావసరాలకు మించిన వాత్సల్యంతో పూర్ణంగా సహకరించిన పథనిర్దేశకులు (Guide) పూ॥ ప్రొ. శ్రీమతి పి. యశోదారెడ్డి గారికి,

పరిశోధనాకాంక్షను పరిశీలించి వెన్నుతట్టి ప్రోత్సహించిన పూ॥ ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి,

చర్చల ద్వారా నా అభిప్రాయాలు తైపారు వేసుకునే అవకాశం ఇచ్చిన సుప్రసిద్ధ ఛందో విమర్శకులు డా॥ కోవెల సంపత్కుమారాచార్య, ప్రొ. చేకూరి రామారావ్, కీ॥ శే॥ విద్వాన్ రాపూరి దొరసామి శర్మల గార్లకు,

గ్రంథామోదానికి న్యాయమూర్తులైన ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రి, కొర్లపాటి శ్రీరామమూర్తి, శలాక రఘునాథశర్మగార్లకు

పరిశోధనావకాశాన్ని, అనుమతిని ప్రసాదించిన శ్రీలక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల పాలకవర్గానికి, కోరినదే తడవుగా గ్రంథాలు, వ్యాసాలు, పరిశోధనాపత్రాలు అందించిన వివిధ విశ్వవిద్యాలయాల, ప్రైవేట్ గ్రంథాలయాధిపతులకు, వ్యాసకర్తలకు, పరిశోధకులకు, సహకరించిన ఎందరో మిత్రులకు,

అచ్చుపనుల్లో సహకరించిన రాఘవేంద్ర, నాగేంద్ర, వోల్గా (విజయవాడ) ముద్రాపకులకు, ఆదినుండీ వెన్నుదన్నై నిలిచిన అర్ధాంగి శ్రీమతి సీతకు,

అభిమానంగా, అల్పవ్యవధిలో అభిప్రాయాలు రాసిచ్చిన డా॥ కోవెల సంపత్కుమారాచార్య, ప్రొఫెసర్ చేకూరి రామారావుగారలకు

కోసుకుంటున్న ఈ ఫలానికి మూలమైన ఎందరో పూర్వ మహానుభావుల సాహిత్య కేదార కృషికి............

మనఃపూర్ణంగా.

— సంగనభట్ల నరసయ్య

# విషయ సూచిక

**సూచన :** అధ్యాయము 5 మరియు 6 ఒకటవ పేజీ సంఖ్యతో ప్రారంభమైనవి. అసౌకర్యమునకు మన్నించగలరు. పేజీ సంఖ్యతో అధ్యాయసంఖ్య ప్రతి పుటలో కలదు. గమనించిన అసౌకర్యము తగ్గును.

# పునరాలోచనలో...

పూ॥ చేరా, సంపత్కుమారలు తమ అభిప్రాయాల్లో నాకు ప్రోత్సాహంతో పాటు చాలా విలువైన సలహాలు ఇచ్చారు. వాటిని ఆదరంగా స్వీకరిస్తున్నాను.

ఐతే వారిద్దరూ రగడలవద్ద ముత్యాలసరంగూర్చి ప్రస్తావించాల్సిందన్నారు. చారిత్రక నేపథ్యంలో క్రమవికాసం గూర్చి విమర్శిస్తున్నపుడు ఆధునిక వికృతి ఐన ముత్యాలసరంను అక్కడ విమర్శించడానికి యోగ్యస్థానంగా భావించలేదు. ఇంకో భయంకూడా ఉంది. ముత్యాలసరంగూర్చి ముట్టుకుంటే మరో గ్రంథం అవుతుంది. అందుకే ఆధునిక ఛందస్సులగూర్చి నా ప్రణాళికలోనుండి విస్తృతి భారం దృష్ట్యా తొలగించాను. ముత్యాలసరం మీద ఇప్పటికే వచ్చిన వ్యాసాలు, విమర్శలు గ్రంథరూపంలో తేవాలనీ, ఒక చర్చాగోష్ఠి నిర్వహించాలనీ సంకల్పం ఉంది.

ఈ గ్రంథం ఇంత విస్తారం కావడానికి నా పరిశోధనాంశమే పెద్దది. చాలా విస్తృత పరిధి ఇది. అంశం పరిధి కుదించాలని పరిశోధనా కాలంలో అనుకున్నా ఒక ప్రామాణిక గ్రంథం అవుతుందనే పేరాశతో ఆలోచన మానుకున్నాను. ఇక ఆధునిక ఛందస్సులను మరొకరు పరిశోధించడానికి పూనుకునేంత పెద్ద విషయం. నాకే ఉంది ఈ ఆలోచన.

థీసిస్ రాసినాటికీ అచ్చువేసేనాటికీ మధ్యగల ఈ అర్ధ దశాబ్ది కాలంలో అనేకంగా అభిప్రాయాలు మారుతూ వచ్చాయి. ఆలస్యంఐతే గ్రంథం అచ్చువేయక పోవాల్సివస్తుందని భయంవేసింది. అభిప్రాయాలకు అనుగుణంగా కొన్ని మార్పులు చేసాను. ముఖ్యంగా ప్రాజ్నన్నయ యుగపు దేశిచ్ఛందస్సులలో శాసనస్థ ఛందస్సుల

విషయంలో ప్రొ. కొర్లపాటి శ్రీరామమూర్తి వంటి పెద్దల సూచనలు స్వీకరించాను. సంధిగ్ధంగా ఉన్న శాసనచ్ఛందస్సులను తొలగించాను. ఐనా శాసన భాష, లిపి, లేఖన, ఉచ్చారణా విధానాలు అర్వాచీనులకు ఇంకా సందిగ్ధ ప్రాయాలే ఐనపుడు ఛందస్సులూ అంతే.

భాష విషయంలో చేరాగారి అభిప్రాయంతో నాకు భేదాభిప్రాయంలేదు. నేను వ్యావహారికాభిమానినే. ఐనా భ్రమరకీటక న్యాయం చొప్పున ఛందస్సంబంధంగా విషయాలు పాత గ్రంథాలు, పత్రికల్లో గ్రాంథికంలో చదివి భాష గ్రాంధిక వ్యావ హారిక రూపాల సరిహద్దుల్లో నిలిచి నట్టయింది. ఐనా యడాగమాలు, ద్రుతకార్యాలు లేకుండా, విసంధులు పాటిస్తూనే రచన కొనసాగింది.

'నిత్యా ప్రవాహినీ దేశ్యా' అన్నట్టు దేశి విషయంలో త్వరితగతిమార్పులు సహజం. వీటి గతకాలపు పోకడ్స్, చారిత్రక క్రమ వికాసాలు స్పష్టంగా పట్టుకోవడం చాలా శ్రమతో గూడినపని. అలలు ఉద్యమించే ఇసుక తీరాల్లో పాదముద్ర ల్లాంటివి ఇవి. ఇక్కడితో నాపని (పరిశోధన) ఆపేదిలేదు. అలా అని నేనొక్కణ్ణే సమగ్రత్వం సాధిస్తానని అత్యాశలేదు. విపులాచపృథ్వీ - కదా !

— రచయిత

# అంకితము



పూజ్య పితరులు శ్రీ॥ సౌ॥ **నర్సుబాయమ్మ** బ్ర॥ శ్రీ॥ **సంగనభట్ల వెంకన్న** గారలకు

# 1. ప్రాస్తావిక

మానవుడు అనుభూతిపరుడు. సుఖదుఃఖాత్మకమగు తన అనుభూతులను వ్యక్తమొనర్చుటకు, పరులకు పంచియిచ్చుటకు యితర ప్రాణికోటికన్న విశేషమైన ఇంద్రియ నిర్మాణము కలిగి ఉన్నాడు. ఆదిమ కాలము నుండియు తన సంఘర్ష ణాత్మక జీవన సమరములో అనుభూతి వ్యక్తీకరణము ఏదో ఒక విధముగ సాధించుచునే యున్నాడు. భాష పుట్టుకకు ముందు నుండియు అంగచాలనము, భాషా రహితములగు కేకలు, అరుపులు, వేటాడి తెచ్చిన జంతువుల చర్మముతో తయారు చేసుకొన్న వాద్యములు, వ్యక్తీకరణకు దోహదమొనర్చినవి. సామూహిక నృత్యము లలో అటవికులలో భాష, భావములకన్న హర్షాత్మకమైన కేరింతలు, గంతులు, వాద్య ధ్వనులు ముఖ్యములై ఉండును. నృత్తములలో ఆనందానుభూతి వ్యక్త మొనర్చగల్గునాటికి లయ, మాధుర్యము, మానవ హృదయము నాకర్షించినవన వచ్చును. నృత్తము పిదప నృత్యము, ఆపై నాట్యమని అనుభూతి వ్యక్తీకరణము లోని అభివృద్ధి దశల పౌర్వాపర్యమును భరత మహర్షులు నిష్కర్షించిరి. మానవ సంస్కృతీ చరిత్రకారులును ఇట్లే వివరించిరి. ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు సైతము భాష తొలినాళ్ళ నుండియు లయ, లయానుగుణమైన గేయము, గేయ సంస్కార రూపములో కవిత్వము, భావ వ్యక్తీకరణానుకూలమైన వ్యవహారభాష కాలక్రమాను గతములని నుడివిరి.[1]

లయ అత్యంత ప్రాచీనమైనది. ప్రకృతిలో అంతర్లీనమైయున్నది. మాన వుని ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు లయాత్మకములు.సూర్య చంద్రోదయాదులు. ఋతువుల కాలముల గమనాగమనములు లయ బద్ధములు, కోయిలల కుహూరావములు, సము ద్రపు టలల తాకిళ్ళు, గమనము నందలి పాదచాలనము అన్నియును లయబద్ధములే. ప్రకృతియే మానవునకు లయ నేర్పినది. శ్రమలో శ్వాసప్రక్రియకు గల అనుబంధము వలన కట్టెలుకొట్టినను, చెట్లు కోసినను, రాళ్ళు పగులగొట్టినను, ధాన్యము దంచినను ఏతాము ఏత్తినను లయ లేనిదే పనిలేదన్నట్లుండును.

ఇట్లు మానవుని జీవనవిధానముతో ముడివేసికొన్న లయ నృత్తములో, పాటలో, సంగీతములో అనివార్యమైనది. లయ కారణముగా ఈ మూడును ఒకే

తల్లి బిడ్డలనవచ్చును. దీనిని క్రిష్టోఫర్ కాడ్వెల్ స్పష్టముగా ఇట్లు వివరించినాడు "Indeed one could makeout a case for the supposition that music itself was generated at the same time as primitive poetry and that an aboriginal physical rhythm expressed in gestures and leapes and in artificial noises made by beating sticks and stones was the common parent of Dance, Poetry, and music"[2]. ఇట్లు మాతృక కాదగిన లయ సంగీత నృత్యములందు తాళశబ్ద వాచ్యమై, సాహిత్యమునందు ఛందమై నిలచినది, లయతో పుట్టిన పాటయొక్క కాలప్రమాణమును కొలుచు సాధనముగ ప్రారంభమైన ఛందస్సు పాటతో అభివృద్ధి చెంది సాహిత్యము అందలి పద్యములో అనివార్యబంధమై, కాలక్రమమున విశాల పరిధి యేర్పడి తక్కిన సాహిత్యశాఖలతో ఒక శాస్త్రరూపమును సంతరించుకొని నిలచినది.

గేయములను పాడునప్పుడు ఉచ్చారణకాలమును కొలిచెడు ఈ శాస్త్రము అత్యంత ప్రాచీనకాలముననే అభివృద్ధినొందినది. ప్రపంచమందలి అతి ప్రాచీన మానవ నిర్మిత సాహిత్యముగా పేరుగాంచిన వేదములలో ఛందస్సులు పేరులతో, నిర్దిష్టలక్షణములతో ఉపయోగింపబడినవన్నచో అంతకుముందే ఈ శాస్త్రమభివృద్ధి పథమున నున్నదన్నమాట. ఇంత ప్రాచీనమును, సుప్రసిద్ధమును ఐన ఈ శాస్త్రము పింగళుడు మొదలుగ అనేకులగు లాక్షణికులచే లాక్షణీకరణమొంది, కవులచే లక్ష్య పుష్టి నొంది నానాకాలములందు పలుభాషలలో, పలు ప్రాంతములలో పెక్కు శతాబ్దులుగా ఎనలేని అభివృద్ధిని సాధించినది. భారతదేశమొక అఖండభూమియైనను ఇందలి అనేక ప్రాంతములు భిన్న, భిన్న భాషా సాహిత్య సంస్కృతులతో భేదించుట చేతను ప్రత్యేక ప్రాంతముల ప్రాంతీయతాముద్ర ఆయా భాషలపై, సాహిత్య సంస్కృతులపై ప్రగాఢమగుటచేతను అఖండత యొకప్రక్క, భిన్నత్వమొకప్రక్క సమాంతర స్రోతస్వినులై అంతర్గత ప్రవాహము నొందుచునే యున్నవి. భిన్న ప్రాంతీయ భాషా సాహిత్యములలో కల్గిన మార్పులకు, ఆ ప్రాంతప్రజల అభీష్టము నకు అనుగుణమైన అభివృద్ధిలో భాగముగా, ఛందశ్శాస్త్రము కూడా (తెలుగుభాషలో) తక్కిన ఇతర ద్రావిడ భాషలతోబాటు (సంస్కృత భాషలోని పారంపరికాభివృద్ధితో బాటు) దేశీయమైన అభివృద్ధిని గూడ గాంచినది.

భారతదేశమున అన్ని ప్రాంతములకు సామాన్యమైన సంస్కృత భాషలో దీనికి వేదాంగములలో నొకటిగా గౌరవముతో పాటు శాస్త్రీయమైన స్వరూపము

అత్యంత విస్తృతపదిధిలో నేర్పడినది. కాలప్రమాణములో కనిష్ఠమైన మాత్రా ప్రమాణమును తీసికొని ఏకమాత్రికము, ద్విమాత్రికములైన లఘు, గురువులతో ప్రత్యక్షరమును కొలుచుచు, ఏకాక్షరము మొదలుగ షడ్వింశత్యక్షరములు గల పాద వ్యవస్థ నేర్పరచి, ప్రయోగసాఫల్యము పరిశీలించకయే కేవల శాస్త్ర ప్రమాణబుద్ధితో కోటానుకోట్ల వృత్తములను గుర్తించుట జరిగినది. ఆశ్చర్యకరమగు నీ పర్గీకరణ మున శాస్త్ర విస్తృత పరిధితోబాటు సర్వఛందముల అంతర్లీనత్వము సిద్ధించి, ప్రాంతీయభాషలకు సహజములైన తత్తత్ప్రాంతీయ ఛందస్సుల స్వతంత్ర ప్రతిపత్తి మరుగున పడినది. కాని స్వజాతి భాషాసాహిత్యాభిమానులగు తత్తత్ప్రాంతీయుల దోహదము మూలమున ఆయాదేశీయములగు ఛందస్సులకు అస్తిత్వము లభించినది. తెలుగు భాషకు సహజమైన అట్టి దేశీయమగు ఛందస్సుల ఉనికిని, సమగ్ర రూప మును, ఆవిర్భావ వికాసములను సంస్కృతభాషలోని పారంపరిక ఛందశ్శాస్త్ర విషయములలో గల విభేదమును, కాలగతిలో నిలదొక్కుకొన్న వాని అస్తిత్వమును పరిశీలించవలసిన అవసరమెంతేని కలదు.

"మార్గసాహిత్య ప్రాబల్యమున మరుగుపడి అంతరించిపోవుచున్న మన ప్రాచీన దేశి సాహిత్యము నుద్ధరింపవలసిన యావశ్యకత."[3] భాషా విషయము లందువలెనే, ఛందసాహితీ రీతులందును గల దేశి సంప్రదాయమును వాని విశేష లక్షణములను పరిశీలింపవలసిన ఆవశ్యకత[4], భిన్నభాషలలోని దేశి రచనలకు గల పరస్పర సంబంధాన్వేషణము, భిన్నములగు నీ ఛందోరీతుల మూల తత్త్వ పరిశీల నము[5], ఈ గ్రంథ రచనమునకు ప్రాతిపదికగా దేశి ఛందముల విషయమును గ్రహించుట జరుగుచున్నది.

—×—

## అథ స్సూచికలు

1. "Language, its Nature, Development, Origin"
—Otte Jesperson
2 "Illusion & Reality"(The birth of Poetry)
—Christopher Caudwell Page. 2
3. "దక్షిణదేశ భాషా సారస్వతములు - దేశి" (తొలిపలుకు) పు V
— కోరాడ రామకృష్ణయ్య
4. " " " పుట 3
5. " " " (దేశి రచనలు) పు. 247



# 2. ఛందో నిరుక్తి

ఛందశ్శాస్త్రము అత్యంత ప్రాచీనమైనదగుటచేతను, వేదము ఛందోబద్ధమగుటచేతను, ఛందశ్శబ్దమునకు విస్తృతమైన విలక్షణమైన, అర్థపుష్టియున్నది.

వైదిక శబ్దశాస్త్రముగా ప్రమాణీకృతమైన నిరుక్తము "ఛందాంసి ఛాదనాత్"[1]అని నిర్వచించుచున్నది. ఛందము[2] ఛాదకమని [తొడుగువంటిదని]దీని అభిప్రాయము. భావమును భాషలో చెప్పునప్పుడు ఛందస్సు ఆ భావనకు అందమైన అచ్ఛాదనమై ఒప్పునని భావింపవచ్చును. మంత్రమయి అయిన దేవతను ఛందోమయమైన మంత్రము ఆచ్ఛాదించుటచే ఛందము ఛాదకమని అభిప్రాయమై యుండును. "ఆచ్ఛాదకత్వాత్ ఛందః"[3] అన్న సాయణుని వాక్యమును ఇదే అర్థమును సమర్థించుచున్నది. "ఛంద్యతే అనేనేతి ఛందః, ఛదిసంవరణే" [4] అని సిద్ధాంతకౌముది ధాత్వర్థమును చెప్పుచున్నది. సంవరణ మనగా చక్కగా ఆవరించియుండుట. ఇది కూడా పై యాస్కుని నిర్వచనమువలెనే ఉన్నది. మంత్రమయి అయిన దేవతను ఛందోరూపమైన మంత్రము చక్కగా ఆవరించియున్నది. అనగా మంత్రము దేవతా రూపమును చక్కగా నిర్వచింప జాలి, ప్రత్యక్షీకరింప జాలియున్నది. కనుక ఆ దేవతను సుష్ఠుగా, స్పష్టపరుపజాలు మంత్రమునకు ప్రాణభూతమైన ఛందము ఆవరణాత్మకమగుట యుక్తమే.

ఛందశ్శబ్దమునకు వేదమని, అభిప్రాయమని, ఛందశ్శాస్త్రము అని అమరకోశము నుడువుచున్నది. వేదము ఛందోబద్ధమైన వాఙ్మయమగుటవలన, లౌకికమగు వాక్కులు [నిత్య వ్యవహారములోనివి] ఛందోహీనము లగుట వలన వేదమును ప్రాచీనులు ఛందమని వ్యవహరించి యుండవచ్చును. ఛాందసమనగా వైదికశైలి, ఛాందసుడనగా వైదికశైలిలో పఠనము లేదా ప్రవర్తనము గలవాడన్న లౌకికార్థములు దీనినుండే వచ్చినవి. అట్లే ఛందమునకు 'అభిప్రాయమ'న్న అర్థము: సుఖదుఃఖానుభూత్యాత్మకమగు అభిప్రాయ ప్రకటనమునకు ఛందస్సుపయోగింపబడుటచే వచ్చి ఉండును.

కాని పై అభిప్రాయము లన్నియు స్పష్టార్థముతో ప్రస్తుతమున కుపకరిం చుటలేదు. ఛందస్సనగా గమనము, నడక అన్న అర్థము వైదిక షడంగములలో ఛంద స్సును వేదమునకు పాదములని [5] చెప్పుటలోనే కలదు. ఛందస్సు, ఋషి, దేవత తెలియనిదే ఏ వేదమంత్రమైనను ఉచ్చరింపరాదని కాత్యాయనుడు చెప్పుటలో గేయ రీతి తెలియక వేదమంత్రము గానము చేయరాదన్న భావన ఇమిడియున్నది. గాన విధానము తెలియక గేయము శోభించదు.

"ఛందయతి ఆహ్లాదయతీతి ఛందః" అని అమరకోశమున వేరొక్క నిర్వచనమున్నది. దీనిని బట్టి ఛందము ఆహ్లాదనార్థమని బోధపడుచున్నది. నిజమునకు సాధారణమైన వాక్కులకు ఛందోబద్ధమైన వాక్కులకు ఉచ్చారణా సందర్భమున ఆహ్లాదజనకత్వ మనెడు ప్రధాన భేదము ఉండనే ఉన్నది. ఛందోహీనమగు శబ్దము ఆహ్లాదకరము కాకుండుటకు కారణము ఆ శబ్దోచ్చారణ సందర్భమున తద్విషయక మగు శ్రవణ సుభగత్వము లేకుండుటయే. శ్రవణపేయతను ఆపాదించుటచే ఛంద మునకు ఆహ్లాదకారి అనెడు అభిప్రాయము ఏర్పడినది. దీనికి భరతుని వాక్యమే ప్రమాణము. తన నాట్యశాస్త్రమున "ఛందోహీనో న శబ్దోస్తి నచ్ఛంద శ్శబ్ద వర్జిత [6] మ్మని శబ్ద-చ్ఛందముల అవినాభావత్వమును తెలిపినాడు. నాట్యము ఆహ్లాదము కొఱ కుద్దేశింపబడుటచే ఆహ్లాదకారియగు శబ్ద ప్రయోగము అవసరమని, తద్భిన్నమగు శబ్దములు త్యాజ్యములే యని, శబ్దమునకు సౌందర్యము నాపాదించు ఛందము అత్యంతావశ్యకమని, శబ్దము, ఛందము పరస్పర మొకటి లేక ఒకటి ఉండజాలవని అతని అభిప్రాయము. కనుక ఛందమునకు ఆహ్లాదకారి అనునదే సమంజసమైన యర్థము. ఛందస్సునకు సంతసించు, సంతసింపజేయు అను అర్థములు గల ఛంద్ ధాతువుతో సంబంధము కలదని డా॥ గిడుగు వేంకట సీతాపతి గారనిరి. [7]

"ఛందస్ అనే సంస్కృత పదమునకున్ను, స్కందో [Scando]అనే లాటిన్ పదమునకున్ను సంబంధమున్నది. స్కందో అంటే ఛేదించడము, విభజించ డము అని అర్థము [8] అని చిలుకూరి నారాయణరావుగారు భాషాశాస్త్ర దృష్టితో సంస్కృతభాషకు సోదర భాషయైన [ఇండో–యూరోపియన్ కుటుంబములోని] లాటిన్‌తో శాబ్దిక సంబంధమును వివరించిరి. ఇన్ని అక్షరములు, ఇన్ని పాదములు, అన్న విచ్ఛేదమూలమే ఛందస్సనెడు పై అభిప్రాయమును "యదక్షర పరిమాణం తచ్ఛందః[9] ఛందోక్షర సంఖ్యావచ్ఛేదకం ఉచ్యతే"[10] అన్న వాక్యములు సమర్థించు

చున్నవి. లయానుగుణ్యమగు విభజనము ఛందోలక్షణమగుటచే స్కందో, ఛంద శ్శబ్దములు ఒకే కుదుట పుట్టిన వనవచ్చును.

ఇట్లు ఛందశ్శబ్దము విచ్ఛేదనారూపమై లయావిష్కారకమై ఆహ్లాద మొన ర్చునదని నిర్ణయింపవచ్చును.

—×—

## అ థ స్సూ చి క లు

1. యాస్కుడు - నిరుక్తం - 7-12.
2. ఛందము - ఛందస్సు అనే అర్థంలో "లౌకిక వ్యవహారం"లో ఉన్నందున ఈ గ్రంథమందు సమానార్థకంగా వాడబడుచున్నది. "నెఱయంగా నీ ఛందము తెఱగెఱుగక" — కవిజనాశ్రయం I-6 - ప్రయోగం.
3. ఋగ్వేద భాష్య భూమిక - సాయణుడు.
4. సిద్ధాంతకౌముది - చురాదిగణం - 1577.
5. ఛందః పాదౌతు వేదస్య - పాణినీయ శిక్ష - 41-42.
6. నాట్యశాస్త్రము - XIV - 44.
7. తెలుగులో ఛందోరీతులు - 8-2.
8. మాత్రాఛందస్సులు - చిలుకూరి నారాయణరావు - "వ్యాస సంగ్రహము" (తెలికిచెర్ల సంపా.)
9. ఋక్సర్వానుక్రమణిక - కాత్యాయనుడు.
10. అథర్వవేదీయ బృహత్సర్వానుక్రమణీ.

★ ★ ★

# 3. ఛందః ప్రశస్తి

ప్రాచీన వైదిక వాఙ్మయము భారతీయ సాహిత్యములో పరమ ప్రమాణమగుట చేతను, వైదిక వాఙ్మయము ఛందోబద్ధమగుట చేతను ఛందస్సునకు ఆదినుండి అమితమైన గౌరవము లభ్యమయినది ఛందస్సుయొక్క ప్రాశస్త్యమును గుర్తించిన వారగుటచే వేదకవులతోబాటు వైదిక సారస్వతమునకు సంబంధించిన మహర్షి కవులు సర్వులు ఛందస్సునకు అత్యధిక ప్రాధాన్యము నిచ్చినారు. నాచ్ఛందసి వాగుచ్చరతి[1], ఛందో హీనో న శబ్దోస్తి[2] వంటి వాక్యములు ఛందోమయమైన ఉత్తమ సాహిత్యమును దృష్టిలో నుంచుకొని చెప్పిన వాక్యములే. ఛందస్సు తెలియక వేద పఠనము నిర్వీర్యమని [3] మంత్రములో ఋషిదేవతలతోబాటు ఛందము తుల్య ప్రాధాన్యము కలదని వారి శాసనము. [4]

కడు కవితా మహిమకు, దివి
రెదు కవికిచ్చదువు తెలుఁగెఱింగిన నఁగా నె
క్కడ నుండి వచ్చు బెడఁగది
రెడు కబ్బము సెప్ప నట పరిజ్ఞానమిలన్ [5]

అని తెలుగులో ఆద్య చ్ఛాందసికుడగు రేచన ఈ చదువును [ఛందశ్శాస్త్రము] ప్రశంసించినాడు. కవిత్వము ఛందోమయమని భావించుటచే రేచనాదులట్లు పలికినారు. ఒక దశలో తెలుగు కవిత్వమున ఛందోహీనమగు వచనమున కాదరము తక్కువ అని భావించుటచే కాదోలు నిర్వచన కావ్యములు వెలసినవి [6]. ఛందోమయత్వము వలన కలిగెడు ఆహ్లాదము, ఛందః ప్రయోగము వలన ప్రదర్శితమగు పాండిత్య ప్రకర్ష కవులచే, లాక్షణికులచే ఛందస్సునకు ద్ద పీట వేయించినది.

కవిత్వమునకు ఛందస్సుతోగల అవినాభావసంబంధమును, ఛందస్సువల్ల కలిగెడు ప్రయోజనము నొక ప్రక్క అత్యధికులు నొక్కి చెప్పుచున్నను, మరొక ప్రక్క ఛందస్సు యొక్క అవశ్యకతను ప్రాచ్య పాశ్చాత్యులనేకులు సూక్ష్మముగా విమర్శించినారు. గ్రీకు తాత్త్వికుడు అరిస్టాటిల్ ఛందస్సు కవిత్వమునకు అత్యావసరము కాదని భావించినాడు. (Verse is no guarantee of poetry, but a

recognised adjunct of it). సర్ ఫిలిప్ సిడ్నీ ఛందస్సు కవిత్వమునకు కేవల మాచ్ఛాదనమే నని, బహిరలంకరణగా ఉండవల్లయునని అదే ప్రధానము కాదని అనినాడు. ("Indeed verse is an appeared only, being but an ornament and no cause to poetry"[7])ఛందాంసి ఛాదనాత్ [8] అన్న నిరుక్తోక్తి లోని మంత్రమునకు ఆచ్ఛాదనమన్న భావమిట్టిదే. సుమారుగా ఇదే భావనను అనేకులు వ్యక్తమొనర్చినారు. వీరు ఛందస్సును ఒక అలంకరణమన్నవారే కాని అంత కెక్కువ ప్రాధాన్యము నీయలేదు. ఛందస్సు యొక్క అవసరము అంతగా లేదను వారు ఆధునికయుగములో ఎక్కువగా నున్నారు. వచన కవిత్వము వచ్చిన పిదప ఆధునిక ప్రపంచ సాహిత్యమున ఛందస్సు అస్తిత్వముపై అనేకములగు ప్రశ్నలుద యించినవి. కాల్‌రిడ్జ్ ఉత్తమ కవిత్వము ఛందస్సు లేక ఉండవచ్చునని [Poetry of the highest kind may exist without metre] చెప్పి తిరిగి అతడే Metre to be the proper form of Poetry and poetry unperfect and deffective without metre అని ఛందస్సు కవిత్వమునకు సంపూర్ణత్వము నిచ్చుననినాడు.[9]

పొడుగాటి గౌను వేసుకున్నంత మాత్రాన ప్రతివాడు న్యాయవాది కాడు. అలాగే కేవలం ఛందస్సు తెలిసినంత మాత్రాన ఎవడూ కవి అయిపోడు అని సిడ్నీ[10] అభిప్రాయపడుట కవితా సామాగ్రికి ఇది ఒక అవసరము మాత్రమేనని, ఇదే కవిత్వము కాదనుటకే. అరవిందుడు సైతము "Sound is no more essential to poetry than sense అనినాడు"[11] ఇచ్చట Sound అను మాట శ్రుతి లేక లయ అన్న అర్థమున వాడబడినది. సాహిత్యవేత్తల అభిప్రాయము లిట్లుండ జాన్ స్టూవర్ట్‌మిల్ మనస్తత్వ శాస్త్రవేత్తగా Ever since Ma· has been man. All deep and sustained feeling has tended to express it self in rhythmical language and the deeper the feeling no more charectaristic and decided the rhythm అని మానవుని భావావేశం లయాత్మక మైన వ్యక్తీకరణకు మారుతుందని భావించినాడు.

పాశ్చాత్యుల భావనలట్లుండ సంస్కృతాంధ్ర భాషలలో ఈ ఛందః ప్రాశస్త్యమును గూర్చి పరిశీలింపవలసియున్నది. కారణము పాశ్చాత్య భాషలలోని పద్యీకరణము [Versification]నకు సంస్కృతాంధ్రములలోని పద్యీకరణము [ఛందస్సు] నకు భేదమున్నది. వారి కవిత్వము లయాత్మకములు [Rhythmic styles] కాగా

ఇచ్చట గణ నిర్బంధత్వమున్నది. గేయసాహిత్యములోని కాల సంపుటములలో [తాళగణములని ముందు వివరింపబడును] గల స్వేచ్ఛ మాత్రాఛందస్సులలో లేదు. మాత్రాఛందస్సులలో గల స్వేచ్ఛ అక్షరగణములందు అసలే లేదు. వీటిని దృష్టిలో ఉంచుకొనే ఆధునిక ఛందో విమర్శకులు, కవులు, "ఛందస్సర్పపరిష్వంగం"[12] "ఛందో బందోబస్తులు"[13], "పద్యాల పావుకోళ్ళు"[14] వంటి పదబంధములను వాడినారు. తేకుమళ్ళ రాజగోపాలరావుగారు సంస్కృతము కన్న తెలుగులో ఛందో నిర్బంధత్వము మరింత అధిక మనినారు. "తెలుగులో పద్యము వ్రాయవలెనన్నచో పాదపాదమునకు యతి అడ్డము వచ్చి కవి గొంతుకను పట్టుకొనును. ప్రతి పాదమునకు ప్రాసము వచ్చి లంకించుకొనును. సంస్కృత కవిత్వమునకీ విషమ విరోధములు లేవు."[15] ఛందస్సు బంధమని భావించుచునే సమస్త ప్రాచీనాంధ్ర కవిత్వము ఛందోబద్ధమయ్యును సువ్యవస్థితమగుటచే కాబోలు మరికొందరు ఛందస్సు బంధమై భావము చెడుటను వ్యక్తావ్యక్తముగా ఒప్పుకొనినారు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు "పద్యము నియమ భూయిష్ఠము, ఛందో భంగము, దోషములలో మొదటిది. కావున నది రాకుండ పద్యమల్లుటలయునన్న జీవకళయగు భావమునకు కొంత గౌణత రాకపోదు" అని నుడివిరి[16]. భావప్రకటనకు ఛందస్సు నిర్బంధమగుననుట పూర్వమునుండియే ఉన్నది. లాక్షణిక గ్రంథములలో కొన్నిటికి 'కవిగజాంకుశము', 'కవి కంఠపాశము', 'కవి సర్పగారుడము', 'కవిమూషికమార్జాలము' 'కవి వాగ్బంధనము', 'కవి జిహ్వాబంధము' అన్న పేర్లున్నవి.[17] వీటిని బట్టి లాక్షణికులు సైతము కవికి ఈ లక్షణములు కంఠపాశరూప నిర్బంధములుగా, వాక్ జిహ్వాబంధములుగా, భావప్రవాహ నిరోధమునకు కారణముగా తలచినట్లున్నది.

ఛందస్సనునది భావప్రకటనలో బంధముగాగాక కేవలము నియమమును సూచించి క్రమబద్ధతను ఏర్పరచునని భావించినవారున్నారు. ఆరుద్ర "డిసిప్లిన్ అనేది కవిత్వంలో ఛందం వాడితేగాని రాదని అందువల్లే తాను ఛందస్సుని ఇష్టపడుతున్నానని" వ్రాసుకొన్నాడు[18]. "ఛందస్సు భావాన్ని పూర్తిగా మింగివేస్తే మాత్రం ప్రమాదమే......ఇంతకు మించిన ఛందో నియమం బంతిలేకుండా ఫుట్‌బాల్ ఆట్టం"[19] అని అన్నాడు. ఇదే అభిప్రాయము ఇతర మహాకవులచే సైతము వ్యక్తమైనదే.

ఛందము తా స్వతంత్రగతి సాగెడి భావన వుం బందాలకున్
బంధము పై చుమంగవికి బాధనొసంగ సపాద బంధనా
లందెలు పైచి మేల్ నడల హంస విహారము సల్పినట్టులై
ఛందము బంధమైన సొగసుందగు నందముఁ జిందు భారతీ !

— స్తవరాజ పంచశతి - 43 వానమామలై వరదాచార్యులు

ఆధునిక ఛందో విమర్శకులలో ప్రముఖుడైన శ్రీశ్రీ ని గూర్చి చెపుతూ కె.వి. రమణారెడ్డిగారు "మహాకవి నియమాధీనుడుగాడు. అతీతుడు, (అట్టి) నియమాల్లో ఛందస్సొకటి, అది గుర్రంలాంటిది. దాన్ని మచ్చిక చేసికొని చిత్రవిచిత్రంగా కొత్త నడకలు నడిపించగలగాలి" అని కవి ఆధీనుడుగాక ఛందస్సు కవికి ఆధీనం కావా"లంటారు [20].

పై విషయములను పరిశీలించినపుడు ఛందస్సనగా బంధమని భావించిన వారందరును ఛందస్సును అక్షరగణ బద్ధతతో ఆలోచించిన వారనిపించును. గేయ ఛందస్సుల గూర్చి ఎవరికిని భేదాభిప్రాయముండదు. అక్కడ గణ నిర్బంధము, అక్షర నిర్బంధము, యతి ప్రాసల స్థావరము వంటి కష్టములు లేవు. వానిలో కవికి స్వేచ్ఛ ఎక్కువ. ఛందస్సు లేక కవిత్వము ఉండవచ్చునని భావించినవారు ఛందస్సు లేనట్టి భావయుక్తమైన వచన కవిత్వమును దృష్టిలో పెట్టుకొన్నవారే. ఎందుకనగా ఛందస్సు లేక పాటలేదు. కాల నియమ బద్ధమైనప్పుడు మాత్రమే పాడుకొనుటకు వీలైనది. ఛందో రహితమైనపుడు పాడుకొనుటకు వీలులేదు. పాడు కొననప్పుడు పాట [వద కవిత] కానేకాదు. కనుక జానపద గీతములు, పదకవిత అంతయు తప్పని సరిగా ఛందోబద్ధమే అగును. ఇచ్చటఛందస్సు లేక కవిత్వముండుట యన్న విచక్షణకు తావులేదు. భావవ్యక్తీకరణలో నైశిత్యము సాధించిన ఆధునిక కవి లేదా విమర్శకుడు మాత్రమే అభివృద్ధి గాంచిన నేటి కవిత్వదశలో భావము ప్రధానము, ఛందస్సు గౌణము లేక త్యాజ్యము అనినాడు.

"ఛందోబద్ధమైన ఒక పద్యం చదువుకొనడంలో ఒక తృప్తి ఉంది. వచన కవిత్వం వలన ఈ తృప్తినశించింది."[21] వంటి అభిప్రాయాలు కూలంకషంగా పరిశీలించినపుడు ఈ తృప్తి అనేది లయ వల్ల శ్రవణ సౌఖ్య రూపంలో కల్గిందని భావించవలయును. కాని పద్యం ఛందోబద్ధమైనను లయ శూన్యమైన చోట్లు పెక్కు లున్నవి. అది పద్యరచనలో కవి సిద్ధహస్తతబట్టి ఉండును. లయవేత్తగాని కవి చేతిలో ఛందోబద్ధమైనను కవిత్వము నీరసమే అగును.

కవిత్వము ఛందోబద్ధమైనప్పుడు భావము వలన ఆలోచనామృతము, లయ వలన ఆపాత మధురత్వము కల్గును. ఈ మాధుర్యము కవిత్వము గానము చేసినపుడు ప్రప్రథమముననే కలుగును. తర్వాతనే భావావిష్కరణము. దీనిని బట్టి కవిత్వములో ఛందస్సు యొక్క ప్రాధాన్యత స్పష్టమగుచున్నది. కవిత్వము ఛందోమయమైనపుడు, సంగీతత్వము జోడగును. కవిత్వములో సంగీత ప్రాధాన్యత గేయ కవిత పరిశీలించినపుడు స్పష్టమగును. సంగీతము లేక కవిత్వము లేదన్న భావము జానపద గీతములు మరింత స్పష్టపరచును. "గానాన్వితమైన ఆలోచనే కవిత్వమని" కార్లైల్, "లయాన్వితమైన రామణీయక సృష్టియే కవిత్వమని" ఎడ్గార్ ఎలన్ పో నిర్వచించినది ఈ దృష్టితోడనే. "విజ్ఞానము అనవరతము గణితము వైపు సాగిపోవుచుండగా, కవిత్వ, అనవరతము సంగీతమువైపు సాగునని"నాడు క్రిష్టోఫర్ కాడ్వెల్[22] ఛందస్సు యొక్క లయబద్ధతను, సంగీత మాధుర్యమును గమనించియే తెలుగువారు ప్రాచీనకాలముననే ఛందస్సులో దేశి పద్యములకు నామకరణము గావించినారు. ఆటవెలది (నృత్యం – తాళ పద్ధతి), తేటగీతి (గేయం–లయబద్ధత) అను పేర్లు ఇందుకు నిర్ధారకములగుచున్నవి. లయ గ్రాహి, లయహారి, లయవిభాతి, వంటి పేర్లతో లయ శబ్దము సువ్యక్తమే-భావ వ్యక్తీకరణకు పదనము తీసికొన్నచో దానికన్న ముందుగా పాఠ పఠితృ హృదయమునకు సమాకృష్టమగును.

"శ్రవణ సౌఖ్యమే లక్ష్యము ఛందమునకు
పద్యమునకైన గీతికాపదము కైన
రాగ తాళాల పదుసను రక్తి మెండు.[23] అన్నట్లు రాగ తాళ బద్ధమొనర్పబడిన కవిత్వము శ్రవణ సౌఖ్యమునకు హేతుభూతమగును. ఛందస్సు వలన పఠితృ హృదయమును కవిత భావోన్ముఖము చేయును. ఆస్వాదన పరాయణ మొనర్చును. ఆలోచనకు పూర్వరంగముననే ఆహ్లాదమొనర్చును.

ఛందస్సు యొక్క ఆహ్లాదన కారణము వలన దానిని ఎన్నో విషయములలో ఉపయోగించుట జరుగుచున్నది. గేయము(పాట)మానవ జీవితములో ఆదినుండి ప్రధానమైన పాత్రను నిర్వహించుచున్నది. సర్వ విషయ జ్ఞానము సులభముగా గేయము ద్వారానే నేర్పబడుట ప్రాచీన సంఘములో చూడగలము. గేయము తన ఛందస్సు వలన కలిగెడు వినోద మాధ్యమముగా విజ్ఞాన ప్రదమైన అంశములు పెక్కింటిని అందించుచున్నవి. పాఠశాలలలో విద్యార్థులకు ప్రాథమిక విద్య గేయ రూపమున

బోధింపబడును. విద్యపై అభిరుచి కల్గించుటకు ముందు బాలగేయములు (Narsary Rhymes) పాడింపబడును. పూర్వము వీధిబళ్ళలో జ్యోతిషాదిశాస్త్ర విషయములు, నక్షత్రములపేర్లు మున్నగునవి, గణిత శాస్త్ర సంబంధములగు ఎక్కములు మున్నగునవి.[24] ఛందోబద్ధములే ఉండెడివి. వచనమున కన్న ఛందోబద్ధమగు రచనముచే కంఠస్థము చేయుట సులభమగుట వలన ప్రాచీన సాహిత్యములో శాస్త్ర గ్రంథములు ఛందోబద్ధములుగనే వ్రాయబడినవి. క్షేమేంద్రుడు తన 'సువృత్త తిలకము'లో సులభ కంఠస్థ యోగ్యములగు అనుష్టుప్పులనే శాస్త్ర గ్రంథములందు వాడుటకు నిర్దేశించినాడు.[25]

ఆధునికముగా అభివృద్ధిగాంచిన భాషాతత్త్వ శాస్త్రము (Linguistics) నందును వ్యాకరణముతో బాటు ఛందస్సులకు శబ్ద ధ్వని శాస్త్ర విభాగ సంబంధముగా ప్రత్యేక ప్రాధాన్యమున్నది.[26] ధ్వని విధేయ శబ్దము, శబ్దోచ్చారణము, ఊనిక, కాల సంపుటులు, మాత్రా విధేయ శబ్ద పరిమాణ పరిణామము మున్నగు అంశములు భాషా తత్త్వ శాస్త్రమున ప్రధానమగుచున్నవి. ప్రాచీన భాషలలోని పై అంశములు నిర్ణయించుటకు ఛందశ్శాస్త్రము ప్రత్యేక గౌరవము నందినది. యతి ప్రాసల మూలమున గణ నిర్బంధము వలన ప్రాచీన కావ్య భాషలోని పెక్కు పాఠ నిర్ణయములు, భాషా సంబంధమగు నియమములు శబ్దమునకు గల చారిత్రక నేపథ్యమును పరిశీలించుటకు ఛందస్సు అవకాశమిచ్చుచున్నది.

ఛందస్సనగా వృత్తములు, అక్షర సముకగణములు యతి ప్రాసములు అన్న నిర్బంధత్వమును మాత్రమే పరిశీలింపక, జానపదగీతములు, సంగీత ప్రాధాన్యత, గేయ ఛందస్సులు, నిత్యజీవితములో సంగీతమునకు గల ప్రశస్తిని పరిశీలించినపుడు ఛందః ప్రశస్తి సుస్పష్టముగా బోధపడగలదు.

)—(

## అ థ స్సూ చి క లు

1. నిరుక్తమ్—7వ అధ్యా—3పా.
2. నాట్య శాస్త్రము XIV—44
3. యజుర్వేద సర్వానుక్రమణిక· అధ్యా 2. పు. 8
4. వృత్త మౌక్తికమ్, భూమిక. పు· 3

5. కవిజనాశ్రయము — సంజ్ఞాధికారము
6. నిర్వచనోత్తర రామాయణము — తిక్కన కృతము
7. సాహిత్య శిల్ప సమీక్ష — పింగళి లక్ష్మీకాంతము
8. నిరుక్తము 8—3—11
9. సా.శి.సమీ.
10. సారస్వత వ్యాసములు 2 సంపు. పు. IX—సంపా. పురిపండా
11. Works of Aravinda
12. శ్రీశ్రీ మహాప్రస్థానం పు. 34 "కవితా" శీర్షిక
13. పరాభి "ఫిడేల్ రాగాల డజన్"
14. నూతలపాటి గంగాధరం—భారతి 1965, జనవరి
15. సారస్వత వ్యాసములు 1 సంపు. పు 22
16. గ్రంథాలయ సర్వస్వము—సంపు. 2, సంచిక. 1
17. తెలుగు భాషలో ఛందో రీతులు—విద్వాన్ రావూరి దొరసామిశర్మ పు. 389—405
18. నవోదయ లహరి—యువభారతి ప్ర. పు. 75
19. సినీవాలి — ఆరుద్ర
20. 'మహా మహా మహాకవి' — భారతి—మార్చి
21. వాఙ్మయ సమాలోచనము — 'కవిత్వము—ఛందస్సు' — కాళూరి హనుమంతరావు పు. 37
22. సాహితీ సుగతుని స్వగతము—తిరుమల రామచంద్ర పు. 174, 191
23. పద్మావతీ చరణ చారణ చక్రవర్తి (నాటకము) స్వామి శివశంకరశాస్త్రి
24. ఒక్కొక్క టొకటీ, ఒక రెన్ రెండూ, ఒక్క మూడు మూడు (ఎక్కాలు) కాకు దీర్ఘమిస్తే కా, కాగ్గూడిస్తే కీ, కాకొమ్మిస్తే కూ (గుణింతాలు)
25. సువృత్త తిలకము — క్షేమేంద్రుడు (3-6)
26. A. తెలుగు భాషలో పెక్కు గ్రంథములు ఒకే గ్రంథ పరిధిలోని వ్యాకరణ ఛందములను బోధించుచున్నవి. ఉదా : అప్పకవీయము. ఇది వ్యాకరణ ఛందో గ్రంథము.

B. Some times the term 'prosody' is extended to include also the study of sound effects such as alliteration, assonance, enphong, and onomatopolia.
— A grossary of litarary terms. M. H. Alarms p. 139.



# 4. ఛందో-విర్భావము

ప్రపంచభాషా సాహిత్యములో గద్యము కన్న ముందే పద్యము (కవిత్వము)అభివృద్ధి చెందినదని పలువురు భాషావేత్తలు నుడివినారు.[1] ఈ విషయములో తగినన్ని సాక్ష్యాధారములు చూపుటకు శక్యము కాకున్నను నేటికిని నిలిచియున్న అనాగరిక భాషలు, ఆ భాషీయుల ఆచార వ్యవహారములు ఈ విషయమును నిర్ణయింప జాలియున్నవి. పద్యము పరిణత గేయమునకు శాస్త్రీయత నాపాదించిన దశలోనిది. పద్యము కన్న గేయము ముందుది. లిఖిత వాఙ్మయము భాషా సాహిత్యములో ఏర్పడుటకు ముందే అలిఖిత వాఙ్మయము ఆ భాషలో సమృద్ధిగా ఉండును. C.M. Bowra తన 'Primitive Song'లో నాగరికతా ప్రపంచమునకు దూరముననున్న ఆటవిక తెగల ఆచార వ్యవహారములను పరిశీలించి ఈ విషయమును నిర్ధారించినాడు. లిఖిత వాఙ్మయములేని సవరజాతీయుల భాషను పరిశోధించి సంస్కరించిన డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు గేయ ప్రాచీనతను నిరూపించినారు.[2]

ప్రారంభ దశలో గేయ రూపములో నున్నఆప సాహిత్యము ఛందస్సుయొక్క ఆవిర్భావమును నిరూపించగల్గియున్నది. ప్రాచీన మానవుడు నిత్య పరిణామశీలత్వముచే తన పరిసరములను తన చుట్టూర నిలిచియున్న అద్భుతమైన ప్రకృతినిపరిశీలించి సౌందర్యారాధకుడగుటచే తాదాత్మ్యమును పొంది ఆశువుగా వాటిని గూర్చి పాడుకొనినాడు.[3] ఉదయాస్తమయములు, పర్వతములు, సెలయేళ్ళు, నదులు, సహజీవనము సాగించు పశుపక్ష్యాదులు, అద్భుత భీభత్సమూర్తులుగా కన్పట్టిన పంచభూతములు ప్రాక్తన మానవుని హృదయమును సుకుమారము, సురుచిరము, ఉద్వేగ భావాశ్రితముగా మార్చినవి. ఋగ్వేదములోని ఋక్కుల రూపములో నిల్చిన భావములనేకములను పైవానికి ఉదాహరణగా చూపవచ్చును.

ఓం మిమీహి శ్లోక మాస్యే
పర్జన్య ఇవ తతనః
గాయ గాయత్రం ఉక్థం (ఋగ్వే 1—38—14)

"ఓ ఋత్విక్కులారా! స్తోత్రమును నిర్మింపుడు. మేఘము వర్షమును విస్తరింప జేసినట్లు గాయత్రీ ఛందమున గల సూక్తమును గానమొనర్చుడు.

ఇచ్చట ఛందమును గానమొనర్చుమనుటచే, వైదిక ఛందములు గేయ గతులు గలవగుటచే గేయ ఛందస్సులే ఆవిర్భావ దశలోనివనవచ్చును.

మధుచ్ఛందుడు అగ్నిని గూర్చి గాయత్రీ ఛందమున గానమొనర్చినాడు.

"ఓం అగ్నిమీళె పురోహితమ్
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్నధాతమమ్"

ఇది ఋగ్వేద-ప్రథమ మంత్రము. లభ్యమాన విశ్వమానవ బుద్ధి వికాస పరిమణాములో ప్రప్రథమమైన భావన. మానవునకు బుద్ధి తెలిసినది మొదలు మొదటి విచిత్రము ప్రకృతి. పంచభూతములు మానవుని బుద్ధికి అందని చిత్రములు. అందుకే అగ్నిని చూచి ఆశ్చర్యమగ్నుడై తొలినాళ్ల మానవుడు దానిని గౌరవ పూర్వకముగా ఛందోరూపమున ప్రస్తుతించినాడు.

అగ్నేర్గాయత్ర్యభవత్ (ఋక్ 10. 130)

అగ్నినుండి గాయత్రి ఛందము పుట్టినది. సృష్టి విచిత్రములనుండి ఉద్విగ్న హృదయజమైన పాట పుట్టినది. గాయత్రి అగ్నివలన పుట్టినదనగా అగ్ని సందర్శనము ప్రేరణమై పుట్టినది. "రత్నరాశివలె నేత్రానందకరుడై ప్రత్యక్షమున ప్రకాశించుచున్న అగ్నిదేవునిచే ప్రభావితుడైన ఋషియొక్క మంత్రమీవాక్యము" అని పాటిబండ మాధవశర్మగారి వ్యాఖ్య[4]. ఛందము గాయత్రము అనగా ఛందము గానము అని. మధుచ్ఛందుని రూపమున ప్రాక్తన మానవుడు ప్రకృతిని పరిశీలించి దాని నుండి పుట్టిన అద్భుతము వలన మనోవికారమును పొందిి తన అవస్థను వెళ్ళగ్రక్కుటకై ఛందోరూపియగు వాగ్వశమున మనోభారమును దించివైచి ఆనందానుభూతిని పొందుచున్నాడు.

"The measure flows, as it were, unconsciously from the mood of poet" అని కాల్‌రిడ్జ్ అన్నట్లు అస్తవ్యస్తము కాని రూపమున ఉత్తేజ చిత్తవృత్తి నుండి క్రమబద్ధమైనపాట పుట్టినది.

ప్రారంభంలో గేయ రూపములోఉన్న ఆదిసాహిత్యముఛందస్సు యొక్క పుట్టుకను నిరూపింప చాలియున్నది. ఈ ఆది సాహిత్యము అప్పటికప్పుడు

మనుష్యుడు తన అనుభూతుల కనుగుణంగా సృష్టించుకొన్నది. ఇట్టి పట్ల ఛందస్సు సిద్ధలక్షణోపేతము గాక స్వతః ప్రసూతముగా (Self form) భావించవచ్చును.

"ప్రాకృతవస్థా మేఁ ఛంద్ స్వతః ప్రసూత్ రహే హోంగే.ఇస్‌కా సంకేత్ బ్రాహ్మణ్ గ్రంథోం కీ ఏక్ నిరుక్తి సే మిల్తా హై. నిరుక్తి గాయత్రీ శబ్ద్ కీ హై జో ఇస్ ప్రకార్ హై, "గాయత్రీ ముఖాదుత్పతనం." అర్థాత్ గాతే హుఏ ఆదీ మానవ్ (యా బ్రహ్మా) కే ముఖ్ సే అప్‌నే ఆప్ నికల్ పడీ (గాయత్రీ)" అని పండితాభిప్రాయము.[5]

లౌకిక ఛందస్సులో తొలిసారిగా కవితనల్లినట్లు,వాల్మీకి మహర్షి సంస్కృత సాహిత్యంలో 'ఆదికవి' గౌరవంతో పేర్కొనబడుచున్నాడు. 'క్రౌంచ ద్వంద్వ వియోగోత్థశోక'మాయనలోనుండి శ్లోకాకృతిలో ఆవిర్భవించినది. సుఖ దుఃఖాను భూతుల తీవ్రత నుండే కవిత్వము ఛందస్సు ఆవరణలో పుట్టినదని చెప్పుటకు ఈ విషయము సాక్షీభూతమగును. క్రౌంచపక్షి హననమాయనలో దుఃఖ తీవ్రతను కల్గించినది. ఆ దుఃఖ తీవ్రత వాగ్రూపమున బయల్వెడలినపుడు తాళాక్షర బద్ధము, తంత్రీ లయ సమన్వితము ఐనది [ఐనా ఈ ఛందస్సు పుట్టుక ఒక్కసారే కల్గిన దనలేము. పాదానికి ఎనిమిదక్షరములతో- పంచమాక్షరం నియతంగా లఘువుగా, షష్ఠాక్షరం నియతంగా గురువుగా గల్గిన నిర్దిష్ట లక్షణోపేత శ్లోకము[6] హఠాత్సంభవము కల చందోపరిణత దశను సూచించుచున్నది.]

మనిషి తన హృదయములోని సుఖదుఃఖాత్మకమైన అనుభూతులను బయ టకు వెళ్ళగక్కి ఇతరులు ఆ అనుభూతిలో పాలు పంచుకొనుట వలన తన హృదయ భారమును దించివేసికొనును. ఈ పంచియిచ్చుటలో ఉండు ఆనందమునకు ఛందము బాగా ఉపయోగపడునని ప్రాక్తన మానవుడు గుర్తించినాడు.[7] గీతానికి గేయాత్మకత అనగా ఛందపు తొడుగు ఉన్నపుడు అది సాధారణ వాక్కుల కంటె భిన్నమై, రమ్యతరమై, ప్రయోజనవంత మగును కదా!

అనుభూతిని ఇతరులకు పంచుటలోగల పై అభిప్రాయమునకు బలముగా ఒక సాక్ష్యము అనుభవ పూర్వకముగా వివరింపబడుచున్నది.రచయితకు తెలిసిన ఒక స్త్రీ తన కూతురు ప్రసవించి చనిపోగా శవమువెంట శ్మశానవాటికకు వచ్చి బంధువులందరు వినగా తన కడుపుచిచ్చును గద్గద కంఠముతో అతి హృదయ విదార కముగా వర్ణించుచు రోదించినది. ఆ తల్లి పల్లెటూరి మనిషి. నిరక్ష్యరాస్య. ఐనా

ఇమె అప్పటికప్పుడు అనువుగా తన రోదనమంతా పాటగా వివరించింది. ఆమె రోదనమంతా ఛందో ఛాందనముతో ఆవిష్కరింపబడి మాటల పొందికతో, కూతురి జీవిత కదనంగా, వచ్చిన బంధువులను ఆకర్షించగల్గింది.

" నాకంటె ముందే బిడ్డా
నీవె పోయితివా "
ఎన్ని జన్మల పాపం "
ఇవ్వాళ కూడింది "
కడుపులోన దుఃఖం "
ఆగుతూ — లేదే "
ఎందు బోయితివే "
ఏడబోయితివి నీవు "

ఈ రీతిగా సాగింది ఆమె ఏడ్పు.ఆమె ఆపుకోలేని దుఃఖావేశంతో దాదాపు తన కూతురు పుట్టిన నాటినుండి అంతంవరకు గల గాథను ఆనాడు చితి పేర్చి నిప్పు ముట్టించే వరకు హృదయశోకంతో వెలిగక్కింది. ఆవేశపూరితుడైన మనిషి తన భావ తీవ్రతను ఏవిధంగా బయటపెట్టేది చెప్పుటకుమాత్రం ఉదాహరణగా చూపబడినది పై హృదయ శోకం గేయరూపంలో ఛందోబద్ధంగా బయటికి రావడము ఇక్కడ విశేషము.

పైన పేర్కొన్న ఆతల్లి యేడ్పువల్ల ఈ క్రింది విషయాలు స్పష్టమయినాయి.

1) ఆ తల్లికి కవిత్వం అంటే ఏమో తెలియకున్నా తన హృదయ వేదనను వ్యక్తంచేసింది.

2) వ్యక్తీకరణం ఆశువుగా జరిగినది.

3) ఆమెకు ఛందస్సు అంటే ఏమో తెలియకున్నా మాత్రా సమత పాటించింది

4) పాదం ఎంతవరకు నడిపించి వదిలివేయవలయునో ఇతర కవులకు వలె తెలియకున్నా ఉచ్ఛ్వాస, నిశ్వాసలను బట్టి అంతం చేస్తూ పాదాలు సమానంగా నడుప గల్గింది.

ఛందోఽవిర్భావ దశలో కాగితం, కలం పట్టిగాక, ఆశువుగా పాటగాని యిచ్ఛానుసారము కవిత్వం అవిర్భవించును. పాటగాని శ్వాసను బట్టి పాదసమాప్తి లేక విచ్ఛేద రూపయతి విలసిల్లును. మాత్రాసంపుటి (లేక కాలసంపుటి) సమతుల్యత

ఆధారముగా స్వీకరింపబడును. గేయావిర్భావమున పై విషయములన్నీ నిర్ధారింపబడినవి.

పాదములో ఉండే మాత్రల సంఖ్య అనేది తొలిదశలో కవుల దృష్టిలో ఉండదు. పాదం వెనుకటి కంటె హ్రస్వమైనదా? దీర్ఘమైనదా ? అన్న విషయము తనకు తాను నిర్ణయించగల్గుటకు వారి హృదయంలో ఉండే లయ జ్ఞానమే తోడ్పడును. మాత్రల సంఖ్యగాక కాలసంపుటులుగా పాద వ్యవస్థ నిలుచును.

గేయం ఉచ్చరింపబడు కాలాన్ని కొలిచే శాస్త్రంగా ఛందస్సు అభివృద్ధి ఐన పిదప కనీస కాలమానము మాత్ర గుర్తింపబడి, లఘు, గురువులు, వాటితో గణములు, గణముల ద్వారా పాదపరిమాణము సిద్ధమయినది. పాదములలో గురు లఘు స్థాన పరివర్తనము బహుముఖముగా నాన్యతస్సిద్ధముగా సాగి షడ్వింశతి ఛందముల నిర్మాణము ఏర్పరుపబడినది.

— x —

## అధస్సూచికలు

1. All most all in the written languages, poetry seems to be earlier than prose' -The Commonness in the metre of dravidian languages - S. Subramaniam.

2. తె.ఛం.రీ. — డా. గిడుగు వేం. సీ. పు. 156

3. తళుక్కున ఒక మెరుపు దూసుకొనిపోయినపుడు, ఒక పుష్పలావర్తకము మదగజమువలె ఘీంకరించినపుడు, ఒక మలయ పవన వీచిక అలసగమనముతో వచ్చి తనువునింతా చందనము రాసిపోయినపుడు, ఆదిమానవుని ఆత్మ పాలకెరటమై పరవళ్లు దొక్కినది. అపుడే కవిత్వమునకు నాంది జరిగినది. అట్టి స్వాదు సమయములలోనే తూర్పున వేదఋక్కులు తొంగిచూచినవి. పడమటింట సామ్స్ (Psalms) పలికినవి.

ఆధు. ఆం. కవిత్వ. సంప్ర. ప్రయో. పు. 54

డా॥ సి. నారాయణ రెడ్డి.

4. ఆంధ్ర మహాభారతము - ఛందఃశిల్పము - డా॥ పాటిబండ మాధవశర్మ (పు. 32)

5. రఘునందన్ శాస్త్రి కృత్ "హింది ఛందః ప్రకాశ్" (పాద్ టిప్పణి పు. 4)

6. పంచమం లఘు జర్వేషు
సప్తమం ద్వేచతుర్థయోః
గురౌ షష్ఠంచ సర్వేషాం
ఏతచ్ఛ్లోకస్య లక్షణం - సువృత్త తిలకమ్ - 14

7. **I had seen a man playing string banzo at a crowded street corner meeting anu his eyes were shining with tomarrow light, as he sang of a "Great day coming'. I listered care fully and I hard my self singing with him.**

from "Great day coming" Denisoft.



# 5. ఛందోంగములు

గురుయతి గణముల పాదాం
బురుహంబుల కెఱిగి సుకవి బుధ జనములనా

దరమున దలచి .... అని కవి జనాశ్రయములో తత్కర్త గురు దేవతా స్తుతిలో శ్లేష మూలకముగా గురు పాదులకు నమస్కారముతో బాటు ఛందోంగము లైన గురువు. యతి గణము, పాదము మొ॥ వానిని స్మరించినాడు. ఇదే పద్ధతిలో అనంతా మాత్యుడును దేవతాస్తుతిలో

శ్రీ వల్లభు యతి గణ సం
సేవిత పాదారవిందు చింతిత ఫలదున్
భావజ గురు నలఘు చ్ఛం

దో వినుతు ననంతశయనుఁ దోయజనాభున్ [ఛందోదర్పణం I-3]
అని యతి, గణము, పాదము, గురువు, లఘువు, మున్నగు ఛందోంగముల స్పృశించినాడు. తెలుగులో ఇతర ఛందశ్శాస్త్రవేత్తలను తమ ఛందోగ్రంథములలో యతి, ప్రాస, పాదము, లఘు, గురు. గణములకు మాత్రము వివరణ నిచ్చినారు. భరతుడు తన నాట్యశాస్త్రమున మరింత విపులముగా 10 ఛందోంగములను సంపుటీకరించినాడు.

శ్లో॥ సంపద్విరామ పాదాశ్చ
దేవతా స్థాన మక్షరం
వర్ణః స్వరాః విధిర్వృత్తం
ఇతి ఛ్ఛందో గతో విధిః

వీని నాతడు ఛందోవిషులనినాడు.

1. సంపద : అనగా వృత్తములో ఒక అక్షరమైనా అధికం లేక తక్కువ కానిదేదో అది సంపత్తు 2. విరామము : అర్థ సమాప్తి విరామము 3. పాదము : నాల్గవ భాగము 4. దేవత : అధిరోహిత దైవము

5. స్థానము : శరీరాశ్రయ, దిగాశ్రయ, రూప ద్వివిధము స్థానము
6. అక్షరము : హ్రస్వ దీర్ఘ ప్లుత భేదముచే త్రివిధము ఐనది అక్షరము
7. వర్ణము : భరతునిచే వివరింపబడలేదు. ('రంగు' అని మానవల్లి కవి గారి వ్యాఖ్య.) 8. స్వరము : తార, మంద్ర, మధ్య భేదంతో త్రి విధమైనది. 9. విధి : గణకృత, అర్ధకృత, విధులని ద్వివిధము 10. వృత్తము : అర్ధసమ, విషమ, సమవృత్తములని త్రివిధము అని పైవానికి వ్యాఖ్య చెప్పబడినది.

దేశి ఛందములకు చెప్పదగిన క్రింది ఛందోంగములను పరిశీలించుట జరుగుచున్నది.

అవి 1) అక్షరము 2) గణము 3) పాదము 4) వృత్తము 5) లయ 6) యతి 7) ప్రాస 8) ప్రాసయతి.

I. అ క్ష ర ము :-

ఉచ్చారణకాలమును కొలుచుశాస్త్రము ఛందస్సు. దీనిలో కనిష్ఠప్రమాణము అక్షరము. అక్షరమును ఉచ్చరించుటకు పట్టుకాలమునుబట్టి పదము, పదమును బట్టి పాదము, పాదమును బట్టి పద్యము కొలుపబడును.

అక్షరము స్వర వ్యంజన భేదముచే ద్వివిధము. ఛందశ్శాస్త్రములో స్వరమున కున్న ప్రాధాన్యము వ్యంజనమున కంతగా లేదు. స్వరమును బట్టియే ఇచట గురు, లఘు నిర్ణయము జరుగును. వ్యంజనమునకు విడిగా గణనము లేదు. స్వరయుత మైనప్పుడు (ప్రాణిగా) గణనము జరుగును.

ఉదా:- రుక్. దీనిలో రు గురువు, క్ అనుదానికి గురువు లేదా లఘువు అన్న గుర్తింపు లేదు. వ్యంజనమును విడిగా అర్ధమాత్రా సమముగా గుర్తించిరి.

ఏక మాత్రో భవే ద్ధ్రస్వః
ద్వి మాత్రో దీర్ఘ ఉచ్యతే
త్రి మాత్రస్తు ప్లుతో జ్ఞేయః
వ్యంజనం త్వర్ధ మాత్రకం — యాజ్ఞవల్క్య శిక్ష 13

అక్షరము స్వరమును బట్టియే హ్రస్వ, దీర్ఘ, ప్లుతములుగా వర్గీకరింపబడినది.

హ్రస్వం, దీర్ఘం, ప్లుతం చైవ
త్రివిధం చాక్షరం స్మృతం నాట్య. శా. XIV–107

హ్రస్వము లఘువని, దీర్ఘము గురువని శాస్త్ర గణన. ప్లుతము ఛందశ్శాస్త్రములో గురువుగనే గుర్తింప బడినది. పద్యము నడుమ ప్లుతము వచ్చినను దానిని 2మాత్రల వర్ణముగనే (గురువుగనే) గుర్తించబడును. కారణము గురులఘువులకన్న మించిన మూడవ కొలత లేదు. గణములు గురులఘువులచే నిర్మితములు. గణనిర్బంధము పద్యములో ఉండును. స్వరప్రస్తారముచేసి మాత్రలు నింపుట పద్యములలో లేదు. గాన యోగ్యములగు గీతములలో ప్లుతము ఉపయుక్తము. ప్లుతము త్రిమాత్రక మైనను గీతములలో అధిక మాత్రికముగా కూడా ఉపయోగింపబడును.

ఛందశ్శాస్త్రములోని కనిష్ఠ కాలమానము మాత్ర. 'నిమేషోన్మేషాభ్యాం అన్యత రేణతులితః కాలః మాత్రా' యని కనురెప్పపాటు కాలము మాత్రగా లెక్కించ బడినది. లఘువు - ఏకమాత్రికము. గురువు. ద్వి మాత్రికము. "ఒక్క మాత్ర లఘువై ద్విమాత్రకము గురువయ్యెన్" అని కవిజనాశ్రయము. వ్యాకరణ శాస్త్రము చెప్పు త్రిమాత్రా కాలికమగు ప్లుతమిందు ద్వి మాత్రికముగానే యుండును. వ్యాకరణ శాస్త్రమున త్రివిధములైన అక్షరము ఛందశ్శాస్త్రమున లఘు గురు భేదముచే ద్వి విధమే యైనది.

'రుక్' లో వలె లఘ్వక్షరము పిదప పొల్లుహల్లు ఉన్నప్పుడు లఘువు గురువు అగుచున్నది. అనగా ద్విమాత్రికమగుచున్నది. గురువు పిదప పొల్లు హల్లున్నపుడు ద్విమాత్రికముకన్న అధికము కావలయును. ఉదా :- వాక్. ఇందు 'వా' గురువు.ద్వి మాత్రికము. 'క్' ఇది ½ మాత్ర మొత్తము 2½ కావలయును. లేదా పూర్ణసంఖ్యలో 3 కావలయును. కాని ఇచ్చట రెండు కన్న అధిక మాత్రలనుట శాస్త్రము చెప్పలేదు. రెండుకన్న అధిక మాత్రలగుట లక్ష్యములందు గానరాదు. దీర్ఘము మీది హల్లు తేలికగా పలుకబడుటయే దీనికి కారణము. అ పొల్లు హల్లు దీర్ఘమును ఉచ్చరించునపుడే దానిలో లీనమగుచున్నది. 'రుక్' అన్నప్పుడు 'క్' ఉచ్చారణలోని ఒత్తిడి, వాక్ అన్నప్పుడు 'క్' ఉచ్చారణలో కానరాదు అందుకే కాబోలు దీర్ఘము మీది పొల్లు హల్లునకు ఊనిక బలహీనమని గుర్తించి తెలుగు వ్యాకరణములలో రుక్–రుక్కుగా మారినట్లు (ఉత్వ ద్విత్వములతో) వాక్ వాక్కు అని వియతము గాక వాకు అనియును ఉచ్చరించుట ప్రస్తావించబడినది. [1]

కేవల వ్యంజనము బట్టి కాక స్వరమును బట్టియే అక్షరము హ్రస్వమా, దీర్ఘమా అన్న నిర్ణయము జరుగును. స్వరములన్నియును హ్రస్వ, దీర్ఘ భేదముచే ద్వివిధమైనవి. స్వరము,వ్యంజన సహితమైనపుడు వ్యంజనమును హ్రస్వమా, దీర్ఘమా యని గుర్తించి మాత్రా గణన జరుగును.

స్వరములు అ, ఇ, ఉ మొ॥హ్రస్వములు; ఆ, ఈ, ఊ మొ॥దీర్ఘములుగా విభక్తములు. ఎ, ఏ, ఒ, ఓ లు వక్రములని ఐ, ఔ లు వక్రతమములని వ్యాకరణము. అనగా వక్రములకన్న వక్రతమముల వర్ణోత్పత్తి ప్రయత్నము. శ్రమతరమే కదా! వక్రతమములు త్రిమాత్రకములని ఒక అభిప్రాయమున్నది.[2] వక్రతమములు సూక్ష్మముగా పరిశీలించినపుడు త్రి మాత్రకములనలేము. ఐ-అయ్ గను ఔ-అవ్‌గను ఉచ్చరింపబడుట సహజమే.[3] అయ్, అవ్‌లు ద్విమాత్రకములుగనుక వక్రతమములును ద్విమాత్రకములే అగును.

ఏక మాత్రికము లఘువని, ద్వి మాత్రికము గురువని చెప్పుట వర్ణ ఛందస్సులలో అక్కరలేదు. మాత్రా ఛందస్సులకిది అవసరము. ఎందుకంటే అక్షర ఛందస్సులలో భగణము ఉండవలయునన్నచోట - తొలి గురువుకు బదులుగా రెండు లఘ్వక్షరములో, పిదప రెండు లఘ్వక్షరములకు బదులుగా ఒక గురువో వాడరాదు కదా! ఐనను వృత్తము యొక్క పాదమును ఉచ్చరించుటకు పట్టుకాలమును దీనిచే చెప్పవచ్చును. ఉత్పలమాలకు భ,ర,న,భ,భ.ర,వ అన్న గణములు ఒక్కొక్క పాదమునకుండును. 8 గురువులు 12 లఘువులుగదా! మొత్తము $8\times2=16+12=28$ మాత్రల కాలము ఉత్పలమాలయొక్క ఒక్క పాద పఠనమునకు పట్టుకాలమని చెప్పవచ్చును.

తర్వాతి అక్షరము యొక్క ఉచ్చారణయత్నము ముందుపలుకు అక్షరముపై నిలుచుటచే, అనుస్వార పరకములు, పూర్ణబిందు పరకములు,సంయుక్తాక్షరపరకములు, విసర్గాంతములు, వ్యంజనాంతములు ఐన లఘువులు గురువులుగనే లెక్కింపబడును. పాదాంత లఘువు కూడ గురువు గనే గుర్తించబడినది. "యుక్పాదాంతే విశేషతః" అని 2, 4 పాదాంతములందు విశేషముగా విధింపబడినది. గేయ ఛందములందు పాదాంత లఘువైనను దీర్ఘీకరింపబడును. పింగళుడు తన ఛందశ్శాస్త్రమందు (1-10) "గంతే"యను సూత్రముచే పాదాంత గురుత్వమును విధించెను.[4] పాదాంత లఘ్వక్షరము ద్విమాత్రాకాలోచ్చారణావకాశము కల్గి యుండునని భావము. ప్రాకృత పైంగళము కూడా ఈ అభిప్రాయమునే తెల్పినది.

దీహో జుసంత్త పరో
బిందుజుఓ పాడిఓ అ చరణంతే
సగురు పంక దుమత్తో
అణ్ణో లహూ హోఇ సుద్ధ ఎక్కఅలో (I-1-2)

(అర్థము : దీర్ఘస్వరాలు, సంయుక్త పరములు, బిందుయుక్తాక్షరాలు, చరణాంత పతిత అక్షరములు గురువులు. ఇవి వక్ర (చిహ్న)ములు, ద్విమాత్రికములు అన్యములు లఘువులు. ఇవి శుద్ధములు, ఏక కళ ( మాత్రికము ) లు.
ప్రాకృత పైంగళమందే కాక అతి ప్రాచీనమైన మరొక ప్రాకృత ఛందమైన విరహాంకుని "వృత్తజాతి సముచ్చయ" మందు గూడ పాదాంతాక్షరము నిత్య గురుత్వము విధించబడినది. గురుత్వవిధివలన గేయ గుణమబ్బును.

ఇఅరాఇం జాణ లహూ అక్ఖరాయిం పాయంతి మెల్ల సహి అణ సంజో అపఢమ దీహ రసబిందు సవిసగ్గ వణ్ణాణ I-13.

"Know all letters to be short, other than those which stand at the end of pada, those that precede a conjuct consonant (Samyoga), those that are long and those that are associated with anuswara or a visarga."

H.D. Velankar (Brief notes)

సంస్కృత మందు పాక్షిక గురుత్వము విధించబడగా-ప్రాకృతమునందు మాత్రము నిత్యగురుత్వము విధింపబడుట గాననగును. సంస్కృత షడ్వింశచ్ఛందోజాతములగు 13, 42, 17, 726 వృత్తములలో సగము లఘ్వంతములే యగుటచే లఘ్వంతత్వ పరిరక్షణలో పాదాంత లఘుత్వమును గురువనుటకు సాంస్కృతిక లాక్షణికులు సాహసింపరైరి. ఈ విధానము ప్రాకృతమున లేకుండుటయును, గేయగుణముగల మాత్రాఛందములే మిక్కుటమైన కారణమున ప్రాకృత ఛాందసికులు నిత్యగురుత్వమును నిర్ణయింపగలిగిరి.

తెలుగులో కవి జనాశ్రయకారుడు చరణాంత గురుత్వమును చెప్పినాడు. పై ప్రాకృత పైంగళ పద్యమునకు అనువాదప్రాయమనదగిన పద్యము కవి జనాశ్రయములో నున్నది.

గురువులు - నిడుదలు, జడ్డ
క్కరములు, బొట్టులు, పిఱుంద, "కడనూదినయ
క్కరములు", పెఱయవి లఘువులు..............(1-16)

పిఱుందకడన్ ఊదిన యక్షరములు చెప్పబడినది. కవి జనాశ్రయకారు ని పిదప ఈ యంశము తెలుగు ఛాందసికు లితరులు ఎత్తినట్లు లేదు.

తెలుగులోని సంస్కృత వృత్తములలో గుర్వంతములే బహుధా ప్రచార మున నున్నవి. లఘ్వంతములు లేవు. చివరి అక్షరము లఘువో, పొల్లో ఉన్నప్పుడు గేయ గుణము పూర్తిగా లోపించును. పొల్లుకు ముందు అక్షరము గురువైనను అది గుర్వంత పాదము యొక్క గేయ సౌందర్యమును పొందలేదు. అంత్య స్వరమును రాగయుక్తముగా ప్రస్తరించుటకు అవరోధమగును. (పలువుర్) దేశి ఛందములందు మాత్రము లఘ్వంతములే అధికములు. సూర్యగణములు రెండును (న, హ, గణ ములు) లఘ్వంతములే యగుటచే సూర్యగణాంత ఛందములగు సీస, గీత, ద్విపద, మధ్యాక్కరాది బహుళ ప్రచార దేశి చ్ఛందములు లఘ్వంతము లగుచున్నవి. కనుక పాదాంతాక్షరము దీర్ఘము చేసికొను సంప్రదాయము వలన తెలుగులోని ఈ లయాను గుణ్యములగు దేశి పద్యములు గేయ ధర్మము నొంది శ్రావ్యతరములగును.

తెలుగులో లాక్షణికులు ఈవిషయమును కవిజనాశ్రయకారుని పిదప ఏఒక్క రైనను ప్రస్తావింపకుండుట చింత్యము.[5] ఐన సూర్య గణాంతములై విధిగా వ్రాతలో లఘ్వంతములుగా కానవగు దేశి పద్యములు గేయ గుణము కల్గి ఉండుటచే పాదాంత గురుత్వమును స్వీకరింపవలయును. ఈ అంశములు ముందు ముందు వివరింప బడును.

ఛందోంగమైన అక్షరము యొక్క ప్రాధాన్యత నిజమునకు దేశి ఛందస్సులలో లేనేలేదు. దీని విలువ మార్గి ఛందస్సులలోనే ఉన్నది. ఒకొక్కక్క అక్షరమును పెంచుచు 26ఛందములలో అక్షరస్థానమున గురు లఘ్వక్షరములను మార్చి మార్చి, 13 కోట్ల పైచిలుకు వృత్తముల ఆవిర్భావమును ఛందశ్శాస్త్రజ్ఞులు యేర్పరచి నారు. ఈ పాదములలో అక్షరమునకున్న విలువ దేశి పద్యములలో లేదు. మార్గి వృత్తములలో గణములు సైతము అక్షర సంఖ్యకు లోబడిన త్ర్యక్షర నిర్మితములే యున్నవి.

ఉత్పలమాలలో పాదమున కెన్ని అక్షరములన్నపుడు 20 అని నిర్దుష్టముగా చెప్పవచ్చును. ప్రతిపాదమున కన్నియే యక్షరములు. ఎన్నవ అక్షరము గురువు లేక లఘువని నిర్దేశింపబడునో అదే అక్షరము తక్కిన పాదము లందును అట్లే ఉండును. పాదమునకు భ ర న భ భ ర వ అను గణములుండునని చెప్పినట్లే 1, 4, 6, 10, 13, 16, 18, 20వ అక్షరములు గురువులని చెప్పినను లక్షణము చెప్పినట్లే యగును. ఈవిధానమును భరతుడు, శ్రుతబోధకర్త అనుసరించినారు. యతి స్థానము సైతము 9 అక్షరములకు మీద యని చెప్పవచ్చును.

దేశి ఛందములలో గణము "కాల ఖండము". అక్షరసమత ఉండదు. ఏ పద్యమునకైనను ఇన్ని అక్షరములన్నది లేదు. ఏకాక్షరమునుండి, షడ్వింశత్యక్షర నిర్మాణ పద్ధతిగా గాక దేశి పద్యములు బహుళ ప్రచారములోని గేయ సంప్రదాయములో నుండి పుట్టిన ఛందములు.

ప్రతి అక్షరము వృత్తములలోవలె 1) గురువు లేదా లఘువన్న నిర్దేశనమునకు లోబడదు. 2) పాదమున కిన్ని అక్షరములన్న నియమములేదు. 3) యతి ఇన్ని అక్షరముల పిదప అన్న నియమము లేదు.

ప్రత్యేకాధిష్ఠాతృ గణములు తప్ప గణ నిర్బంధము లేదు. అనగా ఇంద్ర గణములు ఇన్ని (గణములు ఆరింటికి అధిష్ఠాత ఇంద్రుడు) అన్న నియమమే కాని, ఈ గణము పిదప ఈ గణమున్న గణనామ నిర్దేశములేదు. కందములో మాత్రము నామమాత్ర గణ నిర్బంధమున్నది. గణ నిర్బంధము, గణముల వలన అక్షర నిర్బంధము లేకుండుట దేశి విశిష్టత.

ప్రాస పూర్వాక్షరము మాత్రము నియమ సహితము. ప్రాసగల కంద పద్యము నందో లేక ప్రాస యతి వేయదగు ఉపజాతిపద్యములందో ప్రాస పూర్వాక్షరము మొదటిపాదమున గురువైనచో తక్కిన మూడుపాదములందు గుర్వక్షరముగనే ఉంచవలయును. లఘ్వక్షరమైనచో లఘ్వక్షరముగనే తక్కిన 3 పాదములందుంచవలయును. ప్రాస పూర్వాక్షరము యొక్క గురులఘుత్వములకు లోబడే ప్రాస యతి నియతమై యుండును.

కం. గురులఘువులలో నెయ్యది
మురహర తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడు ప్రాసా
క్షరముల బూర్వమున నదియ కదియింపనగున్.

అప్పక IV - 282

దేశికవి ఇట్టి అక్షర నియమములేని దేశి ఛందముల రచనాసందర్భమున కాలసంపుటులలో ఆలోచించును. అక్షర గణ నిర్మాణములోవలె ఆతని భావ ప్రవాహమును నిరోధింపదు.

— × —

## అ థ స్సూ చి క లు

1. బాలవ్యాకరణము - తత్సమ - హలంతప్రకరణము.
2. నందికేశ్వరుడనెనని డా. కే జి. పాండె "Indian aesthetics" పు. 528 — ఆం.మ. ఛం. శిల్పము - డా. పాటి. మాధవశర్మ (పు. 65) ఉద్ధరించినది.
3. బాలవ్యాకరణము - క్రియా పరి.
4. "క్వచిత్ అవసానేపి లఘ్వంతం" అని హలాయుధభట్టు వ్యాఖ్య. క్వచిత్ లఘువనుటచే బహుధా గురువేనని భావము.
5. వఝలవారు తమ "వ్యాకరణ సంహితా సర్వస్వము"లో పాదాంతలఘువు గురువగుట అశ్రుతచరమని వ్రాసినారు. పు. 70

## II. గ ణ ము లు :-

భరతుడు తన నాట్యశాస్త్రమున పేర్కొన్న ఛందోలంగములలో గణములను పేర్కొనలేదు. అతని మతమున గణవ్యవస్థ అక్కరయే లేదు. పాదములోని అక్షరములను వాని ఏక/ద్వి మాత్రాత్వములను లెక్కించి పాద దైర్ఘ్యమును గణించుటకు గణములు సులభ సాధకములుగా ఛందశ్శాస్త్రమున అవతరించినవి. మ స జ స త త గ అను గణములున్న - శార్దూల విక్రీడితమని లాక్షణీకరణము. గణ సహాయమున నిర్ణయించుటచే గణములు అక్షర దైర్ఘ్యమును - 6 గణములు × 3 అక్షరములు + పైనొక్క గురువు అనగా ఒక్క అక్షరము. 19 అక్షరములని — 19 వ— అతిధృతి ఛందోజాతమని, మాత్రలు ఒకవేళ గణించితిమేని మ 6, స=4 జ=4. స=4, త=5, త=5, గ=2=30 మాత్రలకాలముచ్చారణ కల్గియుండునని, 4 -5 —7—9—10—11 —15—18 అక్షరములు లఘువులని, తక్కిన అక్షరములు గురువులని స్ఫుటముగా, త్వరితముగా స్ఫురించును. ఈ గణముల ద్వారా

పాదమును కొలుచు వ్యవస్థ పింగళునిచే ప్రవేశపెట్టబడినది. భరతుడు పాదలక్షణమును గణ విధానమున గాక, పాదమునందలి ఏయే యక్షరములు లఘువులో ఏయే అక్షరములు గురువులో నిర్దేశించుట ద్వారా చెప్పినాడు. ఈ విధానము తర్వాతి, కొలది ఛందః కర్తలాచరించినను [1] సౌలభ్యము దృష్ట్యా గణవ్యవస్థయే సర్వ జనాంగీకారమునందినది. పింగళాదులది గణా నువర్తి ఛందో (పాద) నిర్దేశనము కాగా, భరతాదులది అక్షరానువర్తి పాద నిర్దేశనము.

తెలుగులోని లాక్షణికులందరును పింగళుని గణవ్యవస్థనే అనుసరించిరి. ఐనను ఒకరిద్దరు ఒకటి రెండు వృత్తములకు గురు లఘు నిర్దేశనము గణ పూర్వకముగా గాక అక్షర పూర్వకముగా చెప్పిరి.

పాలాశ దళమన్న వృత్తమునకు కవిజనాశ్రయాదులు నన, నన, ననగ అని గణములు చెప్పగా అనంతుడు తన ఛందోదర్పణములో మాత్రము "పదునైదు లఘువులును బరగ గగమొంద"[2] అని, 15 లఘువులు+1గ+1గ అని గణం పేరు లేకుండ (5 నగణములు అనకుండ) చెప్పినాడు.

ఛందో దర్పణాదులు పేర్కొన్న " మణిగణనికరము" నకు గల నన ననస గణములు కవిజనాశ్రయ కారునిచే (15 వ ఛందమున 14 లఘువులు + 1గురువు). "మనులఘుగురుకము మణి గణ నికరము" అని (మనువులు పదునల్గురు) లక్షణము అక్షర పూర్వకముగా తెల్పబడెను.

వృత్త పాద లక్షణ నిర్దేశనమప్పుడు గణ నిర్దేశము సౌలభ్యార్థమనుట సర్వసమ్మతము. అట్లయ్యును ఇచ్చట గణములని చెప్పక లఘువులని చెప్పుట మరింత సౌకర్యార్థమే. ఏలయనగా పై పద్యములు సర్వలఘుమంతములు. ఇట్టియెడ లఘు సంఖ్య చెప్పక పోవుటయే సౌలభ్య దూరమగును.

భరతుడు వివరించలేదని అతని మతమున గణములే లేవని కాదు. గణములతో పాదమును మాత్ర మాతడు లక్షణ నిర్దేశము గావింపలేదు. త్ర్యక్షర గణములను గూర్చిచెప్పుచు ఇట్టి గణనమును లాఘవార్థమని చెప్పెను.

త్ర్యక్షరాస్తు త్రికాజ్ఞేయాః.........14-87 నా.శా.

ఏత్తైర్ఘ్యాశ్లిష్టా.......లాఘవార్థంపునరమీ... 14-123 నిశా.

షంపోంఒగములందు మాత్రము భరతుడు 'విధిని' పేర్కొనెను. విధి యనగాపాదమందలి అక్షరముల కూర్పు. ఏయేయక్షరములని విడిగా నిర్దేశించు టయే విధి అనెను. విధి తిరిగి గణకృతము, అర్థకృతమని (ద్వి విధమని) చెప్పెను.[3] అర్థకృత మన్నపుడు భరతుడు నిర్దేశించిన విధముగా పాదములోని స్వల్ప సంఖ్యాక ములు అగు గురువులు లేదా లఘువులు దృష్టియందు మాత్రముంచుకొని కవి తన పద్యరచనా సందర్భమున పాదమును అర్థపంతముగా విరుపుల నిచ్చుచు పద ప్రయో గము గావించును.

శా :— దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫురత్-

శా:- అరూపం బవికార మాభుజలం బత్యంత నిర్గర్వ మా-

తిక్కన విరాట పర్వములో పై రెండు పద్యములు ఒకే శార్దూల వృత్త నిబద్ధము లయ్యును అర్థ కృత విధిలో తమ భిన్నత్వమును కనబరచుచున్నవి. గణ కృత మన్నపుడు అర్థము కన్న లయ స్పష్టమై గణ బద్ధమైన పదములతో శ్రోతృ పర్వముగా పాదము సాగిపోవును

మానిని :- తమ్ములు దానును (ధర్మతనూజుడు) దక్షిణ సంభృతసం భ్రముడై

దీనిని గణమునకొక్క పదము ప్రయోగించుట యనవచ్చును. పాదము నందలి పదములు అర్థానుసారిగా విరుగుట గాక గణానుసారిగా విరుగుట యన్నమాట. దుర్వారో - ద్యమబా - హువిక్ర - మరసా - ఇచ్చట గణానుసారి పదవిభాగము గాక దుర్వారోద్యమ - బాహువిక్రమ - రసాస్తోక అని అర్థానుసారిగా విభాగమైనది. కాని పై మానిని యందు గణమును బట్టి పదము విరిగినది. వృత్తము గణానుసారిమైన మనోహరమగు లయను సృజించునేని ఆ వృత్తమందు ఈ విధమగు పద ప్రయోగము అత్యంత మనోహరమగును. సర్వ భగణ యుతమగు మానిని చతుర్మాత్రికమై స్పష్టమైన లయను కల్గియున్నది. కనుక ఇందలి గణానుసారి పద ప్రయోగము మనోహరమై యొప్పినది. ఇంత చక్కని రూపు కల ఈ మానిని వృత్తమందే మహాక్కచోట (ఆదిపర్వం 8-91) చతురస్ర గతి నడక లుప్తమైనది.

మాని : అమ్మునినాథ వరేణ్యునకున్ వినయమ్మున మ్రొక్కిన మున్న తపీ ఇచ్చట "తమ్ములు..." అన్న పద్యము నందువలె గణానుసారి పద విభాగము కాలేదు. గణానుసారి చేసినచో "అమ్ముని - నాథవ - రేణ్యున - -కున్ విన -

'యమ్మన - (మొక్కిన - మున్నత - పీ - అని విడిపోవును. కాని కవి ప్రోక్తాను సారము అర్థవంతముగా

అమ్మని నాథ పరేణ్యునకున్
వినయమ్మన (మొక్కి
సమున్నత పీర —

ఈ రీతిగా చదువవలెను[4]. వృత్తము ఒక్కటేయైనను ఇచ్చట పైవలె లయ స్పష్టము కాలేదు.

ఒకొక్క గణమున కొక్కొక్క పదమన్న నియమము సర్వత్ర పాటించ బడుట క్లేశతరమే. ఇట్లేయైనచో మానినియందు భగణములగు పదములు తప్ప ఇతర పదములు వాడరాదన్న నియమమగును. కాని ఈ నియమము కవికి పదములనెన్నుటలో మిక్కిలి క్లేశమును కల్గించును. 2 గణములకు కల్పియైనను పదము విరిచి వ్రాయవచ్చును. దీనితో లయ లుప్తము కాదు.

మానిని :- జాదము నప్పుడు, సర్వజ నంబులు చూచి భయంపడి

గణమునకొక్కటి గాక "సర్వజనంబులు" "చూచి భయంపడి "అని రెండు గణముల కొకపరి విభాగమైనది. ఇదియును లయ బోధకమే.

అక్షర వృత్తములలో ఏదముల కూర్పు గణానుసారిగాక అర్థపద్విధి యైన ప్పటికిని ఒప్పును. కాని, లయను మనోహరముగా స్పష్టపరచు దేశి ఛందములలో మాత్రము అక్షరవిధి గణకృతము గాక అర్థకృత మైనపుడు గతిచెడి దేశ్య ఛందముల మౌలికతకే భంగమేర్పడి కృతకమగును. అంతేగాక గణానువర్తి పదములను తెలుగులో వాడుకొనుటకు గణనములో గల స్వేచ్ఛ మరింత సహాయ కారి కాగలదు త్ర్యక్షరగణములు గాక తెలుగులో ద్వ్యక్షర, చతురక్షర గణములుగా సూర్యేంద్ర చంద్రగణములుండుటచే ఈ గణములు ప్రతి పద్యమందు సమిష్టిగా వాడబడుటచే గణానుసారి పదప్రయోగమునకు చక్కని అవకాశముండును.

జానపద గేయ ఛ్ఛందములందు మాత్రాసమక గణముల కూర్పు ఉండునుగణములు సమసంఖ్యలో ఉండి, సామాన్యముగా అర్ధపాదమునకు విరుపు (పద సమాప్తి) కల్గి గణానుసారి పదప్రయోగముండి లయ చక్కగా వ్యక్తమగును. మాత్రాసమక గణములు కాల సంపుటములు (Time Units). అనగా గురు

లఘువుల నిర్బంధములేని మాత్రాసమూహము. ఇవి త్ర్యస్ర, చతురస్రాది జాతులన బడును. వానిలో మాత్రల సమత మాత్రమేగాని అక్షర సమత అక్కరలేదు. ఇట్టి తాల సంపుటంలోనే జానపద కవి ఆలోచించును. పదములను వొంతరలుగా పేర్చి పాదము రచించును. ఏ పదమైనను మాత్రాసమతను సాధింపలేకున్నచో దానిని దీర్ఘీకరించి లేదా హ్రస్వీకరించి మాత్రలను నింపును. పంచ మాత్రికములగు ఇంద్ర గణములలో లాక్షణికులు భల, నలల, పంటివి చెప్పకున్నను గేయములలో ఇవి వాడ బడును.

ఉదాహరణకు సీస పద్యమందు ఇంద్రగణములు పంచమాత్రికములు వాడి నపుడు గతి సుందరమగును. కాని నల, నగ, సల, భ, ర, తలను ఆరు గణము లలో భ, నల, గణములు రెండు మాత్రము చతుర్మాత్రికములు. ఇవి వ్రాతలో అట్లేయున్నను సీస పద్య పఠనములో పంచమాత్రికములుగా ఉచ్చరింపబడినపుడే తక్కిన గణములతో బాటు ఖండగతిగల్గి సీసమునకు నిండుదనము చేకూరును.

సీ॥ ఎండిన ఊళ్లగో డెరిగింప డెవ్వడు
పండిన ఊళ్లకే ప్రభువులంత (నరసింహ శతకము)

దీనిలో ఎండిన, ఎవ్వడు, పండిన ఊళ్లకే అన్న పదములు భగణములు [చతుర్మాత్రికములు] తక్కిన సీస పాదగణములు పంచ మాత్రికములు. లాక్షణిక (పండితుల దృష్టిలో ఎండిన, ఎవ్వడు, సీసలక్షణము చక్కగా పట్టిన పదములే ఐనను గేయ పద్ధతులలో చదువు వారికి పై సీసము 'ఎండినా ఊళ్లగో డెరిగింప డెవ్వడూ' అనియే పంచమాత్రిక గణముగా దీర్ఘీకరించబడును. ఒకవేళ భగణములలోని అంత్య లఘువు దీర్ఘీకరింపబడకయున్నను శబ్దాంతములో ఒక మాత్రకాలము నిశ్శబ్దము పాటింప బడును.

'ఎండిన ఊళ్లగో డెరిగింప డెవ్వడు'

ఎండిన అని ఉచ్చరించిన పిదప ఊళ్లగో అని పలికే ముందే ఒక్కమాత్ర నిశ్శబ్దం కాలం పాటింపబడునే కాని 'నఊ' అని విరామరహితంగా పలుకబడదు. అయితే ఇక్కడ పదములు గణమున కొక్కటి చొప్పున వేయబడినవి. కనుకనే మాత్రా సమత, తద్వార లయ సాధ్యమైనది. ఒక గణంలోని పదం మరొక గణములోనికి చొచ్చుకొని వచ్చినపుడు ఇది సాధ్యపడదు. గణమును బట్టి విరిచినపుడు లయ

స్పష్టమై అర్థము నశించును. అదే పదమును బట్టి విడిచినచో అర్థము స్పష్టమై లయ నశించును.

శరమో - క్షణవే - గనిరం
తరమం - డలితో - రుచాప - దండుడ - కాండో
ద్ధురదం - డధరుడ - ఖోలెను
హరిసం -దనుదా - శైద్రుపదు - డయ్యు - ద్ధతుడై

[ఆదిపర్వ. VI 58]

ఈ పద్యములోని గణకృత విధి లుప్తమై అర్థకృత విధి స్థాపితమై లయ సుస్పష్టము కాకున్నది. అటు అక్షర సమకమై మాత్రాసమత లేని వృత్తముల జాతికిగాని, ఇటు అక్షరసమతయు మాత్రాసమతము నిర్దిష్టముగాని దేశి పద్యముల జాతికి గాని చెందక మాత్రాసమక గణనిబద్ధమై, స్పష్టముగా కానవచ్చు ఏకైక పద్యము కందము. పై స్థలములో అర్థకృత విధి రూపమున లుప్తలయమైనది.

ఆటవెలదులతో ఆటలాడించినాడన్న వేమన్న గణకృతివిధితో మనోహర మగు లయను అలతి అలతి పదముల పేర్పుతోసాధింప గల్గినాడు.

ఆ. వె. ఉప్పు - కప్పు - రంబు - ఒక్క - పోలిక - నుండు
చూడ - చూడ - రుచుల - జాడ - వేరు

ఆ. వె. అనువు - కాని - చోట - అధికుల - మనరాదు
కొంచె - ముండు - టెల్ల - కొదువ - కాదు

వంటివి అనేకములిందు కుదాహరణగా చూపవచ్చును.

తెలుగులో దేశి ఛందములను గేయదృష్టి తోను సామాన్య జనోప యోగిగాగాంచిన శివకవులాదిగా గలవారు గణకృత విధి తోడను కావ్యోపయోగి దృష్టిగల పండిత కవులు తమ కావ్యములందు అర్థకృత విధి తోడను ఎక్కువ భాగము వాడుట కాంచనగును,

తెలుగు పద్యము






సంస్కృత వృత్తములను గేయ, పాఠ్యములుగా నిట్లే విభజింపబడినవి.

శేషాంచితో దోధక తోదకాదినం గేయ మానతయా
శోభాతిశయో భవతి శ్లోక స్రగ్ధరాదీనాంతు పాఠేన — నాట్యశాస్త్రము
అభినవ గుప్త వ్యాఖ్య. (14 వ అధ్యాయం)

## దేశి గణములు :

తెలుగు దేశిఛందము లందుపయోగింపదగు గణములు త్ర్యక్షర గణములలో వలె అక్షర సమకములు గాని, మాత్రా ఛ్ఛందస్సులలోని గణములవలె మాత్రా సమకము గాని కావు. వృత్తములో గణక్రమము తప్పనట్లు దేశి ఛందముల కుపయోగించు గణములకు క్రమము లేదు. స్వేచ్ఛగా ఉపయోగింప వచ్చును. కాని తిరిగి ఈ గణములే వాడవలయునను నిర్బంధముండును. తెలుగులో వాడబడు దేశి గణములు సూర్య, ఇంద్ర, చంద్రలను పేరిట దేవతల నామముతో వర్గీకరింప బడినవి. ఆ వర్గీకరణములో గూడ, సూర్య గణములు అక్షరసమకములు గావు. మాత్రాసమకములు. ఇంద్రగణములు కొన్ని మాత్రాసమకములు, కొన్ని అక్షర సమకములు. గణముల వర్గీకరణను బట్టి నిర్ణయించుటకు ప్రస్తార విధి అవసరము. 2 మాత్రల గురువుకు బదులు 2 లఘువులు వేసికొనుట వంటి మాత్రా గణములకున్న స్వేచ్ఛ దీనికి లేకున్నను, ప్రస్తారవిధిలో మాత్రము లఘువు ఆదిగాగల దానికి మరొక్క లఘువు చేర్చుట కలదు. అక్షర సమత గాని, మాత్రాసమతగాని లేని ఇంద్రగణములు వాడి సీసాదులలో చక్కని లయను సాధింప గల్గుట విశేషము.

దేశ్య ఛందసులకు వాడబడు గణములు తెలుగులో తక్కిన సోదర ద్రావిడ భాషలో వలె తుల్యత్వము గల్గి సూర్యేంద్ర చంద్రుల పేర వెలసినవి.

గల నగణము లిను డింద్రుడు
నల నగ, సల భ ర త లింక నగగ నహ సలా
భల భగురు మలఘు సవ సహ
తల రల నల సలల రగురు తగ లిందు డజా

- ఛందో ద. I-19

1. సూర్య గణములు (2) - న, హ, (గల) గణములు
2. ఇంద్ర గణములు (6) - నల, నగ, సల, భ, ర, త
3. చంద్ర గణములు (14) - నగగ, నహ, భల, సలల, భగురు, మలఘు సవ, సహ, తల, రల, నవ, సలల, రగురు, తగ - గణములు.

ఈ గణములు గుర్తించుటకు సంస్కృత ఛందో గ్రంథములందలి షట్ప్రత్యయములలోని ప్రస్తారవిధి ఆశ్రయించబడినది. 2, 3, 4. గురువులను ప్రస్తారింపగా వరుసగా సూర్య, ఇంద్ర, చంద్ర గణము లేర్పడునని నిర్ణయింపబడినది. అయితే ఈ ప్రస్తారము సాధారణ ప్రస్తార విధిలో ఉన్నప్పటికిని లఘ్వాదిగానున్న వరుసలో ప్రారంభమున మరొక్క లఘువుంచుట విశేషవిధి. ప్రస్తరించిన పిదప మొదటిరెండు వరుసలను తొలగించగా సూర్యేంద్ర చంద్ర గణము లేర్పడును.

కం. ద్విత్రి చతుర్గురు పదముల
ధాత్రీ ధర రెండు మడప దక్కిన గణముల్
మిత్రేంద్రు చంద్రులన జను
మాత్రాది గణంబు మొదల మాత్రలిడంగన్ 6.

### గ ణ ప్ర స్తా ర వి ధి

ప్రస్తార చిత్రము

| 2 అక్షరములు | 3 అక్షరములు | 4 అక్షరములు |
|---|---|---|
| U U మొదటి రెండు | U U U మొదటి రెండు | U U U U |
| I I U తొలగించగా | I I U U తొలగించగా | I I U U U |
| U I -హ | U I U -ర | U I U U -రగ |
| I I I -న | I I I U -నగ | I I I U U -నగగ |
| సూర్యగణములు (న, హ) | U U I -త | U U I U -తగ |
| | I I U I -సల | I I U I U -సవ |

| | |
|---|---|
| U I I -భ | U I I U -భగురు |
| I I I I -నల | I I I I U -నవ |
| ఇంద్రగణములు | U U U I -మలఘు |
| (నల,నగ,సల,భ,ర,త) | I I U U I -సహ |
| | U I U I -రల |
| | I I I U I -నహ |
| | U U I I -తల |
| | I I U I I -సలల |
| | U I I I -భల |
| | I I I I I -నలల |

చంద్ర గణములు
రగ,నగగ,తగ,సవ,భగురు,నవ
మలఘు,సహ,రల,నహ,తల,సలల
భల,నలల గణములు

ప్రస్తారములో గురువాది పరుసక్రింద లఘువాది వరుసవెంబడే వచ్చును. లఘువునకు ఎడమప్రక్క మరొక్క లఘువుంచిన పైవరుసలోని గణములోని మాత్రలతో సమాన మాత్రలుగల గణము పుట్టును. ఒకటవ వరుస రెండవ వరుసగణముతో సమమాత్రికమగును. అట్లే 3-4, 5-6, 7-8 సమములగును. పైన చూపబడిన ప్రస్తార చిత్రములో ఇది కానగును. సూర్య గణములు రెంటిని ఒక్కగురువు లేదా లఘువును చేర్చగా (హ నుండి ర, భ గణములు, న నుండి నగ, నల లు) నాలుగు ఇంద్రగణములైనట్లే, ఇంద్రగణమును ఆరింటికి లఘువు లేదా గురువు చేర్చగా $6\times2=$పన్నెండు చంద్రగణములు ఏర్పడును. తొలగించవలసిన మొదటి రెండు గణములకు లఘువు ఒక్కటి చేర్చగా తక్కిన రెండు గణములు సిద్ధమగును. అపుడు ఇంద్రగణములు ఆరు, చంద్రగణములు పదునాలుగు సిద్ధమగును.

చంద్ర గణములు సూర్యేంద్ర గణముల వలెగాక దేశ్య ఛందములందు క్వాచిత్క ప్రయుక్తములు[7]. ఇవి అక్కరలందు మాత్రము వాడబడును. వీనికి ప్రయోగము ఎక్కువగా లేకుండుటకు కారణము తెలుగులో ఈ గణములకు సరిపడు బహ్వక్షర పదములు లేకుండుటయే కావచ్చును. తెలుగులో పదములన్ని అలతి అక్షరములతో ఒప్పునవి. అంతేగాక చంద్రగణములు రెండుపేరు గణములుగా

విడిపోవుటకు వీలున్నది.[8] చంద్రగణములు 14 లో 12 గణములు ఇంద్రగణములు నల, నగ, సల, భ, ర, తలకు పైనొక్క లఘువో, లేదా గురువో చేర్చగా యేర్పడుట క్రింద కాంచనగును.

| ఇం. గ. | | | చంద్రగణములు | చంద్రగణముల మాత్రా సంఖ్య |
|---|---|---|---|---|
| 1. నల | — | +ల | నలల | 5 |
| | | +గ | నలగ (నవ) | 6 |
| 2. నగ | — | +ల | నగల (నహ) | 6 |
| | | +గ | నగగ | 7 |
| 3. సల | — | +ల | సలల | 6 |
| | | +గ | సలగ (సవ) | 7 |
| 4. భ | — | +ల | భల | 5 |
| | | +గ | భగురు | 6 |
| 5. ర | — | +ల | రల | 6 |
| | | +గ | రగ | 7 |
| 6. త | — | +ల | తల | 6 |
| | | +గ | తగ | 7 |
| తక్కినవి రెండు గణములు | | | 7. మలము | 7 |
| | | | 8. సహ | 7 |

ఇందు నలల, భల, అను రెండు గణములు మాత్రము 5 మాత్రలవి. తక్కినవి 6 లేదా 7 మాత్రలవి. ఇవియే అక్కరలలో ఎక్కువగా వాడబడినవి.

సూర్యగణములు (న,హ) రెండు మాత్రాసమకములు (త్రిమాత్రికములు) ఇంద్రగణములు సైతము నల(4) నగ(5) సల(5) భ(4) ర(5) త(5) లలో నల, భ లు తప్ప తక్కినవన్నియు 5 మాత్రలవి దేశ్య ఛందములందు ముఖ్యముగా సీసములందు 5 మాత్రల గణములే ఎక్కువగా వాడబడి లయను స్పష్టపరచును. నల, భగణము లొకవేళ వాడబడినను అవి పద్య పఠనావసరమున మరొక మాత్ర నింపుకొని సమతూకము సాధింపగలుగును. కవికోకిల దువ్వూరి వారు "నైవేద్యము" నకు తమ పీఠికలో ద్విపదలో పంచమాత్రిక గణములే(ఇం. గ) ఉపయోగించి, వాటి ప్రయోగమును గూర్చి గతియందలి విసుగు వేసటలు తొలగునని చెప్పిరి. గిడుగు

వారును నాలుగు మాత్రల గణముల కంటె 5 మాత్రల గణములే సీసాద్యుపజాతి పద్యములకు నిండుగను, శ్రావ్యముగను ఉండగలవనిరి.[9]

ప్రాచీన లాక్షణికులలో సైతము ఈ దేశీయ గణములు మాత్రాసమకములే నని భావించిరి. కవి జనాశ్రయకారుడు "జాతులు మాత్రాసమక నిబద్ధముల"ని అని నాడు[10]. జాతులు మాత్రాసమక గణములచే నిర్మితములన్నప్పుడు, కందమునకీ యభి ప్రాయము సరిపోవును. ఏలయన కంద గణములు (గగ, భ, జ, స, నల) చతుర్మా త్రికములే.కాని జాతులనగా కేవల కందము రేగాక (కవి జనాశ్రయుడే పేర్కొన్నట్లు) గీతులు, సీసములు, ద్విపద, తరువోజ, అక్కరలు కూడా అగును. మరి వీనిలో సూర్యేంద్ర గణములు వాడబడుచున్నవిగదా ! స్థూలముగా ఇంద్రగణములు 4 లేక 5 మాత్రలవని చంద్రగణములు 6 లేక 7 మాత్రలవని ఆతడు భావించినట్లు చెప్పుకొన వలెను.

గిడుగు వేంకట సీతాపతిగారు ఇంద్రగణములలో చతుర్మాత్రికములగు భ, నల లకు సురపతి గణవర్గమని నగ, సల, ర, త లకు (పంచ మాత్రికములకు) దేవేంద్ర గణవర్గమని విభజింప జూచిరి. సూర్యగణములు మాత్రా సమకములే, చంద్ర గణములు అక్కరలో మాత్రనుపయోగింపబడునని, అక్కర ఛందములు కక్కరలేనివని, ఉన్న ఒక్క మధ్యాక్కర చంద్రగణములు లేనిదగుట వలన తెలుగున "సూర్యేంద్ర గణములనే మనము దేశి ఛందములందు చేర్చుకోదగినవి" అనిరి.[11]

## సోదర ద్రావిడ భాషాగణములు :-

సోదర ద్రావిడ భాషలగు కన్నడ, తమిళ గణవ్యవస్థను పరిశీలించినపుడు అది మరింత విస్తృతముగా కన్పట్టును. తెలుగులోకన్న కన్నడములో, కన్నడములో కన్న తమిళములో గణముల సంఖ్య అధికము. వాటితో పరిశీలించి చూచినపుడు తెలుగులో గణవ్యవస్థ స్వరూప లఘుత్వమున్నప్పటికిని నిర్దిష్టమై కన్పట్టుచున్నది.

రెండు, మూడు, నాలుగు గురువులను ప్రస్తరించుటచే యేర్పడిన గణము లలోలఘ్వాది గణములకు మరొక్క లఘువు తొలుతనే వ్రాసి, మొదటి రెండు గణ ములుతీసివేసిన తెలుగులో సూర్యేంద్ర చంద్ర గణములు వరుసగా సిద్ధమగుట చూసి తిమొదటి రెండు గణములు కూడా కలుపుకొని కన్నడములో బ్రహ్మ, విష్ణు, రుద్ర గణములుగా యేర్పడుచు అనగా తెలుగులోవలె గాక బ్రహ్మగణములు (సూర్య

గణములు) 4, విష్ణు గణములు (ఇం. గణములు) 8, రుద్ర గణములు (చంద్ర గణములు) 16 అగును. తెలుగులోవలె సూర్యేంద్ర చంద్ర గణములన్న పేర్లు గాక త్రిమూర్తుల పేర్లుంచుట తప్ప తక్కినదంతయు తెలుగు దేశ్య గణ వ్యవస్థలో సమానమే.

| తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|
| A) తేమా గణములు<br>గగ — గల<br><br>పుళిమా గణములు<br>య, జ, స, న.<br>మొత్తము గణములు 6 | గగ — గల \| బ్రహ్మ<br>స, న, \| గణములు<br>(తమిళ 6 గణములలో య, జ, గణములు తీసి వేయబడినవి.)<br>మొత్తము గణములు 4. | గల \| సూర్య<br>స \| గణములు<br>(కన్నడ, గగ, స, కరాడా తీసివేసినచో తెలుగు సూర్య గణములు అగును.)<br>మొత్తము గణములు 2. |
| B) కరువిళమ్ —<br>నల, నగ, జల, జగ<br>కూవిళమ్ — భ, ర<br>తేమాంగాయ్—మ, త<br>పుళిమాంగాయ్ —<br>సగ, సల, యగ,<br>యల<br>మొత్తము గణములు 12 | నల, నగ \| విష్ణు<br>భ, ర \| గణ<br>మ, త \| ము<br>సగ, సల \| లు<br>(తమిళ 12 గణములలో జల, జగ, యల, యగ తీసివేయబడినవి.)<br>మొత్తము గణములు 8 | నల, నగ \| ఇంద్ర<br>భ, ర \| గణ<br>త \| ము<br>సల \| లు<br>(కన్నడ మ, సగ తీసి వేయబడినవి.<br>మొత్తముగణములు 6 |

| తమిళము | కన్నడం | తెలుగు |
|---|---|---|
| C) కరువిళంగాయ్ | | |
| నప, నలల, జలగ, జలల, జగగ, జగల, నగగ, నగల | నప, నలల, నగగ, నగల | నప, నలల, నగగ, నగల |
| కూవిళంగాయ్ | | |
| భగురు, భల, రగ,రల | భగురు, భల, రగ,రల | భరుగు, భల, రగ,రల |
| తేమాంగణి | | |
| తగ, తల | తగ, తల | తగ, తల |
| పుళి మాంగణి | | |
| సలగ, సలల, యలగ, యలల | సలగ, సలల | సలగ, సలల |
| తేమాతణ్బ | | |
| మగ, మలఘువు | మగ, మలఘువు | మలఘు |
| పుళిమా తణ్బ | | |
| యగగ, యగల, సగగ, సగల | సగగ, సగల | సగల |
| మొత్తము గణములు24 | మొత్తం 16 రుద్రగణములు (జలగ, జలల, జగగ, జగల యలగ, యలల, యగగ, యగల తీసివేయగా మిగిలినవి పైవి.) | మొత్తము 14 చం.గ. (మగ, సగగ తీసి వేయబడినవి.) |

2,3,4 గురువులను ప్రస్తరించగా వచ్చిన సూర్య ఇంద్ర చంద్రగణములు వరుసగా 4.8,16 కాగా వానిలో మొదటి రెండు తీసివేయగా తెలుగులో 2,6,14 గణములు అయినవి. కన్నడమున ఈ తీసివేత లేక సంపూర్ణగణములున్నవి. తెలుగులో సైతము కవిజనాశ్రయము, కా.మా. గ్రంథములందు సూర్యేంద్ర గణములపై 2 తగ్గించక సంపూర్ణములనే (4,8,16) స్వీకరించినట్లున్నది. ఐతే ఈ రెండు గ్రంధములు కన్నడ, తెలుగు సంప్రదాయానుసారము ఉభయ విధగణములను స్వీకరించినవి. సంపూర్ణ గణములకు "అక్కర జాతి గణము"లనియు, 2 తగ్గించగా మిగిలిన గణములకు "నల నామక," ఇత్యాదిగా పేర్లుంచినవి.

కవి జనాశ్రయము :-

అక్కరేతర జాతి గణములు (రెండు తగ్గించగా)
భ,ర,త, నగ, నల, నలంబులు
వరుసనె యియ్యాఱు నెన్న వాసవ గణముల్
మరి నహములిన గణంబులు
సరవిం దక్కినవి యెల్ల చంద్రగణంబుల్. (సంజ్ఞాధికారము)

అని చెప్పి తిరిగి, అక్కర జాతి గణములు (రెండు తగ్గించక)

వినుత ద్వి, త్రి చతుర్గురు
జనిత గణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను నక్కర జాతులకె

ల్లను నాదిమ లఘువు మొదల లఘు విడవలయున్ (జాత్యధికారము)
అని ఉభయ మతములను పేర్కొనినది. అట్లే కావ్యాలంకార చూడామణి కర్త విన్న కోట పెద్దన్న కూడ రెండు వ్రాసినాడు.

అక్కరేతర గణములను నలనామక గణములని, అంతటను (సీసాదుల లక్షణములలో) పేర్కొని, అక్కరజాతి గణముల వద్దకు వచ్చినప్పుడు —ఇంద్రాది గణ లక్షణములను ఇవి అక్షరోపకరణంబులు (అక్కరకు ఉపయోగించు) గణము లని పేర్కొనినాడు.

గీ. ఓలి రెండు మూడు నాలుగు గురువుం
నైన గణములన సురాధి పేందు
గణము లక్షరోపకరణంబులవి యాది
లఘు గణంబు మొదల లఘువు నిలుప VIII — 52

ఇట్టి ఉభయ మతములను చెప్పినది వీరిద్దరే. అనంతుని నుండి — అక్కరేతర జాతి గణములు (2 వదిలిన ప్రస్తార జనిత గణములు) మాత్రమే పేర్కొనబడినవి. అక్కరలు, ద్విపద, త్రిపద, చౌపద, షట్పద లకు ఒకే చోట లక్షణము చెప్పి, తక్కిన వానికి ముందే చెప్పినవి. అక్కరలకు లక్షణము ప్రారంభమైన స్థలమందే ద్వి త్రి, చతుర్గురు ప్రస్తార జనితగణములు రవీంద్ర చంద్రాఖ్యములని పేర్కొన్నవి. ఈ ప్రస్తార విధానములో అనంతుడు చెప్పినట్లు "రెండు మిగిలినదక్కిన గణములు[12]" అని రెండు తగ్గించుట పేర్కొనలేదు. సీసము తరువోజ మొదలగు వాటిలో నల,

నగ, సల, భ, ర, త, లనియో లేదా నల నామక అనియో పేర్కొనుట జరిగినది.[13] దీనిని బట్టి వీరి మతమున (అక్కరేతర జాతి)

| | |
|---|---|
| సీసము<br>తరువోజ<br>గీతులు (విషమ, సమ)<br>ఉత్సాహ | మొదటి రెండు గణములు తగ్గించగా యేర్పడిన నల నామక గణ నిర్మితములు చంద్రగణ రహితములు |
| 5 విధములైన అక్కరలు (అక్కరజాతి) | |
| ద్విపద, మంజరీ ద్విపద<br>త్రిపద<br>షట్పద | సంపూర్ణ గణముల తోడి సూర్యేంద్ర చంద్ర గణ నిర్మితములు : చంద్రగణ యుత (ద్విపద తప్ప)ములు |

అని స్పష్టమైన విభజనమున్నట్లు అగుపడును. కాలక్రమమును బట్టి కవిజనాశ్రయ, కావ్యాలంకార చూడామణులు తెలుగులో ప్రాచీనతమ ఛందో గ్రంథములు. కాగా వీటి తర్వాత వచ్చిన అనంతుని ఛందోదర్పణము నుండి అర్వాచీన ఛందో గ్రంథములన్నియు ఈ భేదమును పాటింపక, 2 తగ్గించగా మిగిలిన గణములనే స్వీకరించినవి. ఈ రీతిగా దేశీయగణ విషయమున పూర్వానంత మతము, అనంతాది మతమని ద్విధా విభజింపవచ్చును.

కవి జనాశ్రయ కావ్యాలంకార చూడామణి కర్తలు 2 గణములు తీసి వేయగా మిగిలిన ప్రస్తార జన్య గణములలో నల ఆదిగా నుండుటచే నలనామకయని పేరిడిరి. సంపూర్ణ గణములను అక్కర జాతి గణములు అని పేరిడిరి.[14] ఇది కన్నడ సంప్రదాయమును బట్టి నామకరణము జరిగినట్టు తోచును. జయకీర్తి తన ఛందోఽనుశాసనములో కన్నడ బ్రహ్మ (సూర్య), విష్ణు (ఇంద్ర), రుద్ర (చంద్ర) గణములను అధిష్ఠాతృ దేవత[15] నామములను బట్టిగాక ర గణమని, ల గణమని భ గణమని గణ నామము బట్టి వాడినారు [16]. అక్కర జాతిలో చేర్చబడిన త్రిపద, చౌపద, షట్పదులు, పంచ విధాక్కరల వలెనే తెలుగులో ప్రచారములో లేక, నామ మాత్రోపయోగి అయి కన్నడమున విస్తృత ప్రచారములో నుండుటచే యిట్లు భావించవచ్చును. అక్కరజాతి పద్యములని కావ్యాలంకార చూడామణి, కవిజనాశ్రయ కర్తలు చెప్పిన వానిలో ఒక్క ద్విపద మాత్రము తెలుగులోనే బహుళ ప్రచారము గల్గి, కన్నడమున ప్రచారము లేనట్టిది.

పూర్వానంతమతము, అనంతాది లాక్షణిక మతమని దేశ్య గణ వ్యవస్థలో ద్వివిధ మతములు గుర్తించుటకు మరొక్క కారణమున్నది. అనంతునికి పూర్వకాలికులైన లాక్షణికులే కాక కవులును దేశ్య గణ ప్రయోగ విషయమున అక్కర జాతి గణములనే స్వీకరించినారు. ఆదికవి నన్నయ మధ్యాక్కరలలో, పాలుకురికి సోమనాథుడు ద్విపదలలో (అక్కరజాతి) —సూరేంద్ర గణములను వాడిరి. కాని నల నామకములను వాడలేదు.

అనంతాదుల మతము న ను స రి ం చి చూసినప్పుడు నన్నయ వాడిన మధ్యాక్కరలలో అనేకములు లక్షణవంతములు కాజాలవు. నన్నయకు పూర్వ శాసనములలో సైతము వాడబడిన మధ్యాక్కరలలో సూర్యగణములుండ వలసిన చోట్ల గగ, స; ఇంద్ర గణములుండవలసిన చోట్ల సగ, మ కానవగును[17].

ఇట్టి పట్టుల పూర్వానంత మతము నంగీకరించినచో నన్నయ అక్కరలు చాలావరకు లక్షణవంతము లగును. డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు ఈ విష యమును ప్రస్తావించుచు పఘులవారు కన్నడ లక్షణము ననుసరించి నన్నయ మధ్యాక్కరలను లాక్షణీకరింపరని తెల్పి, నిజమునకు పఘులవారే విన్నకోట పెద్దన, కవిజనాశ్రయ కర్తల సూర్యేంద్ర చంద్ర, నలనామకములని ద్వి విధముగా చెప్పిన గణ విధానమును గుర్తించినారని చెప్పినారు.[18]

పాలుకురికి సోమనాథుడు సైతము తన ద్వి ప ద కావ్యములలో గగ (సూర్య గణము), సగ (ఇంద్రగణము) ద్విపద గణములుగా వాడినాడు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్ర గ్రంథమాల ప్రచురించిన బసవ పురాణము (పీఠికలో), బండారు తమ్మయ్య వావిళ్లవారి బసవపురాణము పీఠికలో వీటిని సవరింప బూని నారు. అనంతాదుల మతము ననుసరించి సూర్యేంద్ర గణములను భావించుటచే, ఈ సవరణ (గణ భంగమని) అవసరమని భావింపబడినది. కాని సోముని 'పూర్వా నంత మతమున' పరిశీలించినపుడు ఇవి గణ భంగములు కానవచ్చును[19].

కవి జనాశ్రయ, కావ్యాలంకర చూడామణుల కాలము నాటికి కన్నడములో వలెనే గగ, స, గణములు సూర్యగణములలోను మ, సగ ఇంద్రగణములలోను ఉన్నవని నిరూపితమైనది. దీనితో బాటు ఆనాడే పై రెండు తీసివేసిన (న, హ) సూర్యగణములు (నల, సగ, సల, భ, ర, త) ఇంద్ర గణములు వాడుకలో నున్నట్లు కూడా పై రెండు గ్రంథముల వల్లనే - రెండు మతములను అంగీకరించుట వలననే- తెలియుచున్నది.

సోదర కన్నడములో నుండగ, దేశీయ గణములు తెలుగులో మొదటి రెండు తగ్గించి స్వీకరించుట విశేషము. అదియును కొంతకాలము వరకును నడచియే యున్నది. అట్టి మార్పుకుగల కారణము లేనియో పరిశీలించ వలసి యున్నది. డా॥ చిలుకూరి నారాయణరావుగారు "కన్నడులకున్ను తెలుగు వారికిన్ని యగణ జగణములు గాని, వాటితో గురు లఘువులుగాని యిష్టములేదు. అట్టి వానిని తమిళ గణములనుండి తొలగిస్తే కర్ణాటక బ్రహ్మ, విష్ణు, రుద్రగణములేర్పడినవి. సూర్యగణములలో 3 మాత్రలకు మించినవిన్ని, ఇంద్రగణములలో ఐదు మాత్రలకు మించినవిన్ని గణములుండ కూడదని తెలుగు వారు నియమము చేసుకొన్నారు. అందుచేత ఆయా జాతుల కర్ణాటక గణములనుంచి ఆ సంఖ్యా నియమము నతిక్రమించిన వాటిని తొలగించిరి" అని అభిప్రాయ పడినారు[20]. కన్నడ తెలుగు వారికిని యిష్టము లేదని, ఐదు మాత్రలకు మించిన గణములుండరాదని తెలుగు వారు నియమము చేసుకొన్నారని చెప్పుటకు వారే ఆధారములను చూపలేదు. అంతేగాక జగణమును గూర్చి చెప్పుచు మూడక్షరముల గణము మధ్య గురువు చేర్చినచో గర్భము ధరించి నట్లు ఉండునని అది గమన నిరోధకమని ఊహించినారు. కాని ఈ ఊహ సరియైనది కాదని, దేశ్య శబ్దములలో చాలావరకు జగణ యగణములకు సరిపోవు పదములు లేకుండుటను బట్టి తొలగించి యుందురని డా॥ తంగిరాల సూ. శాస్త్రిగారు విమర్శించినారు[21]. జగణము మరి వృత్తాదులలో కూడ వాడబడుచున్నదిగదా. అంతేగాక కంద పద్యములలో బేసి స్థానములో నిషేధింపబడి షష్ఠ గణముగా ప్రత్యేకించి వాడబడుచున్నది. ప్రాకృత ఛందస్సులలో జగణమునకు విశిష్ట స్థానము ఈయబడినది. జగణమును సరియైన స్థానములో వాడినపుడు లయ సౌందర్యము చక్కగా స్పష్టమగును అని చెప్పబడినది. ఇది గణరాజుగా పేర్కొనబడినది.

ఏ ఆణం చిఅ మజ్ఝే గురుమజ్ఝం సవ్వణాణ అణ్ణం పి।
ఆ అరణి రూవిఅం సణ్ణ అంగి నామం నరేంద్రోత్తి॥
రాణస్పోఓ పసోహఇ రాణ అరహి ఓవి జేణ వినడే ఇ।
మణ్ణా అం పి న, లంఘఇతేణ గుణా మజ్ఝ ఓ రాఅ ॥

వృత్త జాతి సముచ్చయమ్. I-20-21.

Another name of the Gurumadhya chaturmata (Jagana) given to it out of great regard for it, is Narendra or 'King'. It is called a king because when used in its proper place it

beautifies the stanza, but when it is used at an improper place it spoils the whole of it and thus seems to control himself and also others. The King of chaturmatras must not be employed when chatur matra in general is prescribed in the lines of a stanza.

– Prof H.D. Velenkar's English Comm.[22]

ఇట్టి గణమును సక్రమముగా వాడుట తెలిసియుండియు తెలుగువారు సంపూర్ణ నిషేధము చేసిరనుట అసంగతము.

"తెలుగు లాక్షణికులు సూర్యగణములలో తుదిని గురువుగల వానిని, ఇంద్ర గణములలో తుదిని రెండు గురువులు గల వానిని, చంద్రగణములలో చివరి 3 గురువులు గల వానిని కర్ణాట గణముల నుండి తొలగించిరని డా॥ కే. సర్వోత్తమన్‌గారు నుడివినారు[23]. స్థూలముగా పరిశీలించినపుడు ఇది సరిగా కనబడినను, ప్రస్తారములో మొదట రెండు గణములు ఎన్ని ఛందములు ప్రస్తరించినను ఇదే విధముగా (2 గురువుల ప్రస్తారములో చివర 1 గురువు గల గణములు రెండు, 3 గురువుల ప్రస్తారములో చివర 2 గురువులు గల గణములు రెండు, 4 గురువుల ప్రస్తారములో చివర 3 గురువులు గల గణములు మూడు, 5 గురువుల ప్రస్తారములో చివర 4 గురువులుగల గణములు 4) కన్పట్టును ప్రస్తార విధానములో అప్పకవి చెప్పిన సౌలభ్య విధానము పరిశీలించినపుడు ఇది బోధపడును[24]. గుర్వంత గణములు వాడరాదన్న నియమమేలనో తెలియబరచలేదు. అంతేగాక గేయానుగుణమైన దేశి ఛందస్సులలో గుర్వంతత్వము విధిగా కనబడుట పై వాదమును సమర్థింపలేదు.

పై విషయములో తెలుగువారు రెండు గణముల తొలగింపుపై శ్రీకోవెల సంపత్కుమారాచార్యుల వాదనలు సమంజసములై యున్నవి.

తెలుగులో అక్కరజాతి పద్యముల వాడుక తర్వాతికాలములో తగ్గిపోవుటయో, సంపూర్ణముగా లేకుండుటయో జరిగిన కారణముగా అనగా అక్కరల ప్రయోగము ఎఱ్ఱనతో ముగిసి, త్రిపదా షట్పదాదులు సంపూర్ణముగా తొలగిపోయి యుండుట వలన కన్నడ గణ సంప్రదాయము భిన్నమై పోయినదని,

నన్నయ మధ్యాక్కరలలో, పాల్కురికి సోమన్న ద్విపదలో వాడిన కారణముగా, కన్నడ సంప్రదాయము నుండి వచ్చిన అక్కరాదులకు ప్రయోగ

శరణత్వమును బట్టి వాటి ప్రయోగ రీతిని సంరక్షించుటకై మొదట కన్నడ సంప్ర దాయ గణములను (త్రిమూర్తిగణములను) స్వీకరించి, తర్వాత తెలుగునకు అక్కర లేని మొదటి రెండు గణములు తీసివేసిన 'నల నామక గణముల'ని వేరుగా రెంటిని చూపిరని,

ఇట్లు తొలగించుట వలన మాత్రా సమత్వము కొంతవరకు సాధ్యపడుట వలన అనగా సూర్యగణములు రెండు సమ మాత్రికములై, ఇంద్రగణములు 4 లేక 5 మాత్రలవి అగుట వలన వీనిని తొలగించి యుందురని[25],

క్వాచిత్కముగా గగాదుల వాడకము వలన, పేస గణములు నల నామక ములే అధిక ప్రాచుర్యమునంది నందు వలన వీటిని అనంతాదులు పరిహరించిరని వారు వివరించినారు.[26]

12. 13 శతాబ్దుల అంతము వరకు కన్నడ, తెలుగు భాషలలోని దేశ్య గణ వ్యవస్థ తుల్యమై, కవి ప్రయుక్తము, లాక్షణికోక్తమునై అర్వాచీనకాలమున ప్రయోగ దూరమై, అనంతాదులచే సంస్కరింపబడి ప్రకృత స్వరూపమునుసం త రించుకొన్నదని చెప్పవచ్చును.

## దేశి గణములు - ప్రస్తార విధి :-

దేశ్య గణములైన సూర్యేంద్ర చంద్ర గణములను ప్రస్తార విధానమును బట్టి నిర్ణయించుట ఒక విచిత్రమైన పద్ధతిగ తోచుచున్నది. ఏలయన దేశ్య గణముల వంటి గణవ్యవస్థ సంస్కృతము నందు లేదు. ప్రస్తార విధి దేశి భాషలందు లేదు. కాన ఈ రెంటికి సంబంధము పెట్టి జన్య జనకత్వమును చూపుట విశేషము. అంతే కాదు ప్రస్తారములో (షట్ప్రత్యయములలో) లేని లఘువాదికి మరొక్క లఘువు ముందే జోడించుట మరియొక నూతనాంశము. ఇది తెలుగు/కన్నడ గణములను ప్రస్తరించునపుడు మాత్రమే కన్పట్టును. గణ నిర్మాణమునకు ప్రస్తార విధిని వాడు కొనుట సంస్కృతమునందు లేదు. దీనిని బట్టి దేశాభాషా పండితులు సంస్కృత భాషా పండితులును అగుట వలన, జానపద గీతములలోని ఛందస్సులను పరిష్కరించుటలో దేశి గణములను ఏర్పరచియుందురని భావింప వచ్చును. 3వ ఛందమును (షడ్వింశతి ఛందములలో పుట్టు వృత్తములకు ప్రస్తార విధివాడు పద్ధతిలో) ప్రస్తరించుట వలన పుట్టిన వృత్తములు ఎనిమిదింటి గురు లఘు క్రమము — సంస్కృత త్ర్యక్షర గణ వ్యవస్థను పోలి యుండుటచే — అటనుండి

ప్రస్తారవిధిని గ్రహించి దేశ్యగణ నిర్మాణమునకు దీనిని వాడి యుందు రనవచ్చును. దేశ్య గణముల కొరకు ప్రస్తరించునపుడు — గురువాది వరుస క్రింద లఘువుతో ప్రారంభించినపుడు అదనముగా ముందే మరొక్క లఘువుంచుటన్నది దేశి గణములతో సరిపోనప్పుడు సరిపుచ్చుట కొఱకని భావించవచ్చును లేదా పైనున్న గణముతో మాత్రాసమత కొఱకు గురువు క్రింద 2 లఘువులుంచుట అనుకొనవచ్చును. అటు మాత్రా సమము కాక, ఇటు అక్షరసమము కాక, — విచిత్రముగా స్థిరపడిన ఈ దేశి గణములను పండితులు అక్షరసమక సంస్కృతగణములవలె, మాత్రాసమక ప్రాకృత గణములవలె ఉభయప్రభావమున సమన్వయపథమున నిర్ణయించి యుందురు ఇట్టి భావనకు కారణము దేశ్య ఛందములైన సీస, గీత, ద్విపద మధ్యాక్కరాదులు దేశి గణనిర్మితములైనను, మాత్రాసమములగు గేయ గతిని కల్గియుండుటయే.

"అంతట రాములవారు అంగన సీతను గూడి" ఈ జానపద గీత పాదము మధ్యాక్కర పాదమువలె స్థూలముగా గోచరించు చున్నను, చతురస్రగతిలో నడచు చున్నది. 4 మాత్రల గణములు వాడబడినవి. గేయములో ఇది 'అంతట రాముల వారూ అంగన సీతను గూడీ అని పాడబడును. వారూ, గూడీ అనునవి లిఖిత సంప్రదాయములో వ్యాకరణ దోషజుష్టములుగా భావింపబడును. వీనిని వ్యాకరణము తెలిసిన వారు 'వారు, గూడి' యని లిఖింతురు. వీటిలో గేయ సంప్రదాయమున చతుర్మాత్రికములుగా భావించినను లిఖిత సంప్రదాయములో గణ విభజన చేసినపుడు UI (హ) గణముగా లెక్కింపబడును. ఇట్లు పై పాదమున గణ దృష్టితో చూచినపుడు భ, భ, హ. — భ, భ, హ 2 ఇం+1 సూ. — 2 ఇం+1 సూ. గణములుగా కొలిచి నచో అది మధ్యాక్కర పాదమువలె గోచరించును. పండితులకీ గేయము మధ్యాక్కరగా గోచరించినపుడు ఆశ్చర్యపోవుట కూడా జరిగినది[27].

| | | | |
|---|---|---|---|
| 1 న.గ. | 2 గ. | 3 వ. | 4 వ. |
| తులసి | యింట | నుంచు | వార్కి |
| 5 | 6 | 7 | 8 |
| తులసి | పూజ | చేయు | వార్కి |
| 1 | 2 | 3 | 4 |
| తులసి | యందు | భక్తి | యుంచి |
| 5 | 6 | 7 | 8 |
| వెలగు | వార్కి | నీ — | |

1 2 3 4
తులసి చూచి మొక్క వార్చి
5 6 7 8
తులసి యనుభ వింపు వార్చి
1 2 3 4
తెలిసి నీవు వారి దిక్కు
5 6 7
తిరిగి చూడ కూ —(8)

పై గేయములో పాదమున కెనిమిది త్రిమాత్రికా గణములున్నవి. 2వ, 4వ పాదములలో నీ, కూ, అన్న 7 వ గణముల స్థానములో మరొక్క రెండు మాత్రలు+8 వ గణ స్థానము 4 మాత్రలు నీ అను అక్షరము పిదప లేక కూ అను అక్షరము పిదప దీర్ఘమును సాగతీతలోనే నింపబడును. కాని స్థూలదృష్టిలో ఇవి (2, 4 పాదములు) 7 సూర్య గణముల పిదప ఒక్క గురువు (నీ-కూ) గా పరిగణింపబడి ఉత్సాహ వృత్తముగా లాక్షణీకరింపబడియుండును. ఈ అభిప్రాయమునే కోరాడ రామకృష్ణయ్యగారు వ్యక్తపరచినారు 28. కన్నడములో ఉత్సాహ రగడ ఒకటి ఉన్నది. దీనిలో 8 త్రిమాత్రికా గణములుండును. తెలుగులోని ఉత్సాహ, కన్నడ ఉత్సాహ రగడలోని భేదము కేవలము 1 మాత్రాకాలమే.

"...thus a short syllable which covers only one matra according to grammarians, is some times made to cover two matras and a long syllable some times fills up, instead of two, one Matira.

"....some times the Matras are covered by silent pauses. There are not pecularities of Malayalam metres alone but are found in the metres of several other languages" 29 అని గేయ సంప్రదాయ గణముల గూర్చి N. V. క్రిష్ణవారియర్ గారు మళయాళ ఛందః పరిశీలనలో చెప్పిన అంశములు ఇచ్చట సరిపడుచున్నవి.

జానపదగీతము లిట్లు శబ్ద దోషముల క్రింద లెక్కింపబడి శబ్ద సంస్కరణము జరిగి గణదృష్టితో పరిశీలించనవుడు 'కాల సంపుటములు' భిన్న

మాత్రిక గణములుగా మారినవనవచ్చును. సూర్యేంద్ర చంద్ర గణములు అట్టి రూపాంతరము పొంది యుండవచ్చును.

ఈ అభిప్రాయమునే సమర్థించుచు "దేశి రచనలలో గీతి ధర్మ ప్రకృష్టము లైన సందర్భములలో అనగా గేయములను సాగదీసినపుడు దీర్ఘ ప్లుత కాక్వాది సందర్భములలో మాత్రాకాలము పొడగించబడును. లాక్షణికులు వీనిని లాక్షణీకరింప యత్నించిరి విసర్గ గణములకు లొంగనపుడు ఇంద్రేందు గణాలుఅని చాలీ చాలని కొలబద్దలు పట్టుచున్నారని" ఆచార్య యస్వీ. జోగారావు గారనిరి.

గణ వ్యవస్థ కృత్రిమత్వమును చెప్పుచు ఛందోమౌలిక స్వరూపమే భగ్నము చేయబడినదని మరొక అభిప్రాయము.

**The metrical analysis in Sanskrit both vedic/and classical, is extremely arificial and does not take note of the prosodial values in the metrical lines. It serves the purpose of identifying the metre, but does not give an idea of the nature of metre [31].**

సుప్రసిద్ధ భారతీయ ఛందో విమర్శకులలో అగ్రగణ్యులైన హెచ్. డీ. వేలంకర్‌గారు ఇట్టి అభిప్రాయమును స్పష్టముగా పేర్కొనిరి.

"Such lapses naturally offended the succeptibilities of the educated sanskrit pandits, who indeed very much liked this type of metrical music, but were not prepared to sacrifice their conventionally and grammatically correct pronunciation of short and long aksharas, which respectively look one and two time moments or kalamatras."

— Introduction to Hemachandra's
Chandonusasanam P. 15

సంస్కృత పండితుల చేతిలో దేశీయ గణములు కృతకముగా లాక్షణీకరింపబడినట్లు "మొట్ట మొదట దేశభాషలలో ఛందో రచనలకు లక్షణము నిబంధించిన వారు సంస్కృత భాషా పండితులే........పండితులు వానిని (దేశి ఛందములను)

సంస్కృత ఛందోరీతుల కనుగుణముగా సంస్కరించి యుండుటచే నవి కొన్ని విషయములలో నసమగ్రములగుట సంభవించినది.

....దేశీయములైన పద్యములకు లాక్షణికులు మాత్రాసంఖ్యా నియమముతోనో, అక్షర గణ నియమముతోనో సాధ్యమైనంత వరకు లక్షణము నిర్దేశించి, కొన్నింటికి తాళ బద్ధములని చెప్పి యింకను కుదరని వానిని విడిచివేసినారని" ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు వివరించినారు [32].

ఇట్లు అభిప్రాయపడుటలో దేశి గణవ్యవస్థలో అసమానతలే కారణములని తోచును. లిఖిత రూపములో గీతములు కొలచినపుడు వాటి గురు లఘు నిర్దేశనము దీనికి ముఖ్య కారణము. గేయము వ్రాయబడినప్పుడు అది పఠించుటలో గేయ సంప్రదాయరీతి ననుసరించినపుడు ఎన్ని మాత్రలలోపమున్నదో తెలియగలదు. దానిని హ్రస్వీకరించుట లేదా దీర్ఘీకరించుట వల్ల పూరింపబడును. ఈ మాత్రా సమ భార (సమానకాల సంపుటుల) దృష్టి లేక, కేవల శబ్ద దృష్టితో పరిశీలనలో ఇట్టి కృతకత జరుగును.

గేయములోని 5 మాత్రల పదము వ్యాకరణ శుద్ధరూపములో 3 లేదా 4 మాత్రలుగా లిఖింపబడి గురు లఘు రూపమున గుర్తించినపుడు ఇట్టి దేశీయ గణముల నేర్పాటు చేసియుందురు. గేయములలోని సమభారత వంటిది పద్యములలో అక్షర గణవ్యవస్థలో కావలయునని వ్యాకరణ శుద్ధ శబ్దరూపములను కవులు హ్రస్వ దీర్ఘములుగ మార్చరాదని కవిజనాశ్రయకారుడు ఈ క్రింది పద్యములో నిషేధించెను.

కం. వెలయగఁ జెఱకు విలుగొని
యలరమ్ములఁ జేతఁబట్టి యంగజుఁడు విరా
హులనేయు నేర్చు కడిమిన్
దొల మెలయగ ననినఁగాకు దోషంబయ్యెన్ (దోషా-25)

చెఱకు, విరాహులన్నవి గేయ గతిలోగల్గు దీర్ఘములు ఇవి శిష్ట కవుల దృష్టిలో కాకుదోషములు.[33]

ఆ.వె. గురువు లఘువు చేసి కుంచించి కుంచించి
లఘువు గురువు చేసి లాగి లాగి

అని పండిత కవుల ఈసడింపు.

ఇట్టి కారణముగనే పాదాంతమున తప్పక గురువుండవలసిన చోట సూర్య గణాంత

ఛందములే తెలుగు దేశి ఛందములలో అధికమై హ్రస్వాంతత్వమును కలిగి గేయ గుణమును విడచినవి. పాదాంతాక్షరము గురువగుట గేయములలోని ప్రధానగుణము. ఇట్టి గణ వ్యవస్థలో వ్రాయబడిన పద్యములు - దీర్ఘ, కాకు, సంబోధనాంతాదు లయ్యును లఘువులై యుండినవి.

1) ఆ.వె. బాల గేశి మీది భరము క్రమంబున
విడువ గళల యందు వేడ్క సొనిపి
నయము తోడ నర్త నంబుల శిక్షింపు
నెలత కేడుగడయు నీవ కావె ? విరాట I. 251

2) ఆ.వె. నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్ద వారి యట్ల పిన్నవారు
గానబతుల విధమ కాక యే శైలూషి
గానసంగరాదు కంకభట్ట ! విరాట II 152

విశ్వనాథ మధ్యాక్కరలలో

3) మధ్యా ఒక్కయోగమ్మెదో నీ చరణ సన్నిహిత ధాత్రిభాగ
మెక్కితి వేములవాడ రాజరాజేశ్వరా ! స్వామి !

కాని వీనిని దీర్ఘాంతములుగా పలుకుటయే ఉచితము.

కాళిదాసుని మేఘసందేశములోని మందాక్రాంత వృత్తములలో శబ్ద సంస్కారవిధిలో లఘువుగా భాసించిన అంత్యాక్షరము దీర్ఘోచ్చారణమే కల్గియున్నది. ఏలయన మ,భ,న,త,త,గ అనికదా లక్షణము!

U
మందా కశ్చిత్కాంతా............ప్రమత్తః
U
శాపేన ............భర్తుః
I
యక్షశ్చక్రే ...........పుణ్యోదకేషు
I
స్నిగ్ధచ్ఛాయా ..........ఆశ్రమేషు

ఛందో మర్మజ్ఞుడైన కవికుల గురువు 'షు' అన్నదానిని గురువనియే భావించినాడు గదా ! 34 వీటిని 'షూ' గా పల్లకాలి.

దేశీయ గణ వ్యవస్థ గేయ ఛందములనుండి ప్రత్యేకముగా పండితులచే నిర్మింపబడినదనుటకు వాటికిగల పేర్లు సాక్ష్యములు. సూర్యేంద్ర చంద్రగణములనియో లేదా బ్రహ్మ, విష్ణు, రుద్ర గణములనియో, మన్మథ శరములనియో పేర్లుంచబడినవి.

| | | | | |
|---|---|---|---|---|
| రేచన (కవిజనాశ్రయ) | సూర్య | ఇంద్ర | చంద్ర | గణములన్నవానిని |
| నాగవర్మ (ఛందోంబుధి) | బ్రహ్మ | విష్ణు | రుద్ర | గణములని |
| జయకీర్తి (ఛందోనుశా.) | — | స్మర | శర | ” |
| సోమేశ్వరుడు (మానసోల్లాస) | — | మన్మథ | బాణ | ” |
| శార్ఙ్గదేవుడు (సంగీత రత్నా.) | — | మన్మథ | శర | ” వాడినారు. |

పొత్తపి వేంకటరమణ కవి లక్షణ శిరోమణిలో దేశ్య గణములను ఋగ్వేద బ్రాహ్మణముల కాలమునాటి వనినాడు [34]. 2 వేల యేళ్ళ కాలమునాటి బ్రాహ్మణములలో సూర్యేంద్ర చంద్రగణములున్నవని చెప్పుట ఆశ్చర్యకరము. ఆనాటికి ద్రావిడ భాషల చీలికయే సందేహాస్పదము. బహుశ దీనిని చూచియో లేక స్వీయ కల్పనమో కాని డా॥ చిలుకూరి నారాయణరావుగారు కన్నడాంధ్ర దేశిగణములను వేదములకు సమన్వయింప యత్నించినారు [35].

పండితుల చేతిలో శబ్ద సంస్కారములు జరిగి రూపాంతరములు చెందిన గణములు దేశ్య ఛందములలో ప్రయోగింపబడి తిరిగి గేయ సంప్రదాయమును వీడక, సీస, గీత, అక్కరాదులలో హ్రస్వము, దీర్ఘము నొందియో,దీర్ఘముహ్రస్వము నొందియో గేయ సంప్రదాయమును నిలబెట్టుకొనినవి. బసవపురాణము వంటి వాని యందలి ద్విపదలు, శతకములందలి సీసములు, ఉదాహరణములందలి కళికోత్కలికలు మున్నగునవి యిట్టి గేయ సంప్రదాయమును విడనాడకున్నవి. ఒక్కొక్క చోట గణములలో మాత్రాసమత వీడినను గేయ పద్ధతిని బట్టి తిరిగి మాత్రా పూరణము జరిగి లయను సాధింపజాలినవి ఈ దృష్టితోడనే కాబోలు లక్షణ శిరోమణికారుడు సీస, గీత, కంద, రగడాదులను మాత్రాసమ నిబద్ధములని పేర్కొనినాడు [36].

లయాను గుణములగు దేశ్యఛందములకు ఇట్టి కృతక గణ వ్యవస్థ నిర్మాణమునకు వేరొక్క సాక్ష్యము, ఉద్ధుర మాలావృత్తములను అక్షరగణ పద్ధతిలో పాదములు కొలుచుటయే. ఇవి మాత్రాసమక గణ నిర్మితములగు దేశ్య ఛందములు కాని సంస్కృత వృత్త నిర్మాణ విధానములో లాక్షణీకరింపబడినవి.

## మాత్రా గణములు :-

అన్ని గణములకు అక్షరముల సంఖ్య యెట్లున్నను గురువునకు రెండు, లఘువున కొక్కటి చొప్పున మాత్రలు లెక్కించి మొత్తము మాత్రల సంఖ్యను బట్టి — మాత్రాగణముగా లెక్కింపవచ్చును. తెలుగులోని ఛందోగ్రంథములు గురువునకు 2, లఘువునకు 1 మాత్రయని చెప్పినను మాత్రాగణములు ఇవియని పేర్కొనబడలేదు. ఏలయన సూర్యేంద్ర చంద్రగణములలో మాత్రాసమత లేదు. మాత్రా సమక గణ నిర్మాణము బట్టి గణసమూహమును గుర్తించుటయులేదు. ఒక్క కంద ములో మాత్రము చతుర్మాత్రాగణములు గగ, భ, జ, స, నలలు వాడబడును. లాక్షణికులచే చెప్పబడిన వేరొక్క ఛందము 'చౌపద' యన్నది కలదు. కాని యిది ప్రయోగములో శూన్యము. కందమునకు చతుర్మాత్రా గణ నిర్మాణమని కంఠోక్తిగా చెప్పని తెలుగు ఛాందసికులు చౌపదను మాత్రము చతుర్మాత్రా గణ నిర్మితమని చెప్పినారు. మాత్రయని పలుకవలసిన చోట్లలో లఘువని పలుకుట ఇచ్చట గమనించ నగును [37]. ఉపయోగ రాహిత్యమువలన గా బో లు ఏ యే మా త్ర ల గణము లెవ్వియో వివరణ మివ్వలేదు[38]. ప్రాకృత ఛందోగ్రంథములు మాత్రము మాత్రా గణముల గూర్చి వివరించినవి. తెలుగులోని రగడలు, జానపద గీతములన్నియు మాత్రాసమక గణనిర్మితములు గాన అవి యిట వివరింపబడుచున్నవి.

మాత్రా గణములను 3,4,5,7,9 మాత్రల గణములుగా విభజింపవచ్చును. మాత్రాగణములను పాటగాడు పాట నేర్చుకొను వానికి సులభముగా అర్థమగుటకై అక్షరరూపమున అనగా త,క,క,ట లతో నిరూపణము గావించును. ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క మాత్రగా భావించిన 'కాలసంపుటి' సంపూర్ణముగా అవగత మగును. తకిట అనగా 3 మాత్రల కాలమని అర్థము. మూడు లఘువులే వాడవలయు ననిగాక ఒక్క గురు వొక్క లఘువునైనను వాడవచ్చును. కాలసంపుటి (త్రి మాత్రి కము) కలిసిన వాలును. ఇట్టి సంపుటము సరి సంఖ్యలో (2,4,6) వాడి గీతము యొక్క పాదమును గేయకర్త నిర్మించును. తకిట (త్రిమాత్రికా గణము = 3

మాత్రల కాల సంపుటము), తకిటిట (చతుర్మాత్రికా గణము=4 మాత్రల కాలసంపుటము), తక తకిట (పంచమాత్రికా గణము =5 మాత్రల కాల సంపుటము) అని నిరూపించబడును. సంగీత శాస్త్రము నందు వీనికి త్ర్యస్య (3) చతురస్ర (4), ఖండ (5), మిశ్ర (7) సంకీర్ణ (9) మని పేర్లు. కాని ఇవి జాతులుగా గుర్తింపబడినవి. సప్తతాళములకు గల తాళాంగములలో (లఘు, ద్రుత, అనుద్రుతములలో) లఘువునకు పైజాతిభేదము కల్పించబడినది. శాస్త్రములో గల సంక్లిష్టత జానపద గీతములందుండదు. ఎన్ని మాత్రల గణములు ఎన్ని పాదమునకు వచ్చునో మాత్రము తెలిసిన వారును. జానపద గీతముల పాదగణ రావసరమున తెలుగులోని పండితులు జాతికి బదులుగా గతి (త్ర్యస్రగతి, చతురస్రగతి) అని వాడినారు.

మాత్రాగణములలో త్ర్యస. (3) చతురస్ర (4), ఖండ (5) గతులు మాత్రము గుర్తింపబడినవి. మిశ్ర (7) సంకీర్ణ (9) గతులు వాడబడలేదు. వీని వాడుక లేమికి గల కారణములను గూర్చి చెప్పును శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులు "తొమ్మిది మాత్రలతో గూడ నొకగణము నేర్పరుచు కొన్నారు. దానికి సంకీర్ణమని పేరు. కాని యది గాయకులకే రుచింపక వదలి పెట్టిరి." యని యభిప్రాయ పడినారు.[39] డా. సి. నారాయణరెడ్డిగారు '...తక, తర, తక, తకిట అనే 9 మాత్రల నడక గూడ గాయకులు గ్రహించారు. గాని అది 4,5 అన్న రెండు గుంపులుగానే నడవడం వల్ల దానికి 'సంకీర్ణం' అనే పేరుతో క్రోసి వేసారు' అని భావించినారు.[40] సంకీర్ణమేగాక, మిశ్రగతి కూడ అదే అర్థమును అనగా "కూడిన" అను నర్థము నిచ్చుచున్నది. మిశ్ర (7) గతి కూడ (3,4) మాత్రల సంపుటులు రెండు కూడగా ఏర్పడును. కాన ఇవి జానపద గీతములలో ఉపయోగము తక్కువ. అంతే — కాదు 7,9, మాత్రల పదములును తెలుగులో లేవు. తెలుగులో అన్ని చిన్న చిన్న పదములే ఉన్నవి. అవి సాధారణముగా (5) మాత్రలు మించవు. ఆరు మాత్రలైన 2 త్రిమాత్రాగణములగును గదా!)

ప్రాకృత ఛందో గ్రంథములలో త్ర్యస చతురస్ర వంటి పేర్లు గాక వేరు నామము లుంచబడినవి. ప్రాకృత పైంగళమునందు (1-12) 6 మాత్రల గణమునకు — ట గణమని, 5 మాత్రల గణమునకు— ఠ గణమని, 4 మాత్రల గణమునకు — డ గణమని, 3 మాత్రల గణమునకు— ఢ గణమని, 2 మాత్రల గణమునకు —ణ గణమని పేర్లుంచబడినవి. విరహాంకుని 'వృత్తజాతి సముచ్చయము' నందును, హేమచంద్రుని 'ఛందోఽను శాసన' మందును[41] ఇట్టివే పేర్లు కానవగును. విర

హాంకుడు షర్గమునకే కాక చతుర్మాత్రాగణములకే కర్ణ (ద్విగురుUU), కర(అంత్య గురు IIU) వంటి పేర్లుంచినాడు[42]. ఈతడు త్రిమాత్రాగణములు, చతుర్మాత్రాగణ ములు గురు లఘువుల సంయోగమున ఎన్నెన్ని విధములుగా ఉండునో కూడా వివరించి నాడు. కాని వీని వివరణ మక్కరలేదు. జానపద గీతములు వ్రాయువారు కాల సంపుటులు దృష్టిలో నుంచుకొని పదములు పేర్చుచు పాదములు దొంతరలుగా నిర్మింతురు. గణదృష్టి (గురులఘు దృష్టి)ని మించిన విశాల గణనము ఉపయోగింపబడును. జానపద కవులు ద్విపద, రగడ, గేయాదికములందేగాక 'కాల సంపుటి" దృష్టిని సంస్కృత వృత్తములందు సైతము ప్రయోగించునపుడు జాపిరి. కోటపురి ధర్మాంగద చరిత్రములో ఉత్పలమాలలో పాద మధ్యమున భగణ స్థానమున నలము వాడబడినది[43]. గేయ గాథలలోని పెక్కుచోట్ల ద్విపదలకు వాడవలసిన ఇంద్రగణములకు బదులు పంచమాత్రాగణములు వాడిబడినవి. మాత్రాగణముల వలన పద్య నిర్మాణము సులభము. మాత్రా గణములలోని సమత కారణముగా లయ స్పష్టమగును. పెక్కు త్ర్యక్షరగణ నిర్మితములగు పద్యములలో సైతము ఈ లయ స్పష్టమగును. పంచచామర, సుగంధి, తరళాదులుత్ర్యస్రగతిలోను, మానిని, తోదక, కవిరాజ విరాచిత, క్రౌంచపదాదులు చతురస్రగతిలోను, పద్మనాభ, మంగళ మహాశ్రీ త్యాదులు ఖండగతిలోను, మత్తకోకిలాదులు మిశ్రగతిలోను నడచును. ఛందో మర్మజ్ఞుడైన బ్రౌన్ పండితుడు ఛందోగ్రంథమున పెక్కు వృత్తములను త్ర్యక్షర గణ పూర్వకముగా గాక గత్యనుసారముగా చెప్పినాడు[44].

| | | |
|---|---|---|
| 1. | 4+3 మాటిమాటికి, పాడుతుండగా<br>మత్త కోకిల, వింటివా | మత్తకోకిల లక్షణము |
| 2. | 5+4 పుష్పేషు జాతీ, పురుషేషు విష్ణూ<br>నారీషురంభా, నగరేషు కాంచీ | ఇంద్ర వజ్ర |
| 3. | 4+4/ నదీషు గంగా, నృపరేషు రామః<br>5+4 కావ్యేషు మాఘః, కవి కాళిదాసః | ఉపేంద్ర వజ్ర |
| 4. | 4+4+4+4 రసమగు నీకవి రాజవి రాజిత<br>రాగము బ్రౌనను రాజొసగిన్ | కవిరాజ<br>రాజితము |

ఇట్లు చెప్పుట వలన వృత్తములకు గేయగుణమబ్బును.

**తాళగణములు :-**

తెలుగులో లాక్షణికులు పేర్కొనకున్నను జానపదగేయములను పరిశీలించినపుడు ఇట్టి గణ నిర్మాణము అవసరమనిపించును. తాళ బద్ధ రచనలని మాత్రము ఆంధ్ర ఛాందసికులు పేర్కొనినారు. పదకర్తలు సైతము ఉపయోగించిన తాళబద్ధ రచనలకు "సంకీర్తన లక్షణకారులు" తాళ గణముల గూర్చి పేర్కొనరైరి. తాళములను మాత్రము అస్పష్టముగా అప్పకవ్యాదులు పేర్కొన్నారు. సంస్కృత లాక్షణికులు తాళ గణములను. మాత్రాగణములను సమానముగా భావించిరి కాబోలు. మాత్రాఛందస్సులగు ఉద్గీత్యాదులను వైతాళీయ వృత్తములని (వితాళ =వివిధములగు తాళ బద్ధములుగ) పేర్కొనిరి. పాదములో మాత్రలు సమానముగా గల మాత్రాగణములు (కాలసంపుటలు) నిండుగా వాడినపుడు వానిని మాత్రాగణములనవలయును. వీనినే మాత్రా ఛందస్సులుగా ప్రాకృత కవులు వాడిరి.

కాని పాదపాదము నందలి మాత్రాగణములు ఒక పాదమందుండి వేరొక్క పాదమున సమానముగా లేనపుడు, సమానముగా లేని పాదమును దీర్ఘీకరించి సమముగా చేయుట గేయ సంప్రదాయమున చూడనగును. అనగా తక్కువైన మాత్రలు నింపబడిన పన్నమాట. ఇట్టి చోట్ల మాత్రలను లెక్కించితిమేని మాత్రలు తక్కువగా ఉండును. పాడినపుడు ప్రతిపాదము ఒకే సమాన కాల సంపుటిగా పాడబడి తాళము కుదురును. ఇట్టిచోట్ల పాదము ఉచ్చారణకు పట్టు కాలమును తాళ గణమని పేర్కొనవచ్చును. ఇది జానపద గీతములందు బహుధా కాననగును.

ప్రాకృత పైంగళము ననుసరించి దోహాలక్షణము **1,3** పాదములందు **13** మాత్రలు; **2,4** పాదములందు **11** మాత్రలు. ఇది మాత్రాగణము ననుసరించి చేసిన లక్షణము హిందీ భాషలో దోహగేయ ఛందముగా తాళగణములలో వాడబడును. వ్రాతలో యిది.

రామనామ మణి దీపధరు **13** మా॥
జీహ దేహరీ ద్వార్ **11** మా॥
తులసీ భీతర్ బాహిరహు **13** మా॥
జో చాహసి ఉజియార్ **11** మా॥

అను రూపములో నుండగా పాటలో మాత్రల లోటు పూరింపబడి పాదమునకు 16 మాత్రల చొ॥న 8 మాత్రల గణములు రెండుగా పాడబడును.

రాము నామ మణి దీప ధరు ఉఉఉ
జగు దేహరీదావ అఆఅఆఅర్
తులసీ భీతర్ బాహిరహూ ఉఉఉ
జో చాహసి ఉజియా అఆఅఆఅర్

ఇక్లే తెలుగులో — శ్రీ రామ భూపాలుడూఅన్న పాటను మాత్రా గణములలో చూచినపుడు 4+4+2 మాత్రలుగాలెక్కింపబడగా తాళ గణములలో చూచినపుడు 4+4+4=12 మాత్రల గణమగును.

ద్రావిడ భాషలలో వృత్త ఛందముల కన్న గేయఛందములకు ప్రాధాన్యత గలది మళయాళము. ఈ భాషలో 5వ శతాబ్దిలో వ్రాయబడిన అతి ప్రాచీన కావ్య మని "రామచరితం" లో తాళగణములు వాడబడినవట.

".... All metres employed in Rama charitam are based on Tala, the lines of stanzas are to be devided in to Tala being dependent on the number of Matras [Movrae] Such Tala ganas are called 'Laya Khandas' by same prosodists. These feet should be kept independent of each other, that is, no long letter should be allowed to represent the last matra of one foot. and the first matra of subsequent foot. The nnmber of syllables within a foot is variable, pro-vided the number of matras remain constant" అని దీనిని గూర్చిఎస్. వి. కృష్ణవారియర్‌గారు వ్రాసినారు[45].

ఆధునిక ఛందో విమర్శకులలో ప్రఖ్యాతులయిన డా॥ కోవెల సంపత్కుమారాచార్యగారు వచన పద్యమును నిర్వచించు సందర్భమున భావగణమన్న వేరొక్క గణమును వాడిరి. పాదము యొక్క కొలబద్దగా భావగణము నెన్నిరి. ఇది అర్థపళమున గల్గు పాద వ్యవస్థ. కాని ఉచ్చారణా కాలమును కొలుచు ఛందశ్శాస్త్ర సంబంధి

గాదు ఛందోరహితమగు వచన కవితను కొలుపుటకు కేవలము ఒక ఖండ మన్న అర్థములో గణ శబ్దము వాడబడినది.

గణ ప్రయోగ శుభాశుభములను, గణ కులవ్యవస్థనాపాదించి పైతము వివరించుటను బట్టి ప్రాచీన ఛాందసికులు గణములకిచ్చిన ప్రాధాన్యము స్పష్టము.

— × —

## అ థ స్సూ చి క లు

1. 'ఆద్యాశ్చే గురవస్త్రియోయదితః షష్ఠ స్తథా వాష్టమః స్యాదేకాదశ. ................ శార్దూలవిక్రీడితమ్"–వృత్తబోధం. 42 శ్లో. గురువుల స్థాన నిర్దేశము చేసి పాదలక్షణము చెప్పినది.
2. విధిర్గణ కృతశ్చైవ, తథావర్ణకృతోఽపివా'–నాట్యశా. xiv-109.
3. ఛందో దర్పణము II-84
4. 'తేషాంఋక్ యత్రార్థేన పాద వ్యవస్థా'–జైమినీయ మీమాంసా (2-1-35) 'వచనపద్యం' పుట 30 (సంపత్కుమార గారుద్ధరించినది.)
5. The variable metres were, I conveive, invented to facilitate composition, even dictionaries of the language have been written in them, such wotks requiring much greater liberty than the uniform metres would allow.

   —C. P. Brown "The prosody of the Telugu and Sanskrit lauguages explained"-P 33
6. ఛందోదర్ప. 1-18
7. 'సూర్య, ఇంద్ర, చంద్ర గణాలు దేశి సాహిత్యానికి అనవసరం" అంటారు గిడుగువారు. తె. చం. రీ. పు. 241 1PP
8. ఈ విషయము (1) చౌపది, (2) అంతరాక్కర, (3) ఎత్తుగీతుల వద్ద ముందు ముందు వివరముగా తెలుపబడును.
9. తె.ఛం.రీ. –గిడుగు వేం. సి. పు. 241

10. కవిజనా సంజ్ఞా. పద్య విభాగము.
11. తె.ఛం.రీ.—గిడుగు పు. 241
12. ఛందో. ద. 1-18
13. కవిజనా. జాత్యధి. } సీస తరోజ్వల
కావ్యా. చూ. 8కి } లకలములు
14. "ఇనసురాధి పేందు గణము లక్షరోపకరణంబులు...." కావ్యాలంకార చూడామణి 8-52.
"రవీంద్ర చంద్రాఖ్యములై చను నక్కర జాతులల్లెన్"-కవిజనాశ్రయము-జాత్యధికారలు-అక్కరలు
15. అధిష్టాత అనగా గణముల వర్గీకరణలోని బ్రహ్మాదులకని ఉద్దేశించితిని. ఛందశ్శాస్త్రములు చెప్పిన గణాధిదేవతలు గారు.
16. ఛందోఽను శాసనము VII-20
17. ప్రాజ్నన్నయ అగము- డా॥ దివాకర్ల వేంకటావధాని పు. 345
18. భారతి-అక్టోబర్ 1924 సంచిక
19. 1) "పాయక శ్రుతి రసాన్వక్తస్య జహ్వేగ్రేయని" } బసవపురాణములో
2) "అంధక కరిదైత్య వ్యాఘ్రబాలజ" } గణభంగములనిభావించినవి
20. 'మాత్రాచ్ఛందస్సులు - గిడుగు సప్తతితమ జయంత్యుత్సవ సంచిక-వ్యాససంగ్రహము'- తెలికిచర్ల వేం. రత్నముసంపా.
21. ప్రాజ్నన్నయ యుగపు శాసన ఛందస్సులు-పు. 129 (అముద్రిత సిద్ధాంత గ్రంథము)
22. వృత్తజాతి సముచ్చయః - విరహాంక కృతమ్. P 121, 122
23. దాక్షిణాత్య దేశి ఛందోరీతులు - తులనాత్మక పరిశీలనము. పు. 114 (అముద్రిత సిద్ధాంత గ్రంథము)
24. అప్పకవీయము. IV-143 (వావిళ్ళ ప్ర. 1970) ప్ర. 205
25. 'తెలుగు కన్నడ ఛందోరీతులు - ఏకత్వములో భిన్నత్వము'-సంపత్కుమార భారతి, జనవరి 1975) (సం, 52, సం. 1)
26. దేశీయ గణములు-లాక్షణిక మత భేదము' సాహితి నవం. 1963

27. తెలుగు ఛందోగుణాలు-(తెలుగు ఛందస్సు అన్న వ్యాసములో) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పు. 42
28. 'The Telugu literature out side the Telugu country' కోరా. రా. కృ.
29. 'A history of Malayalam metre' - N. V. Krishna warrior (Praface)
30. యక్షగాన వాఙ్మయ చరిత్ర. పు. 68
31. వృత్త రత్నావళి - వెంకటేశకృతమ్. C. Kunhan Raja's Foreword
32. ప్రాఙ్నన్నయ యుగము-నన్నయకు పూర్వము ఛందస్సు. పు. 313, 314
33. కవిజనాశ్రయము-దోషాధికారము-కాకు దోషము
34. లక్షణ శిరోమణి-పు. 202
35. మాత్రాఛందస్సులు-చిలు. నారా. రావు.
36. లక్షణ శిరోమణి-పు, 42. రావూరి దొరస్వామిశర్మ పీఠిక
37. "కరమొప్ప పంచలఘుగణ 'చతుష్టయముచే" (ద్విరదగతిలక్షణము అప్ప. IV 484) అనగా పంచమాత్రాగణమన్నమాట. అట్లే "నరహరి పదియు నాలుగులఘులు" (హరిణగతి రగడలక్షణము అప్ప IV 488) అనగా 14 మాత్రలు పాదమునకన్నమాట. అట్లే "ఇరువది యెనిమిది లఘువులు" (వృషభ గతి లక్షణములు అప్ప. IV 489) అనగా 28 మాత్రలన్నమాట.
38. ఆధునికులలో P. రాజగోపాలనాయుడుగారు 'పాటలలో ఛందస్సులు' అన్న గ్రంథములో వీనిని వివరించిరి.
39. వసుచరిత్ర-సంగీత సాహిత్యములు- సాహి. అకా. ప్ర. XI పు. 10
40. సమీక్షణం-మాత్రాఛందస్సులన్న వ్యాసములో పు. 73
41. ఛందోఽనుశాసనము-I —3వ సూత్రమ్
42. వృత్తజాతి సముచ్చయ - I-'8, 19
43. యక్షగాన వాఙ్మయ చరిత్ర - డా॥ యస్వీ జోగారావుగారు
44. ఆంధ్ర గీర్వాణ ఛందము - బం. గో. రె. సంపా.
45. A history of Malayajam metre. P. 56.

## III. పా ద ము :-

వేదమునకు చందస్సు పాదములుగా భావింపబడినది. నడక చూప గల్గు నది కనుక పాదమన్న శబ్దము సార్థకము. పాదమునకు భాగమన్న అర్థమున్నది. సిద్ధాంత కౌముదిలోని అధ్యాయములు పాదములుగా విభజింపబడినవి. వృత్తమునకు గల సంపూర్ణ దైర్ఘ్యము కూడ ఇట్లే పాదములుగ భాగించబడినదని భావింపవచ్చును. జానపద గీతములందు శ్వాస విగించి నీకటిగిని పాడగల పదముల సమూహమును పాదముగా గుర్తించవచ్చును ఏమాత్రము పాదముయొక్క ఉచ్చారణ కాలవ్యవధి మారకుండ ఇట్టివే పాదములు పేర్చగా గీతమగును. నస్తన జంతువులకు గమనము నకు గల చతుష్పాద వ్యవస్థయే పద్యము యొక్క గమన సంబంధముగా చతుష్పాద వ్యవహారమునకు ప్రేరణమైయుండి యుండును.

జయకీర్తి తన ఛందోను శాసనమున "పాదో ఒక్షర మాత్రానియ మోదిత పిండః" అని నిర్వచించినాడు[1]. నియమితాక్షరములు లేక నియమిత మాత్రలచేత నిష్పన్నమయిన పిండము పాదము. కాలసంపుటి గణముకాగా అక్షర లేదా పద సంపుటి పాదమనవచ్చును. పిండ శబ్ద మచ్చట నొక సంపుటిగా ఉపయోగించ బడినది.

"తేషాంఋక్ యత్రార్థవశేన పాద వ్యవస్థా"యని జైమినీయ మీమాంసా సూత్రము[2]. అర్థవశమున పాద వ్యవస్థ నిర్ణయింపబడినది. కాని ఇదీ వృత్తము లోని పాద వ్యవస్థకు సరియగు నిర్వచనముకాదు. వృత్తమందలి పాదము కాల ప్రమాణమును తెలియజెప్పును.

కిట్టెల్ పండితుడు పాదము చతుర్థ భాగము (Quarter) అ ని నా డు[3]. నాలుగు పాదములున్న పద్యములో పాదము చతుర్థాంశమే యగును. కాని తెలుగు లోని దేశిచ్ఛందస్సులలో పాద సంఖ్యా నియమము వృత్తముల వలె నియతముకాదు. జానపద గీతములు ఏకపాద నిర్మాణ రూపములు. ద్విపద ద్విపాదయుతము, త్రిపద, పంచపద, షట్పది అని అన్ని పాదముల సంఖ్య కానవగును. "తెలుగు కవిత యేక పదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదమై పరిణతి చెందినట్లు కానవచ్చు చున్నది. ఏక పదములగు పాటలను, ద్విపదములగు ప్రబంధములును, త్రిపదాది సంయుక్తములై సంపూర్ణ గాన యోగ్యములగు యక్షగానములును, సలక్షణ చతు ష్పాద వృత్త కవితా సమన్వితములగు భారతాది గ్రంథములును, వాఙ్మయ వీధిని

ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, షష్టములని" శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తెలుగు కవితా పరిణామ స్వరూపమును పాద వ్యవస్థను బట్టి నిర్ణయించిరి[4]. కోరాడ రామకృష్ణయ్యగారును అనేక పాదముల పద్యముచే ముందుండినవని పిదపనే చతుష్పాద వ్యవస్థ వచ్చి యుండునని భావించినారు.

"Desi Metres of the south Indian languages including Tamil, are generally of two line or three line formations and can be carried on to any length .... Regular four lined metres seem to be a very late features in Tamil as also in other Indian languages."

— Annals of Oriental Research Centenary number

Madras University.

పాదముల సంఖ్యను బట్టియు పద్యములకు పేర్లుంచుట దేశి ఛందస్సుల ప్రత్యేకలక్షణము. రెండు పాదములున్నందుకు ద్విపదమైనపుడు, మూడు ఆరు పాదములు ఉన్నందున త్రిపద, షట్పద ఐనట్లే చతుష్పద నాలుగు పాదము లున్నందున పేరు పెట్టబడినది. తక్కిన వృత్తములలో నాల్గు పాదములేమైన పుడు దీనికి ప్రత్యేకముగా నాల్గు పాదములని తెల్పు పేరు పెట్టబడుటకు కారణము, ఇది దేశీయ ఛందమై, మార్గ వృత్తములలో కలయక ప్రత్యేక ప్రతిపత్తి కల్గియున్న దన్న భావనయే ఐయుండును. దీనిని బట్టి ఒక ప్రక్క వృత్తములుండగా దేశీయ గేయ సాహిత్యము నుండి వీనిని పండితులు ఏర్పరచి ఉందురని చెప్పవచ్చును.

గేయములందు పాదవ్యవస్థ సంఖ్యా నియమముతో ఉండదు. గేయము సంపూర్ణమగు వరకు ఎన్ని పాదములు అవసరమున్న అన్ని వ్రాయబడును. ఈ అసంఖ్యాకత్వమే వృత్తముతో సైతము చతుష్పాద వ్యవస్థను మించిఅధిక సంఖ్యలో పాదములు వ్రాయుటకు ప్రేరక మైయుండును. ఇట్టి అధిక సంఖ్యాక పాద వ్యవస్థ కల పద్యములు 'మాలికా' పేరుతో చెప్పబడును. సీస మాలిక వ్రాయునపుడు మాలిక ముందే వ్రాయబడి ఆఖరుననే పైన అటవెలది లేక తేటగీతి వ్రాయబడును. దీనిని బట్టి సీసములో 'పై గీతిని' అంతర్భాగముగా భావించుటలేదని చెప్పవచ్చును. ఉత్పల చంపక మాలికలు కన్పట్టినట్లు శార్దూల, మత్తేభాది వృత్తములు మాలికా రూపమున (4 కన్న ఎక్కువ పాదములతో) సామాన్యముగా తెలుగులో కన్పట్టుటలేదు. జంతువు

నకు గల చతుష్పాదత్వములోని ఔచిత్యము ఈ నియమమునకు కారణము కావచ్చును.

గేయ సంఖ్యలోని పాదనియమము "మాలికా" పద్యములకు ప్రేరణమైనట్లే మార్గ (సంస్కృత) వృత్తముల చతుష్పాద వ్యవస్థ తరువోజ (ద్విపదకు రెట్టింపు) అక్కరల జననమునకు కారణమై యుండును. "సంస్కృతమున వృత్తములన్నియు చతుష్పాదములేయగుటచే వానిని చూచి దేశభాషా కవులు కూడ దేశీయ పద్యములను నాల్గు పాదములు గల వానినిగ వ్రాయజొచ్చిరి. మధ్యాక్కర, తరువోజ మొదలగు పద్యములు చతుష్పాదములుగా స్థిరపడుటకు ఈ సంస్కృత ప్రభావమే కారణము" అని దివాకర్ల వేంకటావధానిగారును పై యభిప్రాయమే తెలిపిరి[5]. ద్విపద, రగడ, వంటి పద్యములలోని అనియత పాద వ్యవస్థ, జానపద గీతములతో వీనికి గల అభేదత్వమును స్థిరపరుప జాలియున్నవి. సాధారణముగా ఇట్టి పద్యములలోని పాద సంఖ్య అనియతమైనను సరి సంఖ్యలో నుండును. ద్విపదలలోని ఆదిప్రాస, రగడల లోని అంత్యప్రాస ఈ జంటలను స్పష్టపరుప జాలియున్నది.

దేశి పద్యములందు పాదమునకు గల అక్షరసంఖ్య సాధారణముగ స్వల్పముగనే యుండును. సూర్యేంద్ర చంద్ర గణములలోని బహ్వక్షరగణములు ప్రయత్న పూర్వకముగా వాడితే తప్ప పాద దైర్ఘ్యత కానరాదు అధిక గణములు గల మహాక్కర ఉపయోగములేనిది. సీసము రెండర్థములుగ విడగొట్టబడి ఉచ్చారణ శ్రమను లేకుండ జేసినది. ఒక్క ఉద్ధుర మాలా వృత్తములు మాత్రము దేశి ఛందములలో దీర్ఘ పాదములు గలఛందములు. మూల ఛందములకు ద్విగుణీకృతము లగు రగడల వలెనె ఇవియును ద్విగుణీ కృత రూపములలోనే భాసించుచున్నవి. మంగళ మహాశ్రీ వంటి దీర్ఘ పాద వృత్తములు సైతము క్వాచిత్క ప్రయుక్తములే. దేశివలె సంస్కృత వృత్తములును 16-21 అక్షరముల మధ్యగలవే ప్రయోగములో నున్నవి.

తెలుగులో పాదాంత యతి నియతము కాదు. దీని వలన పాదస్వరూపము స్పష్టముగా తెలియదు. సంస్కృతమున పాదాంతయతి నియతము. అదియును విరామ (పదసమాప్తి) రూపము. కనుక పాదమునకు ఛందస్సు నియమించిన లతతో సుస్పష్టము కాగలదు.

కూజంతం రామ రామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖం
వందే వాల్మీకి కోకిలం

పై శ్లోకమును పఠించునపుడు పాద ప్రమాణము, పఠితృ పరముగను శ్రోతృ పరముగను చక్కగా తెలియును. ఒకవేళ శ్లోకము అనుష్టుప్పు వంటి చిన్న వృత్తముగాక పెద్దదియైనపుడు సంస్కృత యతి (విచ్ఛేద రూపము) పద్య పాదము విభజించి పఠితకు శ్రమను కల్గింపక, శ్రవణ పేయతను సాధింపగల్గును.

శా. వేదాంతేషు యమాహు రేక పురుషం — వ్యాప్యస్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్య విషయః — శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షి భిర్నియమిత - ప్రాణాదిభిర్మృగ్యతే
సస్థాణు స్థిరభక్తి యోగ సులభో - నిశ్శ్రేయ సాయాస్తువః

—విక్రమోర్వశీయ నాటకము

పై శార్దూల మందలి పాద దైర్ఘ్యమును 12 అక్షరముల పిదప గల విశ్రాంతి స్థానము ద్విధాఖండ మొనర్పజాలి పఠితకు శ్రమ లేకుండ చేయును. నాల్గు పాదములందును '12,7,' - '12,7' - '12,7' ఇట్లు రెండేసి భాగములుగ సమ భారమై చక్కని లయను, తద్వారా పాద వ్యవస్థను చక్కగా వ్యక్తీకరింపజాలి యుండును. తెలుగులో యిట్టి పాదాంత విశ్రాంతి కాని, యతి విచ్ఛేదన రూపమున గాని లేక, యతి యొక్క ప్రయోజనముతో బాటు పాద వ్యవస్థయు దెబ్బ తినును. పాదాంత శబ్దము తర్వాతి పాదములోనికి చొచ్చుకొని వచ్చుట తెలుగులో నున్నది. ఇట్టి దాని వలన అర్థము చెడునని పఠిత కలిపి చదివి రెండు పాదములను కల్పి ముడివేయును. ఇట్లు పాదాంతయతి లేక నాల్గు పాదములు చేంతాడువలె ఒకే దీర్ఘ రూపమును పొంది పాద వ్యవస్థను తద్వారా పద్య (ఛందో) వ్యవస్థను భంగ మొనర్చును. ఉదాహరణమునకు చంపక మాలా పద్యమునకు నజభజ జజర అన్న గణములని శాస్త్రము చెప్పగా కవి తన ప్రయోగములో పాదాంత రగణము పిదప విశ్రాంతి నీయక రగణములోని పదము, తర్వాతి పాదమునందలి నగణములోనికి చొప్పించగా, అర్థ భంగ భయముచే పఠిత పాదాంతమున ఆపక చదువును. పాద మెక్కడికి అంతమైనదో పఠనమున తెలియరాదు. లేఖనమున మాత్రమే తెలియును.

ప్రాసాక్షరమును బట్టి తెలుగులో పాదావృత్తి తెలియవీలున్నది. కాని అది విషమాక్షర మైనప్పుడే పఠనములో పాద సమాప్తి ఐనట్లు తెలియనగును. సుకర (సాధారణా క్షరములచే ఘటితమైన) ప్రాస యున్నప్పుడు ఆ మాత్రమైనను తెలియదు. పాదాంత మున పద సమాప్తి (word) జరిగి — తర్వాతి పాదమున కొత్త పదముతో ప్రారంభించినపుడే పాద ప్రమాణము సువ్యక్తమగునని పిండితార్థము ఈ రీతిన తెలుగులో పాద ప్రమాణము నుల్లంఘించిన పట్టులు పెక్కులు కానపచ్చును. దేశి ఛందములందు ఈ ఉల్లంఘనము తక్కువగా కన్పట్టును.

యతి స్థానమునను, పాదాంతమునను విచ్ఛేదము లేక ఒకే పదము పూర్వోత్తర స్థలములందు నిలిచే పాదప్రమాణ భంగమునకి క్రింది పద్య ముదాహర ణీయము.

తే. గీ. ఒంటెకును సుందరత గేదె — కొదలి శుభ్ర
— త మసిడికి దీప్తి కపికిణి — త్తస్థిరత పె
— లుతురునకు బర్హి కవికిగ — లుములు గులట
కును గృతజ్ఞత యాకాశ — కుసుమ మటుల.[6]

తెలుగులో [దేశి చ్ఛందములలో] పాదాంత యతి తోడి పాద ప్రమాణమును చక్కగా వ్యక్తీకరింపగల్గిన వారిలో శతకకవులు అగ్రగణ్యులు.

తెలుగులో పద్యపఠన మొక కళగా అభివృద్ధి చెందినట్లు పలువురు చెప్పుదురు. రామరాజ భూషణుడు తాను ప్రబంధ పఠనా రచనా దురంధరుడనని చెప్పికొన్నాడు. పద్య పఠనము నాటకములందు ఛందో మౌలికతను వీడి రాగ, హావ, భావ ప్రకటనైక ప్రయోజనముగా మారినది. పాదములుగ విభజింపబడి పఠింపవలసిన పద్యము ఛందో జన్యమైన గమనమును వదిలివేసినది. జైమినీయ మీమాంసా సూత్రము "అర్థవశేన పాద వ్యవస్థా" యన్నట్లు అర్థవశమున విభజింప బడి పఠింపబడును.

ప్రతి పద్యపాదము పాదాంత విరామమున్నప్పుడు పాదాంతము గుర్వంతమగుచున్న శ్రవణ సుభగమగును. లఘ్వంతమైనపుడు దీర్ఘీకరింపబడును. ఇది గేయ రచనలలో అనివార్య లక్షణము. మార్గ ఛందములలో షడ్వింశతి ఛందో జాతములగు 13, 42, 17, 726 వృత్తములలో సగము లఘ్వంతములు, సగము గుర్వంతములే. తెలుగులో గుర్వంత పద్యములే ప్రచురములు. లాక్షణికులు నైతము

వానినే వివరించిరి. లక్షణ శిరోమణికారుడు మాత్రమొక్క లఘ్వంత పాదములు గల వృత్తమును పేర్కొనినాడు[7]. పాదాంత విశ్రాంతి తెలుగులో ఉల్లంఘింపబడుట వలన పద్యాంత గురుత్వమును గూర్చి మాత్రమే విమర్శకులు విమర్శించిరి. "పద్యము గుర్వంతము కావలెనన్న నియమము తెలుగునందు సంస్కృత ప్రభావము చేతనే కలిగినది" యని సంపత్కుమారగారు భావించినారు.[8] కాని గేయ సంప్రదాయము నుండి కూడ వచ్చుటకు అవకాశమున్నది. ప్రతి పాదాంతమున విశ్రాంతి ఉన్నప్పుడు పఠిత తప్పక ఆ పాదాంత విశ్రాంతిలో అంత్యాక్షరమును దీర్ఘీకరించును. అవశ్య దీర్ఘీకరణమును తెలిసిన కవులు గురు ంతాక్షర ముంచవలసిన పాదములందు లఘువునే యుంచి గణభంగ దోషమునకు వెరవరైరి. కాళిదాసుని మేఘ సందేశ కావ్యమందలి శ్లోకము (1-1) (చివర లఘువులే వాడుట) ఉదాహరణీయము[9]. దేశ్య ఛందములందు అర్ధమునకైనను నియత గుర్వంత లక్షణమున్నది కంద పద్యమొక్కటే. పెక్కు దేశ్య ఛందములు సూర్యగణాంతములగుట సూర్య గణములు రెండును లఘ్వంతము లగుటవలన ఈ నియమము [గుర్వంతత్వము] తెలుగులో లాక్షణికముగా లేదు. కాని వ్యావహారికముగా ఈ నియమమున్నట్లే తోచును.

సీ॥ పండినా ఊళ్ళకే ప్రభువులంతా
మధ్యా॥ అంగన సీతను గూడీ
ద్విపద॥ వీరభద్రా రెడ్డి విచ్చేసె నమ్మా
ఆ॥వె॥ విశ్వదాభిరామ వినురవేమా వంటివి ఇందుల కుదాహృతులు.

పాదాంత లేక పద్యాంత దీర్ఘకృత పఠనము గేయ సంప్రదాయము యొక్క భిక్షయనుట లెస్స. గేయ సంప్రదాయమునకు చెందిన ద్విపదలోని పాదాంత [సూర్య గణము] 'గగ' ప్రయోగము గణభంగ దోషముగా పండితులు [బసవపురాణ, పల్నాటి వీరచరిత వంటి గ్రంథములలో] భావించుట ఈ దృష్టితో పరిహరించ వచ్చును.

పాదమునకు లాక్షణికులు చెప్పిన గణములను బట్టి పాదప్రమాణము తెలియును. మార్గవృత్తములందు గణ నిర్దేశము నియతమై నియతాక్షర సంఖ్య, పాద ప్రమాణమును తెల్పును, దేశి ఛందములందు మాత్రము పాదప్రమాణము నియతము కాకుండును. అన్నిగుర్వక్షరములే కల గణములు వాడినప్పుడు స్వల్పాక్షర

సంఖ్య గల్గి, అన్ని లఘ్వక్షరములే వాడినపుడు అధికాక్షర బద్ధమై పాదముండును. ఉదాహరణమునకు చంపకమాల వృత్తమునకు న, జ, భ, జ, జ, జ, ర అన్న గణములు పాద ప్రమాణమని శాస్త్రము. 21 అక్షరములు నియతముగా యుండును. సీస పాదమును తీసికొందుమేని 6 ఇంద్ర గణములు + 2 సూర్యగణములు గలది గనుక త్ర్యక్షర ఇంద్ర గ ణ ము లు, ద్వక్షర సూర్యగణములు (హ)లు వాడినచో $6\times3=18) + (2\times2=4)=22$ అక్షరములు కనిష్ఠ సంఖ్య పాద ప్రమాణమగును. ఇంద్ర గణములు 4 అక్షరములని, సూర్యగణములు 3 అక్షరములని (న) వాడినచో $(6\times4=24) + (2\times3=6)=30$ అక్షరములు గరిష్ట సంఖ్యగా గల పాద ప్రమాణమగును. మాత్రా ప్రమాణము తీసికున్నప్పుడు $[6\times5+2\times3]=36$ మాత్రలు గరిష్ఠ ప్రమాణముగను$(6\times4)+(2\times3)=30$మాత్రల కనిష్ఠ ప్రమాణము సీసపాదము నందుండ వీలుండును. ఇంత విశిష్టమైన భిన్నమైన పాద ప్రమాణము వల్లనే సంస్కృత లాక్షణికులకు దేశ్య పదములను గూర్చి పాద ప్రమాణము చెప్పునపుడు సంకుచితత్వము నాపాదించినారని డా॥ దివాకర్ల వేంకటావధాని గారనిరి[10]. పాద ప్రమాణములో ఇంత వైలక్షణ్యము సంతరించుకొనిన దేశి ఛందములు షడ్వింశతి ఛందోజాతములుగ కృతక పాద నిర్మాణముగల సంస్కృత వృత్త నిర్మాణము నుండి మిక్కిలి భిన్నములయ్యును పండితుల దృష్టిలో సంస్కృత వృత్తములలో అంతర్లీనములే యని భావింపబడినది.

"ఈ మార్గ మహావలయాన్ని ఛేదించి బయటపడి, యే దేశీయచ్ఛందమైనా తన స్వతంత్ర ప్రతిపత్తిని నిలుపుకోవడం యే పరిస్థితుల్లోనూ సాధ్యమయ్యే పనికాదు. అంటే అనంతకోటి సంస్కృతమార్గ ఛందోరీతుల్లో యే దేశీయ ఛందమైనా అంతర్లీనమై తీరక తప్పదన్నమాట" అని వడ్లమూడి గోపాలకృష్ణగారి యభిప్రాయము ఇట్టిదే[11].

మాత్రా సమకగుణ నిర్మితమైన కందమునందు అర్ధమునకు 32 మాత్రల ప్రమాణము కాగా అక్షర సంఖ్య మాత్రము కనిష్ఠ ప్రమాణములో కుఱుచ పాదమునకు 6, నిడుదపాదమునకు 11 అక్షరములు, గరిష్ఠ ప్రమాణములో కుఱుచ పాదమునకు 12, దీర్ఘ పాదమునకు 19 అక్షరములుండును. వీటినే లాక్షణికులు కుఱుచ కందమని, నిడుపకందమని వివరించిరి[12]. లేఖనము నందు మాత్రము పొట్టి పొడవులుగా కన్పించు ఈ కందపాదములు ఉచ్చారణా కాల విషయమున మాత్రము (మాత్రా సమత కారణముగా) సమభారమునే కల్గియుండును.

— x —

# అ థ స్సూ చి క లు

1. జయకీర్తి ఛందోఽనుశాసనము I-25
2. జైమి మీ.సూ. 2-1-35
3. ఛందోఽంబుధి - నాగవర్మ కిట్టెల్ సం. పు. 67, 'పాదశ్చతుర్భాగః' పింగళుడు 4-10
4. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర - పు. 3
5. ప్రాఙ్నన్నయ యుగము - పు. 316, 317
6. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిదని గిడుగు వేం. సీ. గారుదాహరించిరి. తెలు. ఛంరీ. పు. 175
7. రతి విలసిత వృత్తము (ర న జన ననగల) [పు. 42 - లక్షణ శిరోమణి]
8. తెలుగు ఛందో వికాసము పుట 43
9. యక్షశ్చక్రే జనకతనయా స్నానపుణ్యోదకేషు - కేషూ అని చదివితేనే గణము కలియును.
10. ప్రాఙ్నన్నయ యుగము - పు. 314, 315
11. (a) ఇందుమతీ పరిణయము. తొలిపలుకు పు. XVI
    (b) జానుతెనుగు - పు. 148
12. లక్షణ శిరోమణి - వృత్తాధికారము పద్య. నం. 294.



## IV. వృత్తము :

"గాయత్ర్యాద్యే ఛందసి వర్తతే ఇతి వృత్తం" అని నాట్య శాస్త్రమునకు హలాయుధ వ్యాఖ్య. గాయత్రీ మొదలగు ఛందములందు వర్తించునవి వృత్తములు. "గురు లఘు నివేశ నియమేన శ్రవ్యతావర్తతే యేషుతాని వృత్తాని" యని అభినవగుప్తుడు నిర్వచించెను. గురు లఘు నివేశనియమములలో శ్రవ్యముగా వర్తించునవి వృత్తము లనినాడు. పాదముల సమతౌల్యము వలన శ్రావ్యముగా ఉండునది వృత్తమని అతని యభిప్రాయమై ఉండును. భరతముని ఛందశ్శాస్త్రము నందలి వృత్తములకు చక్కని నిర్వచనమిచ్చెను. "పాదైర్వర్ణ విభూషితైః చతుర్భిస్తు భవేద్యుక్తం, ఛందోవృత్తాభి ధానవత్త"ని అనగా పాదములందలి వివిధాక్షరముల (హ్రస్వదీర్ఘప్లుత) తో భూషి తములై నాలుగు పాదములు కల్గినది ఛందోవృత్తమనబడును. [1]

చతుష్పాద వ్యవస్థకల్గిన వానికి తెలుగులో సామాన్య నామమున్నను సంస్కృతమునకంటె భిన్నమైన యతి, ప్రాసలు పద్యాంత గురుత్వము అన్నవి అదనపు లక్షణములు. సంస్కృతవృత్త మర్యాదనుబట్టి తెలుగులో ఉత్సాహముతో బాటు, అక్కరలు, తరువోజలు వృత్తరూపమునే సంతరించుకొన్నవి. కాని ఉత్సాహ మును తప్ప తక్కిన వానిని వృత్త నామముతో సూచించబడుటలేదు. ఇకసీసాదులకు వృత్తమన్న అభిధానమే ఉండదు.

సంస్కృతములో శ్లోకమన్నది సాధారణ వృత్తవాచి. తెలుగులో పద్యము. పద్యము వృత్తము జాతి, ఉపజాతి భేదములచే నొప్పును. వృత్తము సంస్కృతము నుండి రాగా, జాత్యుప జాతులు దేశీయములై సంస్కృత భిన్నములై స్వతంత్రము లగుటచే వీనికి వృత్తమన్న వ్యవహారమే లేదు. తెలుగు చాంధసికులు సైతము వీనిని వృత్తములలో కలుపక ప్రత్యేక భేదముగా పేర్కొనిరి. కాని యతిప్రాసలు, చతుష్పాదవ్యవస్థ సమానమగుటచే వీనికి వృత్తమన్న వ్యవహార నామము లేకున్నను వానితో సమానముగా పరిగణనము కలదు.

సంస్కృతమున వృత్తములకు సమ, విషమ, అర్ధసమమన్న భేదము కలదు. ఒకే లక్షణము (గురు లఘు నివేశ నియమము) సర్వపాదములకు సమాన మైనపుడు సమమని 4 పాదములలో ఏవేని 2 పాదములకొక్క నియమము, తక్కిన రెండు పాదములకొక్క నియమమున్న అర్ధసమము, అర్ధమైనను సమాన లక్షణము లేక, భిన్నమైన విషమవృత్తమని లక్షణము. కాగా లక్షణము వివరించినను లక్ష్యము

లందు అర్ధసమ, విషమ వృత్తములు మృగ్యములు తెలుగులో సైతము మార్గి ఛందములందు ఇది మృగ్యమయ్యును దేశిచ్ఛందములందు కానవచ్చుచున్నది.

4 పాదముల వృత్తములోని అర్ధసమలక్షణము 1=2, 3=4 పాదముల సామ్యముచేగాని 1=3, 2=4 సామ్యముచేగాని 1=4, 2=3 సామ్యముచేకాని అర్ధసమము కాదగును. కాని తెలుగులో లాక్షణికులు ఇన్ని లక్షణములను చెప్పలేదు. అనంత, పెద్దనాదులు 1=3, 2=4 సామ్యమును అంగీకరించినారు. దీని ప్రకారము కందము, ఆటవెలది అర్ధసమములన చెల్లును. ప్రగీతి ఆటవెలదుల లక్షణమొక్కటే అగుటచే వీనిని సైతము చేర్చుకొనవచ్చును. వీనిలో 1వ-3వ పాదముల, 2వ-4వ పాదముల లక్షణము సమానము.

6 పాదముల పద్యమైన షట్పదములో సైతము మొదటి మూడు పాదముల లక్షణము తర్వాతి 3 పాదములకుండును. ఇదియును ఒక విధముగా అర్ధసమమే కాగలదు. 1, 2, 4, 5 పాదముల లక్షణ మొక్కటీరుగను, 3,6 పాదముల లక్షణ మొక్కటీరుగను షట్పదిలో ఉండును. విశేషమేమనగా ఈ అర్ధసమములను కంఠోక్తిగా తెలుగులో ఛందోలాక్షణికులు చెప్పకున్నను, లక్షణ నిర్దేశమున మాత్రము సమవృత్తమునకొక్క పాదమునకు లక్షణము చెప్పి తక్కిన నాలుగు పాదముల కిట్లేయని వివరించిన విధముననే కందము, ఆటవెలది, ప్రగీతి, షట్పదులందు సైతము ఒక్క అర్ధమునకు లక్షణము చెప్పి తక్కిన అర్ధమున కిట్లేయని వివరించినారు. అనగావారును వీనిని అర్ధసమములని భావించిరనియే నిశ్చయము [2].

విషమ వృత్తము అనగా 4 పాదములలో అర్ధమునకుగాని, మొత్తము నకుగాని సమాన లక్షణములేనిది. తెలుగులో 4 పాదములకు ఇట్టి వ్యవస్థ లేకున్నను, 3 పాదముల త్రిపదాఛందమునకుగల లక్షణమును పరిశీలించినపుడు ఇది విషమవృత్తము కాక తప్పదు.

ఇం+ఇం+ఇం+ఇం — 1 వ పాదం
ఇం+సూ+ఇం — 2 ”
ఇం+ఇం+సూ — 3 ” గా సూర్యేంద్రగణముల వరుస సమానముగా లేదు. పాదమునకొక లక్షణమున్నది.

తెలుగులో ఒక పద్యముపై మరొక్క పద్యము చెప్పి దానిని సమిష్టిగా ఒక ప్రత్యేక పద్యముగా గుర్తించుటన్నది కలదు. సీసపాదములు నాల్గింటిపై

ఆటవెలది లేక తేటగీతినిచెప్పి మొత్తమునుకల్పి సీసపద్యమనుట, అట్లే ఉత్సాహ వృత్తముపై ఆ.వె. లేక తేటగీతి చెప్పి దీనిని కూడా (విషమ) సీసమనుట విశేషము. ఈ పద్ధతి ప్రాకృతమునందునుగలదు. 3

సంస్కృత వృత్తములవలె తెలుగులో దేశిపద్యములకు పాదసంఖ్యా నియమములేదు. చతుష్పాద వ్యవస్థఉండి, ఒక సంపూర్ణ భావమును బోధింపజాలి ముగియు పద్యము వృత్తము. ఏకపాదమైన రగడ, ద్విపాదములకే వృత్తము (పూర్ణత్వము) చూపగల్గిన ద్విపద. భావపూరకములై అసంఖ్యాకములగు పాదములుగా సాగిపోవునేకాని చతుష్పాద పద్యమువలె ముగియదు 4. జానపదగేయములు మాతృక లైన వీనియందు వృత్త వ్యవస్థ లేదని అర్థము. నాల్గు పాదములందే ఏక లక్షణము అవృత్తమై భావము పూర్ణమగుట మార్గి లక్షణముకాగా 2,3,4,6 వంటి సంఖ్యలో పాదములుండి (సీసమున కెనిమిది పాదములలో భావసమాప్తి కావించవచ్చును) నట్టి ఈ దేశీ ఛందములలో వృత్తవ్యవస్థ లేదనియే అర్థము.

తెలుగులో రసవ్యంజనమునకు, పూర్ణభావప్రకటనమునకు వృత్తనియమము స్వేచ్ఛగలిగియున్నది. సంస్కృతమునందలి కావ్యములలో సర్గ అంతయు ఒకే వృత్తము ప్రయుక్తమై "సర్గాంతే భిన్నవృత్తతా" అన్న నియమము చొప్పున చివరమాత్రము వేరొక వృత్తము ఉపయోగింపబడగా తెలుగులో అట్లుగాక రస వ్యంజనమునకు, భావప్రకటనా దైర్ఘ్యమునకు సరిపడు వృత్తములు ఒకే ఘట్టమున భిన్న భిన్నముగా స్వేచ్ఛగా వాడుకొనవచ్చును. దేశ్య సంస్కృత వృత్తములను కలబోసి వ్రాయవచ్చును.

వృత్తములకు షడ్వింశతి ఛందోజాతములకు వివిధములైన పేర్లు, గమనమును బట్టియో, లాక్షణికుని అభినివేశమును బట్టియో, పర్యాయ స్త్రీనామమును బట్టియో ఉంచబడినవి. తెలుగులో అట్లుగాకపద్యనామములు చారిత్రక నేపథ్యమునో, పాదవ్యవస్థనో చెప్పగల్గునట్లున్నవి. కంద, సీసములనెడి పేర్లు స్కంధక, శీర్షక శబ్దభవములుగా ఊహింపబడుచున్నవి 5. ద్విపద, త్రిపదాదులు పాదసంఖ్యా సూచకములు. ఆటవెలది తేటగీతి వంటివి గమనము లేక గేయమాధుర్యమును సూచించుపేర్లు. ఈ పద్యములలో ఆయా పద్యనామముల నుంచుట లేక పద్య నామము యొక్క అర్థమును దెల్పుభావమును ఆ పద్యముననే వర్ణించిన ముద్రా లంకారమందురు. అనగా ఉత్సాహ వృత్తమున ఉత్సాహశబ్దము వచ్చుట లేక ఇతి వృత్త మందలి పాత్రల ఉత్సాహమును వర్ణించుట ఇట్టిది. ఇట్టి పద్ధతికి నన్నెచోడుడు

విరివిగా ప్రచారమునిచ్చినాడు. పాలుకురికి సోమనాథుడు ద్విపదయొక్క ప్రాశస్త్య్ర మును గూర్చి వివరించినప్పుడును, అప్పకవి ఆటవెలది, తేటగీతుల చెప్పినప్పుడును సార్ధకముగా ముద్రాలంకార స్ఫూర్తి నిచ్చినారు. ఈ విధానములో చిత్రకవితా విధానమున్నను. వృత్తములు లేదా పద్యములను గమన సౌందర్యమును వ్యంజించుచు వాడుకొనుట ముఖ్యము. ఛందోమర్మజ్ఞుడైన కవికి మాత్రమే వృత్తములతో లయ విన్యాసము చేయించుట సాధ్యము.

—×—

## అ థ సూ్చి క లు

1. నాట్యశాస్త్రము XIV - 41
2. కవి సంశయ విచ్ఛేదము నందును, చేజెర్ల శాసనమునందును ఆటవెలది, తేట గీతులను మిశ్రణము చేసి వ్రాయబడినవి. (తె. భా. ఛం. రీ. రా. దొ. శర్మ పు. 207)
3. సీస ప్రకరణమున వివరించబడును.
4. తరిగొండ వెంగమాంబ ప్రతి ద్విపదకు మకుటమునుంచి (కృష్ణశతకరచనలో) పూర్ణ ఛందమువలె వాడినది.
5. సీసమన్నది లోహమని భావించి బంగారము, వెండి వంటి లోహనామములతో కొత్త ఛందములను శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు తమ విశ్వేశ్వరీయమున సృష్టించెను.



V. లయ :-

తాళాంతరాళ వర్తీయః
కాలోఒసౌలయ నామకః అని కోహలుడు లయకర్థము నొసగెను. తాళాంతర్గతమైన కాలము లయ అని చెప్పబడినది. "లయఃసామ్యం" అని అమర కోశము సామ్యమని మాత్రము చెప్పినది. లయ సహజమైనది. సంగీత శాస్త్రము నందు లయనుండి కళాధర్మముగా తాళము అభివృద్ధి చెందినది.

లయను చైతన్యవంతుడైన మనిషి సహజముగనే గ్రహించగలుగును. లయ బద్ధముగా తట్టినపుడు పసిపాపసైతము నిద్రింపగల్గును. సర్వప్రకృతి లయ బద్ధమే. గుండె లయబద్ధముగా పనిచేయును. సముద్ర తరంగములు లయ బద్ధముగా తీరమునకు తట్టును. దివారాత్రములు లయాన్వితములు. నడకలో పరుగులో పాదభ్రంశము లయ పూర్వకము. లయ కాల ప్రమాణములో సమానత కలది. కాలఖండముల పరస్పర సమత లయ.

లయ ఆంగ్లభాషలో Rhythm అనబడును. "Anykind of pattern of design perciptible in the movement is called Rhythm" అని **S. Subramaniam** గారి నిర్వచనము.[1]

"గేయ సంప్రదాయములలో లయ గీతమునకు ప్రాణము వంటిది. సమ విస్తారము లేక సమభారము కల వర్ణముల సంయోజనము, తదావృత్తి లయకు కారణమగుచున్నది" అని సంపత్కుమారగారభిప్రాయపడిరి[2]. "The regular succession of time periods in poetry as in music is the basis of rhythm[3]" అన్న S. సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయ మిట్టిదే.

గేయమునందు లయకు కారణము పాదసౌష్ఠవము. సౌష్ఠవమన్న సమ ప్రమాణము లేక కొలత. మానవ శరీర మర్ధమునకు చీల్చినపుడు ఉభయ పార్శ్వము లందు సమాన భాగములుండును. ఉభయార్ధములందు ఏ అవయవమైనను సమానము కానప్పుడు వికలాంగముగా గుర్తింపబడును. అట్లే ఒక వక్రరేఖ కాగితముపై లిఖిత మైనపుడు సౌందర్యావహము కాజాలదు. తిరిగి దానికి ప్రతిరూపమును దర్పణ దర్శిత మగు విధముగా ప్రతిబింబమువోలె కలిపి లిఖించిన దానిలో సౌష్ఠవసౌందర్యము కాన నగును. ఇట్టి సౌష్ఠవమే పాదములందు ఉచ్చారణకాల ప్రమాణములో ప్రదర్శితమైన

అది శ్రవణసుభగమై ఆహ్లాదమొసగును. ఆడెనమ్మా శివుడు అన్న వాక్యమునకు పాడెనమ్మా భవుడు అన్న వాక్యము జోడించగా లయ ఉత్పన్నమగును.

లయ మనోధర్మము. శాస్త్రవిశ్లేషణమక్కరలేకయే పామరుడు సైతము మనస్సుచేత లయజ్ఞానమును పొందగల్గును. ఒక పాదమును వినుటచేత తర్వాతి పాదము అంతే దైర్ఘ్యముగల పాదముగా శ్రోత తెలియగల్గును. ప్రతి పాదమునకు గల సమతూకము (సమాన దైర్ఘ్యము) చేత ఇట్టి లయావిర్భావమై రాబోవు పాదము యొక్క కాల ప్రమాణమును తెలియగలుగును. తానూహించిన కాలప్రమాణమునకు తర్వాతి పాదము సరిపోయినప్పుడు మానసికానందము లభించును. తన భావముతో ఇతరులభావము సంవందించునప్పుడు కల్గు ఆనందమిట్టిదే. ఇట్టి కాల ప్రమాణములో దొంతరగా పాదములు సమముగా సాగినపుడు మానసికముగా నిర్ధారిత కాలప్రమాణముతో సంవదించుకొని శ్రోత లయానందమనుభవించును. అందులకే లయ మనోధర్మ మనుట. కూటమి భజనలలో, పాడుతున్నపదం (గేయం) కొలతలు తెలియకున్నను (కోరస్) భక్తులు ఆవృత్తి చరణము లేదా పల్లవి సరియైనవేళకు పలుకుటచూడగలము. సాముహిక జానపదగేయ గానమునందు, కోలాటమునందు సమాన కాలఖండములను గుర్తెరిగి కళాకారులు ప్రవర్తించుట సర్వజనైకవద్యము.

"According to the rhythm in his or her mind, can sing a folk song freely whenever the situation arises. Here the rhythm alone plays the vital role and hence we have a pattern, a very simple one. Imitation of such a song at any time becomes easy". అన్న అభిప్రాయమిట్టిదే[4].

లయ హీనమైనపుడు ఛందోబద్ధమైన రచనయు వ్యర్థమే. గణములకు సరిపడియున్నను, వరనముతో ఏ శ్రావ్యతను సంతరించుకొనక నిరర్థక మగును. గణములు వేసి చూసిన సీసపద్యమని చెప్పబడు ఈ క్రింది సీసము లయహీనమై వచనమున కంటె భిన్నముగాకున్నది.

"శ్రీరస్తు శుద్ధాంధ్ర భారత సంగ్రహ
　　ము వినుడి ఇది చెన్నపురిని మిగుల
వాసినిగన్న కొల్లాసుబ్బరాయలు
　　సెట్టియు గురుసామిసెట్టి.......[5]

ఇట్టి పద్యములు గణబద్ధములయ్యు లయ శూన్యములై ఛందోమౌలిక ప్రయోజన మును త్యజించి వచన ప్రాయములగును.

లయ అన్నది కేవల పాదగతమే గాక - పదగతమై కూడా యుండును. అనగా పాద ప్రమాణ సమత మాత్రమే గాక - పదబంధ, యతి కారణజనిత పాద ఖండముల రూపమునను ఉండవచ్చును. వర్ణఛందస్సులలో లయ కవి యిచ్ఛాధీన మై యుండును. గణములు నియతమే గాని పద లేక పదబంధ (సమాస) ప్రయోగ ములో స్వేచ్ఛ గలిగి వర్ణవృత్తములలో తనకు ఇచ్ఛ వచ్చిన లయను సృష్టింప గల్గును. అంతేగాక యతిస్థానము సంస్కృతమునందు వలె విచ్ఛేదరూపమున్న యెడల అనగా పద (word) సమాప్తి జరిగిన యెడల పాదము యతివరకొక ఖండ మగును. తర్వాతి పాదభాగమొక ఖండముగను విడిపోవును. పాదాంతయతి విచ్ఛేదన రూపమై సంస్కృతమునవలె పాటింపబడినపుడు పాదము 'యత్యంత ఖండము', 'యత్యానంతరఖండము'నై ప్రతిపాదమునందలి ఈ ఉభయఖండములు సమ భారత కల్గి నియత లయాత్మకములగును. అట్లుగాక తెలుగులో యతిస్థానమున విచ్ఛేదము లేక ఏకపద నిక్షేపము వలన పదముల విరుపులు కవి యిచ్ఛాధీనములై ఒక్కొక్క పద్యమున కొక్కొక్క వింత లయను ఆపాదించును.

దేశ్య ఛందములలో ఇట్లుగాక సూర్యేంద్రగణములు పూర్వ నిర్దిష్ట లయనుగల్గి మాత్రాసమక ఖండములుగా విన్పించును. ఒక ఉత్పలమాల లేక చంపక మాల ఒకే కవి చేతిలో పెక్కుభంగుల లయను సంతరించుకొనగ ఒక సీసము లేదా కందమువంటి దేశ్యఛందము ఏ కవి వ్రాసినను నియత లయాత్మకమగును. వరన మాత్రముననే దాని లయను బట్టి ఇది కందమనియో, సీసమనియో, ప్రాథమిక ఛందోజ్ఞానమున్న ఏ శ్రోతమైనను వెంటనే కనిపెట్ట గలుగును. సీసము ఖండగతిలో నడచునని, కందము చతురస్రగతిలో నడచునని సులభముగా చెప్పవీలగును. నిర్దిష్ట లయాత్మకములగు దేశ్యఛందములు కవికిని శ్రోతకును పరిచితములైన కారణమున ఝటిత్యానందనుభూతిని కలుగజేయును. శ్రీనాథ రామరాజ భూషణులు సీసము నకు, కవి బ్రహ్మ తిక్కన కందమునకు, వేమనాదులాటవెలదికిని ప్రసిద్ధులని తెలుగు నాటగల ప్రచారమునకు కారణము వారా దేశీ ఛందములకు నిర్దిష్ట లయను సంత రించి పెట్టిరనియే. తక్కిన కవులు వానినిగణబద్ధముగా వ్రాయుటలో విఫలులైరని కాదుగదా!

—x—

## అధస్సూచికలు

1. The commonness in the metre of Dravidian languages
2. తెలుగు ఛందోవికాసము. పు. 5.
3. The commonness in the metre of Dravidian languages P.11
4. The commonness in the metre of Dravidian languages P. 11

   —S. Subramaniam.
5. శబ్దాంధ్ర భారత సంగ్రహము (కందుకూరి వీరేశలింగంగారిది) ముఖ పత్రము నందలిదని డా|| దివాకర్ల వారు ప్రాఙ్నన్నయ యుగమున పు. 352.



## VI. య తి (వడి) :-

నియతః పదవిచ్ఛేదః

యతిరిత్యభి సంజ్ఞితః(నా.శా.XIV-83)అని భరతుడు పదవిచ్ఛేదనమును యతి యని పేర్కొనినాడు. పాదమును పఠించునపుడు పఠితకు విశ్రాంతి కారకమైనది విచ్ఛేదమే. యతిర్విచ్ఛేద సంజ్ఞికా[1] యను వొప్పున అట్టివిశ్రాంతి నిస్పుటమై విచ్ఛేదింప బడునది యతి.ఇట్టి విశ్రాంతి వలన సమాన కాలప్రమాణములో పాదభాగములు మాటి మాటికి ఆవృత్తులగుచుండ పఠనము శ్రావ్యతాపాదకమగును. 'శ్రవ్యోవిరామోయతిః'[2] అని హేమచంద్రుడు చెప్పినట్లు విరామము శ్రావ్యమైనపుడు యతి యనబడును సమాన కాల ప్రమాణములో పాదము భాగములుగా విడిపోవుటకు భరతుడు చెప్పిన పై నియత పదవిచ్ఛేదము కావలయును. నియతమనగా పాదము యొక్క కాలో చ్చారణ ప్రమాణమును బట్టి శ్రోతృశ్రవణ సౌఖ్యమును, పఠితృ శ్వాసాబంధనమును దృష్టియందుంచుకొని ఇన్ని అక్షరముల లేదా మాత్రల పిదప విచ్ఛేదమన్న నిబంధన. ఇట్టి నిబంధనచే కవి నిర్దిష్ట స్థానమునకు పద సమాప్తి చేసి క్రొత్తపదముతో తర్వాతి భాగమును ప్రారంభించుటవలన పాదములు నిర్దిష్ట భాగములుగా విడిపోయి లయ సాధింపబడును. ఇట్టి లయయే మాధుర్యమును సంతరించును[3].

యతి విచ్ఛేదరూపమున లేకున్నచో పఠిత అర్థవశముననో లేక ఉచ్ఛ్వాసా బలము లుప్తమైపుడో తన యిచ్ఛానుసారము పాదమును భాగించును. కాని అట్టి వాగ్విరామము నియతము కానిదై వివిధ రీతుల సాగి కాలప్రమాణమును ధిక్కరిం చును. అట్టియెడ ఛందస్సౌందర్యము లుప్తమగును. కనుక జయకీర్తి చెప్పినట్లు (వాగ్విరామోయతిః స్యాత్ సాస్థాప్యతేప్రతిసుందరం[4]) ప్రతి సుందర వాగ్విరామము యతి యనబడును.

వాక్కునకు శ్వాసకు అవినాభావ సంబంధము. శ్వాసవాయువు శబ్దోత్ప త్తికి కారణము. అట్టి శబ్దముల యుత్పత్తి ఉచ్ఛ్వాసలో అవిరామమైనప్పుడు తిరిగి నిశ్శ్వాసమునకు తగిన వ్యవధి అవసరము. ఇది గద్య పద్యోభయ సామాన్యము విశేషించి పద్యములందు లయానుకూలమగు ఆవృత్తులలో స్వేచ్ఛా నిశ్వాసమునకు తావులేదు. నిశ్శ్వాస క్రమబద్ధమొనర్చుటకు వాగ్విరామ మవసరము అది యతి (విచ్ఛేదము) వలన సాధ్యము. దీర్ఘపాదములందు ఉచ్ఛ్వాసా బలమునకు మించిన చోట్ల ఒకే పాదమునందధిక స్థలముల యతియు, 9 అక్షరములవరకు గల పాదము

లందు యతియే లేకుండుటయు దీనికి తార్కాణ. యతిని గూర్చి కిట్టేల్ పండితుడు "The pause or caesura(yati) of a verse form, So to say, a place for taking breath" అని నిర్వచించినాడు[6].

"యతిరవధిః భేదః ఇతి పర్యాయాః" అని జనాశ్రయుడు అవధి, భేదము అనునవి యతిపర్యాయములనినాడు. విచ్ఛేదమన్నది వేరొక్కపేరు[7]. వడి లేక వళి యనియు తెలుగులో పేర్లున్నవి. విరామమన్న అర్థములో తెలుగులో ప్రచారములో నున్నవని అప్పకవి

"విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమములు,
శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు
ననగ నివి తొమ్మిదియు వళి కాఖ్యలయ్యె...."నని పట్టికనిచ్చినాడు[8]

కాని యతి, వడి లేక వళి యన్నపేర్లు మాత్రము తెలుగులో బహుళ ప్రచారములో నున్నవి. విరతి, విశ్రాంతి, విరామము వంటి పేర్లు తెలుగులో ప్రచారము తక్కువయిన వగుటకు కారణము సంస్కృతమునందు వలె ఇచ్చట పదచ్ఛేదరూప విశ్రాంతి లేకుండుటయే. యతి స్థానమునకు ముందే పదసమాప్తి జరిగి యతి స్థలము నుండి కొత్త పదము ప్రారంభమగుట సంస్కృతయతి విధానము. తెలుగులో మాత్రము విచ్ఛేదరూపము లేక పూర్వాపర స్థానములందు నైనను ఒకే అఖండ పదము వాడుకొనవచ్చును. తెలుగులో ఈ నియమము (విచ్ఛేదము) లేక యత్యనంతరాక్షరము ప్రథమాక్షరముతో సామ్యమో లేక సాజాత్యమో అయియుండవలయును. సంస్కృతాంధ్రములలో గల ఈ యతి పై రుధ్యమును అనంతామాత్యుడు చక్కగా వివరించినాడు.

కం. ఎన్నిట యతిరావలెనని
రన్నిట సంస్కృతంబునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలెనని
రన్నిట తెలుగునకు మొదలి యక్షర మమరున్

(ఛందోదర్పణము 1-129)

నిర్దేశిత యతి స్థలమందు వేయబడు అక్షరము ప్రథమాక్షరముతో సంబంధము కల్గియుండు నియమమువల్ల తెలుగులో ప్రథమాక్షరమునకే ప్రాధాన్యము హెచ్చినది. అందువలనే వడిని నిర్వచించునపుడు ప్రథమాక్షరమే వడిగా పేర్కొనబడినది. పాద

మధ్యన విశ్రాంతి స్థలము వదిలివేయబడినది. "చరణాద్యక్షరమే వడి" (కవిజనాశ్రయము), 'పాద ప్రథమాక్షర ముత్పాదితమగు వళియనంగ' (కావ్యాలంకార చూడామణి) 'వాసనగల మొదలిబ్రాయి వడి యన బరగున్' (ఛందోదర్పణము) "చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె" (అప్పకవీయము), 'విలసత్పాదాద్యక్షరములు వళ్ళగు' (ల క్ష ణ దీ పి క-) అని యిట్లు సర్వఛందోగ్రంథములు ప్రథమాక్షరమే వడిగా పేర్కొన్నవి. ఆంధ్ర శబ్ద చింతామణి ఆద్యాంధ్ర లక్షణ గ్రంథమయ్యె నని దానిలో "ఆద్యోవళిః" అన్న వడి నిర్వచనము వీనికి మార్గదర్శకమై ఉండును. సంస్కృతమునందలి యతి నియమము తెలుగులో లేకున్నను 'యతి' అన్న పదము మాత్రము వడికి సమానార్థకముగా వాడబడినది. ఋవళి, స్వరయతి, ప్రాణి విరామము, వ్యంజనాక్షర విరతి, ఎక్కటివడి, ప్రాసవిశ్రాంతి, తద్భవవ్యాజ విశ్రమములు వికల్ప విరమణమని ఈ రీతి వడి భేదములకు గల పేర్లను బట్టి చూడ వీటినన్నిటిని భేదరహితముగా ఆంధ్ర లాక్షణికులు వాడిరనిపించును. ప్రథమాక్షరమును మాత్రము 'వడి' యన్న పేరుతో మాత్రమే నిర్దేశించినట్లు, తక్కినపేర్లు దానికి వాడకుండినట్లు కాన్పించును. తెలుగులో యతిస్థానముగా పిలువదగినవి రెండు స్థలములు. ప్రథమాక్షరమొక్కటి, నిర్దేశిత పాద మధ్యస్థలమొక్కటి. పాదమధ్యస్థ స్థలమును మాత్రము వివక్ష లేక అన్ని యతి పర్యాయ పదములతో అభిధానించుట చూడనగును. ప్రథమాక్షరమును మాత్రమే 'వడి'యని పిలుచుట పాల్కురికిసోముని 'యతిపై వడిమైన, అన్న ప్రయోగమును బట్టి నిర్ధారింపవచ్చును. 'యతిపై' అనగా పాదమధ్యస్థ యతి స్థానముపై (తర్వాతి అక్షరము) 'వడి' అనగా ప్రథమాక్షరము (లేక సదృశాక్షరము) నిలుపుటయని సోముని మాటలకు అర్థము చెప్పుకొనవచ్చును. వడిమైన (ప్రథమాక్షరమైన) ప్రాసమైన (ద్వితీయాక్షరమైనను) దేశిగా (తెలుగు సంప్రదాయానుసారముగా) నిల్పుటకు సోముడు (యతి లేదా ప్రాసయతి ఉపయోగ ద్వైవిధ్యము) అంగీకరించినట్టు పై ఉక్తి తాత్పర్యముగా భావింపవచ్చును. తెలుగులో యతి స్థానములుగా పేర్కొనదగిన పాదమధ్యస్థము మరియు పాద ప్రథమాక్షరము, ఈ రెండింటికి రెండు పేర్లు అవసరమైనవి. కవిజనాశ్రయకర్త, చింతామణీ కర్త, విన్నకోట పెద్దన (కావ్యాలంకార చూడామణి కర్త)లు మాత్రము ఈ ఉభయ స్థానములకు ప్రత్యేకముగా పాద ప్రథమాక్షరమునకు 'వడి' యని, పాదమధ్య విశ్రాంతి స్థానమునకు 'యతి' యని నిర్దేశించిరి. తర్వాతి వారిట్టి భేదమును పాటింపక పాదమధ్యస్థాక్షరమును ఉభయనామములతో వ్యవహరించిరి.

యతి విచ్ఛేదరూపమై పాదమును కాలఖండములుగా విడగొట్టి, తద్వారా వృత్తులపట్ల సమభారత సాధించి ఛందఃపరమ ప్రయోజనమైన శ్రవణ సౌఖ్యతను సృజింపవలసి ఉన్నది. కాని యతిని కేవల విరామమని, విరామము అర్థవశమని భావించుటయు జరిగినది. "యత్రార్థ సమాప్తిః స్యాత్ సవిరామ ఇతి స్మృతః" అని భరతుడు నాట్యశాస్త్రమున ప్రవచించినాడు[10]. ఈ విరామము ఛందో విషయకము కాదు. ఛందో విషయకమగు ఇట్టి యతి అవశ్యోపాదేయమని ఛాందసికులైన పింగళాదులు భావించుచుండ, రసోపాధ్యాయులైన భరతమున్యాదులు ఇట్టి యతి నియమమును తిరస్కరించుటకు వెనుకాడరైరి.

వాంఛంతి యతిం పింగళ
వశిష్ఠ కౌండిన్య కపిల కంబల మునయః
నేచ్ఛంతి భరత కోహల
మాండవ్యాశ్వతర సైతవాద్యమునయః[11]

ఈ ద్వైవిధ్యము కారణముననే కాబోలు సంస్కృతములో భర్తృహరి, మురారి, జయదేవాదులు తమ కృతులయందు యతి నియమమును క్వాచిత్కముగా పాటింపనివారైరి.

తెలుగులో సైతము యతి ప్రాసల నిర్బంధత్వమును విమర్శించి, వానిని అనావశ్యకములని భావించినవారు లేకపోలేదు. కాని వారందరును ఆధునికులే. ప్రాచీనులలో యతిని, ప్రాసను లేక యతి ప్రాసలలో ఏదో ఒక దానిని పాటింపవలయునను నియమమునుల్లంఘించిన కవి, లాక్షణికులెవ్వరును లేరనవచ్చును. అంతేగాక ఇవి ఉదాత్తాలంకారములని ఆడిదము సూరకవి, కొఱవి గోపరాజు వంటివారు విశేషముగా కొనియాడినారు[12]. మార్గ ఛందస్సుల నియమములు ఆధునికులకు సర్వపరిష్వంగములై భావ ప్రవాహమునకు అడ్డురాళ్ళ వంటివిగా తోచినవి. ప్రాచీనులు సంస్కృత భాషలో వ్రాసిన శాసనాదికములో[13] తెలుగు యతి ప్రాసలను పెట్టగా, ఆధునికులు[14] సంస్కృతయతి సౌందర్యమును గుర్తించి తెలుగు పద్యములలో యతి ప్రాసలు విడిచి రచనలు గావించినారు. వేకుమళ్ళ రాజగోపాలరావుగారు[15], కాశూరి హనుమంతరావుగారు[16], సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు[17] వంటి విమర్శకులు యతిప్రాసలు బంధములని భావించుటయేగాక, అవి లేకుండగను కవిత్వము రసవంతముగా వ్రాయవచ్చునని ఉదాహరించిరి.

తెలుగుపద్యరచనలో సదృశాక్షర నిబద్ధరూపయతి ప్రాసలు కొన్ని పట్టుల ప్రతిబంధకములేవైనను శబ్దవైదుష్యము గలవారికి ఇది పెద్ద ప్రతిబంధకముకాదు. పైగా తక్కిన భాషలకు లేని విశిష్టములైన యతిప్రాసలు, అనుప్రాస- (శాబ్దిక) సౌందర్యమును వ్యంజించుటయేగాక, శబ్దస్వరూపనిరూపణలో (వ్యాకరణ ప్రయోజనమునకై యతిప్రాస స్థానములో ఘటితమయినపుడు) సహకరించగల్గియున్నవి. వీని వలన గలుగు సౌందర్యమునకు తెలుగులో బహుళ సంఖ్యలో సామెతలను ఉదహరింప వచ్చును. యతిస్థానమున పదసమాప్తి గావించి, వేరొక్క పదమును ప్రారంభిం పక కేవల అక్షరసామ్య రూపమున యతి సాధించినపుడు అర్థభంగ కారణమున పతిత వేరొక్కచోట (అర్థసమాప్తి కొఱకు) విరుచును. ఇట్లు నియమరహితమైన విచ్ఛేదముచే కవి వివిధ రీతుల లయను సాధింపగల్గును. నియత విచ్ఛేదము వలన నియతమైన లయ మాత్రము ఛందో విధిననుసరించి ఉత్పన్నమగును. ఈ అంశము ఈ గ్రంథమునందే లయ అన్న భాగమున చివర వివరింపబడినది.

### విచ్ఛేదరూపయతి :

సంస్కృతమున యతి విచ్ఛేదరూపమగుటయేగాక, పాదాంతమునను విచ్ఛేదమున్నది. దీనివల్ల పాదప్రమాణము స్పష్టమగుటయేగాక లయ సువ్యక్త మగును. శార్దూలము 19 అక్షరముల పాదమన్నప్పుడు దీనిలో 13 అక్షరముల పిదప యతి అన్న నియమము ప్రకారము 13 అక్షరముల పిదప ఒక విరుపు. పాదాంత యతివలన 19 అక్షరముల పిదప ఒక విరుపు ఉండును. ఇట్లు పద్య మంతయు 13, 6, 13, 6, 13, 6 అన్న రీతిలో పాద భాగములుగా విడిపోయి సమానకాల ఖండముల ఆవృత్తి వలన గలుగు లయను మాత్రాఛందములందువలె చక్కగా చెప్పును. కాని తెలుగులో ప్రథమాక్షరమునకు సారూప్య లేదా సాజాత్య వర్ణమైనదానిని నిక్షేపించుటవలన విచ్ఛేదరూప యతి నియమము నశించిపోయినది. దీనిచే లయ లుప్తమగుటయేగాక, అంతర్దీర్ఘ పాదములో మొదటి అక్షరమును బోలిన అక్షరము ఎక్కడో దూరముగా ఆవృత్తమైనపుడు అనుప్రాస సౌందర్యము కూడ ఉండి లేదన్న విధమగును. మొదటి యక్షరము పదమూడవ అక్షరముగా నిక్షిప్తమైన అనుప్రాస సౌందర్యమేమియు నుండదు. పైగా ఆ అక్షరమే ఉండవలయునన్నదేమి ; సాజాత్య వర్ణమైన చాలునన్నపుడు వాటికి మధ్యగల అనుప్రాస సౌందర్యము సైతము లుప్తమగును. దీనికంటె ఏ నియమమూ లేక పాదమునందు దగ్గర దగ్గరగా వేసిన

అక్షర లేదా పదముల ఆవృత్తి ఒకటి రెండుసార్లు చూపబడినను ఇంతకన్న చక్కని సౌందర్యమును ప్రదర్శింపగల్గును.

ఆ. వె. చూచి చూచి చొక్కి స్రుక్కి తాలిమి దక్కి
పగల బొగిలి యూర్పు సెగల నొగిలి
దిగులు దగుల గుండి వగ జెంది బెగడొంది
యలసి సొలసి మూర్ఛ లొలసి వెలసి కంకంటివారి ఉత్తర రా.

VI - 300 సీతాపరిత్యాగము

తెలుగు యతి, లయను లుప్తము చేయుటయేగాక, అనుప్రాస సౌందర్యమును గూడ కోల్పోయి ఉభయ నష్టము నందును "తెలుగు వృత్తములందు అట్టి నియమము లేక అక్షర మైత్రి మాత్రమే ఉండుటవలన ఉద్దిష్టమైన లయ మరింత గుప్తమగును. ఇది పద్యరచనా ప్రౌఢత్వమును తెలియజేయునని కొందరందురు. కాని ఉద్దిష్టమైన లయను మరుగుపరచునని ఒప్పుకొనక తప్పదు" అని గిడుగువారు లయ శూన్యతను అంగీకరించినారు[18]. లయ లుప్తమైన పిదప లాభమేమి ? అంతే గాక వాగుచ్చారణా శ్రమను పోగొట్టుటకైనను తెలుగులో యతి సమర్థమై ఉన్నదా అన్న అదియును లేదు. యతి స్థలమున పద సమాప్తి జరిగి వేరొక్క పదముతో ప్రారంభించు విచ్ఛేదరూప యతి తెలుగునకు సామాన్యము కాదు. ఒకవేళ అనుప్రాస సౌందర్యమే- తెలుగులో యతి పరమ ప్రయోజనమన్నచో ఎక్కడో 13వ అక్షరము వద్దకాక దగ్గర దగ్గరగా తదక్షరావృత్తివల్ల శ్రవణ సౌఖ్యమధికముగా కల్గును.

సంస్కృతమున అధికాక్షర పాదములే తక్కువ. ఒకవేళ క్వాచిత్క ముగా శార్దూలాది వృత్తములు వాడినను 19 అక్షరముల ఆపాదము 13+6గా విడి పోవుచున్నది. ఈ దైర్ఘ్యమునందైనను తిరిగి పాదము రెండుకాక మూడు భాగము లుగా విడిపోయిన ఆ లయసౌందర్యము మరింత స్పష్టపడును. విచ్ఛేదరూప యతి అనగా పాదము యతికొక్క భాగముగా విడిపోవుట అన్నమాట. మందాక్రాంత వృత్తము 17 అక్షరముల పాదములో రెండు యతులుండి నాల్గు, ఆరు, ఏడు అక్షర ముల భాగములుగా విడిపోయి ఎంత మనోహరముగా సాగునో చూడుడు[19].

శాంతాకారం ★ భుజగశయనం ★ పద్మనాభం సురేశం
విశ్వాధారం ★ గగన సదృశం ★ మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం ★ కమలనయనం ★ యోగిహృద్ధ్యానగమ్యం
వందేవిష్ణుం ★ భవభయహరం ★ సర్వలోకైకనాథం

ఇంత మనోహరమగు లయను వ్యంజించు విచ్ఛేదరూప యతిని వదిలి తెలుగులో అవిచ్ఛేదాత్మక సవర్గరూపయతి పాదుకొనుట, అదియును సంస్కృత వృత్తములకు సైతము (సంస్కృత భిన్నమైన యతిని) ఇట్లే నిర్దేశించుట ఛందస్సౌందర్య దృష్టిలో విచార్యము.

తెలుగులో ఆద్యఛాందసికుడగు రేచన ఒక్కడు మాత్రము విరామరూప యతిని సైతము పేర్కొనినాడు.

అనుపమమగు నిగ్గణముల
వినుతశ్రుతి సుభగ లలిత వృత్తంబులు ము
న్నొనరింతు వానిపై వ
ళ్ళును బ్రాలును విశ్రమంబులం దెలియంగన్ [20]

వళ్ళు, ప్రాలుమీద విశ్రమము అని వడితోపాటు విశ్రమమును చెప్పుట గమనార్హము వృత్తములను నిరూపించుచోట గూడ, పంక్తి ఛందమునకు ముందు, యతి ముందు ముందు ప్రారంభమగునవి చెప్పుచు

వెలయ నిటబట్టి వళ్ళిడ

వలయును; విశ్రమము నిలుపలయును[21] అని వళ్ళు, విశ్రమములు రెండుంచుట చెప్పెను. శార్దూల మందాక్రాంతాది వృత్తములకు లక్ష్యమిచ్చునపుడును కంఠోక్తిగా చెప్పకున్నను విచ్ఛేదరూప యతిని ప్రదర్శించినాడు[22].

ఇక దేశ్య ఛందములందు ఇట్టి విచ్ఛేద రూపము బహుధా కాన్పించును. ప్రత్యేకించి కావ్యములందుగాక శతక యక్షగానాది కృతులందు గాయనోద్దేశితములై కవులు విచ్ఛేద రూపమున వాడుట కాంచనగును. మార్గి వృత్తములలో అక్షరముల పిదప కాక, దేశ్య ఛందములలో ఇన్ని గణముల పిదప యతి అన్న నియమమే ఒక ప్రత్యేక లక్షణమై గణములనుబట్టి పాదభాగములుగా విడిపోవుట కాంచనగును. ఈ అభిప్రాయమునకుపబలకము సీసము. సీసము నందలి పాదపాదము విడివిడిగా,

తిరిగి ప్రతిపాదము యతి కారణముగా రెండు భాగములుగా విడిపోవుట - చూడ నగును.

దేశ్య ఛందములందు పాదమధ్య యతి విచ్ఛేద రూపములో ఉండుట వలన తెలుగునకు అనివార్యమైన సదృశాక్షర రూప యతితో కల్పి రెండు యతి సంప్రదాయముల కలసి అత్యధిక సౌందర్యవంతమగుట విస్తారముగా కాంచనగును.

ఆ. వె. నీళ్ళలోన మొసలి — నిగిడి యేనుగుపట్టు
బయట కుక్కచేత — భంగపడును
స్థాన బలిమి కాని — తన బలిమి కాదయా
విశ్వదాభిరామ — వినుర వేమ

పై పద్యమందు యతి స్థానమున విచ్ఛేదమున్నది. తోడుగ తెలుగు యతి సంప్రదాయమైన సదృశాక్షర యతి ఉన్నది. ఇట్టి ద్వైవిధ్యము వలన లయయును, అనుప్రాస సౌందర్యమును సాధింపవచ్చును. దేశ్య ఛందములు మార్గవృత్తములకన్న మనోహరములు. ఝటితిలయ బోధకములై ఒప్పుటకు ఇది ముఖ్య కారణము. తెలుగులో ఇట్టి విచ్ఛేదరూప యతిని దేశ్య ఛందములలో ఎక్కువగా వాడిన కావ్య కవులలో నన్నయ ముఖ్యుడు. కాని ఏలనో ఈ సంప్రదాయము తర్వాతి కవులు ఆచరింపరైరి. సదృశ లేదా సాజాత్య రూప యతిని మాత్రము పాటించి పద్యములు వ్రాసిరి. ప్రబంధ పదనారచనా దురంధరుడైన రామరాజ భూషణుడొక్కడు మాత్రము సీసమునందీ విధానముల రెంటిని విధిగా పాటించి నాడు.

ఇట్టి విచ్ఛేదరూప యతి పదము యొక్క సమాప్తి రూపమునకే కాక స్వరసంధి రూపమున ఉన్నను తుల్య ప్రయోజనము సాధించును.

ఎండిన యూళ్ళగో — డెఱిగింపదెవ్వడు
పండినయూళ్ళకే — ప్రభువులంత

పై సీసపాదమున 'డె' యతిస్థానమయ్యును 'గోడు+ఎఱిగింపడు'గా విడదీసి యత్యనంతర భాగము (విచ్ఛేద రూపమై) నూతన పదముచే ఆరంభమైనట్లే భావించవచ్చును. ఇట్టిచోట్ల సంధి విడదీసి పరపదాద్యచ్చునకే యతి చేసికొనవచ్చు

వని నియమము. ఇది సర్వఛాందసికుల సమ్మతమేయయ్యును, స్వరసంధి గలుగు స్థలములందు వ్యంజనాక్షరమును సైతము యత్యక్షరముగా అంగీకరించుటను తెలుగు ఛాందసికులు అంగీకరించిరి. అనగా విచ్ఛేదరూప యతికి ప్రాధాన్యము నటించి, అనుప్రాసరూప (తెలుగు) యతికి ప్రాధాన్య మిచ్చుట. దీనినే అఖండ పడి యనిరి. తెలుగులో దీనిని ప్రతిఘటించి, సంధి విడదీసి పరపదాద్యచ్చునకే యతి చెప్పుకొనవలెనుగాని అఖండముగా చెప్పుకొనరాదని శాసించిన దొక్క అప్పకవి మాత్రమే విచ్ఛేదరూప యతికి ప్రాధాన్యమిచ్చి దాని సరసత్వమును నిలుపుటకై యత్నించిన ఏకైక ఛాందసికుడితడు. కాని బహ్వాంధ్రకవులు విచ్ఛేదరూప యతి సౌందర్యమును, నిరాకరించి, స్వరసంధి వశమైన స్థానమును అఖండముగా వ్యంజన ప్రాధాన్యముగా 'అఖండయతి' పేర అంగీకరింపగా అట్టి లక్ష్యములను మార్చ యత్నించి తన సిద్ధాంతమును ప్రతిష్ఠాపించుటలో అతడు విఫలుడైనాడు.

అట్లుగాక విచ్ఛేద సౌందర్యమును ప్రత్యేకముగా వివరించి స్వరసంధ నంగీకరించిన పూర్వకవి లక్ష్యములనువబలకముగా నుదాహరించి సమ్యక్పదమున తన సిద్ధాంతమును ప్రతిష్ఠాపించినచో అప్పకవికి తర్వాతి ఆంధ్ర కవులైనను ఈ నియమమునను పాటించి ఉండెడివారు.

విచ్ఛేదరూపయతి జానపదగీతములలో పెక్కు తెలుగు సామెతలలో నియతముగా పాటింపబడినది. జానపద గీతములలో ఇట్టి యతి వలన పాదము రెండు ఖండములుగా విడిపోవుట జరుగును. అదికూడా పద మధ్యచ్ఛేదమై సమద్విఖండన మగును.

1. కాళ్ళగజ్జి - కంకాణమ్మ
2. అట్లతద్దోయ్ - ఆరట్లోయ్
5. ఏటికేతం బట్టి - ఎయ్పుట్లు పండించి
4. మాపావ మామల్లు - మత్స్యావతారం
5. గోడమీది బొమ్మ - గొలుసుల బొమ్మ

జానపదగీతులందు పదవిచ్ఛేద, సదృశాక్షరనిక్షేప-ద్వైరూప్య యతులకు పైవి ఉదాహరణములు. సదృశాక్షరయతి లేకున్నను విచ్ఛేద మాత్రము చేతనే లయ సౌందర్యమును శోభించు యతులును జానపదగీతులందు కొల్లలుగా గలవు 29. ఈ క్రిందివి ఉదాహరణీయములు.

1. కలము దీసుక పోయి - సిరలోనముంచి
   ముత్యాల పంటి యొక - దస్తూరి వ్రాసి
2. మేలుకొనవే - చంద్రశేఖర
   మేలుకొనవే - ఇంద్రవందిత
3. కూకుండె చెలియా - చేడెల కుచలపై
   తుమ్మెదతానెనే - ఓలాలలనా
4. (దిగులం దిగులం దిగితిరి అయ్యా)
   గుంపులు గుంపులు వచ్చితిరయ్యా
   సన్నపు ఇసుకర వారధి నడుమా
   (క్షణాన వారిధి కట్టిరి అయ్యా)

తెలుగులోని సామెతలందు సైతము ఇట్టి ద్వైవిధ్యయతులుకు. సదృశాక్షర రూప రహిత విచ్ఛేదమాత్ర యతులుకు తుల్యాంశాధ్యాసహాయములై యున్నవి.

1. కడుపు చించుకుంటె - కాళ్ళమీద పడుతుంది
2. చిన్నినా బొజ్జకు - శ్రీరామరక్ష
3. అంగట్లో అన్ని ఉన్న - అల్లుని నోట్లో శని ఉంది
4. అడ్డొచ్చిన గుర్రాలు - అగడ్తలు దాటవు
5. ఓంగ మెతుకులేదు - మీసాలకు సంపెంగ నూనె

పైవి విచ్ఛేద సదృశాక్షర రూపయతులు.

ఈ క్రిందివి కేవల విచ్ఛేద రూపయతులైనను సరసములైనవి.

1. చల్లకువచ్చి - ముంతనుదాచు
2. గుడ్డికంటె - మెల్ల మేలు
3. ఊళ్లో పెళ్ళైతే - కుక్కలదే సంబ్రం
4. కొత్త బిచ్చం - పొద్దెరగదు
5. శతకోటి దరిద్రాలకు - అనంతకోటి ఉపాయాలు

## సమద్విఖండన యతి :-

పై సామెతలలో సదృశాక్షరయతి లేకున్నను మనోహరములగుటకు కారణము విచ్ఛేదయతికి పూర్వాపరములైన భాగములు ఇంచు మించు సమానకాల ఖండములుగా విడిపోవుటయే. ఉచ్చారణాకాలము సమానమైనప్పుడు ఉద్భవ మగు లయ

దీనికి కారణము. ఇట్లే జానపదగీతములందు దాదాపు అన్నిగేయములు సమాన పాదములేకాక పాదములోని యతి స్థానము సైతము పాదమును సమద్విఖండన గావించుట జరుగును. మాత్రా సమకములైన గీతములలో మాత్రాగణములు సాధారణముగా సరిసంఖ్యలోనుండి సమముగా విడిపోయి పూర్వోత్తర భాగముల రెంటిటి నడుమ యతి కుదురును. పాద మధ్యస్థయతి స్థానములో విచ్ఛేదరూపయతి నిక్షేపము వలన పాదమంతయు రెండు సమాన కాల ఖండములై మనోహరమగు లయను సృష్టింపగల్గి - సహజ గేయగుణము సంతరించుకొనును.

దే ఛందములలో రగడలు సమద్విఖండనయతి గలవి. ఇవి జానపద గీతములు మాతృకలుగా గల్గినవి. రగడలు జానపద గీత భేదములు. అట్లే ద్విపద సమద్విఖండనయతిగల్గిన రెండవ ఛందము. 3 ఇంద్రగణములు, 1 సూర్య గణముగల ద్విపద పాదములో 4 గణములలో 2 గణముల పిదప యతి మాత్రా సమత దృష్టిలో పరిశీలించితిమేని ఆఖరు సూర్యగణము దీర్ఘీకరణము ద్వారా ఇంద్ర గణముతోడి సమానమాత్రలు కలదై, జానపదగీతములు రగడలువోలె పదమధ్య విచ్ఛేదముతో తుల్య కాలఖండములు రెండుగా విడిపోయి యుండును

వింతగా గాయకుల్ + వీణలా పూనిఇ (పల్నాటి వీరచరిత్రము)
గోరంతదీపమ్ము + కొండల్ల కెలుగూ (జానపదగీతము)
తొలికోడి కనువిచ్చి + నిలిచి మై వంచీ (బసవపురాణము)

శిష్టుల వ్రాతలో 'వంచీ' అనునది వ్యాకరణ దృష్టితో 'వంచి' అని వ్రాయబడినను, గానములో అది 'వంచీ' అనియే పలుకబడు [25]. గేయసరణిని అనుసరించి, శబ్ద సంస్కారశీలురైన శిష్టులే పాదాంతగురుత్వమును విధించిరి. బసవపురాణ, రంగ నాథరామాయణాది ద్విపద ప్రబంధములు పారాయణమునకు (గేయపద్ధతిలో పాడుటకు) ఉద్దేశించినవి. శివకవులు ద్విపదనాదరించిన దిందులకే. ద్విపద జానపదగీతములనుండి పుట్టినదని పైదానిని బట్టి మనము భావింప వచ్చును.

సీసము సమద్విఖండన యతిగల్గిన మూడవ ఛందము. పాదములోని 8 గణములు యతికొఱకు (అర్ధమునకొక భిన్నయతి నియమము వలన) 4 గణముల చొప్పున రెండు భాగములుగా విడిపోవును. తిరిగి ఆ రెండు అర్ధములందు సైతము సమద్విఖండనయతియే అనగా 4 గణముల పాదభాగములో 2 గణముల పిదప యతి వేయబడును.

మధ్యాక్కర ఛందమున 2 ఇం+1సూ+2 ఇం+1సూగ గలపాదములో 2 ఇంద్రగణముల మీద ఒక సూర్యగణము పిదప యతి అనగా 6 గణములలో 3 గణముల పిదపయతి వచ్చి రెండు భాగములుగా పాదము విడిపోవును. నన్నయ, యుద్ధమల్లుని బెజవాడ శాసనకర్త మాత్రలు 4 గణముల పిదప వాడిరి [26]. ఈ పై లక్షణ్యము ప్రతి సౌందర్యమునకు దూరము.

ఉత్సాహమునకు పాదమున కేడు సూర్యగణముల మీద నొక్క గురువు. గురువును దీర్ఘీకరించి చదువుచు ఒక్క మాత్ర కల్పబడి 3 మాత్రలై దానికి ముందున్న 7 సూర్యగణములతో (సూర్యగణమొక్కొక్కటి 3 మాత్రలే కనుక) సరిపోవును. అప్పుడీ 8 గణములలో 4 గణముల తర్వాతయతి అనగా సమద్వి ఖండన యతియే.

ద్విపదకు ద్విగుణీకృతమైన తరువోజకూడా అట్టిదే. సీసము నందు వలెనే 8 గణములు పాదముగాగల దీని యందును 2 గణముల కొక్క యతిగా 4 సమాన భాగములుగా విడిపోవును.

త్రిపదయందు సైతము యతిలేని 2వ, 3వ పాదములు విడచి, యతి ఉన్నట్టి మొదటి పాదములో 4 ఇం.గ. లో 2గణముల పిదప యతి వచ్చి సమద్వి ఖండనమగును.

చౌపది లేక చతుష్పద 4 గణముల పాదము కలది. ప్రతి గణము చతు ర్మాత్రా గణమే (నల, గగ, భ, స లు మాత్రమే వాడవలయును) ఇందు రెండు గణముల పిదప యతి. అనగా 8 మాత్రల ఖండములు రెండుగా పాదము విడి పోవును.

షట్పదియందు 7 గణముల పూర్వార్ధమొకటి 7 గణముల ఉత్తరార్ధమొకటి రెండు భాగములుగా ఉండును. 2 లేదా 3 గణముల చిన్ని పాదములుగల షట్పది పాదములలో యతి లేకున్నను, పూర్వోత్తర భాగములుగా విడిపోవుట సమద్వి ఖండనము.

తక్కిన దేశీయ ఛందములైన నాల్గు విధముల అక్కరలు, సమ, విషమ గీతులు, కంద దీర్ఘ పాదములు ఇంచుమించు అర్ధమునకే యతి చూపబడినది. సమ ద్విఖండనములు కాకున్నను అవి పాదమధ్యములనదగినవే. ఉదాహరణమునకు కంద

దీర్ఘ పాదములో 5 గణములు. అర్ధము $2\frac{1}{2}$ గణములు-యతి 3 గణముల పిదప వేయబడినది. ఇట్లే

| పద్యము | పాదములోని గణసంఖ్య | సమద్విఖండన మైనచో | యతి వేసిన స్థలము |
|---|---|---|---|
| మహాక్కర | 7 | $3\frac{1}{2}$ | 4 గణములపై |
| మధురాక్కర | 5 | $2\frac{1}{2}$ | 3 " |
| అల్పాక్కర | 3 | $1\frac{1}{2}$ | 2 " |
| కందము (దీర్ఘ పాదము) | 5 | $2\frac{1}{2}$ | 3 " |
| ఆటవెలది(పవడగీతి) | 5 | $2\frac{1}{2}$ | 3 " |
| తేటగీతి | 5 | $2\frac{1}{2}$ | 3 " |
| ఎత్తు గీతి | 3 | $1\frac{1}{2}$ | 2 " |
| క్రమలన గీతి (మేలన గీతి) | 7 | $3\frac{1}{2}$ | 4 " |

ఒక్క అంతరాక్కర మాత్రము 4 గణములకు2 గణముల పిదపయతి గాక 3వ గణాంత్యాక్షరము యతి. అది కూడ, చంద్రగణము తక్కిన గణములకన్న పెద్దది అగుట వలన, సుమారుగా పాదమధ్యమే యతి స్థానమగును.

పై పట్టికను పరిశీలించినపుడు, పాదములోని గణముల సంఖ్య సరి సంఖ్యలో గాక బేసి సంఖ్యలో నుండుటచే పాద సమద్విఖండన మన్నచో గణ మధ్యమున యతి స్థాన మగునని భావించి, ఆ గణము పూర్తియైన పిదప యతి స్థానముగా నిర్దేశించి ఉందురని భావింపవచ్చును. దేశిచ్ఛందములందు యతిని గూర్చి బండి నాగరాజుగారు "పాదమందలి గణ సంఖ్యను రెంటిచే భాగించి, శేషము వచ్చిన ఒకటిగా కలుపుకొని ఆ మీద గణారంభమున యతి చెప్పుట జాత్యుప జాతులయందు సంప్రదాయము" అని నుడిరి[33]. ఇట్లు గణాంకములలో చెప్పుట కన్న దేశిచ్ఛందములలో యతి పాదమధ్యస్థమని, ఒకవేళ అది గణమధ్యమైన అక్కడ చెప్పక, గణము సంపూర్ణమైన పిదప చెప్పుట సంప్రదాయ మనవచ్చును. ఒక అంతరాక్కర తప్ప ఏ పద్యమునందైనను గణ మధ్య యతి లేదని తాత్పర్యము. మార్గి వృత్తములందు వలె ఇన్ని అక్షరముల పిదప యతి అన్న నియమము కాక ఇచ్చట దేశి పద్యములలో ఇన్ని గణముల పిదపయన్న నియమ

మైనది. దేశిచ్ఛందములలో పాదము కాల సంపుటులలో కొలువ బడుచుండుటచే నిది సంభవించి యుండును. గణములను బట్టి పదముల విరుపు గణమునకొక పద మన్న చొప్పున లయ సౌందర్యము అపాత మధురమగుటకు ఇది చక్కగా ఉపక రించును. మొత్తము మీద దేశి చ్ఛందములలో యతి సమద్వ్యఖండన చూప.




గణమున కొక్కయతి :-

తెలుగులో దేశీయ ఛందములలో ఒక్కొక్క గణము పిదప విచ్ఛేద రూపయతి కూడా కవి ప్రయోగములందు కానవచ్చుచున్నది. ఇది లాక్షణికోక్తము కాకున్నను, నియతమై ఉండకున్నను, తరచుగా కవి ప్రయుక్తమై వింత శోభను గొల్పుచున్నది[28]. ఒక్కొక్క గణము పిదప విచ్ఛేదము (పద సమాప్తి) అనగా

ఒక్కొక్క గణమున కొక్కొక్క పదమని అర్థము. కన్నడమునందు యతి నియమము లేకున్నను, కన్నడిగుడైన జయకీర్తి మాత్రము తన ఛందోఽను శాసనమున కర్ణాట విషయ భాషా జాత్యధికారమున గణమునకొక్క యతిని (విచ్ఛేద రూపము) నిర్దేశించినాడు.

“పాదేపాదేఽత్ర ప్రతిగణమపి యతిర్లక్ష్యతే

సర్వేషామక్షరాణామ్” అని అక్షరాణామ్ = అక్కరలలో దీనిని నిర్దేశించి నాడు[29]. గణమున కొక్క పదమన్నది జానపద గీతముల ప్రభావమై యుండును. ఏలయన జానపద గీతములందు మాత్రాసమక గణములు పాదమునందు సరి సంఖ్యలో నుండగా గేయకర్త అక్షర ఛందస్సులలోవలె గణములపై దృష్టినిడక, మాత్రా సంఖ్యను (కాల ప్రమాణమును) మనసునందుంచుకొని ఆ కాల ఖండములకు సరిపడు పదములను పేర్చుకొనుచు పాదములు రచించును. మాత్రాగణమునకు సరిపడు పదము ఒకవేళ ఎక్కువ తక్కువలైన వానిని కాలఖండములకు అనువుగా లఘూకరణమో, దీర్ఘీకరణమో గేయకర్త లేదా గాయకుడు చేసి సర్దుకొని కాల ప్రమాణమునకు సరిపెట్టును. పద స్వరూపములో ఏమైనా మార్పుగల్గినను శబ్ద శాస్త్ర (వ్యాకరణ) దోషము లేనందున ఈ పద్ధతి చక్కగా సాగును. జయకీర్తి అక్షర (అక్కర) ఛందస్సులలో దీనిని నిర్దేశించుటవలన అక్కరలు గేయ ఛందస్సులని, జానపద గీతములనుండి ప్రభవించి ఉండునని భావింపవచ్చును. త్ర్యక్షర గణములతో ఉపయోగించు మార్గ వృత్తములలో ఇది సర్వదాసాధ్యము కాకున్నను[30], భిన్న మాత్రికములు. భిన్నాక్షర సంఖ్యాయుతములు, దేశీయ గణ నిర్మితములగు దేశ్య ఛందస్సులలో ఇది చక్కగా సాధ్యమగును. 3 అక్షరముల పద ములే దొరుకుట సాధ్యము కాదుగాని, 2,3,4,5, అక్షరముల పదములు దేశి గణము లలో సరిపడునుగదా!

ఉత్సాహ : నీవు, ధర్మ, భంగి, నెఱుగ, నేర్తు, నీతి, కౌశలం

— ఆంధ్ర మహాభారతము

ఆటవెలది (సమపాదము) : తినగ, తినగ, వేము, తియ్య, నుండు

— వేమన్న శతకము

సీసము : 1) ఎవ్వాని, వాకిట, నిభమద, పంకంబు — ఆంధ్ర మహాభారతము

2) ఒకవంక, నకలంక, మకరాంక, హయహేష

లోకక్రేవ, వనదేవ, యపతి, గీత — మనుచరిత్ర

మధ్యాక్కర : 1) నరరాజు, సురరాజు, గూడి, సూర్యుతో, నొడబడి, మరియు
—కవిజనాశ్రయము

2) మనలక, నిజశక్తి, జేసి, పడిఁబుంచి, ధర్మంబు, నిలపి
—అరణ్య 4-310

తరువోజ : కురురాజు, మొదలైన, కొడుకుల నెల్ల,
గోల్పోవు, టిప్పుడు, గోవింద, కలిగె
—ఆంధ్ర మహాభారతము
స్త్రీ II-158

కందము : సిరిగల, వానికి, చెల్లును,
తరుణుల, పదియాఱువేల, తగపెం, డ్లాడన్
—శ్రీనాథుని చాటువు

ద్విపద : తొలికోడి, కనువిచ్చి, నిలిచిమై, వంచి
జలజల, రెక్కలు, సడలించి, నీల్గి
—పాల్కురికి సోముని బసవపురాణం

తేటగీతి : పర్వ, యుతమై, చతుర్దశ, పర్వ, మనగ ఆది 1-61
నెయ్య, మొనరంగ, నెరిగింపు, మయ్య, మాకు ఆది 3-22

ఇట్లే "ప్రతిగణమపియతి" విధానము అత్యంత మనోహరమై, లయానందబోధకమై రంజిల్లును. కాని పెక్కు కావ్యకవులు వీనిని ఏఒక్క పాదమునకో రెండు పాదము లకో పరిమితము చేసిరే కాని పద్యమంతయు (4పాదములు)ఇట్లే నడిపించుట బహు స్వల్పము. ఈ విధానములో పదమునొక్క గణముగాక, పదబంధ (సమాస) మునకు కల్పి రెండు గణములు లేదా స్వరసంధి వశమున కలిసిన రెండుపదములకు కల్పి రెండుగణములుగా ఉన్నను లయచెడదు. సమాసమైనను గణమున కొకపదము, సర్వసంధియైన గణము పిదప సంధిగతాక్షరముండుట మాత్రము అవశ్యకము. ఈ నియమము పై ఉదాహరణములలో కాన్పించును. ఉత్సాహలోని 'ధర్మభంగి' వంటి సమాసములు ఆ. వె. లోని 'తియ్యనుండు' తరువోజలోని "కోల్పోవుటిప్పుడు వంటి సర్వసంధులకు గలినాశము కలుగలేదు కదా!

ఒకవేళ గణమున కొక్కపదము సాధింపలేకున్నను రెండుగణములకు కలిపి ఒకే పదబంధము వాడినను గతి తప్పదు. ఉదాహరణమునకు

సీసము : (ఎవ్వాని, వాకిట, నిభమద, పంకంబు)
'రాజభూషణరజో' రాజి, నడరు,

ఆ. వె. అనగ, ననగ, రాగ, "మతిశయిల్లుచునుండు" —వేమన్న

తరువోజ : "ఏలయమ్మునినాకు" "నిచ్చెనిమ్మంత్ర"

మిమ్మంత్ర, శక్తియే, నెఱగంగ, వేడి —ఆది V-28

ఉత్సాహ : "ఆపహిల్లు" నీదు, మనముపందు, గాన, నేను, ఁో

—స్త్రీ I 66 ఆం. మ. భా

తేట గీతి : వెలయ, 'బుణ్యలోకంబులు' గలవె, యనిన —ఆది 3-244

ద్విపద : 'కావ్యకళాప్రౌఢి' కల్పంతు, —ద్విపద బసవపురాణము

ఇట్లొక్కొక్క గణము ఒక్కొక్క పదముచే రచింపబడిన పద్యములందు గేయ సంప్రదాయమందలి లయసౌందర్య ముద్భూతమగును.

**పాదాంతయతి :**

సంస్కృతమునందు ప్రతివృత్తమునకు పాదాంతమున యతి నియతము, వృత్తముయొక్క పాదమునకీ నియమముండుట వలన ప్రతిపాదము యొక్క కాల ప్రమాణముచక్కగావ్యక్తమగును. "యతిస్సర్వత్ర పాదాంతే, శ్లోకర్ధేతు విశేషతః[31]" అని హలాయుధ వ్యాఖ్య. ఇట్లే జయకీర్తి సైతము "పాదాంతే సూచిత స్థానే/యుక్పాదాంతే విశేషతః" అని చెప్పినాడు. పాదాంతమున సర్వత్ర అని చెప్పు చునే శ్లోకార్థమున అనగా రెండు పాదముల పిదప విశేషయతియని నాట్యశాస్త్ర వ్యాఖ్యాత పేర్కొనగ జయకీర్తి సైతము యుక్పాద (సరిపాదములు 2,4) ముచివర విశేషముగానుండవలెనని అదే అభిప్రాయమును ప్రకటించినాడు. పాద పాదమునకు విచ్ఛేదరూపయతితో బాటు రెండు పాదముల పిదప విశేషమైన విశ్రాంతిని పఠిత అను భవించవలయును. అనగా కొంచెము అధికముగా విశ్రాంతి పొందవలయునని అర్థమై ఉండును. తెలుగు ద్విపదగేయ సంప్రదాయమిట్టిదే. రెండుపాదముల ద్విపదలో రెంటిని కలిపి ప్రాస ముడి వేయును. ఆ రెండుపాదముల సమాహారమునకు తర్వాతి రెండుపాదముల సమహారమునకు మధ్య విచ్ఛేదయతియున్ననేగాని రెండు రెండుపాద ములద్విపదలు పద్యమాలికగా కూర్చినట్లగును. లేకున్న వేలాది ద్విపదలను వరుసగా వ్రాసిన ద్విపదకావ్యములందు పాదవ్యవస్థ ద్విపదయొక్క సార్థకతను స్థాపించ జాలదు. కందపద్యముకూడా నిట్లే అర్థభాగముసొక్క సమాహారముగా (రెండు

పాదముల సమూహాము) ప్రాధాన్యమిచ్చినట్లు దానికి లక్షణము చెప్పునప్పుడే చెప్ప బడును. విశేషించి అర్ధము చివర గురువుండవలయునన్న నియమము పైతమునీనిని నిర్ధరింపఁజాలియున్నది. పాదాంతమున సాగదీసి చదువు గేయ సంప్రదాయము నుండి ఈ యుక్పాదాంత గురుత్వము సంభవమై యుండును.

పాదాంత విచ్ఛేద రూపయతి లేకున్న పాదప్రమాణము భంగమగునని, తద్వారా లయలుప్తమగునని ఇదివరకే నిరూపింపబడినది[32]. కాని తెలుగులో ఈ నియమము తప్పనిసరిగా పాటింపబడలేదు. ప్రారంభదశలో దీనికి ప్రాముఖ్య మున్నట్లు తోచును గుణగ విజయాదిత్యునిసాతలూరు శాసనము గల చంపకమాలా పద్యములో సర్వపాదాంతయతి పాటింపబడినది[33]. కాని తర్వాతి కాలమున ఇది లుప్తమై ఒకపాదములోని పదమే తర్వాతి పాదములోనికి చొచ్చుకొని పోవుట బహుధా జరిగినది. మార్గివృత్తములకన్న దేశి పద్యములందు ఈనియమము పాదాంత విచ్ఛేదము చక్కగా పాటింపబడినవి. బహుశ దీనికి కారణము ప్రాసనియమమైయుండును. మార్గి ఛందములందు ప్రాసనిర్బంధమున్నది. సంస్కృతము నందుగాని, తెలుగులోని దేశిపద్యములందుకాని ఈ నిర్బంధము లేదు. ప్రథమ పాదములోని రెండవ అక్షరము 'హ' అనుకొందము. ప్రతిపాదమున పాదాంతవిచ్ఛేద (పదసమాప్తి రూప) యతి పాటింపబడినప్పుడు, తర్వాతి ప్రతిపాదముయొక్క ప్రారంభపదము రెండవ అక్షరముగా 'హ' గల్గిన దానినే ఎన్నుకొని ప్రయోగించవలెను. విషమాక్షర ములు ప్రాసఘటితములైన ఇట్టి పదముల ఎన్నిక కవికి మరింత క్లేశకరము. అట్లు కాక 'హ' పదములోని ఏ అక్షరమైనను తర్వాతి పాదములోని రెండవ అక్షరముగా దానిని నిలుపుకొనగల్గుటకు అవసరమైనచో మొదటి పాదము చివరిపదముగా వాడ వలసి వచ్చును ఒకే పాదము ఉభయపాదములందు నిక్షేపించినగాని ఇది సాధ్యము కాదు. దీనితో పాదాంతవిచ్ఛేదయతి (పదసమాప్తి) సర్వత్ర సాధ్యము కాజాలదు. పాదాంతవిచ్ఛేద రాహిత్యము సహజ సౌందర్యమును భంగపరచునని చెప్పుచు శ్రీ పల్లమూడి గోపాలకృష్ణయ్యగారు విచ్ఛేదం అడుగుతీసి అడుగువేయుట వంటిదని, విచ్ఛేద రాహిత్యం వానిలేక ఆడుగునంటి అడుగువేయుటవంటిదనిరి[34]. రెండవపాద విన్యాసము మనిషికి సహజమైనది కాదు. భూమిని కొలిచేటప్పుడు మాత్రమిట్లు నడ చుట జరుగును. "తెలుగు కవులు ప్రవేశపెట్టిన పాదాంతపద విచ్ఛేదరాహిత్య సమ్మతమతం పాదవ్యవస్థకు భిన్నమైనదని తేలుచున్నది. పాదభ్రమాస్పదమైన "అపాదవ్యవస్థ" కు ఆకరమని స్పష్టపడుచున్నది,[35] అని వారు అభిప్రాయపడిరి

పాదవ్యవస్థ జానపదగీతములలో అనివార్యనియమము. పాదము మీద పాదము కేవల కాల ప్రమాణము బట్టి దొంతరలుగా పేర్చబడును. జానపదగీతముల నుండి వచ్చిన ద్విపద అట్టిదేనైనను పాల్కురిక్కి సోమనాథుడు మున్నగువారు ఈ ఛందము కావ్యమునకుపయోగించునపుడు పాదోల్లంఘన గావించినారు. శిష్టవాఙ్మయములోని వృత్తములలో ఇది పాటింపబడకుండుట చూచి వారిట్లు చేసి ఉందురు. కాని జానపద కావ్యమైన పల్నాటివీరచరిత్రములో ఇది సర్వత్ర పాటింపబడినది. పల్నాటి వీరచరిత్రము మంజరీ ద్విపదలో వ్రాయబడినది. మంజరీ ద్విపదను జానపద గీతముగా గుర్తించిన వొత్తపి వెంకట రమణకవి ఒక్కడు మాత్రము "ఏక పాదమంజరీ ద్విపద" అన్న పేరుతో పాదాంత విశ్రాంతిని తన లక్షణ శిరోమణిలో సూచించినాడు[36]. పాదాంతయతిని కంఠోక్తిగా చెప్పినవారుతెలుగులో ఏలాక్షణికులును లేరు. పాదాంతయతి శ్రవణసౌఖ్యాపాదకము, గతిస్పష్టతాపాదకము, పఠనసౌలభ్య కారకము.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
చకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు
బొంకవచ్చు నఘము బొందదధిప.

పోతన వ్రాసిన పై పద్యములోని భావమునే నన్నయ్య అదే సందర్భమున తన భారతములో వ్రాసినాడు.

చనుబొంకగ బ్రాహ్మణ్యయ
మున సర్వధనాపహరణమున విధిగాప
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహసమయములందున్.

కాని ఈ పద్యము కన్న పోతన పద్యము అతి మనోహరమై మిక్కిలి ప్రచారము లోనికి వచ్చినది. పాదాంతమున విచ్ఛేదము లేనప్పుడు మాత్రాసమక గణములతో నిర్మించినదైనను తూగు లేక సౌందర్యము కోల్పోవును. క్రిందిది ఉదాహరణీయము

| | |
|---|---|
| లరిభయంకర జయం | 10 మాత్రలు |
| కరసవిత్రక్షేత్ర | 10 మాత్రలు |
| వీరవిస్ఫారభా | 10 మాత్రలు |
| రత కురుక్షేత్రాన | 10 మాత్రలు |
| కలుష కౌరవచమూ | 10 మాత్రలు |
| కర్ణభేదస్ఫుగా | 10 మాత్రలు |
| విజయగాండీవరా | 10 మాత్రలు |
| వము విజృంభించినది[37]. | 10 మాత్రలు |

జయంకర, భారత అని కలిపి చదివితే మాత్రాసమత/పాదకాల ప్రమాణము లుప్త మగును. తెలుగులో పాందాంతయతి సౌందర్యమును అందరు కవులు గుర్తించినను, దీనిని చక్కగా పాటింపరైరి. ముఖ్యముగా మార్గి వృత్తములందు వేయి కొక్కటి యైన పద్యము పాటింపబడలేదు. దేశి పద్యములందు మాత్రము ఇది అధికముగానే పాటింపబడినది. నన్నయ మొదలుకొని కవులందరును కొద్దిగా పాటించినను, వేమన్న వంటివారిద్దరు ముగ్గురు మాత్రము ఈ విధానమును అనుసరించి తమ పద్యములందలి ఒక్కొక్క పాదమునే నిత్యజీవితోపయోగి సూక్తిగా తెలుగువారి నాల్కలపై భద్రపరచుకొనగలిగిరి. పాదాంతమున యతి (విచ్ఛేదమును) పాటింపని కారణముగా పాదము ప్రమాణ రహితమగును. అర్థభంగమగునని పాదాంతమున పాఠకుడు విరిచి వికృతమొనర్పడు".... భీష్మందు కే—శవ!...." యన్నప్పుడు[38] పాదాంత విచ్ఛేద మొనర్చిన 'శవ!' యని సంబోధనతో తర్వాతి పాదము ప్రారంభ మగును. అట్లు చదువక అర్థసమాప్తి ఐనచోటనే విరామమును పాటించును. "యత్రార్థ సమాప్తిఃస్యాత్‌విరామః"[39] అని భరతుడు చెప్పిన విధమున భావము ముగిసినచోట ఆగును. అందులకే తెలుగులో పద్యపఠనా కౌశలమును పాదవిభజన దృష్టితోగాక, అర్థయుక్త పదవిభాగవశమును బట్టి నిర్ణయించుట సంప్రదాయమైనది. ఏలయన ఒక్కొక్కసారి పాదాంత విచ్ఛేదమున్నను అర్థసమాప్తి కాదు.

ఆ. వె. ధర్మతనయ నిన్ను తద్రాజ్యసంపదల్
వలచి తమకు దామ వచ్చిపొందు. అర-I-61.

"సంపదలు తమకు తామె వలచివచ్చి నిన్ను పొందు" అన్న అర్థము రెండు పాదము లందు కల్పి సమాప్తమగును. తెలుగులోని దేశి చ్ఛందములలో సీసమొక్కటి

మాత్రము పాదసమాప్తితోబాటు అర్థసమాప్తి కలిగి పద్య నిర్మాణమును గావించుటకు సమర్థమైయున్నది. సీసమందలి ఒక్కొక్క పాదమును ఒక్కొక్క విషయమునకు లేదా వర్ణనాగుణమునకు వాడి, పిదప ఎత్తు గీతిలో భావసమన్వయము చేయుట కాంచనగును. "ఎవ్వాని వాకిట నిభమద పంకంబు...." వంటి సీసములు వాని ఎత్తుగడలు, పాదసమాప్త భావములు, ఎత్తుగీతి ముగింపులు తెలుగులో ఎందరో కవులు ఉపయోగించుకొనినారు.

ఇట్లు యతి లేక వడి తెలుగులో మార్గి వృత్తములందు సదృశాక్షర/సాజాత్యాక్షర రూపముకాగా, దేశి పద్యములందు విచ్ఛేద, సారూప్య అక్షర నిర్దేశనములు రెంటి రూపములో ఉండి, లయబోధక, అనుప్రాస విన్యాస రూపమునై వెలసినది.

దేశి చ్ఛందములలోని యతి, మార్గిచ్ఛందముల యతికన్న విశిష్ట సౌందర్య హేతువుగ కన్పట్టు చున్నదని పిండితార్థము.

—x—

## అథ సూచికలు

1. వృత్త రత్నాకరమ్ - కేదార భట్టు I-12
2. ఛందోఽను శాసనమ్ I-16
3. ముఖరతా నిమిత్తం యతిరిష్యతే - కవికల్పలత
4. ఛందోఽను శాసనమ్ I-10
5. ఆంధ్ర ఛందో గ్రంథములలో ఇవి వియతి చ్ఛందోఽధికారమున ప్రత్యేకముగా చూపబడినవి.
6. ఛందోంఽబుధి (నాగవర్మ) పు. 13
7. యతిర్విచ్ఛేదః- ఛం.శా. 6-1
8. అప్పకవీయము - III-6
9. "ప్రాసమైనను యతిపై వడిమైన దేసిగానిల్పి"-పండి-చరి,
10. నా. శా. XIV-104

11. ఛందోఽను శాసనము (జయకీర్తి) సంజ్ఞా-13 [స్వయంభూఛందము, గంగా దాసుని ఛందోమంజరి కూడా పేర్కొనినది.]
12. కవిజన రంజనము, సింహాసన ద్వాత్రింశిక (IV-187-192)
13. ఆరుంబాక తామ్ర శాసనము
14. రాయప్రోలు సుబ్బారావు "దూతమత్తేభము"
15. ఛందశ్శాస్త్రము - పేకుమళ్ళవారు.
16. ఆంధ్ర సరస్వతికి బరువునగలు. "సాహితిజగతి" పు. 195
17. యతిప్రాసలు-ఆంధ్రపత్రిక ప్రమోదూత సంవత్సరాది. 1930-31
18. తె. ఛం. రీ. పు. 250
19. "చతుః షట్ సప్త విరతి వృత్తం సప్త దశాక్షరం మందాక్రాంతా"- సువృత్త తిలకం 1-35
20. కవిజనాశ్రయము - సంజ్ఞాధికారము
21. " - యతిచ్ఛందోఽధికారము
22. "కాంతా కాంతా - మఘనతతగా - కాంతి సంక్రాంతి మందా" కవిజనాశ్రయము-యతిచ్ఛందోఽధికారము
23. అప్పకవీయ భావప్రకాశిక - రావూరి దొరసామిశర్మ
24. ఇది జానపద గీతములలోని ఛందస్సులలో వివరింపబడును.
25. ఇట్టి మాత్రాత్మక కాలఖండముల నుండియే తెలుగులోని సూర్యేంద్ర చంద్ర గణ వ్యవస్థ వచ్చినట్లు ఇదివరకు 'గణములు' వద్ద నిరూపితమైనది.
26. మధ్యాక్కర యతికి గల ద్వివిధ మతములు 'అక్కరలు' వద్ద వివరముగా చూపబడును.
27. 'జాతిపద్యము-అంతరాక్కర'- బండి నాగరాజు భారతి, ఏప్రిల్ 1965, పు. 4
28. పొత్తపి వేం. రమణకవి 'ఏకపద మంజరి ద్విపద'కు మాత్రము 'వాసప్రల్ ముప్పురు' వనజాప్తు పొకడు, ఒక్కొక్క పదమునవొనరి....' అని గణ మునకొక్క పదమని చెప్పినాడు. ల. శి. III-340. పు. 217
29. ఛందోఽను శాసనము VII-8-జయదామన్ సం. H. D. వేలంకర్
30. మార్గి వృత్తములలో గణమునకో పదమన్నది 'గణములు' అన్నచోట ఇచ్చే గ్రంథమున వివరింపబడినది.

31. ఛంపోఉసు శాసనము - హేమచంద్రుడు I-10

32. 'పాదము' అన్నచోట ఇదే గ్రంథమున వివరింపబడినది.

33. ఇది సంస్కృత పద్యమైనను, తెలుగు (పాదమధ్య) యతి పాటింపబడివ తెలుగు పద్యము.

34. మార్గి - దేశి పు. 160

35. ” ” ”

36. లక్షణ శిరోమణి III-340 పు. 216

37. జ్యోతి - 'అరుణ కిరణాలు'- కరుణశ్రీ ఖండకావ్యము

38. ఇది నన్నయ ప్రయోగము. కే=కేకయని, శవ=కృష్ణుని నిందయని - ఇది పలుకుబడి వైచిత్రియని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నిర్వచించిరి. 'తెలుగు మెఱుగులు' పు. 24

39. 'విరామోహి అర్థానుదర్శకః' అని భరతుని వేరొక్క నిర్వచనము. నాట్య శాస్త్రము XVII-134.



## VII. ప్రా స ము :-

తెలుగువారి శబ్దాలంకార ప్రియత్వమునకు లక్ష్యభూతముగ యతి సదృశాక్షరరూపమైనట్లే అనుప్రాస రూపమైన ప్రాసయొక్కటిఛందోంగమై నియతమైయున్నది. సంస్కృతమున ప్రాసలేదు. ప్రాసయన్న శబ్దము కూడా ప్రయోగములేదు. శబ్దాలంకారములలో అనుప్రాసము మాత్రము ఆలంకారికులచే చెప్పబడినది. "వర్ణసామ్య మనుప్రాసః" అని విశ్వనాథ కవిరాజు సాహిత్య దర్పణమున నిర్వచించెను.[1] తెలుగునందలి ప్రాసకూడ ఇట్టి వర్ణసామ్యమే. అనుప్రాసకు ఇన్నవ అక్షరమని కాని, ఇన్నిమార్లు ఆవృత్తికావలెనని కాని నియమములేదు. గద్య పద్యోభయములందు ప్రయోజ్యమే. తెలుగులో ఇది ద్వితీయాక్షర రూపము మాత్రమే- "ద్వితీయోవర్ణః ప్రాసోఽత్రపాదపాదేషు", "ప్రాసస్సర్వేషు పై కవివస్యాత్" అని చింతామణి నిర్వచనము. ప్రతిపాదమునందలి ద్వితీయ వర్ణమేకరూపమై ఉండవలయును. ప్రాస స్వభావమును బట్టి అనుప్రాస రూపమేమైనను ద్వితీయ వర్ణమే ఇట్లుండవలయునని నిర్ణయింపబడుట విశేషము. ప్రాస సంస్కృతమునుండి వచ్చినదని ఛందోవిమర్శకులు భావించినను ద్వితీయ వర్ణమే ఇట్టి నియమము కల్గియుండుటకు కారణము చెప్పరైరి. సంస్కృతమునందు ద్వితీయాక్షర రూపమై అనుప్రాస తెలుగుకోవలెనే క్వాచిత్కముగా వాడబడినది. దండి కావ్యదర్శనమున ఇట్టి ప్రయోగము కావించెను

> చంద్రే శరన్నిశోత్తంసే కుందస్తబక విభ్రమే
>
> ఇంద్రనీల సమంలక్ష్మ సందధాత్యలనశ్రియం[2]

భోజుని చంపూరామాయణమ్‌లో ద్వితీయాక్షర ప్రాస

> ఖణ్డనాయవసుధావధూమనః
> పుణ్డరీక తుహినద్విషాం ద్విషామ్
> దణ్డ కావన మవాపరాఘవ
> శ్చణ్డ భానురివ మేఘమణ్డలమ్

—(అయో — కాం. 86 పుట) వంటివి కొన్నిచోట్ల వాడబడినవి[3].

కాని పెద్దెవ్వరునూ ప్రాస ద్వితీయ వర్ణరూపముగా చెప్పలేదు. "ఇత్యనుప్రాస మిచ్ఛంతి, నాతి దూరాంతర శ్రుతిం" అని దండియు[4], "ఆవృత్తిర్యాతు

వర్ణానాం, నాతిదూరాంతర స్థితా" అని భోజుడును[5] పాదములోనే దగ్గర దగ్గరగా వాడుటను చెప్పినారు.

ఒక్క అక్షరసామ్యత తప్ప సంస్కృతాను ప్రాసమునకు దీనికి సంబంధము లేదు. ప్రాస పూర్వాక్షర నియమము, ప్రతిపాద ద్వితీయ వర్ణైకత్వము తెలుగులో దీనికి ప్రత్యేక అస్తిత్వమును నిరూపింపజాలియున్నది. తమిళ కన్నడము లందు సైతము ఈ ప్రాసఉండుట వలన ఇది సంస్కృతమునుండి వచ్చినది కాక దేశ భాషా సహజమని చెప్పవలయును. తెలుగులో గల ప్రాస స్వభావమును నిర్దిష్టముగా జయకీర్తి తన ఛందోఒను శాసనములో చెప్పినదానికి సరిపోవును.

పాదాక్షర మాత్రానియ
మోదిత పిండోఒద పాదవత్పద్యంస్యాత్
పాద ద్వితీయ వర్ణః
పాదం పాదం యపేతి సోఒను ప్రాసః[6]

ప్రాస లక్షణమును చెప్పుటతో బాటు పై విపులార్యా ఛందమున ప్రాసకూడ (దకార ప్రాస) ఘటించినాడు. దాక్షిణాత్యుడైన జయకీర్తి పేర్కొనిన ఈ అనుప్రాస మచ్చముగా తెలుగులో నున్నట్టి ప్రాసయే తమిళమందలి "ఎదుగైత్తొడై" కూడా ఇట్టి ద్వితీయాక్షర సంబంధమే.

తెలుగులో ఇట్టి ప్రాసను లాక్షణీకించునపుడు ఆధ్యఛాందసికుడైన రేచన దీని భావములను చెప్పుచు, దీనిని శబ్దాలంకారముగనే భావించెను. సుకర దుష్కరములన్నవి ద్వితీయాక్షర సంబంధ ప్రాస బేదములు కాగా, ద్వి, త్రిప్రాసములు, అనుప్రాసాంత్యప్రాసములు నాల్గు శబ్దాలంకార భూయిష్టములు. వీని నారింటినాతడు ప్రాస భేదములుగనే భావించినాడు. అనంతాదులు ప్రాసలను విడిగా పేర్కొని, వానితోబాటు శబ్దాలంకారములగు ప్రాసలను కూడా (రేచన చెప్పిన ఆరింటిని) వేరుగా పేర్కొనినారు. "ప్రాసమన్నది అనంతాదులు చెప్పినట్లు శబ్దాలంకారాలేకాని విభిన్నాలుకావని" జి.వి. కృష్ణారావు[7] వంటివారు అభిప్రాయపడుటకు కారణము సుకర, దుష్కర (సులభాక్షర, కఠినాక్షర ఘటితములగు) ప్రాసములు శబ్దాలంకార ప్రాసలుగనే భావించుటయే. కాని అనంతుడు అప్పకవి మున్నగువారుప్రాస, అనుప్రాసలకు మధ్య శబ్ద సౌందర్య దృష్టితో అభేదమును భావించినను, ద్వితీయాక్షర ప్రాసమును ప్రత్యేక ఛందోలక్షణముగా భావించి వేరువేరుగనే ప్రభేదములను వివరించిరి. తెలుగువారు

అక్షరసౌందర్య సృష్టితోడనే యతిని విచ్ఛేదరూపమైనను, సదృశాక్షరనియతి రూపముగా మార్చినట్లే అనుప్రాసను కూడా ప్రాసనియతిగా పాటించిరనవచ్చును. ప్రాసలేని జానపద గీత ఛందమైన మంజరీ ద్విపదను ప్రాస పెట్టి ద్విపదగామార్చుట, ప్రాసలేని ఆటవెలదిని ప్రాసపెట్టి పదునగీతిగా మలుపుకొనుట తెలుగువారి శబ్దాలంకార ప్రియతకు మరొక్క నిదర్శన.

ప్రథమాచ్చునకును, ద్వితీయాచ్చునకును మధ్యగల వర్ణసముదాయము ప్రాసమనపలయును. "గంగాసంగమ...." ఉన్న పద్యములో గకారోత్తరవర్తి అకారము. దానికిని ద్వితీయ గకారోత్తరవర్తి 'ఆ'కారమునకు మధ్యగల వర్ణ సముదాయము ప్రాసాక్షరమగును. గ్+అ+మ్+గ్+ఆ (గంగా)లో పూర్ణబిందు పూర్వక గ్ వర్ణము ప్రాసాక్షరమగును. ప్రాస పూర్వము పూర్ణబిందువుండెనేని దానిని కూడా కట్టుకొని, ప్రాసవర్ణమైన హల్ మీది స్వరముతో పనిలేకుండ ప్రాస చెప్పవలసి వచ్చుటచే ప్రథమద్వితీయాచ్చుల మధ్యగల వర్ణసముదాయమని చెప్పబడి ప్రాసములో హల్లునకే ప్రాధాన్యము. పై అచ్చుకలిసికున్నను సరిపడును.

"విరామము స్వర ప్రధానము

ధరప్రాసము వ్యంజన ప్రధానమునగుటన్...." అని ప్రాసము హల్ప్రధానమని చెప్పబడినది.[8] తెలుగులో ఏ పదమైనను ద్వితీయాక్షరము హల్లు కల్గియుండుటచే ప్రాసమున హల్లు వచ్చినను కవిజనాశ్రయమందలి ఈ క్రింది పద్యము విలక్షణమై కేవలాచ్చు ఘటితమై యున్నది.

అ ఆలై ఔలకుమది
ఇఈలు ఋకార సహిత మెఏలకునౌ
ఉఊలద్దములో నొదబడి
ఒఓలకు వళ్ళగున్న యోన్న చరితా!

ఈ పద్యమునందు ప్రాసస్థానము హల్లులేదు. ప్రాసక్షరమేది? 'ఆ' ప్రాసవర్ణమంచుమేని ప్రతిపాదములో ఈ,ఊ,ఁ,లని వేరు అక్షరములు వాడబడినవి. కాని అచ్చులతో పనియేమి' అచ్చులెట్లున్నను ప్రాసలో లోపములేదు కదాయన్న హల్లులేవి? హల్లులులేని ఇట్టిప్రాస ప్రాసయేకాదనవలసివచ్చును. హల్వర్ణము లేక వర్ణసముదాయము రెండు తొలిమలి అచ్చులనడుమగల వానిని పక్కన 3 పాదములు ద్వితీయాక్షరములుగా వాడినపుడే ప్రాసఘటితమైనట్లగును. ప్రాచీన కవులెవ్వరును

ఇట్టి పద్యమును వాడరైరి. ఇట్టిదే మరొక విలక్షణమైన పద్యము రాపూరి దొరసామి శర్మగారు దాహరించిరి.

భో అచ్యుత భో బ్రహ్మన్
భో అంబర బారిజాం విభో సర్వేదే
వా అయాత వ్యాయన
గో అగ్రణి నెక్కి శివుడు గొబ్బున వెడలెన్[9].

తెలుగులో పద మధ్యమున అచ్చులేకుండుటయు, పాదాద్యక్షరము 2,3,4 పాదము లందు ఒక పదముతో ముగిసి, ద్వితీయ (ప్రాసా) క్షరము అచ్చుతో ప్రారంభమగు ననుకొన్నను, అది సంధిలేనిచోట యడాగము వచ్చి 'య' ప్రాసాక్షరముగానైనను నిలువిపోవలసి యుండగా పై పద్యములు విశేషములైనవని చెప్పవచ్చును.

## ప్రా స పూ ర్వా క్ష ర ము :—

ప్రాస పూర్వాక్షరము మొదటి పాదములో గురువైన తక్కిన అన్ని పాదములందు గురువే. లఘువైన లఘువే ఉండవలయును. అనగా పాద ప్రారంభా క్షరము నాల్గుపాదములందు ఒకే రీతిగ ఉండవలయును. ఈ నియమమును స్పష్టముగా చెప్పిన వాడప్పకవి. ప్రాస పూర్వాక్షర నిర్ణయము మార్గ ఛందముల కక్కరలేనిది. ఇది కేవల దేశ్య ఛందములకు మాత్రమే సంబంధించినది. ఏలయన మార్గ ఛంద ములలో అన్ని పాదములకు గణములు సమానరీతిలో ఉండును ఉదాహరణమునకు ఉత్పలమాలలో ప్రారంభాక్షరము అన్ని పాదములకు గురువే ఉండును. దేశి చ్ఛందములందు మాత్రము గణ నిర్బంధము లేకుండుట వలన ఈనియమము చేయ బడినది. ఈ నియమము జాతి పద్యములలో అవసరము. ఉపజాతి పద్యములలో ప్రాస అక్కర లేకపోవుట వలన దీని అవసరములేదు. కాని యతికిబదులుగా ప్రాసయతి ఎప్పుడైనా వాడబడినపుడు ఈ నియమము ప్రాసయతిలో కూడ వర్తిం చును ప్రాసయతిలో సైతము ప్రాసపూర్వాక్షరము గురువో, లఘువో ఏక రూపమున నుండును. ఈ నియమము చేయబడుటకు కారణము ఊనికమై యుండును. ఏలయన దీర్ఘాక్షరము మీది అక్షరము తేల్చి పలుకబడును. ఒకవేళ పదములోని మొలియక్క రము హ్రస్వమేని, ద్వితీయాక్షరము మీద ఊనిక నిలుచును. ఏచు, తూచు, వీచు, కాచు, అని ప్రాసవేసినప్పుడు వీనిలో అన్నియును సమానమైన ఊనికికల్గియుండును. ఏచు —తుచు, వీచు — కచు అని కొన్ని గురువులు, కొన్ని లఘువులుండెనేని అను

ప్రాసముచ్చరించుటలో గల సౌందర్యము, నడకబిగువును. మార్గ ఛందములందు దీని ప్రభావమంతగా కానరాకున్నను, దేశ్యఛందములలో ముఖ్యముగా ప్రాసయతి వేయబడు ఉపజాతి పద్యములలో ఇది స్పష్టముగా గోచరించును.

ప్రాసఅన్నది వృత్తములలో నియతము కాగా, దేశి పద్యములలో అనియతముగుట గమనించవగినది. సంస్కృత వృత్తములకు సహితము సంస్కృతము నందు లేని ఈ నియమము తెలుగులో ప్రాచీన కాలముననే పాటింపబడుట శాసనము లందు కాననగును. తెలుగు కవులు సంస్కృత భాషలో వ్రాసిన శాసన పద్యము లందు సంస్కృత ఛందము లేవైనను ప్రాసను పాటించిరి. తెలుగు దేశ్య ఛందము లందు ప్రాసలేని పద్యములుండుటయును వానిని లాక్షణికులు ఉపజాతులని పేర్కొనుటయు చూడ ఈ జాత్యుపజాతి భేదము అతిప్రాచీనకాలము నుండియే ప్రాస ఐచ్ఛికతను తెలుపుచున్నది. ప్రాచీన తెలుగు శాసనములలో ప్రాస కానరాక పోవుటచే ప్రాసను మార్గ ఛందస్సులకు వలెనే దేశి పద్యములందు ప్రవేశపెట్టినట్లు కాననగును. జానపద గీతములందు ఈ ప్రాసనియమము లేదు. జానపద ఛందమైన ద్విపద జానపద గీతములలో ప్రాసరహితమైనను, శిష్టసాహిత్యములో ప్రాస వేయ బడినది. ఐనను ఆ ఛందము యొక్క ప్రాచుర్యమునుబట్టి ప్రాసలేని ద్విపదను కూడా 'మంజరీ ద్విపద'గా లాక్షణికులు గుర్తించి లక్షణ గ్రంథములలో వ్రాసినారు. ఆట వెలదికి ప్రాసలేదు. ప్రాసవేసి పవడగీత అనినారు. సీసమునకు ప్రాసలేదు. ప్రాస వేసి ప్రాస సీసముగా సీసభేదములను కూర్చినారు. కాని సాధారణ సీసమే ప్రచురమై ప్రాసగల సీసము యొక్క ఉపయోగము కావ్యములందు కానరానిదైనది. రగడకు మొదట ప్రాసలేదు. ఇట్టివి శాసనోపయోగమున కాననగును. అంత్యప్రాసఉన్నది. తర్వాత దీనికిని ప్రాస వేయబడినది. ఇది పాల్కురికి సోమన్నతో ప్రారంభమై నట్టున్నది. ఆదినుండియు జాతిపద్య (ప్రాస సహిత) ములతోబాటు ఉపజాతి (ప్రాస రహిత) పద్యములు సమాంతరముగా ప్రచురములగుటను బట్టి దేశ్య పద్యములకు ప్రాసవ్యవస్థ లేదనియు, సహజము కాదనియు, మార్గ ఛందప్రభావమున శిష్టకవులచే కల్పించబడినదనియు భావింపవచ్చును.

దేశ్య ఛందములకు మూలమనదగిన జానపద ఛందములందు ప్రాసలేదు. యతి తప్పనిసరిగా పాటింపబడినవి. నిత్యవ్యవహారములోని సామెతలలో ఇది కాన నగును. అదియును ప్రాసవలె కాక ప్రాసయతిగా కాననగును. పెక్కురు ఛందో విమర్శకులు దీనిని ప్రాసగా చూపిరి.

అత్తమీదికోపం — దుత్తమీద దీసె
ఢిల్లీకి రాజైనా — తల్లికి బిడ్డడే
పేదవాని కోపం — పెదవికి చేటు
ఉత్తర చూసి — యెత్తర గంప
పూకలేనివాడు — పోకచెయ్యలేడు
అప్పుచేసి — పప్పుకూడు

పై సామెతలను రెండు పాదములని భావించిననేగాని ద్వితీయాక్షర సదృశరూప ప్రాసము కానేరదు. దీనిని ఒక్కొక్క పాదముగనే భావించవలయును. 5, 6 అక్షరములకే ఒక పాదముగా భావింపరాదు. 4 లేదా 5 గణముల దేశ్య ఛందముల కన్న నిడివి అధికముగా పైవానిలోలేదు. ఇట్టి ప్రాసయతిలోని అనుప్రాస సౌందర్యమే దేశిపద్యములలో ప్రాస లేదా ప్రాసయతి వేయుటకు ప్రేరణపై యుండును.

## ప్రాస - నిర్బంధత్వము :

యతి వలెనే ప్రాస కూడ ఆధునిక ఛందో విమర్శకుల దృష్టిలో కవి భావ ప్రవాహమునకు బంధన హేతువేయైనది. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు ప్రాసలేని పద్యములను తాను వ్రాసినవి చూపి సౌందర్య లోపమేమి లేదని చెప్పినారు[10]. అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు పల్నాటి వీరచరిత్రమును గూర్చి చెప్పుచు "దీంట్లో ద్వితీయాక్షరపు ఆట లేకపోవటంవల్ల సగం తుక్కు వదలటం మొదటి విశేషం" అని వ్రాసినారు. ప్రాస నిర్బంధమైనపుడు వ్యర్థపదా రోపముండునని అది లేకపోవుట వలన తుక్కు లేనిదైనదని వారి అభిప్రాయము. పల్నాటి వీరచరిత్రము మంజరీ ద్విపదలో ప్రాసలేక వ్రాయబడిన జానపద గేయ కావ్యము. రాపూరి దొరసామి శర్మగారు ప్రాసపేరిట వేసిన ప్రయత్న పూర్వక నిక్షిప్త పదములకు "ప్రాసపూజా కుసుమములని" ముద్దుగా పేరిడినారు[11]. క్లేశకర మైనా శ్రావ్యత ఉందని యతిని సమర్థించినా ప్రాసం నిర్వహించే పనేమీ కన్పించదు. పద్యం హ్రస్వ పాదాత్మకమైతే ప్రాసం చెవికి చప్పున వినిపించి కొంత శ్రవణ సుఖాన్ని కలిగిస్తుంది. కాని తెలుగులో సాధారణంగా వాడబడే ఉత్పలమాలాదులలో ఇరవై అక్షరాల దీర్ఘకాలం తర్వాత ప్రాసం వచ్చినా దానివలన శ్రావ్యత పెంపొం దదు" అని కాకూరి హనుమంతరావుగారనిరి[12].

ప్రాస అనుప్రాస సౌందర్యాపాదకమైనప్పుడు పై అభిప్రాయము సరి యైనదే. అనుప్రాసము దగ్గర దగ్గరగా వాడబడినపుడే శ్రవణ సౌఖ్యము నిచ్చును. "ఇత్యనుప్రాస మిచ్ఛంతి 'నాతిదూరాంతర' శ్రుతిం", "అనువృత్తిర్యాసు వర్ణానాం నాతి దూరాంతర స్థితా" యని దండి, భోజులు నిర్వచించుట ఇందులకే.

అంతట సంతస మడుము లంబురుహాసన వచ్చి భర్తపా
దమ్ముల కాదరమ్మెసగ[13]..." అని యిట్లు దగ్గరగా వేసిన ప్రాస

అనుప్రాస సౌందర్యము నిచ్చును. దీర్ఘపాదములైన తెలుగులోని మార్గి ఛందము లందు పాద ద్వితీయాక్షరముల సామ్యము అనుప్రాస సౌందర్యమును వ్యంజింపు ననుట సత్యదూరమే. దీనికితోడు ప్రాసనియతివల్ల పాదాంత విచ్ఛేదము భంగపడుట జరుగును[14]. లేక శబ్ద ద్వితీయాక్షరములు తుల్యములైన నాలుగు పదములు పద్య భావమునకు సరిపడునవి కవి ముందే గ్రహించవలెను. లేక వ్యర్థ పదమైనను నిక్షేపించవలయును. ప్రాస వలన నిరర్థక పదప్రయోగము పద్యములో వచ్చునని పలువురి అభిప్రాయము. పలువురు కవులు సైతము మట్టిపోట్ల ప్రలోభపడిరి. అనువాద గ్రంథములందు సైతము మూలగ్రంథములోని కీలకములైన మాటలను, పదబంధము లను యతిప్రాసల స్థానము నుండి తప్పించి వ్రాయవలసి వచ్చును. శ్రీహర్షుడు వ్రాసిన నైషధీయ చరితమును శ్రీనాథుడు తెలుగులో వ్రాసినపుడు "గమికర్మీకృత నైకనీవృత...." "సదసత్సంశయ గోచరోదరి...." అన్న సమాసములకు ఆకర్షితుడై రెండునూ మత్తేభ విక్రీడితములో వ్రాయ వీలైనను పాద ప్రారంభము నకు సరిపోవునట్టి ఈ రెంటిని ప్రాస కారణముగా ఒకే పద్యములో వ్రాయలేక భావ పునరుక్తి జరిగినను రెండు పద్యములందు వేరువేరుగా వ్రాయవలసినవాడైనాడు[15], గమి - సదలకు ('మ-ద') ప్రాస కుదరకపోవుటే దీనికి కారణము.

శ్లో॥ "అక్రాంత ప్రతి పార ప్రహత రసనావిర్భూత భూరిశ్రవా
జిహ్మ బ్రహ్మముఖౌఘ విఘ్నితనవస్వర్గ క్రియాకేళినా" అన్న శార్దూ

లములోని "ప్రతిపార... కేళినా" అన్న దీర్ఘ సమాసమును ప్రౌఢత్వము కొఱకు యథాతథముగా వ్రాసిన శ్రీనాథుడు "వేదాభ్యాస విశేషహత రసనావిర్భూత భూరిశ్రవా" - యని వ్రాసి జిహ్మ అనుటకు ప్రాస కుదరక - నాదబ్రహ్మము ఖౌఘవిఘ్నిత నవస్వర్గక్రియాకేళిచే[16]" యని శబ్దపరివృత్తి గావించినాడు. సంస్కృతాంధ్రము లందలి ఈ దీర్ఘ సమాసము ఒకే ఛందముల వృత్తస్థమైనను, సంస్కృతము

నందలి సమాసమును పరిష్కృత్తి (శబ్దములు మార్పిడి) లేక వాడుటకు తెలుగులో శ్రీనాథునకు ప్రాస అడ్డము వచ్చినది. ప్రాసకు పదములుగా 'వేద - నాద' యని నిష్టము చేసికొని పద్యమును వ్రాయవలసిన వాడైనాడు. ఒక్క ప్రాసాక్షరమునకే యిబ్బైనపుడు ద్వ్యక్షర లేక త్ర్యక్షర ప్రాస గూర్చి చెప్పవలసిన పనిలేదు. అవి కవి ఉచిత పదప్రయోగ స్వేచ్ఛను పూర్తిగా హరించివేయును. అందులకే అట్టి ప్రాసలను లాక్షణికులు చెప్పినను కవులు (రెండు లేదా అంతకన్న ఎక్కువ అక్షరముల ప్రాసను) క్వాచిత్కముగానైనను వాడరైరి.

శబ్దాలంకార సంబంధముగా, ప్రాసమైత్రి సంబంధములుగా ప్రాస భేదములు చెప్పబడినవి. మైత్రీ సంబంధముగా గాక కేవల శబ్దాలంకార సంబంధముగా కవిజనాశ్రయకారుడు చెప్పగా, అనంతాదులు ఉభయ విషయముగా ప్రాస భేదములు చెప్పినారు. కవిజనాశ్రయకారుడు నాటికి ప్రాసమైత్రి విషయముగా భేదము లేర్పడక కాబోలు కేవల శబ్దాలంకార సంబంధముగా షడ్విధ ప్రాస భేదములు చెప్పినాడు. 'శబ్దాలంకార సంబంధములని' కంఠోక్తిగా పేర్కొనలేదు. అనంతాదులు మాత్రము ప్రాసమైత్రి సంబంధములుగా పాస భేదములు చెప్పి, కవిజనాశ్రయకారుడు చెప్పిన షడ్విధ భేదములను శబ్దాలంకార భేదములుగా పేర్కొనిరి. సుకర, దుష్కర, ద్వి, త్రి, అనుప్రాస, అంత్యప్రాసములని పేర్కొనబడిన ప్రాసములలో విశేషముగా పరిశీలింపదగినది అంత్య ప్రాసయొకటి. పాదాంతము లందలి యక్షరముల సాదృశ్యమే అంత్యప్రాస. కాగా దీనిలో హల్సామ్యమేగాక అచ్సామ్యమును ఉండవలయును. ప్రాసకొక్క హల్సామ్యమున్న చాలును.

## అంత్యప్రాస :

అంత్యప్రాసము సంస్కృతమున ప్రయోగము ప్రచురముగాలేనిదైనను తెలుగులో మాత్రము నియతరూపమై యున్నది. అంత్యప్రాస నియతమైన ఛందము రగడ, తద్వికృతులగు కళికోత్కళికలు. పాదాంత్యప్రాస సౌందర్య హేతువు. నియత పరిమాణముగల పాదములు పాదాంత విచ్ఛేదితములై చక్కగా పేర్చబడినపుడు వానికి అంత్యప్రాస ఉండెనేని అది మరింత శోభాకరమగును. అంత్యప్రాస గేయ ఛందో లక్షణము. జానపద గేయములలో ఈ లక్షణము బాగుగా కానవగును ఇట్టి గీతములలో పాదాంతమున మాటిమాటికి ఒకే పదము ఆవృత్తమగుట (Refrain) కానగును. ఈ ఆవృత్త పదమునుబట్టి పాటలను వర్గీకరించుట జరిగి

నది. పాల్కురికి సోమన ఈ రీతిగా పర్గీకరించి వెన్నెల పదములు, తుమ్మెదల పదములు మున్నగు రీతిగా పేర్కొనినాడు. ఇట్టి గీతములలో ప్రతి పాదాంతమున వెన్నెల తుమ్మెదవంటి పదముల పేర్పు కానవగును. ఇది ఒకరకముగా అంత్య ప్రాసయే. ఒక్క అక్షరము మాత్రము అప్పుడప్పుడు కల్పి ఒకేరీతిగా పాదాంతమున ప్రయోగింపుట అంత్యప్రాసగా లాక్షణికులు చెప్పగా ఇది బాహ్యాక్షరాంత్యప్రాస అనవచ్చును. ఇట్టి పదావృత్తి (Refrain) నుండియే శతకములందలి మకుట లక్షణము పుట్టియుండవచ్చును. వెన్నెల, తుమ్మెదవంటి పదములందేగాక వేరే గేయములందును ఈ లక్షణము కేవలాక్షర రూపముతోడను ఇతర రూపమున గూడ కాన్పించుచున్నది.

నీళ్ళకోడర శిష్వ
వాళ్ళ పంగదు అప్ప | ప్ప

సీష్కకుడోర తిమ్మ
నిద్దుర్స్తాదమ్మ 17 | మ్మ

వంటివి ఇందుకుదాహరణలు. జానపద గేయము లందలి ఈ పాదాంతము లోని ఊత పదములు అంత్య ప్రాస సౌందర్యమును వ్యంజింపగా, శిష్ట సాహిత్యములో ఇట్టి పద ప్రయోగము 'పునరుక్తి దోష జుష్టముగాన, కేవల అక్షరావృత్తితో అను ప్రాస సౌందర్యము తెచ్చుకొనుట జరిగినదనవచ్చును. జానపద గేయములలోని ఈ నియమము తెలుగులో తిరిగి రగడలలో మాత్రమే నియత మగుట గమనింప దగిన విషయము. రగడలు గేయ ఛందములగుట, మాత్రికా సమగణ నిర్మితములగుట, అంత్య ప్రాస నియతమైన ఏకైక దేశి ఛందములగుటను బట్టిచూడ ఇవి జానపద ఛందస్సునుండి పుట్టిన ఛందస్సులుగా భావించ వలయును. అంత్యప్రాసయుతమైన రగడ రాజరాజు కోరుమిల్లి శాసనమందు కానవచ్చుట, అంత్యప్రాసయొక్క ప్రాచీనతకు నిదర్శనము.

అంత్యప్రాసములో పదావృత్తి ప్రయోగము (జానపద గీతములలోవలె) శిష్టసాహిత్యములో బహు స్వల్పమే మైనను, కావ్యకథలో ప్రత్యేక సందర్భము లందు ప్రయోగింపబడుట కాననగును.

2 అక్షరముల పదము పాదాంతమున ఆవృత్తి యగుటకుదాహరణము

తే॥గీ॥ రమణి మఱికొంత పడిదాక రథము జూచు
తరుణి మఱికొంత సేపు కేతనము జూచు
గాంత మఱిమీద రథపరాగంబు జూచు
పడతి మరియంతటను పట్టియలు సూచు

—కంకంటి ఉ.రా. VI-299

3 అక్షరముల పదము పాదాంతమున ఆవృత్తి యగుటకుదాహరణము.

తే॥గీ॥ భూజనుల బాంధవులలెస్స ప్రోవుమనము
తలపనాకే డుగడయును దానెయనుము
భావమెప్పుడు దనమూర్తి బాయదనుము
నెమ్మియున్ యింత నామీద నిల్పుమనము.

—ఉ.రా. VI - 292

ద్వితీయాక్షర ప్రాస ఇట్లు ఒకటికన్న అధికసుగు అక్షరములతో ప్రాస ఘటింప బడినపుడు **ద్వ్యక్షర**, త్ర్యక్షరాంత్య ప్రాసయన జెల్లును.

కాని యిట్టి ప్రాసలు దేశి ఛ్ఛందములందు మాత్రము పదావృత్తి రూపమున ప్రవేశ పెట్టబడెనేకాని, మార్గివృత్తములందు ఇట్టివి కానరాదు. ఒక వేళ ద్వ్యక్షర. త్ర్యక్షర మాత్ర రూపములుగా (పదావృత్తులుగా గాక) ప్రయోగింప బడినను అవి క్వాచిత్కములై, కవిభావనా స్రవంతికి శృంఖల ప్రాయములై యుండినవి. పై అంత్యప్రాస పదావృత్తి రూపమున సాధించబడినట్లే, ఆది (ద్వితీయాక్షర) ప్రాస సైతము దేశి ఛ్ఛందములందుపదావృత్తి రూపమున అలవోకగా ఘటింపబడుట సర్వ సాధారణము. ఉదాహరణమునకు "ఎవ్వాని వాకిట" వంటి పాద ప్రారంభాక్షరములు పదావృత్తి రూపమున సులభఘటితములై ప్రాస తుల్యములై (ప్రాససీమనజెల్లి) ద్విత్రి ప్రాసములన నొప్పినవి.

—×—

## అథ స్సూచికలు

1. సాహిత్య దర్పణము X-2
2. కావ్యాదర్శమ్ I-56
3. ఈయుక్తి పి.వెం. రాఘవాచార్యులు పరిషత్పత్రిక 1939 ఏప్రిల్ - మే సంచికలో చాలా పద్యములు చూపినారు.
4. కావ్యాదర్శమ్ I-58
5. సరస్వతీ కంఠాభరణమ్ (అలంకారశాస్త్రమ్) XI-70
6. ఛందోఽను శాసనమ్ (జయకీర్తి) 1-125
7. 'ప్రాసలు-అనుప్రాసలు' - శారదామంజీరము -(గోలి ఈశ్వరయ్య సంస్థ రజతోత్సవ సంచిక)
8. అప్పకవీయము III-296
9. తె.భా.ఛం.రీ.పు. 325 - "కవిజనోజ్జీవని సమస్యలు" - కోటి రఘునాథ తొండమాన్ మహీపాల కృతి.
10. 'యతిప్రాసలు'-ఆంధ్రపత్రిక ప్రమోదూత సంవత్సరాది సంచిక (1930-31)
11. తె.భా.ఛం.రీ. - రాప్రాతి పు.158
12. 'సాహితీ జగతి' (ఆంధ్రసరస్వతికి 'బరువునగలు' అన్నవ్యాసమున) పు.195
13. 'యతిప్రాసలు' -వ్యాసములో సన్నిధానము వారుచూపిన వారి స్వీయ ప్రాస రహిత రచన (ఆం.ప్ర.ప్రమోదూత సం.సం.)
14. ఈ సిద్ధాంత గ్రంథమున 'యతి' ప్రకరణమున వివరింపబడినది.
15. శృంగార నైషధము II-21, 20 పద్యములు
16. " " II-41 ప.
17. త్రివేణి-జానపద గేయసంకలనము



## VIII. ప్రాస యతి :-

యతి స్థలమునందు ప్రాసాక్షరమును మైత్రి ఘటించుట ప్రాసయతి. యతి అక్షరమునకు పిదప రెండవ వర్ణముగా ప్రాసముండుటచే యతి స్థానమున సైతము ఒక అక్షరము పిదప ఈ ప్రాస ఘటింపబడుచున్నది. యతికి ఉన్న నియమములు కాక, ప్రాస (ద్వితీయాక్షరమైత్రి) కున్న నియమములు చే ప్రాస యతికి పాటింపవలయును.

ప్రాసయతి తెలుగుభాషకు మాత్రమేపరిమితమైన విశిష్ట ఛందోఽలంకారము. యతిప్రాసలు సోదర ద్రవిడభాషా తుల్యములయ్యును ప్రాసయతి మాత్రము తెలుగులో మాత్రమే కానవచ్చుచున్నది. ఆద్య ఛాంధసికుడైన రేచన దీనిని కంఠోక్తిగా లాక్షణీకరింపకున్నను, తర్వాతి లాక్షణికులు దీనిని వివరించుచు, యతి భేదముగా చెప్పినారు. యతి స్థానమున వేయబడి, యతికి బదులుగా వాడబడుటచే దీనిని యతిభేదముగా వారు భావించినను సంపూర్ణ ప్రాసలక్షణయుతమగుటచే దీనిని ప్రాసగనే భావించుట లెస్స. ప్రాసయతిని, యతిభేదముగా చెప్పినను అప్పకవి ప్రాసలక్షణము వివరించునపుడు లక్ష్యభూతముగా ద్వితీయాక్షర ప్రాసోదాహరణములీయక - ప్రాసయతి లక్ష్యములనే ఇచ్చినాడు. దీనిని బట్టి అతని మతమున ప్రాసయతి, ప్రాస ఒక్కటేయని తలపవలెను. ప్రాసలోని హల్మైత్రి, ప్రాసపూర్వాక్షర నిర్ణయము, ప్రాసవలనగలుగు అను ప్రాస సౌందర్య ప్రయోజనము, పాద విభాగము-ప్రాసయతిలో సైతము ఉండుటచే ఇట్లు భావింపబడుచున్నది.

ప్రాసముకన్న ప్రాసయతితోడనే అనుప్రాస సౌందర్యమెక్కువ. స్వల్ప వ్యవధిలోనే ఆవృత్తియగుట ఇందుకు కారణము. అంతేగాక ప్రాసయతి ఘటితములగు ఉపజాతి పద్యములు నిడివి తక్కువగల పాదములవి. యతిస్థానమును చక్కగా నిర్దేశించి పాదమును యతిపూర్వ, యత్యనంతర ఖండములుగా స్పష్టముగా ప్రాసయతి చూపజాలును. దీర్ఘపాదములుగల వృత్తములలో సైతము ప్రాసాక్షరము సుకరమైనదిగాక విశేషాక్షరమైనపుడు పాదదైర్ఘ్యము స్ఫురించును.

సింగం బాకటితో గుహాంతరమున జేడ్పాటు మైనుండి మా—

తంగ స్ఫూర్జిత — పూర్వబిందుపూర్వక గకారము ఆవృత్తిలో పాదము సంపూర్ణమైనట్టు పఠనావసరమున తెలియబరుచును. ఇట్లే ప్రాసయతి సైతము పాద ఖండములను (యతిస్థానమును) తెలియబరుచగల్గును.

వచ్చునింటికి ప్రజతన్ను

మెచ్చుచూడ యతిస్థానమున విచ్ఛేద రూపములేనిచోట్ల సైతము ఇట్టి పాదఖండములు విడిగా పఠనావసరమున ప్రాసయతి వలన స్పష్ట మగును.

(సనన నలయుగమ్ము - లొనగరంగ నొకపా-)

దంబు నగణపంచ - కంబుగూడ — కవిజనాశ్రయము

పదసమాప్తిలేక పదమధ్యమైన ('పంచకంబు' ఒకే పదము) పాదఖండములు రెండు ప్రాసయతి కారణముగా స్పష్టపడుచున్నవి.

ప్రాసలేని దేశిపద్యములందే ప్రాసయతి వాడుకొనవచ్చును. ప్రాసలేని పద్యములను ఉపజాతి, ప్రాసగల పద్యములను జాతియని పేర్కొన్నట్లే, ప్రాసయతి వాడుటకు వీలైన పద్యములు ఉపజాతులని, వీలులేని పద్యములు జాతులని పేర్కొన వచ్చును. మార్గవృత్తములందు ఈ ప్రాసయతి పూర్తిగా నిషేధము. సంస్కృతమున లేకున్నను తెలుగుయతిప్రాసలు సంస్కృతవృత్తములకు తెలుగులో పెట్టినట్లే ప్రాసయతి పెట్టబడవలసినది. మార్గవృత్తములందు వాడబడకుండుటకు కారణము గేయ ఛందము లందు మాత్రము ప్రయోగింపబడుట కావచ్చును. ప్రాసయతినిబట్టి దేశి ఛందములను ఈ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును.

```
                        —— నిషేధం   (జాతులు)
ప్రాసయతి ————————|—— ఐచ్ఛికం   (ఉపజాతులు)
                        |—— నియతం   (ఉద్ధురమాలా వృత్తములు)
```

జాతులలో ప్రాసఉండుటచే ప్రాసయతిలేదు. ఉపజాతులలో ప్రాసలేకుండుటచే ప్రాసయతి యతికి బదులుగా వాడుకొనవచ్చును. కాని ప్రాసకల ఉద్ధురమాలావృత్తము లందు (లయహారి, లయగ్రాహి, లయవిభాతి) ఈ ప్రాసయతి నియతమైయుండుట విశేషము. ప్రాసయతి కారణముగా ఈ ఛందము దేశిచ్ఛందముగా నిరూపింప వచ్చును. ప్రాస, చతుష్పాదవ్యవస్థ, తక్కిన అక్కర, ఉత్సాహాదులకు వలెనే వృత్తముల ప్రభావమువలన వచ్చి ఉండవచ్చును.

తెలుగు భాషకు సహజమైన ఈ ప్రాసయతి దేశీయమన్న భావము ఆది నుండి ఉన్నదే. పాల్కురికి సోమనాథుడు

ప్రాసమైనను యతిపై వడిమైన
దేసిగా నిలిపి యాది ప్రాసని యతి
వప్పకుండ ద్విపదలు రచియింతు — పండితారాధ్య చరిత్ర

అని యతిపై (యతిస్థలముమీద) పడినదైన ప్రాసదైన, (తెలుగు సదృశాక్షర రూపపడి గాని, ప్రాసయతిగాని) దేశిగా నిల్పుటయని దీనికర్థము. ఇచ్చట తొలిపదము 'ప్రాస' యనగా ప్రాసయతియే. లేనిచో తిరిగి 'ఆదిప్రాసనియతి తప్పకుండ' అని తిరిగి వ్రాయవలసిన పనిలేదు. అందులకే సమకాలీనులనుండి "పాల్కురికి సోమపతితుడీ నడుమ (పాదమధ్యమున) ప్రావళ్ళు (ప్రాసయతి) పెట్టి కవిత్వము చెప్పుచున్నాడ"ని విమర్శలు వచ్చినవి. పాల్కురికి సోమనాథుని బసవ పురాణమున ద్విపదకు ప్రాస యతి వేసిన చోట్లున్నవి. ద్విపదజాతి పద్యమైనను గేయ ఛందమగుటచే ఛందో విశేషజ్ఞుడగు సోముని చేతిలో ప్రాసయతి శోభితమైనది. ఈ ప్రాసయతి భాషలో సహజముగనే యున్నట్లు సామెతలు, జానపద గీతములందు కాంచనగును.

అత్తలేనికోడ
లుత్తమురాలు
ఢిల్లీకి రాజైనా
తల్లికి బిడ్డడే

వంటి సామెతలట్టివే. ఇవి చిన్న పాదముల కలవై, ప్రాసయతి గల్గి అనుప్రాస సౌందర్యముచే శోభించినవి.

"అమ్మణ్ణి కన్నుల్లు - తమ్మిపువ్వుల్లు...."

"జోలల్లు పాడితే - బాలలకు నిద్ర...."

"పుట్టమీద పాల - పిట్టోయ్ నాసామి...." వంటి జానపదగీతములందును ఈ ప్రాసయతి కానవచు టను బట్టి తెలుగుభాషలో ఇవి అత్యంత ప్రాచీనకాలము నుండియే ఉండి, కవులచే ఆదరింపబడి దేశ్యఛందములందు ప్రవేశపెట్టబడియుండును.

ప్రాసయతి ఉపజాతులలో నైనను అన్నిపాదములందు నియతమైయుండ వలయునన్న నియమము లేక కొన్ని పాదముల ప్రాసయతి, కొన్నిపాదముల యతి వాడుకొనవచ్చును. కానియిది జాతులలో (ప్రాస ఉండుటచే నిషేధము కాగా) అక్కడక్కడ ప్రమాద ఫలితముగా రాన్పించుచున్నది. అన్నిపాదములందుంచ వలయునని కవి భావించినచో అప్పుడు సర్వపాదములందు సప్రయత్నముగా ఉంచ వలసివచ్చెడిది. ఒక కంద పద్యములో ప్రాసయతి వాడబడినట్లు రావూరి దొరసామి శర్మగారు వ్రాసినారు

పంచాననావతారహర
పంచ పేతేశ, వువ్వు - బుంచెదగొనుమ — శివ్వుటారాధ్యచరిత్రము

ఎవ్వనిచే జనించు జగ - మెవ్వని లోపలనుండు లీనమై
ఎవ్వని యందుడిందు పరిమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయు - డెవ్వడు తానయైనవా— ఈపద్యమందు 1, 3 పాదములలో ప్రాసయతి పాటింపబడినట్లే, కాని యతి ముందుగానే ఉండుటచే, ఇది మార్గి ఛందమగుటచే యాదృచ్ఛికముగా కలసిన ఈ ప్రాసయతికి కారణము ఎవ్వడన్న ఎత్తుగడ పదము. మార్గి వృత్తములందు ఈ ప్రాసయతి నిషిద్ధమైనను క్రౌంచపద, విభవవృత్తములందు ఇది లక్షణ శిరోమణిలో పాటింపబడినది [2].

ఇట్లు అనుప్రాస సౌందర్య శోభితమై, యతిస్థాపన పూర్వకమై తెలుగు భాషా సహజమై, దేశియమైన ప్రాసయతి విశిష్టమై అలరుచున్నది.

—x—

## అ థ స్సూ చి క లు

1. తె. భా. ఛం. రీ. - రావూరి దొ.సా. శర్మ పు. 299
2. ల. శి - పొత్త పి వెంకట రమణ కవి III - 138, 107

★ ★ ★

# (అ) మార్గి - దేశి

మార్గి — దేశి అన్న పదములు చిరకాలము నుండి, వాడుకలో ఉన్నవే, సంగీత నృత్య పరములుగా పరిచితములైన వీనిని తెలుగులో నన్నిచోడుడు సాహిత్య విషయముగా వాడినాడు. నృపధూర్జటి క్షేమయ పండడు (క్రీ.శ. 1145), శివకవులు వీనిని ప్రస్తావించినారు. మతంగుడు (క్రీ.శ 750), శార్ఙ్గదేవుడు (క్రీ.శ 13 శ), హేమచంద్రుడు, పెదకోమటి వేమారెడ్డి మొదలగు వారు వీనిని వివరించి చూపినారు.

ముందుగా సంగీత పరముగా వీనిని పరిశీలించినపుడు బ్రహ్మాదులచే మార్గదర్శకమై, ఈశ్వరుని సమక్షమున భరతాదులు ప్రయోగించినది మార్గమనియు, అయా దేశములందు జనరంజకమైనది దేశి అనియు శార్ఙ్గదేవుడు నిర్వచించుట చూడ నగును.[1] రాగములను గూర్చి ఈ భేద వివరణములో —

"కామాచార ప్రవర్తిత్వం, దేశీరాగస్యలక్షణం
నియమేతుసతి తత్ర, మార్గత్వ మనులక్షితమ్"

నియమ రూప రహితమైనది దేశియని: తద్భిన్నమైనవి, నియమబద్ధమైనది మార్గ అని చెప్పబడినది. కాశినాథుని సంగీత సుధాకరము, రామయామాత్యుని స్వరమేళ కళానిధి సంగీత దర్పణము — వంటి సంగీత శాస్త్ర గ్రంథములు నియమ రాహిత్యము, జన రంజకత్వము దేశి లక్షణములుగా ఏకాభిప్రాయము నిచ్చినవి. తాళ విషయమున కూడా మార్గ — దేశి విభేదమున్నట్లు కాననగును[2].

నృత్య పరముగా పరిశీలించినపుడు ధనంజయుని దశ రూపకములో భావా శ్రయము నృత్యము, తాళలయాశ్రయము నృత్తము అని, అందులో నృత్యము పదార్థాభినయమై మార్గ మనబడునని, నృత్తము దేశియనబడునని వివరింపబడి నది. నృత్యము భావాశ్రయమైనదని చెప్పుటచే అది కొంత అభివృద్ధి చెందిన దశను చేరినదని, కేవల తాళలయబద్ధమైన నృత్తము అట్టి దశకు రానట్టిదని తెలియు చున్నది. అనగా మార్గి ప్రాథమిక దశను దాటి అభివృద్ధినంది శాస్త్రీయతా ముద్రను సంపాదించుకొనినదని, దేశి సామాన్య దశలోనిదని ధృవపడుచున్నది.

జాయప సేనాని తన నృత్త రత్నావళిలో
ఖపంతి ధరణీపాలాః ప్రాయేణాభినయ (వ) ప్రియాః
అత స్తత్ప్రీతయేఽద్యాపి యద్యదాత్పాద్యతే నవమ్
నృత్తం తతః స్మృతమ్ దేశీ త త్తద్దేశాను సారతః [3]

అని నిర్వచించినాడు. అభినవ ప్రియులగు రాజుల కొఱకు ఉత్పత్తి — చేయబడు ననియు, అవి ఆయా దేశముల ననుసరించునవి కనుక దేశి - అనబడుననినాడు.

కవిత్వ పరముగా పరిశీలించినపుడు నన్నిచోడుని మాటలను బట్టి "మును మార్గ కవిత లోకంబున వెలయ" అనగా విశాల పరిధి (లోకము)లో ప్రవర్తించు నది మార్గ పద్ధతి యని తెలియుచున్నది. దేశి ప్రత్యేక ప్రాంతమున, క్లుప్తమైన హద్దులను మించనిదని "దేశికవిత పుట్టించి తెనుంగున నిలిపి రంధ్ర విషయంబున (ఆంధ్ర ప్రాంతమున)" అన్న వివరణము సమర్థించుచున్నది. కుమార సంభవ పీఠికలో కోరాడ రామకృష్ణయ్యగారు.... "సంగీత నాట్యాదుల రీతిని జూచిన ప్రాచీన లక్షణ లక్షితమై నియమబద్ధమగు కవిత మార్గకవితయని తత్తద్దేశీయ సంప్రదాయాను గుణముగా చెప్పినది దేశి కవితయని చెప్పవలయును" అని స్పష్టపరచిరి[4].

"దేస విసేస పసిద్ధీ ఇ
భణ్ణ మాణా అనంత యా హుంతి
తమ్హా అణాఇ పాఇఅ
పయట్ట భాసా విసేస ఓ దేసి"

అని హేమచంద్రా చార్యులు (దేశ విశేష ప్రసిద్ధమైనవి అనంతంగా ఉంటాయి పదాలు. వాటి నుంచి అనాది ప్రాకృత ప్రవృత్త భాషా విశేషమే దేశి) ప్రత్యేక దేశ ప్రసిద్ధిని గూర్చి ప్రస్తావించినాడు.[5]

ఆధునిక విమర్శకులలో పెక్కురు అఖండ భారతావనిలోని భాషా, కళా సంప్రదాయములకు, తత్తత్ప్రాంతీయములగు వానికిని గల భిన్నత్వమును దర్శించి వరుసగా వానికి మార్గి — దేశి అని విభజనము గావించినారు.

కిట్టెల్ పండితుడు కన్నడ — ఆంగ్ల నిఘంటువులో దేశి కి The language or dialect of a county pecular or belonging to a Country or province అని నిర్వచించెను. చిన్నయసూరి పండితుడు సంస్కృత ప్రాకృత భాషా సంపర్కము లేని త్రిలింగ దేశ్య వ్యవహారసిద్ధ పదములను మాత్రమే

దేశ్యములని[6] సూత్రీకరించినాడు. వీరేశలింగం పంతులుగారు, మానవల్లి రామకృష్ణ కవి మొ॥వారు సంస్కృతము మార్గియని, దేశి ప్రాంతీయమని (తెలుగని) వివరించిరి. నిడుదవోలు వెంకటరావుగారు[7], వేదం వెంకటరాయశాస్త్రి (ఎం.ఏ.) గారు,[8] పల్లమూడి గోపాలకృష్ణయ్య మున్నగు వారు ఇదే అభిప్రాయమును తెల్పిరి. కాగా కోరాడవారు దేశిని దక్షిణ దేశ భాషలకు అన్వయింపజేసిరి. "భాషా విషయమునను ఛందస్సాహితీ రీతుల విషయమునను ఈ దక్షిణ దేశ భాషలకు సహజము సమానము నగు సంప్రదాయ పద్ధతియే దేశి" — అని వ్యవహరింపబడుచున్నది[10]. అని వివరించుటలో సంస్కృత భిన్నమైన దక్షిణ దేశ (ద్రావిడ) భాషా సంప్రదాయము సూచితము.

బ్రహ్మాదులచే మార్గితమైనది మార్గి యని శార్ఙ్గదేవుడు చెప్పుటచే,పూజ్యులు, ఆద్యులగు పెద్దలు నిర్మించిన మార్గముతో నడుచునది మార్గి యనియు, లోక వ్యవహారములో ప్రత్యేక ప్రాంత పరిమితమైనవి దేశియని భావింపవచ్చును. మార్గి మార్గ నిబద్ధ మగుటచే దానికొక నిర్దిష్టలక్షణము, పండిత జనరంజకత్వము సర్వదేశము లందును సమాన రూపత్వము, శాస్త్రీయత్వము కల్గియున్నదనవచ్చును. లోకమున ఆరాధింపబడి, అభ్యసింపబడి నిర్దిష్ట విధానముతో అభివృద్ధినొందిన ఏకళ ఐనను సార్వజనీనమగుటకు పూర్వము ప్రాథమిక దశనుండి క్రమాభివృద్ధిని పొందును. శాస్త్రీయతా సాధనమునకై పూర్వులచే ఇట్టివి దేవనిర్మితములుగ చెప్పబడి పరంపరగా మానవ లోకమునకు సంక్రమించినట్లు చెప్పుట ఆచారమైనది. సంగీత నృత్యాది కళలు, ఛందో జ్యోతిషాది శాస్త్రములు, నియత రూపము పొంది సభ్య సమాజమున శాస్త్రీయముగ రూపొందించబడిన నాటికి దేవతాదేయములుగనే చెప్పబడినవి.

సంగీతము, గాంధర్వము, గానమని ద్వైవిధ్యమును శార్ఙ్గదేవుడు చెప్పగా కల్లినాథుడు దానికి వ్యాఖ్యానించుచు గాంధర్వము — మార్గి అని, గానము దేశి అని చెప్పి "అనాది సంప్రదాయ మిత్యనేన గాంధర్వస్య వేదవదపౌరుషేయత్వమితి సూచితం భవతి" అని అనాది సంప్రదాయ సిద్ధ, అపౌరుషేయత్వమును మార్గి లక్షణములుగా విశదీకరించెను. "నానా దేశగతిచ్ఛాయా దేశీ రాగాస్తుతే మతాః" అన్న సంగీత రత్నాకరాభిప్రాయానుసారము దేశి భిన్న దేశములలో, భిన్న లక్షణములతో, సామాన్య జనాహ్లాదకారిమైనది.

అట్లే దేశీయ భాషలు, దేశీయ సారస్వతము, దేశీయ కళలన్ని దేశిశాఖకు చెందగా, సంస్కృతము సంప్రదాయానుసారిమై దేవభాషమై, సార్వదేశికమై మార్గి శాఖకు చెందినది. గుణాఢ్యుడు పరిత్యజింతుననిన భాషలలో సంస్కృత, ప్రాకృతము లతో బాటు దేశ భాష ఒకటి ఉన్నది. అనగా సంస్కృత ప్రాకృతము దేశికి చెందవు. దేశీయమైన భాష ఒకటి అతడు పరిత్యజించిన వానిలో సంస్కృత ప్రాకృతేతరమైనది. అది ఆ దేశీయులగు జనులచే ఉపయోగింపబడు వ్యవహారములో నున్న దేశీ భాషయే కదా !

ఈ విభజనమును బట్టి చూచినపుడు సంప్రదాయానుసారిమై, బహుళ ప్రయోజనవంతమై, లక్షణాను బద్ధమైనది మార్గి యని, స్వల్ప దేశ పరిమితమై, లక్ష్య ప్రమాణమై, లక్షణానువర్తిగాక స్వేచ్ఛగా దేశీ జనుల నిత్య వ్యవహారములో ఉన్నది దేశి అని నిర్ణయింప వీలగుచున్నది.

## [ఆ] I. ఛందఃపరముగా మార్గి – దేశి

నన్నెచోడుడు మొదట తెలుగు సాహిత్యములో సాహిత్య పరముగా 'మార్గి-దేశి' అన్న పదములు ప్రవేశపెట్టుట వలన ఈ శబ్దముల అర్థవివరణ ముకై పలువురు పండితులు యత్నించినారు. ఆ యత్నములో భాష, భావము, ఛందస్సు ఈ మూడింటిని పరిశీలించిగాని దేశి కవితను నిర్ణయింప వీలులేనిదనిరి'[1]. ఈ తీరున మార్గి - దేశి పదములు ఛందో విషయకముగా సైతము చర్చింపబడినవి.

కాని ఆంధ్ర ఛాందసికు లెవ్వరును దేశి పదమును ఛందః పరముగా వాడలేదు. వారికాదృష్టి లేదు[12]. కన్నడ భాషకు వ్రాయబడిన ఛందోంబుధిలో నాగ వర్మ మాత్రము అక్కర, షట్పాదాదులను దేశీయ జాతులనినాడు[13]. దేశి అన్నది కర్ణాట దేశ సంబంధిగా వాడబడినది. జయకీర్తి తన ఛందోనుశాసనమున సైతము

సంస్కృత వాచ్యార్యాద్యాః
ప్రాకృత విషయేతు గలితకాద్యా బహుధా
కర్ణాటకేఽ క్షరాద్యా
విషయే... శీర్షకాది జాతయ ఉదితాః (1–22 శ్లో)

అని కర్ణాటకి - అక్షరాదులు (అక్కరాదులు), శీర్షికాది జాతులు అన్నాడేగాని సంస్కృత, పాకృత భిన్నములగు కర్ణాట భాషా విషయముగా దేశి అని వాడలేదు.

'విషయే' తర్వాత లుప్తమైన ఒక గురువు లేదా రెండు లఘ్వక్షరముల శూన్య స్థలమున డా॥ పాటిబండ మాధవశర్మగారు విషయే"ఒంద్రే" అని ఊహించి పూరించినారు[14]. జయకీర్తి విషయ శబ్దమును దేశపరముగా వాడినాడు. కనుక ఈ పూరణము అర్థవంతమే అగును. కాగా "విషయేఒంధ్రే శీర్షకాది జాతయ ఉదితాః" అన్నప్పుడు "ఆంధ్ర విషయమున (తెలుగుదేశమున) శీర్షక (సీసము) మొ॥" అర్థము వచ్చును. విషయ శబ్దమునకున్న దేశార్థము మార్గిదేశి అన్న సూక్ష్మ భేదమును స్థిరీకరింపజాలదు. వృత్తము జాతి అన్న భేదమునే కాని, మార్గిదేశి అన్న భేద మును ఛందః పరముగా తెలుగులో ఎచ్చటను లాక్షణీకరణ మొనర్చబడలేదు. ఒక్క పాలుకురికి సోమనాథుడు మాత్రము తన పండితారాధ్య చరిత్ర అవతారికలో ద్విపదస్థానమును తెలుగు సాహిత్యములో సుస్థిరముగా ప్రతిష్ఠించు యత్నములో ఛందః పరముగా దేశి యన్న పదమును వాడినాడు.

"ప్రాసమైనను యతిపై వడిమైనను
దేసిగా నిలిపి యాది ప్రాస నియతి" — (పండి. చరి.)

పరివృత్తి లేని విధముగా ప్రాస స్థానమున వాడబడిన ఈ దేసి యన్న పదము ఛందోంఒగమైన ప్రాస విషయకమైనది. ప్రాసమును దేశీయముగు నిల్పుట అనగా సోమన భావనలో ప్రాస మార్గి దేసి భేదయుక్తమై యున్నట్టుగాక దేశీయమైన (సంస్కృత భిన్నమై తెలుగువారి పద్ధతిలో) విధానములో ద్విపదలో పాద పాదమున ద్వితీయాక్షరరూప ప్రాసము నిలుపుట అని గమనింపవలెను.

ఆద్య ఛాందసికుడైన రేచన దేశి అన్న పదము వాడకున్నను సీసాదులు తెలుగు భాషకు సహజములని అన్నాడు[15]. తెలుగునకు సహజమైన దన్నప్పుడు సంస్కృతేతరత్వమును బట్టి దేశి ఛ్ఛందముగా భావింపవచ్చును.

ఆధునిక యుగములో నన్నెచోడుని కుమార సంభవము తెలుగు సాహిత్య లోకమున ఆవిష్కరింపబడిన అనంతరము దేశి కవిత లేదా శివకవుల గూర్చి విమర్శ చేయనపుడు ప్రతి ఒక్కరును మార్గదేశి శబ్దములను ఛందః పరముగా వాడి

## (ఇ) దేశి - శుద్ధదేశి

సాహిత్యపరముగా తెలుగులో జరిగిన మార్గి - దేశి విభజనములో దేశి సాహిత్యములో "శుద్ధదేశి" అన్న మరొక జాతి గుర్తింపబడినది. "మార్గిదేశి" అన్నప్పుడు నన్నయాదుల మార్గము మార్గి అనియు, శివకవుల మార్గము దేశి అనియు విభజింపబడి, ఈ ఉభయ మార్గములకు భిన్నమును, ప్రత్యేక ప్రతిపత్తి కల్గిన జానపదగేయ సాహిత్యము శుద్ధ దేశిగా భావింపబడినది.

"నన్నయ రచన నిబద్ధ మార్గము. అనగా స్వతంత్రచ్ఛాయలతో గూడిన మార్గ పద్ధతి. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న తుమ్మెద, వెన్నెల పదాదులు శుద్ధదేశి మార్గమునకు చెందినవి. అవి అనిబద్ధములు. సోమనాథుని రచనలు నిబద్ధ దేశి మార్గమునకు చెందినవి. అనగా వానియందును సంస్కృత ప్రభావము కొలదిగా నైనను లేకపోలేదు. ఇది ప్రాధాన్యతా దృష్టితో చేయబడిన వ్యాసదేశము[16]" అని దివాకర్ల వెంకటావధానిగారు నిర్ణయించిరి. సంస్కృత మార్గము ననుసరించిన నన్నయాదులు 'నిబద్ధ మార్గ' వర్గము వారని, సంస్కృత - దేశ్య పద్ధతులను సమ్మిశ్రితము చేసిన శివకవులు, నిబద్ధ దేశి వర్గము వారని, తుమ్మెద వెన్నెల పద సాహిత్యము సంస్కృత స్పర్శ లేనిది కనుక శుద్ధ దేశి అనియు వారి అభిప్రాయము. ఇతివృత్త సంవిధాన, సంప్రదాయ భాషా ఛందో విషయములందు జానపద గేయ సాహిత్యము తెలుగువారి స్వతంత్ర వ్యవస్థకల మార్గము కనుక "శుద్ధ" పదముచే ప్రత్యేకించబడినది.

డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు నన్నయ సంస్కృత ఛందస్సులకు తెలుగు యతి ప్రాసలు కూర్చెనని, శుద్ధదేశి కవితావాదులగు పాల్కురికి సోమనాథాదులకు ఇది నచ్చక వారు "శుద్ధ దేశీయమైన చందస్సు"లో ద్విపదలు వ్రాసినారని "మాత్రాగణ బద్ధమైన ద్విపదలో శుద్ధదేశిగా కావ్యములల్లెదనని సోమనాథుని ప్రతిజ్ఞ" — అని వేరొక అభిప్రాయమును వ్యక్తము చేసినారు[17]. శివకవులు శుద్ధ దేశి కవితా వాదులని, ద్విపద మాత్రా గణబద్ధమైన శుద్ధ దేశీయ ఛందమని వీరు వ్యక్తీకరించిన అభిప్రాయములు పై అభిప్రాయములకు భిన్నములేకాక మార్గ - దేశి, శుద్ధదేశి అని విభజింపబడిన మూడు మార్గములను వ్యక్తీకరించుటకు వీలుపడనివి. వీరి అభిప్రాయములో "శుద్ధదేశి" అన్నది నన్నయాది మార్గ భిన్నమని.

పింగళి లక్ష్మీకాంతం గారు పల్నాటి వీర చరిత్రము పీఠికలో పద సాహిత్యము శుద్ధ దేశీయమని నుడివిరి[18].

సంస్కృత మార్గ భిన్నత్వము దేశి అన్న సూత్రము చొప్పున పాల్కురికి సోమనాథుల మార్గము దేశి అనబడినది. నన్నయాదుల మార్గము మార్గి యనబడినది. కాని పాల్కుర్క్యాదులు తమ మార్గమును సైతము సంస్కృత భిన్నత్వముగా సంపూర్ణముగా నడపక, పండితామోదమునకై ప్రయత్నించుటలో కొంత సంస్కృత మార్గమును స్పృశించిరి. కాని జానపద కవిత్వము సంస్కృత మార్గమును లేశ మాత్రమైనను తాకకుండా, స్వయం ప్రతిపత్తి కలిగిన దేశీయ మార్గమున నడచుటచే ఇది శుద్ధమన్న భావముతో దీనిని శుద్ధ దేశిగా, శివకవి మార్గమును దేశి మాత్రముగా పండితులు విభజించిరి.

—x—

## అ థ స్సూ చి క లు


1. సంగీత రత్నాకరము - శార్ఙ్గదేవుడు శ్లో. 22, 23
2. మృదంగ తత్త్వము - ధర్మాల రామమూర్తి
3. నృత్త రత్నావళి - 5-3 శ్లో
4. కుమార సంభవ పీఠిక - కోరాడ రా. కృ. (మద్రాస్ వి.వి.)
5. సాహితీ సుగతుని స్వగతం - తిరుమల రామచంద్ర పు. 111
6. బాల వ్యాకరణము - సంజ్ఞా పరి.
7. త్రిపురాంతకోదాహరణము — పు. 18
8. నన్నెచోడుని కవిత్వము
9. మార్గి - దేశి పు. 112
10. దక్షిణదేశ భాషా సారస్వతములు - దేశి-కోరా. రామ కృ. పు. 2
11. నన్నెచోడుని కవిత్వము - వేదం వెంకటరాయశాస్త్రి M. A.
12. భారతి పత్రికల్లో ఉస్మా. విశ్వ. వారి 'సంశోధితాంధ్ర మహాభారత' ప్రచురణల సమీక్షలో లిడుదవోలు ఈ విషయమును ప్రస్తావించిరి.
13. ఛందోఒంబుధి - నాగవర్మ (1-20)
14. ఆంధ్ర మహాభారతము-ఛందఃశిల్పము—పు. 468
15. కవిజనాశ్రయము - మల్లియ రేచన (వావిళ్ళ ప్ర. 1969) పు. 47
16. 'మార్గి-దేశి కవిత్వములు'- సారస్వత వ్యాసములు సం. 1 పు 26- డా. దివాకర్ల
17. 'తిక్కన భారత దర్శనము' - పు. 29
18. పల్నాటి వీరచరిత్ర - పిం. ల. సంపా. పు. 27 పీఠిక గౌతమ వ్యాసములలో గూడ వీరిచేత (పు. 113) ప్రస్తావించబడినది.


★ ★ ★

## (ఆ) దేశి చ్ఛందస్సుల నిర్వచనము

అఖండమైన భారతీయ సంస్కృతి, కళలు ఒకప్రక్క పరిరక్షింపబడు చుండ, వేరొకప్రక్క ప్రాంతీయములగు సంస్కృతీ కళలు సమాంతర స్రోతస్వి నులై అభివృద్ధినొందుచు వచ్చుచున్నవి. సంస్కృతిలో భాగమైన సారస్వత కళ యందు సైతము ఇట్టిదే జరిగినది. సంస్కృత ప్రభావము కలది మార్గి, ప్రభావము లేనిది తత్తత్ప్రదేశ జనులకు సహజమయినది దేశి అని విభజింపబడినది. సంస్కృత భాషలోని శాస్త్రోక్తము, కావ్యోపయోగి అయిన ఛందస్సు మార్గి కాగా, సంస్కృత ప్రభావ రహితము, తెలుగునాట సహజమైన ఛందస్సు దేశి చ్ఛందస్సుగా గుర్తింపబడి నది. "స్థూలముగా చెప్పికొన్నచో సాహిత్యమునకు సంబంధించినంతవరకు ఇతరాం శముల విషయమెట్లున్నను, ఛందస్సునకు సంబంధించినంత వరకు మార్గ ఛందస్సు లనగా సంస్కృతమునకు సంబంధించినవి, దేశిచ్ఛందస్సులనగా దేశీయ (ప్రాంతీయ) మైన భాష తెలుగు ఛందస్సులని చెప్పకొనవచ్చునని" సంపత్కుమారాచార్యులు నిర్వచించిరి[1]. స్థూలమని చెప్పుటచే దేశి చ్ఛందస్సులు నిర్దిష్టముగా సంస్కృత భిన్నములే అనుట సాధ్యము కాకపోవుటయే. "It can be seen that the (followirg seven) Desi or Non-sanskrit metres were in vague in Telugu before Nannayabhatta...." అన్న N. V. K. కృష్ణ వారియర్ పలుకులు సైతము ఈ ధోరణినే తెల్పుచున్నవి[2].

దేశి చ్ఛందస్సులనగా ఆంధ్ర చ్ఛందస్సులని తెలుగు సాహిత్యపు మౌలిక లక్షణములు కలవని వేరొక విధముగా నిర్వచింపబడినది[3]. ద్రావిడ భాషా ప్రత్యేక లక్షణములు కలది దేశి చ్ఛందస్సని వేరొక అభిప్రాయమున్నది. ఈ పద్ధతి కన్నడ, తెలుగు భాషలలో ప్రత్యేకమని S. Subrahmaniam నిర్వచించిరి.

"....Kannada and Telugu have two kinds of metres. One based on sanskrit model and the other on Dravidian model and structure[4].

"సంస్కృత ప్రాకృత చ్ఛందస్సుల ననుసరించినచో దానిని మార్గ పద్ధతి అని సంస్కృతాది ఛందో గ్రంథములలో కానరాక సామాన్య జనులలో స్త్రీల పాటల్ల

రూపమున వాడుక యందుండిన పద్ధతి దేశియని వ్యవహరింపుచున్నారు." అని గేయ ఛందస్సులను దేశిగా శ్రీ గడియారము రామకృష్ణ శర్మగారు భావించినారు [5].

గణములను బట్టి "మార్గి దేశి" యన్న విభజనముకూడ జరిగినది. అక్షర గణ బద్ధములు మార్గయని, మాత్రాగణ బద్ధములు దేశియని బంగారు తమ్మయ్య గారనినారు. దేశియములనగా మాత్రాఛందస్సులనుండి పుట్టిన జాతి పద్యములు అని రావూరి దొరసామి శర్మగారు గణానువర్తి లక్షణము నేర్పరచినారు[6].

ఈ విధముగా దేశి చ్ఛందస్సుల లక్షణమును నిర్వచించుటలో పలువురు భిన్నాభిప్రాయములను స్థూల స్వరూపదర్శినిగా వ్యక్తీకరించినారు.

పై అభిప్రాయములను క్రోడీకరించి ఈ క్రింది విధముగా దేశి చ్ఛందస్సు యొక్క స్వరూపమును వివరింపవచ్చును. 1) దేశి, సంస్కృత ఛందో సంప్రదాయమునకు భిన్నము, 2) షడ్వింశతి అక్షర ఛందస్సులలో పుట్టిన వృత్తములు దేశి కాదు. 3) కావ్య సంప్రదాయము మార్గి కాగా, గేయ సంప్రదాయము దేశి, 4) దేశి చ్ఛందములు మాత్రా/ఉపగణ నిర్మితములు, 5) తెలుగు భాషకు సహజములు, 6) పద్య నిర్మాణమునకు సులభ ప్రాయములు, 7) సోదర ద్రావిడ భాషలలో సామ్యములు కల్గియున్నవి.

## 1. దేశి చ్ఛందస్సునకుగల స్వయంప్రతిపత్తి :-

సంస్కృతమునందు ఛందశ్శాస్త్రములో షడ్వింశతి ఛందో భేదములు నిరూపింపబడినవి. ఏకాక్షరము మొదలుగా ఒక్కొక్క అక్షరమును పెంచుచు, ఇరువది యారు అక్షరముల ప్రమాణముగల పాదములు వ్యవస్థీకృతములైనవి. ఒక్కొక్క పాదములోని అక్షరసంఖ్యతో గురు లఘుస్థానములు మార్చుచు, వీలైనన్ని వృత్తములు సిద్ధము చేయబడినవి. ఇది శాస్త్ర నిర్మాణములో పరాకాష్ఠదశ. ఏ ఛందము లోని పాదమునైనను అక్షర సంఖ్యా ప్రమాణమును గురు లఘు స్వరూపమును నిర్ధారించినపుడు అది పై షడ్వింశతి ఛందములలోని కోటానుకోట్ల జన్యవృత్తములలో ఏదో ఒక వృత్తమునకు సరిపోవును. దీని నాధారము జేసికొని పెక్కురు పండితులు దేశి చ్ఛందములను ఏదో ఒక సంస్కృత ఛందోజాతముగా నెంచి, దేశికిగల స్వతంత్ర వ్యవస్థను ఖండించిరి.

పడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు "ఎన్నెన్ని విధాలుగా ఉన్న దేశిచ్ఛందస్సులైనా సమ, అర్ధసమ విషమాది భేదాలతో ఉన్న అనంతకోటి సంస్కృత ఛందోరీతులలో అంతర్లీనాలై పోతా"యన్నారు [7]. శివకవుల ద్విపద ఛందస్సులు, సంస్కృతములో కన్పించుచున్నవనియు, దేశియ ఛందముల పేర్లు సాంస్కృతికములే యనియు, సంస్కృతము నుండి గాక వేరుగా దేనినుండియు ఛందస్సులు మనకు రావీలు లేదనియు వేదాల తిరువేంగళాచార్యులు భావించినారు [8]. మార్గ ఛందములకు, దేశి చ్ఛందములకు నామ సామ్యముతో బాటు సంస్కృత నామములే కలవని డా॥ P.S.R. అప్పారావు గారనినారు [9].

కాని పై నిర్ణయములు విచార్యములు. దేశి చ్ఛందస్సు యొక్క పాద వ్యవస్థకు, సంస్కృత ఛందో జాతములగు వృత్తపాద నిర్మాణ వ్యవస్థకు, సంబంధమే లేదు. 1 నుండి 26 ఛందములలో ప్రస్తార క్రమములో పుట్టిన ఏ వృత్తమైనను అన్ని పాదములకు గణ నిర్మాణము (గురు లఘు స్థానములు) ఒకే విధముగా ఉండును. ఒక్క అక్షరమైనను మార్చి ఇతర పాదములు వ్రాయవీలులేదు. దేశి చ్ఛందస్సులలో అట్లుగాక గణనిర్మాణములో స్వేచ్ఛకలదు గురు లఘువులు ఒకే వృత్తములో భిన్న పాదములలో ఒకే తీరున ఉండవు. వీటికున్న స్వేచ్ఛ వానికి లేదు దేశి చ్ఛందస్సులు మాత్రా సమత కల్గి తాళబద్ధములై ఉండగా, షడ్వింశతి ఛందములు అక్షర సమతకల్గి గురు లఘువులను మార్చవీలులేక ఉండును. ఉదాహరణమునకు దేశి చ్ఛందమగు ఉత్సాహమును తీసికొందము. ఉత్సాహ వృత్తమునకు 7 సూర్యగణములు పిదప నొక్క గురువు ఉంచవలయును. సూర్యగణము నగణము (III) కాని హ గణము (UI) కాని కావచ్చును. కనుక ఏవేని (న లేక హ) గణములు మొత్తము ఏడు వాడవలయును. సూర్యగణములు రెండు అక్షరములది, మూడు అక్షరములది ఉండుటచే (అన్ని హ గణములే వాడినప్పుడు) ఉత్సాహ యొక్క ఒక పాదము $7\times2=14+1=15$ అక్షరముల కనిష్ఠ సంఖ్యతో లేదా (అన్ని నగణములే వాడినప్పుడు) $7\times3=21+1=22$అక్షరముల గరిష్ఠ సంఖ్యతో ఏదో ఒక విధముగా ఉండవచ్చును [10]. 15 నుండి 22 అక్షరములతో ఏదో ఒక సంఖ్య పాదాక్షర సంఖ్య అగును. అప్పుడు ఉత్సాహను షడ్వింశతి ఛందములలో 15, 16, 17, 18, 19, 20, 21, 22 వ ఛందములలో దేనిలో పుట్టిన దనగలము ? అంతేగాక ఉత్సాహ వ్రాయునప్పుడు ఒక పాదములో అన్ని హ గణములేవాడి, రెండవ పాదములో తిరిగి అట్లే వాడవలయునను నియమేమున్నది ? మొదటి పాదములో 3 వ అక్షరము

గురువైనదో 2వ, 3వ, 4వ, పాదములందు అట్లే గురువుండవలయునని నిర్బంధము లేదు గదా! ఉత్పలమాలలో 10వ అక్షరము అన్ని పాదములందు గురువే అని చెప్పినట్లు ఇక్కడ చెప్పరాదు కదా!

కనుక పాద వ్యవస్థలో స్వాతంత్ర్యమున్న దేశి ఛ్ఛందసులు షడ్వింశతి ఛందోజాతములన జెల్లదు. గణ నిర్మితిలో ఇచ్చట స్వేచ్ఛకలదు. అక్కడ (సంస్కృతమున) నిర్బంధము. ప్రస్తార క్రమమున ఏర్పరిచిన షడ్వింశతి ఛందో జన్య వృత్తములు కృతకములు. దేశి ఛ్ఛందస్సులు భిన్న గతులు బట్టి స్థిరపరుపబడిన సహజాతములు.

సంస్కృతము నుండి తప్ప తెలుగులో ఛందస్సులకు వేరుగా వచ్చుటకు ఏ మార్గము లేదన్న అభిప్రాయము సత్య దూరమే. ద్రావిడ కుటుంబములోని తెలుగు భాష సంస్కృత సాహాయ్యముతో సంపన్నమైనను దానికి భిన్నమైనదే. అంతేగాక ఛందో విషయకముగా పరిశీలించినపుడు కావ్యోపయోగి వృత్తములను మినహాయించగా మిగిలిన పద్యములు మరియు అనేకములగు, సుందరములగు దేశీయములైన తెలుగు జానపద గేయ ఫణితులు ఏ సంస్కృత ఛందములకు ఛాయా మాత్ర సాదృశ్యమైనను లేక స్వతంత్రములైనవి.

ఇక సంస్కృత - దేశిచ్ఛందముల నామసామ్యము లేదా సంస్కృత నామ ములను పరిశీలించి దేశి యొక్క సంస్కృత భిన్నమైన స్వతంత్ర వ్యవస్థను నిర్ధారింప వలసియున్నది.

తెలుగు కందమునకు సంస్కృత స్కంధకముతో, సీసమునకు శీర్షకముతో నామ సామ్య మున్నది. కాని ఇంత మాత్రము చేతనే తెలుగు దేశి ఛ్ఛందములు సంస్కృత జన్యములనరాదు. ఏలయనగా స్కంధక శీర్షకాదుల నుండే కంద సీసాదులు జనించినవని చెప్పుటకు వీలులేదు. ఇంకను కిట్టెల్ పండితుడు, కోరాడ రామకృష్ణయ్య వంటి వారు కంద సీసాదులే సంస్కృతీ కరణము జరిగినవని యొక సిద్ధాంతమును లేవనెత్తిరి. దేశి పేర్లకు సంస్కృతీకరణము పండితులచే చేయబడుట పెక్కు చోటుల కనబడుచున్నది. జయకీర్తి తన ఛందోను శాసనమున కన్నడ ఛందస్సులను చెప్పుచు 'అక్కర'ను అక్షర అని సంస్కృతనామముతో చెప్పినాడు [11]. సంస్కృతములో అక్షర పేరుతో ఛందస్సేది లేదు. ఇది నిస్సందేహముగా దేశి నామమునకు సంస్కృతీయమే.

ఇక దేశి చ్ఛందములకు గల సంస్కృత సమనామములను పరిశీలించ వలయును. ఉత్సాహ, ద్విపద, షట్పది వంటి పేర్లు సంస్కృతీయములు, కాని సంస్కృతములో ఇట్టి ఛందస్సులు లేవు ద్విపదయున్నను అది మన ద్విపదకు ఏ మాత్రము సంబంధము లేనిది. సంస్కృత పండితులైన నాటి లాక్షణికులు వాటికా పేర్లుంచవచ్చును. అటు మాత్రాసమతగాని, ఇటు అక్షర సమత కాని లేక సంస్కృత గణ వ్యవస్థకు భిన్నములై విశిష్టములైన తెలుగు, కన్నడ గణములకు సూర్యేంద్ర చంద్ర లేక బ్రహ్మ విష్ణు రుద్ర గణములని పేర్లుంచుట గమనార్హము. సంస్కృత భాషా ప్రభావము ఇతర సాహిత్యాంశములలో ఈ భాషలపై అధికమనుట సర్వ సమ్మతముగదా !

పైన క్రోడీకరింపబడిన చర్చల వలన దేశి చ్ఛంద స్స్వరూపము స్పష్టముగా నిర్ధారితమైనది.

జానపద గేయ సాహిత్యము లోని ఛందస్సును పరిశీలించినపుడు ఈ క్రింది లక్షణములు అగుపడును. ఇవి ఇంచు మించుగా సీసాది కావ్యోప యోగి దేశి పద్యములకు సరి పడుటచే దేశి చ్ఛందో లక్షణములుగా వీనినిచ్చుట జరుగుచున్నది. వీనికి వివరణము ఆయా ఛందముల వద్ద ఈయబడును.

**దేశి చ్ఛందో లక్షణము :-**

1. పాదము ఎప్పుడూ సమముగా ద్విఖండన మగును.
   (యతి పాదంలో అర్ధమునకు ఉండును.)
2. యతి లో సదృశాక్షర యతి కన్న విచ్ఛేదము ముఖ్యము.
3. యతి నిర్బంధము లేక ప్రాసమైత్రికైనను అవకాశమీయబడును.
   పాదాంత యతి (విరామము) అధికముగా పాటించబడును.
4. మాత్రా సమత కారణముగా లయ సాధించబడును. అధిక మాత్రలుకుదింపు, అల్పమాత్రలు, సాగతీత లయపూర్ణత కొఱకు చేయబడును.
5. గణముల కంటే కాల సంపుటములకు ప్రాధాన్యత
6. గణానువర్తి పద ప్రయోగము తరచుగా ఉండును.

## దేశి చ్ఛందో నిర్దేశనము

సాహిత్యము యొక్క బాహ్యస్వరూపము గద్య పద్య భేదముచే ద్వివిధము కాగా గద్యము "....అపాద పదనికర ద్యోతిత నపరసార్థ రచన".[12] దీనిని బట్టి పద్యము పాదవ్యవస్థ కలది అని తెలియుచున్నది.[13] పద్యమును "వృత్తం జాతి శ్చేతి ద్వివిధమ్మని"[14] లాక్షణికులు నిర్దేశించినారు. నియత వర్ణవ్యవస్థకల పాదములు కలది వృత్తము. నియత మాత్రావ్యవస్థకల పాదములు కలది జాతి[15].

"కమనీయ వృత్తములు గణ
నమక నిబద్ధములు, శేష జాతులు మాత్రా
నమక నిబద్ధము[16] లని కవిజనాశ్రయకారుడు నిర్వచించినది మొదలు

తెలుగులో లాక్షణికులెల్లరును షడ్వింశతి ఛందో జాతములను ఒక భాగముగా, శేష జాతులను వేరొక భాగముగా తమ ఛందోగ్రంథములందు లక్షణ మొనర్చినారు. మార్గ-దేశి చ్ఛందములని వాడకున్నను వారు వృత్తములను సంస్కృత ఛందో విషయకముగా, జాతులను తద్భిన్నముగా భావించుట జరిగినది. కవిజనాశ్రయ కారుడే జాతులకు జాత్యధికారమని పేరుగా ఒక ప్రకరణమునిచ్చినాడు. 'ఏక దేశస్థితమైనది జాతి' యన్న హలాయుధ వ్యాఖ్యను బట్టి జాతి ప్రత్యేక ప్రాంతీయమైనదిగా గుర్తించిరనవచ్చును[17]. జయకీర్తి తన ఛందోఽనుశాసనమున సప్తమాధికారమంతయు కర్ణాట విషయ భాషా జాత్యధికారమనినాడు. నాగవర్మ తన ఛందోంబుధిలోని 5 వ ఆశ్వాసమును కర్ణాట చందస్సులకే వినియోగించినాడు. కిట్టెల్ దానికి వ్యాఖ్య వ్రాయుచు The outhor, having furnished the language etc. common to all countries, now introduces the pure carese metres.[19] అని కన్నడ దేశైక ఛందస్సులనినాడు. ఇట్లు జాతి అన్నది సంస్కృత భిన్నముగా దేశీయముగా గుర్తింపబడినది.

తెలుగులో జాతితో బాటు ఉపజాతి అన్న వేరొక్క భేదము చెప్పబడినది. ఉపజాతిని అంతర్భాగముగా పేర్కొనుచు ఆద్య ఛాందసికుడైన రేచన రెంటికి గల లక్షణ భేదమును చెప్పక జాతులు కందము, ఆర్యమున్నగునవి అని, ఉపజాతులు గీతులు మొదలగునవని వివరించినాడు. అప్పకవి జాతులకు, ఉపజాతులకు గల భేదమును స్పష్టముగా చెప్పినాడు. ప్రథమాక్షరము జాతులలో గురువైనచో గురువే, లఘు వైనచో లఘువే యుండును. ఉపజాతులలో ఈ నియమము లేదు.

జాతులలో ప్రాస తప్పనిసరి. జాతులలో ప్రాసయతి వాడరాదు. ఉపజాతులలో యతికి బదులుగా వాడవచ్చును. అప్పకవికి ముందుజాత్యుపజాతి భేదము ఇంత స్పష్టముగా చెప్పబడలేదు.

తెలుగు పద్యము

| | |
|---|---|
| వృత్తములు (మార్గి)<br>సంస్కృతము నుండి వచ్చినది<br>(అక్షర సమక గణ నిర్మితములు) | వృత్తేతర పద్యములు (దేశి)<br>ద్రావిడ భాషా సహజములు<br>(మాత్రాసమక/ఉప (దేశీయ)<br>గణ నిర్మితములు) |

వృత్తేతర పద్యములు:

| | |
|---|---|
| జాతి పద్యము<br>ప్రాస నిర్బంధము<br>(యతి మాత్రమే వాడపలయును) | ఉపజాతి పద్యము<br>ప్రాస నిర్బంధము లేదు<br>(యతి గాని దానికి బదులు<br>ప్రాసయతిగాని ఏదైనా వాడవచ్చును) |

జాత్యుపజాతులను స్పష్ట భేదముతో చూపిన లాక్షణికులు సైతము విశేషముగా కాన రారు. కొందరు ఈ భేదమును పాటింపనైనను పాటింపరైరి. పొత్తపి వేంకట రమణ కవి జాతి, వృత్తమని విభజనమే చేయలేదు. కాని లక్షణము చెప్పునప్పుడు మాత్రము 'ఇది గీత జాత్యధికారము,' 'సీస జాత్యధికారము' అని యిట్లు జాతులని పేర్కొనినాడు. అవియును సీసాదులగు ఉపజాతులను జాతిగా వ్రాసి జాత్యుప జాతుల మధ్య గల భేదమును పాటింపలేదు. అంతేకాదు "అక్కర జాతి వృత్తము లని పేర్కొని, అక్కరాదులను వృత్తములుగ భావించినాడు. జయకీర్తి తన ఛందోఽను శాసనమున '........శీర్షకాది జాతయ ఉదితాః" అని శీర్షకము (సీస మును) జాతియే యని అనినాడు[20]. జాతి అన్నది సముదాయార్థమున (Group)ను వాడబడినది. కావ్యాలంకార చూడామణి, కవిజనాశ్రయకర్తలు అక్కర జాతి పద్యములని ప్రత్యేక విభాగము చేసినారు. అక్కర జాతి యనగ అక్కరకోవలోని పద్య సముదాయమని భావము. ఇది గణములను బట్టి ఏర్పడినదిగా విపరింపబడి నది[21].

గణ వ్యవస్థను బట్టి పరిశీలించినపుడు సంస్కృతములో మాత్రా వృత్త ములు, వర్ణ వృత్తములు అని విభాగము కలదు[22]. నాగవర్మ ఛందోఽంబుధిలోని విశ్లేషణము ననుసరించి మాత్రాబద్ధములైన రఘటాదులు, దేశి (ఉప) గణ నిర్మిత ములు అక్కరాదులు అని దివాకర్ల భావించినారు[23]. తెలుగులో గణ విభజనను బట్టి చూచినప్పుడు అక్షర సమక గణములు, మాత్రాసమక గణములు, సూర్యేంద్ర చంద్ర

(ఉప) గణములని మూడు భిన్నములైనవి కలవు. అక్షర సమత గణ నిర్మితములు వృత్తములు, మాత్రాసమత గణ నిర్మితములు కందాదులు, ఉపగణ నిర్మితములు సీసాదులు. కనుక కంద సీసాదులు అనగా జాత్యుపజాతులు సంస్కృత భిన్నములై దేశీయములగు చున్నవి. "ఉపగణ మాత్రాభిర్జాతి" అన్న చింతామణి కారిక ననుసరించి మాత్రాగణ, ఉపగణ నిర్మితములు జాతి అనగా జాత్యుపజాతు లన్నియు ఒకే విధమగును. సంస్కృతములో మాత్రా గణములున్నవి కనుక కందా దులు దేశీయములు కాకపోవచ్చుననిపించును. కాని పెక్కు జానపద గీతములు మాత్రా సమత కల్గిన పాదములు కల్గియుండుటచే మాత్రాగణ పద్ధతి దేశీయమేనని చెప్పవచ్చును. ఉప గణ నిర్మితమైన ఛందములలో వేని యందును మాత్రా సమత పాటింపబడదు. మొత్తము మీద జాత్యుపజాతులు సంస్కృత భిన్న ఛందములు జాతులు ఆంధ్ర భాషా సహజములు.

కం. మాత్రాగణ రచనలకుం
వాత్రములై నెగడి యాంధ్ర భాషా కవితా
మిత్రములై రసభావా
మత్రములై జాను తెలుగ మించిన క్రమంబున్[24] అని

విన్నకోట పెద్దన చెప్పుటను బట్టి మాత్రా గణములు ఆంధ్ర భాషా కవితామిత్రములే యని లాక్షణికాభిప్రాయముగా భావింపవచ్చును.

ఇట్లు సంస్కృత ఛందోభిన్నములై, ప్రత్యేక గణ వ్యవస్థను కలిగి సోదర ద్రావిడ భాషలతో సంబంధము కలవై తెలుగు భాషకు ప్రత్యేకములును సహజాలంకారములునైన యతి ప్రాసలు కలిగిన ఈ క్రింది ఛందస్సులు దేశి ఛంద స్సులుగా గుర్తింపబడుచున్నవి.

I. ప్రాస నిర్బంధము కలది

1. కందము, 2. ద్విపద, 3. తరువోజ, 4. అక్కర, 5. ఉత్సాహ
6. త్రిపది, 7. చౌపది, 8. షట్పది, 9. విషమ గీతులు.
a) ఎత్తుగీతి b) కమలన (మేలన) గీతి c) పవడ గీతి

II. ప్రాస నిర్బంధము లేనివి

10. సీసము, 11. ఆటవెలది, 12. తేటగీతి, 13 మంజరీ ద్విపద

III. ఉద్ధురమాలావృత్తములు

i) లయగ్రాహి ii) లయ విభాతి iii) లయహారి iv) త్రిభంగి

VI. జానపద ఛందస్సులు

15.రగడ,కళిక,ఉత్కళిక,16. జానపదగేయఛందస్సులు (తాళబద్ధములు)

—x—

## అ థ సూ్చి క లు


1. అనుశాసనిక పర్వము — ఆం.మ.భా. ఉస్మా. విశ్వ. ప్రచు. పు.129 - పీఠిక
2. A history of Malayalam metre - P. 319
3. త్రిపురాంతకోదాహరణము — నిడుదవోలు వారి పీఠిక పు. 32
4. The Commonness in the metres of Dravidian languages (Ch. 15. P. 447)
5. 'దక్షిణ భారత సాహిత్యములు'-కన్నడసాహిత్యచరిత్ర-ఆం.ప్ర.సా.అ.పు.58
6. తెలుగు భాషలో ఛందోరీతులు
7. మార్గి — దేశి పు. 119
8. కుమార సంభవతత్త్వము — పు. 60 — 61, 163
9. నృత్త రత్నావళి — పు. 15. ఆం.ప్ర.సం. నాటక అకాడమీ
10. ఉత్సాహ ఒక పాదమునకు అన్ని హగణములే వాడిన అది సుగంధి (హంస యాన) వృత్త లక్షణముతో సరిపోవును. లేదా అన్ని నగణములే వాడిన అది తరళ (విచికిలిత) వృత్తలక్షణమునకు సరిపోవును.
11. ఛందోఽనుశాసనము — జయకీర్తి 1-22 శ్లో.
12. కవిజనాశ్రయము - సంజ్ఞా 12 ప.
13. పాద, కల్పనంబు వలదు గద్యమునకు, పాదనియతి నొప్పు పద్యంబు, లవియు వృ, త్తములు జాతులనగ నమరు గృష్ణ - ఛందోదర్ప. 1-6
14. ఆంధ్ర శబ్ద చింతామణి
15. "వృత్తంబులు గణబద్ధము
    లుత్తమ మగు జాతులెల్ల నొనరగ మాత్రా
    యత్తంబులు..." ఛందో దర్పణము 1-7
16. కవిజనాశ్రయము 1 - 14
17. మాత్రా ఛందస్సులు - చిలుకూరి నారాయణరావు పు. 88 "వ్యాస సంగ్రహము" - సంపా. తెలికిచర్ల వేం. రత్నము
18. జయదామన్ - హరితోష గ్రంథమాల - సంపా. H.D. వేలంకర్.
19. ఛందోఽంబుధి - నాగవర్మ Ed. Kittel P. 95
20. ఛందోఽనుశాసనమ్. 1-22
21. ఛందోంగములలో గణములన్న ప్రకరణమున 'అక్కర జాతి గణము'లన్న చోట వివరించబడినది.
22. 'మాత్రావర్ణ విభేదేన ఛందస్తదిహ కథ్యతే' - వృత్తరత్నాకరం I-4
23. ప్రాఙ్నన్నయ యుగము - పు. 319
24. కావ్యాలంకార చూడామణి VIII - 21




# ప్రాఙ్నన్నయ యుగము

# దేశి చ్ఛందస్సు

## అధ్యాయము - 3

# ప్రాఙ్నన్నయ యుగము నందలి దేశిచ్ఛందస్సు

క్రీ॥ శ॥ 11వ శతాబ్ది నాటికి నన్నయ భట్టారకులు మహాభారతాంధ్రీకరణ మొనరించు నాటికే తెలుగు సాహిత్యము సుస్థిర స్వరూపమును సంతరించుకొన్నది. దాని కావ్య వాఙ్మయము లభ్యము కాకపోవుటచే నన్నయకు గల పూర్వపు యుగమును సమగ్రముగా పరిశీలించి నిర్ణయములను చేయ వీలుకాకున్నది. అట్లయ్యును లభ్యమాన ప్రాఙ్నన్నయ యుగపు సాహిత్యము దేశి ఛందో దృష్టితో పరిశీలింపబడుచున్నది.

ఈ యుగపు సాహిత్యము లిఖితము, అలిఖితమని విభజించుకొనినపుడు శాసన వాఙ్మయ మంతయు లిఖితమనియు, గేయ వాఙ్మయ మంతయు అలిఖిత మనియు అనవచ్చును. పండిత కవుల అనాదరణకు గురియై లిఖింపబడకుండుటయు మౌఖిక సంప్రదాయమగుటచే దీనిని అలిఖితమని చెప్పబడినది.

## 1. అలిఖిత సాహిత్యము

ఏ సాహిత్యమునకైనను లిపి లేని ప్రాచీన దశలో సైతము గేయ వాఙ్మయ ముండుట సహజము. ఇది నేటికిని అనాగరిక భాషలలో చక్కగా కన్పట్టుచునే యున్నది. అట్లే ప్రాఙ్నన్నయ యుగములో గేయ వాఙ్మయమున్నది. తెలుగు నేలను ఏలిన శాతవాహన రాజుల కాలములో తెలుగుభాష ఉనికి చెప్పలేకున్నను నాటి తెలుగు దేశపు జనుల పాటలు గాథా సప్తశతిలో ప్రాస్తావికముగా చెప్పబడినవి. నిండుగ పండిన పంటను చూచి రైతు పాడుకొన్న పాటలు, వధువునకు విన్పించబడిన వరుని వర్ణనతో కూడిన పెండ్లిపాటలు సప్తమశతిలోని 89, 42వ గాథల్లో వివరించబడినవి[1]. పాలుకురికి సోమనాథుడు ఆనాడు ప్రచారములోనున్న జానపదగీతములను పండితారాధ్య చరిత్రములో పేర్కొనినాడు. ఆతని బసవపురాణ రచనమునకు బసవని భక్తుల పురాతన గీతములే మూలములని చెప్పినాడు[2]. సామాన్య జనుల జీవితములో భాగమైన పాటల ప్రాముఖ్యమును గుర్తించియే కదా అతడు తన మత ప్రచార నిమిత్తము గేయమును గైకొనినాడు! నన్నయ భట్టారకుడే రాజ రాజ నరేంద్రుని కావ్య-గీత ప్రియుడని పేర్కొనినాడు[3]. గీత ప్రియత్వము గేయము

అస్తిత్వమును తెల్పుచున్నది. నన్నెచోడుడు కుమార సంభవమున తపమాచరింప కాననభూమికేగు పార్వతీదేవి యాటవికులాలాపించు గౌడు గీతములు వినినట్లు వ్రాసినాడు[4]. ఇంకను ఊయల పాటలు, అంకమాలికలు మున్నగు జానపద గీతము లను తన కావ్యమున పేర్కొనినాడు.

నాటి జానపద గీతములు ఏ ఛందములో నుండెడివో తెలియరాదు. సోముడు ద్విపదనే కావ్యోపయోగిగా చేయుటచే ద్విపద కానాడు బహుళ ప్రచార ముండెనని యూహింపవచ్చును. "ద్విపదాది దేశీయ ఛందస్సులలో రచింపబడిన కృతులే నన్నయకు పూర్వమున సర్వజన సామాన్యములైన దేశిరచనలై యుండునని మన మూహింపవచ్చును". అని కోరాడవారిట్టి యభిప్రాయమును వ్యక్తీకరించిరి[5]. నేటికిని జానపద గీతములలో అధికాంశము ద్విపదగానో, ద్విపదచాయలోనో నడచు టను బట్టియు, తక్కిన దేశిచ్ఛందములు ద్విపదతో సమీప సంబంధము కల్గియుండుట వలనను పై యభిప్రాయము సమర్థనీయమగుచున్నది.

దేశి ఛ్ఛందస్సులకు మూలమనదగిన జానపదగీతములు ప్రాచీన కాలమున పండితులచే అనాదరింపబడి యుండును. భాష కాని సాహిత్యము కాని దేశీయ మన్నంతనే వారు అనాదరించెడివారు[6]. ప్రాచీన కన్నడ సాహిత్యములో ఆద్యమన దగిన క్రీ. శ. 9వ శతాబ్దినాటి కవిరాజ మార్గములో దేశి కన్నడమును గూర్చిచెప్పుచు దానిలోని దోషములు ఇంతింతయని చెప్పుటకు వీలుకాదని, అది వాసుకికిసైతము అసాధ్యమని, అది కావ్యోపయోగమునకు అందముకాదని, పాతకన్నడము పురాణ కావ్య ప్రయోగమునకు జరద్వధూ విషయ సురత రసికత వంటిదని ఈసడించినది.[7] అంతేగాక కవిరాజమార్గము సమసంస్కృతమును కన్నడభాషలో మిశ్రమముచేసి చెప్పుటను గూర్చి ప్రశంసించినది. ఈ భావనకు నన్నయగారి తత్సమశైలి దగ్గరగా నున్నది. తెలుగు కన్నడ సాహిత్యములు ఇంచుమించు తుల్యరూపములో నున్న ఈ శతాబ్దిలో ఈ అభిప్రాయ మును తెలుగు సాహిత్యమునకును అన్వయింప చేసికొన వచ్చును. పండిత కవులకుదేశి సాహితీ సంపద లోపభూయిష్టముగా నుండుటలో ఆశ్చర్యము లేదు.

లక్షణ విరుద్ధమగు భాష గ్రామ్యమని, అది కావ్యోపయోగి కాదను అభి ప్రాయము పండితులలో తరువాత పలు శతాబ్దుల పర్యంతము తెనుగునాట బలపడి, యున్నది[8]. లేఖన సాధనములు గల్గ లిపి సంస్కారులైన పండితులు నిరాద రించుటచే ఈ గేయ వాఙ్మయము కాల ప్రవంతిలో కొట్టుకొని పోయినది. లేకున్నచో దేశి ఛ్ఛందస్సుల అస్తిత్వ వికాసములు స్పష్ట రూపమున బయల్పడి యుండెడివి.

సోదర ద్రావిడ భాషయగు తమిళములో 4వ శతాబ్దిలోని రాజులచేత జానపద గేయోద్ధరణము జరిగినది. వాటికి విషయమును బట్టి, పాదముల దైర్ఘ్యమును బట్టి పర్గీకరణము జరిగినది. నాలుగు నుండి ఎనిమిది పాదములు గలవి ఒక సంపుటిగా, 13 నుండి 31 పాదములు గలవి మరొక సంపుటిగా అమరినవి. విషయమును బట్టి జరిగిన పర్గీకరణలో 'ఎట్టుత్తొగై' 'పత్తుపాట్టు' అనే 17 సంపుటములుగా ఏర్పడినవి. వీనిలో ప్రాచీన గేయములు 2186 సంఖ్యలో మొత్తము 26,350 పాదములతో 6 సంపుటములుగా వెలువడినవి[9]. ఇవి యన్నియు అగవల్పా ఛందములోనివే. ఈ ఛందమునకు మన తెలుగులోని సీసముతో కొంత పోలిక వున్నది.

ప్రాచీన గేయ వాఙ్మయ నిరాదరణముతో బాటు గేయ ఛందస్సులను కూడా నిరాదరించుటయో లేక మార్గ ఛందస్సుల పద్ధతి లోనికి (గణవ్యవస్థ, పాద వ్యవస్థా విషయమున సంస్కృత వృత్త మార్గములోనికి) మార్చు కొనుటయో జరిగినది. కోరాడ వారును పాటల రూపమున నున్న దేశి కవితకొంత సంస్కారము పొందిగాని, పద్యరూపమున శాసనములలోని కెక్కునర్హత సంపాదించలేదనిరి[10]. తెలుగులో తొలి లక్షణ గ్రంథమైన కవిజనాశ్రయమున సైతము తాళబద్ధమై గేయ ఛందములకు సన్నిహితమైన రగడను లాక్షణీకరించుట జరుగలేదు. కవి జనా శ్రయమున తక్కిన దేశి చ్ఛందములు లాక్షణీకరింపబడినవి. రగడ యొక్క ఉప యోగము ప్రాఙ్నన్నయ యుగములో నున్నది రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక కాలమున క్రీ.శ 1022లో వ్రాయించబడిన కోరుమిల్లి శాసనములో రగడయున్నది. కాని నన్నయభట్టు కింత సమీపములోని రగడను నన్నయ తన భారతమున ఉపయో గించలేదు. తర్వాతి కాలములో సైత మీ గేయ చ్ఛందము శివకవులచే ఉద్ధరింప బడినదే. నన్నయ మార్గములో నడచిన తెలుగు కవులు దీనిని అక్కడక్కడ ఏ ప్రత్యేక వృత్తమును వ్రాసినట్లో వ్రాసినారే కాని బహుళోపయోగము చేయలేదు.

పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రమున నాటి జన వ్యవహారములోని గేయ ఫణితులను పేర్కొని మేలు గావించినాడు.

"పదములు, తుమ్మెద పదముల్, ప్రభాత
పదములు, శంకర పదముల్, నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సంవాది
వర్ణన మంగళ వర్ణన పదములు....[11]"

తుమ్మెదా, తుమ్మెదాయనో గొబ్బిళ్ళో గొబ్బిళ్ళో యనో పాటలోని పాదాంత ఆవృత్తి పదముల (Refrain)ను బట్టి పైన పేర్కొనబడిన పాటలు జనవ్యవహార నామములతో చెప్పబడి ఉండును. (పద్య పద్యమున కావృత్తమగు శతకములోని మకుట మిటువంటిందే. మకుటమును బట్టియే శతకమునకు నామ ముంచుటయు చూడగలము.) ఇట్లే పాటల పేర్లను మాత్రమే గాని స్వరూపమును, ఛందస్స్వభావమును మనము నిర్ణయింపజాలము. ఐనప్పటికిని ఏ కాలములోని జాన పద గేయములైనను తాళ బద్ధ రచనలై, మాత్రా సంపుటులలో కొలువబడుచు, పాదాంత విచ్ఛేద రూపయతి గల్గి పద మధ్యయతి విచ్ఛేద రూపముతో సమ భారత కల్గి ఏకబిగిన నడుచుట సహజసిద్ధము. జాతీలు ఒకరి నుండి యొకరికి అను శ్రుతముగా సంక్రమించెను. నిరక్షరాస్యుడు ఐన జానపదుడు తిరిగి అదే లయను సిద్ధపరచుకొని కొత్త గేయములను సృష్టించుకొనును. దీనిని బట్టి నాటి ప్రాచీన గేయ ఛందములనిట్లే భావింపవచ్చును.

## 2. ప్రాచీన ఛందో గ్రంథము

పాల్కురికి సోమనాథుడు తన ద్విపదకు ప్రాసయతిని గూర్చుట కొఱకై పండితారాధ్య ము ద్దేశించి "ప్రాసోవా, యతిర్వా" యని లక్షణమునుద్ధరించినాడు[12]. ఇది ఏదో ఒక ఛందో లక్షణగ్రంథములోనిదై ఉండును. దీనిని బట్టి మనకు ప్రాచీన కాలములోనే ఏదోఒక ఛ్ఛందోగ్రంథమున్నట్లుతెలియుచున్నది.అంతేగాక అదిసంస్కృతములో వ్రాయబడి వుండును. ఒకవేళ ఇది ఏదైనా సంస్కృత ఛందో గ్రంథమను కున్నను సంస్కృత ఛాందసికులకు తెలుగు ద్విపద లక్షణము చెప్పవలసిన యక్కర వుండదు. కనుక ఇది అచ్చముగా తెనుగునకు సంస్కృత భాషలో రాయబడిన ఛందశ్శాస్త్ర గ్రంథమే. ఇది సోమన్నకు సమీప లేదా సమకాలికము కాక ప్రాచీనమై వుండవచ్చును. సమీప కాలికమే మైనచో 'ప్రాసయతి' విషయమై వివాదము కాని, వాద బలమునకై ఉద్ధరణముకాని అవసరముండక పోవచ్చును.

10వ శతాబ్దినాటి తమిళ భాషలోని "యాప్పరుంగలమ్మ"న్న సూత్ర ఛందో గ్రంథము యొక్క కారికలో "వాంచియార్ సెయిద వడుగ చ్ఛందమమ్" (వాంచియ చేసిన తెలుగు ఛందమును) అని సంస్కృతాంధ్ర కర్ణాట ద్రావిడ భాషలలోని ఛందముల పట్టికలో పేర్కొనుట జరిగినది. "వాంచియ" కవిజనాశ్రయ కారుడైన రేచన ఐయ్యుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారనిరి[13]. కాని

తమలో భాగ బాగుగా నెరిగిన శ్రీ రాపూరి వెంకటస్వామి శర్మగారు మాత్రము దీనిని ఖండించి దేవనను వాచివాచక్ అనుట పదరని, దేవణ్ణ అనవలయునని, వాంఛియ యన్నది ప్రత్యేక వ్యక్తి నామమే యని నిర్ధారించిరి[14]. దీనినిబట్టి తెలుగులో 10వ శతాబ్దికి పూర్వమే ఒక తెలుగు ఛందో లక్షణ గ్రంథముండినట్లు తేలినది. అది సంస్కృత భాషలో వ్రాయబడి ఉండినచో పాలుకురికి సోమనాథుడు ఉద్ధరించినవై యుండి యుండును. మొత్తము మీద ద్విపదకు ప్రాచీన కాలముననే లక్షణమొనర్ప బడిన ఛందోగ్రంథమొకటి ఉన్నదని భావింపవచ్చును.

ఇవేకాక ఇంకను ఆంధ్ర ఛందో గ్రంథములున్నవని శ్రీ రాపూరి వెంకట స్వామి శర్మగారు దేవన కవిజనాశ్రయమును "జయదేవాది చ్ఛందోనయమున..." అన్న మాటలనుబట్టి వ్రాసిరి[15]. కాని జయదేవ చ్ఛందము సంస్కృతము నందును ఉండుటచే దేవన మాటలు తెలుగు ఛందముల నుద్దేశించినవని నిర్దుష్టముగా చెప్ప వీలులేదు.

తెలుగులో స్వతంత్రముగా ఛందో గ్రంథము లున్నట్లు గల ఈ యాధా రములను బట్టి తెలుగు ఛందముల స్వయం ప్రతిపత్తి నన్నయకు పూర్వమే నిర్ధారిత మగుచున్నది. పాటలు, పదములు, కొన్ని తెలుగు పద్యములు మొదలగు పాండిత్య ప్రకర్ష నిరపేక్షములగు రచనములును వానిని బంధించు ఛందో వ్యాకరణ విధులును కొన్ని అంతకుముందు గలవనుట నిశ్చయము" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారును పై అభిప్రాయమును సమర్థించిరి[16].కాని దేశి చ్ఛందములకు గల కావ్యస్థ లక్ష్యములు లభింపక శాసన లక్ష్యములు మాత్రము లభించుట కొంతలో కొంతైనా సాహిత్య పరిశోధకులకు లాభదాయకమైనది.

ఇంక లభ్యమానములగు ప్రాఙ్నన్నయ యుగపు శాసనములలోని దేశి చ్ఛందస్సుల స్వరూప స్వభావములను పరిశీలింతము.

—x—

## అ థ స్సూ చి క లు

1. సమగ్రాంధ్ర సాహిత్యము Vol. I
2. 'ఆతత బసవ పురాతన భక్త గీతార్థ సమితియె మాతృకగాగ'
   — బస. పు.పీఠిక. పు. 9
3. ఆంధ్ర మహాభారతము — ఆది ప. (సంశో.ము.) ద్వితీ — 1

4. కుమార సంభవము — VI — 45
5. ద. దే. భా. సా. — దేశి పు. 125
6. దేశికార ప్రబంధోఽయం హరవక్త్రాద్వి నిర్గతః
అసంఖ్యాకాస్తు కథితాః నజ్ఞాయంతేల్ప బుద్ధిభిః — అల్పబుద్ధులచే తెలియ బడని ఈ దేశి వాఙ్మయమును సూచించిన శ్లో. గిడుగువారి తె. ఛం. రీ.ల్లో ఉటంకించబడినది. పు. 158
7. కవిరాజ మార్గము
8. బాలవ్యాకరణము — సంజ్ఞా పరిచ్ఛేదము
9. సమగ్రాంధ్ర సాహిత్యము. I సం. పు. 33 — ఆరుద్ర
10. ద. దే. భా. సా. దేశి — కోరాడ పు. 113
11. పండితారాధ్య చరిత్రము — వాదప్రకరణము పు. 513
12. " " — పీఠిక — పు. 85
13. 'నన్నయకు పూర్వపు ఛందస్సు' — రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక
14. తె. భా. ఛం. రీ. — రావూరి పు. 11
15. " " "
16. నన్నయకు పూర్వము ఛందస్సు - రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక పు. 218



# 3. నన్నయకు పూర్వపు శాసనములలో దేశి చ్ఛందస్సు

లిఖిత వాఙ్మయమని పేర్కొనదగిన ఈ కాలపు శాసనములలో పద్య శాసనములను పరిశీలించినపుడు దేశి చ్ఛందస్సుల ప్రయోగము విస్తృతముగా కన్పట్టుచున్నది. మార్గి వృత్తముల ప్రయోగము క్వాచిత్కమై ఉన్నది. లభ్యమాన శాసనములే దేశి ఛందస్సుల యొక్క విస్తృత ప్రయోగమును వ్యక్తపరచుటతో నన్నయ తన మార్గమును ప్రత్యేకించి మార్గి పద్ధతికి తీసుకుని వెళ్ళినట్లు తోచును. "No Telugu Verse written in a Sanskrit metre, before Nannaya' has so for been discovered though we meet with a good number of verses written in Desi metres in inscriptions before his time" అని కోరాడ రామకృష్ణయ్యగారు[1] దేశి ఛందః ప్రయోగ బాహుళ్యమును సమర్థించినారు. విద్వత్సభామోదము కొఱకో, తనకు పూర్వపు పంపాది కన్నడ కవుల సరళి అనుసరించుట కొఱకో నన్నయ వదలివేసిన దేశి చ్ఛందస్సంప్రదాయములు తిరిగి శివకవుల కాలమునకు గాని ఉద్ధరింపబడలేదు.

ఈ శాసనములలో ఇప్పటికే ఆటవెలది, తేటగీతులు,సీసము, అక్కరలు, రగడలు, కందము, తరువోజ వంటి దేశి చ్ఛందములు పెక్కు పండితులచే వివరింపబడినవి. అంతేగాక దేశి చ్ఛందచ్ఛాయలో సైతము అనేక శాసన పాఠ పాదములను పండితులు ఆవిష్కరించి చూపినారు. త్ర్యక్షర గణ నిర్బంధము మార్గి ఛందములలోవలె దేశి చ్ఛందములలో లేకుండుటను బట్టి దేశి ఛందములకు గల గణ స్వేచ్ఛవలన అనేక ఇతర శాసనములలో సైతము దేశియ ఛందములను అనేకమును గుర్తింపవచ్చును. వీటిని కొన్నిటిని దివాకర్ల వారు వృత్తగ్రంధిప్రాయములనిరి కొన్ని యాదృచ్ఛికముగా సరిపోవచ్చుననిరి[2]. దేశి ఛందచ్ఛాయలు గల శాసనములను గూర్చి ఆరుద్ర "...యతి ఉంటే ప్రాస ఉండదు. ప్రాస ఉంటే యతి ఉండదు. రెండూ ఉంటే గణాలు సరిపోవు. ఈ పంక్తులలో ఛందో వాసనలు ఉన్నాయని తృప్తి పడాలేగాని సంపూర్ణంగా సలక్షణమైన ఛందోబద్ధ శాసనాలు మనకు గుణగ విజయాదిత్యుని కాలంలో క్రీ. శ. 848 నుంచే కనబడుతాయి...[3]" అని అన్నారు. "పాత తెలుగు పద్యాల్లో యతి నియతి లేదా"

అని శ్రీమతి సులోచనగారు అనుమానించి "ఇది నియమ పూర్వకం కాదని, ఒకవేళ యతి కన్పట్టినా యాదృచ్ఛికాలు కావచ్చుననినారు[4]. ఛందస్సులకు సమగ్ర లక్షణమును చూసగల్గిన ఇట్టి ఆధునిక దృక్పథముతో ప్రాచీన శాసన ఛందములల్లో కన్పిలచుట సమంజసమే. కాని వాటిని దేశి చ్ఛందస్సుల ప్రారంభకాలము లోనివిగా చూడవలయును. ఏ కళమైనను స్వేచ్ఛా వాతావరణములో పుట్టి కాలక్రమములో లక్షణ నిర్బంధమునకు లోనగునుగదా! నాటి లిపి, లేఖన పద్ధతులును, శాసన మర్యాదలును లిపికారుచే వ్రాత దోషములను, లక్షణ స్వేచ్ఛను దృష్టిలో పెట్టుకొని శాసనములు పరిశీలించినపుడు పై అభిప్రాయములు కొంతవరకు దూరమగును.

ప్రాఙ్నన్నయ యుగపు శాసనములలో వృత్తములకన్న ఎక్కువగా దేశి చ్ఛందములే కనబడుట విశేషము. కందము, సీసము, రగడలు, తరువోజ, అక్కరలు, ద్విపదలు మున్నగునవి లభ్యమాన ఛందములలో కానవచ్చుచున్నవి. దేశి ఛందస్సులు తెలుగు శాసనముల యందే కాక సంస్కృత శాసనములందు సహితము ఉపయోగింపబడినవి. రాజరాజు కోరుమిల్లి శాసనమునందు (క్రీ.శ. 1022) రగడ, అయింబాక తామ్ర శాసనమునందు (క్రీ.శ. 927-933) కందము, కన్పట్టుచున్నది. ఈ సంప్రదాయము నన్నయ తరువాత సహితము కొనసాగినదనుటకు క్రీ.శ 1403 నాటి పంచదార్ల స్తంభ శాసనమే సాక్ష్యము.

"మహిత గండ పెండ ∗ మధ్య దేశాధీశ

జనకదత్త రాజ్య ∗ సమధికేశ" ఇది సంస్కృతములో రచింపబడిన 'ఆటవెలది' పాదము. ఈ శాసన రచయితలు నాడు దేశి చ్ఛందమును బహుళ ప్రచారములో నున్న కారణముననే సంస్కృత భాషయందు సైతముపయోగించిరనవచ్చును. శాసనములలో లభించిన దేశి చ్ఛందములు ఇక్కడ వివరింపబడుచున్నవి.

## (అ) ద్వి ప ద :

ఇది శాసన ఛందస్సులలో బహుళముగా గానవచ్చుచున్నది.

1) ఎఱికల ముత్తురాజు పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము : (క్రీ.శ. 575) No. E .I Voi. XXVII Page. 225]

1. పుణ్యకు, మారున్డు ∗ గణ్యమానున్డు
2. మాఱున్ద, పిడుకు, ∗ మదముదితున్డు
3. (ఉ) త్తమోత్తమున్డైన వాన్డుచి, ర్వలియ

4. పుట్టుకాను, రేనాణ్డు, * పఱచు తక్కిన
5. పుణాల్వా, రద్దాయ, * కిఛెపురు, కత్తి
6. శరనుకు, తిపఱ్ఱా, రపనాళ, కొణ్డ
7. కొత్తఱ్ఱాయ, చీకున, బదియసో, మ్వార
8. బుపుణడు, పుష్యంబు, * బృహస్పతి, హోర

ఇందలి ద్విపదను దేపరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు గుర్తించిరి[5]. ద్విపద నడక ఇచ్చట ధారాళముగా కన్పట్టుచున్నది.

ఇందు 'యతి' చెల్లినది. ప్రాసయతి కూడ సరిపడినది. ఆదిప్రాసలేదు. 1, 2, 7, 8, పాదములందు అంత్యప్రాస కలదు. దీనిని బట్టి ద్విపదకు మొదట ప్రాస లేకుండెను, తరువాత సంస్కృత 'మార్గి' (వృత్తము) ఛ్ఛందములను బట్టి ప్రాసము సమకూర్చబడియుండునని భావింపవచ్చును. ఈ శాసనము రేనాటి చోళుల కాలము నాటిది (క్రీ.శ. 814-877) కన్నడ కవిరాజ మార్గము కంటె 3శతాబ్దుల పూర్వపుది. దీనినిబట్టి ప్రాచీన కాలముననే ద్విపదకు ఉపయోగమును కన్నడములో వలెనె లక్షణమును నిర్మింపబడి పాల్కురికి సోమన వంటి వారిచే (ప్రాసోర్వా యతిర్వా—యని) ప్రస్తావింపబడియుండునని తలచవచ్చును.

**2). ఎఱ్ఱగుడిపాడు శాసనము :** (క్రీ.శ. 6వ శతాబ్ది)

[E. I. Vol XXVII Page 227] ఇందు ద్విపద ఛాయలున్నవి[6]
"ొట్టంబు, పాఱను, * కుణ్డికా, ఞ్లళ్ళ,
ఇచ్చిన, పన్నస, * ఇరవది, యాటి
నాల్కను, ఉన్డుఞ్ఞు............
ఈ ద్విపద యందును ఆదిప్రాస లేదు.

**3) పుణ్యకుమార చోళ మహారాజు రామేశ్వర స్తంభశాసనము:** ఇందు ఒక ద్విపద పాదమును దివాకర్లవారు గుర్తించినారు.

విరిపత్తి (జీతి), కమ్మరి * వినెయన, వ్రాసె[7] యతి స్థానమున సదృశాక్షర నిబద్ధతతోబాటు విచ్ఛేద రూపయతి కూడా పాటింపబడినది.

**4) కపిలేశ్వర పురపు శాసనము[8] :** ఇందు రెండు ద్విపద పాదములు గలవు.

ఏజ ఇత్త ఖహరళ* నిల్పిన దత్తి
కడల్దల ఇంశరయ * నిల్పరగుడియు

దీనిలో యతి ప్రాసలు లేవు.

**5) కోసినేపల్లి శాసనము :** [S. I.I . Vol. X. No. 698] ఇందు వేరొక ద్విపద పాదము గుర్తింపబడినది 9.

ప్రథమోటి. రట్టోడి * పరహితు, డితడు
ఇదే శాసనములో వేరొక నాలుగు పాదములు.
రేనాణ్డు, ఎఱువేఱు * నేతిగా, తుఱుము
సూక్లబా, దెయ్యర, * ట్టాడ్లుగు, డ్లెత్తి
ఞ్చెరివారి, పెండ్డంబు, * మారక, జేరు
కొడుకుచా, ముట్లైయ, సత్యాభి, మాని

**6) చాళుక్య భీముని కొఱవి శాసనము** (క్రీ.శ. 892-922)[10] :
ఇందు ఇతర దేశి ఛ్ఛందములతో బాటు ద్విపద రెండు పాదములు గుర్తింపబడినవి.

**1)** కొఱవి నల్లమేఱెయ * కొడుకు పెద్దన
రావించి నీవు నా ౹ ప్రాణ సమాను
ఇందును ఆదిప్రాస లేదు. యతి సరిపడినది.[11]

ఇదే శాసనమందు 2) "చే కొని కొఱవికి * చ్చిన స్థితి నిల్పి[12]" అన్నది వేరొక్క ద్విపద పాదము.

**7) ధనంజయుని కలమళ్ళ శాసనము:** (కీ.శ. 575) [E.I. vol XXVII P. 225] ఇందు ద్విపద 3 పాదములున్నవి.

ఎరికల్, ముతురాజు,* రేనాణ్డు, ఏళ
చిఱుమూరి, దేవణ,* కాలు పంపు చెను·
ఊరుకా, జుటికళా,* ఙ్ఱరిణ్డ వారు

-ఇందు ఆదిప్రాస కాననగుట విశేషము.

**8) సత్యాదిత్యుని మాలెపాడు శాసనము :** (క్రీ. శ. 725) [Ep India vol. XI P. 343] ఈ శాసనములో వేరొక ద్విపద కలదు.

ఞ్చమ్మహా పాతక * ఙ్చేసిన వాని
లోకంబును స్డు వాస్డు

ఇట్లు మరికొన్ని శాసనములలోని ఖండములను సైతము ద్విపదచ్ఛాయతో నడచిన వానిగా చూపవచ్చును. ఒకొక్క పాదము చూపగల్గిన మాత్రమున ద్విపద ఛంద మున్నట్లు చెప్పరాదు. ద్విపద అన్నప్పుడు రెండు పాదములు చూపగలిగి యుండ వలెను. దేశి గణవ్యవస్థలోని స్వేచ్ఛవలన కొన్ని యాదృచ్ఛికముగను ద్విపదను పోల్చవచ్చును[13]. ఐనప్పటికి పై శాసనాధార బాహుళ్యమును బట్టి నాడు ద్విపదకు గల బహుళప్రాచుర్యము నిస్సంశయము. అంతేగాక ద్విపదకు ద్విగుణీకృత రూప మగు తరువోజయు శాసనస్థము లభ్యమగుటచే దీని ప్రచార బహుళత్వము మరింత స్పష్టపడుచున్నది.

## (ఆ) తరువోజ

ప్రాఙ్నన్నయ యుగ శాసన ఛందములలో తరువోజ శాసనమింతవరకు ఒక్కటియే లభించినది. అది పండరంగుని అద్దంకి శాసనము [EI XIX P. 271-275] క్రీ.శ 344 నాటిదిగా గుర్తింపబడినది. పద్యలక్షణము సంపూర్ణముగా నిలిచిన శాసనమిది.

పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
 బల గర్వమొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టిఞ్చి ప్రభు బణ్డరంగు
 బఞ్చిన సామన్త పడువతో బోయ
కొట్టంబు ల్వన్డెణ్డు గొణి వేంగి నాణ్టిం
 గొఱల్చి యా త్రిభువనాంకుశ బణ నిల్పి
కట్టెపు దుర్గంబు గడు బయల్సేసి
 కణ్డుకూర్బెజవాడ గావిఞ్చె మెచ్చి.

ఈ పద్యములో ఆదిప్రాస (ద్వితీయాక్షర) నిర్దిష్టముగా నున్నది. ద్విత్వాక్షర మగుట వలన దాని సొబగు మరింత స్పష్టమగుచున్నది. యతి సైతము విచ్ఛేద సదృశాక్షరోభయ రూపముగా నున్నది. సంస్కృతమునందు వలె పాదాంతయతియు గలదు. పాద మధ్యయతి విచ్ఛేద రూపము నందుంచుటచే ద్విపద నడక స్పష్టమగుచున్నది.

ప్రాఙ్నన్నయ యుగమందలి శాసనములందు ద్విపదల ఉనికి లేదని, తరువోజ శాసనమొకటి లభ్యమగుటచే తరువోజ నుండియే ద్విపద యావిర్భవించి

దని పండితాభిప్రాయము[14]. కాని ఇంతకు ముందు ద్విపద గల శాసనము లనేకము చూపబడుటచే ఈ అభిప్రాయము సరియైనది కాదనవచ్చును. ద్విపదకు ద్విగుణీకృత రూపమే వృత్త పద్ధతి ననుసరించిన తరువోజయైనదని భావింపవచ్చును.

నన్నయకు పూర్వము శాసనములలో తరువోజలు ఇంకను కానరావు. నన్నయ భారతమునందును అనంతర శాసన[15] కావ్యము లందును ఇవి క్వాచిత్కములే.

## (ఇ) సీసము :

ప్రాఙ్నన్నయ యుగ శాసనములో బహుళముగా కానవచ్చుచున్న మరొక దేశి ఛ్ఛందము సీసము. 10 కి పైగా శాసనములలో నిది స్పష్టముగా గుర్తింప బడినది.

**1) ఎఱికల్ ముత్తురాజు మాలెపాడు శాసనము : (క్రీ.శ. 575)[16]**

శ్రీ ఎరి కల్మతు * రాజుల మరుమన్న
ఎపెరి పాఱక ఇరుప దియదీ
ఎనుమ ఋన్నుద్ల రాచమా నంబునా
ఇచ్చిన దత్తిదీ * అచ్చు వాన్డు

ప్రథమ పాదమున యతి సరిపడినది. ద్వితీయ పాదోత్తరార్ధమున ప్రాసయతి కుదిరినది.

**2) ఎఱికల్ ముత్తురాజు ఎఱ్ఱగుడిపాడు శాసనము[17] (క్రీ.శ. 571)**

శ్రీ ఎరి కల్మత్తు * రాజుల్ల కుణ్డికా
ళ్ళునివబు కానుఇ * చ్చిన పనాస
దుజయ రాజుల ముత్తు * రాజులు నవప్రియ
ముత్తురాజుల వల్ల * పదుక రజాలు

అదో రేఖాంకితాక్షరములు యతి, ప్రాసయతి సూచితములు.

3) చోళ మహారాజు ఉరుటూరు శాసనం (క్రీ. శ. 600 ప్రాం.)[18]

ఎరిగల్తు గరజుల్ల ఇచ్చిన పన్నాస
ఏబది తిరువుళ పాటకు ఇచ్చి (న)
పన్నాస దేనికి వక్రంబు వచ్చిన
వాన్తువ ఇచ్చమహా పాతకు అగు

ఈ పాదాలు సీస పూర్వార్ధాల వలె ఉన్నవి. 1, 2 శాసనములలో వలె సూర్యగణద్వయముచే అంతమగు ఉత్తరార్ధములు లేవు. ఒక విధముగా దీనిని పంచమాత్రిక గణ నిర్మితములనవచ్చును.

ఇట్టిదే పొట్లదుర్తి మాలెపాడు శాసనము (క్రీ॥ శ॥ 606-625) దీని యందు మధురగతి రగడగా గుర్తింపబడిన భాగమును సీసముగా పంచమాత్రిక గణ నిర్మితముగా చూడవచ్చును.

4) చోళ మహారాజు ముతుకూరు శిలా శాసనము[19] (క్రీ॥శ॥ 600)

నిల్చిన వత్తియ ధీమస గొరవల
కిచ్చిన నేలనూ టిరువది పుట్టుపల్లు

పై రెండు పాదములు సీస పాదపూర్వార్ధములు. అట్లే ఇదే శాసనములోని ఈ క్రింది రెండు పాదములు.

రాజమా నంబుదీ నియరివా ణంబువ
ద్దె డ్డువు ట్లుగొలుగు దీనికి వక్రంబు

5) చోళ మహారాజు కోసినిపల్లి శిలా శాసనము[20] (క్రీ॥ శ॥ 600)
దిగువ సీసమును డా॥ తంగిరాల విశ్లేషించినారు.

వ్వతి, దిగుసిన, చన్దంబు (?)
మేటిక, త్తన్ యెముందు, ఊరు, రాడ్లు

పైదహాదార్, లొ ఙ్డర, పెట్టతో, ప్తోపంవ

నిఙ్డర్తి, గళిగిన, ఇష్టే, గారి

తనదఙ్డు, ననెసర్గొ త్రంబును, నెగసఋ

ప్రజలకు, ప్రాపు, ప్రోపు (?)

బాణప, జ్వనస్తురు, పారగ, నీకత్తిన్

ప్రథమోటు, రట్టోడి, పరహి, తుడు

ఇలక్ష్ట, సత్యాఘ, మానిక,* ట్టి ఇచ్చి కనిక (?)

పాన్సు, పట్టంబు, హగ్గులు న్నమమె, నింక

పల్య, భక్తాసు, గణపతి, స్టొప్పి, స్థితిచె

చిపిన వ్యాఘ్రాధ్యారాజసి ప్రచిన, వాడు.

[ ఇక్కడ 'చాముండేయ' అన్నపదం శాసన పాఠంలోనిది వదిలివేయబడింది.]

ఈ సీసము ప్రశ్న గుర్తులుంచినచోట అసమగ్ర లక్షణముతో ఉన్నది ఉభయార్ధములలోని నాలుగు పాదములు, పైన తేటగీతి, ప్రతిపాదమున (అర్ధములందు సైతము) యతియో, ప్రాసయతియో వాడబడినది. శాసనములోని ఒక పదము (చాముండియ) ఎందులకు తొలగించబడినదో తెలుపబడలేదు [21].

డా॥ దివాకర్ల వేంకటావధానిగారు పై సీసములోని చతుర్థ పాద ద్వితీయార్ధమును "ప్రథమోటు రట్టోడె-పరహితుడితుడు" అని ద్విపదగా చూపిరి గీతిలోని ప్రథమ ద్వితీయ పాద భాగములనుకల్పి "కట్టించె కనికపొం - పట్టంబు హంబుగులు" అని సీసపాద పూర్వార్ధముగా చూపిరి [22]. ద్విపద సీసాది దేశి ఛందములు అక్షర సమతా నిర్బంధములేని దేశి గణ నిర్మితములగుటచే ఇట్టి విభజన జరిగినది. శాసన పాఠ లేఖకులు శిలల మీద గండరించునపుడు స్థల సౌలభ్యము నాశించుటచే పాదక్రమమున పద్యములు లభించకుండుటవలన ఇట్టి విభజనలకు అవకాశము ఎక్కువ.

## 6. సత్యాదిత్యుని మాలెపాడు శాసనము : [23] (క్రీ.శ. 725)

స్వస్తిశ్రీ, చోళమ, హారాజ, అధిరాజ

పరమేశ్వర, విక్రమా, దిత్యశ, క్తికొమర

విక్రమా, దిత్యుల, కొడుకుఱు, కాశ్యప
గోత్రుస్తు, శత్యధే, తస్తుశి, ద్ది వెయురే
నాడ్డేయు, వేపేప, ఋన్తికా, మటిపాఱు
రేప శమ్మత్తా, కాశ్యప గోత్రి నికి చ్చిన

ఇందు సేసపాదపూర్వార్ధములు పరుసగా కలవు.

**7. నలజనం పాడు శిలాశాసనం [24] : (క్రీ శ. 850)**

పల్లవా దిత్యశ్రీ బాదిరా జుఱుఅన్తు
పశ్చెయా రికొడుకు, బాలిరా
వినువాస్తు రాజమా నముయూస్తు పుట్టాఱు
పట్టుకే త్రఱుపచ్చె పశ్చె యారి
దానంఱు నాకిచ్చె దీనిర క్షించిన
వానికి నడుగడు గశ్వ మేధ
ఋన పలం బగుదీన్ ఱ చ్చిన వాని కిఏకఱు
శ్రీ పర్వత తంఱుఱ చ్చినప పఱగు

ఆ.వె. వాచ్చొ వాళ కొడుకు పల్లవ వాజ్యన్స్య

**8. జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము [25] : (క్రీ.శ. 633-63)**

"హాతక పుత్రక ముని యొశ్రీ శిలా విశా
ల విపుల..........."
"శ్రీ సలకు ఇరువుట్టి ఆళ్ళప పట్టుకుతిలి
యా ఢఃంఢ్ల........"

సీసచ్ఛాయ కన్పట్టు అసమగ్ర శాసనమిది.

**9. రెండవ మహేంద్రుని బూడిదగడ్డపల్లి శాసనము[26] : (క్రీ. శ. 750)**

1. శ్రీ మహే న్ద్రిన్, మాన, రవి మఱు, రాపిడుగు
2. అచ్చెర్వు, గనరివ, రజ ముంస్టు అన్వాన్ను

దన్తియ మంగుతో (ఱన్) పొడుచి పడియె(న్)

**0. రేమయ్య శాసనము :**

పుత్రంఱు పచ్చిన వార్వారణాసిఃము
శ్రీ పర్వ తంఱు వ్ర చ్చిన

**11.** గుణగ విజయాదిత్యుని కందుకూరు శాసనము : (క్రీ శ. 850)

సీసముగల శాసనములలో ముఖ్యమైనదీ, సమసీస లక్షణము గర్గినదీ శాసనము. వేణుగోపాల చెట్టిగారు కనుగొని పరిష్కరించిన ఈ శాసనములో సీసమును కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రథమముగా ఆవిష్కరించిరి.

ఆంధ్ర పరిశోధక మండలి పంచమ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసమున ఇచ్చిన పాదము. (1924) [27]

శ్రీ నిరవద్యుణ్డు - సత్త (జాత) సమణ్డు
శివ పదవ(ర) రాజ్య - సేవితుణ్డు
ఖిలుడు నన్మతరిపు - బలుడు నాహవరాధ
రణ్ణ యోగ్యసి ఘాస - పణ్ణ గజిత
దాన మాన్యుణ్డు (దయానిల) యుణ్డు (ను)
(భణ్ణన) సణ్ణన - పణ్డు రంగు
......................కోలడి పేని
కొట్టము లొవ్వడిచిగుణక నల్ల
తని పక్షపాతి......................
.................. ...............
...................................
......................విభవ గౌరవేంద్ర.

1వ పాదము పూర్వోత్తరార్ధములందు యతి వేయబడినది. 4 వ పాదమున కూడా యతియే (లభ్యమైనంతవరకు) కలదు. ద్వితీయ, తృతీయ పాదములందు ఉభయార్ధములందును ప్రాసయతి పాటింపబడినది. యతి, ప్రాసయతులు రెండును వాడబడుటచే ఇది సమసీసమగును. సీసములోని ఒక్కొక్క యర్ధమునందు సైతము యతి, ప్రాసయతి భిన్నముగా వాడవచ్చును. కాని ఈ సీసమున ఒక అర్ధమున వాడిన దానినే తర్వాతి అర్ధమున కూడా వాడుట నియమముగా కాంచనగును.

పాదాంత విచ్ఛేద రూపయతి గేయ గుణము. అదీ ఇందు లేదు. ఒక పాదములో నుండి మరొక పాదములోనికి పదము చొచ్చుకొని వచ్చినది. పైని చెప్పబడిన గీతిలోని "తని పక్ష..." గణ విభజన గావించినపుడు ఆటవెలదిగాని తేట

గీతిగాని కాజాలదు. అంతమందలి విభవ గౌరవేంద్ర అన్నది గణ విభజనబట్టి చూచిన ఆటవెలదియైనను, తేటగీతియైనను కావచ్చును. ఆరుద్ర తన సమగ్ర ఆంధ్ర సాహిత్యమున (Vol. I) "కాని" అని తరువాతనునకు దీర్ఘమిచ్చినారు. దీనితో (అంతము పలెనే) ఇది ఆటవెలదిగ లేక తేటగీతిగ (ఏదైనను) గుర్తింప వచ్చును. కాని ఈ సవరణకు మూలము పేర్కొనబడలేదు. ఇంకొక్క అక్షరము లభించినను ఇది యేపద్యమో తెలియవచ్చెడిది.

## 12. గణ త్రినేత్ర వైదుంబుని వెలిగల్లుశిలాశాసనము[28](క్రీ.శ.8 శతాబ్ది)

1. స్వ స్త్యనే, కసమర సఙ్ఘష్ట జోవల
బ్ధ జయల క్ష్మిసమా విఙ్గితప క్షస్థల
గణ్డత్రి నేత్ర(శ్రీ) బిఘమ్బ మహారాజు
— సీస పూర్వార్ధ పాదములివి.

2. రేనణ్డు ఎఱువేఱ యేళుచు నొఱమ్బి
తోటిక య్యంబున షుమమ దువున
పోటున మహారాజ చ స్తిమ నదడని
వధిఁచిన పటిగణి వేల మ్బొద్చె
కొఱ దే సింగ్గంబు ఏశిని వేనికి
నెదరయ్న గణ్డత్రి నేత్ర ని
నిక్షయ, సుంకంబు పెఱంగు గుంటతో
డయు ఇఖ్ఖు ఈ చిరా దాయ

4 పాదములు పూర్వోత్తరార్థములు లక్షణవంతముగా కుదిరినవి.

## 13. చాళుక్య భీముని కొరవి శాసనము : (క్రీ.శ. 893-922)

శ్రీ నెల్ల వొనయ ఈళుదై చేకొని
నిబ్బిఁభీ మ సలుకి యంప నేక

## 14. చాళుక్య భీముని ధర్మవర శాసనము [29] : (క్రీ.శ. 897)

(శ్రీమత్) పండరం గులనేలు * నల్లరాము నిఘతోడ
నెడజిన బోయల * నడవి నొన్పె

లోహ్రాస నంబెక్కి * వాహ్రాను నొడచిని
వల్లభు కొల్పున * నెల్ల నెఱుగ
కన్నరా భూపతి * పెన్నాటిలో జూపె
సంకి వాణ్డను చేసి * ఖింప షుఎపె
దణ్డ శై వచ్చిన * బెడ్డన చోఒని
జేన్తని కాచె భూ * లోక మెఱుగ
ఆ.వె. కిరన పురము దహాల * నిటతంబు వవెనాదు
సచల పురము నొచ్చె * నచలి ముద్దు
పల్లమ్మ గుణక * నల్లమ్ము వన్చిన
పణ్డరంగ చూపె పణ్డరంగు

సీస శాసనములలో చెల్లి నిర్దిష్ట లక్షణమును, సంపూర్ణ పాఠమును కల్గిన విశిష్ట శాసనమిది. దీనిలోని మరియొక విశేషము ప్రాసయతి. సీసము యొక్క ప్రతి పాద ఉభయార్ధము లందును, పైన వ్రాసిన ఆటవెలది యందును. క్రమము తప్పక ప్రాసయతి నిలుపబడినది. (ప్రథమ పాదమున "ల డ" లకు ప్రాసయతివేయబడుట కాననగును.) కందుకూరు శాసన సీసము గునుగు సీసము (పాదోల్లంఘన పద ప్రయోగము) కాగా ఈ సీసము ఏ పాదమున కాపాదము చక్కగా విడిపోయి లయను స్పష్టముగా చూపుచున్నది. దీనితో బాటు ప్రాసయతి కారణమున శాసనమును చదువు చున్నపుడే పాద వ్యవస్థ లేని శాసనలిపిలో తన ప్రతిపత్తిని ఎత్తి చూపు చున్నది.

శాసనస్థములైన ఈ సీసములు కాక 'ప్రబంధ రత్నావళి'36 యందు దాహరింపబడిన పద్మకవి జినేంద్ర పురాణము, సర్వదేవుని విరాట పర్వ మందును సీసములు కాననగును. సర్వదేవుని సీసము సమసీసము. జినేంద్ర పురాణ సీసము శ్లేష రచనలో ఒకే సమానమును పునరుక్త మొనర్చుటచే యతి, ప్రాసయతులు కల్గినట్లగును. కాని శైలిని బట్టి ఇవి ప్రాచీనములు కావన్న అభిప్రాయ మున్నది.

నన్నయకు సమకాలికమైన అగ్గపరాజు నన్నమూరు శిలాశాసనం (క్రీ శ. 1023 ప్రాంతము) ఉత్సాహ 4 పాదముల మీద ఆటవెలది యొక్క ఒక అర్ధమున్నది. ఇది లక్షణమును బట్టి మిశ్రమ సీసము. ఉత్సాహ పద్యమును. ఆ.వె. సగమును వేరుగా వ్రాయబడిన పనుల్నెన్నను, ఉత్సాహ అంతిమ పాదములోని పదము, ఆటవెలది ప్రథమ పాదము లోనికి చొచ్చుకొనిపోయి వాటిని అతికించి వ్రాసినట్లు ధృవపరచుచున్నది.

ఇట్లు దేశి ఛ్ఛందములలో సీసము నన్నయ యుగపు కెక్కు శాసనములలో స్పష్ట రూపమున కానవచ్చి, 9వ శతాబ్ది నాటికే తన అస్తిత్వమును స్థిరముగా నిరూపింప జాలియున్నది.

## [ఈ] ర గ డ లు

ప్రాచీన శాసనములలో మిక్కిలిగా లభించు దేశి ఛ్ఛందములలో రగడ ఒకటి. గతి భేదాత్మకములు, మాత్రాసమ ఘటితములైన ఈ రగడలు లయబద్ధమైన గేయ ఛందములగుటచే, జానపద సరణులకు అభిన్నము లగుటచే అత్యంత ప్రాచీన కాలమునాటి వీని ఉనికిని స్థిరీకరింపవచ్చును.

1. ధనంజయుని కలమళ్ల శాసనము [31] : (క్రీ.శ. 575)

ఎరికల్ ముతురాజు ధనంజయు ఉా

రేనా ణ్ఱేళన్ చిఱు మూరీ — ఇది మధురగతి రగడ వలె నడచుచున్నది

2. ఎరికల్ ముత్తురాజు శాసనము [32] : (క్రీ.శ. 600-625)

శ్రీ ఎరి కల్ముతు రాజుల నడుమ

న్న పటె పారక ఇరుపది యాదీ

ఏనుమ ఋస్తు రాచమా నంబు - మధురగతి రగడ నడకలున్నవి

3. చోళ మహారాజు ఉరుటూరు శాసనము [93] :(క్రీ.శ. 600-)

స్వస్తి శ్రీచో ఱమహా రాజు

ళేళ్ల ను ఎరిగ త్తగరా ఱుజ్లీ

చ్చినవ న్నాసే బడితిరు వుళపా

ఱకుఱ చ్చినవ న్నాస - దేనికి మధురగతి రగడ

## 4. పొట్లదుర్తి - మాలెపాడు శాసనము : (క్రీ.శ. 600 - 625)

ఈ శాసనము ప్రథమమున మల్లంపల్లి సోమశేఖర శర్మగారిచే గిడుగు వారి సప్తతి జయంత్యుత్సవ సంచిక 'వ్యాస సంగ్రహము' లో ప్రకటింపబడినది. దీనిని ప్రథమ రగడ ఛందమని వేటూరి పభాకరశాస్త్రి వెంకట కృష్ణారెడ్డిగారు ద్విపద గతి రగడ లక్షణము కొంతవరకు గర్భితమై ఉన్నదని ప్రకటించినారు[34]. శ్రీ వేకుమళ్ల కామేశ్వర రావుగారు శాసనమంతా గేయ పద్ధతిలో ఉన్నదని నిరూపించినారు[35]. డా॥ తంగిరాల నారాయణ శాస్త్రిగారు దీనిలో మధురగతి రగడ ఉన్నదని విశ్లేషణ వేరుగా చేసి చూపినారు[36].

శ్రీ సోట్టి$^{5*}$ మహారా$^{5}$ జొక్కలన$^{5}$ ఇన్నుపోరి $^{5}$
అణ పోతు$^{5}$ లు వేపణ$^{5}$ కాలుపు$^{5}$ ద్దణకాలు$^{5}$
ఇచ్చినవ$^{5}$ న్నానపెన్నా వెఱవె$^{5}$ రేవికిన్$^{5}$ - తేని
యిచ్చినవా స్టుపంచ$^{10}$ మహాపా$^{5}$ తకున్ట కమ$^{5}$ (న్)
(* ఈ అంకెలు మాత్రల సంఖ్యలు) - ద్విరదగతి రగడ

ఇందు ఐదేసి మాత్రల గణములు నాలుగు ప్రతిపాదానికి ఉన్నవని, ప్రథమ, ద్వితీయ పాదాంతములందు అంత్యప్రాస లి,-లు ఉందని, తృతీయ, చతుర్థ పాదములందు ఆదిప్రాస చ్చి-చ్చి ఉన్నదని, శ్రీసోటను సోట్టి అని పలుకవలయునని, అప్పుడు ప్రథమ ద్వితీయ పాదములందు సైతము ఆది ప్రాసట్టి-ణ ఉండునని వేకుమళ్ళ వారు సూచించినారు. ఈ శాసనములో 1, 4, చరణాలలో చివరి గణాలు ఖచ్చితంగా లేవని అందువల్ల ఇది పూర్తి రగడ లక్షణము అనుసరించదని, గేయ పద్ధతిలో రచింపబడిన శాసనమనిరి. దీనినిబట్టి వారు రగడను సంపూర్ణ లక్షణమును పట్టనప్పుడు గేయమని భావించినట్టు తెలియుచున్నది.

స్వస్తి$^{4}$ శ్రీసో,$^{4}$ రమహా$^{4}$ రాజు$^{4}$
ల్లేక$^{4}$ న్నిన్నూ$^{4}$ బోలణ$^{4}$ పోతులు$^{5}$
రేవణ$^{4}$ కాలూ$^{4}$ పుద్దణ$^{4}$ కాలూ$^{4}$
ఇచ్చిన$^{4}$ పన్నస$^{4}$ పెన్నా$^{4}$ ఋతే$^{4}$
వికిదే$^{4}$ యిచ్చిన$^{4}$ వాస్టుప$^{4}$ ఞ్చసుహా$^{4}$
పాతకు$^{4}$ స్టకునసి$^{4}$ పైరవు$^{4}$ లకితము$^{5}$ —మధురగతి రగడ
(అంకె '4' మాత్రా సంఖ్య)

4 మాత్రల గణములు నాలుగు కల పాదములతో దీనినే మధురగతిగా డా. తంగిరాల గారు భావించిరి. వీరే పంచమాత్రకమని గూడ గుర్తించి సీస పూర్వార్ధ పాదములుగా చూపిరి. వీరి విశ్లేషణము ఇంచుక విచార్యము.

మాత్రా ఛందములో గల సాలక్షణ్యము, శాసనము పంచుటలో గల వైవిధ్యము ఇట్టి భిన్న విశ్లేషణములకు అవకాశము కల్పించినది.

5. చోళ మహారాజు ఇందుకూరు శాసనము [క్రీ.శ. 600-625] :

స్వస్తి శ్రీచో ళమహా రాజు
శ్లేశ్వ స్వరిగ బ్బగరా జుల్లి
చ్చినవ న్ననకొ చ్చియపా బరెవ
ర్మమ్మా శా రికెతేన్ బచ్చిన వాన్ణువ
ఞ్చమహా పాతక సంయ్యు క్తాన్ణగు
అసిపై రుడులిఖి తంస్వ స్తిశ్రీ —మధురగతి రగడ

6. చోళ మహారాజు ముతుకూరు శిలాశాసనము (క్రీ.శ. 600) :

రాజమా నంబుది నియరివా ణంబుప
ణ్డెఞ పు ట్లుగొలుగు దీనికి సక్రంబు
—ద్విరదగతి రగడకు చేరువై యున్నది.
నిల్చిన ద త్తియ భీమన గొరవల
కిచ్చిన నేలనూ టిరువది మరుతుర్లు
—మధురగతి రగడకు చేరువై యున్నది.

7. రెండవ మహేంద్రుని బూడిద గడ్డపల్లి శాసనము (క్రీ.శ. 750) :

శ్రీ మహే5న్ద్రవిన్ మాన5 రవిమా5 రాపిడుగు —ద్విరదగతి
మగడు పురలి యేలువాడు
కాపి చోళ ము త్తరాజు —తురగ వల్గన రగడ

8. చాళుక్య భీముని కొరవి శాసనము :

చాళుక్య భీమునకు శౌచకం దర్పునకు
వేగీశ్వ రునకురణ మర్దాన్వ యకులతిల
కుంబైన కుసుమాయు ధుండు గన్నరబల్ల
హానికిసం ప్రా ప్తమై నరసమ ర్దకశ్రీ....
—ద్విరదగతి రగడవలె నున్నది.

రగడలకుపై శాసనములందే కాక గ్రంథస్థ ఉపయోగమును బట్టి, అనాడు వాటి ప్రాచుర్యమును ఊహింపవచ్చును.

క్రీ.శ. 9వ శతాబ్ది నాటి సోమదేవసూరి "యశస్తిలక చంపువు" లో సమగ్ర లక్షణవంతమయిన రగడ ఉపయోగింపబడినది. అది సంస్కృత గ్రంథ మగుట మరియొక విశేషము. సంస్కృతమునందు మాత్రాఛందస్సులలో రగడ లేనం దున ఇందుపయోగింపబడిన రగడ అచ్చముగా దేశీయమగు ఛందమై బహుళ ప్రాచు ర్యము నొందిన కారణముగా దేశీయ కవులచే సంస్కృతము నందుపయోగింప బడినదని చెప్పవచ్చును.

వికచ కర్ణోత్పల స్వర్ధి తరకేశానాం
కేళి తాళ క్వణ త్కనక మయ కంకణాః....

ఇరవయ్యేసి మాత్రల [4×5] పాదములతో అంత్య ప్రాసతో ఇది ద్విరదగతి రగడకు సరిపోవుచున్నది.

నన్నయకు సమకాలికమును, క్రీ.శ. 1022 నాటి రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక కాలమున చేతనభట్టు రచించిన కోరుమిల్లి శాసనమున రగడ సంస్కృత భాషలో రచితమై కన్పట్టుచున్నవి.

పాదసంఖ్య

1. తస్మై సమస్త జనతా విశేష గుణాయ
2. రైసు త్వరిత మహీదేవ దేవ గణాయ
3. విప్రాన్వయాబ్ధి శశిభృత్ ప్రతి చ్ఛందాయ
4. విద్వజ్జనాధికృత విశ్రుతానందాయ
5. జన్మ ప్రభృతి గీత వేదాంత తత్త్వాయ
6. సన్మనో వసతి వాస్తవ్యాత్మ సత్త్వాయ
7. లంఘిత గురుత్వ పరిలాలిత చరిత్రాయ
8. నుంభిత మతి స్థగిత జీవ భృగు పుత్రాయ
9. సిద్ధ నిజ నాథ కృత సేవిత మనీషాయ
10. శుద్ధ మతి దూషిత సమస్త జన దోషాయ
11. సంతతారాధిత నిజస్వామి పాదాయ
12. చింతిత మనస్థ సుఖదాభూత పాదాయ
13. హోమ ధూమ వినిర్గతా మిత కలంకాయ
14. ధీమత్ప్రిగీత రుచిర స్వనామాంకాయ

15. సకల మని గణ సురా ప స్తంభ సూత్రాయ
16. తత్ర సంగీత భారద్వాజ గోత్రాయ
17. సప్తతంతు క్రుత యూపస్తంభ శోభాయ
18. సప్తాశ్వహప సదృశాత్మ తను లాభాయ
19. నిత్య జన తోషిత సుసత్య గుణ యత్నాయ
20. సత్యాభిలషిత కార్య సంపత్తి సక్తాయ
21. పరమ పురుషార్థ సంపాదన పటిష్ఠాయ
23. పరమేశ్వర స్మరణ పాలన పరిష్ఠాయ
23. సకలార్థ శాస్త్ర పరినిష్ఠిత వినోదాయ
24. సుకుమార తాధిక సరోజనిభ పాదాయ

ధారా కరేణాగ్ర హారీకృత కోరు
మిల్లీనామ గ్రామ మిందూ పరాగేణ
దత్తోమాయా చంద్ర తారం హాతిష్ఠేత
తస్యాన్వధి వ్యక్తి రేషోచ్యతేఽద్య

పై రగడ ద్విరదగతి రగడకు సరిపోవుచున్నది. 5 మాత్రల గణములు నాలుగు కలది ద్విరదగతి. దివాకర్ల వెంకటావధాని గారును, నిడుదవోలు వేంకటరావుగారును దీనిని విజయభద్ర రగడ యని పేర్కొనినారు [37]. కాని యిది ద్విరదగతియే.

సంస్కృతమునకు సహజముగా గాని ఆదిప్రాస ఇందున్నది (1—2; 3—4, 15—16 పాదములందు తప్ప) తెలుగులో అంత్యప్రాస యన్నది, ప్రాస భేదముగా నొక యలంకార ప్రాయముగా లాక్షణికులచే చెప్పబడినదే తప్ప, ఏ పద్య మందైనను నియతముగా [ఆదిప్రాసవలె] పాటింపబడదు. ఒక్క రగడ యందు మాత్రము ఇది నియతము. ఈ నియమము ఈ సంస్కృత శాసన రగడయందు ఖచ్చితముగా పాటింపబడినది. యతి తెలుగులో వలె సదృశాక్షర నిబద్ధమైనను సంస్కృతము నందువలె విచ్ఛేద రూపమైనను అన్ని పాదములందు నియమముగా పాటింపబడలేదు. 13, 19, 15 పాదములందు ప్రాసయతి కలదు.

మొత్తము మీద తక్కిన తెలుగు శాసనములలోని రగడలకన్న మిక్కిలిగా సలక్షణమైన రగడయిది. సంస్కృతమునకు సహజముగాకున్నను ఉపయోగింప బడుటచే కవికి దీనిపై గల మక్కువము, నాడు రగడకు గల ప్రాచుర్యము స్పష్ట

మగుచున్నది. కాని ఇంత స్పష్టమైన ప్రతిపత్తి గల ఈ రగడ ఛందము నన్నయచే ఉపయోగింపబడలేదు. తెలుగులో తొలి ఛందో గ్రంథమగు కవిజనాశ్రయ మందు సైతము రగడకు లక్షణము చెప్పబడలేదు.

## (ఉ) అక్కరలు

చంద్రగణోప యుక్తములు, కన్నడాంధ్రములకు సమానములును, జయకీర్త్యాది ఛందోః కర్తలచే లక్షణోక్తములును అగు పంచవిధాక్కరలు ప్రాచీన కాలముననే కన్నడాంధ్రములందు వాడుకలో నున్నవి. శాసనములందు ఐదు విధముల అక్కరలకు మూడు విధములైనవి మాత్రమే దొరికినవి.

**1. ధనంజయుని కలమళ్ళ శాసనం : (క్రీ.శ. 575)**

రేవణ కాలుపం పుచెనూఃః (రు) - భ,ర, నగ
అఃికళా ఊఃరిణ్ణ వారుఊఃరి - నగ, త, రల

**2. చోళ మహారాజు మతుకూరి శిలా శాసనం : (క్రీ.శ. 600)**

హరి దుద్దణ్ణ రపరభు జాసి ప్రచుండ దిన - సల,నల,త,భల,
కరకుల నన్దన కాశ్యప గోత్రకరి - నల,భ,భ,భల.
కాళాన్వ యశ్రీమ చోడమ హారాజులు - త,త,భ,తల
రేనాణ్డు ఎఱువేల నేలశ్రీ మభికిరజు - త,సల,ర,సల,ల.

ఈ శాసనములో పేర్కొనబడిన గణములు గల అక్కర పంచ విధాక్కరలలో ఏదియు లేదు. కాని ఆఖరున చంద్ర గణము ఉండు పద్ధతి ఒక్క అక్కరలలో తప్ప ఏ ఛందమునందు లేదు. ఇట్టి విచిత్రమైన అక్కరకు వేరుగా ఎక్కడను ప్రయోగము లేదు. 3 ఇం.+1 చం. గణముగల ఈ పద్యము 1 సూర్య గణము + 3 ఇంద్ర గణములు + 1 చంద్రగణము ఉండవలసిన మధురాక్కరకు సమీపముగా నున్నదనవచ్చును.

**3. యుద్ధ మల్లుని బెజవాడ శాసనము : (క్రీ.శ. 898-934)**

స్వస్తిన్నృ, పాంకుశా, త్యంత, పత్సల, సత్యత్రి, జేత్ర
(భ,ర.హ,భ,త,హ,)

విస్తరశ్రీ యుద్ధ, మల్లు, జ్జనపద్య, విఖ్యాత కీర్తిన్

(భ,త,గగ, సల,త,గగ)

ప్రస్తుత, రాజాశ్ర, యుణ్ణు, త్రిభువనా, భర నుణ్ణు, సకల

(భ,త,హ,నగ,సల,స)

వస్తున, మేతుణ్ణు, రాజ సల్కి—భూ. వల్లభు, జ్జర్తిన్ (భ,త,హ,ర,ద,గగ)

పరగంగ, బెజవాడం, గొమర, స్వామికి, భక్తుడై, గుడియు,

(సల,సగ,న,భ,మ,న)

నిరుపమ, యుతన్మప, ధామం, బెత్తించ్చె, సైగిదీచ్చెన్, మరంబు

(నల,నల,గగ,తలజ)

గౌరగల్లా, కౌరులిస్తు, విడిసి, బృన్దంబు, గొనియుణ్డు వారు

(సగ,సల,న,త,సల,హ)

గరిగాక యబ్బార, జాసి, ప్రచ్చిన, పాపంబు, గొణ్డు9

(సల,త,హ,భ,త,హ)

వెలయంగ, నిమ్యోట్టు, బస్సి, మలిసుసై విడిసిన, ప్రోల,

(సల,త,హ,నగ,సల,హ)

గలతాన, పతులును, రాజు, పట్టంబు, గట్టిన, పతియు

(నల,నల,హ,త,భ,న)

నలియంద, య్యారల, వెల్వ, టించిన, నశ్వమే, ధంబు

(సగ,భ,హ,భ,ర,హ)

ఫలంబుపే, క్షించిన, లింగం, బిజసిన, పాపంబు, దమకు

(జగ,భ,గగ,నల,త,న)

జననుత, చేబ్రోల, నుండి, బెజవాడ, జాత్రకు, వచ్చి

(నల,త,హ,సల,భ,హ)

త్రిణయుని, సుతన్ద్రామ్న, సోటు, పెచ్చుక, తివిరిమి, స్నెలప,

(నల,యల,హా,భ,నల,న)

యనమున్న, సేకొని. మిస్ట, ప్రత్యక్ష, బయున్న, నిచ్చ

(సల,భ,హా,త,జ,హా)

గని పల్లి క్షెత్తింపె, గుడియు, పురంబునుం, గార్తికే, యునకు

(సగ,త,న,జగ,ర,న)

రమణతో బెజవాడ, కెల్ల పెడంగును రక్షయుం గాను

(నగ,సల,హా,జల,ర,గగ)

స్టమతాత, మల్లప రాజు వేపెయు, దానుంగ, ట్టించ్చెం

(సల,భ,హా,భ,త,గగ)

గ్రమంబున, దానికి. కలశ విత్తల్లు. గామెుగ, మూడు

(జల,భ,న,త,భ,హా)

నపురంగ. క్రియప్త మల్లు డెత్తింపె, నమితతే, జుందు

(సల,త,గగ,త,నగ,హా)

పై శాసనములో ఐదు మధ్యాక్కరలు లభించినవి. ఇంద్రగణములు రెండును, పై నొక్క సూర్యగణము ఆ పిదప రెండు ఇంద్రగణములును పైనొక్క సూర్యగణము మొత్త మారుగణములు మధ్యాక్కర లక్షణము. మొత్తము 20 పాదములలో మధ్యాక్కర లక్షణము 20 చోట్ల పట్టుకున్నది. వానిలో 13 స్థలము లందు (2,4,5,6,7,11,12,16,17,18,20 పాదములలో) సూర్యగణముగా గగ; ఇంద్ర గణముగా సగ, మ గణములు వాడబడినవి. తెలుగులో ఇవి సూర్యగణములు, ఇంద్రగణములుగా గుర్తింపకున్నను, ద్వి గురు, త్రిగురు, ప్రస్తారములతో సూర్యేంద్ర గణములలో ఇవి వచ్చునవే. కాని తెలుగు నాట వీనికి సూర్య, (గగ) ఇంద్ర, (సగ, మ) గణ వ్యవహారము లేదు.

కాని కన్నడ గణములు (దేశీయములు) పరిశీలించినపుడు వారు వీటిని కూడా దేశీయ సూర్యేంద్ర (బ్రహ్మ విష్ణు) గణములుగా లెక్కించుట జరిగినది. తెలుగులో ప్రాచీన ఛందో గ్రంథములైన కవిజనాశ్రయ, కావ్యాలంకార చూడామణి

గ్రంథములు వీటిని పరిహరింపక సూర్యేంద్రగణములుగనే స్వీకరించినవి. వీనికి అక్కరజాతి గణములని ప్రత్యేక సంకేతము నిచ్చినవి. ప్రస్తార క్రమములో తొలి రెండు గణములను పరిహరించి సూర్యేంద్ర గణముల వివరము నిచ్చినవాడు అనంతుడు. అతని కాలము తర్వాత గగ,న, - సూర్య గణములుగా; మ, సగ ఇంద్ర గణములుగా వ్యవహరింపబడలేదు. దేశీయ గణ నిర్మాణ పద్ధతిలో అనంతునకు పూర్వమొక విధానము, అనంతునితో అనంతరికుల వొక విధానమును గూర్చి విస్తారముగా 'గణములు' ప్రకరణమున వివరించితిని. ఈ శాసనము ప్రాచీనమే కనుక ఇందలి గణములను గగ, మ, సగ, - అక్కరజాతి గణములుగా స్వీకరించి నప్పుడు పై లక్షణము 13 స్థలములలో సరిపోయినది[38].

ఇక మిగిలిన 7 స్థలములలో

| | | | | |
|---|---|---|---|---|
| మరంబు | (2వ పద్యము | 2వ పాదములో) | — జ గణం | |
| ఫలంబు పే | (3వ " | 4వ " | ) - జగ " | |
| సుతుండ్వొండ్లు | (4వ " | 2వ " | ) - యల " | |
| బయున్న | (4వ " | 3వ " | ) - జ " | |
| మరంబు నుం | (4వ " | 4వ " | ) - జగ " | |
| వెడంగును | (5వ " | 1వ " | ) - జల " | |
| గ్రమంబున | (5వ " | 3వ " | ) - జల " | |

అన్ని చోట్ల పై అక్కర జాతి గణములను బట్టియు గణము కుదరకున్నది.

దివాకర్ల వేంకటావధానిగారు వీనికి ఆధునిక లిపిలో చూచినచో గణ భంగము ఉండదని చూపినారు.

| | |
|---|---|
| జ న | జగ నగ |
| మరంబు - మరము | ఫలంబు పే - ఫలము పే |
| యల సల | జ త |
| సుతుండ్వొండ్లు - సుతువొండు | బయున్న - బై యున్న |
| జగ సల | జల నల |
| మరంబు నుం - మరమును | వెడంగును - వెడగును |
| జల నల | |
| గ్రమంబున - గ్రమమున | |

పై వాటి కన్నింటికి లేపల మొక అనుస్వారము గణ భంగ కారణమగుచున్నది. అది తీసివేసి పఠించిన సరిపోయినది. బయున్నకు బదులు పై యున్న అని ఐకారాంత బకారమే యతికి చక్కగా కుదిరినది.

అనఘుణ్డు .... ఐయున్న

ఈ మధ్యాక్కర శాసనము యతి విషయమునను ప్రాస విషయమునను తర్వాతి కాలపు వృత్తముల వలె చక్కగా నియమము తప్పక యున్నది. రెండవ పద్యము చివరి పాదములో యతి గరిగాక — ప్రాపంబు అన్నచోట గ — పలకు సరిపడుట లేదు. గ — అన్నచోట అక్షరము శాసనము నందే స్పష్టముగా లేదు[39]. బహుశ అది ప కారమే. ఐయుండును· అన్ని పాదములందింత స్పష్టముగా (4 గణముల పిదప) సదృశాక్షరయతి యుండగా ఆ ఒక్క పాదమున యతి భంగ మేలయగును ? మధ్యాక్కరలో పేరుకు తగినట్లుగా 2 ఇంద్ర + 1 సూర్య + 2 ఇంద్ర + 1 సూర్య గణ వ్యస్థ గల్గి ఇంత చక్కగా గణములు సమద్విఖండమగు చుండగా యతి మాత్రము 4 గణముల తర్వాత చెప్పబడినది. అనగా యతి కూడా 3 గణముల పిదప ఉండినచో చక్కని తూగు కల్గియుండెడిది. నన్నయ కూడా తన భారతమున యతి విషయమున వెజవాడ శాసన పద్ధతినే (పంచమ గణాద్యక్షరమే యతిగా నిల్పు పద్ధతినే) ఆచరించినాడు. నన్నయకు తర్వాతి లాక్షణికులు (రేచ నాదులు)ను, కవులును (ఎఱ్ఱన యొక్కడే) 3 గణముల పిదపనే యతి వేసినారు.

## 4. వెంకయచోడుని దొంగలసాని శాసనము[40] : (క్రీ. శ. 991)

మహాక్కర — శాసన పంక్తులు 19-23.

| హ (సూ) | త (ఇం) | నల (ఇం) | ర (ఇం) | త (ఇం) | నల (ఇం) |
|---|---|---|---|---|---|
| వెంక | యాహ్లోష్ఠ | మహారజు | తెంకణా | దిత్యుణ్డు | కొమరుర |
| | | | | | తల (చం) |
| | | | | | భీముణ్డు వు (సి) |

| హ (సూ) | ర (ఇం) | ర (ఇం) | త (ఇం) | ర (ఇం) | సల (ఇం) |
|---|---|---|---|---|---|
| ఇల్ల | రాష్ట్రమనీ | ధర్మమా | చెందార్క | తారకం | బునువార్ధిక్షి |
| | | | | | సల (చం) |
| | | | | | లుదునుణ్డు |

1 సూర్యగణము, 5 ఇంద్ర గణములు, 1 చంద్ర గణము పాదమునకు చొ॥న ఉన్నచో మహాక్కర. ఇందు మొదటి పాదమున చంద్రగణ స్థానములో ఒక అక్షరము ఎక్కువగా నున్నది. రెండవ పాదము నలపై నొక్క గురువు లేదా లఘువు [నలల/నలగ] ఉండినచో చంద్రగణ మయ్యెడిది. అనగా మొదటి పాదము యొక్క చంద్ర గణములో ఒక మాత్ర అధికముగా, రెండవ పాదము యొక్క చంద్ర గణములో ఒక మాత్ర తక్కువగా ఉన్నది. యతి ప్రాసలు పాటింపబడ లేదు. యతి 5వ గణాద్యక్షరము ఉండవలయును. వెంక - వెంక 4వ గణాద్యక్షర నియమముగా ప్రాసయతి మెంచబడినది. కాని ఇది రెండవ పాదమునను కూడా అప్రవృత్తమగుచో నిర్ధారింపబడి యుండెడిది. బహుశా యాదృచ్ఛికము కావచ్చునేమో! దీనిని దివాకర్ల వేంకటావధానిగారు వృత్తగంధి యనినారు. కాని ఛన్న గణములు రెండు పాదములందు సమానముగా ఖచ్చితముగా సరిపడిన ఈ పద్య శాసనమును వృత్త గంధి వ్రాయుటకు కన్న మహాక్కర ఉద్దేశపూర్వకముగా వ్రాయబడినదే అని భావించుట లెస్స. శాసనములోని మిగిలిన భాగమును కూడా మహాక్కరలోనే యున్నది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| హ (సూ) | ఖ (ఇం) | × (ఇం) | నల (ఇం) | త (ఇం) | ర (ఇం) | నగల (చం) |
| వాట్ట | వాట్టలు | రనసి | యినవాట్ట | శబబ్బున్ | తంబునం | గల లింగంబు |
| న | నల | నల | నగ | × | నగ | నలల |
| లనర | సినవాట్ట | పురముక్కు | న్నగల | ట్టు ఇ | స్తనం బుగలవా | యిఇసాపణ |

41

రెండవ పాదమున 5వ గణము తప్ప తక్కిన దంతయు అక్షరానంతరముగనే యున్నది. 1వ, 3 గణములో శాసనము అసంపూర్ణము. దీనిని బట్టి ఇది మహాక్కరే యని నిర్ధారింపవచ్చును.

## (ఊ) కందము :

ప్రాచీనాంధ్ర శాసనములలో కందశాసనములు తక్కువగా కన్పట్టుచున్నవి. తక్కిన దేశి ఛందముల వలెనే దీనిని సంస్కృత భాషా శాసనములలో దేశి కవులు వ్రాసినారు. ఇందులకు అరుంబాక తామ్రశాసనము ఉదాహరించవచ్చును.

### 1. సత్యాదిత్యుని మాలెపాడు శాసనము [42] : (క్రీ. శ. 725)

వేగు ళ్లపులే సెఱవుళ
వేవా స్తూఁటు నిల్పిన పు, ణ్యంబు
దీనికి వక్రంబు వచ్చు
వాస్తువు త్రవధ శ్రీవధ, గో, వధవ (ఋ)

డా॥ తంగిరాల నారాయణశాస్త్రిగారు దీనిని కందముగా చూపినారు. కాని దీనిని కందమనుటకు సమపాదములలో ఒక గణము తగ్గుచున్నది. సమ పాదాంత
'U'
వర్ణములు దీర్ఘములుగా భావించవలయును. వ (ఋ) గురువు కాదగును. కాని పద్యాంత వర్ణము తర్వాతి వర్ణమగు సంయుక్తము తో పొసగదు. సమపాదములందు గణవిభజన మిట్లు చేసిన ఇది ఆర్యగా చక్కగా కుదురుకొనును.

4 5 6 7 8
(2) పా. వేవా, స్తూఁటు, ని. ల్పిన, పు ణ్యంబు

4 5 6 7 8
(4) పా. వాస్తువు, త్రవధ. శ్రీ, వధగో, వధవ

6వ గణము ఏకాక్షరముగా నిల్చుట ఆర్యలక్షణము, అది లఘువే కావలయును. 4వ పాదమున (శ్రీ) గురువైనది. షష్ఠ గణ స్థానమున ఏకాక్షరము నిల్పి ఉభయార్ధములందు వ్రాయుట ఆర్యాభేదమగు ముఖ చపలార్యలో కానవగును. ఆర్యకు కందమునకు గణ నిర్మాణము పాద వ్యవస్థలో పోలికలు ఎక్కువగా కలవు. జన్య జనక భావమును కూడా ఊహింపబడినది. కందము నుండి ఆర్యయా, ఆర్యనుండి కందమా అన్న విషయములలో భేదాభిప్రాయములు కలవు. అవి కందము అన్న విభాగము క్రింద చర్చింపబడును.

పై పద్యమున 'వే — వి', 'వా — వ' యతి కూడా కలసినది.

## 2. భైరవకొండ శిలాశాసనము[43] : (క్రీ. శ. 6, 7 శతాబ్దుల నడుమ)

శ్రీ జ వా ను సి వా, ని పక్ష్యమ్భం చ డిచ్చె...యా

వెజల, ప్పని పో, ని తిపె వినిర్జితమ్ము సకుల్

దీని గణవిభజనము రెండవ పద్యపాదము [5 గణములు గలదాని] వలె కన్పట్టు చున్నది. రెండవ పాదము పూర్తిగా కంద మే. కొన్ని గణములు జ గణముగా [నల, జల్లో ఏదో ఒకటని లక్షణము] నిలుపనది. యతి చక్కగా వె — వి [ ్రై — డ] సప్తమ గణాద్యక్షరములకు కుదిరినది.

## 3. జినవల్లభుని కుర్క్యాల శాసనము[44] : (క్రీ. శ. 945)

కరీంనగర్ జిల్లాలో లభించిన ఈ శాసనము విలక్షణమైనది. దీని విలక్షణతకు కారణము దీనికి ముందు తెలుగులో సమగ్రకంద శాసనములు లభింప కుండుటయే. వేరొక కారణము కన్నడ ఆదికవి పంపని నివాసమైన వేములవాడ చాళుక్యరాజు ఇమ్మడి (2వ) అరికేసరి చేసిన దాన విషయమును. పంపని తమ్ముడు జినవల్లభుడు వేయించిన ఇందు కంద పద్యములు కన్నడాంధ్ర భాషలలో రెంటి యందును గలవు. కన్నడాంధ్ర భాషా సమైక్యతకు, పంపని సౌభ్రాతృత్వమునకు ఈ శాసనము చక్కని సాక్ష్యము. ఇది నన్నయకు 100 సం॥ ముందు శాసనము. దీనిలో 3 సమగ్ర లక్షణము గల కందములున్నవి.

1) జిన భవనంబు లెత్తింపుట
జిన పూజల్సేయుచున్కి జినమునులకున
త్తిన యన్నదానం బీవుటం
జిన వల్లభు బోలంగలరె జిన ధర్మపరుల్

2) దినకరు సరివెల్గుదు మని
జినవల్లభు నెట్టుకొట్టు టేక నిరాసనుం
మను జాల్గలరే భారతిం
నిని తిప్పుదు ననియు ప్రత్త విబుధ కవీంద్రుల్

3) ఒక్కొక్క గుణంబు కల్గుదు
లొక్కొండగా కొక్కలక్క లేపెవ్వరికిం
లెక్కింప నొక్కాలక్కకు
మిక్కిలి గుణ పక్షపాత గుణమణి గుణంబల్
[భవనంబు – భవనమని, మనుజుల్లలరె - మనుజులుగలరే అని చదవవలెను]

4. బెక్కల్లు శాసనం (చాళుక్య త్రిభువన మల్లదేవుని కాలం) నన్నయకు సమకాలికం [క్రీ. శ. 1000కి కొంచెము తర్వాత] :

కుల తిలకుం డంద్రు నన్నుం
గుల జనులని పెక్కుంబట్టి కుల తిలకము నా
వెలయుంగ ప్రెక్కంగరంబు
... మణినాగార మొప్పైనతి ధార్మికుండై

5. బాదప మహారాజు ఆరుంబాక తామ్రశాసనము [45] :
[క్రీ. శ. 927-933]

ఈ శాసనమందలి కంద పద్యము సంస్కృత భాషలో గలదు. సంస్కృతము నందలి ఆర్యయేమోనని భావింప నక్కర 'కందా సంపూర్ణ చతుర్మాత్రా గణములు 8 తో, తెలుగు భాషాసహజమైన ప్రాసతో వ్రాయబడినది కందము.

ధవళ గుణో ధవళ యశో
ధవళిత దిఙ్మండలోప – దమితారాతిః
భవ భక్తో భవ కటకో
ద్భవ భవ భోగాన్వితోవి భాతిసు కీర్తిః

ఇది అచ్చముగా తెలుగు కందమే యనుటకు మరియొక ఆధారమున్నది. సంస్కృతము నందు పాదాంతయతి తప్పనిసరి. పాదాంతములోని పదము మరియొక (తర్వాతి) పాదములోనికి చొరదు. తెలుగులో ఈ నియమము లేదు. దీనిని బట్టి పై కందములో 3 వ పాదములోని ఉద్భవ శబ్దము యొక్క 'ఉ' 4 వ పాదములోని "ద్భవ" తో ముడి వేయబడినది. కాన ఇది నిస్సంశయముగా తెలుగు కందమే. యతి సైతము సంస్కృతములో లేని సదృశాక్షరయతి (తెలుగుయతి) వేయబడినది.

## ఆటవెలది - తేటగీతి

ఆటవెలది తేటగీతి పద్యములు వ్యస్తముగను,సీసమునకు అనుబంధముగను వాడుబడుట శాసనములలో కాననగుచు. ఇంత ప్రాచీన కాలము నందు సైతము వ్యస్తముగా వాడుబడుటను బట్టి వీనిని సీసము కింద అనుబంధముగా వాడుబడుపద్ధతితో బాటు ప్రత్యేకమైన అస్తిత్వమును కల్గియున్నవని చెప్పవచ్చును.

### (1) చోళమహారాజు కోసినేపల్లి శిలా శాసనము : (క్రీ.శ.600)

ఈ శాసనమందు తేటగీతి సీసమునకనుబంధమై నిలిచినది. సీసశాసనములలో దీని పాఠము ఇష్టబడినది. యతి దీని యందు నియతముగాలేదు. 1వ పాదమున యతి, 4వ పాదమున ప్రాసయతి కలవు.

### (2) విక్రమాదిత్య చోళ మహారాజు నల్లచెరువుపల్లె శాసనం: (క్రీ.శ.700)

ఆటవెలది - మూడు అర్ధ భాగములున్నవి. ఇవి వ్యస్తప్రయోగములు

I. ఏళ, ఈ (స్త్రె)ద్ధి, వాడి, ఎరిగల్లు, ముతురాజు
ఏళ కజ్గ ఖాస్తు, ఏళ, చోడ | ఒక అర్ధము

[3 సూర్య గణములు + 2 ఇంద్రగణములు 1 పాదము, 5. సూర్య గణము 2 వ పాదము వ్రాసిన ఆటవెలది సగము పద్యమైనట్లు లక్షణము.]

II మంఞి (ఇచ్చి), బొట్టి, యారు, ఉణ్ణెలు, ఉజ్జయిస్
ఇచ్చి, పన్న, వీస, గండ, పాట | రెండవ అర్ధము

III. ఉచ్చు, వాడి, పల్వ రాచస్థ్రి, ఆదిత్య
దార, వాసి, లేపు, పథిపి నవస్తు | మూడవ అర్ధము

IV. అఖ, దాప, సిద్ధె, మిపెరొ, ఙొచ్చె, -ఆటవెలది సమపాదము (5సూ. గణములే)

ఒకటి, మూడు అర్ధములందు ఉభయ పాదములందు యతి చక్కగా (చతుర్థ గణాద్యక్షరము) అమరినది.

**(3)** రెండవ మహేంద్రుని బూదినగడ్డపల్లి శాసనము : (క్రీ.శ.750)

ఆటవెలది విడిగా ప్రయోగింపబడినది.

శ్రీమ హేంద్ర (వ) మాన రవిమాఱు రాపిడ్గు

మగస్థు పుదలి పేళు వాస్తు ముత్తు

రాజు అచ్చ ర్యగసు అరిపర జమున్తు అ

న్వాస్థు మంగు రోం న్పొదుప పడిమె

ఒకటి రెండు మాత్రలధికమైనను ఆటవెలది లక్షణము చక్కగా సరిపోయినది.
1-4పాదములందు యతి కుదిరినది.

**(14)** పెద్ద ముడియం శివాలయ శాసనము[49] :- [క్రీశ 8 వశ]

తేటగీతి :- వేప స్వంబులం చముగొన్న వాడు వార

వాసి పర్చిన్న పాపంబు గొన్నవాడు యతి పాటింప బడలేదు.

**(5)** సలజనంపాడు శిలాశాసనం[50] : [క్రీ.శ. 850]

ఆటవెలది :- వావ్వొవాళ, కొడుకు, పల్లవా, వాజ్యవస్య లికిత (మె)

**(6)** గుణగ విజయాదిత్యుని కందుకూరు శిలాశాసనము : (క్రీ.శ. 850)

ఉంపలి వృత్తగీతి (సీసము వంటిది) ఆటవెలదియో తేటగీతియో చెప్పరాకుండా ఉన్నది. శాసనములో వృత్తగీతి భాగము మిక్కిలిగా లుప్తమై పోయినది. ఇది ఈ పరకే వ్రాయబడినది.

**(7)** సోరమడి కయ్యపు ముదివేడు శిలాశాసనము[51] : [క్రీ.శ. 825]

ఆసవెలది :- స్వస్తి శ్రీక, లలివడ, జమున్తువా, రిమగస్తు

(శ్రీ) వాణ క ఫరు, మనస్తు, వారి, చేత

పట్ట(౦), కట్టి, బవెన, వాస్తు శ్రీ, ఏకుళ, కాల

నిల్మెజె, సొర, మాడి, కయ్య, మునసో ...

లేదా 4 పా మాడి, కయ్య, మునను, దొడిచి, పదిమె యతి సరిపడినది.

## 8. చాళుక్య భీముని ధర్మవరం శాసనము : (క్రీ.శ. 897)

సీసము మీద ఆటవెలది

ఈ ఆటవెలది పద్యము సంపూర్ణ లక్షణముతోను, విశేషముగా ప్రాస యతి తోను గల పద్యము, పద్యపాదము ఈ వరకే వ్రాయబడినది.

## 9. అగ్గపరాజు నన్నమూరు శాసనము[52] : (క్రీ.శ. 1023)

ఒక ఉత్సాహ పద్యమును, ఆమీద ఆటవెలది కలదు.

చెగిప్పు రవర మే (శ్లో) ర వాజి వారె గజ్జబ

లికుల అట్ట నగ.. నక్తి యిసుప....

ఉత్సాహమీద ఆ.వె/తే గీ. వ్రాసిన విషయ సీసముని పిలువబడును. ప్రాఙ్నన్నయ యుగములో తేటగీతికంటెన్న ఆటవెలదులే ఎక్కువగా ప్రచారములో నున్నట్లు పై శాసనముల వలన స్పష్టమగును.

సీసము మీద ఆటవెలదియా తేటగీతియా? ఏది ఎక్కువగా ప్రచారములో నున్నదను విషయమున నిడుదవోలు వెంకటరావుగారు నన్నయకు పూర్వము సీసముల మీద ఆటవెలదులు, మాత్రమే వ్రాసెడివారని[53]. దివాకర్ల వెంకటావధాని గారు దీనిని సమర్థించుటకు ధర్మవరం శాసనములో ఆటవెలది ఉండుటను, నన్నయా నంతరము సమీప కాలిక శాసనము పామిడ్డి శాసనములో ఆటవెలదులే ఉండుటను సూచించిరి. కందుకూరు శాసనములో సీసముమీద గల గీతి తెలియ వచ్చుటలేదు. పద్మకవి సర్వదేవుల సీస పద్యములలో తేటగీతులున్నను పై సిద్ధాంతమువలన వీనిని నన్నయకు పూర్వము వ్రాయబడిన వనుటలో సందేహము వెలిబుచ్చిరి. కాని భోజ మహారాజు కొసినిపల్లి శిలాశాసనములో తేటగీతి కూడ కానవచ్చుటను బట్టి నన్నయకు పూర్వమే తేటగీతులు సైతము క్వాచిత్కముగా వాడబడుచుండెనని చెప్ప వచ్చును.

## (బూ) ఉత్సాహము :

ఉత్సాహ వృత్తమని పిలువబడుచున్న ఈ దేశీ ఛందము, దేశి గణ నిర్మిత మైనను, పాద వ్యవస్థలో సంస్కృత వృత్త సంప్రదాయము ననుసరించినది.

**1. నలజనంపాడు శాసనము[54] (క్రీ.శ 850) :**

స్వస్తి, భగవ, దహస్నాత, పరమ, భట్టి, అర, కస్య, పా
దాను, ధ్యాత, పరమ, మాహా, ఈశ్వ, రపర, మేశ, రా
భట్టార, మహేశ్వర, పదములు, సంధి విడదీయబడినది.

**2. అగ్గిపరాజు నన్నమూరు శాసనము[55] (క్రీ.శ. 1023) :**

స్వస్తి, సకళ, జగత్రయాభి,
నన్దితసుర, అసుర, ఆ
ధీశ, పరమ, ఈశ్వర, ప్రతి,
హారి, క్రితప, హారి, ఓ
కస లో, ద్భవ, కృష్ణ, ఘ్రాజవి
రాజ, తపమ, శాప , కా
పటుహ, ఘోషణ, వ్యాఘ్ర, లాఞ్ఛ
నస్థ గిరి, నాథ వ

[పైన ఆటవెలది 2 పాదములు కలవు. ఇవి వెనుక పేజీలో చూపబడినవి.]

ఒకటి రెండు చోట్ల ఒకటి అర మాత్ర హెచ్చు తగ్గులైనను, ఉత్సాహ లక్షణము చక్కగా ఉన్నది. ఉత్సాహ మీద వ్రాయబడిన ఆటవెలది విడిగాకాక ఉత్సాహతో కలిపియే [అనగా ఉత్సాహ చతుర్థ పాదమందలి చివరి పదము ఆటవెలదిలో కూడ కలిసిపోయినది] వ్రాయబడుటచే ఇది లాక్షణికులు చెప్పిన విషమ సీస మగుచున్నది. యతి సీసమునందు వలె అర్ధమున కొకమారు 2 గణముల మీద చేయబడినది.

ఈ శాసనము నన్నయకు సమకాలిక మగుటచే నన్నయ భారత భాగమున 4 ఉత్సాహలు వాడుటచే ఇది అమూల్యమయినదిగా గణించబడ లేదు.

ఇట్లు ప్రాఙ్నన్నయ యుగములో తెలుగుభాష ఉనికిని స్థిరపరచగల్గు నాటి నుండి నన్నయ వరకు గల [4 శతాబ్దుల కాలములోని] శాసనములు [లిఖిత సాహిత్యము] దేశ్య ఛందములు అధికముగా ప్రచారములో నున్నట్లు ధృవపరచ జాలి యున్నవి. సంస్కృత[56], కన్నడ[57], రచయితలు లాక్షణికులు ప్రాచీనాంధ్రకవులు[58] దేశి ఛందములను ప్రయోగించుటయో లాక్షణీకరించుటయో గావించి స్థిరపరచి యున్నారు. గుణగాంకీయమో, వాంఛియార్ ఛందమో, కవిజనాశ్రయుని గురువయిన వాదీంద్ర చూడామణీ ఛందమో గనుక లభించినట్లయిన వీనిని గూర్చి మరింత సమగ్రముగా తెలిసియుండ గల్గెడిది.

## అథస్సూచికలు

1. A Common literary and prosdial tradition in south Indian languages P. 11. Korada Rama Krishnayya
2. ప్రాఙ్నన్నయ యుగము - డా॥ది. వేం. అ. పు. 346, 57
3. సమగ్రాంధ్ర సాహిత్యము - సం. 1 పు. 74
4. భారతి, 1967, జూన్
5. 'తెలుగు కవిత్వము ఎప్పటిది' - భారతి-జనవరి, 1962
6. " " " పు. 87-89
7. ప్రాఙ్నన్నయ యుగము - పు. 354
8. శ్రీ వేంకటేశ్వర వా. Vol. 5 No. 2 P. 41
9. S.I.I. X - 598 ప్రాఙ్నన్నయ యుగము పు. 355
10. దీని కాలనిర్ణయము - బూదరాజు రాధాకృష్ణ ప్రాచీనాంధ్ర శాసనములు పు. 65
11. శాసన పాఠము "తెలుగు శాసనములు" G. పరబ్రహ్మశాస్త్రి పు. 53
12. 'తెలుగుసందడి వృత్త గంధి పద్యములు' - దివాకర్ల ఆం.సా.ప. పత్రిక సం. 44, సం. 4
13. S.I.I. Vol. 2 No. 731 - బెజవాడ శాసనముతో పీని జేకిని. అన్న వచన భాగము ద్విపదగా గుర్తింపబడినది· ఇది యాదృచ్ఛికమే.
14. నన్నెచోడుని కవిత్వము - డా॥ అమరేశం రాజేశ్వరశర్మ
15. కొటిచెన శాసనము (శక సం. 1064) శా.వ.మం. ప్రథమ భా. 17

    " " ( " 1069) " " 22

    " " ( " 1070) " " 23

    బెజవాడ " ( " 1072) " " 29

    పాలకొల్లు " ( " 1091) " ద్వితీ. భా. 7
16. ప్రాచీనాంధ్ర శాసనములు - డా॥ బూదరాజు రాధాకృష్ణ (ఆంప్రసాఅ) పు. 4
17. " " " పు. 2
18. " " " పు. 6

19. S.I.I. Vol. X No. 594
20. " " No. 598
21. డా॥ తంగిరాల సూర్యనారాయణశాస్త్రిగారి "ప్రాజ్నన్నయ యుగపు శాసన ఛందస్సులు."
22. ప్రాజ్నన్నయ యుగము పు. 355
23. Epi - Indica Vol. XI P. 343
24. " " " XXVII P. 203 (బా.రా.ప్రా.శా. P 61, 62)
25. S.I I. VI Vol. No. 584 - (బా.రా.ప్రా.శా. P. 11
26. Ep. Ind Vol. XXVII P. 246
27. తెలుగు కవుల చరిత్ర - నిడుదవోలు వెంకటరావు P. 31, 32 పై గీతి పారము డా. దివాకర్ల వారి ప్రాజ్నన్నయయుగము పు. 339
28. Epi - Col. No. 314 - 19, 22
29. బాద.రా.కృ. ప్రాచీ-శాస. పు. 69.70
30. వేటూరి ప్రభాకరశాస్త్రి పరిష్కరణ
31. Epi Indica Vol 27 P. 225
32. డా॥ బా.రా. ప్రా.శా. పు. 4
33. Ep. In. Vol. 27 P. 227
34. 'పరిశోధన' ప్రథమ సంచిక
35. " సం. 1 సం. 4 (1954)
36. ప్రాజ్నన్నయ యుగపు శాసన ఛందస్సులు పు. 297
37. ప్రాజ్నన్నయ యుగము పు. 318
తెలుగుకవుల చరిత్ర పు. 111
38. ద్విపదగణములు సంపత్కుమార భారతి జూన్ 1963 సం. 40 సం.
39. ప్రాచీనాంధ్ర శాసనములు-బా.రా.కృ. సం. 6 P. 19 పు. 73
40. " " పు. 92
త్రిలింగ రజతోత్సవ సంచిక ముట్లూరి వేంకటరామయ్య పు. 362, 63

41. ప్రాచీ. శా. - ఒ.రా.కృ. పు. 93
42. " " పు. 34
43. Ep. coll No. 262 - 1922
44. కరీంనగర్ శాసనములు - ఆర్కియాలజీ, మ్యూజియమ్స్ విభాగ ప్రచురణ
45. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సం. సంపుటి 12, 1921 - సంపా, లక్ష్మణరావు
46. E.I. vol. X No 598
47. E.I. vol. XXVII P 239
48. Ep.I. vol XXVII P 246
49. S I I. X No 611, - ఒ.రా.కృ. - ప్రా.శా. P 46
50. Ep. In. vol. XXVII " " పు. 63
51. ప్రా. ఆం.శా. - ఒ.రా.కృ. P 53
52. " " పు. 102
53. తెలుగు కవుల చరిత్ర - నిడుదవోలు పు. 126
54. ప్రా. ఆం. శా. - ఒ.రా.కృ. పు. 61, 62
55 " " పు. 102, 103
56. సోమదేవసూరి, చేతనభట్టు మున్నగువారు
57. నాగవర్మ, జయకీర్తి మున్నగువారు
58. సర్వదేవ, పద్మకవ్యాదులు.

—o—

# దేశిచ్ఛందస్సుల వికాసదశ

ఇంతవరకు ఛందోఽవిర్భావము, దేశీయమైన ఛందోఽంగములను మొదట ప్రారంభదశలో ప్రస్తావించనైనది. అంతేగాక నన్నయతో ప్రారంభమైన కావ్య వాఙ్మయమునకు ముందుగల శాసన వాఙ్మయము, అలిఖిత జానపద గేయ వాఙ్మయము నందలి దేశిచ్ఛందస్సులను, సోదరద్రావిడ భాషా విషయకమైన ఆధారములతో సహా పరిశీలించుట జరిగినవి. తగినన్ని ఆధారములు లభింపకున్నను వీలైనంతలో దేశి చ్ఛందస్సుల ప్రారంభాస్తిత్వము స్థిరపరుపబడినది.

నన్నయ నాటినుండి తెలుగునకు కావ్యవాఙ్మయము లభించుటచేతను, వివిధ కావ్యకవులతోబాటు ఛందోలాక్షణికుల లక్షణ గ్రంథములు లభించుటచేతను, నాటి నుండి, ఆధునిక యుగమువరకుగల కావ్యలక్షణిక గ్రంథము లాధారముగా దేశి చ్ఛందములైన కందాదుల [illegible] వాని క్రమవికాసమును ఇచ్చుటనుండి "వికాస దశగా" పరిశీలించుట జరుగుచున్నది.

దేశిచ్ఛందస్సుల పూర్వాపర చారిత్రక నేపథ్యము, కావ్యప్రయోగ విశేషములు, లాక్షణికుల లక్షణ భిన్నాభిన్నత్వములు, సోదర ద్రావిడ భాషా సామ్య వైషమ్యములు, అనుప్రాసాద్యలంకరణములతో ఉద్భవిల్లిన భేదప్రభేదములను, కాలక్రమానుగతమైన ఆధారములతో చర్చించుట జరుగుచున్నది.

# 1. కందము

దేశీయ చ్ఛందములలో కందము అతి విలక్షణమైన ఛందము. పాదముల సమ దీర్ఘత్వము లేనిది. అర్థసమ లక్షణము కల్గియున్నది. తక్కిన దేశి పద్యముల గణములు (సూర్యేంద్ర చంద్ర గణములు) కాక విలక్షణమైన మాత్రా సమక గణములు మాత్రము ఉపయోగముగా కలది. గణముల ఉపయోగములో స్వేచ్ఛ కల్గి, తిరిగి నిషేధ గణములు కలది తెలుగులో ఇదొక్కటియే. యతి సరిపాదములకు మాత్రము పరిమితము పాదాంత వైశిష్ట్యము, తక్కిన తెలుగు పద్యములకు వలె ప్రాసనియతి, సంస్కృత ప్రాకృత భాషలలో సదృశ రూపస్థితి కల్గియున్నది. కవుల ఉపయోగములో తక్కిన పద్యములన్ని ఒక్క ఎత్తు. ఒక్క కందము ఒక్కఎత్తు. ఎన్ని ఛందములున్నను కందము రాసినవాడే తెలుగులో ఛందోమర్మజ్ఞుడైన కవి. ఇన్ని విలక్షణములు తక్కిన ఏ దేశి చ్ఛందమునకు లేవు.

మాత్రాసమక గణ నిర్మితమైన ఛందము తెలుగులో ప్రచురమైనది వేరొక్కటి లేకపోవుటచే ఈ ఛందమునకు ప్రాకృతమో సంస్కృతమో మూలమని పలువురు అభిప్రాయపడినారు. చౌపది మాత్రాసమకగణ (చతుర్మాత్రాగణ) నిర్మితమే ఐనను ఇది తెలుగులో ఉపయోగములో లేదు. తెలుగులో లాక్షణికులు ఒక్క మాత్ర లఘువని, ద్విమాత్రికము గురువని ఆ మాత్రా గణన ప్రకారమును చెప్పుట ఇతర ఛందములకు దేనికిని పట్టనిది, ఒక్క కందమునకు మాత్రమే ఉపయోగము. ఒక్క చతుర్మాత్రా గణమునకు బదులు వేరొక్కటి వేసికొనుటకు ప్రతి అర్ధభాగమునకు 32 మాత్రలుంచుటకు లాక్షణికులు చేసిన నియమమిది.

ప్రాకృతమున గాథ, సంస్కృతమున ఆర్య మాత్రికా సమ గణ చ్ఛందములు. వీనిలో ఒకానొక భేదము తెలుగులో కందమునకు సమానము. గాథా ఛందము గాహూ గాథా, విగాథా, ఉద్గాథా, గాథినీ, సింహినీ, ఖంద అ అన్న భేదములు కల్గి యున్నది. వానిలో ఖంద అ భేదము తెలుగు కందము ఒక్కటే. తక్కిన అన్ని గాథలు 64 మాత్రల సంపూర్ణ అష్టగణ నిర్మితములు కావు.[1] ఇట్లే ఆర్యా ఛందము నందు సైతము పథ్యా విపులా, చపలా, ముఖచపలా, జఘన చపలా, ఆర్యగీతి అన్న భేదములలో ఆర్యాగీతి ఒక్కటియే 64 మాత్రలతో కందమునకు సరి పోవును.[2]

సత్తగణా దీహంతా
జోఁణలహూ ఘట్ఠబేహ జోవినమే
తహగాహే విఅ అద్దే
ఛట్ఠం లహూ అం వి అజేహూ (1-56 ప్రాకృ. పైం.)
చ ఉమత్తా అట్ఠగణా
పువ్వద్దే ఉత్తరద్ధహోఁఇ సమరూ అ
సా ఖందఅ వి అణహూ
పింగల పఅణేఇ ముద్ధి బహూనలఖే అ (1-73)

షష్ఠగణం నల, జలలో ఏదో ఒకటి, విషమ గణములలో జగణ నిషేధము. పూర్వార్ధములు 8 చతుర్మాత్రా గణముల, ఉత్తరార్ధము పూర్వార్థమువంటిదే ఐనపుడు అది గాథా భేదమగు 'ఖంద అ' అగును.

లస్వముద్రాః గణాః
గౌగంత మధ్యాదిః స్లశ్చ
స్వరా అర్ధం వార్యార్ధం
అత్రాయుక్ నజ్
షష్టోజ్
స్లౌవా
అర్ధేవసుగణ ఆర్యా గీతిః[3] ఆర్యగీతికి పింగళముని లక్షణము

ప్రాకృతమున గల గాథకు మిక్కిలి ప్రాచుర్య ముండుటయు, సంస్కృతమునందు ఆర్యకు అంత ప్రచారము లేకుండుట వలన ప్రాకృతము, సంస్కృత, దేశ్య ఛందములకు మూలమని పలువురు అభిప్రాయపడిరి. గిడుగు సీతాపతిగారు[4], కోరాడ రామక్రిష్ణయ్యగారు[5], గడియారం రామకృష్ణశర్మగారు[6], చేకుమళ్ళ రాజగోపాలరావుగారు[7] మున్నగువారు కందమునకు ప్రాకృత 'ఖంద అ' మూలమని భావించినారు. రావూరి దొరస్వామిశర్మగారు మాత్రము "సంస్కృతములోని ఆర్యాగీతియే మన తెనుగు కందమగును" అనియు "కందమునకు గీత్యార్య మూలకము. గీత్యార్యకు ప్రాకృత పైంగళమున 'ఖంద అ' అను పేరు గలదు. దీనినే స్కంధకమని సంస్కృతీకరించిరి" అని ప్రాకృతమునుండి సంస్కృతమునకు పోయిన ఈ

ఛందమే తెలుగులో కందమైనదని భావించినారు. ఇట్లు తెలుగులోని కందమునకు ప్రాకృత 'ఖంద అ' మూలమని సలుపుట భావించుటకు కారణములు పెక్కులు కలవు.

1) స్కంధ- 'ఖంద అ' శబ్దములు తెలుగు 'కందము'నకు మూలమనదగి యున్నవి

2) ప్రాకృతములో మాత్రా ఛందములు పెక్కు గలవు. తెలుగులో మాత్రా ఛందములు అత్యంత స్వల్పము. ఇక్కడి సూర్యేంద్ర చంద్రగణ వ్యవస్థ ప్రత్యేకమై మాత్రా ఛందములకన్న విలక్షణమైనది.

3) తెలుగులో కందమొక్కటే వాడబడగా ప్రాకృతములో గాథా ఏడు భేదములై ఆ మలోపి 'ఖంద అ' తిరిగి 27 (28 అని మరొక అభిప్రాయము) భేదములుగ కల్గియున్నది.[9]

4) కన్నడాంధ్ర భాషల అభివృద్ధికి తోడ్పడి, అంతకు పూర్వము ప్రాంతీయ వ్యవహారములో నున్న భాష ప్రాకృతము.

5) గాథ అత్యంత ప్రాచీనమైన ఛందము. భరతుని నాటికే ప్రచారములో నున్నది. అతడు నాట్య శాస్త్రములో దీని వివరము లిచ్చినాడు.[10]

6) పాదములకు (ఒక పాదమునకు 3 గణములు, మరొక్క పాదమునకు 5 గణములు) అసమ వైవిధ్యత తెలుగులో వేరొక్క ఛందమునకు లేదు.

7) గణ నిర్దేశన వైలక్షణ్యము. 6వ స్థానమున ప్రత్యేక నియమము చేసి స్థానములలో జగణ నిషేధము. ఇట్టి నియమము ఏ ఇతర దేశి ఛ్ఛందములందు లేదు.

దేశీయ భాషలలో నుండియే కందము ప్రాకృత సంస్కృతములలోనికి వెళ్ళి ఉండునని అభిప్రాయము కూడా ఉన్నది. "నేటి భాషా శాస్త్రవేత్తలు తెలుగు కందమే స్కందకమను పేరుతో ప్రాకృతమున ప్రవేశించి, సంస్కృతమున గీతి భేదమై రాణించినదందురు." అని రావూరి దొరస్వామిశర్మగారు వ్రాసిరి.[11] నాగవర్మ ఛందోంబుధిని పరిష్కరించిన కిట్టెల్ పండితుడును ప్రాంతీయ భాషా ఛందమైన కందమే దేశ భాషల మూలమున ప్రాకృతమున పోయినదనిరి. ఆరుద్ర "ఇది తెలుగు వాళ్ళ దగ్గరినుంచి ప్రాకృతంలోకి, ప్రాకృతంలో నుండి సంస్కృతానికీ వెళ్ళింది" అని చెప్పినారు.[12] కాని వారెట్టి ఆధారములు చూపలేదు. కాని దేశి భాషలలో నుండే కందము ప్రాకృతములోనికి పోయినదనుటకన్న అచ్చట నుండియే ఇచ్చటకు వచ్చిన దనుట లెస్స. ఏలనగా తెలుగు కన్నడములు ఉనికికి ఆధారము లభించని ప్రాచీన కాలముననే గాథా ఛందమునకు భరతాదుల లాక్షణీకరణము హాల శాతవాహనాదుల కావ్యోపయోగము కన్పట్టుచున్నది గదా!

# కంద భేదములు

గాథకు ప్రాకృతములోని ఏడు భేదములలో 54 నుండి 64 మాత్రల వరకు వాడుకొనవచ్చును. కాని తెలుగులోని కందమునకు 64 మాత్రలు తప్పనిసరిగా ఉండవలయును. ఆర్యకు పూర్వోత్తరార్ధములు కలిపి 7 మాత్రలు తక్కువ. ఆర్యా భేదములో మాత్రల సంఖ్య కొంచెము మారుచుండును. మాత్రల సంఖ్యలో ఏ మాత్రము భేదములేక 64 మాత్రల సంపూర్ణ పాదము కల కందమునకు తెలుగులో భేదములు లేవు. అప్పకవి ఒక్కడు మాత్రము కందమును ఆర్యతో అభేదముగా భావించి ఆర్యభేదములను కంద భేదములుగా వ్రాసినాడు.

వరగఁ గందము పథ్యయు, మరి విపులయుఁ
జపలయును, ముఖచపలయు, జఘన చపల
లనగ కంద పద్యంబు లీ యాఱు విధము
లఖిల సుకవి కృతులలోన నలరుచుండు (అప్పకవీ - 4-452)

ఈ ఆరుభేదములు అప్పకవి సృష్టించినవే. అప్పకవి తప్ప ఇతరు లెవ్వరు ఈ భేదములు చెప్పలేదు. 'అఖిల సుకవి కృతులలోన నలరుచుండు' అని చెప్పుట సత్యదూరము. మాత్రలు తక్కువగా గల ఆర్యను తెలుగులో ప్రాచీన కవులెవ్వరును వాడరైరి. కందమును మాత్రలు తగ్గించి ఆర్యగా వాడుటన్నది తెలుగు సాహిత్య ములో ఎచ్చటను కానరానిది.

ఆర్యలక్షణము :

అ. లక్ష్మైతత్ సప్తగణా, గోపేతాభవతి నేహం విషమేజః
షష్ఠోయంచ నలఘువా, ప్రథమార్ధే నియతమార్యాయాః
షష్ఠేద్వితీయ లాత్పర, కేన్లే ముఖలాచ్చ సయతి పద నియమః
చరమేర్ధే పంచమకే, తస్మాదిహ భవతి షష్ఠోలః (వృత్తరత్నాకరమ్)

నాలుగు మాత్రల గగ, భ, జ, స నల గణములలో ఏవేని 3 గణములు ఒక పాదమునకు, 5 గణములు ఒక పాదమునకు మొత్తము 2 పాదములకొక అర్ధము కాగా మాత్రల సంఖ్య 8×4=32. ఆర్యలో పూర్వోత్తరార్ధములలో 8వ గణము కేవలమొక గురువే. చతుర్మాత్రికము గాదు. ఉత్తరార్ధములో షష్ఠగణము చతుర్మాత్రి కము గాక (అనగా నల, జలలో ఏదో ఒకటిగాక) కేవలమొక్క లఘువే వాడ వలయును. ఈ మూడు మార్పులు పూర్వార్ధమున ఒకటి, ఉత్తరార్ధమున రెండు చేసిన కందము ఆర్యగా మారును.

| | | |
|---|---|---|
| కంద గణములు | 4 + 4 + 4 | 32 మాత్రలు |
| మాత్రల సంఖ్యలలో) | 4 + 4 + 4 + 4 + <u>4</u> | |
| | 4 + 4 + 4 | 32 మాత్రలు |
| | 4 + 4 + <u>4</u> + 4 + <u>4</u> | 64 మాత్రలు |
| | | కాగా |
| ఆర్య గణములు పూర్వార్ధ | 4 + 4 + 4 | 30 మాత్రలు |
| | 4 + 4 + 4 + 4 + <u>2</u> | |
| ఉత్తరార్ధ | 4 + 4 + 4 | 27 మాత్రలు |
| | 4 + 4 + <u>1</u> + 4 + <u>2</u> | |
| | | గా ఉండును. |

పూర్వార్ధము 30 మాత్రలు. ఉత్తరార్ధము 27 మాత్రలుండును. ఆర్య ఉభయార్ధములందు తృతీయ గణము తర్వాత పాదసమాప్తి ఐన పథ్యార్య. అట్లు గాక తృతీయ గణాంతమున విచ్ఛేదములేక పదము చతుర్ధగణ (ద్వితీయ పాద)ము లోనికి చొచ్చుకొనిపోయిన విపులార్య. ఉభయార్ధములలో ద్వితీయ చతుర్ధ గణములు జగణములై ఉండి, ఉభయ పార్శ్వములందు గురువులు కలిగి ఉండిన అది చపల. ఈ లక్షణము కేవలము ప్రథమార్ధమున ఉన్నచో ముఖ చపల, కేవల ద్వితీయార్ధమున ఉన్నచో జఘన చపల. ఈ భేదములైనను అప్పకవిచే స్పష్టముగా చెప్పబడలేదు. లక్ష్యములందు సైతము పాటింపబడలేదు. అంత్యగణమును గురువుగా నిలిపి కందమునకు మాత్రలు 2 తగ్గించినవాడైనాడు. షష్ఠస్థానము ఉత్తరార్ధములో ఒక లఘువుంచుట పాటించలేదు. పథ్య, విపుల, ముఖ చపలలో ఇది పాటింపబడలేదు. విపులలో పాదోల్లంఘన (చతుర్ధగణము లోనికి పదముచొచ్చుట) పూర్వార్ధమున పాటింపబడి, ఉత్తరార్ధమున పాటింపబడలేదు. చపలాలక్షణములో ద్వితీయ స్థాన జగణ నిక్షేపము, ఉభయగణముల, ఉభయ పార్శ్వముల గురు నిక్షేపము అప్పకవి ప్రసంగించక పోవుటేగాక, చపలా, ముఖచపలాకందములలో ఈ నియమములు ఉల్లంఘించినాడు[13]. యతిలో సైతము ఆర్య, కందములకు చాలా భేదమున్నది. కందములో త్రిగణాంతర యతి (పొడవుపాదము లందు) కాగా, ఆర్యలో ఈ నియమము నల గణోపయోగానువర్తిమైనది. పూర్వార్ధమున ఆరవగణము నలమైన అందు మొదటి లఘువుపై యతి. ఏడవ గణము నలమైన 6 గణముల పిదప యతి. ఉత్తరార్ధమున

ఐదోగణము నలమైన నాల్గోగణముల పిదపయతి. కందమునందిట్టి నియమము లేదు. ఈ విధముగా లప్పకవి చెప్పిన కందభేదములు అటు ఆర్య లక్షణము సమగ్రముగా పట్టక, ఇటు కందభేదములు కాజాలక యతి ప్రాసల విషయంలో తెలుగుపై మిగిలిన లక్షణములు సంస్కృతానువర్తులై, లక్షణలక్ష్యములకు సమన్వయము కుదరక కంద సౌష్ఠవము (సంపూర్ణ చతుష్షష్టి మాత్రికములు) వీడినవి.[14]

కందమునకు ఆర్యకును గల ఈ స్పష్ట భేదమును తెలుగులో పలువురు లాక్షణికులు అస్పష్టముగా చెప్పిరి. కవి జనాశ్రయకారుడు "కందముల రెండర్థముల తుదన్ గురువుఘటించి" అని ఆర్యాలక్షణమును చెప్పినాడు. తుదన్ అనగా తుది గణము అని భావించవలయును. లేనిచో కందము అర్థము మీద మరొక్క గురువు అనగా 34 మాత్రలగును. అప్పకవి పథ్యాకందమున ఒక్క గురువు తాకించిన ఆర్య గీతి అనినాడు[15]. దీనివల్ల ఆర్యాగీతి అంత్యగణము గగమే కావలయునన్న (గురువు మీద గురుపై) నియమమేర్పడినది. నాల్గు మాత్రలని భావించుకొనకున్న ఇది సంకుచిత లక్షణమగును. విన్నకోట పెద్దన్న ఆర్యలక్షణము చెప్పుచు" కందము నర్ధంబుల తుద నందిన గురువుడుపథ్యయగు"నని చెప్పినాడు[16]. చతుర్మాత్రా గణమునకు బదులు 2 మాత్రలు తగ్గించి ఏక గురు నిక్షేపమని చెప్పవలసినది-అస్పష్టమైనది. అనంతుడు ఆర్యాలక్షణంలో షష్ఠ స్థానములో నల, జగణములకు బదులుగా "నలఝులాదింట" అని ఒక్క నలగణోపయోగమే చెప్పినాడు[17]. చిత్రకవిపెద్దన, అప్పకవి చపలలోని (2వ, 4వ గణములు జగణములు వాడవలసి యుండగా) ద్వితీయ స్థానముగూర్చి చెప్పరైరి. అప్పకవికి ముందరి లాక్షణికులు ఆర్యా, కందముల మధ్యగల భేదము పాటింపక పోవుటయు, లక్షణమును అసమగ్రముగా చెప్పుటయు అతనికి ఋజుమార్గము నందింపలేకపోయి యుండును[18].

డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు తమ "ఆంధ్ర మహాభారతము ఛందః శిల్ప" మన్న గ్రంథమున భారతములోని కందములను పథ్యాదిభేదములతో పరిశీలించిరి[19]. త్రిగణానంతర పదసమాప్తి (పథ్య), త్రిగణాలను ఉల్లంఘించిన విధి (విపుల), చతుర్థగణముగా జగణ విన్యాసము(చపల) ఆధారముగా కందము యొక్క నడకలను దృష్టియందుంచుకొని పథ్యాకందము విపులాకందము అన్నరీతి పేర్లతో పరిశీలించిరి. కాని అప్పకవి చెప్పిన మాత్రాలాఘవ కందభేదముల ననుసరించి కాదు. 64 మాత్రలకు తక్కువ కందమే తెలుగులో ఉండదుగదా ! ఇట్టి విభజనము వివిధ గతుల సృష్టికి కారకమై వారి పరిశీలనము సౌందర్యాపాదకమైనది. కాని వారు

రేచనామలకు కందభేదముల యభిప్రాయమున్నట్లు వ్రాయుట ఆలోచింపదగినది. "కందము త్రిశరగణంబుల" అన్న పద్యములో త్రి (3), శర (5), గణములని చెప్పుట త్రిగణానంతర పాదసమాప్తి రూప పథ్యాకందమని రేచన అభిప్రాయముగా వారు పేర్కొని నన్నెచోడుడు వ్రాసిన లొట్టులొట్టకందము "విమలాదిత్య తనూజుడు.." ను పథ్యాకందముగా రూపింప యత్నించిరి కాని తెలుగులో రేచనేకాదు. ఆర్యా భేదములైన పథ్యాదులను కందభేదములుగా (అప్పకవి తప్ప) ఏ లాక్షణికుడును భావించినట్లు కానరాదు. రేచన చెప్పిన త్రిశరగణములున్నది. రెండు వేర్వేరు పాదములని చెప్పుటకే. తెలుగులో దీర్ఘ (5 గణముల) పాదములో సర్వాక్షర రూపయతి 4వ గణము మొదటి అక్షరమునకు, 7వ గణము మొదటి అక్షరమునకు వేయబడును. ఇట్లు చెప్పకున్నచో ఆ ఒక్క దీర్ఘపాదములో యతివేయుట గూర్చి చెప్పవలసి వచ్చు. అంతేకాక రేచన కందలక్షణమును చెప్పునపుడు వ్రాసిన 5 కంద పద్యములలో 3 కంద పద్యములు పథ్యాలక్షణమునకు భిన్నముగా (పాదోల్లంఘనము) ఉన్నవి. పాటిబండవారు వేదత్రయ సాంకర్యమున కందమును పదహారు భేదములుగా భావించి భారతమునుండి లక్ష్యములు చూప యత్నించినారు కాని భారతకవులు పథ్యాది భేదములను పాటింపలేదు. ఆ విషయమును గూర్చి వారే తమ ఛందః శిల్పమున "పింగళముని చెప్పిన చపలా లక్షణమును పూర్తిగా అనువర్తించు లక్ష్యములు కవిత్రయ రచనయందు కనబడుటలేదు. పైన చూపబడిన లక్ష్యములు పింగళ లక్షణమును కొన్ని కొంతవరకును, కొన్ని చాలావరకును అనువర్తించుచున్నవని" సరిపుచ్చినారు.

బేసి జగణనిషేధము. షష్ఠస్థాన నల, జ ప్రయోగము తప్ప కందమునకు గల గణస్వేచ్ఛను బట్టి వివిధ గతులు సృష్టింపవచ్చును. గణముల నాధారముగా కందమునకు భేదములు సృష్టింపబడినవి. గగ, భ, జ, స, నల అను గణములలో ఏవైనా వాడుకొనవచ్చును; నిగుర్వంత గణము అర్ధము చివర, బేసి స్థానమున జగణ నిషేధము, షష్ఠస్థానమున నలలేక జగణములు మాత్రము నియమితములు. కనుక కందములోని గణముల సంయోగము (Each combination) బహుళ సంఖ్యాకములగును. గిడుగు వెంకట సీతాపతిగారు తమ తెలుగులో ఛందోరీతులు అన్న గ్రంథమున వీనిని లెక్కించిరి.

## కందపద్యములోని గణ స్థానములు

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | ఒక అర్థమునకు | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వాడుటకు వీలైన గణములు | గగ | గగ | గగ | గగ | గగ | - | గగ | గగ | = 7 మార్లు | 14 మార్లు |
| | భ | భ | భ | భ | భ | - | భ | - | = 6 ,, | 12 ,, |
| | - | జ | - | జ | - | జ | - | - | = 3 ,, | 6 ,, |
| | స | స | స | స | స | - | స | స | = 7 ,, | 14 ,, |
| | నల | నల | నల | నల | నల | నల | నల | - | = ,, | 14 ,, |
| | 4 విధములు | 5 విధములు | 4 విధములు | 5 విధములు | 4 విధములు | 2 విధములు | 4 విధములు | 2 విధములు | = 25,600 విధములు | |

$4\times5\times4\times5\times4\times2\times4\times2=25,600$ విధములైన పూర్వార్థములు సిద్ధమగును. గుర్వాదిమైనచో పద్యమంతయు గుర్వాది గణములచే, లఘ్వాదిమైనచో లఘ్వాది గణములచే సిద్ధమగును. గనుక గుర్వాది 5120. లఘ్వాది 10240 అనగా $5120\times5120=46214400$ గుర్వాది, $10240\times10240=18,43,57,600$ లఘ్వాది కందము లుత్పన్నములగునని గడుగువారు వ్రాసినారు. షడ్వింశతి ఛందో జాతములగు వృత్తములకు గురులఘు స్థాన నిర్దేశన పూర్వ సంయోగముల (Combinations) ఛందశ్శాస్త్రము లెక్కించి చెప్పినట్లే చెప్పబడినది. శాస్త్రము సాధ్య పరిధిని చెప్పగా, ప్రయోగము అవసరమును మించనీయదు. గనుక గణ బాహుళ్య మును పురస్కరించుకొని గగ కందము, భ కందము, జ కందము, స కందము, నల కందమన్న రీతిలో కందగమన వైవిధ్యమును గుర్తించవచ్చును. ఇది ఛందో లాక్షణికుల, విమర్శకులకు స్ఫురించినదేగాని, కవుల ప్రయోగ సమయమున ఇంత సూక్ష్మముగా పెంట్రుకను చీల్చినట్లు వ్యవహరింపరు. ఈ విషయమును గమనించియే లాక్షణికులు, తెలుగులో నిడుద కుఱుచ కందములను మాత్రము లాక్షణీకరించిరి. ఇట్టివారిలో చిత్రకవి పెద్దన ప్రధానముడుగా కాన్పించును

హరివర ముప్పది నాల్గ
క్షరముల కందంబు కుఱుచ కందంబన ని
ద్ధరఁదగు నఱువది రెండ
క్షరముల కందంబు నిడుద కందం బయ్యెన్.

— లక్షణసార సంగ్రహము 2-86

ముప్పది నాల్గక్షరముల కందమనగా సర్వగురు కందమని, అరువది రెండక్షర ముల కందమనగా సర్వ లఘు కందమని అర్థము. 64 మాత్రలకు అన్ని గురువు లుంచి ("గగ" గణములే వాడిన)గురువుకు రెండు మాత్రల చొప్పున $64\div2=32$ అక్షరములగును. షష్ఠ స్థానములో గగ పనికిరాదు. నల, జలలో ఏదో ఒకటి తప్పని సరి. నల=4 అక్షరములవి. జ=3 అక్షరములవి. 'గగ' గణములతో కుఱుచకంద నిర్మాణావసరమున నలకన్న జగణమే స్వీకార్యము. అనగా రెండక్షరములకు బదులు ('గగ'కు బదులు) మూడక్షరముల (జగణము) గణము వాడబడినది. అర్థ మున కొక్క అక్షరము అధికమైనది. మొత్తము రెండర్థములకు రెండక్షరము లధికమై 34 అక్షరములతో కుఱుచ కందము సాధ్యము. ఇట్లే షష్ఠస్థాన నియమముచే అర్థమున కొక్క అక్షరము చొప్పున 2 అక్షరములు తగ్గి 64 మాత్రలకు 64 అక్షరములకు

బడుల 62 అక్షరములలో ఏకురూప కందము సాధ్యము కాదు. సర్వ గురు, సర్వ లఘు అనుటలో ఆ ఒక్క స్థానమున కుదరదు గనుక మినహాయింపవలెను. నిడుద, కుఱుచ అన్న శబ్దములు సైతము వాడించతగినవే అన్ని గురువులు వేసిన కందము కుఱుచ అన్నది, వ్రాతలో చూచినపుడే. తిరిగి పఠనావసరము ఈ రెండు విధముల కందము లకు ఉచ్చారణాకాలము సమమే కదా! కనుక నిడుద, కుఱుచ అన్న భేదము పఠన దృష్టితోగాదని భావించవలయును. ఐనను వినికిడిలో ఈ పద్యము గతి వైవిధ్యము గల్గియుండుననుట నిశ్చయము, 'గాబా' అన్న పదము నుచ్చరించగా వినుటలో గగ బబ, లేదా గబగబ అని ఉచ్చరింపగా వినుటలో ప్రత్యేకత స్పష్టమైనదే. చిత్రకవి పెద్దనాదులు చెప్పిన లక్షణములకు సరిపడు లక్ష్యములు కవి ప్రయోగములు మృగ్య ములే అయినను, ఈ నిడుద కుఱుచ కందము మాత్రము కవులు వాడిరి.

నన్నయ భారతమున సంపూర్ణము గగ కందములుగాని, సంపూర్ణ నల కంద ములు గాని లేవు. కవిజనాశ్రయకారుడు కుఱుచ నిడుద కందములను తడవలేదు.

కవి జనాశ్రయకారునికన్న ముందువాడును, దాక్షిణాత్యుడైన జయకీర్తి తన ఛందోనుశాసనమున గుర్వంతత్వమువలని సర్వ లఘుకందము షష్ఠ స్థాన నియమము వలన సర్వగురు కందము అసాధ్యములని చెప్పుచు సర్వగురు, సర్వలఘు కందము లను తడివి యుండుట ఇట గమనింప తగినది.

'సర్వలఘుః స్కంధోఽసౌ
గుర్వంతాష్టమ గణతత్వతో నాస్తి భృశం
సర్వ గురుర్నాస్తి తథా
పూర్వమతాన్నియత షష్ఠ జస్ల గణత్వాత్. (5-14)

ఇది ప్రాస ఘటిత మగుటచే దేశీయ పద్ధతి ననుసరించి వ్రాయబడినదని భావింపవచ్చును. స్కంధకమునకు సంస్కృత ప్రాకృతము లందెచ్చటను సర్వ గురు కందము సర్వ లఘుకందమన్న భేదము చెప్పినవారు లేరు.

సర్వలఘు కందము కావ్యప్రయోగములో నన్నెచోడుని కుమార సంభవమున కాన వచ్చుచున్నది.

తగు తగదని మనమున మును
వగపగ నొడబడగ వగప పగపగ బడయున్
దగు దగదని పగవని వగ
వగవగ బని గలదె తనకు వగపడి జగతిన్. (X-186)

నన్నెచోడుని పిదప పూర్వయుగములో పోతన భాగవతమున ఈ సర్వలఘు కందము తిరిగి ప్రయత్నపూర్వకముగా వ్రాసినట్లు కాన్పించును.

"అడిగెదనని కడువడి జను
నడిగిన తను మగుడ నుడుప డనినడ యుడుగున్.
(గజేంద్ర మోక్షము)

ఇట్లే వామన చరిత్రలో

1) తన కడుపున నొక పెరపున
గానరాని జగములను నిముడుకొనియెడి ముకుం
దనిమిషుల జనని కడుపున
దనుగతి గడు నడగి మడగి తనరెన్ బెడగై (అష్ట—496)

2) పెడపెడ నిడుకలు నడుమను
నెడనెడ నడుగిడ గనుబొమ లదిర బడగన్
బుడిబుడి నొడువులు నొడువుచు
బుడుసుకి తడబడగ నడుగు పేరెన్ రాజున్ (అష్ట—541)

పోతనకు పిదప ఇట్టి పద్యములు క్వాచిత్కముగా కవుల ప్రయోగములో కన్పట్టుచున్నవి.

నన్నయ భారతములోని పద్యమొకటి 14 స్థలములు వాడగల్గిన దైనను 10 స్థలములే వాడబడినవి.

హరు శరమును నరు శరమును
సరి నిరు పక్కియలు దాకి జనమణి శిరసం
భరమున దిరిగెను వరాహము
శరనిధి మథనమునఁ దిరుగ శైలము పోలెన్ (అరణ్య - 1-306)

పెద్దగలచోట్ల నలేతర గణములు పడినవి. ఈ నిడుద కందములో నాలుగే యక్షరములు తక్కువైనవి.

ఇక కురుచ కందమునకు తిక్కన భారతమున ప్రయోగమున్నది. అదియును 14 గణములకు 7 మాత్రమే వాడబడినట్టిది.

1 2
అంతం గుంతీ నందన

3 4 5
కాంతా చింతా మహాంధకారముతోన

6
శ్యాంతం బుమచ్చరించెనో

7
సంతమ సంబన ప్రభాత సమయం బయ్యెన్" (7 గగలు)

సమగ్ర కురుచ కందము

లంకా గ్రావ ప్రోద్య
ట్టంకా రక్షో వనీకు రారాజేడే
శంకా దూరా దుష్టా
తంకాం ఘోషా బుగాయు దంచ తిక్కార్తీ - లక్షణసార సంగ్రహము

భట్టుమూర్తి వరస భూపాలీయములో
"బారా ధీర కుమారా
మారా మను" వంటివి స్వల్ప గగ ప్రయోగముల కువాహరింపవచ్చును. శబ్దాలంకార ప్రీతిగల కవులే వీనిని వాడుట గమనింపవగినది.

ఇట్టిసే గణ నిర్మాణమును బట్టి పెక్కు భేదములు చెప్పబడినవి. చిత్రకవి పెద్దన తన లక్షణసార సంగ్రహమున (3-91) నల చతుష్కందము, జగణ చతుష్కందము అని లాక్షణీకరించినాడు. 6వ స్థానముతోపాటు 2వ గణస్థానమున సైతము నలము వాడినచో 2 స్థానములు × 2 అర్థములు = 4 స్థానములు = 4 నలముల కందమని ఇట్లే 4 జగణముల కందమని విభజించినాడు. నల గణము 4 చోట్ల వాడుటలో విశేషమేమియు లేదు. 14 చోట్ల వాడబడు నిడుద కందము ఉండనే యున్నది. 4 చోట్ల జగణము వాడుట విశేషము. జగణము 6 చోట్ల వాడుటకు వీలున్న గణము.

కాపున ప్రభుత్వ సంపద
నీలిభుడాన దియెల్ల నెగ్గంగా నకనా
చేవిసు మునీడు ప్రతినకు
నేవిధి పేయన గుదాని నేర్పడననఘా - కర్ణ - IV-83

జగణమునకు కందమునందు చేసి గణముగా నిషేధమును, షష్ఠ స్థానమున విశేష విధియు గల్గియున్నది. 'చతుష్పద' ఛందమున దీనికి ప్రయోగమే నిషేధము. ప్రాకృత ఛందస్సులలో మాత్రా సమ గణములలో చతుర్మాత్రికములలో జగణము విశేషగణముగా గుర్తింపబడినది. దీనికి 'వృత్త జాతి సముచ్చయమ్' నరేంద్ర గణమన్న పేరుంచినది.[22] జగణ విన్యాసము చేతనే చపలార్య సిద్ధమగుచున్నది. అంతేకాక జగణమునకు ముందు వెనుకల గురువుంచ వలయునన్నది మరియొక నియమము. ఇట్లు జగణ ప్రయోగము విశిష్టమైయుండ జగణ చతుష్కందమని పెద్దన, రమణక వ్యాఖ్యలు కంద భేదముగా పేర్కొనుట సముచితమే. గౌరన లక్షణ దీపికలో కందము 7 విధములుగా పేర్కొనినాడు. 1) సహజ కందము, 2) పూర్ణకందము, 3) కురుచ కందము, 4) ఆర్యా కందము, 5) నిడుద కందము, 6) నల చతుష్కందము, 7) చతుర్విధ కందము. వీనిలో విశేష భేదమేమియు లేదు. చతుర్విధ కందము మాత్రము చిత్ర కవిత్వ సంబంధి. లక్షణ శిరోమణికారుడైన పొత్తపి వేంకటరమణకవి కంద భేదములను 14 విధములుగా పేర్కొనినాడు. 1) సమ కందము, 2) విషమ కందము, 3) ఆర్యా కందము, 4) కురుచ కందము, 5) నిడుద కందము, 6) ద్వివిధ కందము, 7) చతుర్విధ కందము, 8) నల చతుష్కందము, 9) జగణ చతుష్కందము, 10) వృత్త గర్భిత కందము, 11) భాస్కర విలసిత కంద ద్వయము, 12) క్రౌంచపద కంద ద్వయము, 13) మణిగణ నికర కందము, 14) ప్రమితాక్షర కందము. 6 నుండి 14 వరకు గలవి చిత్ర కవిత్వ సంబంధము కాగా ఆర్యా కందము, విషమ కందము మాత్రము విశేషముగా చెప్పినవి.

ఆర్యాకందము : కందము ప్రతి అర్ధమున గుర్వంతము కావలయు నన్నది ప్రసిద్ధము కాగా లక్షణ శిరోమణి చివరి గురువుకు బదులుగా రెండు లఘ్వక్షరములుండుట యని చెప్పినది.

యదుకుల పావన రాధా
హృదయ వ్యాకోచ జలజ భృంగప మాధవ[23]

కాని యిట్టి అపూర్వంతమైన కందము ఆంధ్ర సాహిత్యములో ఎచ్చటనూ కాన రాక లాక్షణికుని ప్రయోగవైచిత్రి ప్రియత్వమును సూచించుచున్నది. కన్నడమున 2, 4 పాదము లంతములు లఘువులైననూ చెల్లునని డా॥ సర్వోత్తమన్‌గారు వ్రాసి నారు. బహుశ ఇది ఈలాక్షణికునికి ప్రేరణము కావచ్చును.[24]

విషమ కందము : సమ కంద కుడుచ పదముల్
క్రమమునవిడి యవల నార్య కంద నిడుదపా
దములను నిలుపంగ దగును
గమలాధిప యడియె విషమ కందము కృష్ణా (III-290)

పొట్టి పాదము పిదప పొడుపు పాదమన్న విధానము కందమునకు ప్రసిద్ధమై యుండగా 2 పొట్టి పాదము లొకసారి, పిదప 2 పొడుపు పాదములుంచిన విషమ కందమని పై లక్షణము చెప్పుచున్నది. కాని ఈ పద్యము ప్రాచీనాంధ్ర సాహిత్య ములో కానరాదు. కనీసము పొత్తపు రమణ కవియైననూ ఈయలేదు. ఆధునిక సాహిత్యములో డా॥ C. నారాయణరెడ్డిగారు 'మా కందములను' పేర ఇట్లు కొలది పద్యములు వ్రాసినారు. కాని అవి పైచిత్రీ ప్రియత్వమునకు గుర్తుగా మిగిలిపోయి నవి. మాకందము పేరుతో కొండ వేంకటరత్నము పంతులవారు పథ్యా కందమును షష్ట స్థానమున జగణైక ప్రయోగముతో విశ్వేశ్వరీయమున ప్రయో గించిరి.

**నడకలు :** కందములో ఏయే గణము లేయే స్థలముల నుండరాదని ప్రశ్నించుకొనుచు గమన వైవిధ్య పరిశీలనలో గమన నిరోధమునకు కారణములు వెదుకుచూ డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు తమ 'తెలుగులో ఛందోరీతుల'లో కందమున ఊత ప్రభావమును చక్కగా నిరూపించిరి.[25] పదము యొక్క ఆద్యక్ష రముపై గుర్వక్షరముపై ఊత (Accent) ఉండునని, పదములో ప్రథమాక్షరము లఘువై, ద్వితీయాక్షరము గురువైనపుడు ఊత ద్వితీయాక్షరముపై ఉండునని చెప్పుచు కందములో 1, 9, 13, 19, 22, 28, 29, 31, 32 మాత్రల మీద ఊనిక అవసరమని సరి సంఖ్యల మాత్రల మీద ఊనిక ఉండరాదని, తక్కిన మాత్రలపై ఐచ్ఛికమని చెప్పుచూ కందముయొక్క నడకలను చక్కగా నిరూపించిరి. పింగళకుని 22, 25 మాత్రలవద్ద ప్రారంభమును సూచించుట, 1, 13 మాత్రలతో

పాదారంభమును (పద సమాప్తి రూప విచ్ఛేదము) చెప్పుట, యతి స్థానములు యుక్పాదముల తృతీయ గణాంతమున సూచించుట, అర్ధము యొక్క చివర గురు వుంచుట, జగణ విన్యాసము, జగణ నిషేధముబట్టి యతి పూర్విడి వంటి వానిని నిర్ణయించుట ఈ ఊనిక దృష్టితోడనే. కంఠోక్తిగా చెప్పకున్నను పింగళముని వంటి ప్రాచీన ఛందో మర్మజ్ఞులు ఈ ఊనిక ప్రభావమును ఎప్పుడో గుర్తించినారు. ఆధు నిక భాషా శాస్త్ర ప్రభావము వలన ఇది మరింత స్ఫుట రూపము నందినది.

చతుర్మాత్రికా గణ వ్యవస్థగల ఈ పద్యమున పఠనావసరమున 4 మాత్రల కొక భాగముగా విడిపోవలయును. అంతేగాని 4వ మాత్ర 5వ మాత్ర కలిసి ఒకే గుర్వక్షరముగా వుండరాదు. ఇట్లే 4-5, 8-9, 12-13, 16-17, 20-21, 24-25, 28-29 మాత్రలు కలిసిన అక్షర ముండరాదు. లేనిచో ఊనిక దెబ్బతినును. ఇంక గణమున కొక్క పదముగా వ్రాసినచో ఇక చెప్పవలసిన పనియేలేదు. కందము యొక్క నడక ఇటితి స్ఫురణమున కన్పట్టును. గణముల ప్రకరణమున ఈ విషయ మింకను స్పష్టముగా వ్రాయబడినది. "పద వ్యవస్థ యెట్లుండినను అక్షరముల కూర్పు మాత్రము నాలుగేసి మాత్రల ప్రమాణము విభాగశః గోచరింప వలయునని పదములు గణానుసారిగాకున్న ఇతర త్ర్యస్రాదిగతులు సాధ్యమ"నియు, "పద స్వరూపాశ్రితము లైన ద్రుత విలంబితాది గతి భేదములను కందమున కల్పించుకొన వచ్చు"ననియు "అందముగా కనిపించు ఆనడకలన్నియు కందమునకు సహజములయిన చతు రస్రములేయని చెప్పవలను పడదు. కొన్ని త్ర్యస్రములు, కొన్ని మిశ్రములు కన్పించుచున్నవ"నియు డా॥ పాటిబండ మాధవశర్మగారు వ్రాసినారు.[25] కాని అట్లుండె నేని ఊనికమాట యటుంచి, కందపు నడక సుప్రసిద్ధమైన దానిని మనసులో ఉంచు కొన్న పఠిత తదనుగుణముగా విరిచి చదివి అర్థభంగ మొనర్చు అవకాశమున్నది. చతుర్మాత్రా ప్రమాణములైన పదములచే నిర్మితమైన కందము చతురస్రముగ నడచు నని- లేనిచో త్రస్రాది గతిభేదములు గలుగ జాలవని వారు వివరించిరి. కాని అట్టి నడకలు కందమున కొలదిసేపు మాత్రము గోచరించును. పాదము పూర్తి అగుసరికి నడకకు విఘ్నమేర్పడును- వారిచ్చిన

ప్రమద, మొనగ, విదురు, బనిచి
సముచిత, మగునర్చ, నంబు, సంకర్షణపూ

అన్ని ఉదాహరణములలో ఒక్క పాదమే త్ర్యస్రగతిలో నడచినది. తిరిగి చతురస్రగతి లేనిచో పాదమున చివర కొలది మాత్రలు శేషించి గతి వికటించును.

ప్రథమ పాదమున నొకగతి, ద్వితీయ పాదమున వేరొకగతి ఆనంద దాయకము కాదు. అంతేగాక ప్రథమ పాదమున త్ర్యస్రగతి నడచుటకు కారణము కూడా యున్నది. అచ్చట 12 మాత్రలు మొత్తము పాదమునకు గలవి. వారిచ్చిన ఉదాహరణములో ప్రథమ పాదాంతము విచ్ఛేదరూపయతి (పదసమాప్తి) కల్గియుండుట మరింత అనువైనది. 12 మాత్రలలో చతురస్రగతి (సహజ కందగతి) నడచిన 4,4,4గా తెగిపోవలయును. కాని త్ర్యస్రగా 3,3,3,3గా తెగినది. ఇది ఇచ్చట సాధ్యమగుటకు కారణము 3,4లకు 12 సమాన గుణిజము. లేనిచో నడక చెడిపోయెడిది. అంతేకాదు వారిచ్చిన ఉదాహరణము సరిపోలేదు కాని లేకున్నచో ఈ నడకను రెండవ పాదమందలి యతిస్థానము వరకు సాధింపవచ్చును. అనగా మరి 12 మాత్రల వరకు సాధ్యమే. కాని చివరి వరకు రెండు మాత్రలు మిగిలిపోవును. 3×10=30 మాత్రలు మీద 2 మాత్రలు ఎటుగాక మిగులును. ఒక వేళ ఇట్లే త్ర్యస్ర గతిలో సాధ్యమైనంతవరకు కందము ప్రయత్నించి వ్రాయుదమన్నను. త్రిగణానంతర పాదసమాప్తియో, ప్రాసాక్షరమో, ప్రాసపూర్వాక్షరమో, నిషేధస్థల జగణ పాతమో, దీర్ఘ పాదయతియో, యుక్పాదాంత గురుత్వమో, షష్ఠస్థానస్థల జగణ నియమమో, కాళ్ళకు బంధమువైచి పద్యము సాగనీయకుండును. ఇంతయేల కందగణములే త్ర్యస్రగతిని ఆద్యంతము అంగీకరింపవు. అతికష్టముపై పద్యమల్లినను, కందమునందు తెలుగు కవికి గల గణస్వేచ్ఛ నశించును. నడక చూసి కందము అనుటకు మనసొప్పదు. ఇక ఖండగతిగూర్చి పరిశీలించవలసిన పనేలేదు. అది కందములో అసంభవమైనగతి. మాత్రా సమక గణములతో నిర్మితమైన పద్యములలో ఇతర గతులు సుసాధ్యములు గావు. తకకిట, తకకిట, తకకిట అన్న క్రమమును తకకి, టతక, కిటత, కకిట, అన్నరీతి విభాగించుట ప్రయోజనకారి కాజాలదు గదా! కనుక పద వ్యవస్థా వశమున కందము యొక్క గతి విశేషము స్పష్టపడుట ప్రయోగ ఫలము.

అనిన విని యన్నెరుంద్రుం, దనుజ సహితముగ ప్రభూత హర్ష సమున్మి
లన కలనా సంవేశిత, మనస్కులై యాతనికి నమస్కృతి చేసెన్. [26]

పై కందమున గణ వ్యవస్థానుగుణ పద ప్రయోగము లేక అర్థవంతమైన పద విభాగము చేసికొన్నంతమన కందగతి లుప్తమైనది. చూచిన కంద భ్రాంతి కల్గునది, నాల్గు పంక్తులలో వ్రాయబడలేదు. వ్రాయబడకున్నను ఈ క్రింది పద్యములో కందగతి చెప్పవలసిన పనిలేకుండా తెలియుచున్నది

పతిబడసి సుతుల బడయగ, నతివలు కోరుపరు కోరినట్టుల తనకున్
పతిబడసి సుతుల బడసెను, నతులీ భార్గవికి భాగ్యసంపద సెనమే[27]

పద్యములో గతిలుప్తమగుటకు కారణము పదములు గణాను సారిగాక స్వేచ్ఛగా నడచినవి. ఒకవేళ గతికొరకు చతివితి షేని

అనినవి, నియన్న, రేంద్రుం,
దనుజన, హితముగ, బ్రభూత, హర్షన, మున్కి
లనకల, నాసం, వేళత

మనస్కు, డైయా, తనికిన, మన్కృతి చేసెన్, అని అర్థ వికృతి కల్గును. ఇంతేకాక ఈ పద్యమున జగణము 'నియన్న' - 'మనస్కు' అన్నచోట్ల (సరి సంఖ్యా స్థానమయ్యును) వాడుట విశేపగతివిచ్ఛితికి కారణమైనది. పరిశీలింపగ ఈ జగణము షష్ఠ స్థానములో వాడుట తప్ప ఇతరత్ర వాడకుండుటయే లెస్సయని పించుచున్నది. ఒకవేళ వాడినను పాదాది (ద్వితీయ పాదాది అనగా 4వ గణముగా) వాడుట నిషిద్ధము చేయవలెను.

అట్లే గణమున కొక్క పదము చొప్పన వ్రాయుచు 6 మాత్రల ఖండములతో గూడ వేరొక్క గతి సాధింపవచ్చును.

1) ద్విరదంబుల నరదంబుల
దురగంబుల గాల్బలముల దూర్యంబుల సీ (శాంతి I-352)

2) అతిమానుష మత్యద్భుత
మతిదుష్కర మైనకేళ వార్జునకృతి గో (ఆది VII-319)

3) అశౌర్యం బానత్త్వం
బాశీలం బాపరాక్ర మాఖీల త్వం (భీష్మ I-ౕ6)

ఊనికను గుర్తించి కందము సొగసుల నాకళించుకొని వ్రాసి తిక్కన, కవి చౌడప్పాదులు కందములకు ప్రసిద్ధి గాంచినారు. సాహిత్య, సంగీత ప్రియులెల్లరును కందపు సొగసును వెంటనే గుర్తించ గల్గుదురు. కందము యొక్క గణ వ్యవస్థ తెలిసినను తెలియకున్నను దాని నడకలను సులువుగ గ్రహింపగల్గుటకు గిడుగు వేం. సీతాపతిగారు రస, భావరహితమునగు పద్యమును దాహరించిరి,

చింతామణి యను బ్రాహ్మడు
పంతానికి గోడ మీద పటమును వ్రాసెన్
అంతట వర్షము కురిసెను
కాంతామణి కంటి మీద కాకరి పూచెన్.

మరొక పద్యము వీధి బళ్ళల్లో గేయమువలె విన్పించెడిది
తేరా పలకా బలపం
ఈరా బగా రిచేది కింపల రంగా
జోరా భోజన వేళకు
రారా పద్యాలు చదువ రాజకుమారా

ఇట్టిదే మా ప్రాంతముననున్న కంద పద్యము వంటిది గేయముగా పాడుకొనుట కలదు సంతర్పణకు పిలిచి భోజనము సరిగా పెట్టని వారిని గూర్చి బ్రాహ్మణులు ఎకసక్కెముగా పాడుకొనుచుందురు.

ఉడికీ ఉడకని మెతుకులు
కాటు వోయినా కందిపప్పూ, కాగని చారూ
గొడ్డళ్ళకు తెగని బూరెలు
సిద్దెలతో మురికి నెయ్యీ సీతారామా!

ద్వితీయ చతుర్థ పాదములందలి యతి విచ్ఛేద రూప+సదృశాక్షరయతి. ఇది గేయములందు కాన్పించు నట్టిది. పదములు వ్యాకరణ శుద్ధములు గాక, మాత్రా సమతకై సాగదీసినవి. పాదమునకు గల సాముదాయిక మాత్రా పరిమాణము తుల్యమై నదిగా పాడబడును. వీనిచే 3వ పాదమున 13 మాత్రలగును. రెండో పాదము రెండో గణము 3వ పాదము రెండో గణము కుదురుట లేదు. నడకకు ఏ లోపము లేదు. ప్రాస బాధలేదు. ఇవన్నియు గేయ గుణములే. జగణములు కూడా చక్కగా కుదిరినవి. పప్పు, నెయ్యి, అన్న పదములు దీర్ఘాంతములు గాకుండిన గణములు కలియును. కాని పఠనములో దీర్ఘముతీయుట ఉన్నది. దీనిని బట్టి గేయగతిలో కందము నడుపుట ఎట్లో తెలిసినది. వీధి బళ్ళలో కంద శతక గానము ఇట్లే ఉండెడిది.

అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను కొలచి మిడుకుట కంటే

పడిగల మెడ్డుల గట్టుక
మడి దున్నక బతుకవచ్చు మహిలో సుమతీ!

ఒక గణములోని పదము వేరొక గణములోనికి పొచ్చుట. ఒక పాదములోని పదము వేరొక పాదములోనికి పొచ్చుటవంటి శిష్ట సాహిత్యపు సంప్రదాయ ఒంపు లేదు. అందువలన పాడుకొనుటకు అనువై యుండును. అర్ధ భంగములేక కావలసిన పదములను కావలసిన మేరకు సాగదీసి పాడుకొనవచ్చును. పై గేయము సాగతీతలో నొక రహస్యమున్నది. కందమునకొక అర్ధమునకు 32 మాత్రలు. అందులో ఒక పాదము 12 మాత్రలకు తెగును. రెండవపాదము యతివద్ద తెగును. అక్కడికి 12 మాత్రలే. ఇక మిగిలినది 8 మాత్రలు. ఈ 8 మాత్రలు కూడా ఇంకొక్క 4 మాత్రలు నింపుకొన్న 12 మాత్రల సమాన పాదము కాగల్గును. పై గేయములో కందిపప్పు, మురికి నెయ్యి అన్న పదముల వద్ద సాగతీత ఉన్నది. అది ఈ కాల లోపమును పూరించు వరకు సాగును. ఇంక గేయమునకు కావలసిన గతి సాధ్యమైనది. ఈ కాల లోపము 4 మాత్రలు ఒకేచోట అనగా 'కందిపప్పు' అన్నచోట నింపబడుట లేదు. అచ్చట రెండు మాత్రలు 'చారూ' పిదప రెండు మాత్రలు నింపబడును. ఆ రెండు మాత్రలు నిండిన పిదపనే 'గొడ్డ' అన్న ఉచ్చారణ ప్రారంభమగును. లేదా మధ్యలో ఎక్కడైనా సాగదీయబడును.

| | | | |
|---|---|---|---|
| 4 | 4 | 4 | |
| ఉడికీ | ఉడకని | మెతుకులు | = 12 మాత్రలు |
| 3 4 | 3 4 | | |
| కాటు వాయినా | కంది పప్పూ | | = 14 మాత్రయి |
| 4 | 4 | 2 | |
| కాగని | చారూ | ఊ | = 10 మాత్రలు |
| 6 | 6 | | |
| గొడ్డళ్ళకు | తెగని బూరెలు | | = 12 మాత్రలు |
| 6 | 3 | 5 | |
| సిద్దెలతో | మురికి | నెయ్యీ | = 14 మాత్రలు |
| 4 | 4 | 2 | |
| సీతా | రామా | ఆ | = 10 మాత్రలు |

(తెగని బూరెలు దృతోచ్చారణలో ఆరుమాత్రలలోనే పలుకబడును)

12+12+12, 12+12+12 మాత్రలుగా ఆరు పాదములుగా సాగినది ఇట్టి సౌలభ్యము గేయ ఛందములది. అతి ప్రాచీన గేయ ఛందములే నడకలలోని మార్పుల వల్ల శేక పదముల వ్యాకరణ దోష పరిహారముచే లాక్షణికుల లాక్షణీకర ణలో దేశ్య చ్ఛందములగుటకు అవకాశము కల్గియున్నది. ఇవియే మూలములనుటకు ఆధారము లేకున్నను భావించుటలో పథదర్శన మగుచున్నది.

కంద పద్యము అతిప్రాచీనకాలము నుండియే కన్నడాంధ్రములలో కానవచ్చు చున్నది. కన్నడ కవిరాజ మార్గములో నాటికే ప్రచురములైన చెత్తాణె, బెందడి కావ్యములలో కందములు బహుళ సంఖ్యాకములై వాడబడుచున్నట్లు తెలుపబడినది. జయకీర్తి తన ఛందోఒను శాసనమున దేశీయ ప్రాసఘటిత కందమును వ్రాసినాడు. కన్నడాంధ్రముల మైత్రికి, సోదరత్వమునకు ప్రతీకయై నిల్చిన ఉభయ భాషా శాసన మైన జినవల్లభుని కుర్క్యాల శాసనములో కన్నడాంధ్ర సామాన్యమైన కంద పద్య ములు ఉభయభాషలలో నాటి ప్రాచుర్యమునకు సాక్ష్యములై నిలచినవి. పంపభారత మున దాదాపు సగము పద్యములు కందములే. పొన్నకవి శాంతిపురాణమున తక్కిన వృత్తములకు 3 రెట్లు కందములు వాడబడినవి. తెలుగులో క్రీ. శ. 953 నాటిదని భావింపబడుచున్న సర్వదేవుని రచన 'ప్రబంధ రత్నావళి'లో ఉదాహృతమైనది కంద పద్యమే. ఆంధ్రమహాభారతములో మూడింట ఒకవంతు కంద పద్యములే, దేశీ ఛందములు 11 వేలు కాగా ఒక్కకందమే 7 వేలు వాడబడినది. (చూ. అను బంధము V B) - ఆద్యఛాందసికుడైన కవిజనాశ్రయకారుడు తన ఛందోగ్రంథ మును సంపూర్ణముగా ఏకైక ఛందముగా కందముతోనే పూర్తి గావించినాడు. (ఏ పద్యము యొక్క లక్షణ మా పద్యమునందే అన్న నియమమును పాటించుటచే తక్కిన పద్యములు వ్రాయవలసి వచ్చినది. తక్కిన భాగమంతా కంద పద్యములే వ్రాసినాడు.)

ఇట్టి కంద పద్యము బహుళ ఖ్యాతమై కన్నడాంధ్ర సోదరుల తుల్యాభి మానమైన ఛందమై, ప్రాకృత జన్యమయ్యును, క్రీ. శ. 8వ శతాబ్దినాటికే ప్రాంతీ యాస్తిత్వము సంతరించుకొని యతిప్రాసనలంకరించుకొని దేశీయ ఛందముగా మన గలిగినది.

తర్వాతికాలములో సైతము కందము కావ్యములలో బహుళ ప్రయో గము నందినది. దీని గమన సౌందర్యము, నాతి దీర్ఘ స్వరూపమునకు మెచ్చి శతక కవులు శతకములను వ్రాసి కంఠస్థ యోగ్యములను గావించినారు.

—x—

అథస్సూచికలు

1. ప్రాకృత పైంగళమ్ I-51 to 71.
2. వృత్త రత్నాకరమ్ II-11.
3. పింగళ ఛ్చందశాస్త్రమ్ సూత్ర 4 అ-సంఖ్య 12, 13, 14, 15,16,17,31.
4. తె. ఛం. రీ. పు. 128.
5. భారతి, చిత్రభాను, ఆశ్వయుజ, పు. 313
6. దక్షిణ భారత సాహిత్యములు - అ "కన్నడ సాహిత్యము"
7. సారస్వత వ్యాసములు భా. 1 పు. 21
8. లక్షణ శిరోమణి - పీఠిక పు. 55, 62
9. ప్రా. పైం. I-75
10. Gatha, the earliest and most poular metre of prakrit prosody. Bharata in his Natya Shastra gives all details about the constitution of this metre- H. D. Velankar 'Introducation Hemachandra's Chandonusasnam.
11. తె. భా. చం. రీ. పు. 152
12. సమగ్రాంధ్ర సాహిత్యము Vo l. I పు. 36
13. ఈ వివరములు "అప్పకవి చెప్పిన కందభేదములు సమంజసములేన ?" అన్న నా వ్యాసమున విపులముగా వివరింపబడినవి భారతి, అక్టోబర్ 1978
14. అప్పకవి వలెనే గౌరవ లక్షణ దీపికయందు ఆర్యలక్షణములు కందమునకు జోడించినాడు. తిరిగి ఆర్యపేరుగా చెప్పినాడు. లక్షణదీపిక పు. 123.
15. అప్పకవీయము. IV-536
16. కావ్యా చూడా VIII-26
17. అనంతుడు తన ఛందో దర్పణమున ఆర్యాభేదములను కందభిన్నములుగా నిర్దుష్టముగా చెప్పినాడు. ఆర్య లక్షణము సమగ్రముగా నెరుగక దిద్దుబాటు గావింపబడిన అనంతుని ఆర్యలు తిరిగి గిడుగు సీతాపతిగారిచే సంస్కరింపబడినవి. తె ఛం. రీ. 122 పు.

18. ఆర్యాభేదములు "తెలుగులోన జెప్పరంద్రు" అని విన్నకోట పెద్దన మాత్రము కా. చూ. లో చెప్పినాడు. VIII-27
19. ఆం. మ. భా. ఛం. శి. పు. 440
20. ,, ,, పు. 443
21. ప్రాకృత పైంగళమునవిస్తే 30 గురువులు గలదాని నుండి గురువుల సంఖ్య తగ్గించగా యేర్పడు 28 భేదములను స్కంధకమునకు నిరూపించినది. ప్రా. పైం. I-75
22. వృత్తజాతి సముచ్చయ్ I-20, 21
23. లక్షణ శిరోమణి III—293
25. తె. ఛం. రీ - పు. 147-155
24. దాక్షిణాత్య దేశి ఛం. రీతులు. తులనాత్మక పరి. పు. 207
25. ఆం. మ. భా. ఛం. శి. పు. 449
26. అనుశాసనిక పర్వము II-129
27. ఆదిపర్వము III—171



# 2. ద్విపద

తెలుగులోని దేశియ ఛ్ఛందములలో అత్యంత ప్రాచీనమైనది ద్విపద. గేయ సంప్రదాయమునకు చెందినది. ఇతర దేశియ ఛ్ఛందములకు గణముల విషయమున సామ్యము కల్గి వానికి మూలమన దగియున్నది. సులభముగా ఒదుగునదై సూటిగ లయను తెలియ జెప్పనదై ఒప్పునది. చంపూ సంప్రదాయములో నన్నయాదులచే విసర్జితమైననూ, గేయగతి, మనోహరత్వము కారణముగా శివకవులచే ధ్ధరించబడి ఒక సంప్రదాయమునే తెలుగు సాహిత్యములో నెలకొల్పినది. పండితామోదమైన శిష్ట వాఙ్మయమునకు సమాంతర స్రోతస్వినిగా, సర్వజన సులభమైన కావ్యములకు తగు ఛందమై, పఠన పారాయణోద్దేశ్యములైన, భక్తి (మత) కావ్యములకు ఆశ్రయ భూతమైనది.

తెలుగులో అతి ప్రాచీనకాలమునుండియే ద్విపద ప్రయోగములో నున్నదను టకు అద్దంకి శాసనములోని తరువోజయే ప్రమాణము. ద్విపదకు రెట్టింపు తరువోజ. అంతకంటె పూర్వమైన తిప్పలూరు శాసనములో (క్రీ. శ. 5 శ) ద్విపద ఉన్నట్లు దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డి గారు వ్రాసినారు. గేయ వాఙ్మయమీ ఛందములో నుండుట వలన దీని ప్రాచీనత గూర్చి చెప్పవలసిన పనిలేదు. "సరిగ్గా ద్విపద ఏనాడు ప్రారంభమయినదో చెప్పుట కష్టము. జానపదులయందు దీని జన్మ కలదని చెప్పవలయును. అనియత కర్తృకము. అజ్ఞాత కర్తృకము. అనియమవంతము అయిన ఇది పండితులచే సంస్కరింపబడి సాహిత్య ప్రపంచమునకు తీసికొని రాబడి యుండును." అని ఆచార్య బి. రామరాజు గారు అభిప్రాయపడినారు[1]. శాసనము లందు ద్విపదలు ప్రయోగింపబడుట ప్రాఙ్నన్నయ యుగములోని శాసన ఛ్ఛందస్సులో చూపబడినది. నన్నయకు ముందిది ప్రచారములోనున్నను ఆయన మాత్రము తన భారతములో దీనిని ప్రయోగింపలేదు. ద్విపదకు బదులాయన తరువోజను వాడి ఉండెను. 'ప్రాస' 'చతుష్పాద వ్యవస్థ', 'సదృశాక్షరయతినియతి' గల్గిన వృత్త స్వరూపమును ద్విపద కాపాడింపగా సిద్ధమగు తరువోజయే ఆయనకు, ఆయన తర్వాత చంపూ సంప్రదాయములో కావ్యములు వ్రాసిన కవులకు శిరోధార్యమయినది. ద్విపద చంపూ సంప్రదాయములో త్యజింపబడి, కాలాంతరమున తృణీకరింపబడినది. పాల్కు రికి సోముని కవితా విప్లవముతో తిరిగి దేశి ఛ్ఛందమైన ద్విపదకు కావ్య ప్రయోగ గౌరవము కల్గినది. ఒకే ఒక్క ఛందము కావ్యమంతటను ప్రయోగింపబడు గౌర

వము ద్విపదను కల్గినది - ఈతనితో ప్రారంభింపబడిన ఈ ద్విపద సంప్రదాయము తర్వాత తెలుగు సాహిత్యమున బహు విస్తృతమైనది.

దేశి ఛ్ఛందములలో పాదనియతిలేదు. ఉన్నకొద్దీ దేశి ఛ్ఛందములలోను చతుష్పాద వ్యవస్థ మార్గ ఛ్ఛందముల ప్రభావము వలన కలిగినదే. పాదనియతి లేకుండుట వలననే ద్విపద, త్రిపద, చతుష్పద, షట్పది, అష్టపది యన్న పేర్లు కలిగినవి. సర్వ మార్గ ఛ్ఛందములలో చతుష్పాద వ్యవస్థ ఉండగా ఒక ప్రత్యేక ఛందమునకు చతుష్పద యన్న పేరెందులకు? అనగా పాదవ్యవస్థ లేని ఛందములో చతుష్పాదత్వము ఒక విశిష్టమే కనుక అట్టిపేరు సర్వసాధారణ పద్యలక్షణముగా భావింపబడక త్రిపాదాదులవలనే ఒక లక్షణ నామముగా ఉంచబడినది. పాద సంఖ్యను బట్టి పేర్లుంచుటను చూడగా ఇది నిర్ధారితమగును. ఇట్టి పేర్లు అన్వర్థములు.

ద్విపదయన రెండు పాదములని అర్థమైనపుడు ఉపయోగములో రెండే రెండు పాదములు వ్రాయబడవుగదా! పాదసంఖ్య బహుళమైనగాని విషయ సంపన్నము కాదు. జానపదగీతములందును ఇట్లు పాదములు అధిక సంఖ్యతోడనే చెప్పబడును. కవి జనాశ్రయకారుడు ద్విపదకు రెండే పాదములలో (లక్షణము చెప్పి లక్ష్యము ద్విపాద ప్రమాణముగా జూపగా అనంతాదులు నాలుగు, పొత్తపి రమణ కవ్యాదుల పది పాదములు చూపినారు. ద్విపదకావ్యములలో వేలపాదములు చూవట్టును. కావున ఇట్టిచోట్ల ద్విపదయన్న పేరువలన ఫలితమేమన వచ్చును? రెండు పాదముల సమాహారము ద్విపద యైనపుడు ఆ రెండు పాదములు ఒకే ఛందముగా గుర్తింపబడవలయును. ఇట్లు రెండేసి పాదములకు సమాహారము చేయుట సౌష్ఠవము దృష్టితోడనే. అయుక్పాదములకన్న యుక్పాదములే (సరిసంఖ్యలో నున్నవి) విశేషలయా విష్కారకములు. ఇట్లు కలిపి ముడివేయునది ద్వితీయాక్షర ప్రాస. ప్రాసమును బట్టి రెండు పాదములు తెలియనగును. ద్విపదను అధిక పాదములలో పేర్చుకొని పోయినపుడు రెండు పాదముల కొకమారు ప్రాస మార్చుకొనవచ్చును. అట్లు మార్చనిచో ఎన్నిపాదముల వరకు ఒకే ప్రాసాక్షరమున్న అన్ని పాదముల ఛందముగా గుర్తించవలయును. ద్విపదకావ్యములం దిట్టి చోట్లు కలవు. ఉత్పలమాల నాల్గు పాదములదిగా ప్రసిద్ధమయ్యును ఒకే ప్రాస. కల్గి, అనేక పాదములు రాయబడినపుడు [అది చతుష్పాదయుతముగా ప్రసిద్ధమైనను] "ఉత్పల మాలిక" యని సమాహార రూపమున పేర్కొనబడుచున్నది గదా! ప్రాసరహితమైనపుడు ఒక పాదములో మరొక పాదమునకు సంబంధములేక పోవును.

కనుక ఇట్టి ప్రాససహిత (మంజరీ) ద్విపదను లాక్షణీకరించినపుడు పొత్తపి వేంకట రమణ కవి ఏకపద మంజరీ ద్విపద అని పేర్కొనినాడు[2] - పాల్కురికి సోమన ఒక పాదము నుండి వేరొక పాదములోనికి పదోల్లంఘన గావించినాడు. అనగా పాదాంత విచ్ఛేదమును పాటింపలేదు. ఇది కూడా రెండు పాదములను కలిపి ముడివేయును. విషమసీసమున ఉత్సాహమీద గీతి చెప్పినప్పుడు పొత్తపి రమణ కవి ఉత్సాహలోని చతుర్థ పాదాంత పదమును పైగీతిలోనికి చొప్పించి అఖండ పద్యముగా నిల్పే చూపుట గమనార్హము.

ద్విపద ఛ్ఛందముగా దీనిని పర్యాలు పేర్కొనగా విన్నకోట పెద్దన్న మాత్రము "ద్విపది"యని పేర్కొనినాడు[3]. పాల్కురికి సోమన్న దీనిని ద్విపద యనుచు యతి స్థానమున మార్పురాని విధమున స్థిరపరచినాడు.

దప్పకుండగ ద్విపదలు రచియింతు - (పండితా - అవతారిక)

ఈ రెండు పేర్లు సంస్కృత విగ్రంటువులలో అర్థ భేదము కలపని, వైదిక వాఙ్మయమున ఋక్కునకు కర్థమైనపుడు ద్విపదయని, మాత్రా ఛ్ఛందో విశేషమున కర్థమైనపుడు ద్విపదియని భేదమును శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వివరించి నారు[4]. కాని తెలుగులో వీని కర్థభేదము లేదు. పైగా ఈ ద్విపదకు వైదిక ప్రాకృత ఛ్ఛందములందలి ద్విపదికి సంబంధమేమీ లేదు.

ద్విపది యన్నందులకే కాబోలు డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు ద్విపద ప్రాకృతమునుండి వచ్చినదనిరి.[5]

ప్రాకృత 'పి అ ఇ' లక్షణ మిట్లున్నది.

(సా చందలేహియా పో టచ ఉక్కంకోయజత్థ)" అహాపపత పోపంచ టా గురూ తత్థ మజ్ఝతా పఢమ పంచమటా"[6]

సంస్కృతచ్ఛాయా-

(పాచంద్ర లేఖా పటచతుష్కం కశ్చయత్ర) అథ ద్విపదీ

పః పణ్చటాః గురు స్తత్ర మధ్యకో ప్రథమ పఞ్చమ్యా

అథవాద్విపదీ యత్రైజ్ఞః షణ్మాత్రః పఞ్చ ఉత్సాహా వీకోయః

— వృత్త జాతి సముచ్చయ II - 24

6+4+4+4+4+4+2 - గణముల తీరు (మాత్రా సంఖ్యలో) ఇట్లుం డును. మొత్తము పాదమునకు గల మాత్రల సంఖ్య 28. కాని తెలుగులోని ద్విప దకు పాదమునకు 3 ఇంద్ర గణములు, మీద నొక్క సూర్యగణముండును. ఇంద్ర గణములు 5 మాత్రలనే వాడినచో

5+5+5+3 = 18 మాత్రలు (గరిష్ఠ పరిమితి)

4 మాత్రలనే వాడినచో

4+4+4+3=15 మాత్రలు (కనిష్ఠ పరిమితి)

కనుక ప్రాకృత ద్విపదికి తెలుగు ద్విపదితో సంబంధము లేదనవచ్చును. విరదవోలు వారును ఈ అభిప్రాయమును ఖండించుచు ప్రాకృతము నుండి తీసికొన్నచో సంస్కృ తపు పేరు ఎట్లుండుననిరి. అట్లే సంగీత రత్నాకరమున చెప్పబడిన శుద్ధద్విపదికకు నాల్గు పాదములు కలిగి 6 మాత్రల గణము+2వ, 6వ గణములు జగణములు 3, 4, 5, 7, 8 గణములు భగణములు+మీదొక్క గురువుండును[7]. కనుక ఇది యును ద్విపదతో పోలిక లేనిదే. సంగీత రత్నాకర వ్యాఖ్యాతయగు కల్లినాథుడు ద్విపదము, దోధకమని పర్యాయ నామమున్నట్లు ద్విపద లక్షణము "దోధక లక్ష ణంతు భౌ భ గౌగితి" అని 3 భగణములు+2 గురువులుగా పేర్కొనెను. ఇది కొంత వరకు తెలుగు ద్విపదను పోలినను భగణ నియతి తెలుగు లక్షణములో లేదు.

కన్నడము 'మవయి' ఛందమున్నది. కాని అదియును అచ్చముగా ప్రాకృత ములోని 6+4+4+4+4+4+2 గణక్రమము కలిగినదే. అనగా ప్రాకృత 'మ అ ఇ' - కన్నడ మవ ఇ ఒక్కటే. బహుశ ప్రాకృతము నుండియే వచ్చి యుండును[8].

తమిళములోని ఆవహాల్పా ఛందమును గూర్చి చెప్పుచు డా॥ జి. నాగయ్య గారు "సంస్కృత ప్రాకృతి" ద్విపద భేదములు మాత్రమేకాక, కన్నడ, తమిళ చ్ఛందములలోని ద్విపదలనదగినవి కూడా ఏ విధముగను తెలుగు ద్విపదతో జన్య జనక భావమును పొందియుండలేవు. తెలుగు ద్విపద తెలుగు వారిదే. తెలుగు భాషలో పుట్టినదే, తెలుగు జాతికి సహజమైనదే అనుటలో సందేహము లేదు". అని వ్రాసినారు[9].

పాలుకురికి సోమనాథుడు వాడునాటి వరకు ద్విపదకు కావ్యోపయోగము లేదు. ద్విపద ఉపయోగములో నుండినదనుటకు కవి జనాశ్రయము లాక్షణీకరించు

టయే సాక్ష్యము. కనుక సోమన్న తాను కావ్యము వ్రాయుటకు అనువైన ఛందముగా స్వీకరించిన ద్విపదను కావ్య గౌరవము కల్పించుటకు బహుయత్నము చేసిన వాడైనాడు. అతడిట్లు ఉద్యమించుటను చూడ గేయ చ్ఛందమైన ద్విపదనాతడు తెలుగు శిష్ట సాహిత్యములో స్థాపించిన వాడనవచ్చును. "సోమన సృష్టించిన ఛందస్సు" అని నిడుదవోలు వెంకటరావుగారు రాసిన వ్యాసములో ఈ యత్నములు విపులీకరించబడినవి' కాని సోమన సృష్టించినాడనుటకన్న స్థాపించినాడనుట లెస్స!

1) ద్విపదకు లక్షణము చెప్పుటలో పూర్వ లాక్షణికోక్తులను ఉద్ధరించుట.

2) ద్విపద కావ్యము ఐహికాముష్మిక హేతువని వివరించుట.

3) ప్రాసయతి ద్వారా అనుప్రాస సౌందర్యమును తెచ్చుట.

4) పాదాంత యతిలేక చివరి పదము తర్వాతి పాదములోనికి చొచ్చుట వృత్తములలోవలె ప్రాసను రెండు పాదములకు పరిమితము చేయక అధిక పాదములకు ప్రవర్తింపచేయుట ద్వారా వృత్త గౌరవము నిచ్చుట.

5) గణములలో స్వేచ్ఛ జూపి, గమన వైవిధ్యము ద్వారా ఈ ఛందస్సు తక్కిన కావ్యోపయోగి ఛందస్సులతో సరిసమానమైనదని (న్యూనతా భావమును పోగొట్టుటకై భావింపజేయుట (గణమునకో పదము నిర్వహింపకుండుట)

6) ప్రాస లేదా యతియని ఐచ్ఛికత చెప్పుట.

7) యతి విచ్ఛేద రూపమునగాక మార్గ పద్యములందువలె సద్రుశాక్షర నిబద్ధత రూపముగా పెట్టుట.

8) గేయములలో లేని ద్వితీయాక్షర ప్రాస ఇతర పద్యములకువలె నిక్షేపించుట వంటి సోముని స్థాపనా యత్నములను మనము ఆతని పండితారాధ్య చరిత్ర. బసవ పురాణములలో కాంచగలము. ఇంత చేసినను తర్వాతి రంగనాథ రామయణాది ద్విపద కావ్యకర్తలు ఈతనిని స్మరింపనైన స్మరింపరైరి. పైగా "పాల్కురికి సోమ పతితుడీనడుమ ప్రావళ్య" పెట్టి కవిత్వము పాడుచేయుచున్నాడని సమకాలికులు భావించిరి[10]. శిష్ట కవులచే ఇంతకంటె ఎక్కువగా తిట్టబడిన" ఈ ఛందము గేయ (గాన) సాంప్రదాయ దృష్టితో చూచినపుడు అతిమనోహరమైన విశిష్టమైన ఛందస్సే.

పాల్కురికి సోమన "అనియతగణైః" ప్రాసోవా, యతిర్వా" అన్న ప్రమాణోక్తులను ద్విపదను లాక్షణీకరించుటకు ఉద్ధరించినాడు. ఈతడు పేర్కొన్న ఛందస్సూత్రములు ఏ గ్రంథములోనివో తెలియరాదు. ఈతనికి పూర్వమే ద్విపద ప్రయోగములో నుండి లాక్షణీకరింపబడినది. కవిజనాశ్రయము తొట్ట తొలిటి ద్విపదను లాక్షణీకరించిన ఛందశ్శాస్త్రము.

ఇంద్రగణములు మూ - డిన గణంబొకటి

చంద్రాన్య ద్విపదకు - చను జెప్పరేచ'[12] యని 3 ఇంద్రగణములు+1 సూర్య గణము, పదమధ్యయతి, ప్రాసలను గూర్చి స్పష్టముగా చెప్పగా పాల్కురికి తిరిగి ప్రమాణము కొఱకు లాక్షణీకరణ యత్నము ఎందుకు చేయును? అని ప్రశ్నించుకొన్నపుడు సోముడు దాహరించినది జానపద గీతముల లక్షణము కొఱకనియే భావింపవచ్చును. "అనియతగణైః" అన్నపుడు నియతములుకాని గణములెవ్వియన్న ప్రశ్న ఉదయించును. నియతములు కాని గణములచేత అనగా గణనియమము లేనిదని అర్థము. మరి ద్విపదలో 3 ఇం+1 సూ. గణములని నియమమున్నది కదా! మరి వృత్తములలో వలె గణనియమము లేక స్వేచ్ఛగా ఇచ్చవచ్చిన ఇంద్రగణములను వాడుకొనవచ్చునని అర్థము కావచ్చును. లేదా ద్విపద ఛ్ఛందస్సులో నడచు జానపద గీతములను పరిశీలించి వానిలో గణ నిర్బంధము లేక స్వేచ్ఛగా కాల ఖండములుగా విడిపోవుట గమనించి "అనియతగణైః" అన్న ఛందస్సూత్రమును ఉద్ధరించి ఉండవచ్చును. 'ప్రాసోవా' 'యతిర్వా'[13] అనుటను బట్టి ప్రాస లేదా యతి యొక్క ఐచ్ఛిక ప్రయోగము సైతము జానపద గేయములను చూచియే ఉద్భవించి యుండవచ్చును. లాక్షణికులు పేర్కొన్న ద్విపదలో 'ప్రాస లేదా యతి' అన్న నియమము ఉండదు. ఈ రెండును తప్పనిసరిగా ఉండవలసినవే. జాతులలో చేర్చబడిన ఈ ద్విపదకు అవి తప్పనిసరి. ఉప జాతులలోని పద్యముల వలె ప్రాస [ప్రాస యతి] లేదా యతి అన్న ఐచ్ఛిక నియమముండదు. జానపద గేయములలో మాత్రము ఈ నియమము ఐచ్ఛికము. ప్రాస అతి తక్కువ ప్రయోగముండును. ఇతర లాక్షణికులు సమ్మతింపనిది, ఇతర కవులు వాడనిదైన ప్రాసయతిని సైతము సోమన ప్రయోగించుటలో అతడు గేయ వాఙ్మయ సౌందర్యమును దాచి పడబోసిన వాడైనట్లు నిర్ధారింపవచ్చును. గేయ సౌందర్యమును చూచి, ఛందమునకు పట్టము కట్టి, ప్రఖ్యాత పదములాదిగాగల వానిని వివరించి తన కావ్యేతి వృత్తములుగా 'పూర్వ భక్త చరిత్రములు పాట గీతములను' స్వీకరించిన సోముడు

ద్విపద ఛందో స్థాపకుడనుటలో దోషమేమి లేదు. సోమన ఉద్ధరించిన ద్విపద స్వతంత్ర రచయిత ఎవరోగాని గేయ సౌందర్యమును సమగ్రముగా జీర్ణించుకొన్న వారే. ఆ గ్రంథము లభించి యుండిన తెలుగు ఛందో ప్రపంచమున మరియొక క్రొత్త వెలుగు ప్రసరించెడిదే.

## 1) ప్రాసయతి :

ప్రాసయతిని గూర్చి చెప్పుచూ సోమన
"ప్రాసమైనను, యతిపై వడియైన
దేసిగా నిలిపి ఆది ప్రాస నియతి
దప్పకుండగ ద్విపదలు రచియింతు"

యని పండితారాధ్య చరిత్రలో వ్రాసినాడు. ఆది ప్రాసనియతి తప్పకుండ అనుటను బట్టి 'ప్రాసమైనను' అన్నదానికి అర్థము 'ప్రాసయతి' యనియే. యతిపై (విచ్ఛేద రూపయతి స్థలము పిదప) 'ప్రాసమైనను', వడియైనను దేసిగా నిల్పుదునని అనినాడు. యతిపై ప్రాస [ప్రాసయతి] వేసినను వడి (సదృశాక్షర రూపయతి) వేసినను ఈ రెండు తెలుగువారి స్వంతము (దేశి సంపద)గా పాల్కురికి సోమన భావించినాడు. ద్విపదమందే గేయ ఛందమగుట వలన నడక మనోహరముగ నుండును. పైగా పాదమధ్యమున విచ్ఛేదముండును. విచ్ఛేదమునకు పిదప సదృశాక్షరయతియో లేక ప్రాసాక్షరమో ప్రాసయతిగా నిల్పిన మరింత మనోహరమగును. ప్రాసయతి వేసిన చోట తాళము చక్కగా నడచును.

ఉదా : ద్వి॥ నిక్కమై ల్లన వేను
మొక్కవి న్నపము
ముక్కంటి నీకునే
దక్కిన బంట.

సోముడు ప్రాసయతి వేయుటకు ప్రేరణ జానపద గీతములందలి ప్రాసయతి సౌందర్యమే. ఈ క్రింది ప్రసిద్ధములైన జానపద గీతములు ప్రాసయతిని ఐచ్ఛికముగా పాటించినవి. ఇవి ద్విపదలు. పెద్ద అచ్చులో గలవి ప్రాసయతి పాటించినవి.

1. అల్లుడ ల్లాడంచే ఒళ్లుమండేను.
అల్లుడ త్రకు దెచ్చె అద్దాలరైక
ఇప్పుక తొడిగితే నిప్పుల్లు రాలె
మరగేసి తొడిగితే మల్లెల్లు రాలె

—త్రివేణి P. 73

అమ్మకణ్ణి కన్నుల్లు తమ్మిపూ వుల్లు
తమ్మిపు వ్వులలోని కమ్మతే నెల్లు
కిలకిలా నవ్వితే కలువల్లు పూసె
కలువపు వ్వేలేమె కలికిచూ పుల్లు

జానపద గేయ సాహిత్యము, (బి. రా. రా), P. 445

ఇట్టి జానపద గీతములలోని ప్రాస యతి సౌందర్యమును తనకు పూర్వమున్న జానపద గీతములను చూచి పసిగట్టి తన ద్విపదలలో సోముడు నిక్షేపించినాడు -

పరభ క్తి చిరము క్తి కరభ క్తి రతులు
నరచర్మ ధరచర్మ హరధర్మ వరులు
గృతకృత్య హితభృత్య ధృతసత్య రతులు
వ్రతధామ ధృతసీమ జితకామ ముఖులు
హరతంత్ర గురుమంత్ర పరతంత్ర చరులు

—పండితా, చరి. P. 9

ఇట్టి ప్రాస గతులు యతికి మారుగా ఉప జాతులలోవలె సోమన్న ప్రయత్న పూర్వకముగా వాడినాడు. కాని పై ఉదాహరణలోవలె పెక్కు పాదములు ప్రాస జాతి ఘటించుట సోమున కిష్టమైనది కాదు. దాని కొఱకు కవితా ప్రవాహ మాగరాదు. అతని నియమము లన్నియు ఐచ్ఛికములే. యతి ప్రాసలలో సైతమీ స్వేచ్ఛ నాతడు గైకొనినాడు. అవి మరి ముందు వివరింపబడును.

2. నిక్క మెట్లన విను * మొక్క విన్నపము
ముక్కంటి నీకునే * దక్కినబంట

—పండితా. చరి. P. 138

ఇట్లే బసవ పురాణమునందును గలవి ఉదాహరణలు.

1. పర కథా స్తోత్రంబు – పెర పెంగించి
చరితార్థు జేయవే – కరుణతో నను 1. ఆ. P. [illegible]

2. ఆతత సకల పు * రాతన భక్త
గీతార్థ సమితియై * మాతృకగాగ 1. ఆ. P. 9

3. ఇట్టి నెట్టన భక్తి * యిట్టి ముగ్ధత్వ 3. ఆ. P. 144

ప్రాస యతులు జానపద గీతములందు ప్రసక్తమగుటకు కారణము అక్కడ పదములకు పదములే మాటి మాటికి ఆవృత్త మగుచుండుట

1. రాజాధిరాజ ఓ * రాజ మహారాజ —దసరా పద్యములు

2. పిలిపించు నీ సీత * పిలుపు చూతాము

—తెలుగు కన్నడ జాన. గే. P. 156

3. సెలవిచ్చి మాయమ్మ * సెలవిచ్చినాము

—తెలుగు జాన. గే. సాహి. (బి. రా. రా) P. 454

ఇట్టివి యాదృచ్ఛికముగా ప్రాస యతి మరియు యతిని పాటింపజేయును. శిష్ట వాఙ్మయములో పునరావృత్తి దోష భూయిష్టమగు నీ పదావృత్తి జానపద గీతములలో ఒక ఊతగా, ఒక అలంకారముగా వాడబడును.

పండితారాధ్య చరిత్రమున సోమన పద వాఙ్మయమును సంపుటీకరించుచు ఒకే పదము యొక్క ఆవృత్తి వల్ల ప్రాసయతి, ప్రాస, యతి మూడింటిని ప్రయత్న రహితముగా సాధించినాడు.

1) పదములు౯ దుమ్మెద పదముల్ ప్రభాత
పదములు౯ బర్వత పదమూ లానంద
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేసు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
(వర్ణన మణి గణ వర్ణన పదము)

—పండి. వాద ప్రకరణము

ఇందు 'పదము' అన్న పదము పలుమార్లు ఆవృత్తిమైనది. అట్లే ఆఖరు పాదము 'వర్ణన' అన్న పదము ఆవృత్తి యగుట వలన ప్రాస యతి (యతితో బాటు) సాధ్యమైనది. ఇట్లే మరికొన్ని ఉదాహరణలు.

2. (ద్వి) పద హేతువగుట ద్విపద * నాబరగు    పండి-I

3. (వ) మోయని భృంగీశ్వరా * యన మోన

మోయని నంది నా * థాయన మోన    —పాదప్రక

4. కర్తలకు కర్తమ * త్కార్తపై నీవు    —బసవపురా IV ఆ.

5. కులజుండు నతడె య * కులజుండు నతడే    " IV ఆ

6 ఇట్టి ముగ్ధత్వంబు * నిట్టి పేరత్వ    " III ఆ.

ద్విపదలో ద్వితీయాక్షర ప్రాస ఉండగా ప్రాస యతి వేయ వలయునన్నచో రెండు పాదముల ద్విపదలో నాలుగుచోట్ల ఒకే అక్షరమును ప్రాసకొరకు నిక్షేపించవలయును. ప్రాసాక్షరములు రెండు, ప్రాసయతి అక్షరములు రెండు మొత్తము నాలుగు. ప్రాసాక్షరమే రచనలో శ్రమసాధకము కాగా మొత్తము నాల్గుచోట్ల ప్రాసము అనేక ద్విపదలు అల్లుట మరింత క్లేశకరము. తెలుగు ఛందస్సులలో ప్రాస ఉన్నచోట్ల ప్రాసయతి లేకుండుట (జాతులు) ప్రాసయతి ఉన్నచోట ప్రాస (ఉపజాతి) లేకుండుట యుండలేదే. అందుకే పాల్కురికి సోమనాథుడు సైతము ప్రాసయతిని విధిగా పాటించలేదు. క్వాచిత్క ప్రయోగమే గావించెను. లాక్షణికులు సైతము ప్రాసయతిని చెప్పరైరి. సోమన తర్వాత పలువురు ద్విపద కావ్యకర్తలు ఈ ప్రాసయతిని పాటింపరైరి.

'అష్ట మహిషీ కళ్యాణము' వ్రాసి "చిన్నన్న ద్విపద కెరగును" అని ప్రఖ్యాతి గాంచిన తాళ్ళపాక చిన్నన్న తన కావ్యమునందు పాల్కురికి సోమన్న వలెనే ద్విపదకు లక్షణము చెప్పుచు

ద్విపదకు ద్విపదకు దెగ జెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితర భాషలను
యతుల లోపల 'బ్రాస యతి దక్క సకల
యతులు జెల్లును' బ్రయోగాతి సారమున
ద్విపదతో ద్విపద సంధిలనేక శబ్ది
మపుడు రెంటను గూర్పనది యయుక్తంబు[14]

అని ప్రాస సరిని ద్విపదలో ప్రయోగించుటను ప్రతిఘటించెను. సోమన్న పద్ధతిలోనే బమ్మ సిద్ధకవి ప్రాసయతిని అంగీకరించినాడు. అతడు సోమన్న చెప్పినటు లనే పాటించుచున్నట్లు అతనిపై గల భక్తితో ప్రకటించినాడు.

ఇల బాల కురికి సోమేశుండు మున్ను
కొలగక ప్రాస యతుల్ ద్విపదలను
లలి రచియించుట యది లక్ష్యంబుగాను
.... .... .... ....
ఆ పాల్కురికి సోమ నసుమతి సేను
సీపిత ప్రాస యతి చ్ఛంద సరణి
నా మహా గురుదేవు ననుమతి యట్ల
శ్రీ మెరయగ రచించితినిట్లు

—"మటి బసవ పురాణము" అవతారిక[15]-2

సోముని వలెనే స్వాచిత్యముగా నైనను కష్టము ప్రాసయతిని వాడినవి కొలది ఉదాహరణములున్నవి - (A) ద్విపద భారతములోని

1. అనయంబు నైవ దూషణమాని (ఆది-34)
2. అని యింద్రుడుర్వి కేగి – ననుపర్వాను (ఆది-37)
3. ఒలసి దిక్కులనున్న – బలములనెల్ల (కర్ణ-16)

(B) నవనాథ చరిత్రములో

4. తిరుమణి వాచక – తీర్చి చేమంతి
విరుల రేఖలను జం - టాడు పెంద్రుకలను (36 P)
5. పన్నపు గటి మీద - జెన్నొందు వాని (42 P)[16]

జానపద గీతములందు లేని ప్రాసము ద్విపద కావ్యములందుండుటకు కారణము శిష్ట సాహిత్య ప్రభావమే. ఇట్టి ప్రాసనియమను పాల్కురికి సోమనాథుడు తన కావ్యములందు అశ్రద్ధగా పాటించినాడు సోముని ద్విపదలకు జానపద గీతములే ప్రేరణములనుటకు ఇదియొక ప్రబల కారణము. అతడు వానిని కావ్యోపయోగిగా ప్రతిష్ఠాపించుటలో ప్రాస వాడినాడేతప్ప అతనికి వానిపై ఆస్థ లేదనుటకు ఈ క్రిందివి ఉదాహరణీయము లగు (ద్వితీయాక్షర) ప్రాసములు.

1. మధ్యాహ్న మాటయు సూరయ్య లింగ
తద్ధ్యాన సుఖ నిరంతర వర్తియగుచు (బసవ - 357)
2. ము క్రొత్త ప్రాణలింగ ప్రసాదంబు
సుప్రసన్నత జంగమ ప్రసాదంబు
3. మర్త్య లోకమునకు మరివేరె యొకడు
కర్త యున్నాడె లోకత్రయ వరద (బసవ - 27)
4. బుజ్జగించుచు పెద్ద బుద్ధును బెట్టు
నిర్జీవి క్రియబడు నివ్వెఱగందు (బసవ - 163)[17]

ఇట్టివానిలో సంయుక్తాక్షర ప్రాస నియమముల్లంఘించ బడెనని. ధ్వని సామ్యమున్న చాలునని సోముడు భావించి యుండవచ్చును.

## 2) యతి :

ద్విపదలో యతి స్థానము 2 గణముల పిదప, అనగా పాద మధ్యమునన్న మాట. చాలా ఛందములకు పాద మధ్యమున యతి ఉండి పాదము సమద్విఖండన మగును. జానపద గీతము లందిట్టి యతి శ్రావ్యతా పాదకమై ఉండును. పాదము మధ్యలో విరిగినపుడు, రెండు ఖండములు తుల్యము లగుటచే లయ సాధ్యమగును. జానపద గీతముల నుండి పుట్టిన ద్విపద కైతమిట్టి యతి కల్గియున్నది. కాని జానపద గీతములందు యతి నియతముగా సదృశాక్షర సంబద్ధ రూపముగాక విచ్ఛేద రూపమున ఉండును. అనగా రెండు గణముల తర్వాత విరుగును. తెలుగులో ఛందో లాక్షణికులు ఇట్టి వానికి 3వ గణము ప్రారంభాక్షరమునకు ముడిపెట్టినారు. అట్లయినప్పటికి 2 గణముల పిదప విరుపుగల్గి 3వ గణము మొదటి అక్షరము వేరొక్క కొత్త పదముతో ప్రారంభము కావలయును లేనిచో శ్రుతి సుభగరూప యతి సాధ్యము కాదు.

1. అల్లుడ, ల్లాడంటే - ఒళ్ళు మండేను
2. దసరాకు వస్తిమని - విస విసలు పడక
బహుమానములనిచ్చి - పంపండి వేగ

కవి జనాశ్రయకారుడు దీనిని పాటించినాడు.

ఇంద్ర గణములు మూడిన గణం, బొకటి
చంద్రాస్య ద్విపదకు చను జెప్పరేచ

మూడు+ఇన = సంధివశమున పద సమాప్తి యగును పద విచ్ఛేదమైనట్లే. పాల్కురికి సోమనాథుడు, తద్వాతి కవులు ఈ నియమమును చక్కగా పాటించి విచ్ఛేదరూప సౌందర్యమును ద్విపద కలంకరించినారు. శిష్ట వాఙ్మయములోని మార్గ వృత్తములందు, జాతి పద్యములందు విచ్ఛేదభావయతిని పాటింపని కవులు సైతము ద్విపదలో పాటింపుట గమనార్హము. లాక్షణికులు మాత్రము ఈ నియమమును పాటింపరైరి. చిన్నకోట పెద్దన్న - పొత్తపి రమణకవి మున్నగువారు ఈ నియమమును పాటింపని వారు.

ద్విపదలో పాదాంత (విచ్ఛేదరూప) యతి సైతము అవశ్యకము. పాదాంత విచ్ఛేదము పాద ప్రమాణమును నిర్ధారించి లయను త్యజింపను. ద్విపదలో దీని యొక్క ప్రాముఖ్యమును కవులు లాక్షణికులును గుర్తించినారు. కవిజనాశ్రయకారుడు చెప్పకున్నను ఆచరించి చూపినాడు. పాల్కురికి సోమనాథుడు అధికాంశభాగము ఇట్లే పాదాంత విశ్రాంతి పాటించినను కొన్నిచోట్ల పాదోల్లంఘనము గావించియే యున్నాడు. పాదాంత యతిని సోము డుల్లంఘించిన చోట్ల పరిశీలించగా వివిధాగమ, పురాణేతిహాసోక్తులు యథాతథముగా సంస్కృత రూపములో చెప్పుటచే సాధ్యపడలే దనిపించును. "ద్విపద కొలది పలుకుట మది మెచ్చ" (ద్విపద కొలతలో చెప్పుటనే విశేషముగ భావించ) వలయునని అతని అభ్యర్థనము. మంజరీ ద్విపదను మాత్రము లాక్షణీకరించుచు పాదమునకు పాదమునకు మధ్యతెగ చెప్పుటకు, లాక్షణికులు నిర్దేశించిరి[18] – మంజరీ ద్విపదయైనను, ద్విపదయైనను జానపదగీతములందుండి పుట్టినదే యైనను మంజరీ ద్విపదను గేయ ఛందస్సుగా గుర్తించి పాదాంత విచ్ఛేదము, ప్రాస రాహిత్యమును విధించి, ద్విపదకీ రెండు విధించక దీనిని తక్కిన పద్యములలో జేర్చుట విశేషము. ప్రాసయొక్కటి తక్క ఈ రెండు సర్వవిధముల ఒకే ఛందము కదా! సోముడు ద్వితీయాక్షర ప్రాసఘటనములో ఈ పాదాంత విశ్రాంతిని ఉల్లంఘించి పాదోల్లంఘనము గావించి యుండవచ్చును. ఇక ఈ ఉల్లంఘనము అనగా ఒక పాదములోని పదము మరొక్క పాదములోనికి చొచ్చుట యున్నది, కనీసము రెండు పాదములకైననూ ఘటింపకుండుట లెస్స. పాదమునకు రెట్టింపు కాలప్రమాణమైనను, పునరావృత్తి యందులో అనగా - ఒక ద్విపదకు, మరొక్క ద్విపదకు-, లయ ఘటింప బడును.

తాళ్ళపాక చిన్నన్న దీనిని

"ద్విపదకు ద్విపదకు — తెగ జెప్పవలయు...."
ద్విపదకో ద్విపద సంధిల, నేకశబ్ద
మపుడు రెంటను గూర్చునది యయుక్తం"బు

అని చక్కగా రెండు పాదముల కొకమారు విచ్ఛేదనము (పద సమాప్తి) గావించి, తర్వాతి పాదము అనగా తర్వాతి ద్విపదను కొత్త పదముతో ప్రారంభించ వలయుననె, ఏకశబ్దము రెండు ద్విపదలను సంధించునది వాడరాదని, అయుక్తమని చక్కగా చెప్పినాడు జయకీర్తి తన ఛందోఽనుశాసనములో చెప్పినట్లుగా

పాదాంతే సూచిత స్థానే

యుక్పాదాంతే విశేషతః (1-10) యతి కనిసము యుక్పాదాంతము (సరిపాదము చివర) న యున్నను విశేష విధి యగును. ఈ జయకీర్తిచేసిన నియమము ద్విపదకు చక్కగా అతికినది. కాల ఖండము ఎంత తక్కువైనచో అంత సులభముగా పఠితకు విశ్రాంతి లభించుటయేగాక స్వల్ప పరిధిలో పునరావృత్తమగు ఈ కాల ఖండము ఝటితి లయావిర్భావము గావించును ద్విపదలో 2 గణముల పిదప యతి ఉన్న రెండు గణముల కొక్కమారు ఆవృత్తియగు కాల ప్రమాణము లయను చక్కగా తెలియ జెప్పును.

అమ్మణ్ణి కన్నుల్లు 2 గణములు
తమ్మి పువ్వుల్లు ,,
తమ్మి పువ్వుల్లి ,,
కమ్మ తేనెల్లు ,, అన్న రీతి నడచును.

రెండు గణముల పిదప విశ్రాంతి పాటింపక పాదాంతమున విచ్ఛేదము పాటించిన ఈ కాల ఖండము 4 గణముల కొకమారు ఆవృత్తియై లయా విర్భావమునకు సమయము హెచ్చును. 2 గణములవలె త్వరగా స్ఫురింపదు.

వరభుక్తి చిరముక్తి కరభక్తి రతులు — 4 గణములు
నరచర్మ ధరకర్మ హరధర్మ వరులు ,,

ఇక రెండు పాదములకు చెప్పవలసిన పని లేదు. ఒక ద్విపదకు మరియొక ద్విపదకు నడుమ విశ్రాంతి యున్నపుడు కాలఖండము యొక్క ప్రమాణము 8 గణములై లయ స్ఫురణము జరుగదు. 2 ద్విపదల కాల ప్రమాణము తరువోజ ఒక పాదముతో సమానము. 3 ఇం+1సూ+3 ఇం+1సూ. గణములున్న తరువోజయగును, అట్టి తరువోజలో నైతము యతిరూపమున పాదము నాల్గుఖండములుగా విభజితమగు నన్నచో ద్విపదకు ద్విపదకు తెగ జెప్పగా లయ యేమీ లేదు. తాళ్ళపాక చిన్నన్న ఇట్లు చెప్పినాడన్నచో లయదృష్టితో గాక, రెండు పాదముల ద్విపదకు అస్తిత్వము

కల్పించుటకై చెప్పియుండవచ్చును. లేనిచో పాదోల్లంఘనము ద్వారా రెండు ద్విపదలు అతికి చతుష్పాద వ్యవస్థకు దారితీసి, ద్విపదయొక్క అస్తిత్వము పోవునని అతడు భావించి యుండవచ్చును. "ఎచ్చట కచ్చట తెగిపోవు ద్విపదలందు నిబంధించ బడిన మహావాక్యము సిద్ధింపదు" అని పాటిబండ మాధవశర్మగారు దీనిని సమర్థించిరిగాని, గేయ చ్ఛందమునందు గేయాత్మకత దీనివలన లోపించును.

పాదాంతయతి భంగతకు - పాదోల్లంఘనకు పాల్కురికి సోమనాథుని ఉదాహరణలు.

1. "వ్రాయంగ బ్రహ్మేశ్వరాయనమోన -
మో యనె...." పండి. చ. వాద ప్ర. P. 696

2. "....ఐహికాముష్మిక ద్వి
పదహేతువగుట ద్విపద నా బరగు" పండి. చ. అవతారిక P. 22

ద్విపదకు ద్విపదకు తెగ జెప్పక రెండు ద్విపదలకైక్యత ఘటించిన ఉదాహరణము.

దాన 'ప్పాతం భక్షిత' మనం 'బ్రియంబ -
- కేన భక్షిత' మనం గ్రియ బ్రసాదంబ -
- నంగ 'నశ్నియా' తనగ దత్ప్రసాద
మంగీకరింపగ నర్హమైయుండు. పండి. చ, దీక్షా. ప్రక. P. 95

కాని యిట్టి ప్రయోగములు క్వాచిత్కములే. అధికాంశ పాదములు చక్కగా పాదాంత విచ్ఛేదములై యొప్పుచున్నవి పాల్కురికి సోమనాథుని తర్వాతి కవులు (లాక్షణికు లీ విషయమున నిర్లక్ష్యము చేసినను) సోమనాథుని మార్గము ననుసరింపక విచ్ఛేదమునే పాటించిరి.

## 5) గణములు :

ద్విపదకు వాడబడు గణములు సూర్యేంద్ర గణములు. ఇంద్రగణములు 3, సూర్యగణము 1, కాగా అనంతునకు పూర్వము తెలుగులోని సూర్యేంద్ర గణములు అక్షరజాతి గణములన్న పేరిట మొదటి రెండు పదలక ప్రస్తార లబ్ధము లన్నియు స్వీకరించుట ఇదివరకే పరిశీలించబడినది. పాల్కురికి సోమనాథుడు ద్విపద

కావ్య నిర్మాతలలో అనంతునికి పూర్వుడు కాన అతని ద్విపదలలో సూర్య గణములు హ, నలే కాక, గగయు, ఇంద్రగణములలో నల, నగ, సల, భ, ర, తలే గాక మ, సగ గణములు వాడబడినవి.

'గగ' ఉపయోగమునకు

UU

1. పాయక ప్రతి రసాన్ప్రక్తస్య జిహ్వా
గ్రేయని మే ప్రోష్ఠ.... బసవ. 5 ఆ. పుట 19

UU

2. ప్రేమం పెలర్పగ భృత్యాపరాధ
స్వా.... బసవ. 4 ఆ. పుట 247

'సగ' ఉపయోగమునకు

IIUU

1. అంధక కరిదైత్య వ్యాఘ్రలాలాజ - బసవ 6 ఆ. పుట 483.
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్ర గ్రంథమాల ప్రచురిత బసవ పురాణమున శ్రీ బండారు తమ్మయ్యగారు వావిళ్ళ ప్రచురిత బసవ పురాణమున వీనిని పరిష్కరింప యత్నించిరి. కాని అక్కరజాతి గణములలో సూర్యగణములో గగ, ఇంద్రగణములలో సగ వుండుటచే సోముడు వీనిని వాడినట్లు భావింపవలయును. అంతే గాక గేయ ఛందములలో పాదాంత దీర్ఘము సర్వసామాన్యము. హ గణమును పాదాంత దీర్ఘముగా పాడిన అది 'గగ' గణమగును. ద్విపదయందు ఈ గణములు మాత్రమే కాక చంద్ర గణములు కూడా ఉపయోగములో నున్నట్లు తర్వాతి ద్విపద కావ్యములలో సంతరింపబడినవి[19].

ద్విపద భారతములోని ఈ క్రింది ప్రయోగములు.

1. భూధరేంద్రము బడ బుడరవము తోడ (43P) - నలల గణము.
2. పతులద్వీప జయంతి పట్టణాధిపుల (57P) - సగ "
3. ఆరయ మాకుగురు జాంబోధులార - భల "
4. కడుమరుగు నట్టి గంగా ప్రవాహంబు (430P) నలల "

విశేషముగా కానవచ్చును. ఇవి శిష్టసాహిత్య దృష్టితో విలక్షణ ప్రయోగములే యైనను గేయ ఛందము లందివి పరిశీలించిన సామాన్యములని తోచగలవు - జానపద గీతములలో కవి గణములను బట్టిగాక మాత్రా సమత గల కాల ఖండము లను బట్టి పాదమును కొలచుకొనుచు పదారోపము చేయును. ఆ పదములు సూర్యేంద్ర చంద్ర గణములా ? కావా ? యన్న పద్ధతిలో ఆలోచించుటయన్నది ఉండదు. ద్విపద 5 మాత్రలలో నడచును అనుకొన్నప్పుడు 5 మాత్రల గణము నకు సరిపడునట్లు పదములు పేర్చుచేగాని ఇది నగ గణమా ? సల గణమా ? నలల గణమా యన్నది యాలోచింపడు. ఆ దృష్టితోడనే పైప్రయోగములలో గణ వైవిధ్య మేర్పడియుండును. ఈ క్రింది జానపద గీతములను పరిశీలింతము.

| | | | |
|---|---|---|---|
| సల | త | నగ | |
| పిలిపించు | సీసీత | పిలుపుచూ | తాము |
| సల | త | నలల | |
| పిలుపేమి | సూసేవు | చిలుక పలు | కుల్లు |

—తెలుగు కన్నడ జా. గే. P 156

ఇందు 5+5+5+3 మాత్రలుగా నడక కన్పట్టుచున్నది. మొదటి మూడు గణములు 5 మాత్రలవి. ఖండగతిలో నడచుటకు పలయు కాల సంపుటులతో జానపద కవి ఆలోచించును. అందువలన రెండవ పాదములోని 3 వ గణము 'నలల' పడినది. ఇది పంచమాత్రా గణమే. కాని శిష్టవాఙ్మయములోని ఇంద్రగణముల జాబితాలో చేరలేదు. పైగా చంద్రగణమైనది శిష్టకవి లేదా లాక్షణికుని దృష్టిలోని కృతక గణములైన సూర్యేంద్ర చంద్రగణములలో చూచిన గణభంగ దోషమే కాని మాత్రా సమగణ దృష్టితో గేయముగా పరిశీలించినపుడు నలల=5 మాత్రలు సరియైనదే - అంతేకాదు - ఒక్కొక్క తూరి మాత్రలధికమైన పదములు పెట్టవలసివచ్చిన వాటిని పఠనావసరమున లఘూకరించి కూడా చదువుట జరుగును. ఈ క్రింది జానపద గీతము పరిశీలింతము.

మదజనక, మన్మోహ, మత్స్యావ, తార
గురుతుగా, కృపజూడు, కూర్మావ, తార
.... .... ....
పక్షమున సిరిగల్ల వామనావతార - శ్రీలపాటలు. తెలు. కన్న జానగే 163

ఇందు 3వ పాదములోని 3వ గణము 'వామనావ' రల గణము. శిష్టదృష్టిలో చంద్రగణము. కాని ద్విపదయందు వాడబడినది. మాత్రలు 6. ఇచ్చట ఖండగతిలో నడచుచు 5 మాత్రల గణము వాడవలసియుండగా 6 మాత్రలు పడినవి. రల గణము ద్విపదలో లేకున్ననూ వాడుటకు కారణమేమి ? వరుసగా అవతారములలో వామనావతారము వచ్చినది. ఆ శబ్దము వాడి తీరవలయును. గణభంగ దృష్టి అక్కఱ ఉండదు. ఆ పదము వాడుచు 5 మాత్రలలో కుదించగలుటకు గాయకునకు విడుమను గాయకుడు గావిని

పక్షమున సిరిగల్లు   వామనవ తార
వామావ తార
వమనావతార

అని తోచిన విధముగా అక్షరములు మార్చును. లేదా 'వామనావ'ను 5 మాత్రలలోనే వేగముగా చదువుటలో కుదించును. ఇట్టి చోట్ల చంద్ర గణము ఉంచుటలో అభ్యంతరమేమియు నుండదు. కనుక ద్విపద భారతమువంటి కృతులలోని పై గణ ప్రయోగములు ద్విపద ఛందమును (గణ) భంగపరచునవి గాక గేయ ఛందో దృష్టితో వ్రాసినవని భావింపవచ్చును. అట్లే

ఆజానంత దనప సత్యాలోకమునకు
నకుల సహదేవ నామ నాయకులు – ద్విపద భారతము.

వంటి ప్రయోగములు పదము మార్చును సూచించుటను బట్టి చూడగా ఈ ద్విపద కవులు గేయములను బట్టియే ద్విపదను రచించిరనిచెప్పవచ్చును[20].

పన్నెండు స్తంభాల పందిరి కింద - అని గేయమును చదువుచున్నప్పుడు 'పందిరి' అన్నచోట 'పందిరీ' అని దీర్ఘీకరించి చదువును. అపుడు మాత్రలు నిండి నడక చక్కగా నడుచును. ఇట్టి జానపద గేయ ధోరణులు గాన విధిలో సామాన్యములే జానపదగేయపు నడకనుండి ద్విపద పుట్టినదనుటకు పై విధానము, లభ్యమాన జానపద గీతములును సాక్ష్యములు.

ద్విపద గణములలో   ఇంద్రగణములు, ఒక సూర్యగణముండుటలో గల రహస్యమేమనగా

పన్నెండూ స్తంభాల పందిరీ కిందా అ
5   5   5   5

అన్న రీతిలో గీతమును చదువునపుడు ఈ గీతము నాల్గు పంచ మాత్రికా

గణములుగా విడిపోవును. కాని లేఖన క్రమములో ఇది-"పన్నెండు స్తంభాల పందిరి కింద" - అని వ్రాయబడి త, త, భ అను ఇంద్ర గణములు కూడను, కింద యన్న హ గణము సూర్య గణము ఒకటియని గణ దృష్టితో రాయబడును. మొదటి రెండు పదములు పంచ మాత్రికములు కాగా 'పందిరి' మాత్రము చాతుర్మాత్రికము. కనుక జానపదగాయకుడు దానిని మరొక్క మాత్ర చేర్చి 5 మాత్రల కాల సంపుటిగా ఉచ్చరించును. అప్పుడది "పండిరీ (రగణము) అనియో

పంఁదీరి (తగణము) ,,
పనిదిరీ (నగ) ,,
పనిదీరి (నల) ,,

అన్నవిధముగానో సాగదీయబడును. అర్థము వికృతము కానంత వరకు ఇట్లు ఎటులైనను సాగదీయబడుగా ఛందో దృష్టిలో ర, త, న, గ, నల ఏవైనా కావచ్చును. ఇవన్నియు ఒక గుంపుగా ఇంద్రగణములుగా గుర్తింపబడినవి. గణము లిట్లే యేర్పడుటను గణ ప్రకరణమున వివరించుట జరిగినది. పై దానిని బట్టి ఇంద్ర గణములలో నల, భగణములు 4 మాత్రలు గలవైనను 5 మాత్రల క్రిందికే లెక్కింపబడును. గేయ ఛ్ఛందములందీ నియమము నియతమై ఉండును. అందు లకే ప్రాకృత ఛ్ఛందములు మాత్రాగణములను తెలుగులో వలె సూర్యేంద్ర చంద్ర గణములుగా గాక ద్విమాత్రా, త్రిమాత్రా, చతుర్మాత్రా అన్నరీతిలో చూపినవి. పై పాదమున ఆఖరు త్రిమాత్రిక సూర్యగణము సైతము సమానకాల ఖండముగ నింప బడుటకు 2 మాత్రల కాలము అధికముగా సాగదీయబడును. తెలుగులోని దేశి పద్యములు పెక్కులు సూర్య గణాంతములగుటలోని రహస్యమిదియే. ఇట్లు గీతము లేఖనమున వ్యాకరణ విరుద్ధ రూపములతో గాక సలక్షణముగా [లేక వ్యవహార ప్రమాణముగా అనగా 'పందిరి' 'క్రింద' అన్న విధముగా] వ్రాయబడి ఇట్టి కృతక దేశ్య గణ వ్యవస్థకు దారితీసినది. నాల్గు గణముల పాదములో 2 గణములకొక్క భాగముగా యతి కుదిరిపోవును. యతిపూర్వ భాగము యత్యుత్తర భాగముతో సమా నము. అనగా గేయ ఛ్ఛందములలో యతి సమద్విఖండన రూపము. ఇది పలుదేశ్య ఛ్ఛందములలో ఉండుటవలన సమద్విఖండన యతి దేశియ ఛ్ఛందో లక్షణముగా భావింపబడినది. అది విచ్ఛేద రూపమైనపుడే లయావిష్కృత మగును - కాక సదృ శాక్షర రూపయతితో - పదోల్లంఘన జరిగి రెండర్థములు అతికిన లయచెరిగిపోవును. పెక్కుదేశ్య ఛ్ఛందములను తెలుగు కవులు ప్రయోగించునపుడు లిఖిత (కావ్య) సాహిత్యమున విచ్ఛేద రూపయతిని నిర్లక్ష్యము చేయుటయు, పఠన సంప్రదాయము

గల (శతకాది) చోట్ల పాటింపబడుటయు కానవచ్చుచున్నది. నిర్లక్ష్యము చేయుటలో మార్గ వృత్త ప్రభావమున్నను పెక్కు దేశ్య ఛందములు దీని నుండి రక్షింపబడి హృదయాకర్షకములై లయను సాధింపగల్గినవి.

ద్విపదగేయ ఛందమనుట సర్వ సమ్మతమైన విషయము. ప్రాచీన కవులు లాక్షణికులు నైతము ఈ యభిప్రాయమును వ్యక్తము చేసిరి. పాల్కురికి సోమనాథుడు గేయ ఛందమగుట చేతనే దీనిని స్వీకరించెను. "ద్విపద కావ్యము విన వింపగ" నని కవి చింతామణిలో వెల్లంకి తాతంభట్టు (భాషా లక్షణాధికారము-17 వద్యం) పేర్కొనెను. "యతినాదం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె సోత్కృతి" అని క్రీడాభిరామములో వీరగాథా గీతములు ప్రసక్తము చేయబడినది. పిన్నపోటు పెద్దన్న దంపుడు పాటగా ద్విపద రెట్టింపైన తరువోజను "తలకొని తగ బ్రాలు దంపెడిచోట - దరుణులవే సొంపు దనరు దరోజ" - అని కావ్యాలంకార చూడామణిలో (VIII-50) దంపుడు పాటగా పేర్కొనినారు. చెంగల్వకాళ కవి రాజగోపాల విలాసమున (1-21-4)

వీణ వాయించెను కోణాధరి యొకర్తు
కిన్నెర బరకించె కన్నె యొకతె
చపలలోచన యొర్తు 'ద్విపదలు చదివెను'
తత్ప్రసంగము చేసె తరుణియొర్తు - అని
పాటగా పేర్కొనినాడు.

'రాగ గరిమ లెరిగి రహి మీఱు పదములు
పాడనేర్తు ద్విపద పద్య ఘటితి' అని బెణకకవి పేర్కొనినాడు.
(చాటుపద్య మణిమంజరి II 125 P)

నడకలో, గణములతో, పాదమధ్య యతిలో ఇది జానపద గీత లక్షణముల నింకను ఎట్లు వ్యక్తించుచున్నదో పరిశీలించబడినది. ద్విపద పాడబడు విధానము కావ్య ఛందమైన పిదప కొంత లోపించిన దనవచ్చును. పెక్కు జానపదగీతములు పరిశీలనలో ద్విపదలుగా గోచరములై వానిగేయ విధానమును నేటికి తెలియబర్చ జాలియున్నది. 5 మాత్రల గణములు నాలుగింటగా ద్విపద పాడబడును. అనగా ద్విపద ఖండగతిలో నడచును. కొన్ని జానపదగీతములు ఇచ్చట ద్విపద నడకగలవి ఈయబడుచున్నవి. ప్రసిద్ధమైన దసరా పద్యము "రాజాధిరాజ" ద్విపద ఛందములో నున్నది.

"రాధిరాజ! ఓ రాజ మహారాజ" ఇది గేయముగా పాడబడునపుడు

రాజాధి, రాజ ఓ, రాజ మహా, రాజా ఆ - అని పాడబడుట గమనింపనగును.
 5 5 5 5

పల్నాటి వీరచరిత్రం అంతా ఇదే గతిలో నడుచును. ఇందులో ప్రాస మాత్రము ఉండదు.

పాదము ఒక్కొక్కటి వేరువేరుగా విరుగును. పాదమధ్యమున వేరొక్క విరుపు. అది జానపద గేయముల యతి. ఈ లక్షణము పట్టినచోట్ల సోమనాథాదుల కావ్యములు సైతము ఇట్లే పఠించవచ్చును. 4 మాత్రల ఇంద్రగణము పడినచోట ఒక మాత్ర సాగతీత, చివరి సూర్యగణము రెండు మాత్రల అధికముగా సాగతీత- ద్విపద పాదములో పాటించ వలయును. ఉదాహరణమునకు —

1. తొలికోడి కనువిచ్చి * నిలిచిమై వంచి
జలజల రెక్కలు * సడలించి నీల్గి (బసవ పురాణము)
దీనిని గేయ ఛ్ఛందముగా
తొలికోడి కనువిచ్చి * నిలిచిమై వంచిఇ
జలజలా రెక్కలా * సడలించి నీల్గిఇ అని చదపవలెను.

2. చెన్నకేశవ పాద * సేవా రతుండ
వలను భారద్వాజ * వంశవర్ధనుడ
కవి సార్వభౌముడ * ఘనత గన్నట్టి
శ్రీనాథుడను వాడ * శివభక్తి పరుడ (పల్నాటి వీరచరిత్రము)
చెన్నకే శవపాద * సేవార తుండాఅ
వలనుభా రద్వాజ * వంశవా ర్ధనుడాఅ
కవిసార్వ భౌముడా * ఘనతగా న్నట్టిఇ
శ్రీనాథు డనువాడ * శివభక్తి పరుడాఅ - అని చదువవలెను.

కొన్ని ప్రసిద్ధ జానపద గీతములు గేయగతిలో (లిఖిత సాంప్రదాయములో పడె గాక) ఇచ్చట వ్రాయబడు చున్నవి.

1. రాజాధి రాజవో * రాజమా రాజా
రాజతీ జోతతీ * రాజసౌం దర్యా(రాజతేజోన్నత రాజ సౌందర్య)
బంగారు కలంవారి * పైడిగొలు సూలా

దిట్టముగ వకచేత * దస్తురం బాట్టీ (దస్త్రం పట్టి)
పట్టిగా చేరిలో * పరలగూ ర్చుండీ(పట్టి, కచేరిలో)
సాహేబు మేర్బాను * సాలాము యనగా
(సాహెబ్, మెహర్బాన్, సలాం)

పటాపటా కాయితం * బాగుగా పట్టి
బాగైన మీచేతి * బంగారు కలమూ[21]

2. మా యత్త మామామ ఊరేగు తుంటే
చుట్టపీ కలురెండు చూడొచ్చి నాయీ
మట్టిగిడ నలురెండు మాట్లాడి నాయీ
కందిరీ గయిపచ్చి కతనడిపి నాయీ[22]

3. అల్లుడ ల్లాడంటే ఒప్పమం దేనూ
అల్లుడ తకుపెచ్చె అద్దాల రైకా
ఇప్పుచా తొడిగితే నిప్పల్లు రాలే
మరగేసి తొడిగితే మల్లెల్లు రాలే[23]

4. మానన్న గానైతి మంచెపే తూరా
చెట్టన్న గానైతి చెలగివే తూరూ[24]

5. మహజనక మమ్మేలు మత్స్యావ తారా
గురుతుగా కృపజూడు కూర్మావ తారా[25]

లిఖిత సాంప్రదాయములో వ్రాయబడుచున్న మరికొన్ని జానపద గీతములు ద్విపద చ్ఛందములో నడచిన విట చూపబడుచున్నవి.

1. అమ్మణ్ణి కన్నుల్లు తమ్మిపు వుల్లు
తమ్మిపు వ్వులలోని కమ్మ తేనెల్లు
కిలకిల నవ్వితే కలువపల్లు పూసె
కలువపు ష్వాలేమొ కలికిచూ పుల్లు[26]

2. పిలిపించి నీసీత పలుపుచూ తాము
పిలుపేమి చూపేపు చిలుకపలు కుల్లు
పిలిపించు నీసీత నడకచూ తాము
నడకేమి చూపేపు అంసనడ కల్లు[27]

3. పచ్చాందు స్తంభాల పందిరి కింద
పత్తివి త్తుల గుమ్మి మెత్తైన వేసి
గోవుపెం డదెచ్చి గోపెమ్మ కలిపి
అవుపెం డదెచ్చి అలుకైన జల్లి[28]

4. సెలలిచ్చి మాయమ్మ సెలవిచ్చి నాము
చెలగిమీ యత్తింటి బుద్ధిగలి గుందు
ఎవ్వరే మాడిన ఎపరాడ కమ్మ
.... ... .... ....
పరమాత్మ తోగూడి వెలుగుమా యమ్మా[29]

5. వాసల వరదల వంగిన చేను
వెన్నెల నీవిన వన్నెల చేను
.... .... .... ....
గింజలు బందలో పాడిపో కుండ
పొంటగ వెన్నెలు కొయ్యం డల్లి
ఇట్లెన్ని గీతములైనను చూపవచ్చును.

తెలుగులోని జానపద గీతములు అధికాంశము ద్విపదగతిలో నడచినవే. జానపదగీతములు పంచమాత్రాయుత కాల ఖండములలో పాడబడుచుండగ, తెలుగులో వీనినుండి సిద్ధమయిన గణవ్యవస్థ (సూర్యేంద్ర చంద్రగణములు) ద్విపదల నడకలో భిన్నమైన రీతులు ప్రదర్శించగల్గినది. ఇంద్రగణములు (చతుర్మాత్ర, పంచమాత్రికములు) వైవిధ్య ప్రయోగములో శిష్టవాఙ్మయములోని ఇతర ఛందములలోవలె కవులు ద్విపద కావ్యములలో ఉపయోగించునపుడు గమన వైవిధ్యమును చూపినారు. ద్విపద కవులు సైతము ప్రసిద్ధమైన 5+5+5+3 నడకను అంగీకరించుచునే గణమునకో పదము వాడినపుడు గల్లు నడకగా దానిని భావించినారు. గార్లపాటి సుబ్బారావుగారు (1910) తన ద్విపద ఉత్తర హరిశ్చంద్రీయము నచంద్రమతీ హరిశ్చంద్రుల వివాహ సందర్భమున ఏర్పాటు చేయబడిన సంగీత సభలో తాళమున మోతను ఈ విధముగా తెలిపినాడు.

టంటజ్ఝం టంటఝ్ఝ టంటఝ్ఝు టఝ్ఝ
టంటఝ్ఝ టంటఝ్ఝ టంటఝ్ఝ టఝ్ఝ[30]

ద్విపద నడక యిట్లుండునని తెలుపుటకు ఇది చక్కగా చూపబడుచున్నది. ఐదు మాత్రల కొక గణము చొప్పున, గణమునకొక్క పదము చొప్పున వాడినప్పుడు ద్విపద ఛందము యొక్క స్వాభావికమైన నడక కన్పట్టును. మార్గి ఛందముల ప్రభావముచే తెలుగు కవులు వీనిలో గణమున కొక్క పదమును వాడక వివిధమైన నడకలు చూపిరి. అవి ఇచ్చట దిఙ్మాత్రముగా చూపబడుచున్నవి.

7+ 3+ 5+ 3
1. కుంతలేశ్వరు జూపి యూర్జరు జూపి = 18 మాత్రలు
గౌళాధిపతి జూపి కాంభోజు జూపి
కాళింగపతి జూపి కాశ్మీరు జూపి
- నలచరిత్ర తిమ్మన్నకవి

5+ 3+ 7+ 3
2. ఇదియేమి నలత నీకిటువలె సలత
ఇదియేల చెలియ నీకిటువలె సొలయ
ఇదియేమి అలస నీకిటువలె జలప
-నలచరిత్ర చక్రపురి రాఘవాచార్యులు (I - 923–926)

అంత్యప్రాస పలన ఉభయార్థముగా విడిపోయినది.

3 + 4 + 3 + 5 + 3
3. సీమ కాదిది మంచి చెలువైన లేమ
లేమ కాదిది మంచి లేమావి కొమ్మ
కొమ్మ కాదిది మంచి కులుకు కెం దమ్మి
తమ్మి కాదిది మంచి తావిపూ లతిక
ఆదే గ్రంథమునుండి II-812–816

4 5 4 3
4. ధుగధుగ నిగిడిని స్ఫులిపోగ లెగయు
4 4 5 3
బొటబొట చెమటలు సోనలై కురియు
4 5 4 3
తటతట మనిరొమ్ము తడబడు చుండ
4 4 5 3
చిటచిట నిప్పులు దొలగహ మ్మనుచు
ఆదే గ్రంథమునుండి II-634–38

పదకలో 1-3 పాదములొకటి 2-4 పాదము లొకటై [illegible] అన్త్యప్రాస పద్ధతిని వ్యక్తమొనర్చినవి-

| | 4 | 4 | 4 | 3 |
|---|---|---|---|---|
| 5. | కొట్టుచు | పడుచుల | దిట్టుచు | జనుల |
| | చిట్టిన | చేటతో | చేటపై | ముసును |
| | రట్టడి | మాటల | రంతుసే | ముసుసు |
| | తిట్టిన | పురుషుని | తిరుగడి | ట్టుసును |
| | గొట్టిన | పెనిమిటి | గొట్టెడో | పుసును |
| | ........ | ........ | ........ | ........ |
| | కొక్కడు | తొక్కడు | తొక్కడి | ల్లసుసు - ఐ. పు II |

## 5) ద్విపద - ఇతర ఛందములు :

ఇట్టి పెక్కు పదకలు గల్గిన ద్విపద మౌలికముగా ఇతర దేశీయ ఛందములతో కొంత పొత్తు గల్గియున్నది. ద్విపదకు రెట్టింపు తరువోజ. 3 ఇం. గ+1 సూర్య గణ+3 ఇం. గ+1 సూ. గ తరువోజ గణములు. మధ్యాక్కర గణములు 2 ఇం. గ+1. సూ. గ+2 ఇం. గ+1. సూ. గ అనగా ద్విపదయొక్క ఇంద్ర గణమును తగ్గించగా యేర్పడినది మధ్యాక్కర యొక్క అర్ధ భాగము. ద్విపదయొక్క రెట్టింపైన తరువోజలోని 3 ఇం+1 సూ.+3 ఇం+1 సూ గణములు పదపదలో మధ్యలోని సూర్యగణమును దీసి ఆఖరుగా ఉంచిన సీస గణములు వచ్చును. సీస గణములు 6 ఇం. గ+2 సూ. గ. గా ఉండును. ద్విపదలోని 3 ఇం+1సూ. పాదు కలో ఇంద్రగణములు నల, భ గణములే వాడినచో చౌపది కాగలదు. అట్లే పంచ మాత్రాగణములు. ఇంద్రగణములుగా వాడినచో పై సూర్యగణము వాడిన కర్ణాట చతుష్పద అగుచున్నది. 5+5+5+3 ఇది కర్ణాట చతుష్పద లక్షణము. ద్విపదలోని ఇంద్ర గణములు చతుర్మాత్రికములే వాడి చివర సూర్యగణమునకు [illegible] ఒక మాత్ర కల్పి వాడిన అది మధురగతి రగడ అగును. ద్విపద విస్తృతి యగు సీసము చివరి రెండు సూర్యగణములు ఒక చంద్రగణమైనచో అది ఉత్పలవి అర్ధమగును. పై వివరములన్నియు యిప్పుడు శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు తమ తెలుగు ఛందో వికాసమన్న గ్రంథమందున "ద్విపద [illegible] [illegible] మూల [illegible] అభిప్రాయమును [illegible] [illegible] లతో

వేనికవే ప్రత్యేక ఛందములు. ప్రత్యేక మొక్కొక్క విశిష్టమైన గమనము సాధించ గల్గియుండగా వానికి మూలము కావలెను.

ఏలయనగ చౌపదిలో చతుర్మాత్రక గణములే వాడవలయును. అట్లని భ, నల మాత్రము వాడవలయునని సంకుచితత్వము లేదు. చౌపది చతురస్ర జాతి నడక గలది. ఇక మధురగతి రగడయు నిట్టిదే. ఇంకను చౌపది, మధురగతి రగడలను పోల్చవచ్చును. గాని ద్విపదకు చౌపదతో సంబంధము చెప్పరాదు. మధ్యాక్కరలో ఒక ఇంద్రగణము తగ్గవలయును. ద్విపదను రెట్టించి మధ్యగల సూర్యగణమును చివర వేసినపుడు సీసము సిద్ధమగునుగాని యట్లు వేయుటన్నది వట్టి ఆలోచనమే. అట్లు చేయబడుటకు కారణమేమియు తెలియరాదు. సీస మధ్యాక్కరలు ద్విపద మున్నగునవి సూర్యేంద్ర చంద్రగణ నిర్మాణములు గలవి. తెలుగులో ఈ గణముల ప్రయోగము అంతటను కలదు. వీనిలో గణ సామ్యముండి వరస లేకున్న చాలు నన్నది లేదు. ఇక కర్ణాట చతుష్పద మాత్రము ద్విపదతో చాలా పోలిక యున్నది. కాని దీని ప్రయోగము తెలుగులో తక్కువ. ప్రసిద్ధమైన ద్విపద యుండగా కర్ణాట చతుష్పదకు తెలుగులో ప్రాముఖ్యము తగ్గినది. సీసము, మధ్యాక్కరలని వేరు వేరు నడకలు కల్గి, వానికి మూలమనదగు జానపద గీత బాణీలున్నవి. స్థూలముగా వీని నడకలు సీసము, ద్విపద, కర్ణాట చతుష్పదలవి ఖండగతి గలవిగను, చౌపద, మధురగతి రగడ మధ్యాక్కరలవి చతురస్రగతి గలవిగను భావింపవచ్చును.

కవితారసపు జల్లు ఖడ్గాల గలగల్లు
కరవాలకే చెల్లు ఓ కూన అమ్మ[31]

అన్న చానలమ్మ పదమును డా॥ బి. నాగయ్యగారు మొదటి పాదము సీస లక్షణము, రెండవ పాదము ద్విపద లక్షణము కల్గి ఈ రెంటికిని సామ్యమును చెప్పిరి. కాని ఇది ఖండ గతిలో నడుచు గేయము - అమ్మా యన్నది యుత్వాదాంతము కనుక గేయ గతిలో దీర్ఘమై ఖండగతిని సంపూర్ణము చేయును. పంచమాత్రలలో గణములు వాడినందున ఇది సీసము, ద్విపదలవలె గోచరించినది. ఈ క్రింది ఉదాహరణమును చూడుడు.

సన్నుతి సేయుదు సత్కవు లలర
తిన్నని సూక్తుల ద్విపదర చింతు (పాల్కురికి సోమన.)

ఈ ద్విపదలో అన్ని చతుర్మాత్రా గణములే వాడబడినవి. గేయగతిలో వాడుక దీర్ఘమును సాధించిన ఇది 'అలరా' 'చింతూ'లుగా మారి అన్ని చతు

ర్మాత్రా గణములతో చొపదివలె భాసించినది. కావి ద్విపద, సీసము, చొపద ఒకే కడుపున బుట్టిన ఛందములని చెప్పలేము కదా!

—తెలుగులోని సూర్యేంద్ర చంద్రగణ వ్యవస్థలో మహాత్కా చమత్కృతి విశేషమున్నది. విభాగ వశమున ఒక్కొక్క గణము వేరొక్క గణముగా మార్ప వీలున్నది. ఈ క్రింది గణక్రమము పరిశీల్యము.

తే. గీ. సూ+ఇం+ఇం+సూ+సూ (గణక్రమము ఒక పాదమునకు)

ద్విపద. ఇం+ఇం+ఇం+సూ

ఏదేని ఒక తేటగీతి యందు

హ భ ర హ హ
UI, UII, UIU, UI, UI అను గణములు వరుసగా వాడినచో ఇదే క్రమముగా ద్విపద కాగలదు.

UIU, IIUI, UUI, UI
ర సల త హ పై గణములే గురు లఘువులను సర్దివేయగా ద్విపద పాదమైనది.

ఇపుడు తేటగీతియే ద్విపద, ద్విపదయే తేటగీతి అని చెప్ప వలనుపడునా? ఇట్టి విచిత్ర గణముల నిర్మాణము, అటు మాత్రా సమక ప్రాకృత పద్ధతి గణముల వలెగాక, ఇటు అక్షర సమ సంస్కృత పద్ధతి గణములవలెగాక, తెలుగులో విశేషమై, దేశి పద్యములలో స్వేచ్ఛగా ఉపయోగము గల్గి మరింత విశిష్టమై అలరారుచున్నది. ఇట్టి చమత్కృతుల కవకాశము గల్గిన దేశి పద్య నిర్మాణము గమన వైవిధ్యము కల్గించుచు ఛందో మర్మజ్ఞులకు ఏకత్వములో భిన్నత్వమును, భిన్నత్వములో ఏకత్వమును గోచరింప జేయుచున్నది.

—x—

అథస్సూచికలు

1. తెలుగు జానపద గేయ సాహిత్యము P. 17. 220
2. లం. శి. పు. 216
3. కావ్యాలంకార చూడామణి VIII - 62
4. సోమన సృష్టించిన ఛందస్సు-"పరిశోధన" ఆగస్టు, నవం. 1955 సంచికలు
5. "యక్షగానము - తంజావూరు" - ఆంధ్రపత్రిక ఖర సంవత్సరాది సం. 1951, 52 (17-32 పుటలు)

6. కవి దర్పణ - సం. H D. వేలెంకర్
7. సంగీత రత్నాకరమ్ 4-114 సూ.
8. మాత్రాచ్ఛందస్సులు - చిలుకూరి నారాయణరావు
9. ద్విపద వాఙ్మయము - డా. జి. నాగయ్య పు. 35
10. సిద్ధేశ్వర చరిత్రము - కాసె సర్వప్ప
11. వేణు గోపాల శతక కర్త - "ద్విపద కావ్యంబు ముదిలంజ...."
12. కవిజనాశ్రయము - జాత్యధికారము
13. జానుల మాత్రాను సంఘాన గణవి
సీసంబు గాన "యనియతగణ్యై ర
వియను "ప్రాసోవా", యనియు "యతిర్వా"య
వియు చెప్పు ఛందోకవి హితో క్తిగాన — పండితారాధ్య చరిత్ర
14. "అష్టమహిషీ కళ్యాణము" అవతారిక పు. 130-136
15. ద్విపద వాఙ్మయము - డా. జి. నాగయ్య పు. 56
16. "ద్విపద భారత కవుల వింత ప్రయోగములు" - కొమ్మనమంచి జోగయ్య శర్మ భారతి ఆగస్టు 1960
17. "పాల్కురికి వాని ప్రావళ్య" - దావూరి దొ. సా. శర్మ పరిశోధన, ఆగస్టు నవం. 1955
18. శబ్ద మొక్కటిలము, రెండు పాదములనీ క్రియ బరచి యుండక వెలయు"
- ఛం. దర్ప. 3-49
19. "ద్విపద భారత కవులు - వింత ప్రయోగములు - కొ. మం. జో. శర్మ.
20. దీనినే కవి జనాశ్రయకారుడు దోషాధికారమున కాకు శబ్దదోష మనినాడు. ఇది శిష్ట దృష్టి 'వెలయగ చెడాకు విలుగొని.... యంగజుడు విరాహుల.... ననిన గాకు దోషంబయ్యె'.
21. దసరా పద్యములు - వావిళ్ళ ప్రచురణ
22. జానపద గే. సా. - ఆచార్య బి. రా. రా. పు. 462.
23. త్రివేణి - జాన. గేయ సం. పు. 73.
24. తెలంగాణా పల్లెపాటలు - బి. రా. రా. పు. 99

25. తెలుగు కన్నడ జానపద గేయములు - డా. ఆర్. వి. యస్. సుందరం పు. 113

26. జా. గే. సా. - ఆచార్య బి. రా. రా. పు. 445

27. తె. క. జా. గే. R.V.S. సుం. పు. 156

28. జా. గే. సా. బి. రా. రా. పు. 36

29. " " " పు. 454

30. ద్విపద వాఙ్మయము - డా. జి. నాగయ్య పు. 158

31. ద్విపద వాఙ్మయము - " " పు. 45



# 3. తరువోజ

ప్రాచీన శాసనములలో సమగ్ర స్వరూపము కల ఛందములలో ఈ తరువోజ ప్రాచీనమైనది. చతుష్పాద వ్యవస్థ, ద్వితీయాక్షర ప్రాస, విచ్ఛేద రూపయతి, సదృశాక్షర యతి గల్గి సమగ్ర వృత్త స్వరూపముతో ఈ ఛందస్సు అద్దంకి శాసనములో లభించినది.

తరువోజలో పాదమునకు 8 గణములుండును. అవి వరుసగా 3 ఇం.గ+1 సూ. గ +3 ఇం. గ +1. సూ.గ. వానిని రెండర్థములుగా భావించినచో ఒక్కొక్కటి ఒక్కొక్క ద్విపద పాదమగును. యతి రెండుగణముల కొకమారు అనగా 1వ గణాద్యక్షరమునకు 3వ, 5వ, 7వ గణాద్యక్షరములతో యతి- అనగా ద్విపదకున్న యతియే దీనికున్నది. ద్విపదలో రెండు పాదములకు వేర్వేరు యతి కాగా, తరువోజలో ఆ రెండు పాదములు ఏకపాద మగును కనుక బహుయతి నియతి ప్రకారము ఒకే అక్షరము యతిగా నిడవలయును.

ద్విపద గేయ చ్ఛందము కనుక తరువోజ కూడా గేయ చ్ఛందమే యగును. దీనిని నిడుదవోలు వేంకటరావుగారు ధృవాపద నిష్పన్నమనినారు. ధ్రువపద, దరువర, తరువద, తరువోజ దీని రూపాంతరములని భావించినారు[1]. కొఱని గోపరాజు ధృవాపద ప్రబంధములను చెప్పినాడు. ఇవి గేయ సంబంధములే. నిడుదవోలు వారిచ్చిన పేర్లలో తరువద నన్నెచోడుడు తరువోజకు బదులుగా వాడినపేరు. ఛందమొక్కటే. ధృవపద జన్యముగా తరువోజను చెప్పుటకు వేరు ఆధారము లేవియు లేవు. ధృవ లక్షణమునకు తరువోజతో సామ్యము సైతము లేదు.

ధృవ లక్షణం : "పచే ధృవకం"-హేమచంద్రుని ఛందోఽను శాసనం 6.24

"పంచమాత్రా చతుర్మాత్రా గణయస్య పాదౌ

తద్ ధృవకం"- వ్యాఖ్య.

ధృవకు ధృవకం ధత్తా అని కూడా వేరు పేర్లున్నవి. ఇట్టి ప్రాకృత మాత్రా చ్ఛందమునకు తెలుగు తరువోజతో సామ్యమేమియు లేదు. తరువోజ శబ్ద నిరుక్తిని గూర్చి చెప్పుచు ఉమాపతి పద్మనాభ శర్మగారు తరువు యొక్క వేళ్ళు లేక కొమ్మల వలె విస్తృతమైన పాదములు కలదని (తరువు+ఓజ) అర్థము నిచ్చిరి. డా॥ కె. వర్ణోత్తమన్‌గారు తమిళ చ్ఛందములకు వృక్ష సంబంధమైన నామములు 'మావిళం'

'కూవిళం' అని పేర్లున్నట్లు చెప్పి, ఇది కూడా వృత్త సంబంధమైన పేరు కావచ్చు ననిరి[3]. దీనికి సంస్కృత ప్రాకృతములలో తుల్యనామము లేకుండుట వలన, లక్షణము సరిపడకుండుట వలన ఏదైన దేశీయ నామమే అయి యుండుననిపించును.

తరువోజ ప్రాస యుండుట వలన జాతి పద్యమైనది. గణముల విషయమై అక్కరేతర జాతి పద్యమగుచున్నది. అనగా 'నలనామక గణములు' వాడబడినవన్న మాట. శాసనస్థ తరువోజ తప్ప తక్కిన ప్రయోగములలో నిది సురేంద్ర గణములతో నడచినను, అద్దంకి శాసనములో మాత్రము జలగణ మొక్కటి 'గొలిచియు' వాడబడినది. ఈ విశిష్ట గణమును గూర్చి చెప్పుచు డా॥ దివాకర్ల వేంకటావధానిగారు యుద్ధమల్లుని బెజవాడ శాసనంలోని మధ్యాక్కరలోని గొరగల్గా వంటిదవి, తేల్చి పలుకవలయునవి, అది అప్పుడు ఇంద్రగణమగునని లేనిచో నాడు జలగణమును సైతము ఇంద్రగణముగా భావించెడి వారని చెప్పవలయును అని వివరించినారు.[4]

తరువోజ గేయ చ్ఛందము, ఇది పాటగా ప్రాచీనకాలముననే గుర్తింపబడినది- విన్నకోట పెద్దన్న దీనిని దంపుళ్ళ పాటగా గుర్తించినాడు.

తలకొని తగ(బ్రాలు దంచెడి చోట
తరుణులచే నొంపు దనరు దర్వోజ యని పేర్కొనబడినది[5]. ద్విపద గేయ చ్ఛందమగుట వలన ద్విపదకు రెట్టింపైన తరువోజ కూడా గేయ చ్ఛందమే. దేశి చ్ఛందములలో ఒక్క తరువోజ మాత్రము తెలుగు లాక్షణికులచే గేయముగా చెప్పబడినది. అట్టి ఘనతయు విన్నకోట పెద్దన్నకే దక్కినది. ఇట్టి తరువోజను పలువురు పండితులు గేయ చ్ఛందముగనే భావించినారు.

"చాళుక్య రాజులకు దేశి కవితయందు గల సమాదరమే వారిని సంస్కృత వృత్తావలంబము నుండి మరల్చి పాటల రూపమున నున్న దేశి రచనలు కొన్నింటిని సంస్కరించి, పద రూపమున నొందింప బ్రోత్సహించి యుండును. క్రీ. శ. 9వ శతాబ్దియందు పండరంగుని అద్దంకి శాసనములో గానవచ్చెడి తరువోజ యట్టి సంస్కార ఫలితమేయని భావింపనగును" అని శ్రీ తిమ్మావఝ్ఝుల కోదండ రామయ్యగారు భావించినారు.[6]

"Most of the indigenous metrical compositions may be said to be capable of being easily set to music and sung like Taruvoja; perhaps it is not proper to say that originally

they were musical compositions with 'tala' and 'laya' but latter adjusted to the exgencies of regular metres" అని గేయము లేదేశి ఛ్ఛందో మూలంపములని కోరాడ రామకృష్ణయ్య పంతులు గారభిప్రాయ పడి నారు[7]. ఇట్లు భావించుటకు కారణము తరువోజ వృత్తరూపము సంతరించుకొన్నను దానిని ద్విపద వికృతిగా భావించుటయే.

ద్విపద రెండు పాదములలో యతి వేరు వేరుగా ఉండును. ఒకేయత్యక్షరము చేత అది తరువోజ అగును. అందులకే పాల్కురికి సోమన్న ద్విపదలోని రెండు పాదములను అధికాంశము భిన్నయత్యక్షరములతో వ్రాసినాడు. ఒకేయ త్యక్షరముగల ఈ క్రింది జానపద గీతములు రెండు, తరువోజ పాదము కాదగును.

కిలకిలా, నవ్వితే, కలువల్లు, పూసె
కలువపు, వ్వాలేమె, కలికి చూ, పుల్లు.

దంపుడు పాట ఒకటి ఉదాహరణకు.

| | | | |
|---|---|---|---|
| తపటపా | కులమీద | పల్లెంద | బోసి |
| అపడ్లు | ఉపడ్లు | బస్తాల | కెత్తి |
| అత్తదం | చినపడ్లు | అధికస | న్నాలు |
| మామదం | చినవడ్లు | మల్లెనూ | దుల్లు[8] |

పై దంపుడుపాట జానపద గీతము కాపున ఆదిప్రాస, సదృశాక్షర యతి నియమము పాటింపబడనిదయ్యెను. కాని నడక మాత్రము ద్విపద లేక తరువోజ ఛాయలో నడచినది. చిన్నకోట పెద్దన్న దంపుడు పాటగా చెప్పిన తరువోజను నన్నయ వాడినాడన్నచో గేయ ఛందమును తన కావ్యమున స్థానము కల్పించినాడ న్నట్లే. అది వృత్త గౌరవమును తనకు రెండు శతాబ్దుల పూర్వమే అందుకొనుట వలన తన కావ్యమున వాడినాడు. తరువోజ వాడుటవలన ద్విపద ఛ్ఛందమును వాడ వలసిన అవసరము తీరినది. కాని తరువోజ వాడినంత మాత్రమున దానికి గేయ ఛ్ఛందో గౌరవమబ్బదు. ప్రతిపాదము పాదాంత విచ్ఛేదముతో, ప్రతి అర్ధము ప్రతి యతిస్థలము పదసమాప్తి రూప విచ్ఛేదముతో నుండవలెను. అప్పుడు దానిని పాడు కొనవచ్చును. నన్నయ ఇట్టి పని చేయడయ్యెను. నన్నయ, అతని తర్వాత అతని చంపూ సంప్రదాయము ననుసరించిన ఆంధ్ర మహాకవులు సంస్కృత కావ్య మథ నము గావించి, అచ్చటి సాహిత్య ఛ్ఛందో లక్ష్యముల నరసియు విచ్ఛేద రూపయతిని

విచ్ఛేద మొనర్చి చేసినవారే. నన్నయ ... ఆంధ్రభారతములో 12 తరువోజలు వాడెను. వానిలో అఖరైనది క్రింది పద్యము.

ఏనేడ, నింద్రాను, లేదవా, రలకు
నెప్పుడు, మ్రొక్కుడు, నేనునీ, ధనము
భూనాథ, నీ గుణం, * బులుహంస, చేత
బొలుపుగా, వినిమనం, * బున నిల్పి, యున్నా
ధానభ, పన్నిమి, * త్తమునని, ట్లఖిల
ధారుణీ, నాథసా, ర్థంబురా, వింపా
గానిష్ఠ వలసెలో * కఖ్యాత కీర్తి
కరుణించి పతిబుద్ధి గావింపుమిందు. (ఆంధ్ర II-47)

పై పద్యమునందు * గుర్తించిన చోట్ల పద సమాప్తి రూప విచ్ఛేదము పాటింపబడలేదు. అర్థవంతముగా విచ్ఛేద మొనర్చి చదివితేని తరువోజ నడకయే పోవును. అర్థమును వదలినచో గేయముగా దీనిని పాడుకొనవచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఏనేడ | నింద్రాను | లేదవా | రలకూ |
| నెప్పుడూ | మ్రొక్కుడూ | నేనునీ | ధనమూ |
| భూనాథ | నీగుణం | బులుహంస | చేతా |
| బొలుపుగా | వినిమనం | బుననిల్పి | యున్నా |
| ధాన భా | పన్నిమీ | త్తమునసీ | ట్లఖిలా |
| ధారుణీ | నాథసా | ర్థంబురా | వింపా |
| గానిష్ఠ | వలసెలో | కఖ్యాత | కీర్తీ |
| కరుణించి | పతిబుద్ధి | గావింపు | మిందూ |

పై వరసలో మొదటి చివరి వరసలు తప్ప తక్కినవి అర్థవంతముగా విభజింపబడ లేదు. కాని పాదములోని ప్రతి అర్థము అనగా ఒక్కొక్క ద్విపద పాదము రెండవ ద్విపద పాదములోనికి చొరబడినను తరువోజ యొక్క ఒక్కొక్క పాదము మాత్రము ఒక దానిలోనుండి ఒక దానిలోనికి పదము పోలేదు. అనగా తరువోజ యొక్క ప్రతి పాదాంతమున విచ్ఛేద రూపయతి పాటింపబడినది. దీనిని కవిత్రయము చక్కగా పాటించినారు.

కవి జనాశ్రయము కారుడు సైతము దీనిని స్పష్టముగా చెప్పినాడు.

వెలయంగ బాదముల్ విరచింప వళ్ళు

వేర్వేర నిప్పాట విదితమై యుండ* - అని వేర్వేరుగా పాదములు వ్రాయుట గూర్చి చెప్పియున్నాడు. వళ్ళు వేర్వేర అని అర్థము చేసికొందుమన్న ఆతని పద్యములో పడివేరుగా లేదు. పడిస్థలమందు విచ్ఛేదము సైతము లేక ఒకే పదము యతికి ముందు వెనుకల ఆవరించియున్నది. కనుక పాదము వేర్వేర యుండ వలయునని ఆతని భావమై యుండును

## తరువోజ - ద్విపద :

ఏకాక్షర యతి సంఘటనముచే అఖండపాదమేర్పడుచున్నను ప్రతిపాదము రెండు ద్విపదలుగా యున్నది. దీనిని బట్టి ద్విపదలు రెండు తరువోజగా మారినట్లు కొందరును, ద్విపదకన్న పూర్వమే తరువోజ లభించుటచే తరువోజ రెండుగా విడ గొట్టబడి ద్విపదగా మారినట్లు మరి కొందరును విమర్శకులు అభిప్రాయద్వైవిధ్యమును కనబరచినారు. డా॥ అమరేశం రాజేశ్వరశర్మగారు తమ "నన్నెచోడుని కవిత్వము" లో తరువోజ నుండియే ద్విపదలు పుట్టినట్లు వ్రాసినారు. ద్విపదలు పాల్కురికి సోమ నాథునికి ముందు కానరావని, తరువోజ అద్దంకి శాసనము మొదలుకొని కవిత్రయ యుగము వరకు కన్పట్టుచున్నదని, ద్విపద సోమనాథునకు తర్వాతనే వ్యాప్తిగాంచిన దని, అపై తరువోజ కావ్య ప్రపంచమున కానరాలేదని, ద్విపదయావిర్భవించి తరువోజను వెనుకకు నెట్టినదని వ్రాసినారు[10]. ఆరుద్రగారు సైతము ఈ అభి ప్రాయమున కనుగుణముగనే "తరువోజలో నుంచే ద్విపద పుట్టింది. ఒక తరువోజ పాదాన్ని రెండు ముక్కలుచేసి. ఆ ముక్కలకు ప్రాసయతివేస్తే అది ద్విపద అవు తుంది. చిన్నఛందం ముందుపెట్టి దానిని పెంచుకొని వెళ్ళడం రివాజు కనుక ద్విపదే ముందు పుట్టిందనే వాదం కూడా ఒకటివుంది. కాని తరువోజ కన్న ద్విపదే ప్రాచీన మయితే నన్నయగారు దాని వాడి యుండరా ?" అని ద్విపద తరువోజ జన్యం అన్న వాదమునకే ఊపిరి పోసినారు.

కాని పై వాదము పరిశీలించవలసినది-తరువోజ ముందు కన్పట్టుచున్నదని, ద్విపద పాల్కురికి సోమనకు ముందు లేదని చెప్పరాదు. ద్విపద జానపద గీతము లలో నుండుటచే అది మనకు లభించలేదు. కవిజనాశ్రయకారుడు లాక్షణీకరించిన పిదప దాని ఉపయోగము గూర్చి తెలిసినది-అంతేకాక పాల్కురికి సోమనాధునకు ముందు ద్విపద ఉన్నదనుటకు ఆతడు దాహరించిన లక్షణ సూత్రములు "అనియత

గవైశ్రప్రాసోవాయతిర్వా" అన్నవే సాక్ష్యములు. ద్విపద గోపినాథుని తిర్యాతనే వ్యాప్తిని గావించినదను మాటయు విచార్యమే. నన్నయవాడ కుండుటచే ద్విపద ప్రాచీనముకాదని ఆరుద్రగారనుటయు పరిశీల్యమే. నన్నయ వాడలేదని లేదనుట ఎట్లు ? ఆయన రగడలు వాడలేదు. అట్లని ఆయనకు పూర్వము రగడలు లేవందుమా ? కోరుమిల్లి శాసనమున యున్నవిగదా! ద్విపదకు వృత్తగౌరవము తరువోజ రూపమున లభించుటచే దానినేవాడి నన్నయ ద్విపదను వదిలియుండును. "తరువోజను రెండు ముక్కలుచేసి"అన్న ఆరుద్ర తిరిగి గుణగ విజయాదిత్యుని కాలంనాటి లక్షణ కర్తలు రెండు ద్విపద పాదాలను కలిపి ఒకటిగా చేసికొని దానికి తరువోజ అని పెట్టటానికి ఆస్కారం లేకపోలేదని తెల్పినారు[11].

కోరాడ రామక్రిష్ణయ్య, డా॥ తిమ్మావఝ్ఝులి కోదండరామయ్య, డా॥ కోవెల సంపత్కుమారాచార్య, డా॥ పాటిబండ మాధవశర్మ ప్రభృతులు ద్విపద నుండియే తరువోజ జన్మించినట్లు నిర్ధరించినారు. దేశియగేయచ్ఛందమగు ద్విపదను మార్గి ఫక్కినను సరించి సంస్కృత పండితులు దీనిని వృత్తముపలె మార్చి నాలుగు పద్యపాదములుగా, యతిప్రాసలు గూర్చి విస్తృత వస్తు నివేదనమునకు తగినట్లుగా సంస్కరించి శాసనములలో ప్రాచీనకాలములోనే వాడియుండిరని వీరు అభిప్రాయ పడినారు.

ద్విపద గేయ ఛ్ఛందము. గేయము పద్యము కన్న ప్రాచీనమన్నది చారిత్రక సత్యము. గేయమెప్పుడు చిన్నగనేయుండును. 8 గణములతో 3 యతిస్థానములతో ఉండదు. గేయమునకు పాదమానము హ్రస్వమైయుండును. దీర్ఘ పాదము యొక్క అవసరమేలేదు. విస్తృత వస్తు వర్ణనకు ఎన్నిపాదములు కావలయునన్న అన్ని పాద ములు వ్రాయుచుబోవును. పాద వ్యవస్థగల మార్గి పద్యములందే పాద స్థైర్యము అవసరము. ఇవి నాల్గు పాదములే వ్రాయవలయునన్న నియమము కలవి. గేయ ఛ్ఛంద ములకు ఈ బాధలేదు. అవసరమున్నన్ని పాదములు వ్రాయవచ్చును. ఉన్న పాదములను పొడవు చేసికొనుట అక్కరలేదు. కుంచిచ పాదములను రెట్టించి దీర్ఘ పాదము తయారు చేయబడుట తెలుగు ఛందస్సులలో సామాన్యమైన విషయమే.

రెండు ద్విపదలు తరువోజ అయినట్లే రగడలు సైతము రెట్టింపు విధానములో సిద్ధమైనవి. అట్లే దేశ్య ఛ్ఛందములందు మధ్యాక్కరయు ఇట్టిదిగనే కాన్పించు చున్నది. అంతేగాక రెండు పాదములు కలిసి ఒకే పాదముగా చేయునపుడు ఆ రెండు పాదముల మధ్య విచ్ఛేదమునందే అతికినట్లు స్వభావమును బట్టి గణ స్వభావమును బట్టి యేర్పడును. అతికినచోట యతి స్థానముండును

మొదటి రెండు గణములుగా ఏర్పడును. వీటిని ప్రత్యేక పాదములని భావించిన దన్నచో రెండు ద్విపదలు కల్పి ఒక తరువోజగ నాతడు భావించినాడన్నమాట. చిన్న కోట పెద్దన్న సైతము తరువోజలోని ద్విపదత్వమును, ద్విపదలోని రెండు అర్ధము లను, శ్రమ తగ్గించుటకై స్త్రీలు రోకటి పాటగా చిన్న చిన్న పాదములుగా వాడుటను చూసి, దానిలోని వృత్తత్వముకన్న గేయత్వమునే వర్ణించి "ప్రాస వంచెడిచోట తరుణులచే" పాడబడు పాటగా పేర్కొనినాడు.

దేశి ఛందములందు గణక్రమము సహజముగా నుండును. గణములబట్టి సమభారత పాదమునందు కల్గును. అన్ని ఇంద్ర గణములే యుండవలసినచోట మధ్యలో సూర్యగణ మెందులకున్నది, నేసములోపలి అన్ని ఇంద్రగణములే వరుసగా ఎందుకుండలేదు అని ప్రశ్నించిన, 3 ఇం. గ+1. సూ.+3 ఇం.+1 సూ అన్న విధమున మధ్యలో సూర్యగణ ప్రసక్తిని బట్టి ఇది రెండు పాదముల కలయికగా శ్రీ సంపత్కుమారాచార్యగారు వివరించినారు.[14]

పైన చర్చించిన అంశములను క్లుప్తముగా క్రోడీకరించితిమేని

1) సాధారణముగా దేశి ఛందస్సుల పాదములు హ్రస్వములై యుండుట.
2) ఛందములను పట్టింపు చేయుట విధానము రగడాదులలో నుండుట.
3) లాక్షణికులు ఒక అర్ధమునకు గణములు చెప్పి తక్కిన వదలే అనుట.
4) యతి స్థానము ద్విపదనందు నిరూపింప జాలియుండుట.
5) మధ్యలో సూర్య గణారోపము కల్గియుండుట.
6) దేశి ఛందములు సంస్కృత (మార్గి) ఛందో ప్రభావమునకు లోనై చతుష్పాద వ్యవస్థ ఆరోపింపబడుట.

అను కారణముల చేత రెండు ద్విపదలే ఒక తరువోజ పాదమైనదని, తరువోజ నుండి ద్విపద పుట్టలేదని నిశ్చయమగును. తరువోజలో ప్రాసయతి ఉండదు. కనుక ప్రాసగల ద్విపద రెండు పాదములచే తరువోజ ఏర్పడుననుటకన్న ద్విపద యొక్క రెండు పాదములచే తరువోజ ఒక పాదము యేర్పడునని చెప్పుట లెస్స!

పేర్కొ గణ సన్నివేశములలోని హ్రస్వసంజ్ఞ, అనంతాది మతముల ప్రకారము అక్కర జాతులు, అక్కరేతర జాతులని కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణులు పేర్కొన్న దేశి పద్యములలో ద్విపదలను అక్కరజాతిగా, తరువోజను అక్కరేతర జాతిగ చేసిన, చిన్నకోట పెద్దన్నలు పేర్కొనినారు. రెండు ఛంద ములు ఒక్కటే [illegible] గణవ్యవస్థలో [illegible] పేర్కొనుట [illegible] తరువోజను

అక్కర జాతీతరములలో చేర్పబడి ఉండవచ్చును.[15] లేదా అక్కర జాతులు కన్నడ ప్రచురములు కనుక, కన్నడమున లేని ఈ తరువోజ ఛందము తెలుగు భాష స్వంతమగుటచే అక్కరేతర జాతిలో వేసియుండవచ్చును. ఈ విభజన మాత్రము చేత వీనిని వేర్వేరు ఛందములని భావింపరాదు.

ఇట్లు ద్విపదకు వృత్తరూపమైన తరువోజ తెలుగు సాహిత్యముయొక్క ప్రారంభదశనుండి కానవచ్చుచు కవిత్రయ యుగముతో అస్తమించినది. పాలుకురికి సోమన్న తర్వాత తెలుగు సాహిత్యములో తరువోజ స్థానమంతరించినది. సోముని ద్విపద ప్రతిష్ఠాపనముచే తరువోజ అవసరము తగ్గిపోయినది.

—×—

## అధస్సూచికలు

1. తెలుగు కవుల చరిత్ర, పు. 27
2. భారతి, ఆగస్టు, 1967
3. వాషి. చేవ ఛం. రీ. తు. పరిశీ
4. ప్రాఙ్నన్నయ యుగము పు. 342
5. కావ్యాలంకార చూడామణి VIII-51
6. "ఆంధ్ర సాహిత్యములో దేశి కవితోద్యమము. పాల్కురికి సోమనాథుని పాత్ర"— అముద్రిత సిద్ధాంత గ్రంథము
7. The lierature outside the Telugu country — Madras Uni. 1947
8. 'తరువోజ పుట్టుక'— బండి నాగరాజు భారతి, సెప్టె. 1967
9. క. జ. జాత్యధికారము - తరువోజ లక్షణము.
10. సమగ్రాంధ్ర సాహిత్యము - Vol. I ఆరుద్ర పు. 78
11. సమగ్రాంధ్ర సాహిత్యము - Vol. I ఆరుద్ర. పు. 79
12. లక్షణ శిరోమణి III -396 ప.
13. అప్పకవీయము IV-461
14. ఆంధ్ర మ. భా-అనుశాస. పర్వ. సంశో ముద్ర పీఠిక
15. 'ద్విపద గణములు'— కోపె. సంపత్కు. భారతి, జూన్, 1963



# 4. అక్కరలు

తెలుగు కన్నడ సాహిత్య బాంధవ్యమునకు పరమ ప్రమాణమై నిల్చిన చందస్సు అక్కర. గణవైవిధ్యముచేత వివిధ భేదములుగల్గి, చంద్ర గణోపయుక్తములై, అత్యంత ప్రాచీనకాలమునుండియే కన్నడాంధ్ర సాహిత్యములో అక్కరలు నిలిచినవి. కాని వీని ప్రయోగము భేదములన్నిట సమానముగాక, ఉపయుక్తములైనను క్వాచిత్కములై, ఉపయోగించిన కవుల సంఖ్య సైతము బహు స్వల్పమై తెలుగు కావ్యరచన ఏర్పడిన ఒకటి రెండు శతాబ్దులలో ప్రయోగ శూన్యమైనది, లాక్షణికులు మాత్రము గతానుగతికముగా కావ్యప్రయోగము లేకున్నను, తమ లక్షణ గ్రంథములందు నిబంధించిరి.

కన్నడమున అక్కరలకు గల పేర్లు దేశీయములై సహజముగా ఉండగా, తెలుగులో సంస్కృత శబ్దముతో అచ్చికపదమును సమసింప జేసినట్టివి ఉన్నవి. కన్నడమున ప్రయోగ బాహుళ్యముగల ఈ అక్కరలు కన్నడ భాషనుండియే తెలుగులోనికి వచ్చియుండునని చేకుమళ్ళ రాజగోపాలరావుగారనిరి[1]. అక్కరలు కన్నడము నుండి వచ్చినవనుటకంటె తెనుగునుండి కర్ణాటమునకే యేల పోగూడదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు భావించినారు.[2] శ్రీ చేకుమళ్ళ వారు అక్కర, కర్ణాట భాషలో బహుళ ప్రచారములో నుండుటవలన, కర్ణాట లక్షణము విశాలమై, ఆంధ్రాక్కరలను సైతము లాక్షణీకరింప సమర్థమై ఉండుటవలన, అక్కర శబ్దవ్యుత్పత్తి, శబ్ద ప్రయోగము (సమాసగతముగా) కన్నడమున చక్కగా ఉండుటవలన, ఛందోంబుధి ప్రాచీనకాలముననే అక్కరలకు లక్షణము చెప్పుటవలన కన్నడాక్కరమే తెలుగు అక్కరకు మూలము కావచ్చుననిరి. జయకీర్తి తన ఛందోనుశాసనమున ఈ విషయమును చెప్పియున్నాడు.

సంస్కృత వాచ్యార్యాద్యాః
ప్రాకృత విషయే తు గలిత కాద్యా బహుధా
'కర్ణాటకేఽక్షరాద్యా'
విషయే * * శేర్షకాది జాతయ ఉదితాః (I-22)

జయకీర్తి క్రీ. శ. 1000 కాలమువాడు[3]. అయినను తెలుగులో యుద్ధమల్లుని బెజవాడ శాసనము (క్రీ. శ. 893-934) లోనే మధ్యాక్కర లభించినది. దీనికంటె ముందు లభించిన శాసనములలో అక్కరల ఛాయ ఉన్నవిగాని సమగ్ర లక్షణ శాసన మిదియే[4]. అట్లే వెంకయ సోడుని పొంగలపాని శాసనము (క్రీ. శ. 991) లో మహాక్కర ఉన్నది[5]. ప్రాచీనకాలమునుండియు తెలుగులో వీని ప్రయోగముండుట వలన కన్నడమునుండి వచ్చినవన చెల్లదు. పైగా జయకీర్తి తన ఛందోఽనుశాసన మున (సప్తమాధికారమున) అక్కరలన్నిటికి ప్రతిపాదము గణగణమునకు యతి అవసరమని వ్రాసినాడు.

"పాదేపాదే ప్రతిగణమపి యతిర్లక్షతే సర్వేషా మక్షరాణాం" (VII - 8) (అక్షరాణాం=అక్కరాణాం) కన్నడములో యతిలేదు. లాక్షణీకరించిన జయకీర్తి సైతము పద విచ్ఛేదమైనను తన లక్ష్యములో పాటింపలేదు. మరి యీ యతి యెట నుండి చూచి చెప్పియుండు ననినచో తెలుగులో నుండియనే భావింపవచ్చును. తెలుగునుండే అక్కరలు కన్నడమునకు పోయినవని చెప్పుటకు ఇది తగినంత సాక్ష్యము కాజాలకున్నను. కన్నడమునుండి తెలుగునకు వచ్చినవనుటకు మాత్రము అంగీకరింపనీయదు. కాగా పేకుమళ్ళవారు కన్నడ అక్కరల లక్షణ వైశాల్యము గూర్చి చెప్పి, తెలుగు అక్కరలను లాక్షణీకరింపవచ్చునని చెప్పినది కేవలము గణ విషయముగనే. తెలుగులో సైతము ఆద్యఛాందసికులైన రేచన, విన్నకోట పెద్దనలు ఈ గణములను 'అక్కరజాతి గణము'లని చెప్పియేయున్నారు. కావున ఏ భాషలో నుండియో మరొక్క భాషలోనికి వచ్చినదనుట కన్న ఉభయభాషలు ఐక్య స్థితిలోనున్న దశనుండియే ఉభయ సమానమని చెప్పుట మంచిది.

అక్కర అన్నది అక్షర శబ్దభవము. కన్నడమున ఉన్న పేర్లు దేశ్యశబ్దఘటిత సమాసములు. తెలుగులో మాత్రము ఈ అక్కర శబ్దమునకే వాని భేదముల నైదిం టిని మహా, మధ్యా ఇత్యాది సంస్కృత సమశబ్దములతో సమాస ఘటనము జరిగినది. జయకీర్తి తన ఛందోఽను శాసనమున మహాక్షర, సమానాక్షర, మధ్యాక్షర, అంతరా క్షర, అల్పాక్షరములని చెప్పగా,[6] కన్నడ ఛందోంబుధి పిరియక్కరె, దొరె యక్కరె, నడుపణక్కరె, ఎడెయక్కరె, కిరియక్కరె అని చెప్పినది. తెలుగున మాత్రము ఉభయపదములు గైకొని మిశ్రసమాసములుగా మహాక్కర, మధ్యాక్కర, సమానాక్కర, అంతరాక్కర, అల్పాక్కర అని చెప్పబడినది. ఒక్క కవిజనాశ్రయ కారుడు మల్లియరేచన 'మహాక్కర'ను 'పెద్ద యక్కరము' అని పేర్కొనినాడు

| తెలుగు | కన్నడ | జయకీర్తి |
|---|---|---|
| కవిజనాశ్రయము | ఛందోంబుధి | ఛందోనుశాసనము |
| 1. మహాక్కర | పిరియక్కరె | మహాక్షరం |
| 2. మధ్యాక్కర | వారెయక్కరె | సమానాక్షరం |
| 3. మధురాక్కర | నడువణక్కరె | మధ్యమాక్షరం |
| 4. అంతరాక్కర | ఎడెయక్కరె | అంతరాక్షరం |
| 5. అల్పాక్కర | కిరియక్కరె | అల్పాక్షరం |

సంస్కృతీయమునకు వికృతిరూపములో, వికృతి రూపములకు సంస్కృతీకరణమోగాని కన్నడపుపేర్లు తుల్యములై సరసములై యున్నవి. కన్నడ ఛందోంబుధిలో కిట్టేల్ పండితుడు (గ్రంథ పరిష్కర్త) పిరి=great, వారె=Equal, నడువ=Middle, ఎడె=Nice, కిరి=Little అని అర్థముల నిచ్చినాడు. కన్నడపు పేర్లు అక్కరల భేదములకు చక్కగా అతికినవి 'మధ్యమాక్షరం' అక్కరలో మధ్యనున్నది. 'సమానాక్షరం' లో గణములు రెండు అర్ధములకు సమానముగా నున్నవి. తెలుగులో దీనికి మధ్యాక్కర అనిపేరు. కావియిది అక్కరలైదింటిలో మధ్యలో లేదు. రెండవ వానిగ నిలిచినది. మధ్యలో విరిచిన రెండర్ధములు చక్కగా ఉండునని మధ్యాక్కర అనియుండెనా? మహా, అంతర, అల్పాక్కరలు మాత్రము కన్నడాంధ్రములలో తుల్యనామములై యున్నవి. అంతరాక్కర కన్నడమున ఎడెయక్కర (Nice)మై యున్నది. అంతరాక్కర అనక దీనిని 'అంతరాక్కర' అన్నచో 'అంత' అన్న శబ్దమునకు గల రమ్యార్థము (సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రదర్శితము) కుదిరి కన్నడపు పేరునకు సరియగును[7]. అప్పకవీయములో దీనికి లక్ష్యము నంప అంతాక్కర అన్న పేరు ఇవ్వబడినది.

భానుడిద్ద వాదిత్య సతుల చంద్రుడు
వన వద్దంబు వింతి 'నంతాక్కరంబు' (4-279)

కాని యిట్టి పేరు ఇతరత్ర కానరాకుండుటయు, జయకీర్తియు అంతరమనే వ్రాసియుండుటయు ఇది కేవల ప్రమాద పతితమేమో యనిపించును.

కన్నడ అక్కరలకు వలెనే తెలుగున అక్కరలకు గణ నియమము సమానముగా నున్నది. తెలుగులోని సూర్య, ఇంద్ర, చంద్రగణములనే వరుసగా బ్రహ్మ విష్ణు రుద్ర గణములందురు. తెలుగులో 2, 3, 4 గణములుగా ప్రయోగించగా వచ్చిన గణములు బ్రహ్మాదికము లనేకము లనవచ్చు. తొలి రెండు గణములు తొల

గించగా వరుసగా సూర్య, ఇంద్ర, చంద్ర గణములగును. అనగా సూర్య (బ్రహ్మ) గణములలో గగ, స తొలగించబడినవి. ఇంద్ర (విష్ణు) గణములలో మ, సగ; చంద్ర (రుద్ర) గణములలో మగ, సగ గణములు తొలగించబడినవి. కాని కన్నడ లక్షణములను దృష్టిలో పెట్టుకొనియో, లేక అక్కరలకు గతి కల్పించవలసియో-లేదన, విన్నకోట పెద్దనలు వీనిని సైతము తొలగింపక అక్కరజాతి గణముల పేర లాక్షణీకరించిరి అక్కరల అవసరము లేని దశలోని అనంతాదులు ఈ కన్నడ పద్ధతికి సరిపోవు అక్కర జాతి గణములను పరిహరించిరి. తెలుగు సాహిత్యములో అక్కరల అవసరము లేనప్పుడు తెలుగు ఛందో లక్షణ గ్రంథములలో అక్కరజాతి గణముల అవసర మెంపలకని తెలుగు లాక్షణికులు భావించి ఉండరు.

కన్నడ వొరె (మధ్యాక్కర) అక్కరలో గణముల విషయమున మరి రెండు నియమములున్నవి. 1) చివరనున్న బ్రహ్మగణము (సూర్య) గుర్వంతమై యుండవలయును. 2) బ్రహ్మ గణములలో 3 లేదా 4 మాత్రలవి, విష్ణు గణములలో 4 లేదా 5 మాత్రలవి మాత్రమే వాడవలయును. తెలుగులోని మధ్యాక్కరకు ఇది చక్కగా సరిపోవును మధ్యాక్కర గేయ ఛ్ఛందమనుటకు పైవి ఆధారములగును.

తెలుగులోని అక్కర భేదములైదింటికి గణ నియమము పరిశీలించితిమేని, ఐదింటిలో మధ్యాక్కర తప్ప తక్కిన నాల్గింటికి ఒక క్రమ విధానమున్నది. మధ్యాక్కర గణ నియమము పరిశీలించిన ఇది అక్కరలలో చేర్పదగినది కాదేమో యని పించును.

| క్ర. సం. | అక్కర పేరు | గణముల వరుస సూర్య/ బ్రహ్మ | ఇంద్ర/ విష్ణు | చంద్ర/ రుద్ర | మొత్తము గణములు |
|---|---|---|---|---|---|
| 1 | మహాక్కర/పిరియక్కర | 1 | 5 | 1 | 7 |
| 3 | మధురాక్కర/నడువణక్కర | 1 | 3 | 1 | 5 |
| 4 | అంతరాక్కర/ఎడెయక్కర | 1 | 2 | 1 | 4 |
| 5 | అల్పాక్కర/కిటియక్కర | - | 2 | 1 | 3 |
| 2 | మధ్యాక్కర | 2 ఇం. గ. + 1 సూ. గ. + 2 ఇం. గం + 1 సూ. గ = 6 | | | |

తక్కిన అక్కరలన్ని ఒక విధముగా, మధ్యాక్కర ఒక విధముగా గణక్రమము గల్గియున్నది. అక్కరలన్నిటికి ముందు సూర్యగణమొకటి (అల్పాక్కరకు తప్ప), చివర చంద్ర గణము తప్పనిసరి. చంద్రగణముల ఉపయోగము అక్కరలందే ఉన్నది. తక్కిన ఒకటి రెండు ఛందము లందున్నను అవి తెలుగులో ఉపయోగములో లేనివే. అట్టి చంద్ర గణోపయోగము లేక అక్కర జాతిలో యిది (మధ్యాక్కర) చేర్పదగినదేనా యనిపించును. పాదమును సమద్వి ఖండన మొనర్చు విధానము, గణముల యతిని బట్టి విడదీయ సాధ్యమగుట మధ్యాక్కరలో తప్ప ఇతర అక్కరలలో సాధ్యముకాదు. మధ్యలో సూర్యగణము అక్కరలలో లేనిది. ఇట్లు మధ్యాక్కరనుండి చూచిన తక్కిన అక్కరల లక్షణము, అక్కరల నుండి చూచిన మధ్యాక్కర లక్షణము విలక్షణమై ఇట్టి శంకకు కారణమగుచున్నది. అంతేగాక మధ్యాక్కర జానపద గేయ చ్ఛందము మూలముగా గల్గినది. తక్కిన విట్టివి కావు. జానపద చ్ఛందములలో నుండవలసిన గణయుత్సంఖ్య (సరి సంఖ్యలో గణముల పద్ధతి) అక్కరలో లేదు. అన్ని బేసి సంఖ్యలోనున్న గణములే. ఒక్క అంతరాక్కర మాత్రము 4 గణములది. పాదమున కొక్కవానికి గణముల మొత్తమును పరిశీలించినచో మధ్యాక్కర 2వ స్థానమున నుంచవచ్చును. 1) మహాక్కరకు మొత్తము 7 గణములు, 2) మధ్యాక్కరకు 6 గణములు, 3) మధురాక్కరకు 5 గణములు, 4) అంతరాక్కరకు 4 గణములు, 5) అల్పాక్కరకు 3 గణములు పాదమునకున్నవి. ఈ గణముల వరుస చూచినచో మధ్యాక్కర అక్కర భేదములలో 2వ స్థానమున నుండదగినదే. పై పట్టికలో గణములు వరుస చూచినచో సూర్య చంద్ర గణములు పాదము యొక్క ముందు వెనుకల ఒక్కొక్కటి ఉండి మధ్యలో ఇంద్ర గణముల సంఖ్య తగ్గుచుండుట కాంచనగును. ఆ వరుసలో మధ్యాక్కర నుంచినచో మధ్యాక్కరకు సైతము 1 సూ.+4 ఇం.+1 చం. వరకు ఉండవలయును. అనగా గణముల మొత్తము ఆరు. మధ్యాక్కరలోని గణములు మొత్తము 2 ఇం+1 సూ.+2 ఇం+1 సూ.=6 గణములే. జానపద చ్ఛందములను దేశ్యగణ వ్యవస్థతో పరిశీలించునపుడు గణ విభజనలో ఏమైనా పోలికలు కలవేమో పరిశీలించవలయును.

| | |
|---|---|
| ఇపుడున్న మధ్యాక్కర పాద గణములు | ఇం+ఇం+సూ * ఇం+ఇం+సూ |
| ఊహించుకున్న " " " | సూ+ఇం+ఇం * ఇం+ఇం+చం |

(* ఈ గుర్తు యతి స్థానము)

ఈ రెండు గణ క్రమములు ఇంచు మించు తుల్యములే యగుచున్నను చంద్రగణము ఈ వ్యవస్థలో లభించదు. యతిచేత రెండుగా విడిపోవుచున్న మధ్యాక్కర పాదములో యతిపూర్వ గణములు 2 ఇం+1 సూ. లేక 1 సూ + 2 ఇం అగుచున్నవి. యత్యనంతర ఖండములో అట్లే 2 ఇం + 1 సూ. కు బదులు 2 ఇం + 1 చం. గణము చేర్చబడవలె అనగా 1 సూర్య గణమునకును మరి రెండక్షరములు కలిపిన 1 చంద్రగణ మేర్పడును. అనగా ఇపుడున్న వ్యవస్థకు చివరగా కొంచెము మార్పు చేసిన క్రొత్త గణ వ్యవస్థ సిద్ధము కాగలదు.

హ నల నల * భ నల హ<br>
UI, IIII, IIII * UII, IIII, UI 1 సూ + 4 ఇం + 1 సూ దీనినే<br>
UII, IIII, III * UII, IIII, UI 2 ఇం + 1 సూ + 2 ఇం + 1<br>
భ నల న * భ నల హ సూ. గా చూపవచ్చును.

పై పట్టికలో మొదటి 'హ' కు బదులు నగణము వేసికొన్న పైరీతిగా ఉభయ విధములకు సరిపడును.

హ త త * నగ నగ న<br>
UI, UUI, UUI * IIIU, IIIU, III 1 సూ + 4 ఇం + 1 సూ<br>
UIU, UIU, UI * IIIU, IIIU, III 2 ఇం + 1 సూ + 2 ఇం+<br>
ర ర హ * నగ నగ న 1 సూ. గా మార్చవచ్చును.

న నల నల * నల నల న<br>
III, IIII, IIII * IIII, IIII, III 1 సూ + 4 ఇం + 1 సూ<br>
IIII, IIII, III * IIII, IIII, III 2 ఇం + 1 సూ + 2 ఇం+ 1 సూ<br>
నల నల న * నల నల న

ఇట్లు పాత పద్ధతిని సవరించిన క్రొత్త పద్ధతి గణములుగా మార్చవచ్చును గాని చివరి సూర్యగణము చంద్రగణ మొకటిగా మారుటకు 1 లేదా 2 అక్షరములు కావలయును. కాని యట్టి వ్యవస్థ ఏ లాక్షణికుడును చెప్పినది కాదు. శాసన కావ్య ప్రయోగములలో ఇట్లు సరిపడునట్లు వ్రాసిన ఉదాహరణములు లేవు. మధ్యాక్కర తక్కిన అక్కరలకు భిన్నమైనలక్షణము కల్గియుండుటచే నిట్లు యోజింపబడినదేగాని లక్ష్యవిధేయము కాదు. ఇట్లు యోచించుటకు మరియొక కారణమున్నది. కన్నడములో పిరియక్కర (మహాక్కర)లో ఆఖరు గణము చంద్ర గణము కావలసియుండగా సరిపాదములందు 6 వ గణము విష్ణు (ఇంద్ర) గణమునకు బదులుగా బ్రహ్మ (సూర్య) గణము ఉండవలయునని నియమ విశేషము ఉన్నది. అట్లే 2, 4 గణ

ములు సూర్య గణములు కావచ్చునన్న వేరొక్క నియమ విశేషము తెలుగులో చెప్పబడినది. ఇట్లు సూర్య గణములుగ పెట్టుట గూర్చిన ఐచ్ఛికాంశము దృష్టిలో విడుకొని ఆఖరు చంద్రగణమునకు బదులు సూర్యగణము పెట్టి మధ్యాక్కరకు క్రొత్త గణవ్యవస్థను ఊహించుట జరిగినది.

## మహాక్కర లక్షణ పరిశీలనము :

మహాక్కర గణములు స్థూలముగా పాదమునకు 1 సూ. గణము, పైన 5 ఇంద్రగణములు చివర 1 చంద్రగణము ఉండవలయును. కాని దీనికి తెలుగులో పలువురు సూర్యగణారోప స్వేచ్ఛను చెప్పినారు. కవి జనాశ్రయకారుడు చెప్పలేదు కాని తర్వాతి వారందరు 2, 4వ గణములలో ఇంద్రగణములకు బదులు సూర్య గణములు వాడుట గూర్చి ఐచ్ఛికత్వమును చెప్పినారు.

1) వారిజాప్తుండు పంచేంద్ర గణములు వనజారియును గూడి వెలయుపంత
నారయ రెండవ నాలవఁ జోట్ల నర్కుఁ డయిననుం దనర్చుమంత
—కావ్యా. చూడా VIII-54

ఇట్టి లక్షణమును విన్నకోట పెద్దన 'చెప్పినవారిలో' మొదటి వాడగును.

పై మహాక్కరలో 2 వ పాదములో 'నారయ' - ఇంద్రగణముగా, 'జోట్ల' సూర్యగణముగా వాడబడినది. అనగా 1 వ గణము సూర్యగణము ఉండవలసి యుండగా, ఇంద్రగణముండి, 4 వ గణము ఇంద్రగణము ఉండవలసియుండగా సూర్యగణమున్నది. ఇది మరియుక విశేషము. 2వ, 4వ స్థానముల సూర్యగణము పెట్టవచ్చునని లాక్షణికులు చెప్పినను 1వ గణము సూర్యగణమునకు బదులు ఇంద్ర గణముంచవచ్చునని యెవ్వరును చెప్పలేదు.

2) నాదిహరి గొల్వ రెండును నాలుగు, నగు వాసరంబును నర్కుఁడైన
నాదరంబున నెడ నొచ్చునని మహాక్కరంబలుకు మరార్యులెల్ల
— ఛందో ద. III — 40

అనంతుడు 1 వ గణము సూ. గ. కు బదులుగా భగణము, 4వ గణము ఇంద్ర గణము బదులుగా సూర్య గణమును వాడినాడు. 2వ, 4వ గణము సూర్యగణమన్న విశేష లక్షణమును కూడ చెప్పినాడు.

3) "రెండవ చోట సార్గింటను వనజహిత గణంబైన వచ్చి పరుసలో నెడ సొచ్చు" నని లక్షణ సార సంగ్రహ (II - 103) ములో నిట్లే చెప్పబడినది.

4) అట్లే అప్ప కవి కూడ
"చేరు రెండవచోట నాల్గవచోట చిత్రభాను గణంబు గడియుచుండు" (IV - 463) అని పేర్కొనెను.

5) అట్లే పొత్తపి రమణకవి కూడ తన లక్షణ శిరోమణిలో
"గదియు నొక్కొక తటి రెండు నాలుగు
గణముల చోట్లను నినగణంబు" (III - 3:9) అనినాడు.
పై లాక్షణికుల లక్ష్యములలో విన్నకోట పెద్దన లక్ష్యము పరిశీలించిన

1) 2వ, 4వ గణములు సూర్య గణములు కావచ్చుననినను, ఒక్క గణము సూ. గ. చేసి వేరొక్కటి ఇంద్రగణముగ నుంచినాడు.

2) 2వ 4వ గణములలో ఒకటి సూర్యగణమైనది. కాగా మొదటి సూర్య గణమునకు బదులు ఇంద్రగణము వాడినాడు.

3) 2వ, 4వ ఐచ్ఛిక స్థానములు, 1వ గణము నియత స్థానముగ సూర్యగణ నిపాత యోగ్యములైనను పాదములో ఒక్కమారు మాత్రమే సూర్యగణమును వాడినాడు.

ఇట్టివి నియమములని చెప్పకున్నను లక్షణములుగా భావింపవచ్చునని శ్రీ సంపత్కుమార గారు వ్రాసినారు.[2] నిర్ధరించుటకు మరొక్క లక్ష్యము తెలుగు కావ్యవాఙ్మయమునందు గానరాదు.

## మధ్యాక్కర లక్షణ పరిశీలనము :

ఇక మధ్యాక్కర లక్షణము పరిశీలించబడుచున్నది. 2 ఇంద్రగణములు మీదనొక్క సూర్యగణము పిదప యతిస్థానము, ఆ పిదప తిరిగి ఇదే గణక్రమము మధ్యాక్కర పాదమునకుండ వలయును. అక్కరలన్నిటిలో రెండే అక్కరలు తెలుగులో వాడబడినవి. అవి మధ్యాక్కర, మధురాక్కరలు. అవియును భారతముయొక్క 3 పర్వముల తెనుగింపులో కానవచ్చుచున్నవి. వానిలో మధ్యాక్కరలే ఎక్కువ సంఖ్యలో నున్నవి. అవి మొత్తము 40. ఎఱ్ఱన వాడిన ఒక్క మధ్యాక్కర పతి

లిన తక్కిన 39 నన్నయవే. (ఆదిపర్వములో 14 + సభాప. 2 + అరణ్యప. 23) ఎత్తిన మధ్యాక్కరలక్షణోద్దిష్టవే. నన్నయ అక్కరలే లక్షణమునకు లొంగకున్నవి.

వీని విషయమై పెక్కురు పండితులు పరిష్కారమార్గములకై ప్రయత్నించినారు. పసుమల చినసీతారామ స్వామి శాస్త్రిగారు,[9] గిడుగు సీతాపతిగారు, వేకుమళ్ళ రాజగోపాలరావుగారు[11], దివాకర్ల వేంకటావధానిగారు[12], కోవెల సంపత్కుమారాచార్యగారు[13] వీరిలో ముఖ్యులు.

వేకుమళ్ళ వారు చూపినవి.

1) మారంగ - ననుదుని - షధదే - శంబప - కరిగియా - హంస
(అరణ్య - II - 22)

2) భూమికి - పర్షముల్ - గురియిం - చెనుసస్య- ముల్వృద్ధి- దొంద
(అరణ్య - III - 206)

3) ఏనేడు - లమ్మెను - మనయు - ద్ధుపుదేగి - యింతకే - తెంచు
(అరణ్య - IV - 3)

ఇట్టి తృతీయ సూర్యగణస్థలములందు 'సగణము' అక్కరజాతి గణముల పద్ధతి (కన్నడ దేశీయ గణములని వీనిని విమర్శకులు సంకేతించినారు) లో పరిష్కరింపబడినవి. ఉత్తమ పరిష్కృత ఆంధ్ర మహాభారత పాఠము నందింప తలపెట్టిన మహాభారత సంశోధిత ముద్రణములో తిరిగి వీనిని ఛందోదోషములని గుర్తించి, వేరు పాఠములు ఇవ్వబడినవి[14].

నన్నయ మధ్యాక్కరలలో లక్షణమునకు లొంగని వివి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తనుమధ్య | తానొక్క | కన్యక | సురనకీ | తటమున | మున్ను |
| భూపాల | నీకుని | క్కోమ | లిఖమందు | బుట్టిన | సుతుడు |
| నీ పరో | క్షంబున | రాజు | కావలయు | నెమ్మిని | ట్లీగ |
| తన దివ్య | శక్తిన | ప్రాశ | ములవిడిచి | తన్మని | నాథు |
| నంగురు | కులహాని | కరుడై | ధారుణీ | నాథనీ | సుతుడు |
| అమరంగ | ధర్మువు | రక్షిం | చప్రీతి | వనిశత్రు | లందు |
| ఖలుగుచె | ఱింగియు | సాయ | పూర్వమున | గడగిత | త్సిద్ధి |

చరితుడై నిజనాథు డటిగి నదోన చనియెన వ్యార్త
ఏషేమ మున్నపూ జింతు ముర్ద్రుదు నిందని వేడ్క
పదుంద్ర బోలెడు సుతుల నూర్వ్వర బడయంగ వలతొ
పదుంద్ర నూర్వ్వర కెనయ గుసుతుల బడయంగ వలతో
అరుణ స రోరుహ దళమ్ము దులంబు లై సయ త్తరుణి
పరగనా కారణ మునని ట్టి దుఃఖ భారము దాల్చె
అరిగినీ శానుది క్కునకు నీయనుజు డనిలవే గమున
మాయమా ర్గగుణా నిగమ నంబు మందమై యుండ
తోవేగ నుత్తర ముమించి ధర్మని త్యుడుధర్మ జుండు

వీనికి గణములు నిర్ణయించుటకు (చూపుటకు) బహుళ పాఠములే సవరించి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు చూపినారు. "అర్థమునకుగాని, నన్నయ భాషా ప్రయోగ పద్ధతికిగాని వైరుధ్యము లేకుండ స్వల్పమయిన మార్పుచేసి లక్షణానుగుణముగా సవరణ జరిగినద"ని చెప్పినారు. లక్షణానుగుణముగా సవరణ జరిగినది లక్ష్యమును బట్టి లక్షణముగాని, లక్షణమును బట్టి లక్ష్యము కాదుగదా! గణములనుబట్టి పద్యమును మార్చుటన్నది ఇచ్చట విశేషము. ప్రాచీన ప్రతులలో పొరపాట్లను లేఖక ప్రమాదములని గుర్తించుచున్నామే, ఇవి ప్రమాదములుగాక పనిగట్టుకొని మారి, నవి గదా! కవిపాఠము తెలియక, లభించిన పాఠములన్నిటిని గౌరవించి అథస్సూచికలలో నిచ్చుట కావ్య ముద్రణావసరమున సంప్రదాయమైయున్నదే. అట్టియెడ పాఠమే మనము కల్పనమొనర్చుట యెట్లు? లక్షణమునకు కుదరకున్న పోనిందు భావి విమర్శకులకే లక్షణమైన నవ్యమైనది లభింపవచ్చునేమో!

వీనిలో కొన్నింటికి గణభంగము లేని పాఠాంతరములున్నవి.

| | ప్రస్తుత పాఠము | లక్షణ భంగములేని పాఠాంతరము |
|---|---|---|
| 4) | పాళ - ముల విడిచి | పాళ - ములుడిచి |
| 14) | దిక్కునకు - నీ యనుజు | దిక్కునీ - యనుజన్మ |
| 15) | మాయామా - ర్గగుణా | మాయావి - యగువాని |
| 16) | నుత్తర - ము మించి | నుత్తర -మించి |

లేఖక ప్రమాదములని గుర్తించినవి

| | | |
|---|---|---|
| 4) | కన్యక | కన్య |
| 5) | కరుడై | కరుడు |
| 6) | రక్షించుఁ బ్రీతి (అర్ధ బిందు) | రక్షించుం బ్రీతి (నిండు సున్న) |
| 8) | దలిగినఁదోవ (అరసున్న) | దలిగినందోవ (నిండుసున్న) |

4 పాఠాంతరములు + 4 లేఖక ప్రమాదములు = 8 పోగా మిగిలిన ఎని మిది 2, 3, 7, 9, 12, 13,14, 16 – 10, 11 తప్ప అనగా 'పదుంద్ర' అన్న శబ్దములు గలవి తప్ప – తక్కినవి గిడుగు వేం. సీతాపతిగారి సూచన ననుసరించి కుదురును. మిగిలిన ఈ యెనిమిదింటికి శ్రీ సంపత్కుమారగారు సవరణలు చూపినారు.[15] గిడుగు సీతాపతిగారి సూచన కన్నడ మహాక్కరకు గల బ్రహ్మ (సూర్య) గణముల యొక్క ఐచ్ఛికత ననుసరించినది. వారు తమ ఛందో రీతులలో కన్నడ పిరియక్కరలోను, దానికి సరియైన తెలుగు మహాక్కరలోను మొదట నుండవలసిన బ్రహ్మ (సూర్య) గణముగాని తనస్థలము మార్చుకొని రెండవ గణముగా గాని నాల్గవ గణముగాగాని ఉండవచ్చునని లాక్షణికులు చెప్పినారు. అట్లే దొరె అక్కరలో మూడవ గణమైన బ్రహ్మగణమున్ను మధ్యాక్కరలో మూడవ గణముగా ఉండే సూర్యగణమున్ను రెండవ గణముగనో నాల్గవగణముగనో ఉండవచ్చునన్న అనుమతి ఉండెనేమో! ఉండుచున్నయెడల ఒక "పదుంద్ర బోలెడు...." అను మధ్యాక్కర తప్ప (అర. 2-348) తక్కిన మధ్యాక్కర పాదములన్ని లక్షణ సమన్వయమయినట్లే చెప్పగలను" అని వ్రాసి[16] 3, 4, 6, 7, 9, 12, 13, 14, 16 సంఖ్య గల పాదములను సమన్వయపరచినారు. కాని యట్టి సూర్యగణోపయోగములోని ఐచ్ఛికత మహాక్కర కుండగా, దానిని మధ్యాక్కరకు సమన్వయింప యత్నించిరి. కాని దీని కుండ వలయునని ఎక్కడను ఆధారము లేదు. ఏ కన్నడ లాక్షణికుడును చెప్పలేదు. సంపత్కుమారగారు గూడ దీనిని ఖండించినారు[17].

ఇట్లు నన్నయ మధ్యాక్కరలు ఏ లక్షణమునకు (కన్నడ లక్షణమునకుగాని, కల్పిత లక్షణమునకుగాని) లొంగక యున్నవి. ఇట్లు నన్నయ వ్రాయుటకు అతని సమీప కాలములో మధ్యాక్కర లక్షణమేమైన ఇట్టి మార్పులకు లోనైనదో తెలియరాదు. లేఖక దోషములు కొన్ని యుండవచ్చును. వేరు పద్యములతో తైపారు వేత

మన్న మధ్యాక్కర ఉపయోగము ఇతర కావ్యములందు కానరాదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనావస్థ మధ్యాక్కరలందు సైతము ఇట్టి గణభంగములు పెక్కు కాన వచ్చుచున్నవి.

ఈ శాసనములలోని పద్యములోని గణభంగము లన్నియు సవిమర్శకముగా ప్రాఙ్నన్నయయుగపు దేశి ఛ్ఛందస్సులలో వివరింపబడినవి. ఆ శాసనము పరిశీలింపగా కన్నడదేశి గణవ్యవస్థ నాడు ప్రచారములో నుండెడిదని తెలియును. ఆ గణములు నన్నయ అక్కరలను సాధువులనుచేయుటకు సరిపోవు.వఝల వారు నన్నయ అక్కరలకు సరిపోవు గణము లన్నియు మధ్యాక్కర కొఱకు స్వీకరించిరి. దానితో గణముల సంఖ్య అపారమై పోయినది.

నన్నయ మధ్యాక్కర సవరణకు ప్రయత్నించిన వారి రీతులు ఈ క్రింది విధముగా నున్నవి.

| | | |
|---|---|---|
| 1) చేకుమళ్ళ రాజగోపాలరావుగారిది | — | కన్నడ బ్రహ్మ విష్ణు రుద్ర గణముల నాధారము చేసికొనుట. |
| 2) వఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారిది | — | యథాతథముగా గ్రహించి వాటిని సూర్యేంద్ర చంద్రగణములలో చేర్చుట. |
| 3) గిడుగు వేంకట సీతాపతి గారిది | — | మధ్యాక్కరలోని 3వ గణమైన సూర్య గణము - 2వ లేక 4వ గణముగా ఉండవచ్చునని ప్రాచీన లాక్షణికాను మతి లేకయే ఊహించి యత్నించుట. |
| 4) దివాకర్ల వేంకటావధాని గారిది<br>5) కోవెల సంపత్కుమార గారిది | — | భాషా, కావ్యార్థ, ఔచిత్య, సందర్భాను గుణముగా పాఠ సవరణ. |

పై రీతులు ఒక్కొక్కటి ఏదో ఒకరీతి సమర్థింపబడుటకే కల్పించబడినవి గాని సమగ్రము ఏదియు కాజాలకున్నది. గిడుగువారు తమ గ్రంథములో ఉద్ధరించిన వఝల వారి అభిప్రాయానుసారము "దిద్దుబాట్లు లేనట్టియు, తప్పుల కుప్పలు కానట్టియు ప్రతులు దుర్లభంబులై యుండుటచేత నన్నపార్యుని యక్కరల వైఖరి నిర్ణయింప శక్యముగాకున్నది" అన్నమాట ఐ ఈనాటికిని సత్యములే.

## అంతరాక్కర లక్షణ పరిశీలనము :

అంతరాక్కరకు 1 సూ. గ. + 2 ఇం. గ. + 1 చం. గ. పాదమున కుండును. చంద్రగణము రెండు సూర్యగణములుగా విభజితమగునేని ఇది తేటగీతి పద్యము కాగలదు.

తేటగీతికి 1 సూ. గ. + 2 ఇం. గ. + 2 సూ. గ. పాదమునకుండును. నహ (I I I UI), రల (UI UI) అన్న చంద్రగణములు రెండు రెండేసి సూర్య గణములుగా విడిపోగల్గి యున్నవి. ఇవికాక అక్కరజాతి సూర్య గణములను నాల్గింటిని (UU, IU, UI, III) గ్రహించితిమేని నవ, సహ, సలల, భల, నలల తప్ప అన్ని చంద్ర గణములు రెండేసి సూర్యగణములుగా విడిపోగల్గును. కాని తేటగీతిలో (ఇది అక్కరేతర జాతిగనుక) ఇవి (గగ, వ) ఉపయోగమున లేక హ, న లు మాత్రమే వాడబడుట వలన నహ, రల అన్న చంద్ర గణములు మాత్రము వాడిన అంతరాక్కర తేటగీతి యగును. చంద్రగణములకు సరిపడు పదములు అంత పెద్దవి తెలుగు భాషకు సహజమైనవి కావు. కనుక గణమున కొక్క పదమన్న నియమము వాదాపుగా గల దేశి చ్ఛందములందు ఇవి ఉపయోగములో లేకపోయినవి. మధ్యాక్కరకు తప్ప తక్కిన అక్కరలకు ప్రాముఖ్యము లేకపోవుటకు చంద్ర గణోపయోగ మొక కారణము. ఇట్లు అంతరాక్కర ప్రాసగల తేటగీతి కాగల్గియున్నది.

## అక్కరల యతి పరిశీలనము :

అక్కరలలోని యతులన్నియు సుమారుగా పాద మధ్యమున నున్నవి. దేశి చ్ఛందములలో యతి సాధారణముగా పాదమును సమద్విఖండన చేయునుగదా! ఇచ్చట పెద్దదైన చంద్రగణమును రెండు చిన్న గణములుగ భావించవలయును. అప్పుడు యతి మధ్యలో కన్పట్టును.

1) మహాక్కర :

1 2 3 4 5 6 7+8

సూ + ఇం + ఇం + ఇం + ఇం + ఇం + చం. 1 చం. గ. 2 చిన్న గణములుగ భావించిన మొత్తము గణములు 8 మహాక్కరకు యతి 4 గణముల తర్వాత ఉండును. అనగా సమద్విఖండితమైనది

2) మధ్యాక్కర :

1 2 3 4 5 6

ఇం + ఇం + సూ + ఇం + ఇం + సూ పాదమునకు మొత్తము 6 గణములు. యతి 3 గణముల పిదప ఉండును.

3) మధురాక్కర :

1 2 3 4 5+6

సూ + ఇం + ఇం + ఇం + చం. మొత్తము ఆరు గణములుగ భావించ వలయును. మధురాక్కరకు యతి 3° గణముల తర్వాత ఉండును. అనగా సమద్విఖండనమైనది.

4) అంతరాక్కర :

1 2 3 4+5

సూ + ఇం + ఇం + చం మొత్తము గణములు పాదమునకు ఐదుగ భావింపవలయును. సమద్విఖండనమనగా 2½ గణముల తర్వాత ఉండవలయును. మూడవ గణము చివరి అక్షరమునకు ముందు యతి యని లాక్షణికోక్తము.

5) అల్పాక్కర :

1 2 3+4

ఇం + ఇం + చం. మొత్తము నాలుగు గణములు అగును. యతి 2 గణముల మీద అల్పాక్కర కుండును.

యతి విచ్ఛేద భావమున నున్నప్పుడే సమద్విఖండనమగును. సదృశాక్షర నియతి తెలుగు సంప్రదాయమైనను. జయకీర్తి తన ఛందోఽనుశాసనమున "పాదే పాదే ప్రతిగణమపి యతిర్లక్షతే సర్వేషామక్షరాణామ్"ని[13] అక్షర (అక్కర) ఛందములలో ప్రతిగణము విశ్రాంతి (విచ్ఛేద రూపము) గల్గియుండవలయునని చెప్పినాడు. విచ్ఛేదమున్న గానల శ్రుతి సుభగమగును.

ఒక్క చంద్ర గణమును 2 సూర్య గణములుగా విడిపోవునట్లు విన్నకోట పెద్దన వ్రాసి యున్నాడు. తన కావ్యా. చూడామణిలో

1) మహాక్కరలో స హ

III UI

1వ పాదం ఆఖరు చం. గ. వెలసు చరిత (వసు-చరి. గ.)

| | | | |
|---|---|---|---|
| | హ | హ | |
| | UII | U I | |
| 2వ ,, ,, ,, | నర్చు | చుంచ | (రల-చం. గ.) |
| | న | హ | |
| | III | UI | |
| 4వ ,, ,, ,, | అతిశ | యిల్లు | (నహ-చం. గ.) |
| 2) మధురాక్కరలో | న | హ | |
| | I I I | U I | |
| 1వ పాదము ఆఖరు చం. గ. | నయుతి | నొంద | (నహ-చం. గ.) |
| | హ | హ | |
| | UI | UI | |
| 2వ ,, ,, ,, | నింపు | మీఱ | (రల-చం. గ.) |
| | హ | హ | |
| | U I | U I | |
| 3వ ,, ,, ,, | రాక్క | రంబు | (రల-చం. గ.) |
| 3) అంతరాక్కరలో | న | హ | |
| | I I I | U I | |
| 1వ పాదము ఆఖరు చం. గ. | గణయు | గంబు | (నహ-చం. గ.) |
| | హ | హ | |
| | U I | U I | |
| 2వ ,, ,, ,, | కంద | ళింప | (రల-చం. గ.) |
| | న | హ | |
| | I II | U I | |
| 3వ ,, ,, ,, | నతిశ | యిల్లు | (నహ-చం. గ.) |
| | హ | హ | |
| | UI | U I | |
| 4వ ,, ,, ,, | షష్ఠి | సంఖ్య | (రల-చం. గ.) |
| 4) అల్పాక్కరలో | U I | U I | |
| 2వ పాదము ఆఖరు చం, గ. | నిండి | మీఱ | (రల-చం. గ.) |
| 3వ ,, ,, ,, | గాంగు | క్షే | (రల-చం. గ) |

ఇవి యీ రీతిగ ఉపయోగించినాడు.

కవిజనాశ్రయ కారులు ఇట్టివి వాడిరి కాని అవి స్వాభిప్రాయములే. ఒక్క చంద్ర గణమును రెండు సూర్యగణములుగా పృథక్కరింపబడునట్లు ఇంత స్పష్టముగ ఇంత బహుళముగ వాడరైరి. ఇట్టి చంద్ర గణమును సూర్యగణద్వయ భావనతో ఒకే గణముగా భావించి మహాక్కరలో 7 గణములకు 4 గణముల మీద, మధురాక్కరలో 5 గణములకు 3 గణముల మీద యతి ఆటవెలది తేటగీతులలో 5 గణములకు 3 గణముల మీద యతి చూచి కాకోలు శ్రీ బండి నాగరాజుగారు "పాదమందలి గణ సంఖ్యను రెంటిచే భాగించి శేషము వచ్చిన ఒకటిగా కలుపుకొని, ఆమీద గణారంభమున యతి చెప్పుట జాత్యుపజాతులందు సంప్రదాయ"మని తెల్పినారు[19]. కాని వారు సమద్విఖండన రూపయతి గల రగడలు, సీసము, ద్విపద, మధ్యాక్కర, తరువోజ, ఉత్సాహ మున్నగువానిని గణింపరైరి. పై పరిశీలనములో అక్కరలు సైతము ఇందుమించుగా యతి విషయమున పాదమధ్యయతి యుతములే యని భావింపవలయును. ఇట్టి ఈషన్మాత్ర భేదము సైతము గేయ చ్ఛందములను గణములలో కొలుచుట వలన సంభవించినది.

## మధ్యాక్కర యతి :

మధ్యాక్కర యతి గూర్చి తెలుగులో భిన్న సంప్రదాయములున్నట్లు కానవచ్చును. ప్రయోక్తలలో బెజవాడ శాసనకర్త, నన్నయభట్టు ఒక పక్షమువారు, ఎఱ్ఱాప్రెగడ ఒక పక్షము. లాక్షణికులలో అధికాంశము ఎఱ్ఱాప్రెగడ వైపే. కొందరు మాత్రము ఉభయ మతములను తమ లక్షణములలో పాటించిరి. ఒకే కావ్యమున ఆంధ్ర మహాభారతమున కేవల పర్వత్రయములో వాడబడిన మధ్యాక్కర, కవులగు ఎఱ్ఱన, నన్నయలచేత లక్షణ ద్వైవిధ్యము గల్గియుండుటచే 'ప్రయోగ శరణం' -లక్షణము అన్న విధముగా ఉభయ మతములను తమ లక్ష్యములలో పొందుపరచి ఉండవచ్చును.

ఆరు గణముల మధ్యాక్కరలో 4 గణముల మీద యతి నన్నయ, బెజవాడ శాసనకర్త వాడగా, 3 గణముల మీద అనగా పాదము యొక్క అర్ధ భాగము మీద ఎఱ్ఱాప్రెగడ, కవిజనాశ్రయకర్త వాడినారు.

### 1) బెజవాడ శాసనకర్త :

స్వస్తిన్ప్ర పాంకుశా త్యంత పత్సల * సత్యత్రి నేత్ర
విస్తర ప్రేయుద్ధ మల్ల దసపద్య * విఖ్యాత కీర్తి

ప్రస్తుత రాజాశ్రి యుండు త్రిభువనా * ధరమ్ము సకల
వస్తుస షేతుబ్బు రాజ సత్కృభూ * వల్లభ ద్ధతి=

అని ఇట్లు చతుర్ధ గణాంతమైన యతి స్థానము అనగా పంచమగణాద్యక్షరముతో వడిమైత్రి పాటింపబడినది. నన్నయ కూడా తన మధ్యాక్కరలలో యిదే పద్ధతిని నడిపెను. నన్నయ వాడిన మొదటి మధ్యాక్కర

ధరణిజ రాచర భూత సంఘంబుఁ * దమవిష వహ్ని
సురగంబు లేర్చుచు నునికి కలిగిన * యొరుహ గర్వ
దురగవి షాపేత జీవ సంజీవ * నోపదే శంబు
గరుణగ శ్యపునకు నిచ్చె నఖిలలో * కహితంబు పొంచె

— ఆది ప. 2-183

ఇక రెండవ మతమైన 3 గణముల మీద యతి (అనగా చతుర్ధ గణాద్యక్షరమునకు సదృశాక్షర రూపము)

**2)** మల్లియ రేచన : (క. జా. జాత్యధి)

సురరాజు సురరాజు గూడి * సూర్యుతో నొడబడి మఱియు
గరమొప్ప నిప్పాట నాఱు * గణముల మధ్యాక్కరంబు
సురుచిర మగనుసు శబ్ద * శోభితం బగునట్లు గాగ
విరచింప బంపెఁబ్రా వళ్ల * వెలయగ విజనాశ యుందు

**3)** ఎఱ్ఱాప్రెగ్గడ (అర - IV - 309)

అసదృశ తేజుడు బ్రాహ్మ * జానీక సహితుడై కడగి
వసుమతి యంమున ధర్మ * వర్తులై యున్నవ్మ ప్పలను
మసలక నిజశక్తి జేసి * మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుం డౌనరించు పేర్మి * వాణిమే ధమున్కి మెప్ప

ఎఱ్ఱన వాడినది ఒకే ఒక అక్కర. దీని తర్వాత 8 (మరి) తెలుగు సాహిత్యమున కవి ప్రయోగములో మధ్యాక్కర లేకుండుట వలన లాక్షణికులు గతానుగతికముగా కవిజనాశ్రయము మతమునే స్వీకరించి లక్షణము చెప్పుటయు జరిగినదన వచ్చును. నన్నయ మార్గములోనే పాలితనము 'తత్రభవసంపదా' హృద్య మొనర్చిన

ఎట్టియు మధ్యాక్కర వాడుట నన్నయ యతి నియమమును పాటింపలేదెందులకన్న ప్రశ్నవచ్చును.

శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు "ఈ భేదాలకు కారణం ఆ లక్షణం పాదబద్ధేటప్పుడు ఉండిన ఒత్తిడి (Stress) లో భేదం అనే చెప్పవచ్చు. ఒక కాలంలో ఉండే ఒత్తిడి ఆ తర్వాతకాలంలో లేకపోవడం బట్టే ఇట్టి చిన్న భేదాలు కల్గినాయి" అని అభిప్రాయపడినారు.[20] కాని ఈ ఒత్తిడి గూర్చి వివరింపరైరి. ఇది ఒక వేళ ధ్వనిక సంబంధముగా వారు భావించిరేని అది ఎట్టిదో తెల్పలేదు. ఒక గణము వద్ద ఉండక మరొక గణము వద్ద ఉండుటేలనో, అదియును ఒక కాలములో ఉండి మరొక్క కాలమున ఉండకపోవుట ఎట్లో అర్థము కాదు.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు "దేశీయమైన ఈ ఛందస్సులో సహజముగా విరుపుగల్గి విశ్రమస్థానమైన నాల్గవ గణముపై యతి నన్నయ భట్టారకుని కంటె ముందు కవులు ఎవరును 5వ గణముపై యుంచిరని సందేహము కలుగక మానదు. కాని యిది సంస్కృతాంధ్ర ఛందస్సుల పరిణామములోని యొక ముఖ్య ఘట్టమును తెల్పును. మధ్యాక్కర దేశీరచన గాన ద్విపదములవలె పాదనియతి లేదు. ఇది సంస్కృత ఛందస్సులలోని నాలుగు పాదములు గల వృత్తముగా నిరూపించునప్పటికి మధ్యాక్కర పృథ్వీ వృత్తముతో సమానమైనది. ఒకటి రెండు మాత్రలు హెచ్చుగా రెండును సమానమే. ఇదిమైన నక్షర గణముల మూలమున నేర్పడినది. కావున నక్షర విశ్రమము ప్రధానమైనది" అని, ఆది పర్వమునందలి (5-62) 'అమూల్య మణిభూషణంబు'లన్న పద్యమున 12 వ అక్షరము మైత్రి కల్గియుండుటను, అట్లే 'స్వస్తి నృపాంకుశ' అన్న బెజవాడ యుద్ధమల్లుని శాసనములోని అక్కరలో 12వ అక్షరము యతి పాటింపబడినదని వివరించినారు[21].

కాని మార్గి ఛందమైన పృథ్వీ వృత్తమునకు, దేశిఛందమైన మధ్యాక్కరతో ముడిపెట్టుట విచిత్రమైనది. పృథ్వీ వృత్తమునకు నన్నయయే కాదు ఎవ్వరు వాడినను 12 వ అక్షరము యతి ఉండవలయును. కాని మధ్యాక్కరలో 12 వ అక్షర మెట్లుండును? గణములను బట్టి యతిస్థానము గల దేశి ఛందములలో సూర్యేంద్ర గణములు అక్షర సంఖ్యాసమములు (నియతములు) కాకుండుట వలన యతి అక్షర సంఖ్యానియతము కాదు. 12వ అక్షరము యతి యగుట మధ్యాక్కరలో కాకతాళీయము. "అక్షర గణముల మూలమున నేర్పడినది", "అక్షర విశ్రమము ప్రధానమైనది" అన్నవి మధ్యాక్కరను గూర్చిన మాటలా? కాకుండ వచ్చును. పృథ్వీ

గూర్చియే ఐనపుడు మధ్యాక్కరతో వీనికి గల సంబంధమేమి? మధ్యాక్కర పాద వైశిష్ట్యములో సమానములై నను, యతి 12 వ అక్షరమున నున్నను, వృత్యాదులకు మధ్యాక్కరతో పోలికేమి? వారిట్టి సంబంధమును నిరూపించ ఏమి కారణము చెప్ప సంకల్పించిరో తెలియరాదు.

రోమెల సంపత్కుమారాచార్యులు[22] "నన్నయగారు తాము రచించిన 39 మధ్యాక్కరలలో 11 పాదములందు ఐదవగణాదియందు యతి చెల్లించుటతోబాటు నాల్గవ గణాది యందును యతి చెల్లించినారని" చెప్పి, 11 పాదములిచ్చి "ఈ పాదముల మొత్తము 39 మధ్యాక్కర పాదముల దృష్ట్యా తక్కువే కావచ్చును. కాని వీటియందు నాల్గవ గణాదిని యతి చెల్లుట చూడగా ఈ పద్ధతి నన్నయగారికి అసమ్మతము కాకపోవచ్చుననియు, దీనికి తగినట్లు కవిజనాశ్రయ కర్త లక్ష్య ముండుటయు, ఎఱ్ఱనగారు గమనించియుండిరు. కవిజనాశ్రయ కర్త మాత్రమిట్లు చతుర్థ గణాదిని చెప్పుటకు కారణము, పై పాదముల పరిశీలనము గావచ్చును. వానితో బాటు మధ్యాక్కర యన్న పేరును బట్టి, తరువోజను బట్టి నడిమికి పాదమును విరిచి యతి చెల్లుట పద్యపాదమున రౌత సమన్వయము కలిగించుననియు కావచ్చును" అని రెండు కారణములు వివరించినారు. ఈ రెండు కారణములలో రెండవది (సమ భాగత కొఱకు 3 గణముల మీద యతి యున్నది) సమర్థనీయమైనది. మొదటి కారణము ఇంతక విచారణీయము. ఏలయన నన్నయ 5 వ గణాద్యక్షరముతోబాటు 4వ గణాద్యక్షరము యతి వాడినది 11 పాదములే. 39 అక్కరలలో 39×4= 156 పాదములలో 11 పాదములు మాత్రము 3 గణముల మీద యతి చెప్పినట్లు వ్రాసినారు. వారే చెప్పినట్లు రాశిలో ఇది అతి తక్కువ. అంతేకాదు, 4వ గణము పిదప యతి చెప్పక కేవలము 3వ గణము పిదపనే యతి చెప్పినా? లేదు. పోనీ ఏ ఒక్క మధ్యాక్కరంపైన ఇట్టి ఉభయ యతిని 4 పాదములందు సంపూర్ణముగా పాటించెనా? లేదు. ఐనప్పుడు దీనిని నన్నయ ఇచ్ఛాపూర్వకముగా త్రిగణానంతర యతి స్థాపించినాడని యెట్లు నిర్ధరింపవచ్చును? కాకతాళీయము కారాదనా? తెలుగులో-సదృశాక్షర నిబద్ధ యూపయతిలో—ఇట్టి అవకాశము ఎక్కువ. యతి స్థానములోని అక్షరమునకు పాదాది తొలి యక్షరముతో సాదృశ్యమని తెలుగు యతి నియమము చెప్పుచున్నది. అంతేగాని పాదములోని ఇతరాక్షరములైనను పాదాది అక్షరముతో మైత్రిని గల్గించునవిగా ఉండరాదని నియమమున్నదా? కనుక పై 11 పాదములందు చతుర్థ గణాద్యక్షరమునకు యతి మైత్రి కాదనము

యాదృచ్ఛికమేగాని ప్రయత్నజము కాదనవచ్చును. కవిజనాశ్రయమందలి పంచమ గణమునకు యతిని ఒక పాదములో నైతము పాటించుట యాదృచ్ఛికమే అనవచ్చును. ఇట్టివానిని చూచి ఎఱ్ఱాప్రెగ్గడ యతి స్థానమును 5 వ గణము నుండి 4 వ గణమునకు మార్చినాడనుట కుదరదు. పాదమున కొక సమహారము కల్గించుటకని ఎఱ్ఱన యతి మార్చెనని చెప్పిన రెండవ కారణము సమంజసమైనది.

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు నన్నయ పాటించిన యతి శ్రావ్యతా భంగకారణమని భావించినారు. "అప్పటికి బహుళ ప్రచారములో నున్న యక్కరలను నన్నయ వాడినాడు కాని వాని తత్త్వ మెరుగజాలక మధురగతి నంతయు మంటపాలు చేసి కుంటినడక యంటించినాడు" అని విమర్శించినారు[23]. మధ్యాక్కరలో పాదమధ్య యతి మధురగతికి కారణము కావచ్చును గాని కుంటినడకను యంటించునది నన్నయ కాదు. బెజవాడ శాసనములోని మధ్యాక్కరలే ఇట్టి యతిని పాటించుటను బట్టి ఈ అక్కర ప్రయోగము, చతుర్థ గణాంతర యతి నన్నయకు సుమారు మూడు శతాబ్దుల ముందే తెలుగు సాహిత్యములో స్థిరపడిన వన్న సంగతి శ్రీ చౌదరిగారు గమనించలేదు. నన్నయ తత్త్వమెరుగ డనుటకన్న సంప్రదాయమును మన్నించినాడనుట లెస్స.

వడి పాదమధ్యస్థ మగుట శ్రావ్యకారకమని చెప్పి, నన్నయ ఇట్లు వాడకుండుటకు కారణము చెప్పుచు డా॥గిడుగు వేంకట సీతాపతిగారు "నన్నయకు ఈ శ్రావ్యత అక్కరలేకపోయిన దనగలమా? ఆ కాలములో ఈ మధ్యాక్కరను నడిపించే విధానములో భేదమున్నదని నేను అనుకొందును. మొదటి నాలుగు గణములు ఒక పట్టుగా ద్విపదవలె నడిపించి శేషించిన రెండు గణములను రెండవ పట్టుగా చదివిన మెదల వినసొంపుగానే యుండును. దీనికొక దృష్టాంతము బొబ్బిలిపాట పాదములలో పాదమునకు 26 మాత్రలు. అందు మొదటి ఖండములో 8 లఘువుల గణములు రెండు అనగా 16 మాత్రలు గలది ఒక ఖండము 10 మాత్రలు గలది రెండవ ఖండము.

విజయనగరిరాజును / వీడేవాడూ /

విజయరామ రా / జా

మధ్యాక్కరలు కూడా చివరి అక్షరము కొంత పొడిగించి గురువు చేసి పాడుకొనేవారు కాబోలు అని ఊహించినారు[24]. గిడుగు వారు చెప్పిన విధానము జానపద గేయములందు ప్రసిద్ధమైనదే. వారన్నట్లు ఏదైనా ఇట్టి గేయ సంప్రదాయము ఉన్న

యకు పూర్వము నుండియే ప్రచారములో నుండియుండును. ఈ క్రింది బతకమ్మ పాటను పరిశీలించిన అది నిజమేయనిపించును.

| | | | |
|---|---|---|---|
| 5 | 5 | 5 | 5 |
| శ్రీరామ | భూపాలు | డా.... | పట్టాభి |
| 5 | 5 | 5 | |
| * షేకుడై | కొలువుండ | గా.... | |

పై గీతములో పాదమునందలి మాత్రాగణములు సమానముగా లేవు. పూర్వార్ధము కన్న ఉత్తరార్ధము చిన్నది. మధ్యాక్కరలో యతి వలన 6 గణముల పాదము 4+2 గా ఎట్లు విడిపోవునో అట్లే పై పాదమందలి 7 గణములు 4+3 గా విడిపోయి ప్రథమ, పంచమ గణాద్యక్షరములకు యతి (విచ్ఛేద రూపమున మరియు సదృశాక్షర రూపమున 'శ్రీ – షే'లకు) పాటింపబడినది.

పై యభిప్రాయమునకు ఆధారమేమియు లేదు. భిన్నత్వమునకు కారణము మాత్రమే ఊహింపబడినది. ఎఱ్ఱాప్రెగడ వాడిన త్రిగణానంతర యతికి సమర్థనీయమైన కారణములు ఇట్లు చూపవచ్చును.

1) మధ్యాక్కరలో 6 గణముల పాదములో త్రిగణానంతర యతి పాద సమద్విఖండన రూపమగును. ఇది దేశిచ్ఛందస్సుల సామాన్య లక్షణము. గేయ ఛందస్సులలో ప్రాకృతిక స్వభావము.

2) పాదము యొక్క ఉభయార్థములు సమానములైనపుడు లయ చక్కగా బోధ్యమగును. పాటలలో గల ఇట్టి త్రిగణానంతర యతిని గుర్తించి కవి జనాశ్రయ కారుడును, ఎఱ్ఱాప్రెగ్గడయును ప్రాచీన మతమును సంస్కరించి యుందురు.

3) మధ్యాక్కర అన్న పేరు అప్పుడు సార్థకము కాగలదు. మధ్యలోని విరిగి పాదము రెండు సమానార్థములు గల పద్యమన్న భావము వచ్చును. లేనిచో కన్నడపు పేర్లకున్నంత సార్థకత తెలుగు అక్కరలకు లేకపోగా కన్నడ నడువణక్కరను పొరపడి తెలుగులో రెండవ అక్కరకు పేరు పెట్టినట్లుగా భావించవలసి వచ్చును. ఈ మధ్యలో యతి గల్గిన మధ్యాక్కర కన్నడమునందలి దొరెయక్కరె (సమానక్షర) అన్న పేరుకు ఇపుడు తగియున్నది. ఉభయార్థములు సమానములన్న అర్థము వచ్చు ఈ కన్నడ నామము తెలుగులోని మధ్యాక్కర యొక్క త్రిగణానంతర యతిని సమర్థింపజాలియున్నది.

## అంతరాక్కర యతి :

అక్కరలలో అంతరాక్కర తెలుగులో విశేషయతి కల్గియున్నది. దీనిలో 3వ గణము చివరి అక్షరము యతి. ఇట్లు గణమధ్యములో యతి చెప్పుటన్నది ఒక్క ఈ అంతరాక్కరలో దప్ప ఏ దేశీయ ఛ్ఛందమునందు లేదు. ఏ దేశీయ ఛ్ఛందమునందైన ఇన్ని గణముల పిదప అని ఉండునేగాని గణమధ్యమున నుండదు. తెలుగులోని దేశీయ ఛ్ఛందములలో గణమున కొక పదముండుట సాధారణ విషయము. గణ మధ్యమున యతి ఉండెనేని పద మధ్యమున యతి అగును. ఇది దేశీయ ఛ్ఛందో లక్షణ భిన్నమై, అను అస్పష్టమై యుండును. మార్గ వృత్తములందు వలె యతి విచ్ఛేదమును సిద్ధ సదృశాక్షర రూపముగ మారును. అంతరాక్కరలో నున్న ఇట్టి యతి దేశీయ ఛ్ఛందో భిన్నము. పాదము నడుమ యతి ఉండుట యన్నది తక్కిన దేశి ఛ్ఛందో లక్షణమైనట్లే అక్కరలలో సైతము ఉన్నదని (ఒక చంద్రగణమును రెండు సూర్యగణములుగ లెక్కించి) ఇదివరకు నిరూపించనైనది. అప్పుడనే అంతరాక్కర యతి గూర్చి చెప్పనైనది. అంతరాక్కరలో 1 సూ + 1 ఇం + 1 ఇం + 1 చం.లో చంద్రగణము గణ ద్వయముగా భావింతుమేని 1+1+1+2=5 గణముల మొత్తములో 2½ గణముల పిదప యతి యుండవలయును. త్రిగణాంత్య వర్ణయతి ఇంచుమించుగా నిట్టిదే యని భావించవలయును.

దేశ్య ఛ్ఛందములకు భిన్నమైన ఈ రీతి త్రిగణాంత్య వర్ణము యతి చెప్పుట యన్నది నేకొక విధముగా భావింపబడినది. ఇంతకుముందు ఒక చంద్ర గణమును రెండు సూర్యగణములుగా భావించినట్లే అంతరాక్కర గణములను పరిశీలింపగా ఇది ఒక తేటగీతి పాదమునకు సరిపోవును. యాదృచ్ఛికమే కాబోలు కవి జనాశ్రయమున 2, 3, 4 పాదములు, అప్పకవీయమున 2, 3, 4 పాదములు, ఛందో దర్పణమున 1, 2, 3 పాదములు, అంతరాక్కరలో అంత్య చంద్ర గణములు రెండేసి సూర్య గణములుగా విడిపోగల్గి యున్నవి.

| సూ | ఇం. | ఇం. | చం. | |
|---|---|---|---|---|
| ఇనువొ | కందును | నిం(ద్రు*లి | ద్దఱును నొక్క | (నహ చం. గ. |
| వనజ | వైరియు | గూడి*వై | భవమొ నర్ప | న+హ |
| గనక | వస్తువిని | గృత్త*కై | టభుని గొల్తు | 2 సూ.గ) గా విడిపోయినది. |
| రనుచు | జెప్పుదు | రంత*రా | క్కర బుధులు | — పాటించ బడలేదు. |

—ఛందో దర్పణము 3-43

ఇట్లు చంద్రగణము రెండు సూర్యగణములుగా విడిపోగల్గినప్పుడు అంతరాక్కర పాదము తేటగీతి కాగలదు.

అంతరాక్కర : సూ + ఇం + ఇం + చం

తేటగీతి : సూ + ఇం + ఇం + సూ+సూ

జాతి పద్యముగాన అంతరాక్కరలో ప్రాస ఉండగా, ఉపజాతి పద్యము గనుక తేటగీతి యందు ప్రాస ఉండదు. యతి తేటగీతిలో త్రిగణానంతరము కాగా అంతరాక్కరలో సైతము త్రిగణాంత్యాక్షరము కాక త్రిగణ సమాప్తి తర్వాత (చతుర్థ గణాద్యక్షరము) ఉంచినచో తేటగీతి, అంతరాక్కరలకు భేదమేమియు ఉండజాలదు. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో (8-57) ఇట్లే 4వ గణము ఆద్యక్షరమునకు యతిచేసి వ్రాసినాడు. అతనికి అంతరాక్కరలో ఇట్టి యతితో బాటు ప్రతిపాదాంతమైన చంద్ర గణమును సైతము రెండు సూర్యగణములుగా విడిపోవునట్లు వ్రాసినాడు.

| | సూ. | ఇం. | ఇం. | చం. |
|---|---|---|---|---|
| | | | | నహ |
| 1వ పా. | కమల | మిత్రుండు | సురరాజు * | గణయుగంబు (న+హ) |
| | | | | రల |
| 2వ పా. | కమల | శత్రుని | తోడెంది * | కందరోంప (హ+హ) |
| | | | | నహ |
| 3వ పా. | నమరు | బ్రాపట్ల | నర్ధంబు * | నతిశయిల్ల (న+హ) |
| | | | | రల |
| 4వ పా. | నమల | మగునంత | రాక్కర * | మబ్దిసంఖ్య (హ+హ) |

ఇట్టి పద్యము గణ విషయమునను, యతి విషయమునను తేటగీతికి సరిపోవుచుండుటచే గాబోలు, వీనికి మధ్య తేడా కల్పించుటకై యతి ఒక్క అక్షరము ముందుగా అనగా త్రిగణాంత్య వర్ణమును అంతరాక్కరలో యతిగా పాటించియుండు సంప్రదాయమును లాక్షణికులు నిలబెట్టి యుందురని అంతరాక్కర యతి విషయముగా శ్రీ సంపత్కుమారాచార్యగారు భావించిరి.[25]

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో వలెనే కవి జనాశ్రయకారుని పద్యమునందును (ప్రాచీన ముద్రణలలో) యతి మూడు గణముల పిదప యున్నది.

ఇనసు రేంద్రచం ద్రంబు * లి ప్పాటవచ్చి
పొనరి యుండగ బ్రాపల్లు * పూర్వభంగి
నన గణంబులు నాలుగిం * టంబెనంగ
ననుప మానాంత రాక్కర * మబ్బెరేచ

ప్రథమ పాదముతో తప్ప, తక్కిన 3 పాదములలో 3 గణములు పూర్తి యైన పిదపనే యతి గలదు. ప్రథమ పాదములో సైతము ఇది "ఇనసు- రేంద్రచం- ద్రంబులు* నిట్లు వచ్చి" అని యుండుట సమంజసము అని సంపత్కుమారగారు సూచించినారు.[26] కాగా రావూరి దొరస్వామి శర్మగారు సాహిత్య పరిషత్తు పరిష్క- రించిన ప్రతిలోని పై పద్యములోని "ప్రథమ పాదస్థ యతియే లక్షణానుసారి, సాధువు. తక్కిన పాదములలోని యతులు లక్షణానుసారులు గావు. ఇది తెలియక కాబోలు పరిష్కర్తలు సాధువు నసాధువుగా సమీక్షించిరి" అని వ్యతిరేకముగా చెప్పి ఒకటవ పాదము వలెనే త్రిగణాంత్యాక్షరము యతిగా తక్కిన పాదముల సవరించిన పాఠ మును చూపినారు.[27] కాని ఒకటవ పాదమును బట్టి 3 పాదములు సంస్కరించుట కన్న 3 పాదముల లక్షణమును బట్టి 1వ పాదము సంస్కరించుటయే లెస్స. అనగా కవి జనాశ్రయ మతమున సైతము 3 గణములు ముగిసిన పిదపనే యతిగా భావించ వలెను. ఇది విన్నకోట లక్ష్యముతో సంవదించును. దీనిని బట్టి ప్రాచీన కాలమున అనగా క.జ., కా.చూ., కర్తల మతమున తేటగీతిలోవలె త్రిగణానంతర యతి, అర్వా చీనుల అనంతాదుల మతమున తద్భిన్నముగా త్రిగణాంత్య వర్ణము యతియని భావింప వలెను. లక్ష్యములు లేనందున లక్షణ మెట్లున్నను దాని అవసరమే లేక పోయినది.

## అక్కరల నడకలు :

అక్కరల నడకలను పరిశీలించినపుడు అవి గేయ చ్ఛందముల నడకలేయని చెప్పనగును. వీనికి జానపద గీతములు మూలమనదగును. ఈ విషయమును కొంత వరకు 'యతి' అన్న ఛందోంగమున ఈ గ్రంథమునందు వివరించబడినది. జయ కీర్తి తన ఛందోనుశాసనమున అంతరాక్షరకు లక్షణము చెప్పుచు దానిని గీతమని నాడు.[28] అక్కరలన్నిలో గణమునకొక్క పదము వాడవలయుననినాడు. అంతేగాక గణములు ఒక్కొక్క పాదమునకు సరిసంఖ్యలో (చంద్రగణము సూర్యగణ ద్వయ తుల్యముగా భావించబడి) ఉన్నట్లు భావించబడినది. చంద్రగణము సూర్యగణ ద్వయము గాకున్నను పెద్దగణమగుట వలన గణద్వయ దైర్ఘ్యమును పాదమునకు సంధించ గల్గును. అట్టిచోడ యతి పాదమును సమద్విఖండన మొనర్చ జాలి గేయ

లయను సాధించగల్గును ఇట్టి అక్కరలను వాడుటలో గమన వైవిధ్యము సాధ్యమగుటకు వలసిన గణ వ్యవస్థ కల్గియున్నది. అట్టివి ఇచ్చట ప్రదర్శింపబడుచున్నవి.

1) మహాక్కర :

| | | | | | |
|---|---|---|---|---|---|
| | న (3) | త (5) | నగ (6) | త (5) | |
| 1) | మొదట | సూర్యుండు | పిదపగా | వింద్రుండు | = 18మాత్రలు |
| | | సగ (5) | భ (4) | నహ (6) | |
| | | * మొదలుగా | నేపురు | పరలుచంద్రు | = 15 " |
| | న (3) | త (5) | భ (4) | భ (4) | |
| 2) | మొదల | సూర్యుండు | పిమ్మట | నేగురు | = 16 " |
| | | సల (5) | సల (5 | రల (6) | |
| | | * పురుహూతు | లమకంగ | జంద్రుపెండు | = 16 " |
| | న (3) | భ (4) | భ (4) | భ (4) | |
| 3) | ముదము | తోనెడ | సొచ్చుము | హాక్కర | = 15 " |
| | | నగ (5) | సల (5) | నహ (6) | |
| | | * మొనసితా | వ్యములంప | విదగకృష్ణ | = 16 " |

ఇట్లు మహాక్కర పాదములోని గణములను మాత్రా సౌష్ఠవము దృష్టితో మార్చి వ్రాసి వివిధ గతులు సృష్టింపవచ్చును. ప్రతి పాదమునకు $(1\times3)+(5\times\text{౦})+(1\times7)=35$ మాత్రల గరిష్ఠ సంఖ్యలో $(1\times3)+(5\times4)+(1\times5)=28$ మాత్రల కనిష్ఠ సంఖ్యలో పాద ప్రమాణము ఉండతగును. అయితే యతికి పూర్వభాగము ఉత్తర భాగములలో సమాన మాత్రా ప్రమాణము సృష్టించుటచే పై విధముగా గతులు సృష్టింపవచ్చును. ఆటవెలది, సీసచ్ఛాయలు ఈ మహాక్కరలలో సాధ్యపడును. పైవి 1, 2 పాదములు ఆటవెలదిగ, 3వ పాదము సీసముగ నడచుట కాంచవగును. యతి స్థానమును గమనించి పాదవిభజన చేసి మాత్రలు పంచవలెను. యతి స్థానము విచ్ఛేదమొనర్చక పదోల్లంఘనము గావించి నచో ఇట్టి నడకలు సాధ్యపడవు. యతికి పూర్వాపరములు తుల్య మాత్రికములుగా ఒకటి రెండు మాత్రలు భిన్నమైనను సరిపడును. (చూ. 3వ ఉదా).

2) మధ్యాక్కర

ఈ అక్కరను గేయ ఛ్ఛందముగా గుర్తించి, జానపద గీతమును లక్ష్యముగా

చూపినవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వారు తమ అమ్మగారు పాడగా వింటి మని ఈ క్రింది గీతమును ఉట్టంకించినారు[29].

| 4 | 4 | 4 | | 4 | 4 | 4 |
|---|---|---|---|---|---|---|
| అంతట | రాముల | వారూ | * | అంగన | సీతను | గూడీ |
| సంతస | మందుచు | వేగా | * | స్వపురము | నకుచను | డెంచీ |
| తమ్ముల | తోడను | గలసీ | * | నెమ్మది | రాజ్యము | లేలే |
| ధర్మము | తో ప్రజ | లెల్లా | * | తామర | తంపర | లైరీ |

ఇందు సూర్య గణములు అంత్యస్వరము దీర్ఘీకరింపబడినవి. వీటిని శబ్ద సాధుత్వ దృష్టితో చూచినపుడు 'వారు', 'గూడి', 'వేగ' అన్న పద్ధతిలో సూర్యగణ ములు కాగలవు. దీనితో మధ్యాక్కరాఛందము ఎట్లు పాడబడవలెనో తెలిసినది. దేశీయ ఛందములు గేయ మాతృకలనుటకు శాస్త్రిగారుదాహరించిన పైగీతమే ప్రమా ణము. పాదము మధ్యలో తెగినది. అనగా యతి విచ్ఛేద రూపము. యతి వలన పాదము సమఖండములు రెండుగా విడిపోయినవి. ఉభయ ఖండములందు 2 ఇం.+ 1 సూ.+ 2 ఇం. 1 సూ. గా నగణముండుటచే సౌష్ఠవము కుదిరినది. మాత్రలు తక్కువగా గల సూర్య గణము ఖండాంత్య గణమై తనకు పూర్వము నున్న మాత్రా గణములతో సమానముగా మాత్రలు గల్గుటకు దీర్ఘీకరింపబడి గణములు సమాన కాల ఖండములుగా ఉంచగల్గినది. ఉభయ ఖండములందు గణసమత, గణము లందు మాత్రా సమత సౌష్ఠవ హేతువైనది. ఇట్టి గీతము వలన మధ్యాక్కర ఛందము యొక్క గేయఫణితి తెలిసినది. దేశి ఛందములన్నీ ఇట్టి మధురగేయ ఫణితులు గల్గి, శిష్టుల ప్రయోగములో గేయత్వమును కోల్పోయినవి. "ఈ మధ్యాక్క రలు నన్నయగారి కాలంనాటికే మాత్రా ఛందస్సుల ప్రాభవం నుండి దూరం కావ డంతో నడక కుంటుపడి వీటి ఆకర్షణ తగ్గిపోయిందనుకోవాలి....". "మన కవులు అక్షర గణ నియమాలున్న చందస్సులపై ఎగబడినందువల్ల మధ్యలో మధ్యాక్కరలు అంతరించినా ఆడవాళ్ళ పాటలలో అవి యింకా సజీవంగానే ఉన్నాయి" అని ఆరుద్ర ఈ గేయముపై తమ అభిప్రాయము నిట్లే తెలిపినారు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కూడా పై గేయము నుద్ధరించుటకు ముందు ఇదే విధముగా ప్రస్తావించి నారు. బెజవాడ శాసనములో మధ్యాక్కర "స్వస్తి నృపాంకుశ...."ను ఉదాహ రించి "ఇందులో కొన్ని యక్షరములు చేర్చినను తీసివేసినను, పద్యము పద్యము గానే ఉండునట్లు రచన ఉన్నది. పఠన ఫణితి తాళగతి కలదిగా గోచరించుటలేదు.

సంగీత రుచి గుర్తించిన తెలుగు కవులు ఈ పదమును ఎంపికకు పాటించినారా అని సందేహించువారును. అర్వాచీన కవులు దీనిని అందుకనియే విడిచిపెట్టినారు కాబోలు" అని మధ్యాక్కర గేయత్వమును గూర్చి సందేహించినారు. వీరిట్లు అనుమానించుటకు కారణములు శిష్టకవులు ఇట్టి గేయ ఛ్ఛందములను 'గణమున కొక్క పదము', 'యతి విచ్ఛేద రూపము', 'శబ్ద సాధుత్వ దృష్టిని వదలిన మాత్రాసమత', 'పాదాంత యతి' మున్నగు లక్షణములను వదలివేయుటయే.

పైగేయమును పరిశీలించినప్పుడు ఎఱ్ఱన మతములోని త్రిగణానంతర యతి ఎందులకు ప్రవేశపెట్టబడినదో సుబోధమగును. ఆతని మతమునందలి యతి పాదమును సమద్విఖండన మొనర్చి లయను బోధింపజాలును. ఎఱ్ఱన తన ఏకైక మధ్యాక్కరలో గేయచ్ఛంద సౌందర్యమును గుర్తించి తృతీయ గణానంతర యతి స్థాపనతో బాటు యతి విచ్ఛేదరూపమును పాటించినాడు.

అనదృశ తేజుడు బ్రాహ్మ * ణానీక సహితుడై కడగి (బ్రాహ్మణ+అనీక)
వసుమతి యందున ధర్మ * వర్తులై యున్నవిప్రులను
మసలక నిజశక్తి చేసి * మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుం డొనరించు పేర్మి * వాజ మేధము నిష్ఠ యొప్ప.
(అరణ్య 4-309)

ఎఱ్ఱన పద్యమంతయు దాదాపుగా గణమున కొక్కపదము, పాదాంత పదసమాప్తి కూడా చక్కగా పాటింపబడినది. ఇట్లు వ్రాసినచో పద్యము నడక చక్కగా వ్యక్తమగును. నన్నయ ఇట్టివానికై ఎక్కువగా శ్రద్ధ పాటింపడయ్యెను.

ఇంద్ర గణములన్నియు చతుర్మాత్రికములే (నల, భ,) వాడిన పై సూర్య గణము కూడా చతుర్మాత్రికముగా ఒక మాత్ర సాగదీయబడి[30] చతురస్రగతి వ్యక్తమగును.

ఇంద్ర గణములన్నియు పంచమాత్రికములే (నగ, సల, ర, వ) వాడిన పై సూర్యగణముతో కల్పి పంచమాత్రికముగా నడచి ఖండగతి వ్యక్తమగును. పై గేయమును ఆరుద్ర ఇట్లే ఖండగతిలో భావించినారు[31].

| | | |
|---|---|---|
| 5 | 5 | 5 |
| అంతటా | రాముల | వారూ - |
| 5 | 5 | 5 |
| అంగనా | సీతనూ | గూడీ - |

5 5 5
సంతసా మంపచూ వేగా -
5 2 5
స్వాపురా మునకుచిను వెంచీ -
(పాదాంతరేఖలు ఒక మాత్ర నిశ్శబ్ద కాలానికి సంకేతాలు)

నన్నయ, ఎఱ్ఱనలు ఇట్టి చతురస్ర, ఖండగతులు ప్రయత్న పూర్వకముగా సృష్టింపలేదు. కారణము వీరిది అక్షరగణ దృష్టియేగాని మాత్రాసమక గణదృష్టికాదు. ఇంద్రగణములలో పంచమాత్రిక, చతుర్మాత్రికములు కలగలుపుగా నున్నవి. తమ పద్యములందు వీరు అన్ని ఇంద్ర గణములను వాడిరి. ఇంద్రగణములలో ఎక్కువ గణములు పంచమాత్రికములు, ఎక్కువగా కవులు ఉపయోగించు గణములు పంచ మాత్రికములేగాన వీరి అక్కరలలో ఖండగతిని చూపవచ్చును.

మాయావి మాయాయు ధములా
మాకిచ్చి మాతోర ణమ్మా
.... .... ....
మాయావి యగువాని గమనా
వేగంబు మందమై యుండా (అరణ్య - 3 - 386-నన్నయ)

ఇట్టి నడకలలో ఎక్కడైనా చతుర్మాత్రిక ఇంద్రగణము వచ్చిన సాగతీతలో ఖండగతి సాధ్యము.

మనలకా నిజశక్తి జేసీ -
మడియించి ధర్మంబు నిలిపీ- (అరణ్య- 4-309 ఎఱ్ఱన)

మధ్యాక్కర పద్యముయొక్క పూర్వార్ధము చతుర్మాత్రాగణములైన ఉత్తరార్ధము పంచమాత్రికములుగను, పూర్వార్ధము పంచమాత్రికములైన ఉత్తరార్ధము చతుర్మాత్రికములుగను నన్నయ వాడి ఉభయగతుల మిశ్రమము చేసినాడు. (అరణ్య-I-2269 లో)

5 5 5 4 4
క్షమయందు చిత్తంబు నిల్పి / నిర్గత కల్మష బుద్ధి
4 4 5 5 5
గ్రమమున ధర్మవు సంద / వర్తిల్లు కరుణాత్మ నిన్ను

చతుర్మాత్రికా గణములనేవాడి అక్కర వ్రాయకున్నను నన్నయ 4 ఇంద్ర గణముల ప్రయోగావసరమున మధ్యాక్కరలో 3 ఇంద్ర గణములను చతుర్మాత్రిక ములు వాడి చతురస్ర గతిని స్ఫురింప జేసినాడు. (అర — II-349లో)

4 4 4
పనుగుర బోలెడు సుతుల సూర్యవర బడయంగ వలతొ

4 4 4
పనుగుర సూర్యవర రెనయ గసుతుల బడయంగ వలతొ

4 4 4
పదలక వేపురు సుతుల బడయగ వలతొపే పురకు

3) మధురాక్కర :

ఈ పద్యము ఎఱ్ఱనచే రెండు మార్లు నన్నయచే నొక్కమారు ప్రయోగింప బడినది. సూ+ఇం+ఇం+ ఇం+చం. గణములు వరుసగా పాదమునకు గల ఈ ఛందములో తేటగీతి (లక్షణము) నడక కొంతవరకు సాధ్యమగును. తేటగీతి లక్ష ణము కన్న ఇందు 3 లేక 4 మాత్రలు అధికముగా నుండును. ఈ క్రింది పద్యములో అధిక మాత్రలు విడిచిన (బ్రాకెట్లలో 'తొలగింపు' సూచింపబడినది.) యతితోసహ తేటగీతివలె నుండును.

వనజ ముఖినేక తమబాన్ధ వనము (నయం) మనిచి
ననఘు డెంతయు వగచుచు నరిగె నాశ్ర (మమునకు)
(అర. ప. 6—352 ఎఱ్ఱన)

ఈ క్రింది మాత్రల సంఖ్య గణముల కూర్పులో పాటించిన లయ సాధ్య మగును.

సూ + ఇం. + ఇం. * ఇం. + చం.
1. 3 + 4 + 5 * 5 + 7
2. 3 + 4 + 4 * 5 + 6
3. 3 + 4 + 4 * 4 + 7

1వ దానిలో యతికి పూర్వము 12 మాత్రలు, యతికి అనంతరము 12 మాత్రలు
2 ,, ,, ,, 11 ,, ,, ,, 11
3 ,, ,, ,, 11 ,, ,, ,, 11

పై వానిలో 3+4+4+4+7 — ఉభ యార్ధములు 11 మాత్రల చొప్పున ఎల్లన మధురాక్కరలో ఒక పాదము పాటించబడినది.

3 4 4
వెలయ నివ్విధ మంతయు

5 6
వివరింప పలయు నాకు (అర. VII - 309)

వాడిన వృత్తములు అతి తక్కువ కనుక వాటిలో పై మాత్రల విధానము లభింపదు. నడకలు విశేషముగా చూపబడలేదు.

## 4) అంతరాక్కర :

అంతరాక్కర ప్రాసగల తేటగీతియున వెల్లునని ఇదివరకే నిరూపింపబడినది. 3 గణముల పిదప యతి ఉన్నప్పుడు తేటగీతి వలె నుండును. కా. చూ. కర్త ఇట్లే వ్రాసినారు.

సూ. ఇం. ఇం. చం.
కమల మిత్రుండు సురరాజు గణయుగంబు

తృతీయ గణాంతాక్షరము యతి వేసిన తేటగీతి వలె కన్పట్టును.

మునిగని సర్వజ్ఞు సేవ్య
ముల ఫలరాజ - రామా కల్పా. కిష్కిం. 254

అంతరాక్కర, కర్ణాటక పలుప్పద - ద్విపద ఛాయలో నడచునని బండి నాగరాజుగారు చెప్పినారు[32]. 3 పంచ మాత్రా గణములు + 1 త్రి మాత్రాగణము అన్న రీతిలో సాగినట్లు వారొక స్వీయోదాహరణము నిచ్చినారు.

తెలుగు సాహిత్య మెల్ల * తేజమ్ము నించ
చెలువ మునవాటి సెల్ల * శ్రీకరము సేయ
వలచి సకవిత్ర యమువం * ఘనుగ్రహిం చెదే
వెలసి లామీద గావ్య * విబులగు వారు

## 5) అల్పాక్కర :

ఇం. + ఇం. + చం. గణములు గల అల్పాక్కర చంద్ర గణమును 2 సూర్యగణ ములుగా విభజించిచేసి నిసమునొక్క ఉత్తరార్ధముగ నడక సాగును.

ఇం. + ఇం. + * చం. (సూ. + సూ.) అల్పాక్కర
ఇం. + ఇం. + * సూ. + సూ. సీస ఉత్తరార్థము

1) నెగడు నల్పాక్కర నియతి తోడ (3-44 అనం. ఛం.)
అనునది సీస ఉత్తరార్ధము కాగలదు.

2) బప్పురం బుమియువా యుపు చలించు
- రామా. కల్ప. కిష్కిం.-257

ఇం. ఇం. సూ
3) సీ. పండిన ఊళ్ళకై ప్రభువులంత ఇదే అల్పాక్కర కాగలదు

మడికి సింగన తన జ్ఞానవాసిష్ఠ రామాయణంలో ఓ అల్పాక్కర చెప్పినాడు. ఇది పైవానివలెనే సీసపు నడకయు కల్గియున్నది.

మీరిందు శంబరు మెచ్చిచూడ
నాయాధి నేరొక్క హయము నెక్కి
యూరించి కోపన ఉర్విభూమి
ధారుణి గాచొచ్చె వాజి వేగ (వాసిష్ఠరామాయణం II-223)

మహాక్కరందు యతికి అనంతరము 2 ఇం + 1 చం. గ. ఉండును. 1 సూ.+ఇం+ఇం+ఇం+* ఇం + ఇం + చం. ఇది మహాక్కర లక్షణము. యిత్యనంతర మహాక్కర భాగము అల్పాక్కర వలె నడచును.

ఇట్లు వివిధ గతులలో నున్న అక్కరల ప్రయోగ వశమున కన్నడమునందు వలె బహుళ ప్రచారమును తెలుగులో పొందలేక పోయినవి. ఒక మధ్యాక్కరకు మాత్రము తక్కిన అక్కరలకన్న ప్రచారము అధికమైనది. ఒక విధముగా దానికిగల బహుళ ప్రచారము వలన అక్కర అనగా మధ్యాక్కరన్న అర్థము సిద్ధమైనది. నన్నయ భారత భాగములో మధ్యాక్కర అన్నచోట, అక్కర అని (కొన్నిచోట్ల) వ్రాయబడినది. మధ్యాక్కర గేయ ఛందమై లయా పద్ధతియందుట దీని ప్రాచుర్యమునకు గల ప్రబల హేతువు కావచ్చును. కన్నడాంధ్రములకు పరస్పర మైత్రి గల కాలమున అనగా అవి ప్రాచీన కాలమున నన్నయకు పూర్వమే దీని ప్రయోగము తెలుగున ఉండి, క్రమముగా తగ్గిపోయియుండును. ఈ అక్కరల ప్రయోగము నన్నయతోడనే [illegible] అయినను. ఎట్టిన వాడినను అప్పుడు నన్నయ ప్రోవలో, అతడు [illegible] సంపూర్ణము

గావించుట కొఱకు వాడినట్లు భావించవలయును. అంతేగాని ఎట్టిన కాలమునకు ప్రయోగమున్నదని భావింపరాదు. అతని ఇతర కావ్యములందు వీని ప్రయోగము లేదు. లాక్షణికులు మాత్రము ఒకరిని చూసి యింకొకరు లక్షణము (తమ గ్రంథము అసమగ్రము అగునని కాబోలు) వ్రాసిరి. చిత్రకవి పెద్దన తన లక్షణసార సంగ్రహమున

అక్కరల నదగునైదు మ
హాక్కర మధ్యాక్కర మధురాక్కర మరి య
ల్పాక్కరయు నంతరాక్కర
యెక్కువ సత్కవులు కృతుల నిడుదురు వీనిన్ (P. 59)

అని ఎక్కువగా సత్కవులు వాడుదురని వ్రాసినాడు. కాని ఈ "ఎక్కువ" అన్న శబ్దము అక్కరల ప్రయోగములో నిక్కము గాదు. ప్రాస కొఱకు వేయబడిన పదమై యుండును. రావూరి దొరసామి శర్మగారీ పదప్రయోగమును "ప్రాస ప్రాణా కుసుమ"మని చమత్కరించినారు[33].

అక్కరలు తెలుగులో ప్రాచుర్యము నందకుండుటకు మరికొన్ని కారణము లున్నవి. మహాక్కర సీసము వంటి దగుట, మహాక్కర ఉత్తరార్ధము అల్పాక్కర వంటి దగుట, అంతరాక్కర తేటగీతి వంటి దగుట, అల్పాక్కర అతి చిన్న ఛంద మగుట కొన్ని కారణములనవచ్చును. అంతేగాక తెలుగు భాషకు చంద్ర గణములు సరిపడనివి. అంతేసి పెద్ద పదములు చంద్ర గణముగా చూపుటకు తెలుగు భాషకు సహజములు కావు. ఇట్టి కారణములచే 11వ శతాబ్దితో అంతరించి వీని ప్రయోగము తిరిగి ఆధునిక యుగము నందే వివిధ ఛందః ప్రయోగాకాంక్ష గల్గిన కవులచే చేయబడినది

— x —

## అథస్సూచికలు

1. సారస్వత వ్యాసములు Part I. పు. 3
2. శశిరేఖ ఫిబ్రవరి, 16
3. జయదామన్ - H. D, వేలెంకర్ సంపా. పుట. 37
4. ప్రాఙ్నన్నయ యుగపు శాసన ఛందస్సులలో వివరింపబడినది.
5. శాసన ఛందస్సులలో ఇదే గ్రంథమున వివరించబడినది

6. ఛందోఽనుశాసనం (జయకీర్తి) - కర్ణాట విషయ భాషా జాత్యధికారము VII - 66 (Jayadaman)
7. తెలు. భా. ఛం. రీ - రా. వా. సా. శర్మ పు. 154
8. ఛందః పదకోశము - 'అక్షరము' పు. 233
9. విజయనగరం మహారాజా వారి కళాశాల మాగజైన్
10. భారతి నవం. 1924 & తెలుగు ఛం. రీ. పు. 206, 207
11. సారస్వత వ్యాసములు భా. 1 పు. 42-44&తె. భా. ఛం. రీ. పు. 160
12. నన్నయ భారతము - పు. 909-921
13. తె. ఛం వి. పు. 79
14. ఆం. మ. భా. సంకో. ము. పు 102, 242, 292 (I vol.)
15. సాహితి నవం. 1963
16. తె. ఛం. రీ. పు. 206, 207
17. తె. ఛం. రీ. పు. 78
18. ఛందోఽనుశాసనము VII-8
19. 'జాతి పద్యము-అంతరాక్షర' - బండి నాగరాజా భారతి, ఏప్రిల్ 1965
20. "మొదటి గేయశాసనము" - పరిశోధన అక్టో, నవం. 1954 పు. 58
21. తెలుగు కవుల చరిత్ర పు 51
22. ఆం. మ. భా. (సంకో. ము.)-అనుశాస, ప. టీక పు. 35
23. తెనుగు వనము - కొసరాజు బసవయ్య గ్రంథమునకు ముందుమాటలు పు. 7
24. తె. ఛం. రీ. పుటలు 218, 219
25. అంతరాక్షర పు. 235 "ఛందః పదకోశము"
26. అంతరాక్షర పు. 235 "ఛందః పదకోశము"
27. తె. భా. ఛం. రీ. పు. 157
28. ఛందోఽనుశాసనము VII-5 (Jayadaman) పు. 6[illegible]
29. 'తెనుగు తేటదనము' వ్యాసము - "తె[illegible]" సా. గ్ర. శా. పు. 42
30. అక్షరలలో సూర్యగణము గగ, స గణములు ఉంచవచ్చును గదా!
31. సమగ్రాం. సా. చాళుక్య యుగము - పు. 82
32. అక్షరల నడకలు - భారతి మే నెల 1965
33. తె. భా. ఛం. రీ. పు. 158



# 5. ఉత్సాహ

తెలుగులోని మాత్రాసమక గణ నిర్మితములగు అతికొద్ది ఛందములలో కందము తర్వాత పేర్కొనదగినది. ఉత్సాహ- ఇది మూడు మాత్రల గణములచేత నిర్మితము. తెలుగులో ఇట్టి మాత్రాసమక గణ నిర్మాణము గల ఛందముల విధానము లేకపోవుట వలన ప్రాకృతము నందువలె మాత్రాసమక గణములు త్రిమాత్రికములు, చతుర్మాత్రికములు పంచ మాత్రికములన్న రీతి గణ నిర్దేశనము జరుగలేదు. కందమునకు మాత్రము చతుర్మాత్రాగణములు ఇవి వాడవలయునని పేర్కొనుట జరిగినది. తెలుగులో ఉపయోగము లేకున్నను లాక్షణికులచే ఉద్ధరింపబడినదిట్టిదొకటి చౌపద. అట్లే ఉత్సాహను కూడ తెలుగు లాక్షణికులు త్రిమాత్రా గణ నిర్మితమని చెప్పవలసినది గాని దీనిని సూర్యగణ నిర్మితమని దేశ్య గణ వ్యవస్థలో చెప్పిరి. సూర్య గణములు త్రిమాత్రా గణములే అయినను IU లగ గణము త్రిమాత్రికము ఇందు చేర్చబడలేదు. అనగా తెలుగు లాక్షణికుల ప్రకారము ఉత్సాహములో లగ వాడరాదు. అక్షర గణ ఛందస్సులో మాత్రము IU [లగ] వాడబడి, దేశ్య ఛందము లందిది లేకుండుటచే దీనిని పరిహరించియుందురు.

గణములు :

నగణ హగణము [సూర్యగణము]లలో ఏవేని 7 గణములు వాటి చివరి నొక్క గురువుంచి, 4 గణముల పిదప యతి వేసిన ఒక్క ఉత్సాహ పాదమగునని లక్షణము. అనగా 7 గణములు×3 మాత్రలు=21+గురువు (2 మాత్రలు) మొత్తము ఇరువది మూడు మాత్రలు పాదమున కుండును. సూర్యగణములని గాక పాదమునకు మూడు మాత్రలని లక్షణము చెప్పినచో లగము కూడ వాడుకొన వచ్చును. ఇట్టి లక్షణమును లక్షణ విలాసమన్న గ్రంథమున పెనుమర్తి వెంకటాచార్యుడు చెప్పినాడు.

"లఘువులు త్సాహ కిర్వది మూడు దనరు లివివి, రమణి[1]" లఘువులనగా మాత్రలని ఇతని భావన. లక్ష్యము నందు సైతము IU లగ, UUI త గణములు వాడబడినవి. గురులఘువు లిచ్చ వచ్చిన రీతి వేయుచు పాదమునకు 21 మాత్రలున్న చాలునని ఈతని అభిప్రాయమై ఉండును. అంతేకాక లక్షణవిలాసము 12 మాత్రల పిదప యతి. యిది వలన సైతము గణముల మీద గాక మాత్రల మీదనే చెప్పుట

విశేషము. తెలుగులో ఏ లాక్షణికుడును ఇట్లు చెప్పియుండలేదు. ఉత్సాహమన్న పేరు గల ఛందము ప్రాకృతము నందును గలదు.

షట్ చతుర్మాత్రాః ఉదరగౌ ద్విపార్శ్వన్లే తృతీయ పంచమావితి.
కవయః ఉత్సాహ లక్షణ మీదృశం భణన్తి
— స్వయంభూఛంద : IV 4 శ్లో.

ఆరు చతుర్మాత్రాగణములు (3, 5 గణములు గురు మధ్య స్థలములు అనగా జగణములు) ఉత్సాహ లక్షణము. ఇది తెలుగులోని త్రిమాత్రిక గణ నిర్మితమైన ఉత్సాహనకు సంబంధము లేదన్నది స్పష్టము. పేరు మాత్రము సంపదించినది.

కన్నడీయుడైన జయకీర్తి తన ఛందోనుశాసనమున (VI-30) ఉత్సాహ లక్షణమును చెప్పినాడు.

గీహితో క్తితో గలాంశ సప్తకం నిరంతరం.
గో పి నైధనే నకార సప్తకం యదాథవా
వ్యాహితం తదుభయ మిశ్ర సప్తకం తదాతదో
త్సాహ మాహు రుత్సవం చ గోగ్రహాదికే బుధాః

నిరంతర గల గణయుతము అనగా అన్ని హగణములతో గాని, నకార సప్తకముతో గాని, తదుభయ మిశ్ర సప్తకముతో గాని ఉత్సాహకమును నిర్మింపవచ్చుననినాడు.

## ఉత్సాహ - దేశిచ్ఛందము :

సప్తమాధికారమున కర్ణాటక భాషా విషయ జాత్యాధికారమునగాక షష్ఠాధికారమున వైతాళీయాది మాత్రా ఛందముల సంస్కృత ఛందోధికారమున జయకీర్తి దీనిని చెప్పినాడు. అనగా దీని నితడు కర్ణాట ఛ్ఛందముగా గుర్తించలేదు. సంస్కృత ఛ్ఛంద మని భావించినాడందమా? సంస్కృత ఛంద శ్శాస్త్రముల ఎవ్వరును దీనిని పేర్కొనరైరి. జయకీర్తి దేశీయమైన ఈ ఛందమును మాత్రాసమక ఛందమనుట వైతాళీయాదులలో లాక్షణీకరించుట సరియైనదని భావించి అందు వ్రాసియుండును. అంతేగాక వైతాళీయాది మాత్రా ఛందములలో గల, సరి మాత్రల పాదములయి నన్ని పద్ధతిలో గణ లక్షణము ఉండదు. ఇవి దేశీయ (కన్నడాంధ్రాది భాషా సామాన్యములైన) గణములతో నుండే దీని దేశీయత్వము నిర్ధారించ వలసియున్నది. అన్ని గణములతో, అన్ని హగణములతో ప్రతి పాదమునకు తప్పక వాడుచో ఆ

'ఉత్సాహ' షడ్వింశ ఛ్ఛందో జాతిములైన వృత్తములలో దేనికో ఒకదానికి సరిపడుట అనివార్యమగును అప్పుడు దీనిని మార్గి ఛ్ఛందమని భావించుట కష్టము.

"ఉత్సాహము సంస్కృత వృత్తముల యొక్క ప్రచారము హెచ్చిన తరువాత కలిగినదని చెప్పవచ్చును. ఉత్సాహమునందు సూర్య గణములుగా అన్నియు గలముచే ఉపయోగించినచో హంసయాన (సుగంధి) యను వృత్తమగుచున్నది. హంస యానమందు "రజ రజర" (UIU-IUI-UIU-IUI-UIU) అను గణములుండును". అని శ్రీ సంపత్కుమారాచార్యులు గారును,[2] "పై పద్యము నందును అన్ని హగణములైనచో సుగంధి వృత్తమగును[3]; అట్లుగాక యన్ని సగణము లైనచో విచికిలిత (తరళ)[4] అగును. హగణ గగణ మేళనమున్నచో యుత్సాహమున చెల్లును". అని శ్రీ రావూరి దొరసామి శర్మగారును ఇట్లే అభిప్రాయపడిరి[5]. ఈ అభిప్రాయమును ఖండించుచు శ్రీ పాటిబండ మాధవ శర్మగారు "ఏడు హగణములపై గురువు సుగంధి, ఏడు నగణములపై గురువు విచికిలిత అనుట యందు సామంజస్యము లేదన వలయును. అట్లే రజరజర యున్నచో హంసయాన యనుటయును నసమంజసమే. ఏడు 'హ'ముల మీద'గ' యున్నను, రజరజర యున్నను ఒక్కటియే. అక్షర వర్గీకరణ భేదమే కాని యక్షర క్రమ భేదము లేదు. కనుక సుగంధి, హంసయాన, విచికిలిత యన్నవి యుత్సాహ వృత్త భేదములే కాని అన్య వృత్తములు కావు. ఈ రీతిన వృత్త భేదము చెప్పబూనినచో కందము, గీతము, ఆటవెలది, సీసము మున్నగు వానియందు అనంత భేదములు చెప్పవచ్చును." అని అభిప్రాయపడినారు. అంతేగాక వారు తెలుగు ఛందకర్తల పై వృత్తముల లక్షణములనిచ్చుచు 'ఆ లక్షణములు చెప్పనేలయని వితర్కించుకొని, నాల్గు పాదములందును గురు లఘు క్రమము ఒక్క తీరుననే యుండిన యుత్సాహ భేదములను వృత్త భేదములుగా నిబంధించుట మీలాక్షణికుల తాత్పర్యము కావచ్చు" ననిరి[6].

అక్షర గణములతో యోచించునపుడు ఉత్సాహలో కేవల నగణ, కేవల హగణ ప్రయోగము వృత్త స్వరూపమును పొందవచ్చుననుట కాకతాళీయమే ఐనను లాక్షణికులు వీనిని ఉత్సాహ భేదములుగా పరిగణింపరైరి. ఏలయన పై వృత్తములు లాక్షణికులు షడ్వింశతి ఛ్ఛందో జాతములగు వృత్తముల ప్రకరణమున చెప్పిరి, అంతేగాని వానిని ఉత్సాహ వద్ద చెప్పరైరి. ఇట్లు కలసినంత మాత్రమున ఉత్సాహము మార్గి వృత్తము కాజాలదు. పాటిబండవారే చెప్పినట్లు ఈ విధముగా

కందాదులకు అనంతములగు భేదము లగును. అంతేగాక అన్ని పాదములందు గణ నిర్మాణము సమానముగా నుండుట అనగా ప్రతిపాదమునందు ప్రత్యక్షరము నిర్దిష్ట లఘు / గురు స్వరూపమున నుండుట షడ్వింశతి ఛందోజములకు వృత్త లక్షణము. దేశి ఛందములందు ఇట్టి నియమము లేక కవి గణ విధానములో స్వేచ్ఛ కల్గియుండును కనుక వీనిని (తరళ, సుగంధులను) ఉత్సాహ భేదములుగా భావింప రాదు. తెలుగులో జయకీర్తి చెప్పినట్లుగా ముఖ్యభేదములు కేవల నగణైక నిర్మిత ములు, కేవల హగణైక నిర్మితములు, హగణ నగణ మిశ్రములని లాక్షణికులు చెప్పినను[7] కవుల లక్ష్యములందును ఏకగణ నిర్మిత పాదములు గల్గలేవు. మిశ్ర మమే యున్నది[8]. అట్లు శ్రమించి ఏకగణ నిర్మితములు గావించినను ఉత్సాహలో దేశీయత్వ ముండదు. దానిని ఉత్సాహ అనక అక్షరగణ దృష్టితో చూడనవకాశ మిచ్చినట్లగునని తెలుగు కవులు భావించియుందురు. ఈ యభిప్రాయమునే డాక్టరు దొరసామి శర్మగారు హగణ నగణ మేళనమున్ననే ఉత్సాహమన జెల్లునని చక్కగా వ్యక్తీకరించినారు. లక్షణ వియుక్త ఉత్సాహ అన్న పేరు ఉత్సాహ భేద మును (గల గణ నిర్మితమైనపుడు) నాగవర్మ కన్నడ ఛందోంబుధి (5-21) లో మాత్రము చెప్పినాడు. ఇట్టి భేదము ఇతరులందు కానరాకున్నది.

**ఉత్సాహ - విషమ సీసము :**

ఉత్సాహ వృత్తము విడిగా వాడబడుటయేగాక విషమ సీసము నందును వాడ బడును. ఉత్సాహమీద గీతి వ్రాసిన అది విషమసీసమగును. ఈ గీతి సాధారణ ముగా ఆటవెలది అగుచున్నది. ప్రథమ తృతీయ పాదములలోని చివరి రెండింద్ర గణములు తప్ప తక్కిన ఆటవెలది పద్యపాద చతుష్కము నందలి గణములు 16 సూర్యగణములగుటచే సూర్యగణ బహుళ ప్రయుక్తమగు ఉత్సాహమే చక్కగా అతుకునని భావింపబడియుండవచ్చును - అనంతుడు, చిత్రకవి పెద్దన్న ఆటవెలది ఉన్న ఉత్సాహమే సీసమనిరి. తెలుగులోని లాక్షణికులు ఉత్సాహమును విషమ సీస సందర్భములోనే లాక్షణీకరించి విడిగా చెప్పరైరి అట్టి వారిలో కవిజనాశ్రయ డామ్మ్రడు అప్పకవి మాత్రము ఉత్సాహ పేరుగా చెప్పి, విషమసీస లక్షణమును వేరుగా వ్రాసినాడు.

ఉత్సాహమును వృత్త శబ్దముతో వాడుట తెలుగులో పరిపాటి ఐనదే. వృత్త శబ్దము సామాన్య పద్యవాచి వృత్త మౌక్తికం. వృత్త రత్నాకరం వంటి పేర్లు సర్వఛ్ఛందో లక్షణ లక్షితములను వృత్త శబ్దముచే పేర్కొనబడినవి. "ఉత్సా

హము వృత్తము గానుగాని ఉత్సాహ వృత్తమని చూడామణిలోను, అప్పకవీయము లోను చెప్పబడియున్నది. "ఇది యనాలోచితపు వ్రాతయనవలె భీమనానంతులుత్సాహ మని పేర్కొనిరి. వృత్తమన లేద"ని రావూరివారు అభిప్రాయపడిరి[9]. జాత్యుప జాతి పద్యములను వృత్త శబ్దముతో చెప్పుట సంప్రదాయము కాదు. వృత్తమనగా మార్గి చ్ఛందమగును. వృత్తమునందు వలె యతి, ప్రాసలు చతుష్పాద వ్యవస్థ మున్నగు లక్షణములు ఉండుట వలన వృత్తమందుమేని అక్కరాదులు కూడ అట్టివే కనుక మధ్యాక్కర వృత్తసుత్యాది పేర్లుంచ వలయును. కాని అట్టి విధా నము తెలుగు దేశీయ ఛందములందు లేదు. వృత్తమని ఉత్సాహమును పేర్కొన్న ఈ లాక్షణికులు వృత్త, జాతి, ఉపజాతి భేదములని తెలుగు పద్యములను విభజిం చుట కాననగును. ఇంతకుముందు పేర్కొన్న తరళ సుగంధి వృత్తముల దృష్టితో యోజించి ఇట్లు పేర్లుంచిరేమో అని తలచుటేమి అట్టి ఉద్దేశము వారికి లేదని ఉత్సా హమును వారు జాత్యుపజాతుల ప్రకరణమున నిర్దేశించుటయే ప్రమాణము. వారిట్టి వృత్తనామ ముంచుట ఉత్సాహమునకు గౌరవ మిచ్చుటకో, లేక సూక్ష్మ భేదముచు పాటింపకుండుటచేతనో జరిగియుండవచ్చును.

**ఉత్సాహ - జానపద గీతము :**

ఉత్సాహమును పరిశీలించిన ఇది గేయచ్ఛందమునుండి పుట్టినట్లు భావింప వచ్చును. గణములందు గల మాత్ర సమత, పాదమునకు గల గణముల సరిసంఖ్య, పాద మధ్యమునగల సమద్వి ఖండన రూపయతి వీనికి సాక్ష్యములు. ఈ క్రింది తెలుగు జానపదగీతము ఉత్సాహ ఛందములో నడచినదని చెప్పబడినది.

తులసి యింట నుంచు వార్కి
తులసి పూజ చేయు వార్కి
తులసి యందు భక్తి యుంచి
మొలగు వారి నీ

ఇందలి ఒక్కొక్క గణము ఒక్కొక్క పదము మరియు త్రిమాత్రికము. 4 గణముల మీద యతి విచ్ఛేద రూపమునను సద్యతాక్షర నియతి రూపమునను ఉన్నది. యతి పాద సమద్వి ఖండన మొనర్చుచున్నది. అనగా రెండర్ధములు సమా నముగా విడిపోయి తుల్యకాల ఖండములై లయను వ్యక్తపరచగల్గియున్నది. అంతే గాక ఆఖరు గణమగు ఏక గురువు ఎట్లు పాడవలెనో తెలిసినది ఉత్సాహలోని 7 గణముల పిదపగల గురువు తనకు ముందుగల 3 మాత్రల గణముతో సమాన

మగుటకు మరొక్క లఘువు దీర్ఘకరణ రూపోచ్చారణము నొంది, త్రిమాత్రికమై 8వ గణముగా నిలిచినది. దీనివల్ల పాదములోని గణముల సంఖ్య 8 అగును. 4 గణముల పిదప యతి సమద్వి ఖండన రూపమగును. (వారి) నీ, (చూడ) కూ అన్ని చోట్ల పాదాంత నీ, కూ, అన్న (7 గణముల మీద) గురువులు వీనిని ఉత్సాహమని చెప్పుటకు సరిపడుచున్నవి. శిష్టుల దృష్టిలో 'నీ – కూ' – అన్నవి ఒక్క గురువుగా నిల్చినవి. గేయగతిలో అవి 3 మాత్రల (ఒక మాత్ర సాగతీత వలన యేర్పడు) గణములు. ఇట్టి గేయములు ఉత్సాహముయొక్క గేయచ్ఛందో మౌలికతను నిరూపింపగల్గియున్నవి.

**ఉత్సాహ - కవుల ప్రయోగము :**

నన్నయ భట్టారకుడు తన భారతమున ఉత్సాహను నాలుగు చోట్ల వాడినాడు. వానిలో రెండు కథా సందర్భములందు, మరి రెండు ఆశ్వాసాంతమున కృతిభర్తను సంబోధించినవి. నన్నయకు సమకాలికమైన అగ్గిపరాజు నన్నపూరు శాసనము (క్రీ. శ. 1023) నందు సైతము ఇది ప్రయుక్తము. ఈ ఆశ్వాసాంతోపయోగ సంప్రదాయము తర్వాతి కవులందు సైతము పాటింపబడినది. ప్రబోధ చంద్రో దయము, హంసవింశతి మున్నగు గ్రంథములు దీనిని ఆశ్వాసాంతములుగా వాడినవి. చంపూ విధానములోని కావ్యములలో ఈ పద్యము ఉభయ సందర్భములలో స్వల్ప సంఖ్యలో వాడబడినది. తిక్కన్న[7], నన్నెచోడుడు 5 పద్యములు వ్రాసినారు. తర్వాతి కాలములో ఉత్సాహల ప్రయోగము తగ్గిపోయినది. కావ్యమున కివ్వి ఉత్సాహలు కానరావు. కవులందరును ఈ ఉత్సాహను న, గల సంయోగముగా వాడినారే గాని ఏకైక గణ నిర్మితములుగ వ్రాయలేదు. ఒక్క నన్నెచోడుడు మాత్రము 4 పాదములందును (ద్వితీయ పాద ద్వితీయ గణము తప్ప) సర్వహగణ ఉత్సాహ వాడినాడు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఘోరి | చూచి | నత్త కన్ను | * | బొత్త కన్ను నిండి | | తా |
| కార | ములనె | ఋంగు దీవు | * | కావలుండ | వైయ | హం |
| కార | వృత్తి | నీకు నల్క | * | కన్నెలింగి | తప్ప | బో |
| నేర | నైతి | కాల మైన | * | నేర్చు సెప్పు | నేయు | నే |

-కుమారసంభవము 5-79

అయ్యలరాజు నారాయణామాత్యుడు (క్రీ. శ 18వ శతాబ్ది) తాను వ్రాసిన హంస వింశతి (I-266) కావ్యములో ఉత్సాహను నన్నయవలెనే ఆశ్వాసాంత పద్యము కృతిభర్త శ్రీరాముని కంకితము ప్రథమాశ్వాసాంతమున వ్రాసినాడు. దాని

రాతడుంచిన పేరు కలహంసోత్సాహ వృత్తము అని. ఈపేరు లాక్షణికు లెవ్వరును పేర్కొనరైరి. దాని నాతడు ఉత్సాహ భేదముగా భావించి పెట్టిన పేరేమో యని పించును. పరిశీలనగా దానియందలి గణక్రమము ఒక నగణము పిదప ఒక హగణము. నహ, నహ, ఇట్లు పద్యమంతయు నడచినది.

కలుష మార భవవి మార కమల సార లోచనా
కలిత హార పరవి వార ఖరవి హార మోచనా
లలిత సిర నిధిగ [illegible] లసదు దార కీర్తిని
ర్ధళిత బార శరవ టీర దరసు థార సోత్కరా

పాదాంత గణము మాత్రము వరుసను బట్టి నగణము రావలసియుండగా హగణముంచబడినది. ఇట్టిది నాలుగు పాదములందున్నది. తక్కిన గణములన్నియు బేసి నగణములు సరి హగణములే వాడబడినవి. యతి స్థానమున విచ్ఛేద రూప సదృశాక్షర రూపయతులు ఉభయములు పాటింపబడినవి. ఈ పద్యము నందలి మరియొక విశేషమేమనగా ఒక్కొక్క పాదములోని గణములు రెండిటి కొక్క దళముగా విడిపోయి ప్రతి దళమున మొత్తము పద్యమునంతటను అంత్యప్రాస (రేఫవర్ణము) పాటించబడినది. ఇట్టి విశిష్ట లక్షణములు గలిగిన ఉత్సాహము వేరొక్కటి కానరాదు.

నారాయణామాత్యుడు దీనిని ఉత్సాహభేదముగా భావించెనేని న, హల వాడుకను బట్టి ఉత్సాహను ఈ క్రింది విధముగా భేదములు చూపవచ్చును.

1) అన్ని నగణములే వాడుట, 2) అన్ని హగణములే వాడుట, 3) నహల గణక్రమము, 4) హనల గణక్రమము.

కాని ఉత్సాహను వాడిన కవులు ఇట్టి భేదమును పాటింపరైరి. కవులలో నన్నెచోడుని ప్రయోగము హగణములే అన్ని వాడుట ఒక్కటి ఉన్నది. లాక్షణికులలో విన్నకోట పెద్దన్న తన కావ్యాలంకార చూడామణిలో అన్ని హగణములే వాడినాడు (VIII-33).

వస రించు బజ్జ లజ్జ * లజ్జ గించు రాజులన్
వేస రించు గర్వ పర్వ * వేష భూషి తారులన్
వాస వాను కార పీర * వర్గ విశ్వ భూపనీ
భాసు రాసి ధేను కాసు * భావ మాహ వంబులన్

అను ప్రాసమును సైతము ఈ పద్యమున గూర్చి వింతసొబగు కల్పించినాడు. ఒకే విధమగు గణక్రమము కనుక అన్నిపాదములందు నియతముగా నుండెనేని

అనగా పై విధముగ భేదముగ పాటింతు మేని అది ఏదేని షడ్వింతిచ్ఛందోజాత వృత్తము కాకపోవను. కాబట్టి ఉత్సాహము యొక్క దేశయత్వము చెడకుండ వలయునన్న గణములు అన్ని పాదములకు ఒక తీరున ఉండరాదు అన్న ఉద్దేశము తోడనో, ప్రయత్నపూర్వకముగా వ్రాయకుండుట వల్లనో తెలుగు కవులు ఇట్టి నియమములను పాటింపకుండిరని భావింపవలయును.

ఉత్సాహము జానపద ఛందోజన్యమని ఇదివరకె ప్రస్తావింపబడినది. రగడలు జానపద ఛందములు. మాత్రాసమక గణోపేతములు. అందువలన ఉత్సాహ, రగడవలె ఉండును. తెలుగులోని రగడలలో తురగవల్గన ఉత్సాహతో పోలియుండును. తురగవల్గన రగడలో 8 త్రిమాత్రాగణములుండును. ఉత్సాహయందు 8వ గణము మాత్రము గురువు కాగా తక్కిన ఏడు గణములు త్రిమాత్రికములే. అది కూడా త్రిమాత్రాగణముగా పాటలో లెక్కించబడును. యతి కూడా 4వ గణము మీద సరిపోయినది. గేయ రగడతో ఉత్సాహకు సంబంధము కలదనుటకు కన్నడ ఛందస్సు ప్రమాణము. అచ్చట రగడ భేదములలో ఒకటి ఉత్సాహర రగళె అనునది. అది మన తెలుగులోని తురగవల్గన వంటిది.

**Utsaha Ragale is formed of eight or four trimatra ganas or three trimatra ganas plus one guru, a line.**

1) 3+3+3+3+3+3+3+3 —లేదా
2) 3+3+3+3—లేదా
3) 3+3+3+ఒక గురువు[10].

3 తీరుల లక్షణము గల ఈ రగడాభేదములో త్రిమాత్రికముల మీద గురువు పద్ధతి తెలుగునదై యుండవలెను. కన్నడమున ఉత్సాహమునకు ప్రచారము లేదు. రగడకు పెట్టబడిన పేరు తెలుగులో కల ఉత్సాహ వంటి నడకలు కలదగుటచే దానిని బట్టియే పెట్టబడినదనవలెను.

ఉత్సాహతో సంపదించు మరియొక ఛందము మేలనగీతి. ఇది విషమగీతి భేదముగా చెప్పబడినది. 7 సూర్యగణములు పాదమున కుండును. 4 గణముల పిదప యతి ఒక్క గురువు తగ్గించిన ఉత్సాహ యగును. యతి కూడా కలసినది. మేలనగీతికే మరియొక పేరు ఎత్తుగీతి.

"ఒనరనేక ౘైన గణము కొప్ప బెరసి యుండ" మేలనగీతిలో ఒక్క

త్రిమాత్రా గణము తక్కువైనది. దీనివలన యతి పూర్వోత్తరార్ధములు సమముగా లేవు ఉత్సాహమునందు సౌష్ఠవమున్నది. పూర్వోత్తర దళములు తుల్యములు. సౌష్ఠవ ఛందమున్నందువలననే మేలనగీతి ఉపయోగములో లేకుండబోయియుండును.

— x —

## అథస్సూచికలు


1. ఆంధ్ర విశ్వవిద్యాలయ లిఖిత ప్రతి
2. తె. ఛం. వి. పు. 43
3. కవిజనాశ్రయమున చూపబడిన వృత్తము-యతి ఛందోఽధికారము
4. అప్పకవీయమున చూపబడిన వృత్తము-IV-349
5. తె. భా. ఛం. రీ. పు. 152
6. ఆం. మ భా. ఛం. శి. పు. 355, 356
7. "ఇంహ నేడు కాక హగణ - మొండె నగణమొండె దత్సాహ చర్య మొండె గురుక....సైతముగ"-కవి. జనా. జాత్య.
8. కా. చూ. (విన్నకోట పె.)లో లక్షణ పద్యము మాత్రము సర్వహగణ నిర్మితము.
9. తె. భా. ఛం. రీ. పు. 153
10. The commonness in the metre of Dravidian Languages. P. 66


★★★

# 6. త్రిపద

త్రిపద అక్కరజాతి పద్యములలో చేర్చబడినది. జాతి పద్యమగుటచే ప్రాస గల్గి, యతి మాత్రము లేనిది. కన్నడమునందును త్రిపదా ఛందమున్నది. త్రిపదకు కన్నడమునున్న ప్రాచుర్యము తెలుగున లేదు. కన్నడాంధ్రముల బాంధవ్యము స్ఫుటముగా నున్న ప్రాచీనకాలమున తెలుగులో ప్రాచుర్యముండి తర్వాత నన్నయకాలము నాటికి ఉపయోగము లేకపోయియుండును. లేదా కవిజనాశ్రయకారుడు తన నాటికి దీని ప్రయోగము తెలుగులో లేకున్నను కన్నడ ఛందో గ్రంథముల ప్రభావముచే దీనికిని తన లక్షణ గ్రంథమున లక్షణము చెప్పి ఉండవచ్చును[1]. కన్నడమున అతి ప్రాచీన కాలముననే దీనికి ప్రాచుర్యము ఉండెననుటకు క్రీ. శ. 8వ శతాబ్దపుబాదామి చాళుక్య శాసనములో కానవచ్చుచున్న త్రిపదలే సాక్ష్యము[2]. కన్నడిగులకు త్రిపద గాయత్రి వంటి ఛందము. అనగా అంత పవిత్రమును, అంత ప్రచారమును పొందినట్టిది. వేమన్న ఆటవెలదుల సుభాషితామృతమువంటిదే కన్నడ సర్వజ్ఞుని త్రిపదుల కవనము. గాయత్రి వలెనే ఇదియును త్రిపాదయుతమే. దీనినిబట్టి త్రిపద కన్నడము నుండియే తెలుగులోనికి వచ్చినదని భావించుట లెస్స. ఇట్టి భావమునకు త్రిపదలో యతి లేకపోవుట ఒక కారణము. కన్నడమున మన తెలుగులోవలె యతి ఉండదు. తెలుగులో యతిలేని పద్యము షట్పది తప్ప మరి వేరొక్కటి లేకుండుట గమనార్హము. త్రిపదయందు మొదటి పాదమునకు ప్రాసయతి మాత్రము అక్కడక్కడ కన్పించుచున్నది.

**లక్షణ విమర్శ :**

త్రిపద త్రిపాదయుత. పాదత్రయ గణసంఖ్య, గణములు తెలుగు లాక్షణికులచే భిన్న విధముల చెప్పబడినది. ప్రాచీనులైన కవి జనాశ్రయకారుడు, విన్నకోట పెద్దన్నల లక్షణములో 3 పాదములకు కలిపి 11 గణములు కాగా, అనంతాది అర్వాచీన లాక్షణికులలో 10 గణములే. కవిజనాశ్రయకారుని త్రిపదా లక్షణమైనను చక్కగా లేదు.

| | | |
|---|---|---|
| కవిజనాశ్రయము | ఇం+ఇం+ఇం+ఇం | — 1వ పాదము |
| | ఇం+సూ+ఇం+ఇం | — 2వ పాదము |
| | ఇం+సూ+ఇం | — 3వ పాదము |

మొత్తము 3 పాదములకు గల్పి 11 గణములు మొదటి రెండు పాదములు నాలుగేసి

గణములు కలవి. మూడో పాదములో ఒక గణము తక్కువ. 6వ, 10వ గణములు సూర్య గణములు. కన్నడపంచలి లక్షణము కవిజనాశ్రయముతో సరిపోవును.

కన్నడ లక్షణము : వి + వి + వి + వి | వి = విష్ణు = ఇంద్ర
వి + బ్ర + వి + వి | బ్ర = బ్రహ్మ = సూర్య
వి + బ్ర +

ఇది నాగవర్మ చెప్పిన లక్షణము. ప్రాస నియమమున్నది. తెలుగులో కూడా ప్రాస ఉన్నది.

విన్నకోట పెద్దన్న 4+4+3 గణముల పద్ధతిలో చెప్పెసను గణ క్రమము ఇంచుక భేదమున్నది.

ఇం + ఇం + ఇం + ఇం
ఇం + ఇం + సూ + సూ
ఇం + ఇం + సూ

7, 8, 11వ గణము సూర్యగణములు. ఇంద్రగణములు 9 + సూర్యగణములు 2 కవిజనాశ్రయ లక్షణముకాగా, కావ్యాలంకార చూడామణిలో పెద్దన ఇంద్రగణములు 8 + సూర్యగణములు 3 వ్రాసినాడు. అనగా ఒక ఇంద్రగణము తగ్గి, ఒక సూర్య గణము పెరిగినది.

ఆనంతాదుల లక్షణములో గణసంఖ్య 11 నుండి 10కి తగ్గినది.

ఇం + ఇం + ఇం + ఇం
ఇం + ఇం + సూ
ఇం + ఇం + సూ

అనగా విన్నకోట పెద్దన లక్షణములోని ద్వితీయపాదమందలి చివరిసూర్యగణములలో ఒక్కటితగ్గించిన ఈ లక్షణమేర్పడును. కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణులలో మొదటి రెండు పాదముల గణసంఖ్య సమముకాగా అనంతాదుల లక్షణము తర్వాతి రెండు పాదముల లక్షణము గణసంఖ్యతోబాటు సమానము. గణముల వరుసను బట్టి చూచిన క. జ. కా. చూ. ల మతమున ఏ పాదములును సమానము కావు. అనంతాదుల మతమున చివరి రెండు పాదములు సమాన గణక్రమము కల్గినవి. గణ విషయమున పెద్దన, రేచనలది ఒకేమతము కాగా బండి నాగరాజుగారు పెద్దన పద్యమును అనంతాదులతో పోల్చి సవరించినారు.[3] కాని సంపత్కుమార పెద్దనను సవరించుటకు

మును రేచన లక్షణముతో త్రైపాదు చేయవలెననిరి[4]. వారన్నట్లు రేచన పూర్వుడు కనుక అతని ననుసరించినాడనుటయే లెస్స. రేచన కన్నడ లక్షణమునే చెప్పినను చెప్పుటలో అస్పష్టత ఉన్నది. కన్నడమున ఆరవ, పదవ, గణములు బ్రహ్మ (సూర్య) గణములు. రేచన 'ఆరగు, పదింటగు నెడను' — అని చెప్పుటచేకన్నడ లక్షణమునే అనుసరించినాడనవచ్చును.

త్రిదశేంద్రములాఱగు పదియగు నెడవకున్
గడియ రెంటను మూటను
నమకుడు ద్రిపదకు నమరు.[5]

కవిజనాశ్రయకారుడు చెప్పినప్పుడు 'రెంటను మూటను నమకుడు' అన్న మాటకు రెండవ మూడవ పాదములలో ఉండే సూర్యగణములు అని అర్థము కావచ్చును. ఏలయన కన్నడమున ఈ స్థానములలో సూర్యగణముండును పై లక్ష్యము ఏల పరిష్కరింపబడినదో తెలియరాదు. ఇది సూర్యగణము 6వ స్థానమున నున్నదికాదు. రెండింటను అని కావలయును ప్రాచీన పాఠము (పరిష్కృతమైనది) 3వ పాదములో నాల్గు గణములు కల్గియున్నది.

త్రిదశేంద్రములాఱగు పదియగు నెడనకున్
గడియగ రెండింటను మూట సూర్యుల
నమకుడు త్రిపదకు నమరు[6]

తెలుగులో త్రిపదల ప్రయోగము లేని కారణముగా లక్ష్యములనుచూచి సవరించుటకు వలనుపడకున్నది. "చిన్నకోట పెద్దన, రేచన లక్ష్యమును కన్నడ లక్షణముతో సరి చూచినచో ఇట్టి అసమత్వము ఉండెడిదికాదు, లక్ష్యమును బట్టి ఉజ్జాయింపుగా తాను లక్షణము చెప్పినట్లు కన్పించును" అని సంపత్కుమారగారు అభిప్రాయపడినారు[7].

రేచన పెద్దనలది ప్రాచీన మతము. అనంతాములది నవీన మతమైనది. ప్రాచీన మతము కన్నడలక్షణానువర్తి. నవ్యమతము తద్భిన్నము. ప్రాచీన మతములో గణములు 11. నవ్యమతములో 10 గణములు. ప్రాచీన మతములో యతి లేదు. నవ్యమతములో యతి ఉన్నది.

సరవి బ్రాసము పొంది - సురపతుల్ నాల్గవదు
హరియుగ్మై కార్యాలు తెలియ
ఇరుగ నప్పగిత్రైప త్రిపద ఛం. దర్ప. III-47

ఇందు మొదటి పాదమున యతి (ప్రాసయతి) ఉన్నను పాటింపబడినది. అప్ప కవీయమున సైతము త్రిపదయందు యతితోబాటు ప్రాసయతి గూర్చబడినది.

తొలుత నల్వురిం-ద్రుంగు రెంటమూటను - IV-470

పొత్తపి వెంకటరమణ కవి తన లక్షణ శిరోమణియందును ప్రాసయతి గూర్చి నాడు. ఈతడు మూడు త్రిపదలు వ్రాసినాడు.

1. సరవి మొదల పురం -దర గణములు నాల్గు
2. పురుని మొక్క రుం - డిరవుగా నాల్గొక్క | 3-338
3 మొదలి పదమునకు - నిదుపవలె రెండు

ఇట్లు పైకి ఏలాక్షణికుడు చెప్పకున్నను ప్రాసయతిని పాటించుట జరిగినది. కావ్యాలంకార చూడామణియందు మాత్రము యతి ప్రాసలు రెండును కలవు. ఇట్టి ప్రాసయతి కవి జనాశ్రయకారుడు చెప్పకున్నను పద్యమునందు ఘటించుట వలన తర్వాతివారు కవి జనాశ్రయమును చూచి వ్రాసియుందురు. కన్నడమునందు ప్రాస ఉన్నది. కాని యతిగాని, ప్రాసయతిగాని లేదు. అయినను తొలి త్రిపద శాసనమైన బాదామీ శాసనమునందు

"సాధుగె సాధు మాధుర్యన్గె మాధుర్యం" అన్న రీతిలో ప్రాసాక్షరము అను ప్రాస యుతముగా సాగి రెండవ త్రిపదములో

'కట్టిద సింఘమన్ కెట్టో దేనెమగెందు'[3] అని ప్రాసయతి పాటింపబడినది. వేమన ఆటవెలదులకు వలె సర్వజ్ఞుడు కన్నడ సాహిత్యమున త్రిపదలకు పట్టము కట్టినాడు. అతని త్రిపదలలో సైతము ప్రాసయతి పాటింపబడినది.

1) చిత్త విల్లొడె గుడి సుత్తివడె ఫలవేను
ఎత్తు గాణపను హొత్తు తానిత్యాది
సుత్తి బందంతె సర్వజ్ఞ

2) జాతి హీనర మనెయ జ్యోతి తా హీనవె
జాతి విజాతి యెనలేకె దేవనొలి
దాతనె జాత సర్వజ్ఞ

కన్నడమునందలి త్రిపదలోని ప్రథమ పాదమునందలి ఇట్టి ప్రాసయతిని బట్టి బహుశః కవి జనాశ్రయకారుడు గమనించి తన పద్యమున నిక్షేపించియుండవచ్చును.

త్రిపదకు విన్నకోట పెద్దన చెప్పిన లక్షణము ప్రకారము

ఇం+ఇం+ఇం+ఇం | అన్న రెండు పాదములు ఒక సీసమునకు
ఇం+ఇం+సూ+సూ |

పూర్వోత్తరార్ధములకు చక్కగా సరిపోవును. పై మూడవ పాదములోని ఇం+ఇం+సూ అన్న గణక్రమము మధ్యాక్కర యొక్క అర్ధము కాజాలును అనగా విన్నకోట లక్షణము ప్రకారము త్రిపద సీస పాదముపై మధ్యాక్కర యొక్క అర్ధపాదము అతిక్రమించినట్లున్నది. విన్నకోట పెద్దన గణక్రమమును తర్వాతి అనంతాదులు మార్చి వ్రాయుటకు గల కారణమును చెప్పుచు శ్రీకోవెల సంపత్కుమారాచార్యగారు "సీస పాదము నుండి విభేదింప చేయుటకై అనంతాదులు విన్నకోట పెద్దన్న చెప్పిన లక్షణములోని రెండవ పాదమునుండి ఒక సూర్యగణమును తగ్గించియుందురని తోచును" అన్న అభిప్రాయమును వెల్లడించిరి.[10]

త్రిపదలో యతి తెలుగులో చెప్పబడలేదు. కన్నడమునుండి త్రిపద వచ్చి ఉండుటచే యతి దీనికి లేకుండ వచ్చునని చెప్పబడినది అర్వాచీన మతమున మొదటి దీర్ఘ పాదమున 2 గణముల పిదప యతి లేదా ప్రాసయతి కూర్చబడినది. యతి లేని పద్యములే తెలుగులో లేవు షట్పది, త్రిపదలు మాత్రము యతి విరహిత ములై కానవచ్చుచున్నవి. ఈరెండు కన్నడ ప్రభావమున తెలుగులోనికి వచ్చి ఉండును. త్రిపదలో గల మరొక్క విశేషము యతి ఒక్క దీర్ఘ పాదమునందు మాత్రముండి తక్కిన రెండు పాదములందు లేకుండుట. ఇట్టి విశేషము ఏ పద్యము నందును లేదు. కొన్ని పాదములకుండి, కొన్నిటికి లేకుండుట విశేషమే. అన్ని పాదములు సమానముగా నుండును. కావున ఇట్టి విశిష్ట నియమము ఇతరత్ర కాన రాదు. కాని త్రిపదలో పాద వైర్ఘ్యము 3 పాదములందు సమానముగా లేదు. కావ ఇట్లు జరిగియుండవచ్చును. తక్కిన రెండు పాదములకు యతి లేకుండుటకు కార ణము అపాదముల పొట్టిదనము. స్వల్పాక్షర పరిమాణములో యతి అక్కరలేదు. 9 ఛందముల వరకు గల వృత్తములలో వియతి ఛందోఽధికారము పేరిట కవి జనా శ్రయములో వేరుగా యతి అక్కర లేకుండ లాక్షణీకరింప బడినది. త్రిపదలోని తర్వాతి రెండు పాదములు 3 గణములు మాత్రమే కలవి (అర్వాచీన మతము) అగుటవలన వానికి యతి చెప్పకుండ వచ్చును. ఈ అభిప్రాయానుసారము 3 గణ ముల వృత్తమైన అల్పాక్కరయందు సైతము చెప్పిరవినపుడు దీనిలో ఏల చెప్ప లేదని విమర్శ కలుగును.[11] కాని ఈ అల్పాక్కరలోని రెప గణము చంద్రగణము. 2 గణములతో సమానము కనుక 4 గణముల దైర్ఘ్యము దానికి కలుగును. అర్ధము నకు అనగా 2 గణముల మీద యతి కుదర్చవచ్చును.

త్రిపద గాన యోగ్యమైన ఛందమని సోమనాథోల్లాసము చెప్పుచున్నది. ఇది త్రిపదల గానము చేయు విధానమును తెలిపినది. "త్రిపదలను గానము చేయునపుడు మొదలి రెండు పాదములను 3వ పాదములోని కొంతభాగమును చెప్పి మరల ఆ పాదములను ఆవృత్తము గావించి నాల్గవ పాదములో ముగించ వలె"నని సోమేశ్వరుడు విశదీకరించినాడు. (4- 6-281)

దేవప్ప అనే కన్నడ కవి ఛాన్య ఖండమున "త్రిపదీ ఖండనే చైవ శృంగారే విప్రలంభకే"యని వివరించినాడు. ఖండనమనగా దంపుడు అని అర్థము. ఉద్భట కావ్య కర్త సోమరాజు స్త్రీలు త్రిపదలను దంపుడు పాటలుగా పాడుదురనియు, ముగ్గురు దంచెదరు కాబట్టి త్రిపద దంపుడు పాటకు యోగ్యమవి ఛందో విమర్శకుల అభిప్రాయము. కాని దంపుడు ముగ్గురే దంచవలెనని ఏలా నియమమొనర్చవలెను. ఎందరైనను దంచవచ్చును గదా! దంపకపు పాటలలో రోకలిపోటు దరువు వేయుటకు మాత్రము ఉపయోగపడును. పాద దైర్ఘ్యముతోగాని, పాద సంఖ్యతోగాని, సంబంధము లేదు. పాద ప్రమాణము పూర్తియగు వరకు రోకటిపోటు ఆగదు. ఆగినచో పోటు పోటునకు మధ్య దీర్ఘవ్యవధి కాగలదు పాటవలన పని వేగము నియతమగును- శ్రమ తెలియరాకుండును. కాని పాద ప్రమాణము కొరకు, పాద సంఖ్య కొరకు పని ఆగదు. త్రిపద దంపుడు పాటగా ప్రసిద్ధము కావచ్చును, గాని దంచే వారితో పాదసంఖ్యకు సంబంధముండి తీరునని లేదు.

తెలుగులో త్రిపద ప్రయోగము ప్రాచీన అర్వాచీన కాలములందు దుర్లభము. ఆధునిక యుగములోని కవులు మాత్రము ప్రయోగ వైచిత్రీ ప్రియత్వమున వాడినారు. విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షములో త్రిపద ప్రయోగమున్నది.

మౌనీంద్ర యోగి సంసన్న హాసిత మూర్తి
నానాత్రి ... తి వర్తి
హానితా త్రిభజన వార్తి      అరణ్యా - శబరి - 377

ఇంత అనంతాలంకరముయై పాటింపబడెనది. యతి వేయబడినది. నేను సేకరించిన జానపద గేయములలో త్రిపదమొకటి దొరకినది.

| | | | |
|---|---|---|---|
| కామా ఆ | రెడ్డి ఇ | రోడ్డా ఉ | మినా ఆ |
| డబులాస | యికీలు | దొక్కాకు | రో ఒ ఓ |
| నాపెద్ద | సరి ఆ | సాపెద్ద | |

తులాము నారా ఆ బంగా ఆ ...సికి
ఎంతా ఆ పైకా ఆ మైకది రో ఓ ఓ
నారెడ్డి నర ఆ సారెడ్డి

ఇందు ప్రాచీన కన్నడ/కవి జనాశ్రయ లక్షణము సరిపోవుచున్నది. ప్రతి రెండు పాదముల పిదప 'నారెడ్డి నరసారెడ్డి' అన్నపాదము ఆవృత్తి అగుచున్నది. పై రెండు పాదములందు మాత్రమే విషయ వివరణ, తృతీయ పాదము కేవలము సంబోధన/ఆవృత్తి పాదమే. దీనినిబట్టి త్రిపద స్వరూపము గేయ గతి తెలిసినది.

త్రిపద దేశీయ ఛందము. దీనికిందలి పాదసంఖ్యయే ప్రమాణము. దేశి ఛందములకు నియత పాదవ్యవస్థ (చతుష్పాదత్వము) ఉండదు. ద్విపద, త్రిపద, చౌపది, పంచపది, షట్పద వంటి పేర్లతో వేరు వేరు గేయములు లాక్షణికుల లక్షణ నిర్దేశనా సందర్భమున పేర్లు పెట్టినను, వీని ఉపయోగము పేరులో ఉన్నన్ని పాదములకే పరిమితము కాక వీనిని గేయకర్త అసంఖ్యాకముగా పేర్చుచుండవచ్చును. కాని మొత్తము పాదముల సంఖ్య సరిసంఖ్యలో ఉండును. త్రిపదలో మూడే పాదములుపయోగించి వదిలిన గేయమసంపూర్ణమై కానవచ్చును. అనగా బేసి సంఖ్యలో పాదములున్న సౌష్ఠవము చెడిపోవును. రెండు త్రిపదములు వ్రాసిన అది సరియగును. ఒక ఆవృత్తిలోని లయను మరొక్క ఆవృత్తిలోని లయతో సంధానించినపుడే శ్రోతకు శ్రవణ సౌఖ్యము కలుగును. దీనిని సౌష్ఠవ మంటిని. తెలుగులోని షట్పదీ ఛందమును చూసిన ఇది బోధపడగలదు. ఆరు పాదముల ఆ ఛందమున లక్షణము 3 పాదములకే చెప్పబడును. అట్లు చెప్పబడినది త్రిపద. ఆ త్రిపదనే రెట్టించిన షట్పది యగునని వివరించబడుట గాంచగలము. ఒక త్రిపది (షట్పద అర్ధభాగముతో)తో కలిగిన లయావిర్భావము, మరొక్క త్రిపది (షట్పద అర్ధభాగముతో) సంపూర్ణమై శ్రవణ సౌఖ్యము కలిగెను.

శిష్టకవి ప్రయోగములోనేకాక, జానపద గేయాలలో ఉద్భవించబడిన త్రిపద లక్షణ గ్రంథములందు మాత్రమే నామావశిష్టమైపోయి నిలిచినది.

—×—

## అధస్సూచికలు

1. 'కవి జనాశ్రయము నాగవర్మ ఛందో౽ంబుధి యనుసరణమని' నిడుదవోలు వారి పీఠిక వావిళ్ళ ముద్రణ, 1950
2. కన్నడ సాహిత్య చరిత్ర - ఆర్.వి.యస్. సుందరం పు. 15
3. భారతి, మే, 1962 కలగూరగంప
4. కె. ఛం. వి.
6. కవి జనాశ్రయము - జాత్యధికారము (వావిళ్ళ 1969) పు. 54
5. ఛందః పదకోశము - పు. 214
7. ఛందః పదకోశము - పు. 215
8. కన్న. సాహి. చ. ఆర్.వి.యస్.సం. పు. 15
9. క. సా. చ- ఆర్.వి.యస్. సుం. పు. 144. 145
10. ఛం. ప. కో. పు. 215
11. ఛం. ప. కో. పు. 215
12. వా. దే. ఛం. రీ. – తు. ప. ——డా॥ కే. నరోత్తమన్ పు. 322



# 7. చౌపద

కన్నడాంధ్ర ఛందములలో సామ్యము గల పద్యములలో చౌపది యొకటి. చౌపది, చతుష్పద పర్యాయ నామము. అప్పకవి చౌపదిని చతుష్పద అనినాడు. తక్కిన లాక్షణికులు చౌపద, చౌపది అనినారు. కన్నడమున దీనికి ప్రయోగ మున్నను, తెలుగులో ప్రయోగము శూన్యము. త్రిపదాదుల వలెనే చౌపది గూడ లాక్షణికులచే పారంపరికముగా, లక్ష్యములు లేకున్నను లాక్షణీకరింపబడుచు వచ్చిన ఛందము.

చౌపద మాత్రాఛందము. తెలుగులో అప్పకవ్యాదులు కన్నడ లాక్షణికులు మాత్రా పద్ధతిలోనే లక్షణము చెప్పిరి. రగడలు గూడా మాత్రాఛందములే. చౌపద రగడ వికారమే. అప్పకవి చౌపద లక్షణము చెప్పుచు చతుర్మాత్రా గణములని చెప్పక పాదమునకు 16 మాత్రలని చెప్పి, యతి సైతము 8 మాత్రల మీదనని చెప్పినాడు. చౌపదతో బాటు, తెలుగు లాక్షణికులు, అర్వాచీనులు వితాళ చతుష్పద, కర్ణాట చతుష్పద అనునవి గూడా లాక్షణీకరించిరి. ఇవియును చౌపద వలెనే తెలుగులో ఉపయోగ రహితములే. ఇవన్నియు చౌపద భేదములే అనుటకు పొత్తపి వెంకట రమణ కవి తన లక్షణ శిరోమణిలో దీనిని చౌపదాధికారమన్న పేర ప్రత్యేక కుటుంబముగా లాక్షణీకరించుట సాక్ష్యము[1]. చౌపద కన్నడము నుండి తెలుగులోనికి వచ్చెనందునని విమర్శకులు తలచినను, ఇదియును కన్నడాంధ్రములు తుల్య రూప ములలో నున్న ప్రాచీన కాలము నుండియే ఉభయ భాషలలో నుండుచు వచ్చినవని భావింపవచ్చును. కన్నడాంధ్ర తుల్య ఛందములైన అక్కరజాతి పద్యములలో వీనిని రేచనాదులు పేర్కొనుట ఇందుకు సాక్ష్యము. దానికి తోడుగా కర్ణాట చౌపద అన్న పేరుతో తెలుగులో వీనిలోని ఒకదానిని వ్యవహరించుటను బట్టి తక్కినవి కన్నడ సంబంధులు కావనియే భావింపవచ్చును.

'చౌపద' అన్న పేరులో 'నాల్గు పాదముల ఛందము' అన్న అర్థమున్నది. వృత్తములన్నియు చతుష్పాద యుతములే. అనపుడు దీనికి తిరిగి చౌపది యన్న పేరెందులకు? ఉత్పల మాలాదులన్నియు నాలుగు పాదములు కలవగుటచే చౌపదు లనవచ్చును కదా! అని అన్నపుడు దేశ్య ఛందములలో చతుష్పాద వ్యవస్థ లేద నియు, ప్రత్యేకముగా నాలుగు పాదములకే పరిమితము చేయబడినదని భావింప వల యును. ఈ పేరు దేశ్య ఛందములందు ద్విపద త్రిపదుల వలె (అనియత పాద వ్యవస్థా లక్షణములకు) చెల్లునని ఎరుగునది.

ప్రాకృత చౌపద లక్షణము :

డి) చౌపయియా :

చ ఉపఇఅ ఛందా భణిఇ ఫణింవా
చ ఉమత్తా గణ సత్తా
పాపహి సగురు కరి తీస్ మత్తహ
చ ఉ స అ అని అ జిరుత్తా

2) చ ఉమత్తా=చతుర్మాత్రా×గణసత్తా=సప్తగణాః
$4\times7=28$ మీద సగురు$=2$ మాత్రలు.
మొత్తము 30 మాత్రలు పాదమునకుండవలయును[2].

తెలుగులోని చౌపదకు 4 చతుర్మాత్రా గణములు అనగా $4\times4=16$ మాత్రలు పాదమునకుండును. దీనిని బట్టి ప్రాకృత చౌపయియా అను తెలుగు చౌపదతో సంబంధము లేదని నిర్ధారితము. ప్రాకృతమునందు, ద్విపదలు, చౌపదలని రెండు నాలుగు పాదముల ఇతర వృత్తములు వ్రాసినపుడు వానికి పాద సంఖ్యను బట్టి పేర్లుంచు సంప్రదాయమున్నది. తెలుగులో ఇట్టి సంప్రదాయము పంచపాది యందు లాక్షణికులు చూపిరి. కాని యిట్టిది తెలుగులోని చౌపదికి సంబంధించనిది. ఒక్క కస్తూరి రంగ కవి మాత్రము చౌపద లక్షణము విశ్లే చెప్పినాడు. "నాల్గు ఇంద్ర గణములు+2 సూర్య గణములు ఒక చరణమగును. ఇట్టి చరణములు రెండు ద్విపద యనబడును. ఇట్లు నాలుగైన చౌపద యనబడును. దీనినే మహానవమి పద్యమందురు[3]. ఇట్టి వింత లక్షణము ఇతరులెవ్వరును తెలుగులో చెప్పలేదు. ఒకే లక్షణము గల పాదములను రెండు పాదములు వ్రాసిన ద్విపద, నాల్గు పాదములు వ్రాసిన చౌపద అనుచునిట్లు పాదసంఖ్యను బట్టి పేర్లుంచి మహానవమి పద్యములనుట ఏమో తెలియరాకున్నది. తెలుగులో పాద సంఖ్యను సూచించు ఒక్కొక్క పద్య మొక్కొక్క విశిష్ట ఛందము కాగా రంగకవి ఇట్లేల ఉదాహరించెనో తెలియ రాదు[4]. ప్రాకృత ఛందముల ప్రభావముచే అట్లు వ్రాసియుండవచ్చును. అతడు పేర్కొన్న చౌపద-తెలుగులోని ఈ చౌపద కాజాలదు.

చతుర్మాత్రాగణ చతుష్కముచే చౌపద నిర్మితమగునని గణ విధానములో చౌపదకు లక్షణము చెప్పినవాడు రేచనాములు కాగా-16 మాత్రల పాద వ్యవస్థగా మాత్రా దృష్టితో లక్షణము చెప్పినవాడు అప్పకవి. అతడు 'షోడశ మిత లఘువుల తోడన్'[5] అనినాడు. ఈతని వలెనే

"అలినవి యారసి లఘువుల తోడన్
గణగణను చౌపద గజపతి గూడన్". అని లక్షణ రాజీయము, లక్షణ దీపిక మున్నగు గ్రంథములు తెలిపినవి[6]. ఇట్లు మాత్రా సంఖ్య పాదమునకు తెలుపుటలో ఉభయ మతములు సమానములే యైనను, రేచనాదుల మతమున 4 మాత్రల గణము అనుటచే 4 మాత్రల కొకమారు మాత్రలను లెక్కింపవచ్చును. 4వ, 5వ మాత్ర కలిసిన అక్షరము ఉండరాదు. గురువు లఘువు లెన్ని వాడినను, ఇచ్చ వచ్చినట్లువాడి గురువుకు రెండు లఘువు కొక్కటి మాత్ర చొప్పున లెక్కించి, మొత్తము 16 మాత్రలు పాదమునకు నిబంధించుట అప్పకవీయాదుల లక్షణములోని వైలక్షణ్యము. కాని ఇట్లు గణ సాంకర్యము మాత్రము జరుగలేదు.

చౌపదకు గల గణములు రేచన పెద్దనాదుల లక్షణము 4 చతుర్మాత్రా గణములు కాగా, అర్వాచీన అనంతాది మతమున చివరి గణము ఒక మాత్ర తగ్గినది.

| 4 | 4 | 4 | 3 | |
|---|---|---|---|---|
| కలిసిచ | తుర్లఘు | గణముల | యందు | |
| సత్రిగ | ణంబై | నగణము | వొందు | |
| నలరుగ | గణద్వయ | యతిగో | విందు | |
| బలుక గ్ర | తుల జౌ | పదజెలు | వందు | (ఛంద. 3-50) |

నాల్గు చతుర్మాత్రాగణములు + మీద ఒక త్రిమాత్రా (సూర్యగణము) గణము అనంతుని లక్షణమైయున్నది. అనంతాదులిట్లు ప్రాచీన మతమును (చతుర్మాత్రాగణ చతుష్కము) మార్చుటకు ఏకజాతి గణ నిర్మాణము ఇష్టపడక పోవచ్చునని సంపత్కుమారగారనిరి.[7] జానపద (చతురస్రగతి) గేయములో పాదాంతాక్షరము శాబ్దిక సంస్కారణ దృష్టిలో త్రిమాత్రికముగానైనను గానవచ్చి ఇట్లు జరిగియుండ వచ్చును. పాదాంత దీర్ఘత్వమును అర్వాచీనులగు అనంతాదులు ఒప్పుకొనకుండుట చౌపద యందేగాక ఇతరత్ర కాంచగలము. 'గగ' సూర్యగణముగా అక్కర జాతి గణములలో ప్రాచీనులైన రేచన, విన్నకోట పెద్దన్నలు గ్రహింపగా, అనంతాదులు గల మాత్రము గ్రహించి 'గగ' పరిత్యజించుట ఇందులకు ప్రబల సాక్ష్యము. లేక చౌపద మధురగతి రగడతో తుల్యమగుటచే దానికి విలక్షణ మొనర్చుటకై చేసిన మార్పైనను కావచ్చును.

మధురగతి రగడ, చౌపద రెండునూ సమానములే. రెండును మాత్రాసమక

గణ నిర్మితములు. రెంటను పాదమునకు 4 చతుర్మాత్రాగణములు, రెంటను 2 గణముల పిదప యతి. పాదాంత్యప్రాస, పాద ద్వితీయాక్షర ప్రాస కలవే. కనుక తెలుగులో రగడలను చెప్పిన అనంతాదులు చౌపదను రగడకు భిన్నమొనర్చుటకై అంత్యగణములో మాత్ర ఒకటి తగ్గించిరుండురు. అంతేగాను అప్పకవి గీనిని రగడకు భిన్నముగా చేయుటకు కాబోలు తన చౌపదకు అంత్య ప్రాసయు కూర్చలేదు. అంత్యప్రాసను తక్కిన వారందరు పాటించినారు. కాని యీ చౌపద రగడ వికారమనుటకై పై లక్షణ సామ్యమే సాక్ష్యము. కాగా ఈ చౌపదను భీమన కన్నడమందలి మందానిల రఘట (రగడ) ను చూసి చెప్పినట్లు శ్రీసంపత్కుమార వ్రాసినారు[8]. కాని రేచన చెప్పకున్నను నాటికే తెలుగులో రగడలు ప్రచారములో నుండుటయు, రగడల పరిధి కన్నడమున కన్న తెలుగులో విశాలమగుటయు - చౌపదకు కన్నడ రఘట మూలమున చెల్లదు. ఒక వేళచౌపదకుకన్నడము మాతృక ముందు మేని అక్కడి చౌపదమైనను దీనికి మాతృక కాదగును. తెలుగు చౌపదకు అంత్యప్రాస ఉన్నది తెలుగు రగడలకు అంత్యప్రాస ఉన్నది. కన్నడ రగడలకు అంత్యప్రాస లేదు. కన్నడ రగడ దీనికి మూలము కాదగదనుటకు ఇవియును ప్రబల సాక్ష్యములే.

ద్విపదలో 3 ఇంద్రగణములు +1 సూర్యగణముండును. ఆ ఇంద్రగణములు మూడు చతుర్మాత్రాగణములే వాడినచో అనంతుడు మున్నగువారు చెప్పిన 4+4+4+3 మాత్రల పాదలక్షణమునకు సరిపోవును. ద్విపదలో 3 ఇంద్ర గణములు పంచమాత్రా గణములే వాడినచో కర్ణాటక చతుష్పాద అగును. కర్ణాటక చతుష్పాదలో మూడు పంచమాత్రాగణముల మీద ఒక త్రిమాత్రాగణముండును.

చౌపద కన్నడమునందు ప్రయోగములో నుండగా తెలుగులో అది కానరాదు. రగడలు తెలుగులో ప్రయోగములో నుండుట వలన ఇది ఉపయోగములో లేకుండ ఉండి యుండును. ఇది అచ్చమైన జానపద ఛందము. దేశీయ ఛందో లక్షణములు ఇందు చక్కగానున్నవి. పాదమంతయు కాలఖండములలో (చతుర్మాత్రా గణములలో) కొలువబడును. కాల ఖండములు సమసంఖ్యలో (4 గణములు) పాదమునకుండును. పాదాంత విచ్ఛేదము, పాదమధ్యమున సమద్విఖండన రూపయతి, ప్రతి గణమొక పదము. ఇవి చౌపదియొక్క లక్షణములు. తెనాలి అన్నయ్య సుదక్షిణా పరిణయమున (3–89) ఒక చౌపద వాడబడినది[9].

చిన్నది యొక్కతె చెంచొప క్రోవిన్
దిన్నగ జిమ్మెను దేనియ కావిన్

మన్నన సేయుచు హరుని శివిన్
బన్నిన ఖచరుని పవడపు మోవిన్

ఈ చౌపది సంపూర్ణ చతుర్మాత్రా గణ చతుష్కముతో చతురస్రగతిలో నడిచి నది. ఆద్యంత్య ప్రాసము, సమద్విఖండన రూపయతి తోడుగా సదృశాక్షర నియతి గల్గియున్నది. ప్ర. రా. వేం. వి.లో 4 చౌపదలు వాడబడినవి[10].

నేను సేకరించిన జానపద గీతములలోని ఒక కోలాటపు పాట చతురస్ర గతిలో 4 × 4 మాత్రల గణములతో నడచిన చౌపదగా గుర్తించదగినది.

| 4 | 4 | 4 | 4 |
|---|---|---|---|
| శ్రీరా | ములబం | టునునే | నూ ఊ |
| 4 | 4 | 4 | 4 |
| సీతను | వెదుకా | పొమ్మెద | నూ ఊ |
| 8 | | 4 | 4 |
| వారికడ్డము | | నువురా | కూ ఊ |
| 4 | 4 | 4 | 4 |
| కోరిమి | పోగా | యదిగా | కూ ఊ |

'నూ–నూ, కూ–కూ' అని అంత్యప్రాసముకూడా పాటింపబడినది.

చౌపద ఆద్య ఛ్ఛాందసికులలో మువ్విధముగా పేర్కొనబడకున్నను, తర్వాతి కాలములలో లక్షణదీపిక, లక్షణశిరోమణులందు మువ్విధములని పేర్కొనబడినది "చౌపదమ్ములు త్రివిధమ్ములై పరగునవియె మహానవమి పద్యమ్ములన వెలయు, నవి యెయ్యవి యంటేని శుద్ధ చౌపదంబును కర్ణాట చౌపదంబును, విశాళ చౌపదంబును నాఁ త్రివిధంబులయ్యె" నని పొత్తపి రమణకవి పేర్కొనినాడు[11]. చౌపదలు మూటిని పేర్కొని చివర ఇది 'చౌపదాధికారము' అని ఒకే కుటుంబముగా చెప్పినాడు. చౌపదనే శుద్ధ చౌపదయనినాడు. తక్కిన రెండు చౌపదలు అర్వాచీనులచే పేర్కొనబడినవి.

## కర్ణాట చౌపద :

పేరును బట్టి ఇది కన్నడములోని చౌపదగా భావింపవలెను. కాని చౌపద, విశాళ చౌపదలు కన్నడము నందలివి కావన్న భావము లాక్షణికులకున్నట్లు తోచును.

కన్నడమునందున్న చౌపద సైతము మువ్విధముగా గానవచ్చు చున్నది. వీనిలో రెండు దేశిగణ నిర్మితములుకాగా, ఒకటి మాత్రాగణ నిర్మితము. అవి[12].

(1) చతుష్పది లేక చతుష్పదిక
పాదమునకు 1 విష్ణు గణము + 1 రుద్ర గణము

(2) చౌపది

(A) రు+రు లేక

(B) వి+రు లేక

(C) వి+వి+వి+బ్ర (బ్ర = బ్రహ్మ)

(3) చౌపది (మాత్రాగణ నిర్మితము)

(A) 5+5+5+4 లేక

(B) 3+4+3+4 మూడు పాదములకు
3+4+3+1 గురువు ఆఖరు పాదమునకు } లేదా

(C) 4+4+1 గురువు=10 మాత్రలు లేదా

(D) వి+రు+గురువు

కన్నడమునందలి ఈ గణక్రమము దేశ్య, మాత్రాగణోభయ నిర్మితమై అతి విస్తృతమై సుమారుగా తెలుగు చౌపదల మూడింటిని అంతర్భవింపచేయుచున్నది. కన్నడ చతుష్పది (చతుష్పదిక) తెలుగులోని ఎత్తుగీతి అగుచున్నది. చౌపది (మాత్రాగణ నిర్మితము) లోని ఒక లక్షణము 5+5+5+4 ఒక మాత్ర ఎక్కువగా కన్నడ చౌపద (తెలుగులోనిది) లక్షణమునకు సరిపోవుచున్నది.

కర్ణాట చతుష్పదకు అప్పకవి లక్షణము :-

| | | | |
|---|---|---|---|
| మొగిబంచ | లఘుగణం | బులుమూడు | రవియు |
| దగులదుద | బ్రాసంబు | దాకరెం | టివయి |
| నగువిశ్ర | మమువగ | ర్ణాట చౌ | పదమె |
| నగుకృతుల | సత్కవుల | సమ్మతము | తో.ద-IV-473 |

అప్పకవి పంచ లఘుగణమన్నది 'నలల' కాక పంచమాత్రికా గణము లనియే. అతడు 'తుదబ్రాసంబు' అని చెప్పినను అంత్యప్రాస పాటింపలేదు. పంచ మాత్రికా గణములు మూడు పైనొక్క త్రిమాత్రాగణము కర్ణాట చతుష్పద లక్షణ మని దీనివలన తెలియుచున్నది. మొత్తము మాత్రల సంఖ్య 18 పై (5+5+5+4 లో) ఒక మాత్ర అధికముగా కన్నడ లక్షణము సరిపోయినది. పంచమాత్రికా గణములను అప్పకవి పేర్కొనకున్నను పొత్తపి రమణకవి

కరుగనగ    నలలతల   -   సలభలర    లొందున్
దురితహర    చరణంబు   -   తుదగగము   జెందున్

ధరప్రాస    ములు: (రెంట)   దగయతిన   హిష్ణా
వరగుగ    ర్ణాటచె    పద మిదియె   కృష్ణా[13] !

నగ, నలలి, తల, సల, భల, ర అని పేర్కొనినాడు. ఈ గణములలో 'తల' అన్నది పంచమాత్రా గణముకాదు. తగణమే UU1 పంచమాత్రా గణము, పొరపాటున ఇట్లు పేర్కొనబడియుండును. దీనిలో విశేషము 'తుదగగ' అని చెప్పుట అనగా 3 పంచమాత్రా గణములమీద ఒక చతుర్మాత్రా గణము కన్నడ మందలి 5+5+5+4 కు సరిగా సరిపోయినది. అప్పకవి లక్షణమునకు ఒక మాత్ర అధికము. ఇందు పాదాంత్య ప్రాసము సైతము రెండు పాదముల కొరకు మాత్ర పాటింపబడినది. 4 పాదముల కొరకే అంత్యప్రాస ఏల పాటింపలేదో ! ముందుదాహరించబోవు పాటలో వలె జానపద గేయముల చూచి వ్రాసియుండును. కర్ణాట చతుష్పదను పీఠిద్దరితోపాటు చిత్రకవి పెద్దన తన లక్షణసార సంగ్రహమున, వెల్లంకి తాతంభట్టు ఛందో దర్పణమున లక్షణము చెప్పినారు. పంచమాత్రా గణముల వాడుకచే ఇది ద్విపద గతితో తుల్యమగుచున్నది. చివరి గణమున మాత్రము 1 లేదా 2 మాత్రలు తగ్గింపబడినవి. అప్పకవి చెప్పిన 3 పంచమాత్రా గణములు మీద త్రిమాత్రా గణము గల కర్ణాటక చతుష్పద ద్విపదకు (3 ఇం.+1 సూ.) సరిపోవుచున్నది. యతి పాద మధ్యమగుటచే గేయగతిలో చివరి గణము సైతము పంచ మాత్రములకు విలపబడునని యే భావింపవలెను.

ఈ క్రింది జానపద గీతములలో కర్ణాట చతుష్పది ఉన్నది.

(1) సాటిలే    వింటికీ    నాబిడ్డ    నిస్తి
దామన్న    దంచన్న    గోఓగి    పువ్వా
అప్పుడో    తీమన్న    అరికాలి    చెప్పు
దామన్న    దంచన్న    గోఓగి    పువ్వా

(2) పుట్టలో    నాగన్న    బూచినా    గన్నా
ఎండలో    పడుకోకు    ఎర్రినా    గన్నా
కలవారు    ఇళ్ళలో    గర్వంబు    వారూ
కాలాపి    చల్లేరు    కాళ్ళద    న్నేరూ

రెండవ గీతము పొత్తపి వెంకట రమణకవి లక్షణమునకు సరిపోవుచున్నది. పాదాంత్యప్రాస సైతము పాదద్వయమున నొకమారు మార్చబడినది. పొత్తపి కవి కిట్టి జానపద గేయమే పాదద్వయ అంత్యప్రాసకు ప్రేరణ కావచ్చును.

## వితాళ చతుష్పద :

వితాళ చతుష్పదమునకు మాత్రా గణములలో కొందరు, దేశి గణములలో కొందరు లక్షణములను చెప్పిరి. అనంతుడు, చిత్రకవి పెద్దన దేశి గణములలో చెప్పిరి.

అర్కనామ గణ మనువుగ రెండు
దార్కొని లఘు వొందగ నిట్టుండు
దర్శింపగను వితాళము నందు
పేర్కొనదగు హరి బిరుదుల పిందు (ఛంద - III - 51)

2 సూర్య గణములు, 2 ఇంద్ర గణములు మీద ఒక్క లఘువుండవల యును. దీనిని అనంతుడు చక్కగా చెప్పలేదు చివర లఘువులేదు. తృతీయ పాదమున 2 సూర్య గణములకు బదులు 6 మాత్రల గణము వాడబడినది. పాదమునందు మాత్రము అన్నింట 15 మాత్రమే కలవు. అంత్యప్రాస ఉన్నది. అనంతుడు 'అర్కనామగణ'ము అని చెప్పదలచినను, దేశి గణములకన్న మాత్రా గణములకే ప్రాధాన్యమిచ్చినాడనవచ్చును. పై పాదములలో 2 సూ + 2 ఇం. +1 మాత్ర పద్ధతి లేదు.

రవియుగము చ తుర్లఘుగణ యుగము
నవులనునొక లఘువై పదపదము
ద విలిన నిడియె వితాళము క్రమము
జివరనొను విశ్రమ మీ విధము, ల. సా. సం. (2-122).

లో ఇంద్రగణము అనుటకు బదులు 'చతుర్లఘు గణ యుగము' అనియే చెప్పి నాడు. అంత్య ప్రాసము తెలుగులో ఎవ్వరు చెప్పకున్నను పై ఇద్దరి లక్ష్యములను బట్టి వితాళ చౌపదలో అంత్యప్రాసము వాడదగినదేయనిపించును!

"భానుగణయుగము పయినవలలిం
పూన మణి విరతి నొండి ధరలో" నని అప్పకవి చెప్పినవుడు. (నవ = తొమ్మిది, లలు = లఘువులు) భాను గణమనగా త్రి మాత్రిక గణమని భావించి

వచో 3+3+9 మాత్రలు అప్పకవి చెప్పినట్లాయెను. 2 చతుర్మాత్రాగణములు +1 మాత్ర అనుటకు బదులు అప్పకవి 9 మాత్రలనినాడు. ఇట్లనుట వలన మాత్రల సంఖ్య సమానమేయైనను చివర లఘువు విడిగా వాడక వెనుకటి లఘువుతో కలిపి గుర్వంతముగానైనను వాడవచ్చును. అప్పకవి అట్లే (ధరలో) వాడినాడు.

ఇట్లు పై లక్ష్యములలో గణములన్ని చెప్పక మాత్రల సంఖ్య చెప్పిన సరిపోయెడిది. మాత్రాఛందమైన దీనిలో దేశిగణములు చెప్పిన మాత్రా సమత్వము లేని కారణముగా అట్లు చెప్పుట కంటె ఇదియే ఉత్తమము.

నాచన సోముని వసంత విలాసములోనిదిగా ఒక వితాళ చతుష్పద పేర్కొనబడినది.

పీణా గానము వెన్నెల తేట
రాణ మీఱగ రమణుల పాట
ప్రాణ మైనపిన బ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజర పాట

దీనిలో సూర్యగణము ప్రథమ పాదమున లేదు. ఇంద్రగణములన్నదిలేదు. మొత్తము పాదమునకు 15 మాత్రలున్నవి. అప్పకవి చెప్పినట్లే 8 మాత్రల మీద యతి విచ్ఛేద రూపమున నున్నది. గేయచ్ఛందమైన దీని యందు 8 మాత్రలమీద యతి అనగా యత్యనంతరభాగము సైతము 8 మాత్రలని భావించవలయును. అనగా 7 మాత్రల తర్వాతి భాగమునకు ఒకమాత్ర సాగతీత ఉండునని భావింపవలయును. పై నాచన సోముని పద్యమును అప్పకవి చెప్పినట్లు పాదాంత గురువుగా చేయవలయును.

ఇట్లు చౌపద తెలుగులో ప్రయోగములో లేక రగడ లేదా ద్విపదలతో తుల్యమై, దాని ప్రయోగ గౌరవము వలన ఉత్తమై గేయ చ్ఛందమునకు గుర్తుగా లక్షణ గ్రంథములలో మిగిలిపోయినది.

— x —

## అధస్సూచికలు

1. లక్షణ శిరోమణి - పౌ. ర. క. పు. 218
2. ప్రాకృత పైంగళం-I-97
3. ఆనంద రంగ రాట్ఛందము—కస్తూరి రంగకవి I-52

4. పొత్తపి వెంకట రమణకవి గూడ మహా సులు పద్యములనిచాడు. లం. శ. పు. 9 217

5. అప్పకవీయము IV-471

6. ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయ వ్రాతప్రతులు No. 120, T.111- అజ్ఞాత కర్తృకములు.

7. తెలుగు ఛందో వికాసము. పు. 200

8. ఛం. ప. కో. పు. 216

9. తె. భా. ఛం. రీ. - రావూరి దొ. శ. పు. 174

10. అనుబంధము I లో చూపబడినవి

11. ల. శ. III. 341 పు. 217

12. The Commonness in the metre of Dravidian Languages P. 69, 70.

13. లం. శ. III- పు. 218



# 8. షట్పద

కన్నడాంధ్ర తుల్య ఛ్ఛందములలో షట్పది ఒకటి. కన్నడమున ప్రచురమైనను తెలుగులో దీనికి శిష్టకవి ప్రయోగము లేదు. జానపద గీతములందు మాత్రము ఉదాహరణలు కానవచ్చుచున్నవి. కాని లాక్షణికులు మాత్రము తెలుగులో పారంపరికముగా లక్షణమును చెప్పినారు. కన్నడమున షట్పద ప్రారంభమున బహు భేదయుతము కాదు. నాగవర్మ ఛందోంబుధియందు చెప్పిన విధముగనే షట్పదిని చూసి రేచన తన కవిజనాశ్రయమున లక్షణము చెప్పినట్లున్నాడు. రేచనను అనుసరించి అనంతర లాక్షణికులు తెలుగులో లక్షణము చెప్పినారు. కాని కన్నడమున తర్వాతి కాలమున వెలసిన షట్పది భేదములను తెలుగులోని అర్వాచీన లాక్షణికులెవ్వరును గమనింపరైరి[1]. దేశిచ్ఛందములలో పదచ్ఛందములు కన్నడాంధ్రములకు తుల్యములై, కన్నడమున ప్రచారములో నుండి, తెలుగులో లాక్షణికుల గ్రంథములందు మాత్రము శేషించి పోవుట గమనించగలను.

షట్పది పదచ్ఛందము. మాత్రాఛందము అగుట గేయగతి గల్గియున్నది. తెలుగులోని రగడ వికారమే షట్పది. తెలుగులోని ఛాందసికులందరును ఇట్టి పద చ్ఛందములను ప్రత్యేకముగా ఒకే స్థలమునందు లాక్షణీకరించిరి. ద్విపద, త్రిపద, చౌపద, కర్ణాటక చౌపద, వితాళ చౌపద, మంజరీ ద్విపద, షట్పద, రగడలు, రేకులు, యక్షగానములు ఇవి అన్నియు ఒకే చోట లాక్షణీకరింపబడుట గమనించ గలను. షట్పద రగడ వికారమే ఐనను తెలుగులోని లాక్షణికులు దీనిని దేశి గణ వ్యవస్థలో (సూర్యేంద్ర చంద్రగణ వ్యవస్థ) కొలచినారు. కన్నడమున మాత్రము ఇది మాత్రాగణములతో కొలువబడినది.

షట్పదకు రేచన లక్షణము.

త్రిదశేంద్ర గణముల
వెలయని ట్యాడిడి
కడపను త్యజించిన చంద్రు గూర్చి
తుదియిట్లు గానిడి
జెప్పిన నదియొష
ట్పదమగు మల్లియ రేచనాఖ్య[2]!

ఇంద్ర గణములు పాదమునకు రెండు చెప్పిన 3 పాదములు వ్రాసి 3వ పాదములో ఆఖరుగా చంద్రగణము చేర్పబడెనని త్రిపదములకు లక్షణము చెప్పి దానిని రెట్టించిన షట్పద యగునని రేచన చెప్పినాడు. దేశ్యచ్ఛందములలో రెట్టించు టన్నది సామాన్య లక్షణము. ఇచ్చట ఒక త్రిపద రెట్టింపగా షట్పద వచ్చెను. లాక్షణి కులు చెప్పిన గణ విధానమే ఇట్టి భావనకుపబలకము.

గణములు ఈ వరుసలో నుండును.

ఇం+ఇం (1వ పాదము)
ఇం+ఇం (2వ పాదము)
ఇం+ఇం+చం (3వ పాదము)

కవిజనాశ్రయకారుని లక్షణములో ప్రాసము 2, 5వ, పాదములందు లేదు. అనగా 1, 2 పాదములు ఒక ఖండముగా 4, 5 పాదములట్లే ఒక ఖండము (పాదము)గా భావించినాడనవలె. అంతేగాక ఆధునిక ముద్రణములలో షట్పాదము లలో చూపబడినను ప్రాచీన ప్రతులందు 4పాదములు గనే చూపబడినది. దీనికి కారణము బహుశ 3వ పాదము చంద్రగణోపేతమై దీర్ఘమై, మొదటి రెండు పాద ముల కింపుమించు తుల్యముగుట వలన అట్లు లిఖింపబడి ఉండవచ్చును. అప్పుడు లేఖనమున—

త్రిపదేంద్ర గణములు, వెలయ నిమ్మాడిడి
కడియ నంత్యంబున జంద్రు గూర్చి
యది యిట్లుగా మడి, జెప్పిన నది యష
ట్పదమగు మల్లియ రేచనాఖ్య!

వావిళ్ళ ప్రచురణమున ఇట్లేయున్నది. దీనికి తోడు ప్రాసము కూడా ద్వితీయ, పంచమ పాదములందు రేచన ఘటింపకుండుట ఇట్లు పాద విభాగ మొన ర్చుటకు తోడ్పడినది. రేచన ఇట్లేల ప్రాసము 2, 5 పాదములకు ఘటింపకుండెనో తెలియరాదు.

అప్పకవి మాత్రము దీనిని నాల్గు పాదములదిగా చెప్పినాడు.

ప్రాసము ల్యమ్మాటు
వాసవు లాగ్గురి
వైసుధా దీధితి, తో నిర్మతి
హాస్లిల్ల గాబాద
మీ బాటె తో నాల్గు
శివుని త్పతులింప షట్పదాఖ్య (4-476)

మాత్రలు 9+9+ '10 నుండి 17 మాత్రలు' తెలుగులో షట్పది 1, 2, 4, 5 పాదములందు ఇంద్ర గణములు రెండు చతుర్మాత్రిక మొకటి, పంచ మాత్రికము ఒకటి వాడి 3, 6 పాదములందు 2 పంచ మాత్రిక ఇంద్రగణములు+7 మాత్రల చంద్రగణము వాడిన దీనికి సరిపోవును. దీర్ఘ పాదములందు 14 మాత్రల నుండి 17 మాత్రల వరకుండుట తెలుగు గణములను బట్టి సరిపోవును.

ప్రాకృత పైంగళము నందు షట్పదయుతముగా రసికా ఛందమనునది పేర్కొనబడినది. కాని 4+4+3 మాత్రల లక్షణము గల ఆరు పాదము.. వ్రాసిన 'రసిక' యనబడినది[5]. ఇది పాదముల సంఖ్యను బట్టియే పిల్వబడినదే కా.. తెలుగు షట్పది వంటిది కాదు. స్వయంభూ ఛందము పేర్కొన్న షట్పది మాత్రము అచ్చముగా తెలుగు కన్నడములందలి షట్పది వంటిదే. వానిలోని తర్వాతి రెండు 8 మాత్రలు, 9 మాత్రలు ప్రథమ ద్వితీయ పాదములుగా గలవి శరషట్పది, విషమ షట్పదిలతో సరిపోయినవి. కాని తృతీయ షష్ఠ పాదములందలి 10 నుండి 17 మాత్రలన్న నియమము మాత్రము కన్నడాంధ్ర షట్పదులతో పోలకున్నవి. కన్న డాంధ్ర దేశి (అంశ) గణ నిర్మితములలో దీర్ఘ పాదములు 14 నుండి 17 మాత్ర లుండును. 1, 2 పాదముల యొక్క మాత్రా పరిమాణము, తృతీయ పాదము వీని కన్న ఎక్కువ మాత్రలు గలదిగా నుండుట, 1, 2, 3 పాదముల వలెనే (అనగా ఒక అర్ధము వలెనే) తర్వాతి 4. 5, 6 పాదములు (తర్వాతి అర్ధము) ఉండుట మాత్రము ప్రాకృతముతో కన్నడాంధ్రములకు సరిపోవుచున్నది. దీనిని బట్టి ప్రాకృతము నుండి దేశ భాషలలోనికి షట్పదులు వచ్చినవేమో అనిపించును. కాని స్వయంభూ ఛందః కర్త స్వయంభువు నాగవర్మకు ఇంచుమించు సమకాలీనుడు. దేశ భాషలలోని షట్ప దుల విస్తృతోపయోగమును బట్టి చూడగా ఇక్కడి నుండియే ప్రాకృతములోనికి ప్రవేశించినవేమో అనే శంక రాకమానదు.

షట్పదిలో యతి గూర్చి అప్పకవి 'విర్యతి'యని, అనంతుడు 'వళ్ళుదొఱగ' అని యతి లేకుండుటను గూర్చి చెప్పినారు. కన్నడమునందును యతిలేదు. తెలుగులో యతిలేని పద్యమిది ఒక్కటే. ఇది గేయ చ్ఛందమగుట గేయములలో సదృశాక్షర రూపయతి నియతము కాకుండుట వలన, కన్నడములో వియతి రాహిత్య మును తెలుగులో షట్పదికి యతి లేకుండ చేసినవి. రెండే గణముల చిన్న (1, 2, 4, 5) పాదములో యతి లేకుండుటయే ఉచితము. దీర్ఘ పాదము (3, 6) లందు

యతి ఉండుట ఉచితమని భావించిరి రాబోలు విన్నకోట పెద్దన అనంతాదులు పీనివి పాటించిరి.

సురపయు గమ్మతో సోముండును (3వ పాదము) యతి.
సరి ప్రాసం బులుపస రారంగను (6వ పాదము)
ప్రాసయతి (కా. చూ. 8-59)
పరలు జక్రిపదాబ్జ పర్ణసంబు (ఛం. ద. 3-46)

ఇక్కడ యతి ఉద్దేశపూర్వకముగా గాక యాదృచ్ఛికమే కావచ్చును. అందు వలన దేవియందు యతి లేదనియే భావించవలయును. ప్రాస మాత్రము నియతము. ఒక్క కవిజనాశ్రయము 2, 5 పాదముల తప్ప అన్ని లక్షణములందు ప్రాస పాటింపబడినది.

షట్పదికి కన్నడములో వలె తెలుగులో ప్రచారము లేదు. ఒకటి రెండు జాన పద గీతములలో మాత్రము ఇది కన్పట్టుచున్నది. ఆధునిక యుగమునందు షట్పదల ఉపయోగము అధికమైనది. ప్రాచీనకాలమున షట్పదల ఉపయోగము లేకున్నను శిష్ట కవులు సైతము వీనియొక్క ప్రాముఖ్యమును గుర్తించి గేయ ఛందములుగా తమ గ్రంథములందు పేర్కొనిరి. వారు-

1) కుమారసంభవములో నన్నెచోడుడు (4-102)
'చ. అలరుల మందహాసముల నన్నిన షట్పదపుం జుగీతి' అని

2) పాండురంగమాహాత్మ్యములో తెనాలి రామకృష్ణకవి (4–10)
'కన్నడ కవితా విలాసంబు నుంబోలె షట్పద వృత్త విలాస భాసురంబై'
అని కన్నడ షట్పది గూర్చి

3) అయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యుదయము నందు (1-22)
క. వనితామణి యీ చోద్యము
కనుగొంటే షట్పదములు గల మంజరు లిం
దు నవీనాగమ రూఢిన
ఘన పద్యాన్వితము లగుచుఁ గానంబడియెన్

4) రామరాజ భూషణుడు వసుచరిత్రలో "వదమెత్తన్ కలహంసలీల" అన్న (తృ తీ. 59) పద్యములో "పీక్షింప షట్పదియుం బొల్చు" అని

షట్పదులను గూర్చి ప్రశంసించుచు ప్రస్తావించినారు. దీనిని బట్టి తెలుగులో షట్పదుల రచన కొనసాగుచు వచ్చినదని, అది జానపద గీతములందే ప్రయోగింపబడినదని భావించవలయును. ప్రశంసించిన కవులు సైతము దీనిని (షట్పదిని) తమ కావ్యములలో ఒక ఛందముగా ప్రయోగింపరైరి. ఈ అభిప్రాయమును వివాకర్లవారు వ్యక్తమొనర్చినారు. "షట్పదుల తెలుగున శిష్ట కవితలోనికి ఎక్కలేదు.. కాని వాటలు మున్నగు వానిలో గానవచ్చుచునే యుండును."[6]

తెలుగులోని షట్పది ఇంద్ర చంద్ర గణ నిర్మితమగుట వలన, ఆ గణములు మాత్రా సమకములు కాకుండుట వలన కవి ప్రయోగములో గణస్వేచ్ఛ గలిగి ఉండి మాత్రా సమకములు కాకుండ వ్రాయవీలున్నది. అందుకే 2 ఇంద్ర గణముల ప్రథమ-చతుర్థ. ద్వితీయ-పంచమ పాదములలో 8 నుండి 10 మాత్రలకు, తృతీయ-షష్ఠ పాదములలో 14 నుండి 17 మాత్రల వరకును అవకాశమున్నది. రెండింటిని గణము లనగా కనిష్ఠ ఇంద్రగణ మాత్రలు $4\times2=8$, గరిష్ఠ మాత్రా గణములలో ఇంద్ర గణములు $5\times2=10$. తృతీయ, షష్ఠ పాదములలో 2 ఇం+1 చం. అనగా కనిష్ఠ మాత్రికా గణములే వాడిన $\overbrace{2\times4}+\overbrace{1\times6}=14$, అన్ని గరిష్ఠ మాత్రికా గణములే వాడిన $\overbrace{2\times5}+\overbrace{1\times7}=17$ మాత్రలుండును ఇట్లు లక్షణ వైశాల్యము గల తెలుగు షట్పద మాత్రాసమక గణ నిర్మాణముచేత కన్నడములోవలె షట్పద భేదములను సృష్టింప జాలియున్నది.

కన్నడములో చెప్పిన షడ్విధ షట్పద భేదములు కొన్ని తెలుగులో లక్షిత ములై యున్నవి. కన్నడ షట్పదులలో చివరి చంద్ర (రుద్ర) గణము గుర్వంతమై, చివరి గురువు విడిపోయి, తక్కిన గణము వెనుక గణములతో సమ మాత్రికమై ఉండును.

1) శరషట్పద

ఒక అర్ధము $\left\{\begin{array}{l}4+4\\4+4\\4+4+4+2\end{array}\right.$

చివరి 6 మాత్రల గణము (చం. గ.) 4+2 గా విడిపోయినది తక్కిన అర్ధమిట్లే.

కావ్యాలంకార చూడామణిలోని లక్ష్యము (8-58) శరషట్పది వంటిదే.

| | | | |
|---|---|---|---|
| సురపతు (4) | లిరుపురు (4) | | |
| సురపతు (4) | లిద్దరు (4) | | |
| సురపయు (4) | గమ్మతో (4) | సోముం (4) | డును (2) |
| ఖరువడి (4) | పెనగొవ (4) | | |
| వరుదుగ (4) | షట్పది (4) | | |
| వరిబ్రా (4) | సలుదవ (4) | రారం (4) | గను (2) |

ఇందు "గమ్మతో" అన్న గణము మాత్రము (తృతీయ పాద ద్వితీయ గణము)ఒక్క మాత్ర అధికమైనది. తెలుగు లాక్షణికులు ఇట్టి ప్రత్యేక నియమమును పాటింపకుండుటచే ఇట్లైనవి.

ఆధునిక యుగమునందు మాత్రాచ్ఛందస్సులను ఉపయోగించిన కవులలో ఇట్టి షట్పదులు కానవచ్చుచున్నవి. మాత్రిక ఛ్ఛందో మర్మజ్ఞుడైన శ్రీ శ్రీ వ్రాసిన 'మరో ప్రపంచం'లో శరషట్పది ఉపయోగించబడినది.

| | | | |
|---|---|---|---|
| 4 | 4 | | |
| మరోప్ర | పంచం | | |
| మరో ప్ర | పంచం | | |
| | | 4 | 2 |
| మరో ప్ర | పంచం | పిలిచిం | దీ |
| పదండి | ముందుకు | | |
| పదండి | తోసుకు | | |
| పోదాం | పోదాం | పై పై | కి |

—మహాప్రస్థానం

ఇది చతురస్రగతిలో నడచుచున్నది.

## 2) కుసుమషట్పద

| | | |
|---|---|---|
| ఒక అర్థమునకు { | 5+5 | చివరి |
| | 5+5 | చంద్రగణము |
| | 5+5+ 5+2 | 5+2 (7 మాత్రలుగా) |

అనంతామాత్యుఁడు తన ఛందోదర్పణమున (3-46) నిచ్చిన లక్ష్యము కుసుమ షట్పద లక్షణము గల్గియున్నది.

5 5
మెఱయంగ నిద్దఱి
ద్దఱు సురేం ద్రులు మూడు 5 2
తెలుగులన్ శశిగూడ వర్ధంబు లన్
నెఱిగ్రాల గావళ్ల
దొలుగష ట్పదరీతి
వఱలుజ క్రీవదాబ్జ వర్ధనం బున్

"పాటలలో ఛందస్సు" అన్న గ్రంథమున పి. రాజగోపాలరాయుడుగారు (పుట. 32) ఆధునిక కవిత నొకదానిని కుసుమషట్పదిగా గుర్తించినారు.

స్వప్నాల లోనన్ను
స్వర్గాల దేవించి
ఆనంద మున ముంచి వేశావు రా

ఇది ఖండగతిలో నడచుచున్నది.

3) భోగషట్పద :

3 + 3 + 3 + 3
ఒక అర్ధమునకు 3 + 3 + 3 + 3
3 + 3 + 3 + 3 + 3 + 3 + 2

భోగషట్పది షట్పదులన్నిటిలోకి తెలుగులో ప్రచురమైనదిగా గాన వచ్చుచున్నది. జానపదగేయము లందును. భజన సాహిత్యమందును ఇవిగానవచ్చుచున్నది.

1) తులసి యింట నుంచు వార్ని
తులసి పూజ చేయు వార్ని
తులసి యందు భక్తి యుంచి గొలుచు వారి నీ.

2) సువ్వి సువ్వి రామ చంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి నీ ఇ తమ్మ- మాకు శుభము లిమ్మా ఆ

— జానపద గేయములు.

3) రామ చం- ద్రాయ జనక
రాజ జామ నోహ రాయ
పూప కాల ప్ఠ వాయ మహిత మంగ ళం.
— భద్రాచలరామదాసు కీర్తన.

ఇది త్ర్యస్ర గతిలో నడచుచున్నది.

4) భామినీషట్పద ;

భామినీ షట్పదకు కన్నడములో మంచి ప్రచారమున్నది. దీనికి 'కన్నడ కస్తూరి' అని ప్రసిద్ధిగలదు. దీనికి గణములు మాత్రలలో అర్ధమునకు

3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4 + 3 + 4 + 2 గా ఉండును. తెలుగులోని ప్రాచీన జానపద గీతమొకటి భామినీ షట్పదిలో నడచినది. ఇది మిశ్రగతిలో నడచుచున్నది. తెలుగు భాషకు ఏడేసి మాత్రల పదములు సహజములు కావు. ఇది గణమున ఏడు మాత్రలుగా గాక 3, 4 మాత్రలుగా పదములు విడిపోవుట ఇందు చూడనగును.

3 4 3 4
1) గుమ్మ దేడే గోపి దేవి
గుమ్మ దేడే కన్న తల్లి 3 4 2
గుమ్మ డినిపొడ సూప గదవే అమ్మ గోపె మ్మా.

ఇక చెప్పబోవు షట్పదులు వెనుకటి నడకలతోడనే వెనుకటి షట్పదలకు రెట్టింపు రూపములో నున్నవి.

5) పరివర్ధిని షట్పద ;

4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4 + 4 + 4 + 2

ఆఖరు గురువు విడిచి తక్కిన ఒక్కొక్క చతుర్మాత్రా గణము స్థానమున రెండు చతుర్మాత్రా గణములు వచ్చి ఇది శరషట్పదతో రెట్టింపగును. మీద ఒక్క గురువు ఎప్పటివలె అతుకును. ఈ రెట్టింపు రగడల వంటిదై యున్నది. చివరి రెండు మాత్రలు సాగదీసిన ఇది మధురగీతి రగడ కాగలదు.

6) వార్ధక షట్పద :

5 + 5 + 5 + 5

5 + 5 + 5 + 5

5 + 5 + 5 + 5 + 5 + 5 + 2

ఇదియును అష్టే కుసుమ షట్పదకు రెట్టింపుగ నున్నవి. ఈ రెట్టింపు ఆఖరు గణమును సాగదీసిన ద్విరదగతి రగడ యగును.

ఇంక తలషట్పద, జలషట్పదలన్నవి వెనుకటి భేదములలో అంతర్భవించును. వానిలో ఇవి సగముండును.

1) తలషట్పద. బొమికల విరుగ 3 + 3
నడుము విరుగ 3 + 3
కష్టపడెడి శ్రామికా ! 3 + 3 + 3 + 2.

ఇవి రెట్టింపైన భోగ షట్పద యగును.

2) జలషట్పద. నేను సైతం 3 + 4
ప్రపంచాగ్నికి 3 + 4
సమిధనొక్కటి ఆహుతి(చ్చాను) 3 + 4 + 3 + 2.

ఇది రెట్టింపైన భామినీ షట్పద అగును.

విషమ షట్పద, ప్రౌఢ షట్పదలు మొదటి దానివి రెట్టించిన రెండవదగును.

1) విషమ షట్పద 4+5
4+5
4+5+4+5+2

2) ప్రౌఢ షట్పద 4+5+4+5
4+5+4+5
4+5+4+5+4+5+2

చివరి '4+5+2' మాత్రము రెట్టింపు కాలేదు. ఇది సంకీర్ణ గతిలో వడను.. సంకీర్ణగతి జాతులలో 5వది. త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ జాతులలో చివరి రెండు జాతులకు ఎక్కువ ఉపయోగము తెలుగు జానపద గీతులందు కానరాదు.

వీనిలో మొత్తము 10 విధములైనవి*. కాని 10 విధములలో 5 విధములకు రెట్టింపగా తక్కిన 5 విధముల షట్పదులు పుట్టును. కాన వీనిలో 5 విధములే మూల ఛందములనదగును.

1) తల షట్పదికి రెట్టింపు భోగషట్పది
2) జల " " భామినిషట్పది
3) శర " " పరివర్ధనిషట్పది
4) కుసుమ " " వార్ధకషట్పది
5) విషమ " " ప్రౌఢషట్పది యగును.

తెలుగులోని రగడలు నైతమిట్లు ద్విగుణీకృత మొనర్చుచు భేదములుగ విలసిల్లుట గాంచనగును. షట్పదులును రగడల వంటివే. చివరి గురువు తృతీయ, షష్ఠ పాదములలోనివి సాగదీసినచో వెనుకటి మాత్రలతో సమమై సౌష్ఠవము కలిగి రగడల వలె అగును.

భోగషట్పద 3+3+3+3 — 1వ పాదము
3+3+3+3 — 2వ పాదము
3+3+3+3 }
3+3+2 } — 3వ పాదము

ఈ మూడవ పాదములో చివరి రెండు మాత్రలు (గురువు) సాగదీసినచో మరి రెండు మాత్రలు నిండి సంపూర్ణ సౌష్ఠవము పొందును. ఎట్టి పాటలైనను అర్ధోక్తిలో ఆగిపోవు. సౌష్ఠవ రూపమును సంతరించుకొన్ననేగాని తాళ బద్ధము కాజాలదు. అక్షరము లేకున్న, అఖండన సాగతీత సాధ్యము కాకున్నను కనీసము తర్వాతి పాదము ప్రారంభించువరకు గల మధ్యకాలమును విరామముగా గ్రహించి మాత్రలు నింపుట గేయ పద్ధతి కనుక పై షట్పదులు రగడ వికారములే యగుటలో యెట్టి విప్రతిపత్తి ఉండబోదు. ఇట్లు మాత్రాగణ నిర్మితమైన షట్పదులు రగడలుగా మారిపోవును.

1. భోగషట్పద = హయ ప్రచార రగడ - త్రిమాత్రిక - త్ర్యస్రగతి
2. శరషట్పద = మధురగతి రగడ - చతుర్మాత్రిక - చతురస్రగతి
3. కుసుమషట్పద = ద్విరదగతి రగడ - పంచమాత్రిక - ఖండగతి
4. భామినీషట్పద = హరిణగతి రగడ - 4+3 మాత్రలు - మిశ్రగతి

భామినీ షట్పద కుదాహరణముగా చూపిన "గుమ్మదేదే" అన్న జానపద గీతము ప్రాసతో సహా హరిణగతి రగడకు సరిపోయినది.

హరిణగతి రగడకు 3+4=7 మాత్రల ఈ విరుపుతో గణములు రెండు చొప్పున పాదమునకు ఉండి సమసంఖ్యలో పాదములుంత వలయును.

గుమ్మ దేదే గోపి దేవి
గుమ్మ దేదే కన్న తల్లీ
గుమ్మ డిని పొద సూప గదవే
అమ్మ గోపె మ్మా ............

భామినీషట్పదలోని చివరి దీర్ఘ (తృతీయ) పాదము యొక్క చివరి '3+4+2' భాగమును తర్వాత పాదముగా వ్రాసి లోపించిన మాత్రలు పూరించుటచే ఇది అచ్చముగా హరిణగతి రగడయైనది. ప్రాస కూడా కలిసినది. అంత్య ప్రాస జానపద గేయములలో నియతము కాదు కనుక దీనిని రగడగా భావింపవచ్చును. అందులకే దీనిని గిడుగు వెంకట సీతాపతిగారు మిశ్రగతి గేయముగా భావించి ఉదాహరించినారు[10].

భోగషట్పద త్రిమాత్రికా గణములతో ద్వితీయార్ధము ఉత్సాహవలె నడచును. భోగషట్పద కుదాహరణముగా చూపఁబడిన 'తులసి ఇంట నుంచువార్ని' గేయము 'ఉత్సాహ'కు కూడ నేనుదాహరించితిని.

తెలుగు లక్షణము ప్రకారము షట్పది సీసమగుటకు అవకాశము కలదు. షట్పదిలో దేశిగణ వ్యవస్థలో

ఇం+ఇం
ఇం+ఇం

ఇం+ఇం+చం కాగా సీసము యొక్క ఒక్క పాదముగా షట్పది కాగలదు. సీసమునకు 6 ఇం+2 సూ. ఉండును. చివరి చంద్రగణము 2 సూర్య గణములుగా విడిపోయిన సరిపోవును.

"ఖాసిల్లి గాబాద
మీసూటి తో నాల్గు
జేసిన కృతులందు
షట్ప దాఖ్య"

అప్పకవీయ షట్పద ఉత్తరార్ధము

ఇదియే "సీ. ఖాసిల్లి గాబాద * మీసూటి తోనాల్గు

జేసిన కృతులందు షట్పదాఖ్య"గా సీసము వలె సరిపోయినది. షట్పద మూడు పాదములందలి ప్రాస సీస పాదములోని మూడు ఖండములకు ప్రాస యతిగా సరిపోవును. నాల్గవ ఖండమునకు అనగా షట్పద తృతీయ పాదములోని అధిక గణమునందు కూడ ప్రాసయతి లేక యతి పాటించితిమేని అది సీసమునకు రెండవ అర్ధములోని రెండు ఖండములకు సరిపోవును. ఇచ్చట అట్లు పాటించబడుట చేతనే అప్పకవీయ షట్పద షష్ఠ పాదములోని 'జేసిన – షట్ప' - సీసము యొక్క ద్వితీయార్ధమునకు సరిపోయినది. ఇది యాదృచ్ఛికమే కావచ్చును. ఏలయన షట్పద పూర్వార్ధమున ఇట్టి యతి పాటింపఁబడలేదు. యతి పాటింపఁబడకుండుట (దీర్ఘ పాదములందు), చంద్ర గణమును రెండు సూర్య గణములుగా విడిపోకుండుట అన్నవి షట్పదను సీసము గాకుండ చేయగలుగును. ఇది తెలుగులోని దేశి గణము లతో షట్పదిని తూచినప్పుడు సాధ్యమగును. కన్నడములోని షట్పదలు మాత్రా సమక గణ నిర్మితము లగుటచే ఇది అన్నిట సాధ్యము కాకపోయినను, 4, 5 మాత్రల గణ నిర్మితములకు శర, కుసుమ షట్పదలలో సాధ్యము. తెలుగులోని దేశి (సూర్యేంద్ర చంద్ర) గణవ్యవస్థ వలెనే కన్నడ షట్పదయందు సైతము 'అంశ' (బ్రహ్మ విష్ణు రుద్ర) గణ వ్యవస్థ ఉన్నది. అట్టి దాని యందు సైతము సీసము సాధ్యమే. ఇట్టి కుసుమ షట్పది ఒకటి సీసపు పోలిక ఉన్నది.

ఎంబెసక కమలదా
నవబ్రహ్మ పురదొళగె
ఎంటుబీది యొళెంటు కరిగళుంటు సీసముగా దీనిని వ్రాయగా

5 5 5 6
ఎంబెసక | కమలదా | నవబ్రహ్మ | పురదొళగె

5 5 3 3
ఎంటుబీదు | దియుళెంటు | కరిగ | కుంటు

యతి పాటింపబడకుండుట కన్నడమున సహజమైనదే.

దేవరపల్లి వెంకట కృష్ణా రెడ్డిగారు కవిరాజ విరాజితమును షట్పదిగా చూపి నారు. కాని మార్గి వృత్తము - దేశి ఛ్ఛందముతో తుల్యత్వ మొనర్చుట షడ్వింతి ఛందో జాతములలో ఎక్కడో ఒక్కచోట సాధ్యమే యయ్యును దేశి తత్త్వమునకు సరిపోదు".

ఇట్లు షట్పద ఛందము తెలుగు జానపద గీతములందుండి శిష్టకవులు గేయ ఛందములను తృణీకరించిన కారణముననో, లేక రగడ సీసాదుల నడకలతో సంప దించిన కారణముననో లాక్షణికుల గ్రంథములలో మిగిలిపోయినది.

—x—

## అధస్సూచికలు

1. నాగవర్మ ఒక్క శరషట్పదిని చెప్పినాడు. తర్వాతి కన్నడ ఛాందసికులు ఆరు భేదములు చెప్పినారు (5-13 ఛందోంబుధి)
2. కవిజనాశ్రయము – వావిళ్ళ ప్రచురణ పు. 55
3. తె. భా. ఛం. రీ. పు. 177
4. స్వయంభూ ఛందః (5-3, 5, 6) – సం. H. D. వేలెంకర్ పు. 61
5. ప్రా. వైం. I-86
6. ప్రాజ్నన్నయ యుగము పు. 322
7. పాటలలో ఛందస్సు – పి. రాజగోపాలనాయుడు పు. 30
8. మహాప్రస్థానం - శ్రీశ్రీ
9. ఈశ్వరకవి కవిజిహ్వా బంధనము, గుణచంద్రుడు ఛందస్సారము, వీరభద్రుడు నంది ఛందోఽర్ణవము వంటి కన్నడ ఛందోగ్రంథములలో షట్పద భేద ములు విపులముగా వివరించబడినవి.
10. తె. ఛం. రీ. పు. 90
11. 'కవిరాజ విరాజితము - దేశికవిత' - భారతి, 1962, సెప్టెం.

★ ★ ★

# 9. విషమ గీతులు

దేశి గణ నిర్మితములుగా పేర్కొనఁబడిన ఈ విషమ గీతులు ఒక్క తెలుగులో మాత్రము కానవచ్చును. ఇవి రేచన మొదలుకొని అందరు లాక్షణికులు తెలుగులో లాక్షణీకరించినను వీనినెవ్వరును కవులు ప్రయోగింపరైరి. ఈ విషమ గీతులకు తుల్యములైన గణ విధానముతో కన్నడమున ఛందములున్నను ఇట్టి పేర్లు మాత్రము లేవు. గీతులను బట్టి గేయ గతులనుండి ప్రాచీనకాలముననే స్వీకరించిన వానిగా భావింపవచ్చును. విషమ గీతులు మూడు 1) ఎత్తుగీతి, 2) పవడగీతి (ప్రగీతి), 3) కమలన (మేలన) గీతి. ఎత్తుగీతి వంటివి కన్నడమున కన్నడచౌపద యున్నది. ప్రగీతి-ఎడెయక్కర (అంతరాక్కర), మేలనగీతి - ఉత్సాహరగళె (తెలుగున ఉత్సాహము)లకు పోలికలున్నవి.

తెలుగులో గీతులు సమములు, విషమములని ఉభయ విధములుగా చెప్పఁబడినవి కవిజనాశ్రయమున విషమగీతులు ముందుగా పేర్కొనబడి, పిదప సమగీతులు రెండు (ఆటవెలది, తేటగీతులు) లాక్షణీకరింప బడినవి. ఇది మొదలు అందరు లాక్షణికులును తెలుగులో విషమము పిదపనే సమగీతులను పేర్కొనినారు. ఒక్క అప్పకవి మాత్రము సమగీతులు ముందు పేర్కొని, పిదప విషమ గీతులు పేర్కొనినాడు.

లాక్షణికులు అందరును గీతులు 3 రకముల చెప్పినారు.[1] అవి ఆర్యా సంబంధులగు గీతి, ఉపగీతి, ఉద్గీతి, ఆర్యాగీతులు. ఇవి ఆర్యయొక్క రూపాంతరములే. ఇవి సాంస్కృతికములు. ఇక దేశ్య గీతులలో విషమ సమభేదములచే పై 5 గీతులు పేర్కొనఁబడినవి. ఒక్క ఆట వెలది ప్రగీతులకు మాత్రము లక్షణ సామ్యమున్నను, ఇతరములు భిన్నములే. రేచన 'గీతి' అన్నచోట అంతటను గీదియ అన్నాడు.




గీతులలో సమగీతులు సీసము క్రింద అనుబంధ ఛందములుగా కూర్ప వీలున్నవి. వీనిని సీసమునకు అనుబంధముగా కూర్చనికాని సీసము సంపూర్ణముగాదు. విషమగీతు లట్టివికావు. విషమ గీతులు 3 విధములు.

అవి :

1) ఎత్తుగీతి ; పాదమునకు 3 సూర్యగణములని పూర్వ లాక్షణిక (రేచన, వి. పెద్దన) మతము. 1. ఇం గ.+2. సూ.గ. అని అనంతరికుల (అనంతా ముల) మతము. యతి రెండు గణముల మీద.

2) ప్రగీతి (పవడగీతి) : పాదమునకు 3 సూ.గ.+2. ఇం.గ.→ చేసి పాదములకు 5 సూర్యగణములు→ సరి పాదములకు. యతి 3 గణముల మీద.

3) మేలనగీతి (కమలన గీతి) : 7 సూర్యగణములు. యతి 4 గణముల మీద.

తెలుగులో సమ విషమ గీతులని పేర్లుంచుటలో గల కారణమేమో తెలియ రాకున్నది. గణసంఖ్య విషమమగుట వలన వీనిని విషమగీతులని భావింపవలెనా?

పిలయున ఎత్తుగీతి 3 గణములు, ప్రగీతి 5 గణములు, మేలనగీతి 7 గణములు గలవి. కాని సమగీతులలో సైతము గణసంఖ్య విషమమే. ఆటవెలది, తేట గీతులలో పాదమునకు ఐదు గణములుండును. కనుక గణసంఖ్యను బట్టి విషమమని భావించిరనరాదు. దీనికి కారణము ఊహించుచు శ్రీ కోవెల సంపత్కుమార గారు "ఈ సమ విషమత్వము లేర్పడుట కొక కారణము చెప్పవచ్చును. మొదట ప్రసిద్ధములుగానున్న తేటగీతి, ఆటవెలదులు రెండు గణములు తీసివేయుట వలన, లేని ప్రాసను గూర్చుట వలన ఎత్తుగీతి, ప్రగీతులు మొదటి వాటికన్న విషమ లక్షణములు కలవయినవి. కావున వాటిని విషమ గీతులని పేర్కొని యుండవచ్చును. ఇట్లే ఉత్సాహ లక్షణమును మార్చుటవలన కల్గిన మేలన గీతియు విషమగీతిగా పేర్కొని యుండవచ్చును." అని వ్రాసి, తిరిగి వారే "కాని విషమములనుటకే కారణము వాలదు. మరియొక విధముగా చూచినచో అధిక ప్రచారము కలవాటిని సమ గీతులని, కాని వాటిని విషమములని చెప్పినారేమో" అని భావించినారు.[2] వీటిని విషమములని భావించుటకు మరికొన్ని కారణములు చెప్పఁబడుచున్నవి. సీసములలో ఉత్సాహము యొక్క ఉపయోగమున్నది. ఉత్సాహ వ్రాసి పైన ఆటవెలది లేక తేట గీతి నడికిన విషమ సీసమగును. ఉత్సాహ తుల్యమగు మేలనగీతి యుండుటచే మేలన గీతియు, తక్కిన రెండును విషమములని పిలువబడినవేమో ! లేక సీసమునకు తుద అతుకదగిన ఆటవెలది, తేటగీతులు సమగీతులై, అట్టి సర్వాతలేని ఈ గీతులు విషమ గీతులైనవేమో యనిపించును. ఇంతకన్న సముచితమైన కారణము ఇంకొక్కటి తోచుచున్నది. సమగీతులు రెండు. విషమగీతులు మూడు. కనుక వానిని సమగీతులని, విషమ సంఖ్యలోని వీనిని విషమగీతులని భావించి యుందురనవచ్చును.

## 1) ఎత్తుగీతి :

రేచన 3 సూర్యగణములు పాదమునకు గల్గియుండ వలయుననినాడు. అతని లక్ష్యపద్యము లక్షణముతోబాటు అస్పష్టమై ఉన్నది.

శ్రీ దయి తాధి పాన
యోదయ నలిన సత్ర
యోదితమైన నెత్తు
గీడియ యొప్పు గృతుల (కవిజ. జాత్యధికారము వావిళ్ళ ప్రతి)

లక్ష్యమేమో ఒక ఇంద్రగణము మీద 2 సూర్యగణములకు సరిపోవుచుండగా, లక్షణము 'నత్రయ'మని గణములను చెప్పుచున్నవి. దీనికి సవరణలు సూచింపఁబడి

త్రిద యాధి పాన
యోద యసలి పత్ర
యోది తమయి మెత్తు
గిడి మొప్పు గృతుల అని సూచింపఁబడినది.

"దివిలో గిడియకు బదులు గిదిఅని సవరింప బడినది. ప్రసిద్ధముగా గీతి యన్నదే యున్నది. తేటగీతిని కవిజనాశ్రయకారుడు తేటగిదియ యనినాడు" అని సమర్థింపఁబడినది. కాని దీనిని ఇట్లు సవరింప బూనకుండుటయే మేలు. గీతి శబ్దము వచ్చినచోట్ల అంతటను గిడియ అని కవిజనాశ్రయకారుడు వ్యాకానినాడు. "మఱి గిడియలన్నవి" "విషమ గిదియలు, సమగిడియలు అని రెండు తెఱంగులయ్యె నందు విషమగిడియలు ఎత్తుగిదియ, ప్రగిడియ, మేలన గిదియ యనబరగె' "సమ గిదియలలో తేటగిదియ "వస్తు కవిజనాశ్రయా తేటగిదియ యగు", అని యిట్లు రేచన పెక్కు తావుల 'గిదియ' అనియే చెప్పుచుండగా ఇచట మార్చుట ఉచితము కాదు. అన్ని పాదములందును గణములు చక్కగా అనంతాదులు చెప్పినట్లు 1 ఇం.+2 సూ గ సరిపోయినవి. విన్నకోట-పెద్దనను పరిశీలింతమన్న ఆతడు ఎత్తుగీతి లక్షణము ఎత్తుగీతిలో చెప్పక మేలన గీతిలో చెప్పినాడు. ఆతడు

"గలము, రెండు, నగణ, ములును, గలసి, ప్రాస, మెఱయు
జెలువు, దోప, నెత్తు, గీతి, పెలయు, గృతుల, యందు" అని చెప్పిన లక్ష్యమునే 3 సూ. గ.ములతో వ్రాసిన

| | | |
|---|---|---|
| గలము | రెండు | నగణ |
| ములును | గలసి | ప్రాస |
| మెఱయ | జెలువు | దోప |
| ఎత్తు | గీతి | పెలయు-నని చక్కగా వ్రాయవచ్చును. |

కాని ప్రాస చెడును. విన్నకోట పెద్దన 3 సూ. గణములని ఇట్లేల వ్రాసెనో తెలియ రాదు. 'సల్పిన త్రయోదిత' యన్న కవిజనాశ్రయకారుని 'నత్రయ' శబ్దము అట్లు భ్రాంతి కల్గించినదేమో ! శ్రీ సంపత్కుమారాచార్యగారు 7 సూర్యగణముల మేలన గీతిలో విన్నకోట పెద్దన చెప్పిన ఎత్తుగీతి లక్షణమును ప్రాసాక్షర దృష్టితో పాద విభజన గావించి

గలము రెండు నగణములును
గలసి ప్రాస మెఱయు
జెలువ దోప నెత్తుగీతి

వెలయు గృతులందు అని వ్రాసినారు. కాని వీనిలో గణములు అధిక మగుట గాంచి వానిలో కొన్ని అక్షరములను తొలగించినారు. (కుండలీకరణము లలో చూపఁబడినది)

గలము రెండు స (గణ) ములు
గలసి ప్రాస మెఱయు
జెలుపు (దోవ) నెత్తగీతి
వెలయు గృతుల యందు

దీనిని సవరించుటతోబాటు అనంతాములు 3 సూ. గ చెప్పక 1 ఇం + 2 సూ. గ. అని దీనికి లక్షణము చెప్పుటకు కారణము లిచ్చుచు అనంతాములు 3+3+3 అని గాక 1 ఇం. గ. అనగా 4+3+3 అని (ఒక్క మాత్రాధిక్యముగా) ఎందుకు మార్చివేసినారనగా, అనంతాములు ఏకజాతి మాత్రాగణములు ఒక పాదము నకు ఒప్పుకొనరని చౌపదలో కూడా ఇట్టి మార్పే చేసిరని సమర్థించినారు. కాని ఇదిఅంత సమర్థనీయము కాదు. రగడలను, ఉత్సాహను పేర్కొన్న అనంతుడు ఏకజాతి మాత్రాగణ నిర్మిత పద్యముల నొప్పుకొనడనరాదు. మీదు మిక్కిలి సీస పద్యములందు సైతము ఇంద్రగణ నిర్మాణములో 4 లేదా 5 మాత్రల గణములు వాడుకొను వీలుండగా 5 మాత్రలనే ఖచ్చితముగా అంతటను పాటించిన వాడతడు. కాన దానిని అట్లు ఎత్తుగీతి గణక్రమము మార్చుటకు గల కారణముగా సూచింప రాదు. రేచన లక్షణము కుదరలేదని రేచనను, అతని ననుసరించి, వెలన గీతిలో వ్రాసినవి పెద్దన పద్యమును, అనంతునిని, సవరింప బూనుటకన్న రేచన మార్గమునే పరిశీలింపవలయును.

నిశితపరిశీలనములో రేచన పద్దనే అసలు రహస్యము బోధపడగలదు. 'నలిన నక్రయోదిత' అన్న పాద ఖండములో 'నలన నక్రయోదిత'యని లకారమును ఇత్వ విశిష్టముగా గాక అదంతముగా (గుడి తీసివేసిన) చెప్పిన సరిపోయినది. "నల, న, న క్రయ' అన్నప్పుడు నల - ఇంద్రగణము న, న=రెండు సూర్యగణములు మొత్తము క్రయ=మూడు అని (నల, న, నక్రయ ఈరీతి పదవిభాగము) విభజింపవచ్చును. సంపత్కుమారగారిచట ఒక్క నకారమును గమనింపక 'నల, నక్రయోదిత అని కూడా (నలికాక నల అని) మార్చవచ్చును కాని 'నల, న' యొక్క క్రయ అనే అర్థము వచ్చిన చిక్కు కల్గును కాన ఇట్లు మార్చరాద'ని భావించినారు. కాని వారికి 'నల, న, నక్రయ' అన్న పాదములో ఒక్క నకారము కన్పట్టకుండుటకు వారే

ప్రతిని చూచిరో తెలియరాదు. 'నల'ను ఇంద్రగణ సంకేతముగా, 'న' ను సూర్య గణ సంకేతముగా వాడుట రేచనకు పరిపాటిఅన్నది ప్రసిద్ధ విషయము. అతడు తేటగీతి లక్షణమును చెప్పుచు "నాలుగడుగులను న సల నల నసంయోయని (5 గణములు) ఆటవెలదికి చెప్పుచు "న-న-న-నల-నగమ్ము నౌనరి"యని వ్రాయుట గమనింపదగినది.

దీనినిబట్టి నల-న-న-త్రయ అని విభజింపబోన్న రేచన లక్షణము, లక్ష్యము కుదురును. అంతేగాక ఈ పద్యము రేచన కన్నడమందలి చతుష్పద/చపుష్పదికను చూసి చెప్పియుండును. వానికి 1 విష్ణు+1 రు. అనగా 1 ఇం.+1 చం. గణములు ప్రతిపాద మందుండును. ప్రాస ఉండును. చంద్ర గణమును 2 సూ. గ. గా విభజించబోనిన ఎత్తుగీతి తయారగును.

ఎత్తుగీతి రేచన మతమున 3 సూర్యగణములనుపొందుపేని, తిరిగి 7 సూర్యగణముల మేలన గీతిని అనే విషమగీతులలో చెప్పుట యెందులకు ? ఈ రెండును నడకలో భిన్నత్వమును చూపజాలవు గదా! కనుక గణభేదముండి తీరును.

రేచన పద్యములో 1 ఇం. గ +1 చం. గ. వాడగా అన్నియును చక్కగా 2 సూర్యగణములవలె విరిగినవి. ప్రాసగల ఆటవెలది ప్రగీతియైనట్లే ప్రాసగల తేటగీతి మరియొక విషమ-గీతి కావలయునుకాని అట్టివి చూపబోలేము. 2 సూ.గ.లు మొదట తగ్గించగా తేటగీతియే ఎత్తుగీతి కాదగును.

రేచన వ్రాసిన ఎత్తుగీతి పద్యము మూడు పాదములు కన్నడమున నాగవర్మ చెప్పిన 1 విష్ణుగణ (ఇం. గ.) 1 రుద్రగణ (చం. గ.) లక్షణముతో సరిపోయినది.

| | | | |
|---|---|---|---|
| శ్రీదయి | తాధి | పాన | [రల (చం.గ.) = హ + హ] |
| యోనయు | సలన | సత్ర | [నహ (చం.గ.) = న + హ] |
| యాదిత | పైన | సత్తు | [(రల చం.గ.) = హ + హ] |
| గీతియు | యొప్పు | గృతుల | (భలల) |

చివరి పాదము హ + న (భలల) — చంద్రగణము కాదు. పై గణవిభజనలో పాదత్రయము అటు రెండు సూర్యగణములకును, ఇటు చంద్రగణమునకు లక్ష్యము కాదగినది.

ఎత్తుగీతి అతి చిన్న పద్యము. మూడే గణములు. అవియును రెండు సూర్య (చిన్న) గణములే. ఇట్టి చిన్నపద్యమున పరనావసరమున యతి అక్కరలేదు. అంపలోను తెలుగులో ఇట్టి పరనక్రమూపవారకమైన విచ్ఛేదరూపయతియే ఉండదు గదా! ఇట్టి పద్యమునకు సైతము 2 గణములమీద యతి- అనంతాదులలో పాటించ బడినది.

ఆది ప్రా సంబు * హారియు
నాదిత్య యుగము * నగుచు
నీవెస యతుల * నెత్తు
గీదియ నెగడుఁ * గృష్ణ - ఛందోదర్పణము (3—16)

1 ఇం + 2 సూ అనఁగా కనిష్ఠ ప్రమాణములో 7 అక్షరములు, గరిష్ఠ ప్రమాణములో 10 అక్షరములను మించని ఇట్టి చిన్న ఛందమునందు సైతము యతి నియమించుటను బట్టి చూడ తెలుగు లాక్షణికులకు తెలుగులో ఏ పద్యము సైతము యతి రహితము కారాదన్న గట్టి నియమము కలిగియుండి ఉన్నారనవచ్చును.

## 2) ప్రగీతి :

దీనికే పవడగీతి యని మరియొక పేరు. రేచన ప్రగీతి అనగా అనంతాదులు పవడగీతి అనినారు. ఇది అచ్చముగా ఆటవెలదియే. తొలుత3 సూ. + 2 ఇం. రెండవ-పాదమున 5 సూర్యగణములు ఉండును. ఇట్లే తక్కిన రెండు పాదములు వ్రాయవలయును. 3 గణములమీద యతి. విషమగీతులు జాతిపద్యములు. ప్రాస కలవి. ప్రాస లేకున్నచో ఇవి అచ్చముగా ఆటవెలదియే. విన్నకోట పెద్దన ఈ ప్రగీతిని చెప్పలేదు. ఆటవెలది చెప్పఁబడుటవలన దీనిని చెప్పలేదేమో !

రేచన లక్ష్యము :

మూండు నేసి నగణ * ములు రెండు నలముల
మూండు సగణములును * మొగి నహంబు
పొంది గాగ నర్ధ * మునకగు మీదని
ట్లుండ జెప్ప వలయు * నొగి ప్రగీతి

## 3) మేలనగీతి :

విషమగీతులలో చివరిది అందరు చేపని మేలన అనఁగా అప్పకవి కమలనగీతి

అనినామాంతరముంచినాఁడు. దీనిలో ప్రతిపాదమునకు 7 సూర్య గణములుండును. 4గణములమీద యతి ఉండును. మేలనగీతి గణములకు, ఉత్సాహగణములకు ఇంచుమించు సరిపోవుచున్నది. ఉత్సాహకు కేవలమొక్క గురువే అదనముగా కావలయును. యతి సమానమే. ప్రాస ఉభయత్ర ఉండును.

అప్పకవి యిట్లు పేరు మార్చుటకుగల హేతువు గానరాదు. ఆతని ఉదాహరణలో యతి భంగమున్నది.

మిగుల మెఱయుచుండు గృతుల * గమలనాఖ్య గీతి 4-354
మేలనాఖ్య అని సవరించిన యతి సరిపోవును.
మిగుల మెఱయుచుండు గృతుల * మేలనాఖ్య గీతి

ఇప్పట్టున అప్పకవీయమున గూడ 'కమల' శబ్దము ప్రమాద పతితమందుమా? విషమ గీతుల పేర్లలో సైతము ఇదే 'కమలన' పేరున్నది

మేలన గీతిని విశ్వనాథవారు తమ రామాయణ కల్పవృక్షమున (బాల. ధను. 371) నుదాహరించిరి.

జనకు నింట దశరథేశు * సౌమ్య భావ మెంచి
తనర జనకు సౌమ్యతగని * దశరథేశు నింట
మనసు నందు నొకరి నొకరి * మార్దవంబె చూచి
యనఘ ముదితులైరి యిద్ద * రైన పెండ్లి వారు

మలయ గీతి :

అందరు లాక్షణికులు ఈ ప్రసిద్ధమైన మూడింటిని విషమగీతులుగా పేర్కొనుచుండగా పొత్తపి వెంకటరమణకవి తన లక్షణ శిరోమణిలో మేలనగీతిని మలయ గీతిగా పేర్కొనినాడు. పొరపాటుగా పేర్కొనినాడందమన్న గణ క్రమమును గూడా వేరుగా చెప్పినాఁడు. దీనినిబట్టి ఆతడు మేలన (కమలన) గీతిగాక మలయగీతియను వేరొక్క ఛందమును చెప్పినాడని భావింపవలయును. మలయగీతికి పాదమునకు 2 నగణములు + 2 నల గణములు అని చెప్పి లక్ష్యమున మాత్రము 3 నగణములు + 2నలగణములు వాడినాడు. యతి 3 గణములకడ.

నగణయుగళ మొకటి * నలయుగ మిడిపడు
అగటి గతుల మలయ * మలయగ్గీతి హరి 3-314 వ.

దీనియందు విషమ గీతులందుండవలసిన ప్రాససైతము నశించినది. అచ్చులో ఇది ఆటవెలదిగా చూపఁబడినది. కాని ఇది ఆటవెలదిగాదు. సరిపాదమున యత్యనంతరము 2 సూ. గ. లే ఉండును. కాన దీనిని మలయగీతిగా నాతఁడు భావించి నాడనవలె[6]. ఇట్టి లక్షణ భిన్నత్వమునకును లక్ష్యములో సమన్వయ లోపమునకును కారణము అంతుపట్టదు.

ఇట్లు కవులుపయోగించని విషమ గీతులను లాక్షణికులు మాత్రము గతానుగతికముగా చెప్పినారు. కవులు వాడకుండుటకు కారణములు

1) చంద్రగణోపయోగము ఎత్తుగీతి యందుండుట కావచ్చును. చంద్రగణ నిర్మితములైన ఇతర పద్యములు తెలుగులో వాడుక లేదు.

2) చిన్న పద్యమని ఎత్తుగీతిని వదిలివేసియుందురు. 3 గణముల పద్యముగ అల్పాక్కరయు వదిలివేయబడినది. అది యింక దీనికన్న కొంచెము పెద్దదే. (2 ఇం. + 1 చం.)

3) మేలనగీతి ఉత్సాహ నడక గలిగినది. ఉత్సాహము వాడుచుండగా ఎందులకని భావించియుండ వచ్చును.

4) ప్రగీతి ఆటవెలదియే. దానికితోడు ఆటవెలదిలో లేని ప్రాస నిర్బంధిత్వమున్నది. ప్రాస అనంతరమగు అలంకారము కనుక మూలమైన పద్యమునకే ఆదర మెక్కువ ఇచ్చి యుండవచ్చును.

5) సమగీతులకు సీస పద్యానుబంధములుగా సంధానించు భాగ్య మబ్బినది. వీనికా అవకాశము లేదు, అనుబంధములనే (సమగీతులు) వ్యస్తముగ వాడుటజరిగి, వీనిని వదలివేయుట సంభవించియుండును.

— x —

## అధస్సూచికలు

1. 'సమగీతి ద్వయంబును, విషమగీతి త్రయంబును, అర్ధగీతి చతుష్కంబును- అవి యిట్టి గీతుల తొమ్మిది రీతుల వెలసిల్లు"- ల. శి. పు. 204, III-310.

2. తె. ఛం. వి. పు. 190

3. కలగూరగంప, భారతి, జూలై, 1962 పు. 81-సంపత్కుమార

4. „ „ „ 1962 „ „

5. నేను పరిశీలించినది వావిళ్ళ ప్రతి (1969 ముద్రణ) పు. 51

6. ల. శి. - పరిష్కర్త రావూరి దొ. సా. శర్మ (ఆం. ప్ర. సా. అకా. ప్రచురణ)



# 10. ఉద్ధురమాలా వృత్తములు

పాదమునకు ఇరువది ఆరు అక్షరములు కల వృత్తములను తజ్జనక ఛందము లను కలిపి షడ్వింశతి ఛందములుగా గుర్తించి పాదమునకు 27 నుండి ఆ పైన అక్ష రములున్న ఛందములకు వేరుగా ఉద్ధురమాలా వృత్తములని పేరుపెట్టినారు. ఈ విధానము సంస్కృతలాక్షణికులు సైతము పాటించినదే. హేమచంద్రుని ఛందోఽను శాసనము ఇట్టివానిని వివరించుట జరిగినది. అతడు 26 ఛందములను ఉక్తాది జాతులని పేర్కొని, ఈ పై ఛందములను శేషజాతులవినాడు. ఈతడు 40 అక్షర ములు గల పిపీలికామాల వరకు వీనిని వివరించినాడు. సంస్కృతములో ఇట్టి షడ్విం శత్యధిక సంఖ్య గలవానికి మాలా వృత్తములనిరి[1]. కాని ఈ పర్ణ వృత్తముల ఉప యోగము సంస్కృతమునందు కానరాదు. సంస్కృతములో నిత్యపురాణ శాస్త్రాదికము అనుష్టుప్పు (8 అక్షరముల పాదముల)లో వ్రాయబడగా కావ్యాదులు 14, 15 అక్షరములకు మించలేదు. శార్దూల, స్రగ్ధరాది వృత్త ప్రయోగమున్నను, వానిని ఉపయోగించినంతగా వీనిని ఉపయోగింపరైరి. 20 అక్షరములు మించిన ఛంద ములు సంస్కృతమునందు ఎక్కడను కానరావు.

మాలావృత్తములని సంస్కృతమున పేరుంచుటను బట్టి వీటి దైర్ఘ్యమును తత్కారణమును ఊహించినారనవలె. అనగా చిన్నపాదములను కలిపి చేర్చి మాలగా చేర్చినారనవలె. ఇట్టి సుదీర్ఘ పాదముల వలన లయ సుబోధము గాదు. పిపీలికామాల (చీమల బారు) అని హేమచంద్రుడు పేరుంచుటను బట్టియే ఇట్టి దీర్ఘత్వము గుర్రపు కదము వంటి నడక కాదని సుదీర్ఘముగా సాగిపోవునని భావింపవచ్చును. పాదములో నడక లేనప్పుడు పాద దైర్ఘ్యతా బాహుళ్యము వ్యర్థకారణమగును. ఇట్టి వానిలో పరిత్యవిశ్రాంతికై బహు విరామము లుంచవలసివచ్చును. దండకమిట్టిదే. పాద వ్యవస్థలేని ఈ ఛందము ఛందస్సౌందర్యమును వ్యంజించునది గాక విషయ సంపన్నతకు మాత్రము ఉపయోగపడును. "వాడు దండకము చదివినాడన్న" నాను డిలో సౌందర్యహీనమును, సుదీర్ఘమునగు విషయమును వ్యక్తమొనర్చినాడన్న అర్థము వచ్చును.

తెలుగులో ఇట్టి వృత్తములు బహు సంఖ్యలో లేవు. రేచన మొదలు కొని ప్రారంభపు లాక్షణికులందరును, 5 పద్యములే చెప్పిరి. లయగ్రాహి,

లయవిభాతి, లయహారి, త్రిభంగి, దండకములు. వీనిలో దండకము పాదవ్యవస్థ లేకపోవుటచే పద్యమన జెల్లదు. మిగిలినవి నాలుగే. వానిలో లయగ్రాహి, లయవిభాతి మాత్రమే కవుల ప్రయోగములో విశేషముగా కానవచ్చుచున్నవి. అర్వాచీన ఛాందసికులగు లింగమగుంట తిమ్మనకవి లాక్షణి, రమణకములని, పొత్తపి వెంకటరమణకవి దర, లలిత, ఘననిసదములను, అధికముగా చెప్పినారు. కాని లక్ష్యసిద్ధి వీనికి లేదు. దీనిచే ఉద్ధురమాలా వృత్తములకు కవులు, లాక్షణికులు ప్రాముఖ్యము ఇవ్వలేదన్నది స్పష్టము. ఉద్ధురయని తెలుగులో పేరుంచుటచే (ఉద్ధురమనగా బరువైన, నిండిపోయిన అను అర్థములున్నవి[2]) కన్పట్టుచున్నది దీర్ఘపాదత్వము తెలుగునకు సరిపడునది కూడ కాదు. దేశ్య ఛ్ఛందములలో సీస పాదమును రెండు ఖండములు చేయుట, తరువోజను ద్విపదవచ్చి ప్రయోగహీనము చేయుట కొంచ నగును. రగడలు, తరువోజ, మధ్యాక్కర, షట్పది వంటి ఛందములు చిన్నపాదములవి పెద్దపాదములగుటకు అతుకబడుట కొంచగా చిన్నపాదము సహజ వ్యవస్థయని, దీర్ఘపాదములు చిన్నిపాదముల అతుకుబడువలన సంభవించినవని తెలియును. ఈ ఉద్ధురమాలా వృత్తములను అట్టివేయవచ్చును. వానిలో గణక్రమము దీనికి బలమునిచ్చుచున్నది. ప్రాసయతి (పాద ద్వితీయాక్షర ప్రాస అతుకులో ప్రాసయతి స్వరూపము) వేరొక సాక్ష్యము, పాదమంచు బహుయతి నియతి మరొక సాక్ష్యము.

లాక్షణీకరణమున తెలుగులో ఉద్ధురమాలా వృత్తములు రెండు విధములైన మార్గములలో ప్రదర్శింపబడినవి. మొదటిది వీనిని పాద దీర్ఘత్వమున్నను దేశీయ ఛ్ఛందములుగా, లయాత్మకములుగా చూపుట. ఇట్లు భావించుటకు కారణము—

1) షడ్వింశతి ఛందోజాతములుగా ఉన్న వృత్తముల వంటివానిగా దీనిని భావింపకుండుట. జనక ఛ్ఛందో నిర్దేశనము, ఛందోనామము, వృత్త సంఖ్యా నిర్ణయము లేకుండుట.

2) షడ్వింశతి ఛందముల వరుసలో వ్రాయక ప్రత్యేక భాగముగా ప్రదర్శించుట.

3) ప్రాసయతి నియతముగా వేయుట.

4) షడ్వింశతి ఛ్ఛందో జాతములకు వలె సమ అర్ధసమ విషమ భేదము చూపకుండుట.

5) లయ కల్గియున్నవని లయగ్రాహిత్యాది నామములతో సూచించుట.

6) అక్షరసమక గణ దృష్టితో బాటు మాత్రాసమత్వమును గూడ పాద ప్రమాణమునకై సూచించుట.

పై మార్గము రేచన మొదలు సకల లాక్షణికులు సూచించినదే, బహులాక్షణిక సమ్మతమైన మార్గము.

ఇక రెండవ మార్గము వీనిని షడ్వింశతి ఛందోజాతముల వంటివానిగా భావించి మార్గి ఛందస్సులన్న భ్రమతో లాక్షణీకరించుట. ఈ మార్గము ననుసరించిన వాడు పొత్తపి వెంకట రమణకవి[3]. అతడు వీనిని అక్షరసమక గణ దృష్టితో ఆలోచించి వీని దేశ్యత్వమును భంగమొనర్చినాడు. అతని లాక్షణీకరణములో

1) ఇవి షడ్వింశత్యుపరి ఛందో జాతములు. ఉక్త, అత్యుక్త, మధ్యా- వంటి పేర్లు ఛందముల కుంచి, వానియందు జన్యవృత్తములుగా వీనిని నిరూపించుట, ఛందో నిర్దేశనము, వృత్తసంఖ్యా నిర్ణయ మొనర్చుట.

2) అక్షర సమగణ దృష్టితో మాత్రమే చూచుట. మాత్రా సమత్వమును గణించి పాదలక్షణములలో సూచింపకుండుట.

3) దేశియ ఛందములకు సరిపడని 'వృత్త' నామముతో నిర్దేశించుట.

ఇట్టి లక్షణ నిర్దేశనమునకు ఈతనికి వెనుక చూపబడిన హేమచంద్రసూరి మున్నగువారి సంస్కృత లక్షణ గ్రంథము లాధారము గావచ్చును. సంస్కృతము నిట్టి విధానమున్నను, తెలుగులో తనకు పూర్వము అనేక లక్షణ గ్రంథములు ఇట్టి విధానమును చెప్పకుండగా ఈతడీ క్రొత్త విధానము నవలంబించుటకు కారణమేమో తెలియరాదు. ఉపరి వృత్తముల జనక ఛందములకు అతడిచ్చిన పేర్లు :

పాదమునకు 27 అక్షరములు భూశ్ఛందస్సు, 28 అక్షరములు భువశ్ఛందస్సు, 29 అక్షరములు సువశ్ఛందస్సు, 30 అక్షరములు మహాశ్ఛందస్సు, 31 అక్షరములు జనశ్ఛందస్సు, 32 అక్షరములు తపశ్ఛందస్సు, 33 అక్షరములు సత్యచ్ఛందస్సు, 34 అక్షరములు భూర్భువశ్ఛందస్సు, 35 అక్షరములు స్వరశ్ఛందస్సు, 36 అక్షరములు విరాట్ఛందస్సు[4] అని పేర్లు.

అతడుదాహరించిన ఉద్ధురమాలా (ఉపరి వృత్తములని అతడు నిర్దేశించిన నామము) వృత్తములలో

| | | | |
|---|---|---|---|
| 1. దర వృత్తము | 30వ ఓ మహాః ఛందమున | 52,00,03,662 వ వృత్తము |
| 2. లలిత " | 36వ విరాట్ఛందమున | — |
| 3. ఘననిద్రప్రద " | 36వ " | — |
| 4. లయగ్రాహి " | 30వ మహాః ఛందమున | — |
| 5. లయవిభాతి " | 34వ భూర్భువశ్ఛందస్సున | — |
| 6. త్రిభంగి " | 34వ " | — |

పుట్టినట్లు పేర్కొనినాడు. ఉద్ధరమాలా వృత్తములనే గాక ప్రసిద్ధ దేశ్య (ఉపజాతి) ఛ్ఛందమగు సీసమును సైతము విరాట్ఛందోభవముగా పేర్కొనినాడన్నచో అతడు వీని దేశ్యత్వమును భంగ మొనర్చినాడని చే అనవలయును.

వీనిని వృత్తములనియే అతడు తలంచుట అతని విధానమున సమంజసమే. కాని ఉపరి ఛ్ఛందోజన్యములుగా భావింపని ఇతర లాక్షణికులు సైతము వీనిని వృత్తములనుట ఉచితముగా లేదు. వృత్తనామము దేశి పద్యములకు సరిపడదిది.

మాత్రా ఛందములను అక్షర గణములతో కొల్చుట వలన నిర్బంధత్వ మేర్పడును. అక్షర గణములలో గణించుట వలన ప్రతిపాద మందును ప్రత్యక్షరము అదే గురు/లఘు రూపములో నుండును. ఇది కృతక వ్యవస్థ. షడ్వింశత్యక్షర ఛ్ఛందో జాతములన్నియు ఈ కృతక వ్యవస్థకు శాస్త్రీయ రూపములే. తనకు పూర్వము ఛ్ఛందః కర్తలందరు మాత్రా గణనముతోఁబాటు త్ర్యక్షర గణ నిర్మితములుగా ఉద్ధర మాలా వృత్తములను చూపుటచే కాబోలు పొత్తపి రమణకవి వీనిని అట్టి వ్యవస్థలో భాగముగా స్వీకరించి షట్ప్రత్యయ విధులలో గణించి, వృత్త సంఖ్యా సహితముగా నిర్దేశించినాఁడు. పొత్తపి కవియే కాదు, తత్పూర్వ లాక్షణికులు సైతము ఉద్ధర మాలా వృత్తములను మార్గిచ్ఛందములుగా భావించినారు. జాతులు, ఉప జాతులను వివరించిన చోట వివరింపక, 26 ఛ్ఛందముల తర్వాత వీటిని వివరించుటనుబట్టి అట్లు భావింపవచ్చును. తెలుగులో లక్షణమునుబట్టి వీనిని మార్గి-దేశి లక్షణముల రెండింటి మిశ్రముగా చూడవచ్చును. ప్రాస నియమము, అక్షర పరిగణనమును బట్టి వృత్త లక్షణమును, ప్రాసయతి, మాత్రాగణనమును బట్టి దేశి పద్య లక్షణమును వీనిలో మిశ్రణ మొనర్పఁబడినది. డా॥ పాటిబండ మాధవశర్మ వీనిలో లయగ్రాహిని హేమ చంద్రుడు చెప్పిన వృత్తలలితము (2-383) తో సరిపోవుటను సూచించి, లయ విభాతిని సంస్కృత లాక్షణికు లెవ్వరును చెప్పినట్లు కనఁబడ లేదని భావించి, వీనికి దేశీయత్వమును శంకించినారు.

ఉత్సాహాలా వృత్తములు దేశ్య చ్ఛందములే. ఒక్క దండకము మాత్రము సంస్కృతమున ప్రయోగము కలదు. అది దేశికాదు. తక్కిన వానికి సంస్కృతమున ప్రయోగములేదు. మాత్రా చ్ఛందములైన ఇవి అక్షర-సమక గణములలో కొలువబడుటచే యాదృచ్ఛికముగా సంస్కృతములోని ఛందములలో పోలవచ్చును. అది కూడా ఒక్క లయగ్రాహి హేమచంద్రుని వృత్తలలితమును పోలినది. వృత్త పాద పరిమాణము దీర్ఘమగుటవలన సంస్కృతమాలా వృత్తనామము సామూహికముగా స్వీకరింపఁబడినది. ఐనను వీని పేర్లు వీడికుంచఁబడినవి. లయ బోధకములన్న సంగతి నామ-స్వీకరణముననే గుర్తించఁబడినది. ఇది అక్షరగణ చ్ఛందస్సులుగా తెలుగు లాక్షణికులు గుర్తించలేదని, వారు మాత్రా పరిగణన మొనర్చుచు పాద దైర్ఘ్యమును సూచించుటను బట్టి కూడా తెలుపవచ్చును. షడ్వింశతిచ్ఛందో జాతములు అగు వృత్తములకు ఇట్టి మాత్రగణనము సూచింపఁబడలేదు కదా! ఇట్టి ఉపరి షడ్వింశతి చ్ఛందో జాతములు సైతము సంస్కృత లక్షణ గ్రంథములందు గాని, కావ్యములందు గాని ఇతరత్ర కానరావు. ఒక్క హేమచంద్రుడు మాత్రమే చెప్పినట్లున్నాఁడు. ఈతడు ప్రాకృత, దేశ్య భాషల తుదముట్ట నీదిన బహుభాషావేత్త. బహుశ ఈయన దేశి భాషలలోనుండి వీనిని స్వీకరించి ఉండినను ఉండవచ్చును. వీనికి ప్రాసయతి వేయఁబడినది. ప్రాసయతి తెలుగులో దేశి పద్యములకు ముఖ్యముగా ఉపజాతులకు మాత్రమే పరిమితము. కాగా వీనియందు నియతముగా ప్రాసయతి యుంచుటనుబట్టి ఇవి దేశ్య చ్ఛందములనఁజెల్లును. ఇక పాదమునందలి ప్రాస యతులను పరిశీలింపగా ఇవి గేయ చ్ఛందములేనని అక్షర సమక గణములలో యోచింపఁబడెనని భావింపవచ్చును. యతి, ప్రాసయతులు పాద దైర్ఘ్యమునకు గల కారణములు చెప్పును. ఇవి కుఱుచ పాదములతికి, నిడుద పాదములుగా చేయఁబడినవి. గానమున, పఠనమున ఇంత పెద్ద పద్యమక్కరయే లేదు. మీదు మిక్కిలి శ్రమాపాదకము. ఇట్లతుకబడిన వసువుకు ప్రాసయతి ఆవృత్తి, అతికిన పాదముల అఖండత కొఱకు యతి పాదమందంతటను ఏకాక్షర రూపమున (బహుయతి నియతి అన్నాడు అప్పకవి) ఘటించుట కాంచనగును. తరువోజలో రెండు ద్విపదలు కలుపుటకు బహుయతి నియతి ఉంచబడినది కదా!

తక్కిన దేశ్య చ్ఛందములకు వలెనే ఇవికూడా అర్ధమునకొక్క భాగముగా యతి లేదా ప్రాసయతివల్ల సమఖండములుగా విభజింపవీలున్నది.

| | | |
|---|---|---|
| లయ గ్రాహిలో (ప్రాస యతినిబట్టి) | 8 అక్షరము+8అక్షరములు +8 అక్షరములు+తక్కిన అక్షరములు | ఒక్క పాదమునకు |
| లయ విభాతి ప్రాసయతి | 9 అక్షరములు+9అక్షరములు +9 అక్షరములు+మిగిలినవి (7) | ఒక పాదమునకు |
| లయహారి ప్రాసయతి | 10 అక్షరములు+10అక్షరములు +10 అక్షరములు+తక్కినవి (7) | ఒక పాదమునకు |
| త్రిభంగి ప్రాసయతి | 8 అక్షరములు+8అక్షరములు +తక్కినదంతా ఒక పాదము (18) | ఒక పాదమునకు |

ఇక గణముల విషయమున పరిశీలింపగా ఇవి మాత్రా సమక గణములలో నడచును. లయగ్రాహికి వాడబడు గణములన్నియు స, న, య (3 గణములు) తప్ప చతుర్మాత్రకములే. చివరి యగణము ఒక్క మాత్రా అధికమైనది. అదియును పాదాంత దైర్ఘ్యతగా వాడబడిన దనవచ్చును. ప్రతి ఖండము యొక్క అంతమున స గణమే ఉన్నది. కాని ఇవి ప్రాసయతినిబట్టి పరిశీలించినపుడు 5 మాత్రలకొక ఖండమై విడిపోవుచున్నవి. అప్పుడు భజసన, భజసన, భయ అను గణక్రమము భల, భల, భల, భల, భల, భల, భల, గగ గా మారిపోవుచున్నవి.

5 5 5 5
ఇంబదర, గాభజస- నంబులక, దన్ భజన

5 5 5 4
నంబులభ, కారమునొ - డంబడిల, యగ్రా (కవిజనాశ్రయము)

అని చివరి 4 మాత్రల కొక్క మాత్ర పాదాంతమున అతికి, పరింపన ఖండగతిలో నడచుచున్నది.

లయ విభాతి సైతము ఇట్లే నడచును.

న స న(10)— న స న(10)— న స న(10)— న న గ(9)

10 మాత్రలకొక ఖండము ప్రాసయతిని బట్టి విడిపోవును. చివరి 9 మాత్రలు పాదాంతమగుట పాదాంత దైర్ఘ్యము వలన 10 మాత్రలుగా సరిపోవును.

నలల 5 / భల 5 నలల 5 / భల 5
ననసన స/నంబులును - ననసవన/ గంబులును

నలల 5 / భల 5 నలల 5 / 4
నెనగగ్భతి / పాదములరసికతను/ జెప్పన్ (కవిజనాశ్రయము)

ఇది నలల, భల,/ నలల, భల/, నలల, భల, / నల ల, గగ గా నడచినవి.

**లయహారి :**

న, న, న, న, న, న, న, న, న, న, న, స, 1 గురువు పాదమునకుగలవి. ఇదికూడా,

నలల (5) నలల (5) నలల (5) నలల (5)
పదునొకడు నగణముల - మదనగణ మునుగురువు
నలల (5) నలల (5) నలల (5) గగ (4)
గదిసిమ్మృమి పదరచన - నొదలి పది ప్రాసా—
గ విడిపోవును.

**త్రిభంగి :**

నన నననసస భమ సగ - లాక్షణీకరింపఁబడిన గణముల వరుస. ఇవి 4 మాత్రల చొప్పున ప్రాసయతిని బట్టి విడిపోవును.

4 4 4 4
ననలును ననలును - ననలును ననభమ

4 4 4 4
లునుసగ యుక్తము - లైనన్ మృదుపై

4 5
నన్రస్తు తమైనన్

అనఁగా ఇదికూడా నల, నల, నల, నల, నల, నల, నల, నల. నల య - గణములుగా విడిపోవును.

కాని లాక్షణికులు మాత్రము ప్రాసయతిని బట్టి గణ విభజన గావించిన చక్కఁగా లయపేరు సార్థకమయ్యెడిది.

| వృత్తనామము | లాక్షణిక గణ నిర్దేశనము | ప్రాసయతి (నడక)ను బట్టి నిర్దేశింప వలసిన గణ విధానము |
|---|---|---|
| 1) లయగ్రాహి | భజసన భజసన భయి | భల, భల, భల, భల, భల, భల, భల, గగ |

| | | |
|---|---|---|
| 2) లయవిభాతి | సనస సనస సనస సనస | నలల, భల, సలల, భల, నలల, భల, నలల, గగ |
| 3) లయహారి | సస సస నస సస సస స సగ | నలల, సలల, సలల, నలల, నలల, నలల. సలల, గగ |
| 4) త్రిభంగి | ససన సనస సస భ మ సగ | నల, సల, సల, నల, నల, భ, గగ, స, త, య |
| 5) లాక్షణి | భ నస సస + భ సస స | భ, నల, సల, నల భ, నల, నల, గ |
| 6) రమణక | ససన సనస నసన లగ | నల, నల, సల, నల నల, నల నల, గ |
| 7) దర | సస నస సస సస భస | నల, నల, నల, నల నల, నల, భ, స |
| 8) లలిత | సస సస సస సస స సనయ | నలల, నలల, నలల, నలల నలల, నలల, నలల, గగ |
| 9) ఘనవినద | సస సస జ సజ ససస భస | నల, నల, నల, జ, నల భ, నల, నల, భ, స |

(చివరి ఘన వినదములో నడక చెడినది. యతిని బట్టిగాక గణ వర్గీకరణ గావించినను అంతే).

తెలుగు లాక్షణికులలో ఒక్క బ్రౌన్ పండితుడు మాత్రము, ప్రసిద్ధ వృత్తములకు ప్రసిద్ధ గణ క్రమమును బట్టిగాక, లయానుసారముగా యతి ననుసరించి ఇట్టి గణక్రమ విధానము నిచ్చి వృత్తములలో సైతము లయను కల్పించినాడు. అతని గణ గణన విధానము అతని ఛందో పరిజ్ఞతను ప్రకటించును. తెలుగులో ఇట్టి గణ విధానము ఏలాక్షణిక లక్షణమునందు లేదు. **The Telugu Prosodians who never consulted the case of learner scan every species of uniform verse by feet of three syllables yet the rhythm often shows that they are naturally devided otherwise***.

కనుక పై అంశములన్నియు పరిశీలింపగా ఉద్ధురమాలా వృత్తములు దేశి ఛందములనక తప్పదు. ఉద్ధురమాలా వృత్తములలో గల దేశి లక్షణములు :

1) 'ప్రాసయతి' ఉపయోగము. ఏ పద్యములకు లేని ప్రాసయతి 'నియత త్వము' వీనికున్నది.

2) మాత్రా సమక గణములు త్ర్యక్షర గణములలో కొల్చినను ప్రాసయతి లేదా యతి మాత్రాసమకముగ నడచుచున్నది.

3) పాదఖండాల సమత

4) బహుయతి నియతి

5) ప్రాచీన లాక్షణికులచే షడ్వింశతి జన్య వృత్తముల పంటి విధానములో చెప్ప బడలేదు.

6) ప్రాసయతి, విరుపుల వల్ల గేయగతి సాధ్యమగును.

లయగ్రాహి, లయ విభాతి, లయహారులలో మాత్రా నియమముచే లక్షణము చెప్పిన యెడల, ఇవన్నియు ఖండగతిలో నడుచు ఒకే వృత్తముగ మారిపొయ్యే వివి. అక్షర సంఖ్యా నిర్దేశనవల్ల భిన్నత్వము సిద్ధించి, భిన్న వృత్తములైనవి. అక్షర సంఖ్యా నిర్దేశము వల్ల కొంత మేలేమైనది. మొత్తము మీద పై వానిలోని మొదటి ఏడు గణములలో పంచమాత్రికా గణములు భల లేక నలలు, ఏకగణము లేక మిశ్రిత గణములుగా చెప్పఁబడినవి. ఇట్లే ఖండగతిని సృష్టించు త, నగ, నల వంటి వానితో అన్ని స్థానములలో లేదా వేసి నరిస్థానములలో భిన్నత్వ కల్పనముచే మరికొన్ని లయ పద్యములు 'లయకాంత' ఇత్యాది కల్పిత నామములుంచి రచింపవచ్చునని డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు తమ 'తెలుగులో ఛందోరీతు'లన్న గ్రంథమున (P. 86) పేర్కొనినారు.

ఉద్ధురమాలా వృత్తములలో ప్రాసయతి వాడుట నియతమే అనను ప్రాసయతికి బదులు లింగమగుంట తిమ్మకవి సరూపాక్షర యతిని (పొత్తపికవి కూడ) పాటించి నాడు. ప్రాసయతి వలన పాదమునకు శోభయు, గతియు వచ్చుటయేగాక, అది రెండు పాదములు కలయికగా కన్పించును. రెండు పాదములలోని ద్వితీయాక్షర ప్రాస, ఆ పాదములు కల్పినప్పుడు ప్రాసయతిగా భాసిల్లును. త్రిభంగియందు పాదాంత మున అంత్యప్రాసమైతము చెప్పబడినది.

## 1) లయగ్రాహి :

ఉద్ధురమాలా వృత్తములలో అన్నిటికన్న ఎక్కువగా ఉపయోగించబడినది. భారత కవులు కవిత్రయమువారు దీనిని 8 మార్లు వాడినారు. నన్నయ ఆది పర్వమున రెండుమార్లు, అరణ్య పర్వమున ఒక మారు (అరణ్య 1-40, ఆది 4 138, 139), తిక్కన నాలుగు మార్లు (స్త్రీ II- 5, 6, 7, 8), ఎఱ్ఱన ఒక్కమారు (అర 7-76) వాడినారు. ఇది అన్ని యుగములలోని కవులచే తెలుగులో ఇష్టే వైచిత్ర్యముగా వాడబడినది.

హేమచంద్రుడు తన ఛందోనుశాసనములో చెప్పిన 'వృత్తలలిత'ముతో ఇది సరిపోవుచున్నది. "ద్విర్భజసనా భ్యాం వృత్త లలితమ్" (2-383) జయకీర్తి తన ఛందోనుశాసనమున (2-271) "వృత్తలలితం, లలిత వృత్త మపి సుందరల యాత్త పరసం భజసనా - భజసనాభ్యాం". ఇచ్చిన లక్షణములో వృత్త లలితం, లలిత వృత్తం అని చెప్పినాడు ఈతని లక్షణములో లయ శబ్దమున్నది. జయకీర్తి దేశి ఛందములోని (లయగ్రాహి) లయ శబ్దమును విసర్జించక త్ర్యక్షరగణ దృష్టితో పాద విభజన గావించి లాక్షణీకరించినాడేమో! ఆతని పద్యములో ప్రాస యతి గూడ చక్కగా పాటించబడినది. తెలుగులో లాక్షణికులిట్టి గణ క్రమమునే చెప్పుటకు పై గ్రంథములు మార్గదర్శకములై యుండును. లయ బోధకమైన మాత్రికా ఛందము త్ర్యక్షర గణములలో కొలువబడి, తత్సమాన గణయుతమై, సంస్కృతములో మాలా వృత్తముగా చెప్పబడిన పై వృత్తము ఉద్ధురమాలా వృత్తముల లక్షణ మార్గమునకు దారితీసి ఉండును.

పాదాంతయతి (విచ్ఛేద రూపము), గణమున (భల) కొక్క పదమున్న లయ చక్కగా బోధ్యమగును. కవిత్రయ భారతమున ఇది చక్కగా పాటింపబడలేదు.

| | | |
|---|---|---|
| నాపుతుల | తుండెములు | |
| భూపతుల | నుగ్గడచి | |
| గావలెక | రంబులుగ | { 1వ పాదము |
| జూపయుప | లాశ | స్త్రీ పర్వము II-5 } |

ప్రాసయతి అక్షరముల ద్విత్వముచే, సంయుక్తాక్షరములచే ఈ లయ మరింత స్పష్టమగును.

అమ్మలను   వింప్లిబరి
ఘమ్ములను   దోమరచ
యమ్ములను   గంతనిక { 1వ పాదము / శ్రీ. ప. II - 7 }
రమ్ములగ   గనత్ప

ప్రాసయతిగల సీసము భల ప్రయోగము లేకున్నను పంచమాత్రికా (ఇంద్ర) గణములతో నిర్మితమైన అచ్చముగా ఖండగతిగల ఈ లయగ్రాహివలె ఉండును.

ఇమ్మలై   మరు హజా
రమ్మలై   పొదలుండ
హజరిక   లువేరెవ్రాన పలడూ (వసుచరిత్ర - I 141)

లయగ్రాహి ఉపయోగములో లయను చక్కగా సాధించినవారిలో నన్నెచోడుడు శ్రేష్ఠుడు. ఆతడు తన కుమారసంభవమున ద్వితీయాశ్వాసమున మూడు (97, 98, 99), ద్వాదశాశ్వాసమున రెండు (171, 173) మొత్తమైదు లయగ్రాహులు వాడినాడు.

ద్విత్వాక్షర ప్రాసయతితో వ్రాసిన లయగ్రాహి.

1వ. పాదము   ముట్టిగజ   యూథముల
బట్టి రద   నాగ్రముల
గుట్టి తెగ   జీరెవలు
తట్ట ములు   వెట్టున్

2 వ. పా.   గట్టెసిర   నాకివడి
గొట్టమొగ   పెట్టుచెద
ముట్టసని   వాలముల
బెట్టుకొని   పీడున్

ఈ రెండు పాదములలో పాదాంత విచ్ఛేదము, పాదాంత్య ప్రాసస్థైతము (స్వరరహిత ప్లుతము) పాటింపబడినది. ఇట్ పద్యమున ఇట్టి ద్విత్వాకార ప్రాసను గణగణమునకు స్థైతము అనగా భల కొక్కటి చొప్పున హాదార్ధమున పాటించినాడు.

4 వ. పా. పెట్టుజన దట్టు బెడ
మెట్టునలి గొట్టుగని
కట్టలుక దారకసు
రేట్టుకరి పోరన్ —ద్వాదశాశ్వాసము 173. ప.

1 వ. పా. తాళరుతి గీతిరుతి
మేళితతి వాద్యరుతి
బాలరస పంజెపుచు
యోలినుల యంవా —ద్వితీయాశ్వాసము 18 ప.

2 వ. పా. జ్వాలలాకో పింగళజా
టాకియొకో నావెరసి
తూలిదివి ఘూషణచ
యాలుశిత దీర్ఘ

3 ప. పా. వ్యాళనిక రంబాబాత
రాకియొకో నావసరి —అని అక్కడక్కడ

యను ప్రాసలు సైతము ఘటించినాఁడు.

ఒకబాయ జవపాయ
పికగేయ సముదాయ
మొకసీమ నానామ
యూరనివ ద —వంటి (వసుచరిత్ర)

సీసములలో గణాంత్యప్రాస మిట్టిలయ గ్రాహి పదకలను పై వన్నెగొదుని లయ గ్రాహి నడకలవలె స్ఫురించుచున్నది.

కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణమున శబ్దాలంకార ప్రియుడై అనుప్రాసయుతముగా లయగ్రాహి ఆద్యంతము ఘటించి వ్రాసి వన్నెకూర్చినాఁడు.

1 వ. పాద. పొంచుచు వ యవ్యాలగ్ర
హించుచుద దంగముల
వంచుచుద రంగముల
ముంచుచుజ లంబుల్

2 ప. పాద. వెంచుచునొ కన్యకరి
మించుచు న రోజాములు
ద్రుంచుచు ము ఖాబ్జముల
వించుచు చా గల్ ప్రా

| | | |
|---|---|---|
| | పెంచుచు ర | ఘాంగీల గ |
| | లంచుచు మ | రాళముల |
| | గాంచుచు ద | మిదోమవ |
| | నెంచుచు బ | తిన్ బ్రా |
| 4 ప. పాద. | దీంచుచు జ | లేఖలకు |
| | గొంచుచు బ | గాళిపెద |
| | రించుచు జె | లంగిరిహ |
| | సించుచు ల | తాంగుల్ |

—(తృతీ. 214 ప.)

లయగ్రాహిలో 5+5+5+5+5+5+5+4 కాగా పంచమాత్రికేంద్ర గణము వాడిన సీసములో 5+5+5+5+5+5+5+6 మాత్రలుండును. ఒక్క మాత్ర సీసములో ఎక్కువ. విజయభద్ర రగడలో(5+5+5+5+5+5+5+6) ఒక్క మాత్ర లయగ్రాహి కన్న అధికము. నాగవర్మ మాలావృత్తములలో చెప్పిన 'లలిత' లయగ్రాహితో సరిపోవును

## 2. లయవిభాతి :

ఇదియును అక్షరగణ దృష్టితో వేరుగా చెప్పబడినను పంచమాత్రికా గణములతో నడచు లయగ్రాహి వంటిదే. తిక్కన రెండు లయ విభాతులను విశిష్ట ఛందః ప్రయోగ శోభితమగు స్త్రీ పర్వముననే వాడినాడు. ప్రబంధ యుగమునందు వీని ప్రయోగము క్వాచిత్కముగా కనబడుచున్నది. ఆధునికులలో దువ్వూరి వారి 'కృషీవలుడు'లో లయవిభాతి యున్నది.

| | |
|---|---|
| త్వరితగతి | దొచ్చికురు |
| వరుడుదల | రంగవిసి |
| కరితతుల | చేపలని |
| కరములమి | రంగో |

—2 ప. పాదము
స్త్రీ పర్వము II-73

గణమున కొక్క పదము వాడి పింగళి సూరన కళాపూర్ణోదయములో కొన్ని పాదములందు చక్కని లయను వ్యంజించినాడు.

| | |
|---|---|
| తరిరుగమి | రెంపులుగ |
| బలు వెలుగు | క్రొవ్విరుల |
| విలసనము | ముత్తియపు |
| సిరికలకు | దక్కున్. |

2వ పాదము క. పా. 1-10.

పోతన భాగవత దశమస్కంధమున ఒకేచోట రెండు లయ విభాతులు గాన

వచ్చు చున్నవి (I-1559, 1560). నాటక కవులలోనూ తర్వాతి కవులలో సైతము ఉద్ధుర మాలావృత్తములు వాడినచోట ఒకటికన్న అధికముగా వాడుట కాంచనగును.

లయగ్రాహిలో నలము కాగా లయవిభాతిలో సలము, భల ఈ రీతిలో సాగును. భలలో గురువు స్థానములో రెండు లఘువులుంచిన లయగ్రాహితో సమానమగును. నాగవర్మ చెప్పిన కుసుమశర వృత్తము లయవిభాతికి సరిపోవును.

## 3) లయహారి :

లయహారిని పొత్తపి రమణ కవి పేర్కొనలేదు. లయగ్రాహి, లయవిభాతి, లయహారి ఈ మూడు ఛందములు, అక్షర సంఖ్యలో భిన్న మయ్యును మాత్రల విషయమున అన్నియు సమానమే. ఒక్కొక్క పాదానికి మాత్రల సంఖ్య 39. [(5×7) + (4×1) = 39)] లయహారి తక్కిన రెండు ఛందముల కన్న - ప్రయోగము తక్కువ. ప్రాచీన కవులలో ఒక నన్నెచోడుడు మాత్రము దీనిని వాడి నట్లున్నాడు. ఆతడు తన కుమార సంభవమున ద్వితీయాశ్వాసమున దీనిని రెంటిని ఒకేచోట వాడినాడు. దీనికాతడు 'లయహారిణి' యన్న పేరుంచినాడు.

కరనికర మురువిటప పరములన గరతలము
లరుణరుచిఁ దలిరులన గరజములు పుష్పో
త్కరమనగ వనరుహజ హరిదనుజ మునిమనుజ
సురగగన చరభుజగ గరుడగణ యక్షే
శ్వరులకతి దయనొసగు వరఫలము లవిశమున
భరితమయి మధుసమయ సురవరమ హీజ
స్ఫురణకెన యనదనరు వరమహిత నటనరతుఁ
బరమదరుఁ బరమపురుఁ బరమునుతి యింతున్

(II - 101)

## 4) త్రిభంగి :

ఈ పేరు ప్రాకృత ఛందము లందును కానవచ్చు చున్నను ప్రత్యేక ఛందము కాదు. మూడు ఛందముల కలయిక త్రిభంగిగా పేర్కొనబడినది.

ఖండ + ఖండ + గీతి = త్రిభంగి (కవిదర్పణ 2-6)
మాత్రా + దోహా + ఉల్లాల = ,, ( ,, 2-36)
ద్విపదీ + ఖండ + గీతి = ,, ( ,, 2-37)
ద్విపదీ + అవలంబక + గీతి = ,, (హేమచంద్రుడు 4-89)
భంగద్విపద + విదారీ + గీతిక = ద్విపది (జనాశ్రయ 5-65)
“ద్విపద్యవలమ్బకాంతే గీతి స్త్రిభంగికా”

"పూర్వ స్త్రిపదీ పశ్చాదపలంబ కస్తదంతే గీతి రితి త్రిభంగికా" యని హేమచంద్రుని నిర్వచనము.

తెలుగులోని ఈ త్రిభంగి లక్షణములో భిన్నమతములు గోచరించు చున్నవి. రేచన ననుసరించి త్రిభంగికి 4 నగణములు + 2స + భ + మ + స + గ. 17, 21, 26 అక్షరముల తర్వాత ప్రాసయతి. 17 అక్షరముల తర్వాత ప్రాస మును బట్టి మిగిలిన రెండు ప్రాసయతులు వచ్చును. మొదటి ప్రాసాక్షరముతో ఈ ప్రాసయతులకు సంబంధము లేదు.

విన్నకోట పెద్దనాదులు చెప్పిన దానినిబట్టి 6 నగణములు +2స+భ+మ+ స+గ. పూర్వార్ధము 16 అక్షరములు. ఉత్తరార్ధము 18 అక్షరములు. 8, 16 అక్షరముల తర్వాత పాదాది ననుసరించి ప్రాసయతి చెల్లును. ఇరువది మూడక్షర ముల తర్వాత ప్రాసాక్షరము ననుసరించి 27, 32 అక్షరముల తర్వాత ప్రాసయతి. అనగా ఉత్తరార్ధములు 3 భాగములుగా 9, 4, 5 - అక్షరములుగా విరిగి, వీనికి విశేషముగా అంత్యప్రాస యుండును. పాదమున 8, 16 అక్షరముల పిదప పాదాది ననుసరించియే ప్రాసయతి. అంత్యప్రాసకు ఈ ప్రాసయత్యక్షరముండదు.

ప్రాచీన కవులలో దీనికి ప్రయోగములేదు. పాల్కురికి సోమన్న మాత్రము 'అనుభవసారములో 4 త్రిభంగులు వాడినాడు'[7].

రేచన మతము ప్రకారము - నన ననలును ససభగులును సగయుక్తము లైనన్ - మృదువైనన్ - ప్రస్తుతమైనన్ - కవిజనా, వృత్తా 123.

రేచనేతర మతము ప్రకారము విశ్వనాథ సత్యనారాయణగారు త్రిభంగిని వ్రాసినారు.

బలికపి పతికర - తలమున(బొ మరగ
బలమటి యంతట నుగ్రీ - వుడప్రగ్రీ - వుండయిద్ప్రగ్రీ
తులు కళవళపడ - దొలగుచు మలగుచు
చల పఱచెన్ మరివాలిన్ - ధృతమాలిన్ - సంగర్‌కేళిన్
—రామాయణ కల్పవృక్షము, కిష్కిం - గజపుష్ప —115

## 5. లాక్షణి :

లింగమగుంట తిమ్మన తన సులక్షణసారములో దీనిని అధికముగా చెప్పి నాడు. ఇతరులెవ్వరును చెప్పలేదు. యతి 16వ అక్షరము.

4+4+4+4

4+4+4+2 గా సాగి యీ ఛందమునకు అక్షరసమక గణములలో లక్షణము చెప్పినాడు తిమ్మన. వీనిలో ఉద్ధరమాలా సామాన్యముగు ప్రాస యతి పాటింపబడకుండుట విశేషము. ఈ ఛందము కవి ప్రయోగములో లేనిది. దీనిని అతడు ఏదేని తన సమీప / సమకాలమున నున్న గేయ మాధారముగా వ్రాసినాడేమో.

పక్షవి, రమణము, భనన న, నములను
        భాసుర, భననస, లెనసిన, నో
లాక్షణి, యనదగు, నతులిత, మదనవి
        లాసల, లితగుణ, గణజల ధీ —సులక్షణసారము

—వృత్త - 103.

## 6. రమణక

ఇది లింగమగుంట తిమ్మన చెప్పిన వేరొక్క కొత్త ఉద్ధరమాలా వృత్తము. 9న గణములు మీద వగణము (త్రిమాత్రికము) పాదమున కుండును. 9, 17, 25 యతి స్థానములు. 10 గణములు మొత్తము అన్ని త్రికములగుటచే త్ర్యస్రగతి అను భ్రాంతి కలుగును. కాని యతి చతురస్రగతిలో పద్యము నడుపుటకు దోహదమొనగును.

8 లఘువులు+8 లఘువులు
8 లఘువు +4 లఘువులు+గురువు

మనసిజ జనకన - మదిరపు గజహరి
మదగజ వసువిర - మణముల తో
నన నన నన నన - నలగము లెనయగ
నరవర నుతరమ - ణక మమరున్ — సులక్ష. వృత్త 104

గణ విధానములో భిన్నత్వము తప్ప పద్యము నడకలో భిన్నత్వ మేమియు లేక లాక్షణి - రమణకములు ఒక్కటేయగు చున్నవి. లాక్షణిలోని గురువున్న చోట రెండు లఘువులిడ రమణమగును. చివరి గురువు ఉభయత్ర సమానమే. ఇంత స్పష్టముగా ఒకే పద్యముగా భాసించు వీనిని రెండు పేర్లుంచి రెండు వేరు ఛందము లని చెప్పుట ఏ కారణముగ సంభవించినదో తెలియరాదు. ప్రత్యక్షర గణ దృష్టిలో లాక్షణికునకు అభేదము కన్పడక పోయి ఉండును. ఇదియును ఏ కవి కూడా ఉపయోగింపనిదే యైనను ఇట్టి నడకలో జానపద గీతములను చూపవచ్చును. కాని ప్రత్యక్షర లఘుత్వము వంటి కృతక గణ వ్యవస్థకు జానపద గేయము ఒప్పగదు.

## 7) దర :

పొత్తపి వేంకట రమణకవి తన లక్షణ శిరోమణిలో దీనిని వివరించినాడు. ఇంతకు ముందెవ్వరును దీనిని చెప్పలేదు. కవి ప్రయోగములో నైతము కానరాదిది. దీనికి గణములు నన నన నన నన భస : 8 అక్షరముల మీద ఒక్కొక్క మారు యతి పాటింపఁబడును. ప్రాసయతి పాటింపఁబడలేదు. పొత్తపి రమణకవి వీనిని తక్కిన వృత్తములవలెనే భావించుటచే దేశ్య లక్షణమైన ప్రాసయతిని విడిచివేసినాడు. ఇది 4 లఘువుల కొక్కటి చొ॥న చతుర్మాత్రికములైన గణములతో చతురస్ర గతిలో నడచును.

4 4 4 4
ననసన లనునన * ననలను భసల బె

4 4 4 4
* నగొనగ వసుగజ * నొగవి రమముల్

దనరిన దంమన * దగుధర దశరథ

* దశరథ తనయుఁడు * ధృస్తుత నృహరీ— ల. శి. III. వృత్తా. 228 ప.

దీనిని షడ్వింశతి ఛందో జాతమగు వృత్తము వంటిదానిగ 'ఓంమహః' ఛందో జనితమని చెప్పుటయేగాక 52 కోట్ల 3వేల 662వ వృత్తమని వృత్తసంఖ్య పేర్కొనినాడు.

## 8) లలిత :

లక్షణ శిరోమణికారుఁడు పేర్కొన్న వేరొక్క కొత్త ఉద్ధురమాలా వృత్తము. కవి ప్రయోగ శూన్యము. గణములు 8న + న న నయ, ప్రతి పది అక్షరముల పిదప రెండుచోట్ల యతి. తరువాత 9 అక్షరముల మీద యతి. వృత్తములలోవలె ప్రాస ఉండును. 5 మాత్రలతో ఖండగతిలో నడచును.

5 5 5 5
మొదలనునె నిమిడిగణ * ములునవల నొకనగణ

5 5 5 4
* మునుతుదన గణద్వయ * మునుయగణ, మర్వెం

5 5 5 5
గడిపిదళ దిశవిఘల * గలుగు యుతు లనిడివర
5 5 5 4
*కవులు లలి తకందము * గనిలిపిన గ్శల్తా
— లం. శ. III వృత్తా. (229 ప.)

లలితరగళె కన్నడము నందిది పాదమున కిట్టి 5 మాత్రల గణములు నాలుగు వాడబడుచు తెలుగులోని ద్విరదగతిని పోలియున్నవి. బహుశ ఆ 'లలిత' నామము రెట్టింపు రూపమున నున్న తెలుగులోని తన లలిత వృత్తమునకు ప్రేరణగా తీసికొని ఉండవచ్చును. లేదా నాగవర్మ కన్నడమున మాలా వృత్తములలో పేర్కొన్న 'లలిత' వృత్తమైనను కావచ్చును.

# 9. ఘన వినద :

పొత్తపి రమణకవి పేర్కొన్న క్రొత్త ఉపరి ఛందముల యొుకటిలో ఇది చివరిది. 4న + జన + జన + నన + భస. యతి 10, 9, 9 అక్షరముల మీద ప్రాసయతి లేమ 36వ 'విరాట్' ఛందో జన్యమని పేర్కొనినారు.

5 5 5 5
ననననజ నజనములు * ననభస ల్దళ విరమ
5 5 5 5
* ణమ్మునవ నిధియుతుల * నలువొప్ప గవివరుల్
ఘననినద మనగ్శతిన * గణిత సత్కవివిమతి
* గగ్గి చెలువ వలరుసురు * గతులంద ముగహరీ !
— లం. శి. తృ. వృత్తా 230

# 10. శాలూరము :

దీనిని లాక్షణికు లెవ్వరు చెప్పలేదని విశ్వనాథవారి రామాయణ కల్ప వృక్షమందు ప్రయుక్తతమని శ్రీ సంపత్కుమారాచార్యగారు ఛందఃపద కోశములో ఉదాహరించినారు.

పాదమునకు 1త + 8న + 1లగ. "ప్రాసయున్నది. యతిగాని, ప్రాస యతి గాని నియతి రీతిలో లేదు. పాదాది నగణముండుటచే, ఆ ఎదు వరుసగా 8 నగణము లుండుటచే నగణ మధ్యమున మగణాసునాంగా ప్రాసయతి చెల్లింప వీలుం

దప రాగా కనీసము 16వ అక్షరము యతి చెల్లుట సమంజస" మని వారు అభిప్రాయ పడినారు.

అంతన్ రఘుపతి వృథ ధను రుడిత శర
వికర సరదన లపటు తరశిఖా
ప్రాంతం బిగుచు జలధి బహుల కుహర ని
వసద సురమకర తతి తత తనూ
సంతానములు తెక తెకలయి తహ తహ
లమి తిక మక పడి వడిగుడుసులై
యంతర్జ్వలముల సముచయములు రలిస
గము వెలకిల బడి చలన మురవెన్.
— రామా. క. వృ. సుందర. సంధ్యా. 327

ఇట్లు ఉద్ధురమాలావృత్తములు మాత్రాసమక గణనిబద్ధములై లాక్షణిక దృష్టిలో అక్షరసమక గణ గణితములయ్యును తమ దేశీయత్వమును వీడక, కవి ప్రయోగ రక్షితములై ఒప్పినవి. వీనిలోని పాదదీర్ఘత్వము గేయావసరమున ఖండములై చిన్నవై లయను సృష్టింపజాలి ఉండుట కాంచగలము. ఎక్కువ ఖండగతిలో నడిచినవే ఉద్ధురమాలలో గాంచగలము. ఇవి రగడలకు వికృతి రూపములే. రెట్టించుటచే రగడలు సైతము అధిక దీర్ఘ పాదములై ఉద్ధురమాల యననొప్పును.

— × —

అధస్సూచికలు

1. హేమచంద్రుని ఛందోనుశాసనము II—381
2. ఛం. ప. కో — సంపత్కుమార
3. ల. శి. III - 227
4. ల. శి. III - 304
5. ఆం. మ. భా. ఛం. శి - పు. 321, 323
6. ఆంధ్ర గీర్వాణ ఛందము - బంగోరెసం. పు. 25
7. అనుబంధము II చూచునది

★★★

## ఉ ప జా తు లు

ఇప్పటివరకు దేశి చ్ఛందములలోని జాతి పద్యములు వివరింపబడినవి. ఇవన్నియు ప్రాసగల పద్యములు. ఇకముందు ఉపజాతులు వివరింపబడును. అవి ప్రాసరహితములు. జాతులలో ప్రాసయుండి, ప్రాసయతి ఉండదు. కనుక ఇటుక వివరించినవానిలో ఒక్క ఉత్సరమాలా వృత్తములలోని ప్రసిద్ధ పద్యములు మాత్రము దీనికపవాదములై నిలచినవి. వానిలో కొన్ని యతి గల్గి, ప్రాసయతి గలవానిలో ప్రాసయుండి, వృత్త గౌరవము నందుటచే వానిని జాతులలో చేర్చుట జరిగినది.

ఉపజాతులలో విశిష్టములగు సీసములు ప్రాసవలన గల్గు భేదములచే జాతులు కాదగి యున్నను, సహజ సీసమునకు ప్రాస లేకుండుట, ప్రాస వృత్తముల నుండి వచ్చిన సంప్రదాయముగా నొక సీసభేదమగుటచే సీసము ఉపజాతిగా స్వీకరింపబడినది. అట్లే మంజరీ ద్విపద, ద్విపదతో అభిన్నము కనుక ద్విపదవద్దనే వివరించవలసినను, ప్రాసరహితము కాన ఉపజాతులలో ముందు వివరింపబడును.

## 1. సీ స ము :-

దేశియ చ్ఛందములలోకెల్ల విశిష్ట పద్యము — సీసము. అన్నిటికన్న పెద్ద పద్యము పాదమునకారు ఇంద్రగణములు, మీద రెండు సూర్యగణములు మొత్తము 8 గణములతో 22 నుండి 30 అక్షరముల వరకు 30 నుండి 36 మాత్రల కాలోచ్చారణము గల్గిన పాదములు నాల్గు కల్గియుండి వానిమీద దీని దైర్ఘ్యమునకు తోడుగా వేరొక్క సమగీతి పద్యముండును. పాద దైర్ఘ్యము ఉండుట దేశి పద్యములకు విరుద్ధము. కాన పాదము 2 గణములకొక్క ఖండముగా విడిపోయి ఖండ ఖండమునకు యతి లేదా ప్రాసయతి ఉండును. రెండు ఖండములకొక్క పాదార్ధము చొప్పున ఏ యర్ధమునకాయర్ధము విడిగా నుండును.

సీసము వర్ణనాఛందము. వర్ణింపవలసిన అంశమును విశేషముగా వర్ణింపదలచిన, నాల్గు అంశములు లేదా గుణములుగా విభజించి ఒక్కొక్క గుణము ఒక్కొక్క పాదమున వర్ణించి, ఆఖరుగా ఎత్తుగీతి పద్యమునందు ఉపసంహారము గావించు విధానము తెలుగులో బహుళముగనున్నది. ఇట్టి అవకాశము మరేపద్యములో లేదు. పాద దైర్ఘ్యత కవికి స్వేచ్ఛగా, విశాలముగా వర్ణించుట కనువు కల్పించును.

విశిష్ట వర్ణనీయాంశమును సీసములోనే వర్ణించు విధానము, అతిప్రాచీన కాలము నుండియే కానవగును. కందుకూరు, ధర్మవర శాసన సీసములు వర్ణన గావించుటకు వాడబడినవి. సర్వదేవ పద్మకవుల సీసములు ఇట్టివే. తిక్కన భారతమునుండి వీనికి వర్ణనా విషయమున ఒక నిర్దిష్ట విధానము అవలంబించుట సంప్రదాయమైనది. సీసములతో వన్నెకెక్కినవారు తరువాతి కాలములో శ్రీనాథ, భట్టుమూర్తులు. ఒక ఛందములోని పాదములు వర్ణనీయాంశము కొఱకు ప్రణాళికాబద్ధముగా స్వీకరించుట, తిరిగి ఆటవెలదిలో ఒక్క వేమన్న గావించినాడు. 2 పాదములలో దృష్టాంతమును వివరించి, 3వ పాదములో నిర్ధారిత సూక్తిని వివరించి, నాల్గవ పాదము మొత్తము మకుటమునకు వాడుకొన్నాడు. తానెన్ని ఆటవెలదులు వ్రాసిన ఏ తత్ప్రణాళికాబద్ధుడై నడచినాడు. ఇట్టి ఆటవెలది సైతము నడకలో సీసమువంటిదే యగుట విశేషము.

సీసముపై ఆటవెలది వ్రాసిన ఆ మొత్తము పద్యము మూడు ఆటవెలదులతో సమానమగును. సీసము 2 పాదములు ఒక ఆటవెలదియంత దైర్ఘ్యముండును. 3 సూర్యగణములు 2 ఇంద్రగణములతో సమానము. అపుడు ఒక సీసపాదము ఆటవెలది యొక్క అర్ధభాగము కాగలదు.

సీసమన్నది తెలుగులో లోహమన్న అర్థమును స్ఫురింపజేయుచున్నది. సంస్కృతమున శీర్షక శబ్దము నుండి ఇది పుట్టియుండవచ్చునని మరియొక యభిప్రాయమున్నది. శీర్షకము నుండి సీసకము పుట్టవలెను. సీసమన్నది శీర్ష శబ్దభవము. అట్లయిన 'శీర్ష' శబ్దము పేరుతో 'శీర్షక' మున్నట్లుగా ఇతర ఛందమేమియులేదు. అనంతుడు సీసములు లోహమన్న అర్థములో వాడినాడు. చక్కగా చెప్పిన సీసము పసిడి వంటి దగునని చమత్కరించినాడు[1]. అర్వాచీన కవులలో కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు తన బిల్వేశ్వరీయమున సీసమున్నదని వెండి, బంగారము పేర్లతో పద్యములు కల్పించినాడు.

## సీసము - ఇతర ఛందములు :

ఈ సీసమునకు మాతృక యనదగిన దానిని భరతుడు తన నాట్యశాస్త్రమున 'శీర్షక'మను పేరుతో పేర్కొనినాడు. శీర్షితతాళ భేదముచే కల్పింపబడిన ఈ రచన శీర్షకమనఁ జెల్లినది.

భరతుడు చెప్పిన శీర్షక లక్షణము :-

శీర్షకం నామ విజ్ఞేయా శీర్షితేన విభూషితా।
ఏకపాదావసానస్తు యస్యాస్యావర్ధవర్జితః॥
ఏకావసానేన యుక్తైః సాజ్ఞేయాతు చతుష్పదా।
పూర్వపాదేన తస్యస్యాత్ సర్వత్రగురు లాఘవః॥
పాదే పాదావసానే చ సాజ్ఞేయా నియతాక్షరా।
శీర్షకంచ ప్రకర్తవ్యం గురుప్రాయాక్షరాన్వితమ్॥
తతశ్చ శీర్షకం కార్యం ప్రయుక్తం పంచపాదినా।
శీర్షకో నామ నియమో భవేత్పాద విధానతః॥
నాన్యావృత్త వినిష్పన్నం కుర్యాద్వై శీర్షకం బుధః॥
గురుర్గుర్వాది స్తథాల్పాదిర్వ్యగ్మః సతు లఘుస్తథా॥
చతుర్మానాక్షరో జ్ఞేయా పూర్వభంగో వికల్పకః।
అష్టాష్టగణాః పాదాః శీర్షకస్య భవన్తి హి॥
త్రింశన్మాత్రాశ్చ విజ్ఞేయా యుగ్మౌజాక్షర పైః పదైః॥
శీర్షకేప్యేక వింశత్యాః షడ్వింశతి పరస్తథా॥
అక్షరాణాం భవేత్పిండః పాదేష్వేక త్రినిర్దిశః।
యుగ్మౌజ మిశ్రకాః ఖలుపాదే కార్యాస్తు చత్వారః స్యుః॥
శీర్షకేతు నియమేన పశ్చాల్లఘు పంచయః కార్యః।
త్రయ ఏవగణాస్తు ముఖే లఘువత్రయ ఏవావసానేతు॥
మధ్యేచేత్ గురుణీద్వే తచ్చ పలాశీర్షకం నామ।
పూర్వే హ్యర్ధంయ గురుహ్రస్వా ద్విమాత్రా గణాస్తు చత్వారః॥
పాదే భవన్తి నియతం పశ్చాల్లఘు పంచయాః శేషాః॥[2]

"చతుర్మానాక్షరో జ్ఞేయః = నాల్గు మాత్రల గణములు వాడవలయునని, చతుష్పదా= అనఁగా 4 పాదములు కలదని, అర్ధాష్టప గణాః పాదాః శీర్షకస్య భవన్తి హి= పాదమునకు 8 గణములు, పూర్వార్ధ దళములు నాలుగేసి ఉండును. త్రింశన్మాత్రశ్చ విజ్ఞేయాః = ముప్పది మాత్రలు పాదమునకుండునని అర్థమగును. 21 – 26 అక్షరములు దీనికుండును.

తెలుగు సీసములో 21 అక్షరములుండ వీలులేదు. కనీసము 22 అక్షరములు మొదలు 30 అక్షరముల వరకుండును. పాద వైశిష్ట్యత సీసమునకు సరిపోదు.

పైగా 4 మాత్రల గణములనుట తెలుగు సీసమునకు విరుద్ధము. 4 లేదా 5 మాత్రల గణములు ఇంద్రగణములు. 4 మాత్రలని నిర్బంధింపతగదు. పైగా తెలుగులోని సీసములో 5 మాత్రల నడకయే ప్రసిద్ధము. గణనియమము, పాదనియమము మాత్రము సీసమును బోలియున్నది. ధృవాభేదమైన శీర్షకము తెలుగు సీసమునకు పోలికలు లేనిదే. అంతేగాదు భరతుడు నానావృత్తి నిష్పన్న పాదములతో శీర్షకములు నిర్మింపవచ్చునని అన్నాడు. ఇట్లు తెలుగు సీసముతో సంస్కృత శీర్షకమునకు సంబంధము లేదు.

జనాశ్రయుని కందమందు 'శీర్షిక' యను పేరుతో చెప్పబడిన ఛంద మొకటి కలదు. అది ప్రాకృత ఛందో భేదము.

"షడధికాక్షరా" (5-52)

ప్రతి పాదం షట్ గణా భవ న్తిచేత్ అధికాక్షరానామభవతి.

"శీర్షకం గీతికాపరా" (5-57)[3]

అధికాక్షరలో 4 లేదా 5 మాత్రల గణములు 6 ఉండి విపరిగీతిక చేర్చి నచో శీర్షమగును. ఒక్కొక్క గణము పెంచుటచే ఇవి మరల భేదము లేర్పడు చున్నవి. 7 గణములతో లలిత, ఎనిమిది గణములతో సుభద్ర, 9=రవిద్రుమ. 10 = వంశపత్ర, 11=కుంజర, 12=వంశపుష్ప, 13=వంతమాల అనునవి.

(అ) సమస్థాన జగణనిషేధం, (ఆ) తృతీయస్థానం జగణ నిక్షేపనం, (ఇ) పాదాంత గణము 'నగణ రగణములతో నొకటి. ఇవి మరికొన్ని నియమములు. గణ విషయమున సుభద్ర తెలుగు సీసముతో కొంచెము పోలును.

దీనిని బట్టి జనాశ్రయుని 'శీర్షక' కు తెలుగుతో సంబంధము లేదన వలయును.

నాగవర్మ ఛందోఒంబుధిలో రఘటాభేదముగా చెప్పినది మన సీసముతో చక్కగా సరిపోవును. 5 మాత్రల గణములు ఆరు, త్రిమాత్రికాగణములు రెండు కల పాదములు నాల్గు వ్రాసి మీద ఆటగీతి చేర్చవలయునని ఆతని లక్షణము. ఆటగీతి ప్రాసగల ఆటవెలదియే. తెలుగులో 4 లేదా 5 మాత్రల గణము లుండవచ్చును. ఐనను పంచమాత్రికాగణ సీసమే ప్రసిద్ధము కనుక ఇది తెలుగు సీసముతో పోలును.

ఇక పద్యము మీద పద్యమును పేర్చి వ్రాయుట ప్రాకృత ఛ్ఛందస్సం ప్రదాయము. ఇట్టివి —

1. ఛప్ప ఉ ఛందము :-

2+4+4+4+4+4+2 మాత్రలుగా గలిపి (యతి 11 మాత్రల మీదుండి) 4 పాదములు వ్రాసి మీద ఉల్లాలా ఛందము 2 పాదములు (28 మాత్రల కొక్క పాదము, యతి 15 మాత్రల మీద గలది) వ్రాసిన ఛప్ప ఉ ఛందమగును.

— ప్రాకృత పైంగలం I – 105

2. రడ్డా ఛందము :-

1, 2, 3, 4, 5 పాదములకు వరుసగా 15, 12, 15, 11, 15 మాత్రలు గల్గిన ఐదు పాదములు వ్రాయబడి, మీద దోహా ఛందము అతికించిన అది రడ్డా ఛందమగును.

— ప్రాకృత పైంగలం. I - 133.

3. కుండలియా ఛందము :-

దోహాను రెట్టించి అనగా నాల్గు పాదములుగా వ్రాసి పైన ఒక్క ఉల్లాలా ఛందము అతికించిన అదికుండలియా ఛందమగును.

ప్రాకృత పైంగలం I - 546

4. ద్విపదీ ఛందము :-

కీరయి గణేహి పాఏ పాఅ చత్తారి పత్తలం భణియం !
చత్తారి సగీయి ఆపత్త అయిం మువయిత్తి నిద్దిట్ఠా॥

— II-1 వృత్తజాతి సముచ్చయ

The technical name Dwipadi is given to a group of 4 stanzas, each containing 4 lines and followed by a Gitika: thus it is a strophic metre where 4 stanzas of 4 lines are followed by Gitika each. — H.D. Velenkar.

ఇట్లు ఒక ఛందముపై వేరొక్క ఛందము అతుకుట అన్నది ప్రాకృత ప్రభావమనవచ్చును. ఈ సంప్రదాయము తమిళమునకూడ ఉన్నది. కలిప్పా అనే పద్యమునకు కూడా స్వతంత్ర పద్యముగా రాసినపుడు దానికి అటిరియప్పా లేదా వెణ్బాపద్యము చేర్చుట కలదు. ఒకే వృత్తముతో 'సర్గ' అంతయు వ్రాయబడు సంస్కృత భాషలోని పద్యకావ్య పద్ధతిలో ఆలోచించిన ఇది వి[illegible] ...గా చెప్పట్టును. తెలుగులో ఒక ఛందము తరువాత వేరొక ఛందము అనగా ఒ[illegible] [illegible] చిన్న ఛందః ప్రయోగము గల్గిన భారతాది గ్రంథములలోని చంపూపద్ధతి[illegible] విధానములో విశేషమేమియు లేదు. ఒక ఉత్పలమాల పిదప ఒక ఆటవెలది [illegible]వచ్చు

నియమమేమీలేదు. అందుకే ఒక ఉత్సాహమీద ఆటవెలది లేక తేటగీతి వ్రాయు విషమసీసపు విధానములో రెంటిని అనుసంధించు పదము వేయవలయునను నియమమును విమర్శకులు సూచించుట జరిగినది. లేనిచో తెలుగు చంపూ కావ్య విధానములోని వేర్వేరు ఛందముల ఇటీతి పరివర్తనములో దీనికి విశేషము ఉండబోదు. సమ సీసములోని పూర్వభాగము (ఎత్తు గీతి విడిచినది) వ్యస్తప్రయోగము లేకుండుట వలన దీనికి 'ఉత్సాహ, ఎత్తు గీతి'వలె భిన్న ఛందములని భావించు అవకాశము లేదు.

భరతుఁడు తన నాట్యశాస్త్రమున పేర్కొన్న 'శీర్షకము' అచ్చుముగా సీసమే కాకున్నను గణ విధానము, పద్యనిర్మాణము సీసము వలెనే యున్నది. నాటికే వ్యవహారములోనున్న దేశీయ ఛందములను చూచి భరతుఁడు తన గ్రంథమున పేర్కొని వాడవలె. ఎందుకనగా ఈ విధానము సంస్కృతమున లేనట్టిది. సంస్కృతమునకు సరిపడనట్టిది. ఇదే యభిప్రాయమును శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు "దక్షిణదేశీయ సంప్రదాయసిద్ధములగు ప్రాచీన గేయ రచనములు మాత్రా ఛందస్సులుగా సంస్కృత ప్రాకృత లాక్షణికులచే గ్రహింపబడినట్లు అగుపడు చున్నదని"యు, [4] శ్రీ దివాకర్ల వేంకటావధానిగారును "సంస్కృత ప్రాకృత లాక్షణికులచే మాత్రా ఛందములుగా గ్రహింపబడిన దేశీయ సంప్రదాయసిద్ధములగు గేయ రచనలలో శీర్షకమునువొకటి" యనియును వ్యక్తపరచిరి [5].

జయకీర్తి (దాక్షిణాత్యలాక్షణికుడు) తన ఛందోఽనుశాసనమున సీసమును గూర్చి పేర్కొనినాఁడు. అతడు కందపద్యమున దేశి పద్యములను గూర్చి వివరించినాడు.

కం సంస్కృత వాఙ్మార్యాద్యాః
ప్రాకృత విషయే తు గళితకాద్యాః బహుధా
కర్ణాటకేఽక్షరాద్యాః
విషయే....శీర్షకాది జాతయ ఉదితాః (I-22)

ఆర్యాదులు సంస్కృతమునకు, గలితకాదులు ప్రాకృతమునకు, అక్కరలాదులు కర్ణాటమునకని వివరించుచు, శీర్షకాదులు తెలుగునకని భావించినాడేమో ! దురదృష్ట వశమున సరిగా అక్కడే గ్రంథశైథిల్యము కలిగినది. జయకీర్తి కన్నడ జైన పండితుఁడగుట, తన గ్రంథమున కర్ణాటాంధ్ర ఛందో లక్షణములను చెప్పుటవలన సీసము ఆంధ్రులదని చెప్పి యుండవచ్చునని ఊహించవచ్చును. ఆ లుప్త భాగమున

ఒక గుర్వక్షరము లేదా రెండు లఘ్వక్షరములు ప్రారంభమగును [6]. దానిని 'విషయేంద్రే'యని పూరణము తెలుగు విద్వాంసులచే సూచింపబడినది [7]. ఇది సరియైన పూరణమే కావలయును. ఇట్టి పూరణమునకు సందర్భమును, వైచిత్ర్యమును ఉన్నది. అప్పుడు 'విషయేంద్రే' అన్న మాటకు ఆంధ్ర విషయే=ఆంధ్రదేశేయని యర్థము చెప్పవలసివచ్చెను. సీసము తెలుగు ఛందము అనుటలో ఏ పేచి, సంస్కృత పండితులకు అభ్యంతరముండదు.

భరతుని కాలమునాటికి అంతప్రాచీన కాలమునందే ఉన్నదనుటకు వేరొక్క సాక్ష్యము - కొత్తపి వెంకటరమణకవి సీసపద్యమునకు ఋగ్వేదబ్రాహ్మణమునందలి దని లక్షణమును చూపుట.

సీసమును విరాట్ఛందోభవముగ చెప్పు ఋగ్వేద బ్రాహ్మణమును మూలముగా చెప్పినాడు.

"విచ్ఛేదంగా ప్రాసంద్వ్యోః। ద్విపప్వలి షడార్కయుగే॥
చత్వారింశోత్తరశతలఘ్వయః ప్రసన్నపద్యాతా సమా॥
చతుఃపంచాధికోలః విషమా। జాతిరిత్యాహ।
మహర్షిస్సీసాపవేతి। విరాట్ఛందో భవేతి। నాగాకలత్రపు
మనోజ్ఞాపశలిభేదాః పంచాశత్"

విచ్ఛేదమ్మనే యతి ఏదో గణాను ప్రాసము. ద్వ్యోః రెండో గణము మీద ప్రాసయతి రావలెను. ద్విపప్వలి షడార్కయుగే=ఇంద్రగణములాఱున్ను అర్క గణములు రెండున్ను ఒక చరణాన కనుక చత్వారింశోత్తర శతలః చతుః=నాలుగు చరణాలకున్ను, చత్వారింశోత్తర శతలః=నూటనలభై లఘువులనుట. ప్రసన్న పద్యాతా సమా=ప్రసన్నపతి అను పేరుగలిగిన ఆటవెలది గీతితో కూడినదై, సమా=సమసీసమనిపించును. చతుః పంచాధికోలః విషమజాతి రిత్యాహ=నూటనలభై లఘువులమీద నాలుగైదు లఘువులెక్కువైనది విషమసీస మనిపించుకొనును. ఈ సీసము పేర్లు జాతులనిన్ని, మహర్షిః సీసాపవేతి, సీసములని మహర్షులు పలుకుదురు. విరాట్ఛందో, భవేతి=ఈసీసములు విరాట్ఛందోభవములు, నాగ కల త్రపు మనోజ్ఞా పశలిః భేదాః పంచాశత్=ఈ సీసములు 'నాగ' అనిన్ని 'కల' అనిన్నిత్రపు అనిన్ని మనోజ్ఞ అనిన్ని, అపశలి అనియు అయిదు భేదములు. ఈ అయిదున్ను ఒక్కొక్కటి పదేసి భేదములై యేబది సీసంబు లయ్యెను. ఇది సీస జాత్యధికారము." [8]

పోతప్తి రమణకవి చెప్పిన ఋగ్వేద బ్రాహ్మణమూలమును ఇతర ఆంధ్ర ఛాందసికులెవ్వరును చెప్పకుండుట గమనార్హము. పై లక్షణము నైతము సీసమునకు చక్కగా అతకకర్గ అద్భుతావహముగ నున్నది. ఒక వేళ ఇది అంత ప్రాచీనమయ్యేనేని భరతుని నాటికే తెలుగు చాటు ప్రయోగములోనున్న దనవలె లేదా తర్వాతి లాక్షణికులెవరైనా రచించి ప్రక్షిప్త మొనర్పగా పొత్తపి రమణకవి ఉదాహరించినైన ఉండవలెను. రెండవ ఊహే బలముగా నున్నది. "మహర్షిః సీసావదేతి" అన్న వాక్యము మహర్షులగు భరతులవారు తమ నాట్యశాస్త్రములో సీసమును చెప్పినారన్న అర్థము వచ్చుచున్నది. రెండో గణము మీద ప్రాసయతి అన్న నియమము తెలుగున తప్ప మరే భాషా ఛందమున లేనట్టిదే. విషమ, సమ సీస భేదములను కూడా ఇది చెప్పుట విశేషము. దీనిని బట్టి ఇది తెలుగు సీసమును చూచియే సంస్కృతమున లక్షణము చేసినారనవలయును. సూర్య ఇంద్ర గణములని పేర్కొనుట కూడ అది తెలుగు లక్షణమేయని నిర్ధారించును.

ఇది పొత్తపి కవియే రచించినాడేమో అని అనిపించవచ్చు. సీసము శీర్షక మన్న భ్రాంతితో అట్లు చేయరాదని ఏమున్నది? కాని పొత్తపి కవి కట్టి అవసరము కన్పించదు. పైగా 'విచ్ఛేదం గా' అన్నమాట అతనికే అర్థముగాక 'విచ్ఛేదస్మిన్ యతి మేకో గణానుప్రాసము' అని వదిలివేసినాడు. దానే సంస్కృతీకరణము సృష్టించిన మొదల ఇట్టి అస్పష్టతకు తావుండదు. పైగా 'ప్రసన్న పది' అన్నది కూడా సంస్కృత లక్షణమున నున్నది. దీనికాతడు ప్రసన్నపతి అనే పేరు గలిగిన ఆటవెలది గీతితో కూడినవై అని అర్థము నిచ్చినాడు. ఈ ప్రసన్న పది/వలి యన్నపేరు అతి ప్రాచీనమైనది. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో గీతి భేదములలో

ప్రపశినాఁ బ్రసన్న పదినాఁగ గీతులు
సీసములను రెండు చెందు ముదల
నాటవెలది యనఁగఁ దేటగీతి యనంగ
వానిపేర్లు వేట వలయుఁ దెలియ ......................(8-47)

- అని పేర్కొనుట చూడనగును.

కనుక ఈ ఋగ్వేద బ్రాహ్మణ సీసలక్షణము ప్రాచీనమైనదే. పాల్కురికి సోముడు 'ప్రాసోవా యతిర్వా' యని ఉద్ధరించిన సంస్కృత లక్షణము, ఇది ఒకే గ్రంథములోనివి - అగునా? అనిపించును.

క్రౌంచపదములోని గణములను మాత్రా గణములుగామార్చి అంత్య గురువు రెండు లఘువులుగా చేసినసీసమగునని శ్రీ మానపల్లిరామకృష్ణ కవిగారనిరి[10].

క్రౌంచపదము భ,మ,స,భ,న,న,న,య గణములు కలిగి పదకొండక్షరములకు మీద ప్రాసయతి, ఆపై పదిఅక్షరములకు యతి ఉండును. ఇవి చతుర్మాత్రాగణము లుగా గుర్తించి, చతురస్రగతిలో నడుపవలెను.

పంచశ రాభా - సంచిత పుణ్యా

భమసభ నననయ - పరిమిత మైనన్

క్రౌంచప దాఖ్యం - బంచిత పద్యం

గ్రహయతి దశపను - కలితము గాగన్.

సీసములో భ, నల గణములు మాత్రమే వాడిన చతురస్ర గతిలో సాగును. కాని వ్యవహారములో నున్న సీసము ప్రసిద్ధముగా ఖండగతిలో సాగును. ఇంద్రగణములలో బహు సంఖ్యాకములు (నగ,సల,ర,త) పంచ మాత్రికము లే యగుట దీనికి కారణము. ఇట్టిచో చతురస్రగతిలో మాత్రమే సాధ్యమై, నియత త్ర్యక్షర గణ వ్యవస్థ గల్గిన క్రౌంచపదము సీసముతో సంబంధము గలదనుట చెల్లదు. అనియత లక్షణమునుండి నియత లక్షణముగల పద్యము పుట్టుట సహజము. తద్భిన్నము అసహజము.

రెండు ద్విపదలు కలపి, సూర్యగణము. 4వ దానిని చివరవేసిన సీసము సిద్ధమగునని కోవెల సంపత్కుమారాచార్యగారనిరి [11]. రెండు ద్విపదల పాద దైర్ఘ్యము సీసముతో సమానమగుట సత్యమేమైనను 4వ గణము (సూ.గ) చివర వేయుటకుగల పద్ధతి ఆలోచనా ఫలమేకాని ఇతరేతర సాక్ష్యముచే జన్యజనకత్వ సంబంధము స్థిరపరుప జాలిలేదు.

## సీసము - గేయము

సీసము జానపద ఛందోజన్యము. ఖండగతిలో సాగు గేయమే మాతృక కావగును. 8 గణముల పాదము. గణ సంఖ్య సరిసంఖ్య. అర్థము 4 గణము లకు అనగా పాదము సమద్విఖండనము. ప్రతి అర్థము తిరిగి సమద్విఖండనమై రెండేసి గణములకొకటి నిల్చును. ఇంత చక్కగా సౌష్టవమున్న ఛందము తెలుగున వేరొక్కటి కనబడదు. కాన ఇట్టి రెండు గణములు + 2 గణములు—2 గణములు

+ 2 గణములు అన్న పదుసలోని గణములు అన్నియును సమ కాల్యము గలిగియే యుండవలయును. అన్నియును ఖండగతిదే సరిపోవలయును. అనగా పంచమాత్రికములే కావలయును. కాని 2 చివరి రెండు గణములు సూర్య గణములై త్రిమాత్రికములై నిల్చినవి. అనగా జానపద గేయములో 2 చివరి గణములు వ్రాతలో త్రిమాత్రికములై గోచరింపగా శిష్టకవులు/లాక్షణికులు అట్లే స్వీకరించి యుందురు. ఇది గణములన్న భాగమున వివరింపబడినది. అక్కడ సీస పద్యపాదమిందు ఇకినది.

ఎండిన ఊళ్లగో డెరిగింప దెప్పడు

పండిన ఊళ్లకె ప్రభువులంత — నరసింహ శతకం

ఇది గేయములో ఎండినా, చెప్పడూ, పండినా, ఊళ్లకే, ప్రభువులంతా అని పూర్ణకాల ఖండమగుటకు కావలసిన మాత్రల నిలుపుకొని పాడబడును. కాల ఖండములు (5 మాత్రలవి) సంపూర్ణముగా సున్న స్పష్టపము స్ఫురించును. ఒకవేళ కాలఖండ పూర్ణత్వము కొఱకు పూరణ వీలులేకున్నను, లోటుకల్గిన 2+2మాత్రలు. (3+3 సూ. గ - కావలసినవి 5+5) తర్వాతి పాదమున యొక్క ప్రారంభమునకు మధ్య కాలములోనైన 'విశ్రాంతి' పూరణమునే సవరింపబడును. (అ) గణమున కొక్క పదము వ్రాయబడుట, (ఆ) నాలుగు అర్థములుగా పాదము విడివోపుట, (ఇ) గణానుపత్తి యతి లేదా ప్రాసయతి, (ఈ) ప్రాసాక్షర నియమానైచ్ఛికత లాక్షణికులు సీసమునకు చెప్పని గేయగుణములు. ఆఖరుగణములు తెలుగులో పలుపద్యములలో బహుధా సూర్యగణములే. గేయగతులను దేశి గణములలో కొల్చుట వల్ల కలిగిన కృతకతలో ఇట్టి పాదాంతమాత్రా లుప్తత యేర్పడినది. ఇది గానములో సరిచేయబడును. ఇందుకు సాక్ష్యము లాక్షణికులు మాత్రాసంపూర్ణములు కాని గణము లకు పూర్ణత్వము ఇచ్చుటగా చూపవచ్చును. ఉత్సాహలో ఆఖరు సూర్యగణమునకు బదులు ఒక గురువు. ఐనా సీసములోని చివరి సూ. గ. వలె అదీ కూడ ఒక మాత్ర అధికోచ్చారణము వలన సమమగును. రగడను గూర్చి చెప్పని విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో మధురకవిత్వముతో బాటు ప్రబంధములగూర్చి లక్షణము చెప్పుచు, 2× ఉత్సాహ=రగడ అని కేవలరగడను మాత్రము చెప్పినాడు.

కం॥ సరియగు నడి దేశుల చే
బరుపడి నుత్సాహ వృత్తి నస మగణముచే
విరుప్పగ వడి ప్రాసంబుల
నరుమగ రచియించు రగడ యగు దగవృత్తిన్. (4–40)

ఇది రగడ తుల్య (త్ర్యస్రగతి గల త్రిమాత్రికములగు) మాత్రికములుగల గణములు గలది. ఉత్సాహలో చివరిగణము (గురువు). ఒక మాత్ర ఇతర 7. సూ. గ. కన్న తక్కువగగా యనిపించును. కాని ఇచ్చట విన్నకోట పెద్దన లక్షణమును బట్టి దానిని కూడా త్రిమాత్రికము (8వగణము) గానే భావించి నట్లనుకొనవలెను. లేనిచో రగడ కుదరదు.

కాన ఇట్లు పాదాంత్యగణములలో మాత్రల తక్కువదనము లాక్షణికులచే సైతము పూర్ణ (పూర్ణగణతుల్యము)మైనట్లు భావింపబడుట వలన సీసమును సైతము పంచమాత్రికాగణయుతముగా అన్ని గణములను భావించి, ఖండగతిలో నడచు జానపద గీతముగా భావింపవలె. కన్నడమున నాగవర్మ దీనినే రఘటా (రగడ) భేదముగా చెప్పుట చూడనగును. 5 మాత్రల గణములారును, 3 మాత్రల గణములు రెండు కలిసి ఏర్పడిన పాదములు నాలిగింటిమీద ఒక ఆటగీతి (= ప్రాసగల ఆట వెలది)ని చెప్పిన సీసమగుననినాడు. రగడగా అతడు భావించుట, తుల్య మాత్రికా గణముల చేత నిర్మింపబడిన పద్యముగా సీసమును భావించుటయే. దీనిని బట్టి

(1) సీసము చివరి గణములు తక్కిన గణములతో సమానమని (రగడ లక్షణమిది. తుల్య కాలఖండములచే నిర్మితము.)

(2) గణవ్యవస్థ శాబ్దిక దృష్టితో చేయబడిన కృతకవ్యవస్థ అని

(3) తాళబద్ధరచనలు దేశిగణవ్యవస్థలో కొలువబడినవని భావింపవలెను. కాన సీసము జానపద గేయచ్ఛందో జన్యమైన పద్యమని పిండితార్థము.

## పాదముల సంఖ్య :

సీసమునకు పాదముల సంఖ్య పాదముల సంఖ్య సామాన్యముగా 4పాదములని, పైన ఎత్తుగీతి 4 పాదములని చెప్పబడును. ప్రతి అర్ధము పాదములను 8 భాగములను జేయును. ఆధునిక ముద్రణాలిపి విధానమున ఇట్లు యతి కారణముగా పాదము యొక్క రెండు భాగములు రెండు వరుసలలో ద్వితీయార్థము కొంచెము ఎడగల్గి వ్రాయబడుచుండుట కాంచనగును. అపుడు సీసము 8 పాదములుగా, ఎత్తు-

గీతి 4 పాదములుగా మొత్తము 12 పాదములు సమానముగా కన్పట్టును. గీతి పద్యమును రెండు పాదములను సీసము యొక్క ఒక్కొక్క పాదమును ఒక్కొక్క సంఖ్యలో వ్రాయవలెనను ప్రాచీన లేఖన విధానముగ (తాళపత్రములందు) [illegible] పద్యవిధి. ఐనాక దీనికి భిన్నమే కాదోలు విన్నకోట పెద్దన 6 పెద్ద (సమాన) పాదముల సీసములోనున్న సీసమును చూచి —

తన పాదంబులు నాలుగు
మొనసిన పైగీతి పాదములు రెండునుగా
నినుమూఁడై సీసమునకు
జను నడుగులు వ్రాలు పట్టు సరియున్నిటన్

కావ్యా. చూడా. (8-36)

'ఇనుమూఁడై' 2×3=6 పాదములు. పాదములు నాలుగు+గీతి అర్ధ మొక్క పదునగా= 6 పదములు (6 పాదములుగా)గా భావించి విన్నకోట పెద్దన వ్రాసినాడనవలె. సీసమే పెద్ద ఛందమునగా దీని పాదములు ఎత్తుగీతి గాక 4 కు బదులుగా అనేక సరిసంఖ్యలో పాదములు వాడుట ఆచారము. ఎన్ని పాదములు వాడినను చివర తిరిగి ఆ.వె. లేదా తేటగీతి వ్రాయబడును. దీనిని సీసమాలికయనియే పిలువబడును.

ద్వాదశ పదమగు మరియు, అష్టాదశపదమగు
గది సహితంబుగదా! వేది యగు సీసమాలిక
శ్రీదయితా నిలుపవలయు సీసపు నియతిన్[12]. అని సీస మాలికగా

చెప్పబడినది. ప్రాచీన కవులలో లేకున్నను ఈ విధానము అర్వాచీన కవులగు కంకంటి ప్రభృతుల కావ్యములలో కానవచ్చును. శ.సం. 997 (క్రీ.శ.1073) శాసనపద్యమంజరిలోని దీక్షాసి శాసనములో శ్రీశకు....అనే సీసంలో 8 పాదాలున్నవి. ఆ మీద ఆటవెలది వ్రాయబడినది. అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిలో 10 పద్యముల వరకు ఇట్టి బహుపాదయుత సీసమును వాడినాడు. 10, 12, 16, 22, 24 అని ఇట్లు పాదములు నియమరహితమై యుండుటను, 17 పాదముల పద్య మొక్కటి సేసము చెప్పుట యు (బేసి సంఖ్యలో) ఈ కావ్య మందలి విశేషము.

## సీస భేదములు

సీసము సమవిషమ భేదముచే ద్వి విధము. పాదమునకు 6 ఇం. + 2సూ. చొప్పున వ్రాసి పైన ఆటవెలది లేక తేటగీతి వ్రాసిన సమసీసము. 7 సూ. + 1 గురువు చొ॥న ఒక్కొక్క పాదమునకు ఇట్టి గణములు గల ఉత్సాహ పద్యమును వ్రాసి పైన ఆటవెలది లేదా తేటగీతి వ్రాసిన విషమ సీసమగును. ఉత్సాహములో పాద ద్వితీయాక్షర ప్రాస నియతము, యతి ఉన్నచే. సమమునందు పాద పాదమునకు అర్ధము - అర్ధమునకు యతి వేరుగా యుండును. యతి చేనప్పుడు ప్రాసయతి వాడు కొనవచ్చును. ద్వితీయాక్షర ప్రాసలేదు. ఇది సమ సీసము యొక్క సాధారణ యతి, ప్రాసయతి, ప్రాస నియమములు. ఇవి నిర్బంధములు కాక ఐచ్ఛికములు. వీనిని నిర్బంధమొనర్చుట వలన మరిన్ని సీసభేదము లేర్పడు చున్నవి.

సీస భేదములను చెప్పుటలో లాక్షణికులు ఒక క్రమమును పాటింపలేదు. కాలము జరుగుచున్న కొద్ది ప్రయోగములు అధికమై సీస భేదములధికమైనవందుమా అదియును లేదు. ప్రాచీనులు చెప్పిన భేదములు అర్వాచీనులు వదిలినారు. పేర్ల విషయమునసైన క్రమము లేక ఒకరు వాడిన పేరు వేరొకరు వేరొక్క లక్షణము నకు వాడినారు. రేచన ఏడు భేదములు చెప్పగా, అనంతుడు పది చెప్పినాడు. అప్ప కవి తిరిగి తగ్గించి ఏడు భేదములు చెప్పినాడు. అనంతుని సమప్రాససీసము అప్ప కవి వృత్తప్రాససీసమగును. అనంతుని అపకలి సీసము, అప్పకవి అపకలి వడి సీసమగును. ఇట్లు పరస్పర భిన్నములైన సీస భేదములు ఆంధ్ర ఛాందసికులు ఎవరికి తోచినట్లు వారు వ్రాసినారు. లక్ష్యగ్రంథములను సైతము పరిశీలించలేదు. కవులను లాక్షణికులు నిర్లక్ష్యము చేయగా, లాక్షణికుల లక్షణములను అర్వాచీన కవులు నిర్ల క్ష్యము చేసినారు. సీస గములలో ఆదికవి నన్నయ నియమ పూర్వక యతి, ప్రాస యతుల వాడుకతో రచన చేయుటచే తర్వాతి లాక్షణికులకు ఇవి భేదములుగా చూపుట అవశ్యమైనది. ఐనను వారు నన్నయ లక్ష్యములకు లక్షణములు వ్రాయక స్వతం త్రించి యథేచ్ఛగా భేదములు తెల్పినారు లక్ష్య లక్షణములు సైతము ఒక త్రాటిపై నడుపలేదు. ఈ భేదములలో అక్కిలి, అవకలి శబ్దములందు సామాన్యముగా కాన వచ్చు నామములు. ఈ శబ్దములు ఏ అర్థములలో ఉద్దేశింపబడినవో తెలియరాదు. లాక్షణికుల ప్రయోగములో ఈ శబ్దముల అర్థములు విభిన్నములైనవి. "రేచన లక్ష్యములను బట్టి చూడగా అక్కిలి యనగా ప్రథమాక్షర మైత్రియనియు, అవకలి యనగా ద్వితీయాక్షర మైత్రియనియు ఊహింప వీలగుచున్నది" అని డా॥ పాటిబండ

మాధవ శర్మగారు అభిప్రాయపడినారు[13]. తక్కిన లాక్షణికులు ఈ అర్థములో వాడలేదు.

యతి లేదా ప్రాసయతుల ఐచ్ఛికత కారణముగా సీస భేదములేర్పడు చున్నవని చెప్పబడినది. వృత్తములందు వలె ప్రాసను ఉంచు విధానము మరొక్క కారణము. గణముల వ్యవస్థను బట్టి సర్వలఘు సీసాదికము ఏర్పడుట ఇంకొక కారణమగుచున్నది. సర్వసాధారణముగా ప్రయుక్తమగునది సమసీసము. దానికున్న ప్రయోగము ఇతర భేదములకు లేదు. దాని ప్రయోగ బాహుళ్యమును గాంచి అప్ప కవి —

"సప్త విధము లివియు శబ్ద శాసనుండు
పంచమామ్నాయ ఫక్కిలోఁ బల్కెగాని
కడమ కవులాయి సీసముల్ విడిచిపెట్టి
చెలగి సమసీస పద్యమే చెప్పినారు[14]. అని పేర్కొనినాడు. కడమ

కవులు వదలి వేసినారన్నది సాధారణముగా చెప్పినమాట. పై భేదములో కొన్నింటిని కవులు వాడినారు. కాని అవి క్వాచిత్కములు.




అని అనేక భేదములుగా విభజింపబడినది.

1) పంబులూరు శాసనమందు

1వ పా. 2 దళములు }
4వ పా. 2 దళములు } యతి వేయు-బడగా
2వ పా. 2 దళములు }
3వ పా. 2 దళములు } ప్రాసయతి వేయుబడగా
4వ పా. 1వ దళము లుప్తము.

2) ధర్మవరం శాసనమందు

1వ పా. 1వ దళము లుప్తము
తక్కిన 7 దళములు }
ఆటవెలది నాలుగు పా. } ప్రాసయతి వాడబడెను.

బహుశ లుప్త భాగమునందు కూడా (1 పా. 1ద,) ప్రాసయతియే యుండియుండును అప్పుడది అపకలి ప్రాస సీసము (అనంతునిది) లేదా అపకలి పడిసీసము (అప్పకవి ప్రకారము) అనవచ్చును. కవిజనాశ్రయ కావ్యాలంకార, చూడామణులు దీనిని అపకలి సీసమనినవి.

ఇక కావ్యస్థములని చెప్పబడిన

3) పద్మకవి జినేంద్ర పురాణములోని సీసములో శ్లేషఘటన వలన నియతముగా ఎనిమిది దళములలో యతి, ప్రాసయతి వరుసగా వేయబడినది. కాని తే.గీ. 1,3,4 పాదములలో యతి, 2వ పాదములో ప్రాసయతి పాటింపబడినది.

4) సర్వదేవుని విరాట పర్వములోని సీసమున[15].

2వ పా. 1వ దళం + 3వ పా. 2 దళము }
4వ పా. 1వ దళం + తే.గీ. 2,3,4 పాదములు } ప్రాసయతి

తక్కినచోట్ల యతి వాడబడినది. దీనిని బట్టి నన్నయయే సీసమునందు తనకు పూర్వములేని ఈ నియమమును తన "అక్షర రమ్యత" కొఱకు పెట్టినాడని భావింపవచ్చును.

నన్నయ పాటించిన నియమమును డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు చక్కగా వివరించినారు[16].

| సీసము | - పై గీతి |
|---|---|
| 1. యతి | యతి |
| 2. యతి | ప్రాసయతి |
| 3. యతి | యతి<br>ప్రాసయతి |

| | | |
|---|---|---|
| 4. | యతి | ప్రాసయతి<br>యతి |
| 5. | ప్రాసయతి | యతి |
| 6. | ప్రాసయతి | ప్రాసయతి |
| 7. | ప్రాసయతి | యతి<br>ప్రాసయతి |
| 8. | ప్రాసయతి | ప్రాసయతి<br>-యతి |
| 9. | యతి<br>ప్రాసయతి | యతి |
| 10. | యతి<br>-ప్రాసయతి | ప్రాసయతి |
| 11. | యతి<br>-ప్రాసయతి | ప్రాసయతి |
| 12. | యతి<br>ప్రాసయతి | ప్రాసయతి<br>-యతి |
| 13. | ప్రాసయతి<br>-యతి | యతి |
| 14. | ప్రాసయతి<br>-యతి | ప్రాసయతి |
| 15. | ప్రాసయతి<br>-యతి | యతి<br>-ప్రాసయతి |
| 16. | ప్రాసయతి<br>-యతి | ప్రాసయతి<br>-యతి |

అడ్డుగీత వేసి ఉభయ విధముల చూపినచోట దేసి దళములందు మొదటిది, సరి దళములందు రెండవదిగా భావించవలయును. 12. 14, 15 భేదములు నన్నయ వాడ లేదు. యతి ప్రాసయతులు ఉభయము గల్గినచోట్ల ఏదేని ఒకదానిని ప్రసక్తవిషయాను సారము గ్రహింపకుండుటచే గిడుగువారి నన్నయ'సీస విభాగ వివేకము' చెడిపోయిన

వ సి వా॥ పాటించిన మాధవశర్మగారు భావించిరి. అంతేగాక కొన్ని సీసములందు పై సంపాదకుననుసరించి సందేహాస్పదములైన పద్యములు కొన్ని ఉన్నవి[17]. కొన్ని పాఠములు చక్కగా లేవు. పాఠాంతరములు స్వీకరించబడలేదు. కొన్ని సవరణలు చేయబడియున్నవి. వృత్తములందు వలె ప్రాసయును సీసమున పాటించుటను గిడుగు వారు స్వీకరించి భేదముగా చెప్పరైరి. మిగిలిన విధానము మాత్రము వచ్చినయెడ అక్షర రమ్యతకు సరిపడునట్లు చక్కగా అమరి గిడుగువారి పరిశోధనా పాటవమునకు సాక్ష్యమైనది.

మార్గి విధానములోని నియమములను అనియతమైన దేశి విధానములో నుంచి దేశి మార్గ ఛందముల అనుసంధానముద్వారా సమన్వయమొనర్ప యత్నించిన నన్నయ యత్నము, అతని మార్గము ఎట్టిదో కొంతవరకు లక్షితమై తరువాత కవులచే ఉపేక్షితమైనది. తిరిగి అనుప్రాస ప్రియులైన సోమనచే ఆదరించబడి ప్రబంధకవుల అనంత ప్రబంధ కవులు చిత్ర కవిత్వప్రీతికి తోడై విస్తృత ప్రయోగములోనికి వచ్చినది.

తెలుగులో లాక్షణికులు పేర్కొనిన యతి భేదములలో ముఖ్యములైన వానిని లక్ష్యలక్షణయుతముగా పరిశీలింతము.

1. **సమసీసము** : యతిగాని ప్రాసయతిగాని ఐచ్ఛికముగా వేసిన ఉభయ దళములందు పై గీతియందు ఇష్టమువచ్చిన విధముగా వాడుకొనుట సమసీస లక్షణము.

నిజమునకు దీనిని భేదముగా పరిగణింపరాదు. యతి/ప్రాసయతి/ప్రాస లను గణవిన్యాసమునుబట్టి ముందు ముందు చెప్పబోవు సీసములన్నియు దీని వికృతులే. ఇది ప్రకృతి, మాతృక కాదగిన దీనిని భేదములలో చెప్పుటకంటె చెప్పకుండుటయే మంచిది.

తెలుగు సాహిత్యములోని వేలాది సీసములు ఈ సాధారణ నియమము కల సమ సీసములే.

సీ॥ పత్రజా తరంగిణీ * వర్త వికస్వర మాల్య
కస్తూరికాషాయ గం * ధము వహించి
ప్రత్యూష పవనాంకు రములు పైకొను వేళ
వాసనస్తుతి పర * త్వమున లేచి

సచ్ఛాత్రుడగుచు ని * చ్చలు నేగి నయ్యేట
నఘమర్షణ స్నాన * మాచరించి
సాంధ్య కృత్యము దీర్చి * సావిత్రి జపియించి
సైకతస్థలి గర్మ * సాక్షి కెఱఁగి

తే॥ గీ॥ ఫల సమిత్కుశ కుసుమాది,, బహుపదార్థ
తతియును నుదికిన మడుగు ధోవతులు గొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చునింటికి బ్రజ తన్ను మెచ్చిచూడ. —మను చ. I-54

ప్రాసయతి, యతులు ఇచ్చవచ్చిన రీతి వాడబడినవి.

## వడిని బట్టి యేర్పడు సీస భేదములు

**2. వడిసీసము :** పాదము ఉభయార్ధములకొకే అక్షరము యతిగా వాడబడిన వడిసీసము. ఈ నియమము ఎత్తుగీతియందు సైతముండును. అనగా సీసము నాలుగు పాదములు + ఎత్తుగీతి రెండు పాదములు (పూర్వార్ధమొక్క యక్షరము, ఉత్తరార్ధమొక యక్షరము) మొత్తము ఆరు పాదములకు ఆరు అక్షరములు యతిగా మాత్రము వేయవలెను.

సీ॥ కరుణా సముద్రుండు * గజరాజ వరదుండు
గర్వితాసుర శిరః ఖండనుండు (క)
విహగేంద్ర వాహనుండు * విబుధ దేవేంద్ర వంద్యుండు
విశ్వరు క్షిచణ * వీక్షణుండు (వి)
రతిరాజ జనకుండు * రఘువంశ తిలకుండు
రణ బలోదగ్రుండు * రమ్యగుణుడు (ర)

సీ॥ నిజమహీ మండల - ప్రజ ప్రీతి చెందుచు (జ)

బిరమండలం - ధరణిపతుల (ర)

నదిమి కప్పంబుల - ముదముతో గొనుచును (ద)

బలిమి వీయని భూమి - పలయపతుల (ల)

సక్కడగించుచు - దిక్కుల దనయాజ్ఞ (క్క)

వెలిగించును విప్ర - కులమునెల్ల (ల)

ప్రోచుచు శరణన్న - గాచుచు భీతుల (చ)

నగ్ర జన్ములమన - నుగ్రహమున (గ్ర)

ఆ. వె॥ జాయతర మహోగ్ర - హారంబు లిచ్చుచు (ర)

దేవభోగముల మ - హా విభూతి (వ)

దనర జేయు చిట్లు - మనుమార్గుడగు విష్ణు (న)

వర్ధనుండు వంశ - వర్ధనుండు. (ర్ధ)

—ఆం. మ. భా. ఆది. I-7

**సర్వతః ప్రాస సీసములు** : నియతముగా అన్ని పాదములందు అన్ని అర్ధములందు పై గీతితో సహా ఒకే అక్షరము ప్రాసయతిగావాడిన సర్వతః ప్రాససీసము అగును. యతి నిషేధము.

సీ॥ ఆరక్య ఘోర్కజం బీరకరోర్కలమం

దార చందనసారి కేరసింధు

ఆ॥ పాదముల ప్రాస :

సీ॥ భామిని చేనున్న — పట్టు తోరము జూచి
ప్రల్లదంబున ద్రెంచి — పారవైచి
యామిని ద్రోహ ప — త్న్యంతమై తనుబట్టి
యతి దరిద్రుని జేయ — నార్తినొంది
స్వామి పెర్వడిపోయి — పుర పుర బొక్కుచు
బుండరీ కాక్ష మో — పువనపంద
స్వామి నాయపరాధ — శతసహస్రంబుల
సైరింపవే కృపా — జలధి యనుచు

గీ॥ ప్రేమునించు కౌండిన్యుని — భీతి బాపి
వృషుల సౌఖ్యంబు లొసగిగాం — భీర్యమమర
బాముల పై, బహ్వళించిన — ప్రభుడవనిన
ప్రాసపీసంబు విలసిల్లు — పద్మనాభ. ధం. వ. 3-27

7. అక్కిలి ప్రాస సీసము :- సీసపద్యములోని నాలుగు పాదములలోని ఎనిమిది ఖండములలో, పై గీతి నాలుగు పాదములలో మొత్తము 12 చోట్ల ద్వితీయాక్షర ప్రాస, వృత్తములలోవలె చెల్లించిన అది అక్కిలి ప్రాస సీసమగును.

సీ॥ ఉరగ తల్పుని గాని - యుల్లంబులో నిల్ప
శరధి తల్పుని గాని - సన్నుతింప
మురసంహారుని గాని - మ్రొక్కులగై సేయ
నరమృగేంద్రుల గాని - నమ్మి కొలువ

కలకంఠి యితడువో — కల కలములనుంచు
—
నుడివోని శుభమూర్తి — నుండు పెద్ద
లలితాంగి యితడువో — యలఘుతేజమున
—
విశ్వంబు వెలిగించు — విశ్వనాథు

తే॥ డబ్ధి సంభవ యితడువో హాలహాలపు
విషము పుక్కిట దాల్చిన పెగ్గలీడు
పాటల గంధి యితడువో భక్తతతికి
శాశ్వతానంద కరుడగు నీశ్వరుండు. -కాశీఖం. 5-116

ఇట్టిదే ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమున భిన్న పదావృత్తిలో కలికి-జెలువ - వెలది - బొలతి యన్న పదములతో లకార ప్రాస పాటింపబడినది[19].

యతి, ప్రాసయతి, ప్రాసలతో నేవలము పై భేదములే గాక, అర్ధముల (దళముల) మార్పిడిలో నైతము తిరిగి అనేక భేదములు సృష్టింపవచ్చును. ప్రాసాక్షరము వృత్తములోవలె నాల్గు పాదములే పాటించిన వృత్తప్రాసము గాగా ఎనిమిది అర్ధములందు పాటించబడిన పద్యములున్నవి. (ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము పు. 37). అట్లే గీతిలో సరిపాదములకు ప్రాస, ప్రాస యతి కేవల సీసపాదములందే రెండేసి అర్ధములకు 4×2=8 దళములకు 8 చోట్ల పాదమునకొక యక్షరము పాటించుట కలదు. (ప్ర. వేం. వి విలాసము పు. 22 పం. 12). దీనిని గణపవరపు వేంకటకవి అక్కిలిపడి యనినాడు. ఈ పేరు యతి సంబంధమైనది.

పాద పాదమునకు, దళ దళమునకు, గీతి వదలివేసి, గీతితో కల్పి, యుక్పాదములతో, అయుక్పాదములతో ప్రాసయతి - యతి సాంకర్యములతో ఇట్లెన్నియేని భేదములు చూపవచ్చును. లాక్షణికులు నైతము లక్ష్యములు లేని సీస భేదములెన్నియో చూపినారు. పొత్తని రమణకవి సర్వపది, అర్ధసమ, గీతరహిత చతుష్పాద్విస సీసము వంటి భేదములను ఇతరులు చెప్పనివి అదనముగా పేర్కొని నాడు. కాని వీనికి లక్ష్యములు మాత్రము లేవు.

యతి, ప్రాస, ప్రాసయతులతో భేదము సృష్టించినది గణించినచో అను ప్రాస, అంత్యప్రాస చమత్కృతిచే నైతము సిద్ధమగు భేదములు గ్రహించవల

గీ॥ సమిత సారస సముదరీవరి
మధుర సాసార మధురసా మధురసార
భృంగసంగీత భంగితరంగి వాఖి
లాగమంబు దలిర్చు పై రాగమంబు -ప్ర. వేం. వి - ప. 45

ఇచ్చట పాదాంత్య గణములు రెండు సూర్యగణములలో ఒక్కొక్క గణము పిదప అంత్యప్రాసరాదు. ఇవి చిన్న గణములగుటయేగాక సూర్యగణముల కొక్కటికి అంత్యప్రాస యుంచినచో లయ చెడుటకు కారణములగును. గేయగీతిలో ఈ రెండు సూర్యగణముల సమాహారము సాముదాయికముగా దీర్ఘీకరింపబడి ఇతర దళములతో సమానకాల ఖండముగ పాడబడును. ఈ విధానము "ఒకపాయ ననపాయ" అన్న రామరాజ భూషణుని మనుచరిత్ర ప్రఖ్యాత పద్యముతో ప్రారంభ మైనదనవచ్చును.

**2. పాదప్రతి - దళాంత్య ప్రాస సీసము :-** రెండు గణముల కొక్కమారు అంత్యప్రాస పాదములో పాటించబడును. మొత్తము నాలుగుచోట్ల ఒకే అంత్యప్రాస అక్షరము కానవగును.

సీ॥ "లలనాజ నాపాంగ వలనావ సదనంగ
తులనాభి కాభంగ దోఃప్రసంగ
మలసా నిలవిలోల దళసానవ రసాల
ఫలసాదర శుకాలపన విశాల
మలసీ గరుదనీ కమలినీకృత ఘనీక
మలినీ సుఖిత కోకకుల వధూక
మతికాంత సలతాంత లతికాంత రనితాంత
రతికాంత రణతాంత సుతనుకాంత

తే॥ [illegible]
[illegible]
[illegible]
భాసురము వొల్పు సుభవాసరంబు"  హరచరిత్ర I - 126

పైన సుబ్రహ్మణ్యకవి తన 'ఛందో నిరంకుశము'న కల్పిత [illegible] సీసమును పేరుతో నొక సీసము వ్రాసినాడు. ఆ సీసములో ప్రతిపాదార్ధ ద్వితీయదళమున గణములు భిన్న లక్షణము గల్గియున్నవి. అతడు లక్షణములో ఏమియు చెప్పలేదు. లక్ష్యమును నిశితముగా పరిశీలించినపుడు దానిలో ప్రతిదళమునకు పైపనే అంత్య ప్రాస యున్నది. పైదానిలోపలి నాల్గుచోట్ల గాక, అర్ధమునకొక్క అంత్యప్రాస యున్నది.

శ్రీ పార్వతీలోల శ్రితజనపాల
తాపస సురభూజ తపనసుతేజ
తరుణేందు శిఖనేత్ర ధీరనిభగాత్ర
కరకమలోదార గరభారహార
గజదైత్య మదభంగ కరుణాంతరంగ
వృజిన తమోనాశ విజిత రతీశ
హేమ భూధరచాప మృదుతరాలాప
కోమల హితపాద కుమతివభేద
దివిజలోక నిధాన దేదీప్యమాన
కవి మనోరథ పోషక కంకణదక్ష
గణ మనోనుతవేష గంగ విభూష
సారరాజిత శైల సంచారలోల

ఇట్టివే పోతన "ఇందీవరశ్యాము - నందితసుత్రాము

కరుణాలవాలు - భాసురకపోలు" (10-2-979)

యని (ఎత్తుగీతితో సహా) వ్రాసినాడు.

3. పాద ఉభయార్థాంత్య ప్రాససీసము :-

సీ॥ సుందరి పొక్కిలి సుమ సరమ్మును గెల్చు
రమణీకురులు కప్పువాల గెల్చు
భామకన్నులు మహోత్పలముల నిరసించు
జెలిగోరు తారకముల హసించు
మగువ చన్దోయి మన్మథ ఫలంబుల గేరు
గాంతమై పద్మరాగముల మీఱు
కన్నెనగపు సదాకాశాకృతిని గొట్టు
నింతి పల్కెన్న గోయిలల మెట్టు
గీ॥ లలన కేల్సాటి కోమలపోలముల సాటి
కలికి ముఖరీతి కామినీగణము భాతి
వనిత చూపుల రహి నాటి వాతెఱ నహి
తెఱవనడుము సరణి దోణి పిఱుదుకరణి

(— ప్రబం. వేం. వి. విలాసము. 319 ప.)

సీసపాదములోని ఉభయార్థములకు అంత్యప్రాసతోబాటు ఎత్తుగీతిలో యతి పూర్వార్థమునకు, యత్యనంతరార్థమునకు కల్పి అంత్యప్రాస పాటింపబడుట విశేషము.

ఇట్టిదే పోతన“ వరవర వింద సుందర నేత్రయుగా :

సలలిత శ్రీవత్స కలితవక్షః” — యని వ్రాసినాడు.

ఎత్తుగీతిలో మాత్రము పాటింపలేదు.

**4. సకలార్థాంత్య ప్రాససీసము** :- మూడవ దానిలో ఏ పాదము నకా పాదము విడి అక్షరములతో అంత్యప్రాస ఘటింపగా, దీనిలో అన్ని అర్థములకు (8 అర్థములకు) ఒకే అక్షరములతో అంత్యప్రాస.

సీ॥ :- “ కన్నెపాదములజాగన్న మేటికినైన
బాల జంఘలు వరశాలికైన
బాలదోడి జఘనంబు భూరివేదికినైన
బొలతి పొక్కిలి సరసులకునైన
సతికౌను సర్వజ్ఞమతికైన నతివచ *
స్తన ప్రసన్నాదిత్య కవులకైన
రమణి నెమ్మోము పూర్ణకళాసింధికినైన
వనిత వేనలి ఫణిస్వామికైన — వసుచరిత్ర - II. 51. ప.

తృతీయ పాద పూర్వ దళమున మాత్రము * వద్ద తప్పినది.

**5. పాదాంత్య ప్రాస సీసము** - సీసము నాలుగు పాదములందు చివర అంత్యప్రాస ఘటించుట, ఈ అంత్యప్రాసపై గీతి నాలుగు పాదములంతమందు కూడ పాటింపబడుట విశేషము. మొదటి విధము ఆంధ్రసాహిత్యమున వర్ణనావసరమున అనేకులగు కవులు వాడగా రెండవ విధము వైచిత్ర్యమై యున్నది.

సీ॥ “ మీరినరాజా బల్మినడంప లోనైన
నభినవస్థితి పెంపనతడె నేర్చు
దేరి చూచిన దీప్రదీప్తి జూప జనాళి
కక్షి సాఫల్య మొనతడె నేర్చు

సింఘలింక ప్రతాపశిఖి ఒూన విశ్రాదే
తాంబులనలి నింప నతడె నేర్చు

సమి దుర్ముఖుని తేజము మలంప వాదంబు
లంటిన నెలయింప నతడె నేర్చు

తే ॥ మండలము దాల్చి హరిదెస మైత్రి నిలుప
నలఘు సన్మార్గ గతి దెల్ప నతడె నేర్చు
నా జగద్బంధునకు వసురాజనామ
మిడిన చతురాస్య కౌశలందెన్నరిది." — వసుచరిత్ర. **I.118**

పద్మై కావృతి ('వారు' అనుపదము)తో నన్నయవొక్క సీసము కానచ్చుచున్నది.
— అరణ్య. II. 241.

**6.** ప్రత్యేకార్థాంత్య ప్రాస సీసము :- నాలుగు పాదముల యొక్క పూర్వార్థములందు ఒకే అక్షరము అంత్యప్రాస. నాలుగు పాదముల యొక్క ఉత్తరార్థములందు ఒకే అక్షరము అంత్యప్రాస (వెరొక అక్షరము) ఉండును.

సీ॥ :- "పలిదీర్ఘ బాహువుల్ పరికించు పరికించి
జలదంతి హస్తముల్ దెలియజూచు

విధుని కన్నుల తెల్చి వీక్షించు వీక్షించి
తెలి దమ్మిరేకుల తెలివి జూచు

జెలుక ని మైచాయ దిలకించు దిలకించి
నీలోత్పలంబుల నీటు జూచు

బ్రాణేశు గళరేఖ భావించు భావించి
శంఖ సౌభాగ్యంబు సారె జూచు

తే॥ :- సఖిః పరిహాస చంద్రికలనరయు నరసి
సరసిజ మరాళ ఖగ గరుచ్ఛాయ జూచు
నతని యుపయమములకు జోకొనాకొనా
యను తలంపున గొలనిలో నపని కన్య ?

— ఉత్తర రామాయణము. (కంకంటిపాపరాజు)ఆ. 93 ప.

ఇట్టి సీసములు భిన్నభిన్న అంత్యప్రాసల ఉపయోగముచేత ఎన్నియో భేదములు చూపవచ్చును.

కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణమున అనేక విధముల ఇట్టి అంత్యప్రాసములు వాడినాడు. అతని సీసములలో నూటికి పదియైన సాధారణ సీసములు కానరావు. ఇవన్నియును పదముల ఆవృత్తిలో సంబంధింపబడిన అను ప్రాసలే. ప్రాస/ప్రాసయతి యన్నది పదముల పునరావృత్తి విధానమునుండి పుట్టినది అని యిది వరలో నిరూపించనైనది. అప్పకవీయ సీస భేదములలో పదముల ఆవృత్తియే చూపబడుట కాంచనగును[20].

సీసములను ప్రాస, ప్రాసయతి, యతి, అంత్య ప్రాసలద్వారా లాక్షణికులు భేదములను భావించినట్లే, గణములతోడి కూడ భేదములను భావించినారు. అదీ "సర్వ లఘు సీసము" న్నది. దానిని రేచన తప్ప అందరు లాక్షణికులు చెప్పినారు. అనగా గణములతోడి వైవిధ్యమును సాధించుట అన్నది రేచనకు అర్వాచీనమని భావింపవలయును. దేశ్య చ్ఛందములు గణస్వేచ్ఛ గలిగి, త్ర్యక్షర గణ నిర్మిత మార్గి వృత్తముల వలెగాక, తమకు భావానుకూల్యమును బట్టి పద్య నిర్మాణములో సహకరించును. అనర్థ దోషముచే పద విచ్ఛేదమునకు సాధ్యపడని మార్గి ఛందములందు వలె గాక, గణమునకొక్క పదమువాడి, గణములను కావలసిన విధముగా వాడుకొని వైవిధ్యములను సాధించవచ్చునని లాక్షణికులు, కవులును భావించిరన్నమాట.

సీసములనందలి నడకలు ప్రసిద్ధములై, గణానుగత పద విచ్ఛేదము లేకున్నను లయ సాధించునవే. యతి లేదా ప్రాసయతి దీనికి మరింత తోడగును. కాని అర్థము చెడిపోవును.

"పవమాన మానవ స్తవమాన వైరవ
చ్యవమాన రజముపై నంట దీవుడు" —వసు. 3.117ప.

అన్నపుడు గతి గణానుసారియై యొప్పినది.

అదే పద్యము చతుర్థపాదము

"సలయాహా — తలదాకి - సలయాగ - మలయాగ
నిలయాని - లునకార్ప - దెలుపదలచు" అన్నపుడు అదే సీసపద్యములో తల తాకుటలు, సలయాగమములు, మలయాగమములన్న వికృతార్థము లెన్నియైన పుట్టును. జోసీ అర్థ వశముననే విరిచి చదువుదమా, ఇంతవఱకు మూడు పాదములు సీసము చదివిన లయ మనసులో అప్పటికే ముద్రితమైనది గదా! గతపాద లయను వర్తమాన పాదలయ అనుసరించుట మనోధర్మమే గదా! అన్ని పాదములందును లయ లేకుండునట్లు, అనగా గణమున కొక్క పాదము వ్రాయుట నియమమే పెట్టుకొనుటకు ఏ కవీ అంగీకరింపడు.

ఈ విషయమున వ్యతిరేకతను తెల్పుటకు ఏ లాక్షణికుడును, తెలుగు కవీంద్రుడును హర్షించడు. దానికి సాక్ష్యము ఇంద్రగణము కాకున్నను "నలల"ను సర్వలఘు సీసమున వాడుటయే కారణము. అనగా తమ సీసములను ఖండగతి 5 మాత్రల గణముగా "పంచమాత్రికా కాల ఖండము"గా గుర్తించుటయే. గణముల దృష్టితో "నలల" లక్షణ భిన్నమని, "నల"తో మాత్రమే సర్వలఘు సీసము వ్రాసిన వారు లేకపోలేదు. వారు సీసమును ఖండగతిలో నడుచు పద్యముగా గుర్తించలేదన్న మాట. తెలుగు కావ్యకవులలో ఆద్యుడును, వాగను శాసనుడను అగు నన్నయ కవీంద్రుడు అక్షర రమ్యతకై సీసమున ఇన్ని భేదములు సృష్టించినను గణమునకొక్క పదమో, దళము తర్వాత విచ్ఛేదమో, ఉభయార్థముల తుదల విచ్ఛేదమో, పాదోల్లంఘనమొనర్పని పాదాంత విచ్ఛేదమో పాటించు నియమము పెట్టుకొనడయ్యెను. ఆయన సీసములలో గతి స్వల్పముగ తోచును. ఈ నియమము లేవియు లేని తిక్కన సీసము నడక మర్మములను తెలుగువారికి తెలియపరిచినాడు. "ఎవ్వాని వాకిట నిభమద పంకంబు" వంటి ఎత్తుగడలు తర్వాతి కవులకు సీసపు నడకలెన్నిటికో మాతృకలైనవి.

**సర్వలఘు సీసము :-**

సీసములో రావలసిన ఇంద్రగణములలో ఒక్క "నల" మాత్రము సర్వలఘు గణము. సూర్యగణములలో "న" గణము సర్వలఘు గణము. వీనిని

మాత్రమే వాడి సీసము వ్రాయుట సర్వలఘు సీసమగును. ఐతే సీసము ఇంద్ర గణోపేతమే యైనను, ఇంద్రగణములలో 'భ-న'లు రెండుచతుర్మాత్రికము లైనను సీసము నడక ఖండగతిలో ప్రసిద్ధము గనుక అన్నిలఘువుల గణములున్నపుడు ఇంద్రగణము స్థానమున "నలల" వాడవలయునన్న నియమము యేర్పడినది. దీనిని బట్టి –

1. ఇంద్ర గణములు పంచమాత్రికములని
2. సీసము పంచమాత్రికమగు ఖండగతిలో నడుచు ఛందమని
3. దేశిగణ వ్యవస్థ మాత్రా సమక గేయ ఛ్ఛందము నుండి పుట్టిన వ్యవస్థయని
4. నడకగల పద్యములలో మాత్రలతో లెక్కించవలయునని
5. అక్షర సమక గణములలో వలెగాక దేశి ఛ్ఛందములలో గణములను అవసర మైతే మాత్రలతో మార్చుకోవచ్చునని.

ప్రాచీనాంధ్ర కవి లాక్షణికులు భావించినారనుటలో విప్రతి పత్తి ఉండబోదు.

పంచలఘు గణ "నలల" యుతముగా - (సర్వ లఘు సీసములు మొదటగా) చెప్పినవాడు అనంతుడు.

అతని లక్షణము అస్పష్టముగా నున్నది.

కం॥ సర్వలఘు సీసమునకును
ఖర్వాంఘ్రుల నడుమ నింద్ర గణములు మూడై
నార్వంచ లఘు గణంబులు
నుర్వీధర త్రిలఘు యుగముతోక గీతి యుపన్"

—ఛందోదర్పణము. 3-37

లక్షణము గణ విధానమునకు సరిపోయినను ఆతడు గణములనట్లు ఏల చెప్పెనో తెలియ రాదు. అతని లక్షణమును అన్వయము చేసుకొనిన ఇంద్రగణములు మూడు + ఆరు అంచ గణములు (సూ. గ.) + త్రిలఘు యుగము పిదప గీతి.

3×ఇం. గ. + 6×సూ.గ. + 2×త్రిలఘువులు.

ఇంద్ర గణములనగా అతని దృష్టిలో "నల" మాత్రమే.

3 × నల + 7 × న + 2 × 3ల
3 × 4 + 6 × 3 + 2 × 3
12 + 18 + 6
= 36 లఘువులు వరుసగా అన్న అర్థము వచ్చును.

నలల్లు × 6గ. + 2 × సూ.గ

5 × 6 + 2 × 3 = 30+6

= 36 లఘువులగును. కాని అతడిట్లేల చెప్పలేదో! ఇది ఋజుమార్గము. ఇంద్రగణములనాతడు "నల" అని భావించుటయే కారణము కావచ్చును. దానితో లఘువుల సంఖ్య కుదరక విపరీతముగా చెప్పి, సంఖ్య మొత్తము మీద సమానము కావించినాడు. అతని లక్ష్యమున మాత్రము "నలల" గణములు ఆరు మీద "న"లు రెండున్నవి. ఇక అనంతుడు "ఒక గీతి తుదన్" అన్నాడేగాని, గీతిలో సైతము 'నల, న' ల ప్రయోగము చెప్పడయ్యెను. లక్ష్య పద్యమందు సైతము పాటింప లేదు. దీనినిబట్టి ఈ నియమము తర్వాతి కాలమున అభివృద్ధి చెందినదనవలె. అనంతుడు అట్లు చెప్పుటలో ఔచిత్యమున్నది. సీసపు నడక పంచమాత్రిక గణయుతము. గీతి అట్లుండదు. వ్యస్త ప్రయోగమునందు గీతి సూర్యగణముల బాహుళ్యము (20 గణముల పద్యములగు ఆటవెలదిలో 16 సూ. గణములు, తేటగీతిలో 12 సూ. గణములుండును) గల పద్యముగ వ్రాయబడుట చూడనగును. ఇట్టి దానిలో అతడు సర్వ లఘుత్వము అంగీకరింపడయ్యెను.

దీనిని అప్పకవి స్పష్టముగా చెప్పినాడు.

"షట్త్రింశల్లఘువులు, త్రిమహేశ విరామము[21]" 36 లఘువులు, 10మీద (మహేశ=11 అని) యతి యని చెప్పుటచే 2 పంచ లఘు గణములన్నట్లయినది. ఈతడును పైగీతి సర్వలఘుకముగా భావింపడయ్యె. ఈతనికి పూర్వకాలికుడైన పోతన్న సర్వలఘు సీసమును గీతితోసహా సత్యలఘు ప్రయుక్తముగ వ్రాసినాడు. (గీతిలో మాత్రము నలల వాడక "నల వాడినాడు)

సీ॥ "నవవికచ సరసిరుహ నయనయుగ నిజచరణ
గగనచర నదినిఖిల నిగమ వినుత
జలధిసుత కుచకలశ లలితమృగ మదరుచిర
పరిమళిత నిజహృదయ ధరణిభరణ
ద్రుహిణముఖ సురనికర విహితనుతి కలితగుణ
కటిఘటిత రుచిరతర కనకవసన
భుజగరిపు వరగమన రజతగిరి పతివినుత
సతతధృత జపనియమ సరణిచరిత

సూ. ఇం. ఇం. సూ. సూ.
న నల నల న న
తే॥ గీ॥ "నసయ సుధసపు నగినిసి నవెను కనెచి

సూ. సూ. సూ. ఇం. ఇం.
న న న నల నల
ఆ. వె. "ననయ పుధసు పునగి నిసినపె నుకనెచి

తర్వాత రెండవ పాదమున (5 సూ. గణములవద్ద) గాని తెలియరాదు.

కవిత్రయ భారతము నాటినుండియు సీసము బహుళ ప్రయోజన కారిమై, బహుళ ప్రయుక్తమై వెలసినది. ఆదిలో ఇది కథనము, వర్ణనమన్న శ్రవ్యకావ్య లక్షణోభయమునకు ఉపయోగమైనది. నన్నయ వర్ణమునకన్న కథనమునకు ఎక్కువ ప్రాముఖ్యము సీసమునకిచ్చెను. కాని తిక్కన దీనిని కథమునకన్న వర్ణనాఛందముగా భౌతిక స్థితిని గుర్తించి వాడినాడు. తిక్కన్న విరాటమునందలి ధర్మజ వర్ణనమందులకుదాహరణములు. కాని కాలక్రమములో సీసము వర్ణనాఛందమై పోయినది. వర్ణితాంశము యొక్క గుణములను, స్వరూపమును లేక భావ పరంపరను నాలుగు ఖండములుగా నాలుగు పాదములందు చెప్పి, పై గీతిలో వానికి సమన్వయ పరచుట అన్నది నిర్ధారితమైనది.

గణములను పంచమాత్రికములను నిర్దుష్టముగా పేర్చుచు నాలుగు విధములగు గుణగణము ప్రారంభములో చేయబడును. ఇట్టివానిలో పాదము ఏ పదముచేనైన ప్రారంభించినచో అదే పదము అక్కడే చేర్చి వ్రాసే ఆచారము తెలుగునాట ప్రసిద్ధమై పోయినది. ఇట్టివానిని "ఎత్తుగడ" అని అందురు. ధర్మరాజు వర్ణనావసరమున "ఎవ్వానివాకి...." 'ఎవ్వాని' యన్న ఎత్తుగడ సిద్ధము చేసుకొనబడినది. అది తర్వాతి కవులకు సీసరచనా మార్గమును చూపినది. ఇట్టివానిలో ఎత్తుగడ గణము నియతమగును. పాదము ఆద్యంతము ఒకే గణముచే నడచుట అన్నది ఒక్క సర్వలఘు సీసమున తప్ప తెలుగున ఏ కావ్యలక్షణ గ్రంథములందు కానరాదు. భిన్న గణమిశ్రణమే లయబోధకమగునని తలంచవచ్చును. దీనికి సర్వలఘు సీసక్వాచిత్క ప్రయోగమే సాక్ష్యము. ఇట్టియెడల 'లయ' గల సీసములను, తద్గణసానుకులతను ఇచ్చట దిఙ్మాత్రముగ ప్రదర్శింపబడుచున్నది.

ముందుగా కథన సీసము :-

సీ॥ "ధృతరాష్ట్రి సఖుడైన యతిరథుండను సూతు
డెలెపలు దానును నలి విహాతి
గంగలో జలకేళి సంగతుండై యుండి
తుంగతరంగాను షంగవశత
జనుదెంచు మంజూషగని కడువేడుక
దన పరిజనముల బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తి మొప్ప నేకతమున
నప్పెట్టె దెరచి తానప్పుడందు

ఆ. పిసుత హేమ కవచ గనకకుండలధరు
నసమమాన తేజు ఘను కుమారు
గని మనంబులోన ననయంబు విస్మయం
బొనర గ్రుచ్చి యెత్తికొని ముదమున!

—అరణ్య. VII-350

కథ వేగముగా సంక్షేపముగా నడుపుటకు ఈ సీస ఛందము ఉపయోగింపబడినది. ఇదే తర్వాత వర్ణనాపరముగనే వాడబడుటకు వాడుక పడినది.

సీ॥ :— నెత్తమ్మి రేకుల మెత్తందనము దెచ్చి
యద్దున బెట్టినట్లుండు మేను
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలు సేసినట్లొప్పు మెఱసి
చందురు నునుగాంతి కందేర్చి కూర్చి బా
గునకు దెచ్చినయట్లు గొమరు మిగిలి
యలికులంబుల కప్పు గలయంతయును దెచ్చి
నారు వోసిన భంగి నవక మెక్కి

గీ॥ :— యంఘ్రి తలములు. కుచములు, నాననంబు,
కచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
కాదె యీ త్రివ్వ లేటికి గమల వదన ?" — విరాట.II.52

ప్రతిపాదము ఒకే గణము ఎత్తుగడగా గల్గి అధిక గణములు పాదమున దానినే వాడి పెంతలయలు కల్పించిన వానిని గణమును బట్టి సీసభేదములుగా ఇచ్చుట చూప బడుచున్నవి.

## 1. 'సల' గణపు టెత్తుగడ సీసము :-

సీ॥ :— సల సల సల సల
ఒక వాయ ననపాయ పికగేయ సముదాయ
సల
మొకపేము నానామయూరనినద
సల సల సల సల
మొకపంక నకలంక మదరాంక హయహేష
సల సల
లోకక్రేప వనచేప యపరిగీత
సల సల సల సల
మొకచెంత సురకాంత లకరాంత తలనాద
సల సల
మొకదారి వనచారి కోదితంబు
సల సల సల సల
లోకయోర పటుచార జకుమార ఫణితంబు
సల సల
లోకదండ నలిమండ లికలగాన(ము) — వసుచరిత్ర II· 7.

ఎత్తుగడే కాదు పద్యమంతయు సుమారుగా సలగణముతో నడిపి రామరాజభూషణుడు ఈ పద్యమును గణాంత్యప్రాస ఘటితమొనర్చి అద్భుతముగ తీర్చిదిద్దినాడు.

## 2. 'త' గణపు టెత్తుగడ సీసము :-

సీ॥ :— త
ఎవ్వాని వాకిట నిభమద పంకంబు
రాజభూ షణరజో రాజినడరు
త
ఎవ్వాని చారిత్ర మెల్లలో కములకు
నొజ్జయై వినయంబు నొజవుగఱపు

5. 'ఖ' గణపుటెత్తుగడ సీసము :-

ఖ
"ఎవ్వని నూపుర మీటించి మేఘంబు
లద్రిశృంగంబని యాశ్రయించు
ఖ
ఎవ్వని ఝంకెక జ్ఞేంద్రియం బులుసోక
గర్భపాతంబగు గర్భిణులకు
ఎవ్వని పదహతి నెగయుచు రాగంబు
లంధకారా రాతి నావరించు
ఎవ్వాడు కొమ్ముల నెమరించి చిమ్మిన
బ్రహ్మోఘ రంబులు పెల్లగిల్లు" — భాగవతము. X. 1134.

6. 'ర' గణపుటెత్తుగడ సీసము :-

పీడపే! రక్కసి విగత జీవగ జన్ను
బాలుఁడా వినమేటి వాలకుండు
పీడపే! నంమని పెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు
పీడపే! మంచలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు
పీడపే! మెలయించి వ్రేతల మానంబు
చూఱలాడినలోక సుందరుండు" — భాగవతము-X-1248

ఇంద్రగణము లారింటికి ఒక్కొక్కదానికి లక్ష్యములు ప్రదర్శింపబడినవి.

విషమ సీసము :—

ఒక పద్యముపై వేరొక పద్యమతికించు విధానమునుండి విషమ సీసము వచ్చినది. సమ సీసమునకిన్ని భేదములున్నట్లు విషమ సీసమునకు లేవు. విషమ సీసము-తర్వాత వచ్చిన మార్పు. ఇది ప్రాచీన కవుల ప్రయోగములందును కాన రాకుండుట వలన లాక్షణికుల మానసిక పుత్రికయేమో యనిపించును.

సమసీసముతో పోల్చిచూచినచో ఇది మిక్కిలి విలక్షణమైనది. సమసీసములో ఆటవెలది అంతర్భవించును. విషమ సీసమునకు ఉత్సాహపై అంటించిన తేట గీతితో చక్కగా నడక కుదురును. ఆటవెలదితో అర్ధమునకు ఎక్కువ సూర్యగణ ములు(2ఇ.గ.) ఉండును. ఉత్సాహ నియతముగా యతిప్రాసలు గలది. అనగా వాని యందు సమసీసమునకు ప్రాసకాని, ప్రాసయతికాని ఐచ్ఛికత్వము లేదు. పైన ఉత్కింటి గీతికి అవి కలవు. కాన ఇవి కలియవు. గీతి ఉపజాతి, సీసము ఉపజాతి. మరి విషమ సీసము జాతియగునా! ఉత్సాహకు జాతియే. ప్రాస నాల్గుపాదములందు పాటింపబడి తక్కిన ఎత్తుగీతిలో ఉండదు. సమసీసము ప్రసిద్ధముగా ఖండజాతిలో నడచును. కాగా విషమ సీసము త్ర్యస్రగతిలో నడచును. ఉత్సాహమీద+గీతి ఇట్లు చెప్పుకున్నను లోపమేమీ లేదు. చంపూ సంప్రదాయములో ఒక పద్యము తర్వాత వేరొక పద్యము వ్రాయుట తెలుగులో ఉన్నదే. ఉత్సాహ తర్వాత గీతి వ్రాయ వచ్చును. ఈ రెండు ఒక విషమసీసఛందము అని తెల్పుటకు ఉత్సాహలోని పదము గీతిలోనికి చొచ్చుకొని పోవలయును. అప్పకవి యట్లే వ్రాసినాడు.

ఉత్సాహముపై పెట్టవలసిన గీతి ఆటవెలదియేకాని, తేటగీతి నిలువవల దని అనంతాదులు చెప్పినారు. అప్పకవ్యాదులు కంఠోక్తిగా చెప్పకున్నను ఆట వెలదియే లక్ష్యములందు చూపినారు. ఆధునికులగు చెళ్ళపిళ్ళ వరసకవి యామినీ పూర్ణతిలకా విలాసములో (2–165) విషమ సీసము తుద తేటగీతి ఉన్నది. ఉత్సా హను విషమసీసములో తప్ప విడిగా వ్రాసిన లాక్షణికులిద్దరును లక్షణములివ్వలేదు. అదియును సీసముల భాగములోనే చెప్పబడినది. దీనిని బట్టి తొలుత ఉత్సాహకు ప్రయోగము వ్యస్తముగా తక్కువయని భావింపవచ్చును.

పొత్తపి రమణకవి దీనికి ఉత్సాహ వేదండమన్న క్రొత్తపేరు పెట్టినాడు. గణపరపు వేంకటకవి 'ఉత్సాహయుక్తగీతి'యని అతుకు పద్యమని స్పష్టముగా చూపినాడు. అతని పేరులో సీసమన్నదియే లేదు.

విషమ సీసము (తేటగీతిలో) :-

ఉ॥ "అందమైన కీలుగొప్పులందు బాలు తేనియల్
చిందనీక యుంచి సిగ్గుచెంగలించు జాణవా
సందిదండ లుంగరాలు సన్నబన్నగురులు హొం
నంచెలుం గడెంబు లచ్చుపోరములల్ మరల్క్రొం —

తే॥ గీ॥ బసిడి గంటల మొలనూళ్ళ బాహుపురులు
సరిపె కౌలిము త్తియంపు సుంగరులు రా?
పతకములు దాల్చి పన్నీట పదను మించు
చందనమలంది రంతట సంతసమున"

— ప్రబంధ. రా. వేం. వి. 273 ప.

గునుగు సీసము :-

లాక్షణికులు దీనిని భేదముగా చెప్పకున్నను, క్వాచిత్కముగా ప్రచారములో నున్నది. పాదాంత విచ్ఛేదము లేకుండా, అనగా పదము పాదాంతమున ముగియక, తర్వాతి పాదములోనికి చొచ్చుకొనిపోగా గునుగు సీసమగును. పాదాంత విచ్ఛేదము వలన లయ కన్పట్టకున్నను ఇట్లు వ్రాయబడవలయును. అనేక సీసపద్యములు పాదాంత విచ్ఛేదము లేనివి ప్రయోగించుట ప్రాచీనమైనదే. అలతి అలతి పదములలో వ్రాయుట గునుగు సీసముల యొక్క వేరొక్క లక్షణముల C. P. Brown గారు గునుగు సీసములను ఈ క్రింది విధముగా నిర్వచించిరి.

"A sort of sisa verse so formed as to read like mere prose [23]."

1) కందుకూరు శాసనమున పాదోల్లంఘన లక్షణము సీసమున కలదు.

"శ్రీనిర పద్యుండు చిత్తజాత సముండు
శివపద పరిరాజ్య సేవితుండ—
ఖిలుడు........"

2) సీ॥ నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా
— కమరంగ దూతవై యభిమతంబు
— సేయుమనావుడు జెచ్చెర నట్టుల
చేయుదుమరి నాకు జెపుడు మీర
— లెవ్వరలేను మీకిష్టంబుగా దూత
— నై యేమిసేయుదు ననిన నఖి
— కమరేశ్వరుండిట్టులనియె నేనింద్రుండ
వీరు దిక్పాలురు విదితయశులు

ఆ॥ ధరణి నెవ్వరెన్న దనుజుండె యెవ్వండు
— వరుస నారి పెట్టి వన్నె యున్న
— వారిపెద్ద మన్కు వారిజాక్షి నెంచ
— గింపు నామధేయ కీర్తనముల"  — అర్జా : II - 34

నన్నయ సీసమును కథాకథనమునకు వేగము నొసంగుటకు వాడగా, తిక్కన దీనిని వర్ణనాంశములకు పనికివచ్చు ఛందముగా వాడినాడని ఇదివరకే తెలుపబడినది. ఇట్లు భావింపుటకు కారణము ధర్మరాజాదుల మహిమల వర్ణనము లున్నగునవి. అభిమన్యుడు మరణించగా దుఃఖోపశమనార్థము షోడశమహారాజ చరిత్రమును వర్ణించుటకై నారదుడు ఒక్కొక్కరాజుకు ఒక్కొక్క సీసములో చెప్పుట గాంచనగును. ఇది తర్వాత అభివృద్ధి చెందిన శతక వాఙ్మయమునకు తొలి దశయనవచ్చును. అతని పద్యములను వర్ణనావసరమున పరిశీలింపతిమేని మొదటి నాలుగు పాదములలో విషయము/వర్ణనీయాంశమును వరుసగా సూచకముగా కోణములలో పరిశీలించి ఎత్తుగీతిలో ఉపసంహారము చేయుట చూడనువ్పగా నుండును. ఇట్టి సీసములో ఎత్తుగీతి పూర్వపాద చతుష్టయములోని వర్ణ్యాంశమునకు మకుట (శీర్ష) ప్రాయముగా అలంకరింపబడును. అందుకే దీనిని శీర్షక (పేన) మని యనుట ఉచితమగును. ఇట్టి విధానమును కావ్య కవులకన్న శతకకవులు చక్కగా స్వీకరించి ఆచరించినారు. వారి పద్యములు ఎత్తుగొన్నది మొదలు గీత్యంతము వరకు పరిత్య మనోపథమున విషయము కేంద్రస్థానమాధారముగా వలయాకారములో పరుగిడి చివరకు వృత్తమై సంపూర్ణత్వము నంది ఒక ఖండకావ్యము యొక్క పఠనానుభవమును స్ఫురింపజేయును. ఇట్టి దానికి కారణము శతకములందలి పద్యములు ముక్తకములగుటయే. అనగా ఒక పద్యములోని విషయము వేరొక పద్యముతో సంబంధించి (కావ్యాదులలోవలె ధారావాహికగా) ఉండదు. సమగ్రవిషయ వివరణకిట్లు సీసము అన్ని వేరె ఛందములలో మిక్కిలి అనువైనదిగ తీర్చిదిద్దబడినది. నాల్గు దీర్ఘ పాదములు, వానిలో దీర్ఘత్వమును తొలగించుటకై అర్ధములుగా విభజన, ఎనిమిది అర్ధములపై ఆటువంటి దీర్ఘత్వముగల మరి నాలుగు పాదములు, భావవిభజన, వేరుగా పాదవిభజన. గతితప్పని లయ, సంపూర్ణ మూర్తిమత్త్వము, పద్యైక భావ (విషయ) సమాప్తి ఈ సీసములలో పరిత్య హృదయము నందలి రసావిష్కారమునకు తోడ్పడును. ఇట్లు సీసములను ఉపయోగించుటలో కవులు తిక్కన మార్గమును స్వీకరించి దానికి మరిన్ని మెరుగులు దిద్దుచు అనంతర

ప్రబంధయుగమునాటి వరకు చక్కని గమనము నాపాదించినారు. శాబ్దిక సౌందర్యము గణ, దళ, అర్ధ, పాద, తౌల్యములతోబాటు భావ తౌల్యము సహితము సాధించినారు.

భావతౌల్యమునకు ఈ క్రింది సీసములు పరిశీలించదగినవి.

**1.** శిఖరారోహణరూప వర్ణనమునకు :-

[ఒక్కో పాదమునకు ఒక్కో అడుగు వేయిస్తూ పఠితను వక్త మానసిక స్థితికి గొని వచ్చుటకు]

భీముని భయంకరరూప వర్ణన :-

సీ॥ "నేలయు నింగియు దాళముల్గా జేసి
యేపునరేగి వాయించి యాడ
గుల పర్వతంబుల గూర్చి యొందొంటితో
దాకంగ వీకమై దన్నియాడ
నేడు సాగరములు నిక్కడక్కడ బెట్టి
పలుచని రొంపి మైనలదికొనగ
దిక్కులు నాలుగు నొక్కచోటికి దెచ్చి
పిసికి పిండలిసేసి పిడుచగొనగ

మిగుల బ్రహ్మాండ భాండంబు పగులవ్రేయ
నవ్వళించుచు ప్రళయ కాలానలమున
గండరించిన రూపంబు కరటిభీము
డతి భయంకరా కారత నతిశయిల్లె" —విరాట - I. 134.

తిక్కన పై విషయమునకు ఔద్ధత్యమును గొనిరాగా శ్రీనాథ పెద్దనాదులు గత వైభవము నెమరువేసికొని దీనాలాపములచే ఒకొక్కక్క మెట్టు ఉద్వేగభరితముగా చెప్పికరుణ రసావిష్కారము చేసినారు.

"కాశికా విశ్వేశు కలసి వీరారెడ్డి
రత్నాంబరము లేరాయడిచ్చు". — శ్రీనాథుని చాటుసీసము.

"ఎదురైనచో తనమదకరీంద్రముడిగ్గి
కేలూతయొసగి యెక్కించుకొనిమె"
— అల్లసాని పెద్దన చాటు సీసము

2. సమాంతర దృశ్య వర్ణనానురూపమునకు :-

సీ॥ రాకేందు బింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై - ఘనధూమ కేతువై
యలరు బాలాకీ చేలాంచలంబు
భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృత ప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

హర్షదాయియై మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికి జూడ నందంద శృంగార
వీర రసములోలి విస్తరిల్ల" — భాగవతము X - 183.

3. ద్వంద్వి, ప్రతిద్వంద్వి అర్థద్వయ రూప వర్ణనమునకు :-

"బొమ్మ పెండ్లిండ్లకు బోనొల్ల నను బాల ×
రణరంగమున కెట్లు రాదలంచె
మగవారి గనిన దామరుగు కేగెడు నింతి ×
పగవారి గెల్వనేపగిది జూచె.
పసిడియుయ్యెల లెక్క భయమందు భీరువు ×
ఖగపతి స్కంధమే కడిదినెక్కె
సఖుల కోలాహల స్వనములో ర్వని కన్య ×
పటహ ఢాంకృతుల కెబ్బంగి నోర్చె

నీలకంఠములకు నృత్యంబు గఱపుచు
నలసి తలగిపోవు నలరుబోటి
యేవిధమున నుండెనెలమి నాలీఢాది
మానములను రిపులమానమడప" — భాగవ. X. 180.

దీనిలో శ్రీ సహజ సౌకుమార్యము పూర్వార్ధములందు, రణపీరణము ఉత్తరార్ధము లలో పోటీపడినది. పోతన ఈ సొగసుకింతంటిలో తనియక ఇట్టిదే మరియొక పద్యము పెన్వెంటనే వ్రాసినాడు.

"పీక చక్కగ బట్టపెరపెరంగని కొమ్మ ×
బాకాసనంబెట్లు పట్టనేర్చె" — 181 ప.

ఈ రీతిగా సాగినది. అర్థ ద్వంద్వమును పాదార్ధద్వయమున సంధింపుటతోబాటు అర్థములను విచ్ఛేదహాస పళమున అంటకుండగ నుంచగల్గినాడు.

4. క్రియా, ప్రతిక్రియా రూపమునకు :-

సీ॥ "అర్థివాంఛకునీక హానిచేయుటకంటె
చెంపతో పసనాధి దీనుటమేలు
అడబిడ్డల సొమ్ములపహరింపుటకంటె
బంతగట్టుక సూతబడుటమేలు
పడులకాంతలబట్టి బల్మిగూడుటకంటె
బడబాగ్ని కీలల బడుటమేలు
బ్రతుకజాలక దొంగపనులు సేయుటకంటె
కొంగుతో ముష్టెత్తుకొనుట మేలు

తే॥ జలజదళనేత్ర నీభక్తజనులతోడ
జగడమాడెడు పనికంటె జావుమేలు
భూషణవికాస శ్రీధర్మ పురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర" — నరసింహ శతకము (10).

తుల (త్రాసుకు ఉభయ పార్శ్వములయందు సమానమైన భారమున్న యెట్లు సౌష్టవ రూపముతో కన్పింపునో, అట్లే అర్థ తౌల్యముచే పై సీసములు శోభించినవి. ప్రశ్నోత్తర మాలికా రూపముగల సీసపాదములందు మొదట అర్థము ప్రశ్నగా తర్వాతి అర్థము దానికి జవాబుగా పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములో (4-71) ఒక పద్యము రాసినాడు. ఇట్టి గుమలింకను పెక్కులు చూపెట్టు వచ్చును. ముఖ్యముగా శతకకవులు వీనిని బాగుగా చూపగల్గిరి. అన్నింటి యందు ఒకే తీరు పద్ధతి. అది సీసము యొక్క పాద దళ, లేక అర్థముల మధ్య తౌల్యము (సమభారతను)ను ఘటించుట.

వీటన్నిటి వెనుకగల సౌందర్య రహస్యము పాదాంత, అర్థాంత విచ్ఛేద మూల సూత్రమే. లాక్షణికులెవ్వరు చెప్పకున్నను ఈ రహస్యమును కవులు పసిగట్టి సంపూర్ణముగా ఉపయోగించుకొనినారు. నన్నయలో కానరాని ఈ నియమము తిక్కనాదులలో చక్కగా కాననగును. యతిప్రాసల విషయమున శ్రద్ధకనబరచిన నన్నయ పాదాంత అర్థాంత విచ్ఛేదములో శ్రద్ధ కనబరచకుండుటచే. సామాన్య శతక కవి సీసమునకున్న నడక ఐనను నన్నయ సీసమునకు లేకపోయినది. క్రమముగా వికసించిన స్పష్టమైన సీసగమనము శ్రీనాథుని చేతిలో విస్తారమైనది. పాదాంతయతి పాటించిన శ్రీనాథుడు అర్థాంతయతి (విచ్ఛేదమాత్రము) పాటించలేదు. దానిలోని రహస్యము నెరిగి రామరాజభూషణుడు సీసములను ఉయ్యాల లూపినాడు. దశాంతమున సైతము విచ్ఛేదమును, అనుప్రాసములను పెట్టి సీసమునకు వింతసొబగు పెట్టినాడు.

కాని యిట్టి నియమములు, వందల కొలదిగా పద్యములు వ్రాసెడి మహా కావ్య నిర్మాతలకు అధికముగా పద్యములు వ్రాయుటలో సాధ్యపడదు. ఉపరి భాగము నిర్మించుట అతి దీర్ఘమగుట వలన కవిత్వావేశము కన్న ప్రయత్న పూర్వక పద నిర్మాణము అధికమైపోయి లాక్షణిక సమ్మత గణములలో కొలిచిరి. పాద నిర్మాణము చేసి తూగును త్యాగము చేసిన సీసములు చాలా ఉన్నవి.

“మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు” అన్న పద్యము

మొదటి పాదము చక్కగా ప్రారంభమయి, పోనుపోను సీసగమనములో శైథిల్యము వచ్చినది. శతక నిర్మాణములో రాసేవి వంద పద్యములే కనుక శతక కవులు శ్రద్ధతో పైగా నిత్యవ్యవహారోపయోగిమై, కంఠస్థమై పారాయణము గావలయునని భావించి కాబోలు ఈ తూగు చెడకుండ వ్రాసినారు.

### సీసం - గేయగుణం :-

తెలుగునాట సుప్రసిద్ధమై, వీధిబడులలో పాఠ్యగ్రంథమై చక్కని సామాజిక స్పృహాగ్ని - ఉద్బోధకమైన శ్రీ ధర్మపురి నరిసింహ శతకము శేషప్ప వ్రాసినది, మా ఊరిలో మూడు శతాబ్దుల క్రిందట జన్మించినది, నేటికిని స్త్రీలకు పారాయణముగనున్నది. పారంపరికముగా వరుస ఆ శతకము గేయరూపమున సాంప్రదాయకముగా పాడుట గమనింపబడినది. గేయ సంప్రదాయములో సీసమెట్లు పాడవలెనో పరిశీలన తెలియును.

వారి గేయ విధానమిట్లున్నది.

1. సర్వమును ఖండగతిలో నడపుట. అనగా చతుర్మాత్రాగణములు సాగదీయుట.

2. అర్థ, పాదాంత విరామము కవి పెట్టుకున్నను, తాత్పర్యమును ప్రక్కనపెట్టి లయవశమున విభజించి చదువుట.

3. సీసమునొక విధముగా చదివి, గీతిస్థాయిమార్చి మరొక్క విధముగా చదువుట, చదువుచుండగానే సీసపాదములనుండి గీతిలోనికి మారినట్లు తెలియజెప్పుట.

4. గీతమును ఖండగతిలోనికి మార్చుట : ఉదాహరణమునకు

1. సీ :- "మాన్యంబు లీయసా * మర్దుకొక్కడు లేడు
మాన్యముల్, చెఱుపసా * మర్దులంతా
ఎండినా ఊళ్ళగోడెరిగింప * డెవ్వడూ
పండినా ఊళ్ళకే * ప్రభువులంతా" శ.ప.సం. స.14.

2. సీ॥ :- అతివిద్య, నేర్పుటా * అన్నవా, స్త్రములకే
పసులకా, స్తింపుటా * పాలకొఱకే
సతిని పెండ్లాడుటా * సంసార సుఖముకే
సుతుల బోషించుటా * గతులకొఱకే" శతకప.సం.31.

ఇట్టి చలలు తక్కువగా వాడబడినవి వాడినచో గాయకులు వానిని దీర్ఘీకరించిరి. ఈ శతకములోని 108 పద్యములలో 108 × 4 = 432 పాదములలో 432 × 6గ = 2592 ఇంద్రగణములలో ఒకటి రెండు పదులు తప్ప భగణములు ఎక్కువగా వాడబడలేదు. తక్కినవన్ని పంచమాత్రాగణములే (ఇం.గ.) వాడబడినవి. కొన్నిచోట్ల గేయగతిలో వరాహ పంటి జగణములు(ల వ) వారాహ పంటి సాగతీగ రూపములతో కవి ప్రయుక్తములు కానగును. ఇది కవికి కల గేయ ధోరణిని పట్టిచూపును. చివరి రెండు సూర్యగణములలో ఐదు మాత్రల గణమొకటై తక్కిన ఒకమాత్ర చివరి అక్షరము దీర్ఘీకరింపబడి మరి మూడు మాత్రలకాలము రెండవ పాదము ఉచ్చరించుటకు ముందు కాల విలంబన మొనర్చుట అనగా పంచమాత్రికా కాలఖండములు 4గా అర్థములు విడిపోవుట, చివరి గీతిసైతము పంచమాత్రికా గణములుగా సాగుట, గేయములోవలె - శబ్దము వ్యాకరణ విరుద్ధమైనను మాత్రల పూరణములలో నిలకడ- "నిలకడా", "సుంకరి-సుంకరీ", అన్న రీతిలో సాగదీయ బడుట, ఇట్టి గేయ

ఇ) పచ్చలకథ :-

"రత్నాల మొలనూపు రవసెయం బెలమొయ
రవికులా రామన్న జోజో" 26

## నా పరిశీలనలోని మరికొన్ని జానపద గీతములు :-

1. "శ్రీశంభు తనయునకు సిద్ధగణ నాథునకు
వాసిగల దేవతా వందితునకు"

2. "ఓబొజ్జ గణపయ్య నీబంటు నేనయ్య
ఉండ్రాళ్ళ మీదకీ దండు బంపు"

ఇట్టి జానపదగేయగతి మూలముగా గలిగి దేశిగణవ్యవస్థ (సూర్యేంద్రగణవ్యవస్థ)లో సీసములు గేయ సంప్రదాయమునకు చెందుచున్నవి.

ఖండగతిలో నడచు సీసము తెలుగులోను, సోదరద్రావిడ భాషలలోని ఛందములతోను సంపదించుచున్నది.

## సీసము - ఇతర ఛందములు :

తెలుగులో ఖండగతిలో ఐదు మాత్రల గణములతో నడచు మరొక పద్యము ద్విపద. సీసమునకు వలెనే దీనికిని చివర సూర్యగణములుండును. మూడింద్ర గణముల మీద ఒక సూర్యగణము ద్విపదకాగా ఆరింద్ర గణముల మీద రెండు సూర్యగణములు సీసమున కుండును. దీనింబట్టి సీసము ద్విపద నడకతో రెట్టించని భావింపవచ్చును కాని గణక్రమములో భేదమున్నది. రెండు ద్విపదలు జోడించిన తరువోజయగును కాని సీసముకాదు సీసములో మధ్యలో సూర్యగణ ముండదు. ద్విపదలు రెండు కలసి మధ్యలోగల సూర్యగణమును చివర చేర్చిన సీసము కాగలదని, సీసము ద్విపదజన్యమని ఛందో విమర్శకులఊహ[27]. కాని యిది యిట్లు స్వీకరింపబడుటకు ప్రమాణమేదియు లేదు. పైగా గేయ సంప్రదాయమున కిది విరుద్ధము. సాంకేతికముగా ఇట్లూహించినను, గమన వైవిధ్యము కొఱకు గతులు కల్పించుకొనిన జానపదులు ఇట్టివానిని గణింపరు. జన్యజనకత్వమునకు గమనమున తుల్యత్వముండి చదివినపుడు ఒకదానినిబట్టి ఒకటి స్ఫురింపవలయును. శబ్దశాస్త్ర దృష్టితో సూర్యగణములుగా చూడబడుట, లాక్షణిక దృష్టితో గణములు మార్చుట గేయ సంప్రదాయ మౌలికతకే భంగ కారణము.

lines each can be made equal or identified with one line of sisa verse having eight ganas. అని కోరాడవారు అభిప్రాయపడినారు.

ఇట్లు సీసము సోదరద్రావిడ భాషలలోని ఛందములతో కొంతవఱకు సరి పోవుచున్నది.

## సీసము గీతి :

రెండు భిన్నగమనములు, భిన్నగణ వ్యవస్థగల పాదములు గల్గిన ఛంద ములు జోడించి ఒకే ఛందముగ చెప్పుట సీసముయొక్క విశిష్టత. ఇది యేయితర దేశి చ్ఛందములందు లేనిది. భిన్న వృత్త పాదములను సాంకర్యమొనర్చి అర్ధసమ వృత్తములుగ చెప్పుట సంస్కృతమునందున్నను ప్రయోగములో స్వల్పము. పాదసాంకర్యము వైదిక సంప్రదాయములో నున్నది. ఐనను సంస్కృత లౌకిక సాహిత్యమునందు అది త్యజింపబడినది. ఈ విధానము ప్రాకృతమునందున్నది. ప్రాకృతము తెలుగునందలి ఇట్టి విధానమునకు ప్రేరణ కావచ్చును. సీసముతో ఆటవెలది సగమనుకొన్నతో - ఉదాహరణ కావ్యములందు రగడల వికృతులగు కళి కలు, వానిపిదప వానిలో సగమగు ఉత్కళికలు వరుసగా వ్రాయబడు సంప్రదాయ మున్నదని, ఇదికూడ అట్టిదే కావచ్చునని డా. పాలంకి మాధవశర్మగారనిరి[29] రగ డల వికారములైన కళికోత్కళికలలో భిన్నరూపమేమియులేదు. సీస, గీతులలో గతి వైవిధ్యమును, గణ వైవిధ్యమును గలదు. సీసము తెలుగునాట తొలినాళ్ళనుండియే కలదు. ఉదాహరణ వాఙ్మయము సీసమంత ప్రాచీనముగ గన్పట్టదు.

సీసపాదములు నాలుగువ్రాసి పైన (ఎత్తుగా) వ్రాయుట వలన కాబోలు ఎత్తుగీతియని పైగీతికి పేరున్నది. గీతియని సామాన్యవాచిగా కూడ పేర్కొనబడు చున్నది. "కీర్తితాతి మధుర * గీతియు దైగల్గ"యని లాక్షణికకోక్తి[30]. పెక్కు గ్రంధములందు అవి తేటగీతియైన తే.గీ. యనియు, ఆటవెలదియైన ఆ. వె. అనియు వ్రాయబడుచున్నను కొన్నింటియందు మాత్రము "గీ" యని పేర్కొనబడుటను కాంచనగును. 'ఎత్తుగీతి'యన్న మరొక్క పేరు లాక్షణికోక్తముగాక వ్యవహార నామమై యున్నది ఏలయన ఎత్తుగీతియని విషమగీతులలో నొకదానికి పేరుండుట కాంచనగును. C P Brown సీసము మీది గీతిని "కోరస్" (Chorus) అని పేర్కొనినాడు "But a Sisa verse is not complete without yettu giti or chorus which must be in one of the Giti metres[31]"

వ. ఆటవెలది గీతము ప్రసన్నపది, నటి యనబరగుచు. తేటగీతి యే పవడి, శుభ్ర గీతి యనబడుచు"—(లక్షణ శిరోమణి - 307, 308) అని పేర్కొనినాడు. ప్రవళి నతడు 'పవడి' యని ఇంచుక మార్పుచేసి పేర్కొనినాడు.

ఉభయుల పేర్లలో తారుమారు కానవచ్చుచున్నది. విన్నకోట పెద్దన బహుళ పరుసక్రమము పాటింపకుండవచ్చును ఆటవెలది అధ్యాయము క్రింద ఇది వివరింపబడినది.

ఇట్లు అతి ప్రాచీన కాలమునందే సీసముపై ఆటవెలది, తేటగీతులకు 'ప్రవళి, ప్రసన్నపది' పేరులతో చేర్చబడు సంప్రదాయము కానవచ్చు చున్నది. వీనిలో ఆటవెలదియే ప్రారంభమున కానవచ్చుచున్నది. తర్వాత సమగీతియైన రెండవది తేటగీతికూడ సీసముపై కూర్పబడుట జరిగి యుండవచ్చును. పొత్తపి రమణ కవి పేర్కొనిన ఋగ్వేదబ్రాహ్మణ లక్షణములలో 'శుభ్రగీతాసీసాన్వితా కేచిత్' అన్న మాటలు దానికాతడు వ్రాసిన "'ప్రవళి' యనే గీతిక శుభ్రగీతమనే పేరు గలుగుట చేతను తెలుగున తేటగీతి యనబడెను. సీసాన్వితా కేచిత్ ఈ ప్రవళి యనే గీతికి కేచిత్ కొన్ని మతములలో సీసముతో కూడుననుట" యన్న వాక్యంబట్టి చూడగా ప్రాచీన కాలమున తేటగీతిని సీసమునకతుకుట లేకుండెనని, తర్వాత కొందరు అంగీకరించిరని భావింపవచ్చును. నన్నయ సీసములలో అధికాంశము ఆటవెలది ప్రయోగములే కానవచ్చుచున్నవి. 251 సీసపద్యములలో 225 సీసములపై ఆటవెలదియే వ్రాయబడినది. సోమనాథుని చతుర్వేదసారమున సుమారు 400 సీసములు వ్రాసినాడు. వాటి చివర ఆటవెలదులే వ్రాయబడినవి[34]. ధర్మవరం శాసనములో సోమలదేవి (దీర్ఘాసి) శాసనములో ఆటవెలదులే కలవు. కందుకూరి శాసనమందలి సీసము చివరి గీతి శిథిలమైపోయినది. దానిలో మొదటి పాదములో "తాని పక్షపాతి......." ప్రారంభ పదములు; "......విభవ గౌరవేంద్ర" యని చివరి పాదమున్నది. విభవ గౌరవేంద్ర అన్న పదవిభాగములో హంస (సూర్య) పంచకముతో ఆటవెలది వలెను పైనొక్క లఘుత్రయముతో ఇం.సూ.సూ. చివరగా గల తేటగీతివలెను ఉభయవిధముల కాదగును. "తాని పక్షపాతి" యన్న శబ్దములు కూడ ఆటవెలది (తాని-పక్ష—పాతి—ఇన గణత్రయము), తేటగీతి (తాని-పక్షపా-తీ...." సూర్యుడొకడు, సురరాజులిద్దరు) అగుటకు వీలు కల్పించుచున్నది. కాన ఇది ఆటవెలదియో, తేటగీతియో చెప్పవలను పడదు. నాగవర్మ తన "ఛందోఽంబుధి" యందు ఆటగీతి (ప్రాసగల ఆటవెలది)యే సీసముమీద చెప్పవలెనన్నాడు. ఇట్లు ప్రాచీనకాలమున తేటగీతుల ప్రయోగములేమిచే

నన్నయయే తొలుత తెలుగున సీసమును ప్రవేశపెట్టెనని వెల్లూరి వెంకట రావుగారభిప్రాయపడిరి.[5] ప్రబంధ రత్నాకరములో ఉదాహరింపబడిన పద్మకవి సిద్ధ దేవుల సీసములతో తెలుగున సీసము వ్రాయబడినది. కాని యవి అర్వాచీనములని భావింప బడినవి.

సీసముపై అర్వాచీన కాలమున చేసిన ప్రయోగము వైవిధ్యము చేయబడి నను, ఆటవెలది, తేటగీతులలో ఆటవెలదియే సీసముపై ఎక్కువగా అమరును. దాని కును ఆటవెలదికిగల గణవిధానము. సీసముపై ఆటవెలది వ్రాసిన ఆ పద్యము మొత్తము మూడు ఆటవెలదులతో సమానము కాగలదని ఇదివరకే చెప్పబడినది. అనగా సీసము యొక్క నాలుగు పాదములు రెండు ఆటవెలదులకు సరిసాటిగా సమాన మగును. ఆటవెలది బేసి పాదములలో 3సూ+2 ఇం.గ. ఉండును. సరిపాదములలో 5 సూర్యగణములుండును. సీసము యొక్క పాదమును రెండు అర్ధములుగా విభ జించుట ప్రసిద్ధమైనది. ఇట్టిగల రెండు అర్ధములు సరి బేసి పాదములుగా స్వీకరిం చిన ఆటవెలది రెండు పాదములకు సమానమగును. ఒక్కొక్క సీసపాదము రెండు ఆటవెలది పాదములతో సమానమగును. రెండు పాదములు ఒక సంపూర్ణ ఆటవెలది పద్యము. 4 పాదములు 2 ఆటవెలది పద్యములతో తుల్యమగును.

| | | | | |
|---|---|---|---|---|
| ఆటవెలది :- | 1వ పా | సూ+సూ+సూ | * | ఇం+ఇం |
| | 2వ పా | సూ+సూ+సూ | * | సూ+సూ |

మొదటి పాదములోని మూడు సూర్యగణములు రెండు ఇంద్రగణములుగా భావించి నచో మొత్తము నాలుగు ఇంద్రగణములై సీసపాద పూర్వార్ధమగును. రెండవ పాదములోని మూడు సూర్యగణములను కూడా మొదటివాని వలెనే భావించిన రెండు ఇంద్రగణములు+పైనగల ఆటవెలదిలోని రెండు సూర్యగణములు కల్సి సీసపాద ఉత్తరార్ధమగును. (సీస ఉత్తరార్ధ పాదము రెండు ఇం.గ + రెండు సూర్య గ.) యతిస్థానము కూడ సీసపాదములకు ఆటవెలది అర్ధపద్యమునకు చక్కగా కుదురును. మూడు సూర్యగణములు వైశిష్ట్యములో రెండు ఇంద్రగణములతో సమానమగుటయే గాక, గణములు కూడ ఇంచుమించుగా కలియును. సూర్యగణములైన 'నగహ' లను మూడు గణములుగా వ్రాసి రెండు ఇంద్రగణములుగా మార్చవచ్చును. అట్టివి నాలుగు సమాహారములు (Combination) ఇంద్ర గణములగుటకు వీలున్నవి క్రింద చూపబడుచున్నవి.

| | న | హ | న | | |
|---|---|---|---|---|---|
| (1) | III | UI | III | = | నగ, నల (ఇం.గ.) కాదగును. |
| | హ | న | హ | | |
| (2) | UI | III | UI | = | భ, సల ( ,, ) ,, |
| | హ | హ | న | | |
| (3) | UI | UI | III | = | ర, నల ( ,, ) ,, |
| | న | న | హ | | |
| (4) | III | III | UI | = | నల, సల ( ,, ) ,, |

డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు వీనిలో కొన్నిటికి లక్ష్యములనిచ్చినారు.

హ న హ ఇం. ఇం.
(1) ఆ॥వె॥ ;- "గ్రుడ్డి పయితి వీపు — కుంటిదా ననునేను
న హ న సూ సూ
నగరి కెట్లు మనము — నడువ గలము

భ సల ఇం. ఇం.
(2) సీ॥ :— "గ్రుడ్డిప యితివీపు — కుంటిదా ననునేను
నగ నం సూ. సూ.
నగరికె ట్లుమనము — నడువ గలము"

హ న హ = భ, నల (మొదటిది) పై పట్టికలో రెండవది.
న హ న = నగ, నల (రెండవది) పై పట్టికలో మొదటిది.

వరుసగా ఒకటవ, రెండవ పాదములందు ఆటవెలదిలో వ్రాయబడి (పూర్వోత్తరార్ధ భాగములతో) సీసపాదములుగా చూపబడినవి.

న స హ
III III UI ఇం. ఇం.
ఆ॥ వె॥ :— నడువ గలను నేను — నామూపుపైకెక్క
తిన్నన యిన బాట — తెలియచెప్పు.

నల సల ఇం.త ఇం.త
IIII IIUI UUI UUI
సీ॥ నడువగ లనునేను — నామూపు పైకెక్క

ఇచ్చట న న హ = నల, సల (పట్టికలో నాలుగవది) కుదాహరణ కాదగినది.

యాదృచ్ఛికముగా నైతము కవిప్రయోగములో ఇట్టివి కానవచ్చు చున్నవి. నన్నయ ప్రయోగములో (ఆది-2-100)-

హ న హ ఇం. ఇం
ఆ॥వె॥ "పంది యపర దిక్కు - నొందిరా దిక్కులా
న హ న సూ. సూ.
శ్వేనులు నుత్త రమున - గొనర బఱచి

దీనిని సీసముగా వ్రాసిన -

భ సల
"పందియ పరదిక్కు - నొందిరా దిక్కులా
నగ నల
శ్వేనులును త్తరమున - గొనర బఱచి [36]

పై రెండవ, ఒకటవ జంటలే ఇందు ప్రయుక్తములు. గణములు సరిపోవుటతో పాటు యతిస్థానము గూడ సరిపోవును. ఇట్టి ప్రయోగములు సప్రయత్నములు కాకున్నను ఇంద్ర, సూర్యగణ వ్యవస్థలో సహజముగా సంభవములు.

సీసముయొక్క పాదమునగల పూర్వోత్తరార్థములను పరిశీలింపగా అది అర్థసమవృత్త లక్షణములను పోలియున్నది. ఆటవెలది పద్యము నైతము యుక్పాదలక్షణము, అయుక్పాదలక్షణముతో కలియక అర్ధసమవృత్త లక్షణమే కలిగియున్నది. తేటగీతి యందు, అన్ని పాదములందు గణనియమము సమవృత్తము లలో వలె సమానమే. ఈ అర్థవృత్త లక్షణమును పోలియుండుటను బట్టి సీసమునకు ఆటవెలది పొత్తుకుదిరినదనవచ్చును. ఇప్పటివఱకు వివరించిన ఈ విధానములోని సామ్యమే ఇందుకు సాక్ష్యమగుచున్నది.

గణవిధానములోని సౌలభ్యము వలన కొంచెము సవరణతో తేటగీతిని నైతము సీసముగ చూపవచ్చును. కాని సీసపు తూగు దీనియందుండదు. 'సీసముతో ఆటవెలది కలిసినంత ఇంపుగా తేటగీతి కలియద'ని చెప్పుచు గిడుగు సీతాపతిగారు ఒక ఉదాహరణము నిచ్చినారు -

నలల
సీ॥ "చెలయకం / టివెనీవు / సిరులొలుకు / సుమబాల
భాగ్యపం / తుండైన / భర్త బడయు

తే॥ సీ॥ "చెలియ, కంటివె, నీవుసి, రులొలు, కుసుమ
బాల, భాగ్యపం, తుడైన, భర్త, బడయు"

ఇందు "నలల" గణము వాడబడినది. కనుక కుదిరినది. అనగా ప్రసిద్ధ గణములతో సీసము తేటగీతిగా వ్రాయరాదన్నమాట. గిడుగువారు చూపిన గణములు సీసపద్యములో కవులచే వాడబడనవి కావు. నలల మాత్రము ఒక్క సర్వలఘు సీసమున వాడబడినది. కనుక ఇట్టి గణములతో సీసము, ఆటవెలదిలో కలిగినంత తేటగీతిలో కలియదన్నమాట. తూగు లేకపోవుటకు కారణము "గణమునకొక్క పదము"గా వెనుక ఆటవెలదిలో కుదిరినట్లు తేటగీతిలో కుదరక "నీవుసి, రులొలు, కుసుమ, తుండైన" - వంటి రీతిలో అడ్డదిడ్డముగా తెగిపోవును. ఊత పదమునననుసరించి వచ్చును. గణము పదమునకొక్కటిగా తెగినపుడు ఈ ఊత చక్కగా నిలుచును. అది లేనపుడు ఊత పాడగును. పైదానియందు అదియే జరిగినది. అందులకే తేట గీతి సీసముపై సరిపడలేదనుమాట. వెనుకటి ఉదాహరణములో ఆటవెలదిలో గణములు, పదములు, ఊత, యతి అన్నియు చక్కగా కుదిరినవి.

నన్నయనే తొలుత సమగీతులు రెంటిని సీసములపై నుంచుట ప్రవేశ పెట్టినాడన్న విషయము ఇంకను భావిసాక్ష్యములతో నిర్ధారింపవలసినను, ఆటవెలది ఉపయోగము మాత్రము నన్నయ యందు అతివిస్తారము 251 సీసపద్యములందు 225 సీసపద్యముల మీద ఆటవెలదులు వ్రాసి, 26 సీసముల మీద తేటగీతులు వ్రాసినాడు ఈ స్వల్పమైన తేటగీతులైనను గతి వైవిధ్యమునకై వ్రాసియుండును. నన్నెచోడుడు 186 సీసములందు తేటగీతులు గలవి 94, ఆటవెలదులు గలవి 92 వ్రాసినాడు అనగా దాదాపు సమానముగా వ్రాసినాడన్నమాట. తిక్కన మాత్రము 1152 సీసములందు 783 తేటగీతిగలవి వ్రాసి 369 ఆటవెలది గలది వ్రాసినాడు. అనగా తిక్కన తేటగీతి సీసములను, ఆటవెలది సీసములకు రెట్టింపు వ్రాసి తెలుగు సాహిత్యములో ఇట్టిదానికి ఆద్యుడైనాడు. గతివైవిధ్యము కొఱకు ఇట్లు ప్రయోగించి యుండును. నన్నయ నిష్పత్తిలో పోతన ఆటవెలదిని గాక తేటగీతిని సీసముపై వాడినాడు. అనగా నన్నయ మార్గమునకు వ్యతిరేకమైనది. భాగవతములోని

ఆయన వ్రాసిన 899 సీసములలో 677 తేటగీతి కలవే. 222 మాత్రము ఆటవెలది సీసములు. శ్రీనాథుడు మాత్రము ఆటవెలదిని పూర్తిగా త్యజించినాడు. శృంగార నైషధములో (2-62) ఒక్కచోట మాత్రమే సీసము మీద ఆటవెలదిని వ్రాసినాడు. కాశీఖండములో అన్నియు తేటగీతి సీసములే. 824 తేటగీతి సీసములు, ఒక సీసము ఆటవెలదిలో వ్రాయబడినది. ఈరీతిగా కాలము గడచిన కొలది తేటగీతి ప్రయోగము సీసము మీద అధికమైనది.

సీసము, ఆటవెలది చక్కగా అతుకుట బట్టి, ప్రాచీనకాలములో తేట గీతులు ప్రయోగములో లేకుండుటను బట్టి సీసము జానపద గీతమునుండి ఆట వెలదితో సహా ప్రభవించినదేమో అనిపించును. అనగా జానపద గీతములందు పాద నియమము లేకుండుట వలన సీసము నడకలో నడచు జానపద గీతమునుండి 6 పాదములు స్వీకరించి, దానిని 12 అర్ధములుగా విడగొట్టగా 8 అర్ధముల సీసము మీద 4 అర్ధముల ఆటవెలది (అనగా ఒక్కొక్క అర్ధము ఒక్కొక్క పాదమై) సిద్ధమైనదనిపించును

(1) సీస, గీతోభయములందు ఒకే గణ విధానము.

(2) ప్రాచీన కాలమునందు 6 పాదములుగా లేఖన సంప్రదాయముండుట.

(3) యతి, లేదా ప్రాసయతి నియమము సీస గీతములందు సమానమై యుండుట.

(4) సీసపాదము అర్ధములుగ విడగొట్టబడుట, వానిలో భిన్నయతి నిల్పుట.

(5) అర్ధములను భిన్న పాదములుగ పాదగౌరవము నిచ్చి వానిలో సైతము యతి లేక ప్రాసలను వృత్తములందు నియతముగా నిల్పుట.

వంటి నియమములు ఈ ఊహను బలపరుచగల్గుచున్నవి. అఖండమైన 12 అర్ధ పాదముల జానపద గీతము 8 అర్ధపాదముల సీసముగ, 4 అర్ధపాదముల ఆట వెలదిగా ఆదిలోనుండి, తర్వాత సూర్యేంద్ర గణవ్యవస్థలో రెండు పద్యములుగా గుర్తింపబడి యుండవచ్చును. రెండు పద్యములు అతుకబడియున్న దానికంటె ఇట్లు భావించుటయే శ్రేస్సు. ఏలయనగా, ఇవి రెండు పద్యములే యైనచో ఆటవెలది వ్యస్తముగా ప్రయోగించబడినట్లు సీసము, పైగీతి లేక వ్యస్తముగా ఏల ప్రయోగింపబడలేదు? అఖండమైన పైపద్యములో తర్వాతి 4 అర్ధముల ఖండము ప్రత్యేకముగా (ఆటవెలదిగా) ప్రయోగింపబడుటకు కారణము దానికి హ్రస్వరూపత కావచ్చును. ఆటవెలది, తేటగీతులకు ప్రత్యేకాస్తిత్వము స్థిరపడిన పిదప, సీసము

మీద ఆటవెలది వ్రాయబడినపుడు తేటగీతి ఎందులకు వ్రాయబడరాదన్న ప్రయోగ ప్రయత్నముచే తేటగీతి ప్రయోగము నన్నయ కాలమునకు కొంచెము ముందుగనో, సమకాలముననో ఆచరణలోనికి వచ్చి యుండును. సీసము, ఆటవెలది, తేటగీతులు మూడు వ్యస్త ప్రయోగములున్నవో వీనిని అతుకుబడలనగలిగిన పద్యమనవలయును. కాని సీసమునకు వ్యస్త ప్రయోగము లేమిచే ఇట్లు నిర్ణయింపవచ్చును.

పొత్తపి రమణకవి లక్షణశిరోమణిలో ఋగ్వేద బ్రాహ్మణములోనివని చెప్పిన లక్షణములలో "ఇంద్రాదిత్యగణైక్యాః మనోజ్ఞాయతే బ్రహ్మవాదినో గీయతాం గీతాభవన్తి" అన్నదానికి, "....సీస గీతములయందు వచ్చే గణములు సూర్యేంద్ర గణములు వినాగా మరి ఇతర గణములు రావు గనుక ఈ సంబంధమున గీతులయందు వచ్చే గణములు సూర్యేంద్ర గణములు" అని వీని సంబంధమును గూర్చి తెలుపుటలో ఐక్యత సూచించినాడు. అంతేగాక "...మనోజ్ఞాయతేతి, మనో అనే గీతి సీసభేదము గనుక సీసపద్యములతోనే గీతులు గూర్చవలెననుట" [ల.శి. 3-306 వ.] అనియు పేర్కొనుట [గీతి సీసభేదము] ఇట్టి భావనకవకాశమిచ్చినది.

ఇంకను ఆఱు పాదముల జానపద గీతమునుండి సీసము + ఆటవెలది పుట్టినదనుటకు ప్రాససీసమును, వడిసీసమును ఆధారముగా చూపవచ్చును. ప్రాస సీసములో ఆఱు పాదములకు ప్రాస ఉండును. అర్ధములు కూడా కలుపుకొని పన్నెండు పాదములు ప్రాస ఉండవలసి ఉండగా కేవలము పూర్వార్ధములు నాలుగు పైగీతిలోని దేసి పాదములంచే ప్రాస నియమము ఎందులకుండవలయును అను ప్రశ్న ఉదయించును. వడి సీసమందిట్లే యుండును. నాలుగు సీసపాదములు - మీద తేటగీతి రెండు పాదములు [అర్ధమునకొక పాదము చొప్పున] వ్రాసికొన్నచో ఆఱు పాదముల రూపముతో కన్పట్టును. వి. కొ. పెద్దన ఇట్టిదానిని చూచి కాబోలు సీసమునకు ఆఱు పాదములే ఉండునన్నాడు.

ఈ నిర్ణయమునకు మరింత బలమును చేకూర్చు సాక్ష్యమును ఇంకను ప్రాఙ్నన్నయ యుగములో లభించినగాని, దీనిని సిద్ధాంతీకరింపలేము.

విషమసీసము అనునది వ్యస్తముగా ప్రయోగము గల రెండు పద్యముల సంధానము వలన, కవుల/ఛందః కర్తల ప్రయోగ లాక్షణీకరణ ఫలముగా భావింపవలయును సమసీసములో ఉపరిఖండమునకు వ్యస్తప్రయోగము లేకున్నను విషమసీసములో ఉపరిఖండము ఉత్సాహ పద్యముగా వ్యస్త ప్రయోగము కల్గియున్నది.

అనగా విషమ సీసములోని ఆటవెలది, తేటగీతి, ఉత్సాహ మూడు వ్యస్త ప్రయోగ ములు కల్గియున్నవి. ఉత్సాహము కూడ జానపద గీత జన్యమే. త్ర్యస్ర గతిలో నడచు జానపద గీతమునుండి ఇది పుట్టినదని ఇదివఱకే నిర్ధారింపబడినది. విన్న కోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో ఉత్సాహకు రెట్టింపు దగడ నొకదానిని సూచించినాడు. ఇనప్పటికి ఇది (ఉత్సాహ) ప్రత్యేక గౌరవమునందిన పిదపనే గీతి సమ్మేళనముతో విషమ సీసముగా సిద్ధ పరుపబడినది. కాని సమసీసముపలె విషమ సీసము ప్రయోగములో క్వాచిత్కమైనది. కారణము సీసమునందువలె ఉత్సాహ + మీదిగీతి అఖండ పద్యముగా కన్పడ కుండుట. ఉత్సాహము వృత్త లక్ష ణమును సంతరించుకొన్నది. ద్వితీయాక్షర ప్రాస నియమము నియతమయినది పై గీతియందు ఈ నియమము ఉండదు. అనగా విషమ సీసములోని పై ఖండము (ఉత్సాహ) జాతి లక్షణము, క్రింది ఖండము (గీతి) ఉపజాతి లక్షణము కలిగి యున్నది.

ఉత్సాహము మీద ఆటవెలది ప్రయోగమే అధికముగా గానవచ్చుచున్నది. కవిజనాశ్రయకర్త, విన్నకోట పెద్దన, అప్పకవి తటస్థముగా "గీతి" వాడవచ్చునని నారు. అనంత చిత్రకవి పెద్దనలు ఆటవెలదిచే కూర్చవలయునని కంఠోక్తిగా చెప్పినారు. లక్షణము మాట ఎట్లున్నను లక్ష్యములందు అన్ని గ్రంథములలో ఆట వెలదియే కానవచ్చుచున్నది. గణపవరపు వేంకటకవి తన ప్రబంధరాజ వేం. వి. విలాసములో (273 ప) ఉత్సాహయుక్త గీతియని-ఉత్సాహ మీద తేటగీతి వ్రాయుట విశేషము కావున తను అట్టి పని చేయుచు, విషమ సీసమనక "ఉత్సాహ యుక్తగీతి" యని పేరుంచుటను బట్టి సూచించినాడనవలయును.

గతి వైవిధ్య ప్రియత్వము తప్ప సమసీసమున కున్నంత సొబగు దీనికి లేదు. దానికున్నంత లయమాధుర్యము దీనికి లేదు. అందులకే దానికి గల ప్రచారము దీనికి రాలేదు. భేదముల మాట యటుంచి తెలుగులో సీసము వ్రాయని కవి లేడు. సీససౌందర్యమును గుర్తించని కావ్యపాఠకుడు లేడు.

—x—

## అధస్సూచికలు

1. ఛందో దర్పణము - తృతీ-26
2. నాట్యశాస్త్రము, XXXII - 246-255 పు.
3. హేమచంద్రుని ఛందోఽనుశాసనమునకనుబంధముగా H. D. వేలెంకర్ సంపాదించిన జనాశ్రయి - పంచమాధ్యాయం.
4. ద. దే. భా. సా. దేశి - పు. 207
5. ప్రాజ్ఞన్నయ యుగము పు. 315
6. Jayadamas Ed. H.D. Velenker (one long or two short letters are missing - Editor)
7. ఆం. మ. భా. చం. శి.—పాటి. మాధ. శర్మ
8. ల. శి. తృతీయ - 305 పు. 200, 201
9. భారతి, సెప్టెం. 1962, పు. 64
10. భారతి, ప్రభవ, ఆశ్వ. సం. 4, సంచి. 10, 1927
11. తె. ఛం. వి. 'ద్విపద సంప్రదాయము'
12. సకల లక్షణ సార సంగ్రహ చింతామణి -ఉప్పలూరి వేంకటరెడ్డి. నం. 115 ఆం. వి. వి. గ్రం. లిఖితప్రతి
13. ఆం. మ. భా. ఛం. శి. పు. 472
14. అప్పకవీయము IV-521
15. పద్మకవి, సర్వదేవుల సీసములు ప్రాచీనములు కావని యొకమతము
16. అప్పకవీయము, పీఠిక
17. ఆం. మ. భా. ఛం. శి. పు. 476
18. అనుభవసారము-పద్యసం. 216, పు. 55 (వావిళ్ళ ప్ర.)
19. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము - పద్య సం. 503
20. అప్పకవీయము - చతుర్థ, 524, 526 పద్యములు
21. " " " 530 ప.

22. ఒక్క లఘువు (న) అధికమైనది.

23. ఆంధ్ర గీర్వాణ ఛందము - C. P. బ్రౌన్

24. విశేషముగా తెలుగులో దీనినెవ్వరును మార్గవృత్తములందు పాటింపరైరి.

25. 'తెలుగు వెలుగు' - వే. ప్రభాకరశాస్త్రి (తెనుగు మెరుగులు)

26. తె. భా. ఛం. పు. 202

27. తె. ఛం. వి. - పోవెల సంపత్కుమారాచార్య పు. 34

28 Annal of Oriental Research Centenary Number, University of Madras 1957

29. ఆం. మ. భా. ఛం. శి. పు. 468

30. కా. చూ. విన్న. పెద్ద అష్టమోల్లాసము, ప. సం. 34

31. ఆం. గీ. ఛం - బ్రౌణ్యము పు. 38, "One the changing metres" అన్న ప్రకరణములో

32. కా: చూ - ఉపోద్ఘాతము - వేదం వేంకటరాయశాస్త్రిగారు, పు. 4

33. ల. శి. పీఠిక - రావూరి దొ. సా. శ. పుట. 7
— ఆం.ప్ర. సా. అ. ప్రచురణ

34. పరిశోధన- 'ఆగస్టు, నవం' 1955 - నిడుదవోలు వెం. రా.

35. తె. క. చ. పు. 126

36. ఈ ప్రయోగము రావూరి దొరసామి శర్మగారు చూపినది.
తె. భా. ఛం. రీ.పు. 205



# 2. ఆటవెలది

"మేలు మేలటంచు మిత్రులు ముగ్గురు
వింత వింత యనుచు విబుధు లిద్ద
ఱహహా యనుచు సూరులయిదుగురును మెచ్చ
నాటవెలది మూట నలరు సగము."

అని అప్పకవి (IV.537) ఆటవెలది లక్షణమును చమత్కారముగా నాట్యకర్త్రి అన్న భావము వచ్చునట్లు (పాదగణములు నాట్యద్రష్టలు రసికులునైన ప్రేక్షకులుగ) చెప్పినాడు. తేటగీతి లక్షణమును కూడ పరిశీలించినపుడు అప్పకవి ఉద్దేశపూర్వకముగా ఈ రెండు సమగీతుల పేరులలోని ఔచిత్యమును స్ఫురింప చేసినాడనవలెను. ఆటవెలది యన్న పేరు వేశ్యపదములతో కూడిన సమానమై 'నర్తకి' అన్న అర్థమును స్ఫురింపజేయుచున్నది. ఒక దేశి ఛందస్సునకిట్టి పేరుంచుటను బట్టి ఛందస్సునకు, నృత్యమునకు గల అంతర్గత సంబంధమగు లయను స్ఫురింపచేయును.

ఆటవెలది ప్రాచీన కాలమునుండి ఉపయోగములో నుండుటకు ధర్మవర శాసనము ప్రమాణము. ఇందలి సీసముపై ఆటవెలది వ్రాయబడినది. వ్యస్తప్రయోగము ప్రాచీనకాలమున కూడ కానవచ్చుచున్నది[1]. నాగవర్మ తన ఛందోంబుధియందు వ్రాసిన "ఆటగీతి" దీని ప్రాచీనతను సూచించును. ఆటగీతి యనగా ప్రాసగల ఆటవెలది ఉపజాతియగు ఆటవెలది యందు ప్రాసనియతి అన్నది మార్గిచ్ఛందో ప్రభావమని చెప్పవచ్చును. 'నాగవర్మ ఆటగీతి'ని 1వ పాదములో 4 సూర్యగణములు + ఒక చతుర్మాత్ర గణము + ఒక సూర్యగణముగా, రెండవ పాదములో 3సూ. గ. + 1చతు.గ.+1సూ. గణము వచ్చునట్లు కిట్టెల్ చూపినాడు. దీనిని తెలుగులో ఆటవెలది లక్షణములలో చూచినపుడు సరిపోవును. పొత్తపి వేంకట రమణకవి దీనిని ఋగ్వేద బ్రాహ్మణముతో ఉన్నట్లు చెప్పినాడు.

"...... ఇంక నంచు గీతా నిర్ణయము.
గభస్తి స్త్రిః ద్వేంద్ర పంచారార్కార్ద్రా ద్వ్యర్ణ విచ్ఛేదః షట్ సమానపే ప్రసన్న పదా"
"టీక"...............

సమానమే ప్రసన్న పదా— "ప్రసన్న పది" అనే పేరు గలిగిన సమగీతికి "నటి" యని పేరుగలదు. కాబట్టి నటి యనగా తెలుగున ఆటవెలది గీతియనుట. ఆ గీతికి గణస్థితిః — సూర్యగణములు మూడున్ను, ఐంద్ర - ఇంద్రగణములు రెండున్ను, పంచార్కాస్త్ర-సూర్యగణములు ఐదున్ను ఆగా పద్యార్థమును అనగా రెండు చరణములు కనుక. మొదటి చరణానకు సూర్యగణములు మూడు, ఇంద్ర గణములు రెండున్ను, రెండో చరణానకు ఐదు సూర్యగణములున్నూ. అద్రస్కర్ణ విచ్ఛేదః — అందుకు ఏడో అక్షరం యతి యగును. సూర్యగణములు నగణ హగణములు రెండిటిలో హగణమే శాస్త్ర సమ్మతమగును. ఈ ప్రసన్న పది అనేది గీతిక-షట్-ఆరు భేదములని తెలియునది..."

— లక్షణ శిరోమణి - తృతీయ - 201

ఈ లక్షణము ప్రాచీనమని, ఋగ్వేద బ్రాహ్మణములోనిదని పేర్కొనినాడు. ఈతడు తప్ప ఇతరులెవ్వరు దీనిని పేర్కొనరైరి. ఈ లక్షణము ప్రాచీనమనరాదు. గీతులు సమగీతులన్న భేదము కల్గియున్నవని లక్షణ శిరోమణికారుడనెడి ఋగ్వేద బ్రాహ్మ ణములోనిదని పేర్కొనబడుట గమనించదగినది. "శుభ్రగీతా సేనాన్వితా కేచిత్" (తేటగీతి కొన్ని మతములలో సేనముతోడ కూడునదని) అన్న మాటలు ఈ ఋగ్వేద బ్రాహ్మణ లక్షణమును అంత ప్రాచీనము కాదనుటకు తోడ్పడుచున్నవి. సమా (సమ గీతులని), నటి (ఆటవెలది), శుభ్రగీతా (తేటగీతి) వంటి పదములు తెలుగు పదము లకు సంస్కృతీకరణములని తోచును. అద్రియతి యని ఏడు అక్షరములమీద యతి యున్నది దేశీయ లక్షణముకాక-మార్గి (వర్ణ) ఛందో లక్షణమైనది. ప్రసన్నపది (=ఆటవెలది) షట్ భేదములని చెప్పుటనుబట్టి ఇది అర్వాచీన లక్షణమనియే భావింప వలయును. దేశ్య చ్ఛందములకు సంస్కృత భాషలో ఇంత స్పష్టముగా లక్షణము చెప్పినది వేరొక్కటి కానరాదు.

పొత్తపి రమణకవి చెప్పిన ఋగ్వేద బ్రాహ్మణములోనిదన్న లక్షణములోని పేర్లు విన్నకోట పెద్దనచే కావ్యాలంకార చూడామణియందు సైతము పేర్కొనబడినది. అయితే ఇక్కడ గల పదస అక్కడ లేదు.

"ప్రవళి నాఁ బ్రసన్న పదినాఁగ గీతులు
సేనములను రెండు రెండు మసల
నాటవెలది యనఁగఁ దేటగీతి యనంగ
వాని పేళ్ళు వేఱవలయుఁ దెలియ" (8-17)

ప్రపళి, ప్రసన్న పదులనగా ఆటవెలది తేటగీతులని పేర్కొనబడినది. పౌత్తపికవి మాత్రము పరుస మార్చినాడు. "...సమానదే ప్రసన్న పదా - ప్రసన్న పది అనే పేరుగలిగిన సమగీతికి "నటి" యని పేరుగలదు. కావున నటియనగా తెలుగున ఆట వెలది గీతి యనుట...." "....పపళి యనే గీతిక, శుభ్రగీతా-శుభ్రగీత అనే పేరు గలు గుటచేతను తెలుగున తేటగీతి యనబడెను." వ. ఆటవెలది గీతము ప్రసన్నపది, నటియనంబడును. తేటగీతియే పపడి, శుభ్రగీతి యనబడును...2" అని వ్రాసిన ఋగ్వేద బ్రాహ్మణమున కొతడిచ్చిన వ్యాఖ్య ఈ విషయమును స్పష్టపరచుచున్నవి.

ఆటవెలది పద్యములో ప్రతి పాదమునకు ఒకే గణక్రమముండదు. మొదటి పాదమునకు మూడు సూర్యగణములు, రెండు ఇంద్ర గణములు, రెండవ పాదమునకు 5 సూర్యగణములు ఉండగా తిరిగి ఒకటవ పాదమువలె మూడవపాదము రెండవ పాదమువలె నాలుగవ పాదముండును. బేసి పాదములొక గణక్రమము సరి పాదములొక గణక్రమము కలిగియున్నవి. అనగా ఇది మార్గ ఛందములోని అర్ధసమ వృత్త లక్షణమునకు సరిపోవుచున్నది. అర్ధ సమలక్షణము వైచిత్రీప్రియత్వముకొరకు సృష్టింపబడిన విధానము. సమ వృత్తముల విధానమునకు ఇది అర్వాచీనము. తెలుగు దేశ్య చ్ఛందములకు అర్ధ సమవృత్త విధానములేదు. సీసపద్యములోని పాదమునందలి ఒక్కొక్క అర్ధమును చూచిన పాదములోని రెండర్ధములు అర్ధసమలక్షణము కలిగి యుండును. కాని సీసపాదము రెండు భిన్నచ్ఛందస్సులు అర్ధసమవృత్త విధానములో కలిపి జతచేయబడిన వానిగా అంగీకరింపలేము. ఇది ఖండగతిలో నడచు 8 గణ ముల సమూహమని, దేశి గణములలో చివరి రెండు గణములు సూర్యగణములుగా కొలవబడినవని, ఇది గేయచ్ఛందో జన్యమని ఇదివరకు చెప్పనైనది. అట్లే ఆట వెలది సైతము ఏకపాద జానపద గేయమునుండి పుట్టి, దేశి గణములలో చూడబడి, ద్వైధ్యము కారణముగా రెండు అర్ధములుగా విభజింపబడి యుండవచ్చును. ఇది సీస పాదమునకు చక్కగా సరిపోవుట వలన సీసముతోబాటు, 6 పాదముల జానపద గీతమునుండి పుట్టి, కాలక్రమములో సీసమునుండి విడివడి వ్యస్త ప్రయోగాముగలిగి వేరు సమగీతిగా స్థిరపడియుండును. పాటిబండ మాధవశర్మగారు కూడా ఆటవెలదిని పది గణముల సమాహారముగా భావించి ఈ పది గణములలో నైదు గణములొక ఖండము, మిగిలిన యైదు గణములొక ఖండమని చెప్పిరేకాని, ఇవి వేరు వేరు పాదములని, ఒక్కొక్కటి ఒక్కొక్క పాదలక్షణమని భావింపలేదు. కాకున్నచో దీనిని సమగీతి అనుటెట్లు ?

సమగీతులని చెప్పబడిన ఆటవెలది తేటగీతులలో తేటగీతి నాలుగు పాదములకు ఒకే విధముకాగా, ఆటవెలది లక్షణము అర్ధ సమలక్షణమైయున్నది. సమలక్షణములేని ఈ ఆటవెలదిని సమగీతిగా పేర్కొనుట గూర్చి పెక్కురు ఛందో విమర్శకులు ప్రశ్నించినారు. ఖండగతిలో వరుస నాలుగు గణముల సమూహమే ఆట వెలది అర్ధమని భావించిన ఈ సమలక్షణము సాధించవచ్చును.

ఆటవెలది అర్ధసమత్వమును ప్రేరణ తీసికొని తాదోలు కొన్ని సీస పద్యములు చివర గీతిద్వయమును సమ్మేళన మొనర్చుట జరిగెనది. అనగా ఆటవెలది ఒక అర్ధము వ్రాయబడి గీతి ముగించబడినది. ఇట్లు వ్రాయబడుటను ఆటగీతి తేటగీతులు రెండు సమగీతులగుటయు, రెంటిలో ఏది వ్రాసినను తుల్యమేయన్న భావముండుట గూడ కారణములు కావచ్చును. కవి సంశయ విచ్ఛేదమునందు 1-61వ, 1-100వ, 1-15 పద్యములిట్టివే.

| | |
|---|---|
| "ఎన్న జాత్యేక వచనముల్ గొన్ని గలవు<br>వాని వర్ధభులెరుగంగ వలయు గవులు | తేటగీతి |
| హరుని నృత్తకేళి యద్భుతి చూచిరి<br>యఖిల విబుధ వర్యులన్న యట్లు | ఆటవెలది |

ఇందు పూర్వార్ధము తేటగీతియు, ఉత్తరార్ధము ఆటవెలదియు వ్రాయబడినవి.

చేబ్రోలు కపోతేశ్వరాలయ శాసనమందు పూర్వార్ధము ఆటవెలది, ఉత్తరార్ధము తేటగీతియున్నది.

| | |
|---|---|
| "సిద్ధ పంచ్యుడైన చేడెంపుల కపో<br>తీశ్వరునకు భక్తి శాశ్వతముగ | ఆటవెలది |
| మనమకులుడైన తాడూరి ఘనుడుమార<br>మాంబ కేత డఖండ దీపంబు నిలిపె | తేటగీతి |

— శాసన పద్య పద్యమంజరి. 1భా. శా. సం. 47.

దీనిని అర్ధసమ లక్షణము గలవనవచ్చును. ఆటవెలది ఉభయపాదములందలి గణ క్రమము భిన్నముగ భావించిన యెడల (మొదటి) పాదములందు లక్షణము భిన్నమై విషమవృత్తము కావచ్చియున్నది. ఈ శాసన కాలము (శా.సం. 1085) అగుటను బట్టి ఈ పద్ధతి అర్వాచీనమని భావింపవలయును.

పవడగీతికిఆటవెలదికి భేదమేమియును లేదు, ఒకట్రెండువ్రాలు తప్ప. అట్లయిన పవడగీతి విషమగీతియని, ఆటవెలది సమగీతి యని భావించుట ఎట్లు పొసగును?

ప్రాసయుండుట విషమ లక్షణమా? సీసమునకు శీర్షక స్థానమునమన్నవి సమగీతులని తక్కినవి విషమ గీతులని భావించుట కన్న వేరుమార్గము కానరాదు.

సమగీతములందు ప్రాసము లేకుండుట ఒక లక్షణము, అందుకే ఇది ఉపజాతి పద్యముగా చెప్పబడినది. ఐనను వృత్త ప్రభావము వలన ప్రాస ఉంచి చెప్పుట అన్న విధానము కానవచ్చుచున్నది. ప్రాసవలన ఆటవెలది అన్నది ప్రగీతి (వగడ/వవడగీతి)గా మారుచున్నది. కనుక దీనికి ప్రాస చెప్పకుండుటయే లెస్స. ప్రాసగల ఆటవెలది వవడగీతి అగుటను కంఠోక్తిగా చెప్పకున్నను కవిజనాశ్రయ కర్త రెండింటిని విడిగా విషమ సమ గీతులలో చూపినాడు. అనగా ప్రాస సహిత, ప్రాసరహితములాదీనిని చెప్పుట ప్రాచీనకాలమునుండియు అమలులోనున్నదనవచ్చును. కాని ప్రాసలేని ఆటవెలది కున్న ప్రాచుర్యము ప్రాసగల ప్రగీతికి లేదు. ప్రాస నిర్బంధమగుట వలన దీనిని వదరి వేయుట జరిగియుండును. ఆటవెలదికి ప్రాస ఉంచుటన్నది నాగవర్మ ఛందోఽంబుధి యందే కానవగుచున్నది. అచ్చటదానికి ఆటగీతి యని పేరు. ఈ పేరును తెలుగులో వాడుకలో లేదు. వెల్లటూరి లింగయ్య మాత్రము తన "సరసాంధ్ర వృత్తరత్నాకరము"లో పేర్కొనినాడు. భాస్కర విలసిత వృత్తమునకు ఆటవెలదిలో లక్షణము చెప్పుచు ఆటగీతి అని వ్రాసినాడు.[3] ప్రాసతో వ్రాయుట అన్నది నిర్బంధ కారణమేగాక, ప్రాసయతి వేయవలసినచో ప్రాసాక్షరము పెక్కుచోట్ల పాటింపబడవలయును. తెలుగులో ప్రాసయతి వేసికొన వీలైన ఉపజాతులందు ప్రాసనిర్బంధము లేకుండుటకు ఇదే కారణము. ఒకవేళ యాదృచ్ఛికముగ ప్రాసఘటించిన ఉపజాతులలో దోషముగా ఏ లాక్షణికునిచే చెప్ప బడలేదు. యాదృచ్ఛికముగా ప్రాస పాదచతుష్టయమున ఉంచుటన్నది ఉండదు. ఏదైనా ఒక పదము తప్పని సరిగా నాల్గు పాదములందు వాడవలసి వచ్చినను, లేదా వాడినను ప్రాస సిద్ధమగును. తిక్కన భారతమందలి ఒక పద్యము "రాజ" శబ్దము యొక్క ఆవృత్తి వలన ప్రాసఘటిత ఆటవెలది పద్యమైనది.

"రాజ తిలక రాజరాజ కంఠీరవ
రాజ రత్న దీపన రాజ తేజ
రాజ రాజ యనుచు రాజన్య సైంధవ
రాజు బనపుచుండె నాజిలోన" — స్త్రీ. II. 99.

ఏక పదావృత్తముగాక ప్రాస ఘటించిన ఆటవెలదీ పద్యము నన్నయ భారతమున గానవచ్చెను.

"పర నరేంద్ర మకుట పద్మరాగద్యుతి
నరుణమగు భవత్పదాబ్జ యుగము
పరుషదారు శిలలపై నిప్పుడరుగుట
నరుణమయ్యె బర్హ్యాంతరముల" — అరణ్య - I - 212

ప్రాస నిర్బంధత్వముగల ఇట్టి ప్రయోగములు (ప్రాస గీతులు) తెలుగు సాహిత్యములో క్వాచిత్కములే.

యతి, ప్రాసయతి వాడుక స్వేచ్ఛగా గల ఆటవెలది పద్యములలో వీని ప్రయోగ నియమములను బట్టి భేదములను సీసమునందువలె నిరూపింప వచ్చును. కాని ఇట్టి నియమములతో కూడిన ఆటవెలదులను లాక్షణికులు గాని కవులుగాని చెప్పరైరి.

| నియమము | ఉంచదగిన పేరు |
|---|---|
| 1. అన్ని పాదములలో యతినే వాడుట — | సర్వయతి ఆటవెలది |
| 2. " " ప్రాసయతినే " — | సర్వప్రాసయతి ఆటవెలది |
| 3. " " " తోబాటు ప్రాసక్షరము వాడుట — | సర్వతః ప్రాస " |
| 4. విషమ పాదము లందు ప్రాసయతి సమ " " యతి | విషమ పాద ప్రాసయతి " |
| 5. సమ పాదము లందు ప్రాసయతి విషమ " " యతి | సమ పాద ప్రాస యతి " |
| 6. పూర్వార్ధమునందు ప్రాసయతి ఉత్తరార్ధమునందు యతి | పూర్వార్ధ ప్రాసయతిఆటవెలదిలేదా ఉత్తరార్ధ యతి " |
| 7. పూర్వార్ధము నందు యతి ఉత్తరార్ధమునందు ప్రాసయతి | పూర్వార్ధయతి ఆటవెలది (లేదా) ఉత్తరార్ధ ప్రాసయతి " |

ఈ నియమములన్నింటిని పాటింపకున్నను నన్నయ ఉపజాతులలో ఈ నియమములను కొన్నిటిని పాటించినాడు [4]. అతడక్షరరమ్యతకై అట్లు చేసి ఉండును. తర్వాతి కవులు ఈ నియమమును (ఒక్క ఎఱ్ఱన తప్ప) అంతగా పట్టించుకొనలేదు. యాదృచ్ఛికములుగా లభించినవి ఉన్నవి.

1. సర్వ యతి :-

ఇట్టి పద్యములను లెక్కకుమించి చూపవచ్చును. (ఇది సాధారణ నియమము)

"అనగనగ రాగ * మతిశయిల్లుచునుండు
తినగ తినగవేము * తియ్యనుండు
సాధనమున పనులు * సమకూరు ధరలోన
విశ్వదాభి రామ * వినురవేమ."

2. సర్వ ప్రాసయతి ఆటవెలది :-

"బలియుడపుడు పెంద్రు — దలు పాదిముడిచి గం
తెసగ దాల్చి వీర — రసిక వృత్తి
నుద్ధతుండు మల్ల — యుద్ధ ప్రసాధనం
బమర నిలిచె వేడ్క — నమిత బలుడు." 5 — సభా. I. 201

3. సర్వతః ప్రాస ఆటవెలది :-

అన్ని పాదములందు ప్రాసయతినే వాడుచు ప్రాసాక్షరమును గూడ వృత్తములలో వలె ఒకే అక్షరమునుంచుట సర్వతః ప్రాస ఆటవెలది అనబడును. ఇది సర్వతః ప్రాస సీసమును బట్టి వచ్చిన నియమము ఇది ప్రాచీనముకాదు.

దండ గొండ పొల్కి — నుండుచో నొండెడ
దండి తనము మీర — నండ గొనక
పిండి పిండికాగ — రెండు కాళులుచాచి
దండి బండి పొలసు — దిండి జెండె (నీలాసు. వలి I.73)

4. విషమ పాద ప్రాసయతి ఆటవెలది లేక సమపాద యతి ఆటవెలది

"వేద విహిత విధుల — నాదరించుట యూర్ధ్వ
గతికి దెరువు విమల * గడచి యెండు
నాగ బడిన వాని — లోగక చేయుట
యధమ గతికి మార్గ * మనిరి మునులు — ఆది.III.220

5. సమపాద ప్రాసయతి ఆటవెలది లేక
విషమపాదయతి ఆటవెలది :-

“ఔర పిరి కొమ్మ * నాకార రేఖ నీ
మాయ మాట మాటకు — మారు మాట
పీని కన్ను వోయి * పెదవుల్లొ గలతి
రేపు మాపు బాపు * రేపు మాపు” — సారంగధర చరిత్ర. II 41

6. పూర్వార్ధ ప్రాసయతి ఆటవెలది లేదా
ఉత్తరార్ధ యతి ఆటవెలది -

“వాని జాడ సఖుడు — దాన్ని రాణిమీ
నున్న గలిగినంగ — నన్ను పొంది
యమా వినయము చేత * నవిశంపు దట్టించ
నైతి నింక నాకు * నలుగ పంపు” — అరణ్య. II. 180

7. పూర్వార్ధ యతి ఆటవెలది లేదా
ఉత్తరార్ధ ప్రాసయతి ఆటవెలది

“పత్ని పహ్వారెంపు * ప్రయ్యలుగా గోసి
పరిజనముల వెల * పాలు సేసె
యాక్షణంబు పుట్టి — దక్షపురం బిత్త
మమున వెడలి యుచ్చి — ప్రమథ గణము”
— కుమార. సంభవము. II. 65

కావ్య పరిశీలనలో ఇట్టి భేదములు లభించినను ఇవి ప్రయత్నజములైనవిగ కన్పట్టవు అప్రయత్నముగ వెల్వడినవిగ తోచును.

ఆటవెలది నడక :-

ఆటవెలది ఖండగతిలో నడుచు పద్యము. దేశముతో దీనికి పొత్తు కుదురుట కిదియే కారణము. మౌఖిక సంప్రదాయముతో వెలసిన శతకములలో ఈ లక్షణము బాగుగా ఎరుకపడును. లిఖిత (కావ్య) సంప్రదాయములో ఆటవెలది సూర్యగణ బాహుళ్యము కల్గి త్ర్యస్యజాతి నడకలు కల్గినది కన్పట్టును. వేమన్న ఆటవెలదులు మౌఖిక సంప్రదాయముతో విలక్షణ శైలిలో ఖండగతి నడకతో పఠింపబడుట తెలుగునాట సంప్రదాయము.

3 4 3
ఉప్పుకప్పు రంబు = 10 మాత్రలు
5 5
ఒక్కపోలిక నుండు = 10 ”

3 4 3
చూడ చూడా రుచుల = 10 మా”
5 5
జాడవే రూ షః = 10 మా”

5 5
పురుషులందూ పుణ్య = 10 మా”
5 5
పురుషులే వేరయా = 10 మా”

5 5
విశ్వదాభిరామ = 10 మా”
5 5
వినుర వేమా ఆ — = 10 మా”

వేమన్న ఆటవెలది నడకలు ఇలా సాగుతాయి. లేఖన సంప్రదాయములో ఈ పద్యము.

“ఉప్పు కప్పు రంబు ఒక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులే వేరయ
విశ్వదాభి రామ వినుర వేమ” అని యుండును. పై గేయవిధానం

తెలుగునాట సుప్రసిద్ధమైనదే. ఈ నడక వల్లనే ఇది సీసమునకు చేరువమైనది. సమ భాగతమై మాత్రల పూరణము, పాదాంత దీర్ఘీకరణము గేయ సంప్రదాయములో తరచు కన్పట్టెడి నియమము. అదే విధానములో పఠించినపుడు తప్ప ఆటవెలది నడక బోధపడదు. అయితే ఈ గేయ విధానము పాదాంత యతి, గణమును బట్టి పదము, కూర్చజాలినపుడే చక్కగా సాధ్యమగును. ఈ రెండు నియమములు చక్కగా సాధించిన వారిలో వేమన్న అగ్రేసరుడు, తిక్కన ఇట్టిదానిని సాధించినను అక్కడక్కడ అపవాదములు లేకపోలేవు.

"అంగరాజుల గురుని సంయుగంబునఁ దునిమెం -
-ద్రజుని గాచుట యొగ్గడించు గాచె" —ద్రోణ.II.17.

పాదాంతయతి (విచ్ఛేదము) వలన గలుగు అపూహలక్ష్యము ఇట్టి చోట్ల చెడును. లయకొఱకు చదివినచో "ద్రజుని గాచుట" అన్న విరుద్ధ అర్థమును చెడగొట్టును. కాని యిట్టి పాదోల్లంఘనము పండిత కవులందు సైతము కావ్య ప్రయోగములలో క్వాచిత్కముగా మాత్రమే కానవచ్చుట విశేషము.

కేవల పాదాంత విచ్ఛేదము మాత్రమేగాక గణమునకొక పదమన్న విధానము సైతము ఇట్టి సాగతీతలతో కూడిన గేయసంప్రదాయమును పోషించును. లేనిచో లయ భిన్నమగును. తెలుగు సంధి పదములు అతిచిన్నవగుట వలన సూర్య గణబాహుళ్యముగల ఆటవెలదియందు సైతము ఇట్టిది సాధ్యమే.

1) "అనగ అనగ రాగ (మతిశయిల్లుచునుండు)
తినగ తినగ వేము తియ్య నుండు" —వేమన

2) "తేనె సోక నోరు (తీయనయగురీతి)
తోడ నర్థ మెల్ల తోచ కుండ
గూఢ శబ్ద ములను (గూర్చిన కావ్యమ్ము)
మూగ చెవిటి వారి ముచ్చ టగును."
— మొల్ల రామాయణం - అవ-17.

3) "వాలు మీలు డాలు (నేలింతి కన్గవ)
సోము గోము నోము గామ మోము
మించు మంచు నంచ (సుంచుబాలికమేను)
మిన్ను చెన్ను దన్ను కన్నె నడుము"
— ప్రబంధ. రా. వే. విజయవిలాసము వ. 396.

4) చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు
నాగు లేటి నీళ్లు నాప రాళ్లు
సజ్జ జొన్న కూళ్లు సర్పంబు లునుదేళ్లు
పల్లె నాటి సీమ పల్లెటూళ్లు (శ్రీనాథుని చాటువు)

ఇట్టివి గణముననొక్క నవముగా విరిగి పాదాంతయతి గల్గి, ఖండగతి సాధించుటకు సాగతీత కనువైన పద్యములు పెక్కింటిని ఉదాహరింపవచ్చును.

ఇట్టి మధురగేయ నడతిగల పద్యము మధ్యయుగములందు తెలుగు కవులచే వదలివేయబడి, తేటగీతి ఆస్థానము నాక్రమించెను. వందల తేటగీతుల కాశీ ఖండములో ఆటవెలదులు కేవలము ఐదే ఉన్నవి. వేమన్న మాత్రము ఇందులకపవాదమై ఆటవెలదిని అందలమెక్కించినాడు.

— × —

## అ థ స్సూ చి క లు

1. ఇదే గ్రంథమందు ప్రాఙ్నన్నయయుగ శాసనచ్ఛందస్సులలో వివరింపబడినది.
2. లక్షణ శిరోమణి - తృతీయాశ్వాసము. ప.సం. 306, 308.
3. సరసాంధ్రవ్య.ర. - ఆంధ్ర విశ్వవి. వి. ప్రతి సం. 109
4. 'నన్నయ ఎఱ్ఱనల ఉపజాతులు' - వంతరాం రామకృష్ణారావు. భారతి. ఫిబ్రవరి, 1962
5. ఆం.మ.భా. సంశోధిత ముద్రణ ఉపో. విశ్వ. వి ఆంధ్రశాఖప్రచురణ పు.104

★ ★ ★

# 3. తేటగీతి

మిత్రుఁడొక్కఁడు వీణియ మీటుచుండ
విబుధవరు లిద్ద ఱర్థంబు విప్పిచెప్ప
ఇనులు నిద్దఱు విసుంచుచు నేకగతిని - అని అప్పకవి తేటగీతి

పాదమునకు 1 సూ.గ. +2 ఇం.గ్ర.+2 సూ.గణములుండుటను చమత్కారముగా చెప్పినాడు. 'ఏకగతిని' అనుటలో సమగీతి యన్నది స్ఫురించును. ఆటవెలదితోపాటు తేటగీతి సమగీతులలో చేర్పఁబడినది. ఆటవెలది లక్షణము అర్ధసమ లక్షణము కాగా తేటగీతి లక్షణము నాలుగు పాదములందు ఒకే గణక్రమముతో సమలక్షణమై సమ గీతులుగా గుర్తించబడుటకు యోగ్యమై ఉన్నది. ఆటవెలదితో సమాన పాద ప్రమాణమును, తుల్యయతి స్థానమును (3గణముల పిదప యతి), తుల్య శీర్షోప యోగమును కలిగియున్నది. పాద దైర్ఘ్యమునకు ప్రమాణమైన 3 సూ.గ +2ఇం.గ. రెండింటి (ఆటవెలది, తేటగీతి) యందు సమానము. గణక్రమము మాత్రమే వ్యత్యాసము.

ఆటవెలది : సూ+సూ+సూ+ఇం+ఇం

తేటగీతి : సూ+ఇం+ఇం+సూ+సూ

అందువల్ల సీసము మీద గీతిగా దేనిని వాడినను సీస ప్రమాణములో వ్యత్యాసము రాదు. ఆటవెలది ప్రయోగము తెలుగు సాహిత్యమున ఆదికాలమున అధికముగా నుండి తర్వాతి కాలమున తేటగీతి ప్రచురమైనది. సీసము మీదగాని, విడిగా గాని ఈ విషయమున ఉభయ ఛందములకు తుల్యమే.

వ్యస్త ప్రయోగమున ఆటవెలది వలెనే తేటగీతికి మారుపేరు, కవులెవ్వరు వాడకున్నను, సూచింపబడినది. వపడి, ఖుత్రగీతి యని తేటగీతికి పేరు పొత్తపి రమణకవి ఋగ్వేద బ్రాహ్మణములోనిదని చూపిన లక్షణములో చెప్పినాడు.

"తేటగీతియు పవడి చంద్రగీతి యనబడును. ఇది సీసగీత జాత్యధికారము లక్షణము"
—ల.శి. III - 308.

"......హంసేంద్ర గభస్త్యేక ద్వౌద్వౌ చంద్రగీతా సీసాన్వితా కేచిత్ గాగ (య)తిః పవళిః...." వివరణః పవళిః - పవళియనే గీతిక, చంద్రగీతా -చంద్రగీత అనిపేరు గలుగుట చేతను తెలుగున తేటగీతి యనబడెను. సీసాన్వితా కేచిత్ - ఈ పవళియనే గీతికి, కేచిత్-కొన్ని మతములలో సీసముతో కూడుననుట ఆపవళి గీతికి - హంసేంద్ర గభస్త్యేక ద్వౌద్వౌహంస - సూర్యగణము, ఏక- ఒకటిన్ని, ఇంద్ర-ఇంద్రగణములు, ద్వౌ-రెండున్ను, గభస్తి - సూర్యగణములు ద్వౌ-రెండున్ను కూడ ఐదుగణములు చరణమునకనుట. గాగ (య)తి- గాగ -మూడు గురువులు, ఆరులఘువులు గనుక ఏడోయక్షరము యతియగుననుట. ఏడు గురువు లనగా సూర్యగణానికి 3 లఘువులున్ను, ఇంద్రగణములు 2 కిన్ని 10 లఘువులు కూడ, 13 లఘువులాయె గనుక రెండు లఘువులు 1 గురువు గనుక 12 లఘువులు 6 గురువులు గనుక తక్కిన 14 లఘువులయతి నిలుప వలయును గాన 'గాగయతిః' అన్నాడు. గ అంటె గురువున్ను, అగఅంటె ఏడనుట. ఇంద్ర గణములలో నగ, సల, ర, త గణములు ఐదేసి లఘువులు గలవి గనుక నీగతికి ఈ శాస్త్రపద్ధతి సంకేతము. —లక్ష - శిరో.తృతీయ. వృవాధి.—306.

పై లక్షణ శిరోమణి లక్షణములో విశేషాంశములు - ఇంద్రగణములు రెంటికి 10 లఘువులని చెప్పుట, ఇంద్రగణములలో నగ, సల, ర, త గణములు (ఐదేసి మాత్రలవి) ఉపయోగించుట, ఈ పవళియనే గీతిక సీసముతో 'కొన్ని మత ములలో' కూడుననుట.

ఇంద్రగణములు త్రిగురు ప్రస్తారములో ఎట్లున్నను, వాడుకలో పంచ మాత్రికములుగనే భావించినట్లు పై లక్షణము విశదీకరించుచున్నది. 'సీసాన్వితా కేచిత్' అనుటనుబట్టి ప్రాచీనకాలమున ఆటవెలదియే సీసము మీద ఉండెడిదని కొన్ని మత ములలో తేటగీతి అతుకుట అన్నది ఉన్నదని తెలియుచున్నది. ప్రాచీనాంధ్ర సాహి త్యములోని ఆటవెలది బహుళ ప్రయోగము, తేటగీతి క్వచిత్ప్రయోగము దీనిని బల పరచుచున్నది.

| కవులు | సీసము మీద వాడిన ఆటవెలదుల సంఖ్య | సీసము మీద వాడిన తేటగీతుల సంఖ్య |
|---|---|---|
| నన్నయ | 225 | 26 |
| నన్నెచోడుడు | 92 | 94 |
| తిక్కన | 369 | 783 |
| ఎఱ్ఱన (భార. మాత్రం) | 62 | 40 |
| శ్రీనాథుడు (కాశీఖం + శృంగా.నైషధ) | 1 | 427 |
| పోతన | 222 | 677 |
| మొల్ల | 5 | 82 |
| అల్లసాని పెద్దన | – | 79 |
| కంకంటి పాపయ్య | 6 | 359 |

పై పట్టిక ననుసరించి పరిశీలించిన కాలక్రమమున సీసము మీద తేటగీతి బహుళమై, ఆటవెలది ప్రయోగము అతి స్వల్పమైనట్లు కానవగును.

### తేటగీతి - ప్రాస :-

తేటగీతి సైతము ప్రాసలేని ఉపజాతి ఛందమే ప్రాస లేకుండుట ఐచ్ఛికము కాగా, ఒకవేళ ప్రాస కాకతాళీయముగనో, పద్యైకావృత్తి రూపముననో, సప్రయత్నముగనో ఉంచబడిన తేటగీతి కాకుండపోదు. ఉంచరాదన్న నియమమును, ఉంచుట లక్షణ విరుద్ధమన్న అంశమును లాక్షణికులు కంఠోక్తిగా చెప్పరైరి. సామూహికముగా ఉపజాతులకు మాత్రము చెప్పినారు. కాని ప్రాసను ఉపజాతులలో అలంకార ప్రాయముగా ఉంచుటల న్నది అక్కడక్కడ కానవచ్చుననే ఉన్నది.

అప్రయత్నజములగు ప్రాసలు గల పద్యములరుదు. వృత్తములందు ప్రాసాక్షరములతో సప్రయత్న పద్య రచన గావించుచు కవులు వేళ పద్యములను అలవోకగా వ్రాయుచు, తిరిగి అట్టి శ్రమను స్వీకరింపరు. సప్రయత్నప్రాస నిక్షేపిత పద్యమునకు ఉదా :-

కవ్వంపుఁ బ్రాడునకుఁ జేతి కదెమొసంగి
గువ్వకోలుగఁ జెనుకాల దూట మార్చి
ఠివ్వటిలు నీదు ప్రేమంబు నీవు మాకు
దివ్వెలై గాక జీకటిఁ దెరల లేము

—శ్రీమద్రా. కల్ప. వృ. — బాల. అహల్య - 441

ఇట్టివి ప్రాచీన సాహిత్యమునందు అంతగా గానరావు. ఒకే పద్యము అవృత్తియగుట వలన ప్రాస సంధానమైనవి మాత్రము కానవగును.

ప్రాసగల తేటగీతి :

వీడె కృతహస్తు డఖిలాస్త్రవిద్యలందు
వీడె యగ్రగణ్యుడు ధర్మవిదులలోన
వీడె భరతవంశంబెల్ల వెలుగకుంతి
కడుపు చల్లగా బుట్టిన ఘనభుజుండు

— ఆది VI-19 - కుమారాస్త్ర వి. ప్ర. నన్నయ

ఇట్టి యల్ప సంఖ్యలోగల పద్యములను ఆదికాలమునను, మధ్య యుగములందు నప్పుడ్డిగ చూపవచ్చును. కాశీఖండములోని ఈ క్రింది పద్యము ఉదాహరణీయము.

ఇంక నెన్నడు చూతునో యేను దుంతి
నింక నెన్నడు చూతునో యేను దుర్గ
నింక నెన్నడు చూతునో యేను వటుకు
నింక నెన్నడు చూతునో యేను గుహుని 3 - 158

ప్రాసను, అనుప్రాసను కలిపి ఒకే అక్షరముతో సప్రయత్నముగ శబ్దా లంకారయుతముగ గణపవరపు వేంకటకవి (17 శ.) వ్రాసినాడు.

కేళికా శారికా సురసాల సాల
పాళికా శారికాసార మౌళి కాబ్జ
ధూళికా మాలికాత్త మనూళి కాళి
బాలికా హేళికా ధ్వనుల్బరగుకోట

— ప్ర. వేం. వి. పి. 440

ప్రాసగల అటవెలది ప్రగీతి (పవడగీతి) మైనట్లే ప్రాస గల తేటగీతి అంతరాక్కర యగుటకు అవకాశమున్నది. అంతరాక్కరకు ప్రాస నియతము. గణముల విషయమున మాత్రము చివరి చంద్రగణము రెండు సూర్యగణములు కాగల్గిన సరిపోవును.

అంతరాక్కర : 1 సూ. గ + 2 ఇం. గ + 1 చం. గ
తేటగీతి : 1 సూ. గ + 2 ఇం. గ + 2 సూ. గ

భీమేశ్వర పురాణములోని (II - 88 ప.) క్రింది పద్యములోని మొదటి మూడు పాదముల చివరి చంద్రగణము రెండు సూర్యగణములుగ విడిపోయి ప్రాసగల్గి యున్నది

| | చం. | సూ. |
|---|---|---|
| ఎట్టు పాసితి మిన్నేటి యిసుక తిప్ప | (నహ) = | స, హ |
| ఎట్టు పాసితి వాస్థలం బేను కోను | (రల) = | హ, హ |
| ఎట్టు పాసితి పవిముక్త హట్ట భూమి | (రల) = | హ, హ |
| ఎట్టు పాసితి విశ్వేశు నెందు ధరుని | — | — |

ఇంతకు ముందటి "కప్పంపుద్రాడు...." యన్న రామాయణ కల్పపృష్టోదాహరణము నాలుగు పాదములు గణములు కలసి, అంతరాక్కర కావగియున్నది. అనంతామాత్యుడు వ్రాసిన అంకరాక్కర ప్రాసగల తేటగీతి కావగియున్నది.

కావుననే ప్రాస నియమముచే ఈ రెండు ఛందముల అస్తిత్వము వ్యక్తముగా ఉండగల్గినది. కాని అంతరాక్కర ప్రయోగములో లేదు. దీని ప్రచారాభావమునకు - తేటగీతి ప్రచార బాహుళ్యము కారణము కావచ్చును.

## తేటగీతి - అంత్య ప్రాస :-

పాదాంత విచ్ఛేదమై, అంత్యప్రాస ఘటింపబడినప్పుడు దేశి ఛ్ఛందముల సౌందర్యము మరింత స్పష్టమగును. పద్యైకాప్యత్తిపలన పాదాంత్యానుప్రాస తేటగీతి పద్యములలో బహుళముగా గానవచ్చుచున్నది.

పొగడదగువాని గానరే పొగడలార
యాదెఱంగని విభుజూపుఁ డీదెలార
మొల్లమగు కీర్తివాడేడి మొల్లలార
శుకనిగదితునిఁ జెపుడు కింశుకములార

— భాగవ. దశమ. పూ. భా. 1015

కంకంటివారి ఉత్తర రామాయణములోను (VI - 292, 299, VIII - 165), కాశీఖండములోను (I - 137, VII - 217), హంసవింశతిలోని పెక్కు పద్యములోను తేటగీతి పద్యములందు అంత్యప్రాసము కానవచ్చుచున్నది. భాగ

పతకము (VI - 85) లోను, కాశీఖండములోను (I - 107) మూడు పాదములకు మాత్రము అంత్యప్రాస ఘటింపబడినది. పూర్వార్ధమునకు మాత్రము కాశీ - IV - 113లో, ఉత్తరార్ధమునకు మాత్రము కాశీ. పీఠిక అవ-20లో ఘటించిన వానిని గూడ చూడవచ్చును. ప్రాసతోబాటు పాదాంత్యప్రాసను పద్యైకావృత్తితో కూడ ఘటింపబడినవి కానవచ్చుచున్నవి (కాశీ ఖం. I - 132).

**తేటగీతి భేదములు :-**

యతి లేదా ప్రాసయతి నాలుగు పాదములందును ఐచ్ఛికమగుట వలన, పాద చతుష్టయమున ఒకే నియమము అక్కరలేకుండుట వలన వీనిని నిక్షేపించుటలో తేటగీతి భేదములు చూపవచ్చును. ఆటవెలదికి వలెనే తేటగీతికిని లాక్షణికులు భేదములు చెప్పలేదు. ఉపజాతులలో ఇట్టి భేద కల్పనము ఒక్క సీసము నందు మాత్రము లాక్షణికులచే ఆదరించబడినది.

| నియమము | | భేదమునకుంచదగిన పేరు |
|---|---|---|
| 1. అన్ని పాదములలో యతినే వాడుట | — | సర్వత్రయతి తేటగీతి |
| 2. " " ప్రాసయతినే " | — | సర్వత్ర ప్రాసయతి తేటగీతి |
| 3. విషమ పాదములందు ప్రాసయతి సమ పాదములందు యతి | — | విషమపాద ప్రాసయతి తేటగీతి లేదా సమపాదయతి తేటగీతి |
| 4. సమపాదములయందు ప్రాసయతి విషమ " " యతి | — | సమపాద ప్రాసయతి తేటగీతి లేదా విషమపాద యతి తేటగీతి |
| 5. పూర్వార్ధము నందు ప్రాసయతి ఉత్తరార్ధము నందు యతి | — | పూర్వార్ధ ప్రాసయతి తేటగీతి లేదా ఉత్తరార్ధ యతి తేటగీతి |
| 6. పూర్వార్ధము నందు యతి ఉత్తరార్ధమున ప్రాసయతి | — | పూర్వార్ధ యతి తేటగీతి లేదా ఉత్తరార్ధ ప్రాసయతి తేటగీతి |
| 7. ద్వితీయాక్షరము ప్రాసముతోబాటు ప్రాసయతి సర్వపాదములందు | — | సర్వపాద ప్రాసయుత - ప్రాసయతి తేటగీతి |

పై భేదములకు ఆంధ్ర మహాకవుల ప్రయోగములు కొన్ని :

## 1. సర్వత్ర యతి తేటగీతి :-

ఇది సహజమైన తేటగీతి లక్షణముతో కూడుకొన్నది. ఇట్టివి వేలకొలది చూపవచ్చును.

ప్రౌఢి పరికింప సంస్కృత * భాష యంద్రు
పలుకు నుడికార ముననాంధ్ర * భాష యందు
రెవ్వరేమన్న నండ్రుగా * కేల కొఱత
నా కవిత్వంబు నిజకుక * రాట భాష — భీమ ఖం. 1 - 15

## 2. సర్వత్ర ప్రాసయతి తేటగీతి :-

ఇట్టివి కవిప్రయోగములో అతిస్వల్పములు.

ఏను గుర్వర్ధ మర్థినై * మానవేళ
కడగి వచ్చితి నిపుడునీ * కడకు పేద్క
దండి తారాతి నీదేవి * కుండ లమ్ము
లిమ్ము నాపూన్కి యిది సఫ * లమ్ముగాక — ఆది - I - 95

## 3. విషమపాద ప్రాసయతి తేటగీతి :-

1, 3 పాదములందు ప్రాసయతి పాంటిపబడి 2, 4 పాదములందు యతి పాటింపబడినది.

ఎఱుగరా దింతులార యీ * తెఱవ నిచట
మసలగా నీక తోతెండు * మనము గొనిన
కుసుమ కిసలయ ఫలసప * ప్రసవ రసము
లసమ శరునకు నర్పింత * మనుచు వెడలి. — వసు చ. III-151

## 4. సమపాద ప్రాసయతి తేటగీతి :

ఫల సమిత్కుశ కుసుమాది * బహు పదార్థ
తతియు నుదికిన మడుగుఘో * వతులు గొంచు
బ్రహ్మచారులు వెంటరా * బ్రాహ్మణుండు
వచ్చు నింటికి ప్రజ తన్ను * మెచ్చి చూడ
— మను చరిత్ర i-54

## 5. పూర్వార్థ ప్రాసయతి తేటగీతి :

మున్ను తన చౌల నెన్నడు * విన్నయతడు
కన్నులారంగఁ దాఁబొడ * గన్నయతడు
గాని యసమాన రూపరే * ఖా విలాస
కలితు ననిరుద్ధు నర్మిలి * గవసి నటులు —భాగవ - కృ. భా-3 :6

**6. ఉత్తరార్ధ ప్రాసయతి తేటగీతి :**

బ్రహ్మ నిలయమ్ము వైకుంఠ * పట్టణమ్ము
నాగ కంకణు శైలమ్ము * నాక పురము
లలిత గతి బోలు యేవేళ * దులను దూగి
ఘనత నొప్పారు నవ్వూరి * వనము లెల్ల.

—మొల్ల రా - బాల కాం - 15

**7. ప్రాసయుత ప్రాసయతి తేటగీతి :**

ఉపజాతులలో ప్రాస లేకుండుటవలన ప్రాసయతి, యతికి బదులుగా వాడు కొనుటకు వీలున్నది. అదికూడ నాలుగు పాదములందు నియతముకాదు. ఒకవేళ నాలుగు పాదములందు నియతమై, ప్రాస కూడ ఘటింపబడినచో మరింత చమత్కార హేతువగును. దీనిలో ఒకే అక్షరము పాదమునకు రెండుసార్లు, మొత్తము 8 పర్యాయములు ఆవృత్తమగును. ఇట్టి రచనము శ్రమాపాదకము. కనుక ఆంధ్ర సాహిత్యము నందిట్టివి అరుదు. పరిశీలనములో ఒక పద్యమిట్టిది లభించినది.

ఇఱుకు భుజములు కెంజాయ * కఱకు మీన
లుఱుకు కనుగ్రుడ్లు మిట్టపం * డ్లుఱుకు నెఱులు
వెఱుకు చూపులు పరుపుల * విఱుపులుగల
మెఱుక లపొరదా మకుడుగొం * దఱవెని యందు

—ప్ర. వేం. వి. వి. 192 ప.

**తేటగీతి నడకలు :**

ఒక యనిర్వచనీయ మహోన్నతమగు
హాయి యున్నది గీత పద్యములయందు
దరులొరసి పారు గాంగ నిర్ఝరిణి కరణి
చెంగుచెంగున గీతి తురంగ లించు[1].

గీతి ఛందము యొక్క నడకలను గూర్చి ఛందోమర్మజ్ఞులు పలికిన ప్రశంస యిది. 'గట్టునొరసి పారు'ననుటలో నియతి, 'చెంగు చెంగున తురంగలించు' యనుటలో స్వేచ్ఛ ఇట సూచితము. మనోహరమయిన దీనినడక కారణముగనే మధ్యయుగాంధ్ర సాహిత్యమునందు సీసముపైగాని, వ్యస్తముగా గాని, ఆటవెలది విస్మృతమై తేటగీతి గద్దెనెక్కినది. సీస శతకములలో పెక్కు సీసములు తేటగీతితో ఉపయోగింపబడినవే.

పూర్వోక్త విధముగా గణమునకొక్క పదము వ్రాసిన తేటగీతి లయ మనోహరమగును.

ఎండ తాకక యుండగ నెత్తి పట్టు

పగలు ముంగికే భుజగంబు పడగ గొడుగు —కాశీ. ఖం. 2-43

పాదాంత విచ్ఛేదమువల్ల తేటగీతి పాద ప్రమాణము పరిత్య మనము నాకట్టుకొనును.

బోధ మల్పంబు గర్వమ త్యున్నతంబు —

శాంతి విప్పచ్చరంబు మచ్చరము ఘనము —

కూప మండూకముల బోలె కొంచెమెఱిగి —

పండితమ్మన్యులైన పై తండికులకు. —భీ. ఖం.

శ్రీనాథుని నైషధములోని తేటగీతులు ముప్పాతిక మువ్వీసము పాదాంత విచ్ఛేదమును పాటించి నూతన పదముతో తర్వాతి పాదారంభమును గావించిన వన్నచో దీనికి శ్రీనాథుడు మొ॥ కవులు ఎంత ప్రాధాన్యమిచ్చినారో తెల్లమగును.

గందళింపంగఁ గాశికా ఖండ నైష—

—ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి. —భీ. ఖం. పు. 17

వంటి ఒకటి రెండు ప్రయోగములు పాదాంత విచ్ఛేదము లేక, అర్థవంతమయిన విరుపులో పాదోల్లంఘనమై, పాద ప్రమాణము ఉత్తమై నడక చెడినవి. పాద ప్రమాణార్థమై చదివినచో

"ధ ప్రముఖ వివిధ ప్రబం

ధ ములొనర్చి" అని అర్థము చెడిపోవుట కాంచనగును. పాదాంత యతి కనీసము సంధివశమైనను లయ చెడిపోదు.

ఎన్ని కల్పంబు లరగిన * నెడలిపోవ

దెంద దింద్రులు గడచిన * నెలమి తప్ప

దెన్ని మన్వంత రంబులు * చన్న నెప్పుడు

పసిమి తప్పదు కాశికా * పట్టణంబు. —కాశీ. ఖం. II-48

1) తేటగీతి రచనలో గమన సౌందర్యము వ్యంజింపజేయుటకై తప్పని సరిగా మొదటి గణము (సూ. గ) న కొక్క పదము వ్రాయవలయును. పూర్వ మహాకవి రచనలలో వేలాది పద్యముల నిందు కుదాహరణముగా చూపవచ్చును.

అంతేగాక 2) తద్వాతి-రెండు ఇంద్రగణములు విడివిడి పదములు గాకున్నను ఆ రెంటికి కల్పితమైనను పదసమాప్తి ఉండవలయును. అనగా యతి స్థలమునుండి కొత్త పదము ప్రారంభము కావలయును. 3) యత్యనంతర ఖండము 2 సూర్య గణముల సమాహారము. ఇది అంతయు ఒక్క పదమైనను, సమాసమైనను చాలును.

1 2 3 4 5
1) లంక యేటికి సైన్యంబు లింక నేల

—మొల్ల రా. యు. కాం. 27

1 2+3 4 5
2) ఎన్ని మన్వంతరంబులు చన్న నెపుడు—కాశీఖం. 1[illegible]-48

మొదటి గణము ఒకే పదము కాకున్న లయ లుప్తమగుటకు ఉదా :-

భూషణ వికాస శ్రీధర్మ పురనివాస దీనిని గేయ సంప్రదాయము భూష-ణ వికాస-శ్రీధర్మ అని లయ కొఱకు చదువుటపరిపాటి (నరసింహ శతకము)

3) యత్యనంతర ఖండము అఖండ పదమగుటకు
భావ రససుధా చర్వణ * "ప్రౌఢ తయును"

—[illegible]. ఖం. ప. 17

తేటగీతిని స్థూలముగా త్ర్యస్ర, చతురస్ర లేదా ఖండగతియని (ఆటవెలది ఖండగతి యని చెప్పినట్లు) చెప్ప వీలులేదు. ఆటవెలదిలో యతి పూర్వ భాగము సూర్యగణ ప్రయుక్తము. ఉత్తర భాగము ఇంద్రగణములు గలది. తేటగీతి అట్లుగాదు యతి పూర్వభాగము సూర్యేంద్ర గణ సంకలితము. పాదమును యతి పూర్వానంతర ఖండములని విభజింపక పూర్ణపాదమును గతిశోధనకై స్వీకరింప వీలులేదు. యతి తోడనే గతి. కనుక తేటగీతి యతికి పూర్వము 13 మాత్రలని, యత్యనంతరము 6 మాత్రలని మాత్రము భాగించుకొనవలయును. ఇట్టివిభజనలో దీనిని త్ర్యస్ర గతిలో నడుపుటకు వీలున్నది. యత్యనంతర ఖండము ఎట్లైనను 6 మాత్రలే (సూ.గ) యతి పూర్వభాగములో మొదటిది 3 మాత్రలగణము, తక్కిన రెండింద్ర గణములు 9 మాత్రలుగ లెక్కింపగల్గినచో పాదము మొత్తము 6 త్రిమాత్రా గణములతో త్ర్యస్ర గతిని సాధించును. ఐతే పదమొక్కొక్కటి 3 మాత్రలకు విడిపోవలయును. అనగా 9 మాత్రల 2 ఇంద్రగణములు - 2 పదములుగా (గణమునకొక్క పదముగా) గాక మొత్తము మూడు పదములుగా విడిపోవలయును.

సందె వేళ పొలము గట్టు * చల్ల గాలి[2]

పై తేటగీతి 3 మాత్రల కొక్క గణముగా విడిపోయినది. గణములలో చూచిన అది సందె-వేళపొ - లముగట్టు * చల్లగాలి — గా వ్రాయబడ వలయును. అనగా 5 మాత్రల ఇంద్రగణములు రెండుకు బదులు 4 మా. ఇంద్రగణమొక్కటి (భ,నల) 5 మాత్రల ఇంద్రగణమొక్కటి (నగ, సల, ర, త) వ్రాయబడవలయును కాని యిట్టి నడకలు ప్రాచీన కవి ప్రయోగములలో గానరావు. ఆధునికులు గతిపై చిత్రప్రియులై ఇట్టి ప్రయోగములు గావించినారు.

## తేటగీతి ఇతర ఛందములు :-

తేటగీతికి ఆటవెలదికి గల పొత్తు ఇదివరలో తెలిపితిని సర్వలఘు (సీసము మీది) గీతి విషమ పాదములు ఆటవెలదియో తేటగీతియో తెలియ రాకుండును.

| సూ | ఇం | ఇం | సూ | సూ | |
|---|---|---|---|---|---|
| దతతు | హినమహి | ధదరత | ఱపడ | తులిత | - తేటగీతి |
| సూ | సూ | సూ | ఇం | ఇం | |
| దతతు | హినమ | హిధద | రతఱప | డపులిత[3] | - ఆటవెలది |

కాని యతి విషయమున ఉభయమునకు సరిపడునట్లుండవలయును. పైన తేటగీతికి యతి కుదురుటలేదు. [ఈ పద్యము కావ్యమున తేటగీతిగానే కలదు. కవి యతి నుల్లంఘించినాడు. లేక ఆటవెలదిగా (యతి కుదిరినది గనుక) రాసి, మొదటిపాదము పిదప తేటగీతిగా యాదృచ్ఛికముగానో సప్రయత్నముగానో వ్రాసియుండునా? ఐనచో యిది విషమ వృత్తమగును యతి విషయముననే ప్రమాదము జరిగియుండును.] ఈ కావ్యముననే మరొక పద్యమున యతి చక్కగా కుదిరినది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ననెల | నెలనుమ | నసునఘ | నతను | గనుచు | - తే.గీ. |
| ననెల | నెలను | మనసు | నఘనత | నుగనుచు | - ఆ.వె |

గిడుగు వారును ఇట్టి జాగ్రత్త తీసికొని స్వీయ లక్ష్యముల నిచ్చినారు[4].

I | అఖిల సుకవి కృతుల యందున లరుచుండు - ఆ.వె.
| అఖిల సుకవికృ తులయందు నలరు చుండు - తే.గీ.

II | విజయ పాండ పులకు విసుముజ యమగును - ఆ.వె.
| విజయ పాండవు లకువిను ముజయ మగును - తే.గీ.

మొదటి దానిలో యతి, రెండవ దానిలో ప్రాసయతి కుదిర్చినారు.

అంతరాక్కరకు తేటగీతికి గల సంబంధము తేటగీతి ప్రాసవద్ద చూపబడినది. అంతరాక్కర ఆఖరు గణము చంద్రగణము. అది రెండు సూర్యగణములుగా విడిపోగల్గినచో తేటగీతి కాగలదు. కాని యతి సరిపోదు. అంతరాక్కర మూడవ గణము కడపటి వర్ణము యతి, తేటగీతిలో నాల్గవ గణము మొదటి యక్షరము యతి. ప్రాస అంతరాక్కరకు నియతము, తేటగీతికి అనియతము.

తేటగీతికి ద్విపదతో సంబంధము గలదు. 3 ఇంద్ర గణములు, ఒక సూర్యగణముగల ద్విపదను తేటగీతిగా రూపింపవచ్చును. 3 ఇం గ. ద్విపదవి, 1సూ +2 ఇం.గా విడిపోయిన (యతిస్థానము తప్ప) సరిపోవును. ద్విపదలోని మొదటి ఇంద్ర గణము మాత్రము విధిగా నగ, ర లలో ఏదో ఒకటి కావలయును.

| | ఇం | | ఇం | ఇం | సూ | |
|---|---|---|---|---|---|---|
| I | II IU | | IIUI | UUI | UI | — ద్విపద |
| | III | UII | UIU | UI UI | | గా తేటగీతి గణము లకు సరిపడును అట్లే |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| II | UIU | | IIUI | IIII | III | — ద్విపద |
| | UI | UII | UII | III | III | — తేటగీతిగా సరిపడును. |

నడుమక మ్మరివిద్ధ చంద్రుణ్ని బోలు — ద్విపద
నడుమ కమ్మరి విద్ధచం ద్రుణ్నిబోలు — తేటగీతి

గణ విజనలో ద్విపదలోని తృతీయ గణాద్యక్షరము (యతిస్థానము) విధిగా తేటగీతిలోని తృతీయ గణాంతమైపై పోవును. ద్విపదలోని 2 గణముల మీద, తేటగీతిలో 3 గణముల మీద యతి ఉండును. ఏ ద్విపదమైనను యతి కుదరక గణములు మాత్రము కుదురుటచే పైన జానపద గీతము లక్ష్యముగా చూపబడినది. జానపద గీతములలో యతి సదృశాక్షర నియత రూపమున నుండదు గనుక పైన రెంటను ద్విపద, తేటగీతులలో యతి పాటింపబడలేదు.

అట్లైనను యతి విచ్ఛేదరూపమునగల జానపదగీతి ద్విపద నడకలో నున్న దానిని తేటగీతిగా (గణములు పొసగినను) చదువరాదు. పై ఉదాహరణమే చూడ

వచ్చును. 'బిడ్డచం' వంటి కాలఖండములు కర్ణ కఠోరమగును. దీనికి కారణము ఊనిక. ఊనిక సాధారణముగా పదాది సిద్దము. దేశి పద్యములలో యతి పద ప్రారంభరూపమున ఉండును. యత్యక్షరము పదమధ్యమున ఉండదు. మహాకవులు వృత్తములలో ఇట్లు పాటించినను, దేశి పద్యములలో పాటింపరు. పదసమాప్తి చేయుదురు. లేనిచో నడక తెలియదు.

గణముల సంతతి యెట్లయినను ఈ క్రింది జానపద గీతము కొద్ది అక్షరముల మార్పుతో ఒకే నడకగల ద్విపద, తేటగీతివలె ఉన్నది.

మొగ్గ ఎవరిని బోలుఅ న్నరఘు రామ
ఈ మొగ్గ మీవదినె కనుబొమల బోలు
పిందె ఎవరిని బోలుఅ న్నరఘు రామ
ఈ పిందె మీ వదినె పలుపరున బోలు
కాయె ఎవరిని బోలుఅ న్నరఘు రామ
ఈ కాయె మీవదినె కన్నులా బోలు —త్రివేణి పు. 120

పాట ఒకే నడకలో గలది. దేసి పాదములు తేటగీతిలో, సరి పాదములు ద్విపదలో కొలువ వచ్చును. ఇచ్చట అట్లే విరిచి వ్రాయబడినది. సంవాద రూపమున గల ఈ గేయములో రెండు భిన్న ఛందములుండి అక్షరాధిక్యతయున్నను, గమన వైవిధ్యము లేక పాటగాని నోట ఒకే రీతిలో సాగినది.

—×—

## అ థ స్సూ చి క లు

1. శ్రీశ్రీ గీత పద్యాలు 'ఖండిక'
2. 'అతని పాట' -దేవులపల్లి కృష్ణశాస్త్రి
ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము - ప. 75 -గణపవరపు వేం.కవి.
4. తె. ఛం. రీ. గిడుగు. పు. 171

★ ★ ★

# 4. మంజరీ ద్విపద

మంజరీ ద్విపదకు, ద్విపదకు గణవ్యవస్థలో ఏమియును భేదము లేదు. 3 ఇం. + 1 సూ. రెంటికి గలదు. యతిస్థానము రెంటను సమద్విఖండన రూపమే. అనగా 4 గణములలో 2 గణముల పిదప యతి. కేవలము ప్రాస విషయమున మాత్రము మంజరిలో స్వేచ్ఛ గలదు. ద్విపదకు నియతము. ప్రాసలేని సీసమును ప్రాసగలసీసమును సీసభేదములుగ చూపినట్లే ద్విపద, మంజరీ ద్విపదలు ఒకేఛందము యొక్క భేదములుగా చూపవచ్చును. కాని ఆటవెలది పవడగీతులవలె భిన్నఛందము లుగా చూపబడినవి. నిజమునకు మంజరీ ద్విపద యొక్క సంస్కరణ రూపము ద్విపద.

లాక్షణికులు ప్రాసలేని వానిని ఉపజాతులలో పేర్కొనినారు. మంజరీ ద్విపద ఉపజాతులలో పేర్కొనబడవలయును. కాని ఉపజాతులలో ప్రాసయతి – యతికి మారుగా - వాడవచ్చును. మంజరీ ద్విపదలో ప్రాసయతి నియమము లేదు. మంజరీ ద్విపద అచ్చమైన జానపద ఛందము. నియమములు లేనివి. తర్వాత శిష్ట కవులు యతిప్రాసాది నియమముల నాపాదించినారు.

జానపద సాహిత్యము శిష్ట సాహిత్యమునకు సమాంతర స్రోతస్వినియై సాగినది. కాని జానపద సాహిత్యము యొక్క సౌందర్యమును, ప్రాచీనత్వమును, మాతృత్వమును, శిష్టులు అంగీకరింపక, ఈసడించినారు. సోదర తమిళ మళయాళ భాషలలో గేయములు ప్రాచీన కాలముననే భద్రపరుపబడగా కన్నడాంధ్రములందు త్యజింపబడినవి. గుడ్డిలో మెల్లగా తెలుగులో రగడ, ద్విపద, మంజరీ ద్విపదల వంటి ఛందములు జానపద గీతముల నడకలను తెలుపునవి లాక్షణీకరింపబడినవి. లేనిచో వీని ప్రాచీనత్వము, గేయ సంప్రదాయము నశించెడిది. మంజరీ ద్విపదను పదచ్ఛందముగా పండితకవులు తమ కావ్యములలో స్మరించినారు. చేమకూర వేంకట కవి సారంగ ధర చరిత్రమున —

తారావళి యట నఖములు
రోరుహములు రెండు 'మంజరులె' యట నేత్రా
కారంబులు 'భపకసు'లట
యారమణిన్ మంజువాణి యనజెల్లవొ కో (1-59)

శ్లేష చమత్కార రూపమున పద చ్ఛందములతో బాటు పేర్కొనినాడు.

మంజరీ ద్విపదకు ప్రాసయతి లేదు అని లాక్షణిక మతము. అనంతా మాత్యుడు తన ఛందోదర్పణములో ప్రాసయతి నిషేధమును గూర్చి లక్ష్య సహిత ముగా పేర్కొనినాడు.

శ్రీమందిరాకారు జితదైత్య ధీరు
గీర్తించుచో బుణ్య పర్తనుండనుచు
యతి మారు ప్రాసమిట్లచ్చోటనిడక (3-49)

సాధారణముగా జానపద గేయ చ్ఛందములందు యతిప్రాసాది నియమములు నియతము గావు. అట్లే ప్రాసయతి నియతముకాదు గాని, యాదృచ్ఛికముగనో, పదైకా వృత్తి రూపముననో ప్రాసయతి దొరలవచ్చును. కొన్ని యిట్టివి ద్విపద ప్రకరణ మున చూపబడినవి. పల్నాటి వీరచరిత్రలో ఇట్టివి మరికొన్ని చూపవచ్చును.

1) జొన్న కంకులు మాకు కొన్ని యీవయ్య
2) ఉక్కు చువ్వల నీకె లొక్కు పెట్టునను
3) కదన భూమికి తాను కదలిపోవంగ

ఒకే పదము ఆవృత్తి యగుట వలన ప్రాసయతి+యతి కుదురును.

1) వేదాంగములు నీవె వేదముల్ నీవె
2) మతమెన్న వైష్ణవ మతము మా మతము
3) కదలుము మావెంట కదలుమనంగ
4) కదిలిరి సర్దార్లు కదిలిరాశ్వికులు

వంటివి ఇందు కుదాహరణీయములు. ప్రాసయతి నిర్బంధమగుననియే గాని ఉపజాతు లలో పాటించినట్లే, దీనియందును పాటింపవచ్చును. ఇది దోషముకాకపోగా సౌందర్యావహమేయగును. పాలుకురికి సోమన్న ద్విపదలో (ప్రాసగల దానిలోనే) పాటించినాడు గదా!

ప్రాస కూడదని చెప్పిన లాక్షణికులు, ప్రాసయతి గూర్చి చెప్పలేదు. కాని అప్పకవి ఏలనో అంత్యప్రాస గూర్చి చెప్పినాడు.

తుద మొదళ్ళను నంటి దూకు శబ్దంబు
పర్షించి యలిమారు ప్రాసంబు లిడక
ప్రాసంబు లేని ద్వి పదయై చెలంగ
ప్రాసంబు తుదలందు బదిలంబు చేసి
........... ................ ... ... ...
చందాన నలరారు జగతి మంజరులు — (4-463)

'ప్రాసంబు తుదలందు' అని అప్పకవి మంజరీ ద్విపదలో అంత్యప్రాసయేలచెప్పెనో తెలియరాదు. రగడల వలె వీనికిని అంత్యప్రాసలు రెండును (గేయ ఛందములు కనుక) ఉద్దేశించినాడా? ఆతని సమకాలమున ఏవైనా కృతులు మంజరీ ద్విపదలోనివి, అంత్యప్రాస యుతములై ఉండునా ? అప్పకవి లాక్షణీకరణమునకు గల మూల కారణమేమిటో తెలియరాదు. లక్ష్యములు అలభ్యములు. అప్పకవి సైతము పై లక్షణములో అంత్యప్రాసను ప్రదర్శింపడయ్యెను. ఈతని చూచి కాబోలు పొత్తపి వెం.ర. కవిసైతము "అలరించి యందు నంత్య ప్రాసమొంది" (ల.శి.III.340)యని అంత్య ప్రాస చెప్పినాడు. తన లక్ష్యములో సైతము అంత్యప్రాస చూపడయ్యెను.

తరిగొండ మంగమాంబ తన "కృష్ణమంజరి" (మంజరీ ద్విపద) కావ్య మందు, రెండు పాదములకొక తూరి అంత్యప్రాస పాటించినది.

నీవుబా ధ్యుడవని నేనిన్ని నాళ్ళు
గనలేక బోతిని క్రమముగా కృష్ణా
నిరతంబు పరులను నిందింతు గాని
నాదుర్గు ణంబులె న్నగనేడ కృష్ణా

2 పాదముల కొకమారు కృష్ణాయనుచు నిట్లు ఆవృత్తమైన పదము వలన అంత్య ప్రాస కుదిరినది. కాని యిది కవయిత్రి చేత అంత్యప్రాస కొఱకుగాక, శతక మకుటమును బోలిన సంబోధనము కొఱకైనట్టిది. ఇట్టి పదైకావృత్తి ఘటిత అంత్య ప్రాస మంజరీ ద్విపద కావ్యములందు గాన వచ్చినను, అది కవులచే సప్రయత్నముగ పెట్టబడినది కాదు.

పాదాంత యతి (విచ్ఛేద రూపమున) మంజరీ ద్విపదకు అత్యంతా వశ్యకము. లేనిచో పాద ప్రమాణము తెలియదు. జానపద గీతములందు పాదోల్లంఘనము ఉండదు. ఏ పాదమునకా పాదము తెగిపోవును. ఇవి అన్ని దేశ్య ఛ్ఛందములకు సామాన్య లక్షణము. కాని ఇతర దేశ్య ఛ్ఛందముల విషయమున లాక్షణికులు చెప్ప రైరి. కవులు మాత్రము క్వాచిత్కముగా పాదోల్లంఘన గావించినారు. కాని ఈ మంజరీ ద్విపదలో లాక్షణికులు దీనిని కంఠోక్తిగా చెప్పుట ప్రశంసావహము. పాదాంత విచ్ఛేద రూపము వలన గలుగు లయను గుర్తించిరన్నమాట. అంతేగాదు, గేయ ఛ్ఛందములను సైతము తెలుగులో లాక్షణికులు పరిశీలించి ప్రామాణీకరించిరన్న మాట.

"తుద మొదళ్ళను నంటి దూకు శబ్దంబు

వర్జించి...." అని అప్పకవి క్లుప్తముగా చెప్పగా అనంతుడు తన ఛందోదర్పణమున లక్ష్య సహితముగా వివరించినాడు.

సరసిజ నాభాయ సముదగ్ర సాహ —
— సాయన మోయంప శబ్ద మొక్కటియు
రెండు పాదముల నిక్రియ బంచి యిడక
వెలయు ప్రాసము లేని ద్విపదమై బరగ
బూణింప వలయువా కృష్ణమంజరుల (3-49)

ప్రాస లేకుండుట వలనను, పాదోల్లంఘన నిషేధము వలనను మంజరీ ద్విపద ఏ పాదమున కాపాదము వ్యస్తమైనది. అనగా ఈ చందమున పాదసంఖ్యలేదన్న మాట. ఇది ఏకపద ఛ్ఛందము. జానపదకవి పదము రచించునపుడు ఒక్కొక్క పాదము పేర్చుకొనుపోవును. ఇట్టి గేయ ఛ్ఛందము ప్రాసాదులతో ద్విపాద వ్యవస్థ, త్రిపాద, చతుష్పాద వ్యవస్థలకు దారితీసినది. అనగా గేయ ఛ్ఛందములు ప్రాచీనములు. తర్వాతి ఛందములు అన్నియు వీనికి సంస్కరణ రూపములే. దీనినే నిడుదవోలు వెంకటరావుగారు "తెనుగు కవిత యేకపదమై, ద్విపదమై, త్రిపదమై చతుష్పదమై పరిణతి చెందినట్లు కానవచ్చుచున్నది" అని వ్రాసినారు. [1]

జానపద గేయములలో పాదవ్యవస్థ లేదు. పాదసంఖ్య అనియతము. ఏ పాదమునకా పాదము ముక్తకము, అర్థపూర్ణము. పాదసంఖ్యానియతి లేకుండుట వలన అన్వయ కాఠిన్యముండదు. అర్థము పునరావృత్తమైనను సరిపడును. కారణము-

పాదపాదమునకు సంబంధము లేకుండుటయే. మంజరీ ద్విపద అట్టిదే. పాద సంఖ్యా నియమములేదు పాదాంత విచ్ఛేదమున్నది. పాదములను ముడివేయు ప్రాస-ఉండనే ఉండదు. కనుక ఇది తక్కిన ఛందములవలె పాద సంఖ్యాసూచిత నామముతో పిలువ వలయునన్నచో ఏకపాద మంజరియని పిలువదగును. పొత్తపి రమణకవి అట్లే 'ఏక పద మంజరీద్విపద' అనినాడు. ఇట్టి ఏకపాద చ్ఛందమును ఇచ్చవచ్చి నన్ని పాదములలో భావ సమాప్తియగు వరకు వ్రాయుచు పోవచ్చును. ద్విపదకావ్యము లిట్లే వ్రాయబడును. ద్విపద రెండు పాదముల సమాహారముగా గుర్తింపబడుటకు ప్రాస ఉన్నది. దీనికట్లులేదు. ఐనను ద్విపద కావ్యములలో పాదసంఖ్య వేలలో ఉన్నను సరిసంఖ్యలో నుండును. ఇది అనివార్యము. కారణము ద్విపదకు పాదసంఖ్య సరిసంఖ్యలో నుండుటయే. మంజరికైతే పాదము. బేసిసంఖ్య. కనుక బేసి సంఖ్యలో పాదములుండదగునా ? లేదు. సమసంఖ్యలోనే ఉండవలయును. ఏకపద యన్న పేరుంచిన పొత్తపి రమణకవియే. దీనిని "సమసంఖ్య పదములబరగు నీరీతి" యని సమసంఖ్యను సూచించినాడు. సమసంఖ్య సౌష్ఠవహేతువు. పాదసంఖ్య నియతము కాని వేరొక్క ఛందము రగడ. ఇదియును గేయచ్ఛందమనుటకు పాద సంఖ్య నియతము కాకుండుటయే సాక్ష్యము. ఇందు సైతము (ఏ రగడ భేదమైనను) పాదసంఖ్య సరిసంఖ్యయే. చతుష్పాద పద్యములందే గాక అధిక పాదములతోడి వ్రాయబడు మరి యే'మాలికా' పద్యమైనను సాధారణముగా సరిసంఖ్యలోనే ఉండును. మంజరి యనగా గుచ్ఛము. చతుష్పాద వ్యవస్థలో బహుళ పాదయుత మైనప్పుడు ఉత్పలమాలికాది విధమున మాలికావిధానమున్నట్లే దీనికి మంజరి అన్న పేరు సార్థకము.

'ఏకపద మంజరీ ద్విపద' అన్నపేరు ఇంచుక పరిశీలింపవలసినది. ఏకపద-ద్విపద యన్న పదములు ఒకే ఛందము పేరగుట యెట్లు? ఏకపదమా? ద్విపదమా? ఇది ఎట్టి ఛందము? ఏకపదమని లక్షణము ఘోషించు చున్నది. తిరిగి ద్విపదయను పేరెందులకు? ద్విపదలో రెండు పాదములను కలిపి ఒకే సమాహారము (Unit) గా చేయు ప్రాసలేదు కదా!

పండితులు ఏకపాద మంజరి నుండి యతిప్రాసలతో కూడిన సంస్కారముతో ద్విపదను సిద్ధము చేసికొనినారు. వృత్తత్వమునకై చతుష్పాద వ్యవస్థతో తరువోజ గావించినారు. ఇట్టి మూల చ్ఛందమనదగిన ఏకపాద మంజరి ద్విపద ప్రాచుర్యము తర్వాత లాక్షణికులచే గుర్తింపబడినది. అది ద్విపదను పోలిన గణములు

కలిగియుండుట, ప్రాసరహితముగా నుండుటను బట్టి ద్విపద వికారమని భావించినారు. పాదాంత విచ్ఛేదమై, తర్వాతి పాదముతో లంకె లేకుండుటచే 'ఏకపాద' ఐనది. బహుపాదయతమగుటచే 'మంజరి' ఐనది. ప్రముఖముగ ద్విపదగా గుర్తింప బడుటచే "ఏకపాద ప్రాసరహిత మంజరీ ద్విపద" అనబడినది.

గణమునకొక పాదము, పాదాంత విచ్ఛేదము, విచ్ఛేదరూపయతి, ప్రాస నిర్బంధము కాకుండుట, ప్రాసయతి, అంత్య ప్రాసలుఅలంకారముగా వాడుకొనుట అన్న ఈ లక్షణములున్న ఈ మంజరీ ద్విపద అచ్చమైన జానపద గేయ ఛ్ఛందము. దీని గేయత్వములు తెలుగు లాక్షణికులు చక్కగా గుర్తించినారు. దీని మనో హరత్వమును గుర్తించికాబోలు పదకవితా పితామహుడు తాళ్లపాక చిన్నన్న తన సంకీర్తన లక్షణములో ద్విపదకు సైతము పాదపాదమునకు 'తెగచెప్పవలయునని' నిర్దేశించినాడు. పాలుకురికి సోమన్న దీనికి కావ్య గౌరవము నిచ్చుటకై, యతి సదృశాక్షర రూపత్వమును ప్రాసయతిని, పాదోల్లంఘనమును కూర్చి దీనికి తక్కిన ఛందముల వృత్తత్వమును కూర్పయత్నించినాడు. వృత్తగౌరవము నందిన తరువోజ సైతము దీనినుండి జనించినదే. తరువోజ యొక్క ఒక్క పాదము కొఱకై రెండు మంజరుల సమాహారమునకు 3 చోట్ల మొదటి అక్షరముతో మైత్రిని గూర్చి 'బహు యతి నియతి' తప్పకుండునట్లు అఖండత్వములను కవులు సాధించి పెట్టినారు. లాక్షణికులు గేయములో ద్విపదత్వము (గణసామ్యము), ప్రాసరాహిత్యము చూచి, ద్విపదయనిసే భావించి, దీనిని ప్రాసరహిత ద్విపదయని భావించినారు. ప్రాసరహిత మంజరినుండి శిష్టకవులచే ప్రాసఘటితముగ కొంచెము సంస్కరించి ద్విపద సిద్ధము చేసికొనబడగా, దాని ప్రసిద్ధి కారణముగా తర్వాత ద్విపద గణములతో పాటలలోని ఆ ఛందమును కొలచి, ద్విపద పేరేఉంచి, ఏకపద, ప్రాసరహిత అన్ని విశేషణ ములను లాక్షణికులు వాడినారు.

కాని పింగళి లక్ష్మీకాంతంగారు ద్విపదనుండే ప్రాస విసర్జనతో సులభ రచనోద్దేశముగా మంజరీ ద్విపదను కూర్చినారని భావించినారు. ".......ద్విపద లక్షణములో, ప్రాసను తొలగించి పదకర్తలు రచన మరికొంత సులువు అగునట్లుగా మంజరీ ద్విపదను సృష్టించిరి".[2] అని వ్రాసిరి. కాని ఇది సహజమునకు విరుద్ధము. ప్రాకృతికములకు స్వేచ్ఛఅన్నది సహజము. సహజత్వమునుండి లక్షణ నిర్బంధత్వము

జనించును. ప్రాసాదులు తెలుగువారు తర్వాత కల్పించుకొనిరన్నది సర్వజనాంగీకారాభిప్రాయము.

మంజరీ ద్విపద, లక్షణమొనర్చిన తొలిలాక్షణికుడు విన్నకోట పెద్దన నాటికి ముందే, కావ్యప్రయోగములో నున్నదనవలెను. కోనేరు దోనయామాత్యుడు తన సస్యానందముకో మంజరీ ద్విపదను వాడినాడు (క్రీ.శ. 1360). దీనిని బట్టి ఆరుద్ర "ఈ పద్యాలను చూసాక క్రీ.శ. 1360 ప్రాంతములోనే మంజరీ ద్విపదలు తెలుగులో ప్రవేశించాయని చెప్పుకోవాలి." అనినారు [3]. కాని శిష్టకవులాదరించని పద చ్ఛందము గ్రంథాధారములనుబట్టి నిర్ణయింప వీలులేదు. అద్దంకి శాసనములోని తరువోజ, శివకవుల ద్విపద ప్రయోగము దీనియొక్క అత్యంత ప్రాచీనత్వమును నిర్ధరింపజాలియున్నది.

మంజరీ ద్విపద ఉపయోగము జానపదులలో అతి ప్రాచీనకాలము నుండియే ఉండియుండును. జానపద గీతములలో అధికాంశము ద్విపద ఛాయలోనే నడచినవి. ద్విపద ప్రకరణమున (ద్విపదకు మంజరీ ద్విపదకు అభేదత్వము స్వీకరించి) ఈయబడినవన్నియు ఇట్టివే. ప్రాస నిర్బంధత్వము శిష్టవాఙ్మయమునందే తప్ప గేయ ఛందములందుండదు. కనుక ద్విపద ఛందములో నడచిన గేయము లన్నియు మంజరీ ద్విపదలే. తెలుగు శిష్టవాఙ్మయములో వానికి కోనేరు దోనయామాత్యునితో కావ్యగౌరవము, విన్నకోట పెద్దనతో లక్షణ గౌరవ మబ్బినది. గేయ పరిమళము వీడక, ఆద్యంతము ఏక ఛంద ప్రయుక్తమై, విపుల కథాకథనాత్మకమై, జానపద కవులచేత నిర్మితమై, జానపదుల నోళ్ళలోనే బ్రతికిన మంజరీ ద్విపద కావ్యము 'పల్నాటి వీరచరిత్రము'. తర్వాత పదకర్తల స్వర్ణయుగమనదగిన దక్షిణాంధ్ర యుగమున మంజరీకృతులు వెలసినవి. కొలని గణపతి దేవుని 'మనోబోధ' (14?0 A. D ). లక్ష్మీనారాయణయోగి 'ఉత్తర గీతామంజరి', తాళ్ళపాక అన్నమయ్య (1400-150 ) 'శృంగార మంజరి', నాచెంట్ల ఉమాపతి (140? A. D.) 'మహా చిదానంద మంజరి', తాళ్ళపాక పెదతిరుమాలాచార్యుని (1460-1547) 'చక్రవాళమంజరి' వంటివి ఇందులకు ఉదాహరణీయములు. ఇంకను లెక్కకు మించిన పెక్కు జానపద గీతములు, కథలు మంజరీ ద్విపదలో వ్రాయబడినవే.

కోనేరు దోనయామాత్యుని మంజరీ ద్విపద ప్రయోగము విశేషమైనది. ద్విపద కవులవలె ఆద్యంతము ద్విపదను వాడుటకాక, చంపూ పద్ధతిలో ఇతర

ఛందసులను వాడుచు, మంజరీ ద్విపదను, రగడను వాడినాడు. ఇంతవరకు లభ్య మానాంధ్ర సాహిత్యములో ఇట్టిది వేరొక్కటి లేదు. చంపూ పద్ధతిలో ద్విపద వాడుకయే అపురూపమైనది. అందులకే కాబోలు ఇది ఊహించని పరిష్కర్తలు విమర్శకులు దీనిని తరువోజగా భావించినారు [4]. తరువోజలు చంపూ పద్ధతిలో తక్కిన వృత్తములవలె వాడుక ఉన్నది ప్రసిద్ధమైనదే, దోనయామాత్యుడు తన 'సస్యానందము'లో 2 చోట్ల మంజరీ ద్విపదము వాడినాడు. వాడినపుడల్ల 8 పాద ములు వాడినాడు. 2 పాదములకొక తరువోజ పాదము కనుక, ఇది స్థూల దృష్టికి 4 తరువోక పాదములుగా సరిపోయినది.

మానుగా జ్యేష్ఠమా సము పెంపు లోన
పుడుపతి యాషాఢ యుగముల నొండె
మానమై రోహిణి మధ్యంబు నొండె
జనజొచ్చి వెడలిన జలధార లపని
భాసిల్లు గర్భసం పద పెంపు పెలుచ
గాగన వ్వనివాన కాలంబు లోన
వానలు లేవాని వలనుమీ రంగ
మునుజెప్పె కైలాస మునసీశ్వ రుండు (సస్యా. 2-18)

దీనిలో రెండేసి పాదములు ఒకపాదముగా - తరువోజగా - వ్రాసినచో 3వ పాదము ప్రాస కుదురదు. ఒకే పాదముగా వ్రాసినపుడు 1వ, 3వ, 5వ గణాద్యక్షరములు ఏకాక్షర యతి (బహు యతి నియతి) కుదురుట లేదు. కనుక దీనిని మంజరిగనే గుర్తింపవలయును. ఆరుద్ర దీనిని మంజరి ద్విపదగా గుర్తించినారు. కాని వేరొక్క ఉదాహరణలో ప్రాస కుదిరినది.

మానుగ వైశాఖ మాసంబు గృష్ణ
పాడ్యమి యాదిగా బరగెడి నాళ్లు
దినములు బరగునా దినమునై పార
మహిమీద శ్రావణ మాసంబు లాది
గానాళ్లు నెలలకు గానయ ద్దివస
ములగాలి యునునెండ మొయిలులు గలుగు
నన్నెల వరపని రార్యజ నములు
సితపద్మ సంకాశ శ్రీగిరి వాస (సస్యా. 2-5)

దీనిని తరువోజపలె వ్రాసిన మాను - దినగానా - నన్నె ప్రాస కుదిరినది. చతుర్థ పాదమున నకార ద్విత్వమును ప్రాసభంగముగా వారు భావించినారేమో ! దీనికి తోడు తరువోజలో ఉండవలసిన యతి 4 స్థానములందు ఒకే యక్షరము ఉంచబడకుండు టచే ఇది మంజరీ ద్విపదగా ఎన్నవలసినది.

దోనయ్య తన సమకాలీనవు రైతుల వర్షశాస్త్ర జ్ఞానముగల పల్లెపాటలను "సస్యానందము"న గ్రంథస్తమొనర్చినాడేమో !

మంజరీ ద్విపద నడకలన్ని ద్విపద నడకలే. ద్విపద గేయ సంప్రదాయ ములో ఎట్లుండునో ఇదివరకే చూపబడినది. మంజరీ ద్విపదకన్న, ద్విపద గేయత్వ మును మించిన వృత్తత్వమును సంతరించుకొన్నది. అనగా శిష్టకవి ప్రయోగములో గణమునకో పదముగా గాక, యతిస్థానమున విచ్ఛేదము పాటింపక, పాదాంత విశ్రాంతి లేక, ప్రాసతోకూడి ద్విపద గేయత్వమునకు దూరమైనది. మంజరీ ద్విపద అట్లుగాక పూర్తిగా గేయ ఛ్ఛందముగనే స్వీకరింపవలయును.

గేయములో పదకర్త గణములను చూడక కాల ఖండములలో కొలుచు కొనుచు పాదములను పేర్చుకొనుచు పోవును. ఈ దృష్టితో మంజరీ ద్విపదను పరిశీలింపవలయును కాక గణముల దృష్టితో చూచిన ఈ కాల ఖండములకొక్క కన్నుడు సమాన కాలఖండములుగ మాత్రము నిలిచిపోవును. అట్టి దృష్టితో చూచుటచే ఆరుద్రగారికి సస్యానందములోని గణములు భంగమైనట్లు కన్పట్టినది[5]. పల్నాటి వీరచరిత్ర నీ గణదృష్టితో చూచుట వలననే పరిష్కర్త పింగళి లక్ష్మీకాంతం గారు ఛందస్సులకు సరిపడని అనేక పాదాలను గణభంగములనినారు[6]. పల్నాటి వీరచరిత్ర (మంజరీ ద్విపద) ఆట సంప్రదాయమునకు చెందినది. దానిని లేఖన సంప్రదాయ దృష్టితో చూచిన గణభంగమనిపించును.

జానపదగేయ ఛ్ఛందమైన మంజరీ ద్విపదలో నాల్గు 'కాలఖండ ములు'న్నవి. ఒక్కొక్కటి ఐదేసి మాత్రలది. అఖరుది చూపుకు 3 మాత్రలుగ కన్పట్టినను, గానములో తక్కిన రెండు మాత్రలు నింపుకొనును. పదకర్త ఒక్కొక్క కాలఖండమును పేర్చుకొనుచు పాదమును పూర్తిచేయును. కాలఖండము నకు ప్రమాణము మనస్సే. మాత్రాగణము, గురులఘు వివేకము జానపదునకుండదు. పదము కాలఖండములలో సమానముగా ఇమిడ్చి కొనుటకు సాగతీత లేదా కుదిం పును గేయము సమ్మతించును. శబ్దదోషమునకు స్థానమక్కడ ఉండదు. కనుకనే ఆవి కాలఖండమునకొక్కొక్క పదము చొప్పున లేదా గుణమునకొక్కొక్క

పదము చొప్పున నడచును. యతి పాద మధ్యస్థము. అనగా సమద్వీఖండనరూపము. సదృశాక్షరము ఉండవచ్చును. లేకపోవచ్చును. పదము మాత్రము పూర్తియై, యత్యనంతరము కొత్త పదము ప్రారంభమగును. పాదము పాదమునకు సంబంధముండదు. పాదాంతమునవిశ్రాంతి యుండును. ఈ విశ్రాంతిలో ఆఖరు కాలఖండములోని మాత్రలసంఖ్యనింపబడును.

1 ఇం. గ. + 1 ఇం. గ. * 1 ఇం. గ. + 1 సూ. గ.
5మా. + 5 మా. * 5 మా. + 3 మా.

శ్రీనాథుడను వాడ శివభక్తి పరుడ (ప. వీ. చ.)

యతి రెండు గణముల తర్వాత అనగా రెండు పదముల తర్వాత - కొత్త పదము లతో విశ్రాంతి యుతముగా ప్రారంభమగును. ఐతే జానపదగేయములలో తెలుగు లోని (వృత్తములలోని) సదృశాక్షర నియతి గూడ తరుచు కనబడును. పల్నాటి వీరచరిత్రలో అధిక భాగము యతి విచ్ఛేద రూపములోను, సదృశాక్షర నియతి రూపములోను కన్పట్టును. పై పాదమిందులకుదాహరణీయము.

చెన్నకే శవపాద * సేవార తుండ
వలనుభా రద్వాజ * వంశవ ర్ధనుడు
కవిసార్వ భౌముడ * ఘనతగ న్నట్టి
శ్రీనాథు డనువాడ * శివభక్తి పరుడ
— (పల్నాటి వీరచరిత్రము)

శిష్టకవి నిర్మితమగుటచే ఈ పాదములలో గణవిభజన 'శవపాద' వంటి విరుపులు గల్గినది. కాని యిట్టిది గేయ ప్రవాహములో కన్పట్టదు. 5 మాత్రల కాలఖండము లకు గేయవిధానములో భగణము, నల వచ్చినచోట దీర్ఘమగును.

5 5 5 5
చెన్నకే శవపాద సేవార తుండా అ
5 5 5 5
వలనుభా ర్ద్వాజ వంశవా ర్ధనుడాఅ అని పాడబడును.

కాలఖండములలో మాత్రలధికమైన ద్రుతోచ్చారణలో కుదించబడును. కాలఖండములలో ఆలోచించి పేర్చిన వానిలో 5 మాత్రల 'భల', 'నలల' వంటి గణములు కూడవచ్చును. గణ దృష్టిలో భల ఇంద్రగణము కాదు. గేయ సంప్ర దాయములలో అది దోషముకాదు. ఈ క్రింది అప్పగింత పాట మంజరీ ద్విపదలో

నడచినది. గేయ విధానములో లిఖించితిమేని యిట్లుండును. జానపద గేయోద్ధారకులు సంగ్రాహకులు వీనిని శ్రద్ధగా విని, కాలసంపుటులలో వ్రాయించి, అచ్చువేయించిన గానవిధానము స్పష్టపడును.

నలల
ఘనమైన తొడవులను కట్నాల నిచ్చీఇ
వేచెనే జనకుడూ వైదేహి నంపాఅ
నెయికాచ నేరదూ నెలమీకా వదినాఅ
నేర్పుతో పనులెల్ల నేరుపా వమ్మాఅ
ఖల
బుద్ధులెరు గదుమంకు బుద్ధులే గాసీఇ
బుద్ధువొ చ్చినదాక దిద్దుకో వమ్మాఅ[7]

పల్నాటి వీరచరిత్రను గూర్చి ముఖ్యముగా మంజరీ ద్విపదను గూర్చి చెప్పుచు పింగళి లక్ష్మీకాంతముగారు "....ఈ కవులు అవసరమైనచో ఛందో వ్యాకరణాది నియమములనుల్లంఘించుచు, సడలించుచు, అతి స్వతంత్రులై, ఇంచు మించు వ్యావహారికమని చెప్పదగిన భాషలో ఈ పాటను రచించి, పాట మర్యాద లను గమనించి దీనిని పఠింపదగునని లోకమునకు ఆదేశించిపోయిరని నా తలంపు"[8] అని వ్రాసిన వాక్యములు జానపగేయ ఛందో విమర్శకులు, గేయపరిష్కర్తలు అనుక్షణము స్మరింపదగిన ప్రత్యక్షర సత్యములు.

—×—

## అ ధ స్సూ చి క లు

1 ఉదాహరణ వాఙ్మయ చరిత్ర పు. 3
2. పల్నాటి వీరచరిత్ర - పీఠిక. పు. VI
3. సమగ్రాంధ్ర సాహిత్య - సంపుటి IV. పు. 26
4. " " " పు. 24, 25
5. పల్నాటి వీర చరిత్ర - పీఠిక. పు. XXIV
6. సమగ్రాంధ్ర సాహిత్యము - సం. IV. పు. 24. అధోజ్ఞాపిక
7. ద.దే.భా.సా. దేశి - కోరాడరా - పు. 179, నేను పాడగా విన్నది.
8. పల్నాటి వీరచరిత్ర - పీఠిక - IX P

★ ★ ★

# 5. రగడ

దేశి చ్ఛందస్సులలో రగడలది విశిష్ట స్థానము. స్వభావమును బట్టి వీనిని అచ్చమయిన గేయ చ్ఛందములుగా నిరూపింపవచ్చును. ఇవి మాత్రాగణములలో ప్రామాణీకరింపబడినవి. గతి వైవిధ్యముగల్గి వివిధ తాళబద్ధములై వైతాళీయములన దగినవి[1]. వివిధ గతులతోబాటు ద్విగుణీకృతత్వముతో వివిధ భేదములు సంతరించు కొన్నవి. కాలఖండములలో మాత్రాయుతములుగా గుర్తింపబడవలసినవి. అక్షర గణములలో కొలువబడి, దేశ్య ఛందములకు శిష్టకృతకత్వమును నిరూపింప సమర్థములై యున్నవి. అతి ప్రాచీన కాలమునుండి ప్రయోగములో నుండి, దేశి సాహిత్య ప్రియులు, ప్రచారకులయిన శివకవులచే ఆదరింపబడి, తర్వాత కూడ ఆంధ్ర కవులచే ఉపయోగింపబడినవి. సోదర కన్నడమునందు ప్రచార ప్రాచీనత్వమును సంతరించు కొని కన్నడాంధ్రోభయ సామాన్య ఛందములనదగియున్నవి.

రగడ, రఘట, రగళె యని పేర్లు దీనికి కానవచ్చుచున్నవి. రఘటా శబ్దము సంస్కృత ఛందోగ్రంథములందెక్కడను ప్రయుక్తము కాదు. దేశి శబ్దము నకు సంస్కృతీకరణ రూపమని భావింపవచ్చును. రగళె అన్న ప్రయోగము కన్నడమునందలిది. ఇది రఘటాశబ్ద భవమని సంస్కృతీకరణ రూపమునుండి పుట్టినట్లు కన్నడ వ్యాకర్త 'కేశిరాజు' శబ్దమణి దర్పణములో సూత్రీకరించినాడు[2]. శ్రీకుక్కల కృష్ణభట్టుగారు నాగవర్మ ఛందోంబుధి పీఠికలో రఘటాయనగా ఘట = గుంపు అని, రగణ సమూహామని అర్థము చెప్పి రగణము పంచమాత్రికము కనుక కన్నడ ములో బహుళ ప్రచారము పొందిన లలిత రగళె పంచమాత్రిక గణనిర్మితమని ఆధా రములు చూపినారు. దీనిని సర్వోత్తమరావు గారు సమర్థించినారు[3]. కాని రగడలు పంచ మాత్రికములు మాత్రమేగాక త్రి, చతుర్మాత్రికములుగను ఉండినవి. అంతేగాక రగ ణము పంచమాత్రికా సంకేతముగాదు. పింగళ నిర్మితములగు అక్షరగణములలో రగడవంటి మాత్రాఛందమును కొలుచుట సమంజసమైనదికాదు. నైఘంటికార్థమున రగడయనగా శ్రావ్యత అన్న అర్థమున్నది[4]. దానిని స్వీకరించుట సమంజసము. గేయ ఛందములకు శ్రావ్యత జీవమన్న సంగతి చెప్ప పనిలేదు.

## రగడల సామాన్య లక్షణములు :

రగడల సామాన్య లక్షణములలో సమమాత్రికా గణములు ఏవేని నాలుగుండుట (లేదా రెండు) పాద మధ్యమున యతి అనగా మొదటి గణమునకు, 3 వ గణమునకు ఆద్యక్షరములు యతి, పాదము పాదమునకు ప్రాసయన్నవి ముఖ్యములు ఐతే ఇది ద్విపదలవలె రెండు పాదములకొక్క రీతిని ఉండును. అంత్య ప్రాస నియతము. ఇది సైతము రెండు పాదములకొకమారు మారుచుండును. అనగా రగడను ద్విపదవంటి పదచ్ఛందముగా ప్రాచీన కాలమునుండియే భావించిరనవచ్చును. "పదంబుల్ హృద్యంబులు గూర్చిన" అని అప్పకవి[5] పాదములు పాదములుగా పేర్చుకొనిపోవుట (పదచ్ఛందోనిర్మితి)ను సూచించినాడు. రగడ పాదముల సంఖ్య సైతము సరిసంఖ్యలోనే యుండును.

| | | | |
|---|---|---|---|
| 1. | హయప్రచార రగడ | 3 మాత్రల గణములు | నాలుగు |
| 2. | తురగ వల్గన రగడ | " " | ఎనిమిది |
| 3. | విజయ మంగళ రగడ | " " | పదహారు |
| 4. | ద్విరదగతి రగడ | 5 మాత్రల గణములు | నాలుగు |
| 5. | విజయభద్ర రగడ | 5 మాత్రల గణములు | ఎనిమిది |
| 6. | మధురగతి " | 4 మాత్రల గణములు | నాలుగు |
| 7. | హరిగతి " | " " | ఎనిమిది |
| 8. | హరిణగతి " | 7 మాత్రల గణములు | రెండు |
| 9. | వృషభగతి " | " " | నాలుగు |

తెలుగులో ప్రసిద్ధమయిన రగడలకు పాదలక్షణమిది.

ప్రాస అన్నది రగడకు ప్రాచీన కాలమున లేదు. శాసన రగడలలో ప్రాస లేకుండుట పూర్వము కాననగును. తర్వాత ద్విపదకు పెట్టినట్లు ప్రాస అలంకారముగా పెట్టబడినది[6]. అనగా మాత్రా సంపుటలతో అలంకార రహితమైన సహజ స్నిగ్ధమైన గేయచ్ఛందము రగడగా మలచబడినదన్నమాట. అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంసవింశతిలో మంజుల రగడ అనే పేరుతో ప్రాసరహితముగా రగడ (మధురగతి రగడ) వ్రాసినాడు. ద్వితీయాక్షర ప్రాసలేనప్పుడు ఉపజాతులలో వలె ప్రాసయతికి అవకాశమున్నది. దీనిలో ప్రాసయతి వాడబడినది. ప్రాస లేని ఆటవెలది, ప్రాస లేని ద్విపదవలెనే ప్రాస లేని రగడ ప్రయోగ ప్రమాణమై తిరిగి ప్రాస, అర్వాచీనముగ తగిలించబడినదని భావించవలయును.

ప్రాసతోబాటు అంత్యప్రాస అన్నది కూడా రగడకు ఒక అలంకారముగ కుదుర్చబడినది. అంత్యప్రాస ప్రాచీన కాలమున లేదనవలయును. లభ్యమాన సాక్ష్యములలో అంత్యప్రాస గల రగడ క్రీ.శ. 9వ శతాబ్దినాటిది. అంత్యప్రాస లేనప్పుడు, పాద వ్యవస్థ స్పష్టముగా లేక, వరుసగా వ్రాయబడి వచనమని భావింపబడినది. ఇది కూడ అర్వాచీనాలంకారముగ భావింపవలయును. అంత్యప్రాస నియతముగా నున్న ఏకైక ఛందము రగడ, లాక్షణికులు అంత్యప్రాసను శబ్దాలంకార ప్రాసగా భావించిరే కాని తెలుగు ఛందములకు నియత మొనర్పలేదు. జానపద గీతములలో అప్పుడప్పుడు అలంకారముగా వ్రాయబడు అంత్యప్రాస రగడ పాదాంత్యమున నిక్షేపించుటకు ప్రేరణమై యుండును. అంత్యప్రాస లేని 'గేయచ్ఛందముగా రగడను ఆంధ్ర మహాకవులు గుర్తించిరనుటకు శ్రీనాథుని కాశీఖండములోని (6-125) హరిగతిరగడ సాక్ష్యము. ఇందు అంత్యప్రాస చాలాభాగము పాటింపబడలేదు.

## రగడ - ప్రాకృతచ్ఛందస్సులు :

ప్రాకృతమునందు రగడనుబోలిన ఛందస్సులున్నవి.
అవి మాత్రా చ్ఛందస్సులుగా గుర్తింపబడినవి.

### 1. పద్ధడి ఆ [స్వయంభూ ఛం 2-129]

4 చతుర్మాత్రాగణాలు పాదమునకుండును. అంత్యప్రాస కలదు. దీనినే హేమచంద్రుడు "పద్ధతి" అని, ప్రాకృత పైంగళము "పజ్ఝటికా"[8] అని పేర్కొని నారు. పజ్ఝటికాలో చతుర్మాత్రికాగణములు నాలుగు చొ॥న నాలుగు పాదములు (మొ. 64 మా॥) పాదాంత జగణము విశేష లక్షణములు.

### 2. అడిల్లా [ప్రా. పై. 1-127]

పాదమునకు 16 మాత్రలుండవలయును. అవి ఎట్లున్నను సరిపోవును. అంతమునందు మాత్రము 2 లఘువులే వాడవలయును.

### 3. ఛప్పయ్ ఛందము.

పాదానికి 24 మాత్రల చొప్పున నాలుగు పాదాలు వ్రాయవలెను. 11 మాత్రల పిదప యతి. దీనిమీద పాదానికి 28 మాత్రల చొ॥న 15 మాత్రల తరువాత యతి కల్గిన ఉల్లాలా అనే పేరుగల ఛందము అతికించవలయును.

పై మాత్రా ఛందస్సులు రగడలవంటివే. రడ్డాయన్న వేరొక్క ఛందము న్నది. కాని దానికి నామ సామీప్యమే తప్ప రగడల లక్షణములు చక్కగా కుదరవు. దానికి ఐదు పాదములు, పాదమునకు 15, 12, 15, 11,15 మాత్రల చొ॥న ఉండును. దీని వివర తెలుగులో సీసములోవలె అధికముగా వద్యము నతికించు విధానమున్నది. ఈ రడ్డా ఛందము పాదములోని మాత్రాసంఖ్య హెచ్చు తగ్గులను బట్టి 7 భేదాలుగా విభజింపబడినది.

కాని యీ ప్రాకృత చ్ఛందములకు తెలుగు రగడలతో సామ్యము లేదు. ప్రాచీన గేయములెట్టివైనను మాత్రాసంపుటులుగా విభజింపబడి ఛందోగ్రంథముల కెక్కినప్పుడు ఇట్టి స్వల్పమైన పోలికలు రానగును తెలుగులోని రగడల వింగడింపు, వివిధ భేదములు, పాదవ్యవస్థ, ప్రాస, అంత్య ప్రాస సంయోజనము దీని యొక్క స్వయం ప్రతిపత్తిని నిర్ధారింప జాలి యున్నవి ఏ భాషలోని గేయ వాఙ్మయమైనను ఇట్టి సమాన కాల సంపుటములలో కొలువబడుట సహజమే. దీనిని గమనింపకయే తెలుగు రగడలు అపభ్రంశ మూలములు కావచ్చునని N.V. Krishna Warrior భావించారు.

In addition to the above metres nine varieties of Ragadas, which are most probably adopted from Apabhramsa poetry, are described by Telugu prosodists.

— A history of Malayalam Metre — P 315

ప్రాకృతాపభ్రంశ చ్ఛందస్సులలో మాత్రాచ్ఛందస్సుల ప్రాచుర్యమును చూచి వారిట్లు ఊహించి యుండవచ్చును.

## మాత్రా చ్ఛందస్సులు

సంస్కృతప్రాకృత చ్ఛందస్సులను పరిశీలించినప్పుడు వానిని వైతాళీయ జాతి, ఆర్యాజాతి, మాత్రా సమకగణ జాతులని మాత్రా చ్ఛందస్సులను 3 విధములుగా భావింపవచ్చును.

**1.** వైతాళీయ జాతి :- ప్రత్యేకాక్షరాలు లఘు గురుత్వ నిర్దేశితము లుగా నుండు మాత్రాగణములు గల ఛందస్సులు. దక్షిణాంతికాదు లిట్టివే.

**2.** ఆర్యాజాతి మాత్రా సమక గణములుండి ప్రత్యేక నిర్దేశిత సంఖ్య మీద గణ స్వరూపము మారును. గీత్యుపగీత్యాదు లిట్టివే.

3. మాత్రాసమక గణజాతి :- ఇందుగణములు మాత్రాసమకములు. అనగా మాత్రా సంపుటములు. ఇందు గురులఘువులకు ప్రాధాన్యము లేక పాదమున కిన్ని మాత్రలని మాత్రము చెప్పబడును. వనవాసిక, పాదాకులము మొదలగున విట్టివి.

ప్రాకృతమునందు మాత్రికా ఛందములకు విశేష ప్రాధాన్య మీయబడినది. 2 నుండి మాత్రల సంఖ్య పెంచుకొనుచు బోవుచు, ఒక్కొక్క మాత్రా సంపుటము నకు ఒక్కొక్క అక్షరనామ మీయబడినది. అక్షరగణములను సైతము మాత్రలలో లెక్కించుట జరిగినది. అనగా జగణమును 4 మాత్రలని, రగణమును 5 మాత్రలని లెక్కింపు నిచ్చినారు. అంతేగాక 4 మాత్రల గణములని చెప్పునపుడు గురు లఘువుల సమాహారములను ఎన్ని వీలైన అన్నిటిని చూపినారు [9]. ఇంత విస్తృత ప్రణాళిక వల్లనే కాదోలు, ఆంధ్రలాక్షణికులకు, ఛందోవిమర్శకులకు ఇవి సాంస్కృతి కములు లేదా ప్రాకృతికములన్న భావన గల్గినది. [10]

తెలుగులోని గణ విధానములోని ప్రత్యేకత వలన దేశ్య చ్ఛందములలో గేయ ఛాయలు గల వానిలో సైతము మాత్రాగణనము లోపించినది. లఘువు ఒక్క మాత్ర, గురువు ద్విమాత్రికమని సర్వాంధ్ర లాక్షణికులు చెప్పినను, అక్షరగణములను గాని, దేశియమైన సూర్యేంద్ర చంద్రగణములనుగాని, ఆ భావనతో లెక్కింపరైరి. సాంస్కృతికములని కాదోలు దక్షిణాంతికాదులను, ఆర్యాదులను తెలుగు లాక్షణికులు గతానుగతికముగ చెప్పిరే కాని తెలుగులో వాని ఉపయోగమును గూర్చి ఆలోచింప రైరి. ఆర్యాదులకు బదులుగా కందమును, మాత్రాజాతులగు వనవాసికాదుల వంటి విగా, రగడాదులను తెలుగులో దేశి మాత్రా ఛందములుగా స్వీకరింప వలయును. తెలుగు లాక్షణికులు దేశి గణవ్యవస్థలో సైతము మాత్రా ఛందో దర్శనము గావించి నారు. ఉత్సాహలక్షణములో 7 త్రి మాత్రికములని సూర్యగణములను గూర్చి చెప్పి నారు. చిన్నకోట పెద్దన ఉత్సాహను రగడగా భావించి త్రిమాత్రా నిర్మితగణములలో కొలిచినాడు [11]. ఇంద్రగణములను పంచమాత్రికములుగా అవ్యక్తముగా భావించుట జరిగినది. అప్పకవి వైతాళీయములైన దక్షిణాంతికాదులను, రగడలను ఒకే జాతిగా భావించినాడు.

1) ఖ్యాతిగను రగడలందును
వైతాళీయాఖ్య వృత్త వారము లందున్
పీతాంబర గురువునకు

స్త్రీతిగ గృహల లఘువులు రెండేసి యగున్ —(అప్ప IV. 424)

యని పై ఛందములలో గురువుకు రెండు లఘువులు (రెండు మాత్రలని) చెప్పినాడు.

మాత్రా ఛందములను లాక్షణీకరించుటలో తెలుగు ఛందః కర్తలు స్పష్టమైన మార్గమున వలంబింపలేము. మాత్రా సంపుటులలో గణింపవగిన గేయ ఛ్ఛందములగు రగడాదులను, పరిమిత త్ర్యక్షరగణములలో కొలువదగిన ఆర్యా, కంద, చౌపదాదులను, ఒకే మార్గములో వివరింపబూనినారు ఇందుకు పై అప్పకవి లక్షణము సాక్ష్యము. అష్టే పాదమునకు 14, 16 మాత్రలుండవలసిన దక్షిణాంతికకు స స జ గ (14 మాత్రలనుటకు బదులు) స భ ర వ (16 మాత్రలనుటకు బదులు) గణములుండు నని చెప్పబడినది

2) ఉరుసాజగలుండు జేసులన్
సరులందూకొను సత్రభవంబులన్
వొరలేడిటు వొమ్మిదింటరా
ధరలో జెన్నగు దక్షిణాంతికల్ —(అప్ప IV. 425)

3) ఉద్ధురమాలా వృత్తములలో ఉభయ విధానము పాటించబడినది.
'ముప్పది తొమ్మిది మాత్రల
ముప్పది యక్కరముల పదము తదంఘ్రులునా
ల్గొప్పయతి ప్రాసంబులు
గుప్పలయగ్రాహి యనగ గొమరొందు హరీ.
ఇంబడరగా 'భజససంబల పదన్ భజసనంబులు'
పదంపడి భయంబులు లయగ్రా
హింబరగు ప్రాసవిరమంబు.... — అప్ప 4-435

4) రగడల లక్షణము చెప్పుచు ఉభయ విధానము పాటించబడినది.

అ) ఋతువిరామ మినులు నల్వు
రతుక నొక్క యంఘ్రి చెల్వు (హయప్రచార) — అప్ప. 4-487
(ఇనులు నల్వురనగా 3 మాత్రల గణములు నాలుగని)

ఆ) కరమొప్పు పంచలఘు గణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే (ద్విరదగతి) అప్ప 4-484
(పంచలఘు=పంచమాత్రికమని – నలల తప్ప
మరేది పనికి రాదన్న యర్థము కూడా వచ్చుచున్నది)

ఇ) నల సభ గగములు లోపలనేవైనను నెనిమిది నాల్గిటిపై
విరమము గలిసిన హరిగతి చెలువగు గృతులంగవివిరులౌనని చెప్పిన నియమము

(నల, స, భ, గగ అని గణములతో కొలువబడినది) — అప్ప 4-487

ఇట్టి లక్షణ ద్వైవిధ్యమును, అసమగ్రమార్గమును గమనించియే కోరాడ వారు "...ద్విరదగతిని రెట్టించిన విజయభద్రము ఇట్లు 5 మాత్రల గణములు నాలుగిటిని రెట్టింపగా వచ్చిన వానిలోని భేదములే లయవిభాతి, లయగ్రాహీత్యాది మాలా వృత్తములు. వీనిలో పాటలోని సౌకర్యము కొరకొక మాత్రయో, గణమో తగ్గింపబడి యుండును. మొత్తము ఇవి అన్నియు తొలుత నాలుగు గణములతో గూడిన పాదములు గలవియే. మాత్రా సంఖ్యా నియమమునకో, అక్షర గణనియమమునకో లొంగినంతవరకు లొంగదీసుకొని లాక్షణికులు వీనికి లక్షణ మేర్పరచినారు. ఇంకను అందని వానినివదిలివేసినారు. కొన్నిటిని తాళబద్ధములని గ్రహించియున్నారు అట్టి వనేకములు సామాన్య జనుల పాటలలో నుండును"[12]. అని లాక్షణికుల మార్గమును సూక్ష్మముగా విమర్శించినారు.

నిజమునకు మాత్రా ఛందస్సులను గేయ విధానముతో గ్రహించి, తదనుగుణముగా స్వీకరించి, లాక్షణీకరించిన - వాటిలో గల స్వేచ్ఛ రచనా సౌలభ్యము. గేయ గంధము సువ్యక్తమగును రగడలిట్టివే. వానిలో గేయత్వమును లాక్షణీకులును, శిష్టకవులును సూక్ష్మముగా గ్రహింపరైరి. రగడ గణ నిర్మాణమును గూర్చి చెప్పుచు కిట్టేల్ పండితుడిదే విధమగు అభిప్రాయమును చెప్పినాడు.

The Ragada is neither built on the System of the syllable feet, nor no that of a mere Number of moras, but on an equal number of moraes (Matras) included within certain feet (gana) and harmonise with beating time in music (Tala).

— ఛందోఽంబుధి-243 Para of notes

తక్కిన దేశ్య చ్ఛందస్సులను ఉపయోగించుటలో అల్పత్వమో, సంపూర్ణ త్యజనమో గావించిన ఆంధ్రకవులు తమ కావ్యములలో వీలునుబట్టి, దైవప్రార్థనకో, ప్రకృతి వర్ణనలకో రగడలను వాడుకొనిరి. పింగళి సూరన మాత్రము రగడను లేఖ కొరకు వాడినాడు (ప్రభా. ప్ర. V 152).

రగడ అత్యంత ప్రాచీన చందము. లాక్షణికోక్తిలో ఇది 10వ శతాబ్దిలో కానవచ్చినను ఉపయోగములో అంతకుముందే యున్నది. అది రగడవలెగాక గద్య భేదముగా చూడబడినది. క్రీ. శ 5 శ. నాటి హల్మిడి శాసనములోని కన్నడ వచనములో రగడను గుర్తించినారు. 6 శతాబ్ది తెలుగు శాసనములలో రగడ గుర్తింపబడినది[13]. 9వ శతాబ్దిలోని యశస్తిలక చంపువన్న గ్రంథమున రగడ వాడబడినది. దీని గ్రంథకర్త సోమదేవ సూరి దా॥ నాత్యుడగుట వలన కన్నడాంధ్ర సాహిత్యములోని రగడను తన గ్రంథమున వాడుకొనియుండుము. అది గద్యముగా పరిష్కర్తలు, వ్యాఖ్యాతలు భావించినను దానిని రగడ భేదముగా వ్రాయవచ్చును.

వికచ కర్ణోత్పల స్పర్ధితర కేక్షణాః
కేళితాళక్వణత్కనక మయ కంకణాః
సరస నఖరాణి విచ్చురిత భుజమండలాః
కాంచికోల్లాస వశదర్శితోరుస్థలాః
స్త్వైర సంజల్పన స్మేర బింబాధరాః
కర్ణ కండూమిషోద్వలిత కక్షాంతరాః
పృథు నితంబ స్థలల్లలితహాగతి విక్రమాః
సహజ శృంగార రసభరిత ముఖ విభ్రమాః [14]

అంత్యప్రాస రెండక్షరములతో ఇందు పాటింపబడినది. పాదాంత విసర్గ ఉచ్చారణలో హకార ధ్వనితో అంత్యప్రాసవలె శోభించును. సరి పాదములలో నుండుట, తెలుగు లోని ద్విరదగతికి సరిపోవుట దీని విశేష లక్షణము. దేశియమైన రగడ సంస్కృతములో ప్రయోగింపబడుటకు వేరొక సాక్ష్యము కోరుమిల్లి శాసనము. రాజరాజ నరేంద్రుని పట్టాభిషేకానంతరము (క్రీ. శ. 1022) వేయబడినదీ శాసనము. ఇదియును ద్విరదగతిలో అంత్యప్రాస లక్షణముతో నడచినది. సరిపాదములలో (పాదసంఖ్య 24) నడచినది. పాలుకురికి సోమనాథుడు సైతము ఈ రగడను ఉదాహరణ కావ్య ప్రక్రియతోబాటు సంస్కృతములోనికి కొనిపోయినాడు. రగడ ఉదాహరణ కావ్యములలో కళిక, ఉత్కళిక యన్న పేర్లతో వ్యవహృతము. పై రగడలలో ద్వితీయాక్షర ప్రాసలేదు. సంస్కృత భాషకు అది సహజము కాదు గనుక వారు వాడలేదు. పాల్కుర్కి సోమడు మాత్రము తెలుగు ప్రాసను సంస్కృతమునందు సైతము వాడినాడు.

లపిత పురాతన నూతన శివగణ పాదోదక పరిలసదభిషేకః
క్షపిత విపల్లవ పల్లమజంగమ లింగ సమర్చన నిచిత వివేకః
సతత వికస్వర భాస్వర నిజముఖ మండల ఖండితరజనీనాథః
కృతయుగ వర్తన కీర్తన నిరసన నిపుణ పవిత్ర చరిత్రసనాథః
ప్రకటిత దర్పక దర్పకరేణు ప్రమగననిశిత కరాంకుశ హేలః
సకముఖ మానస కమలాకర విహరణ చణరాజ మరాళః
స్వానుభవాంచిత కూడలి సంగమ సంతత దేవధ్యాభిజ్ఞః
సూనృత భాషాభూషణవాణీసింహాసనగంభీర రసజ్ఞః

— సంస్కృత బసవోదాహరణము

ఇది సంస్కృత భాషలోనిదైనను తెలుగుదనము పుణికి పుచ్చుకొన్నది. వృషభగతి రగడగా నడచినది.

రగడకు లాక్షణికముగా ప్రాచీనత్వమునకు ప్రమాణము నాగవర్మ ఛందో ఒంబుధి. దీనియందాతడు స్థూలముగా రగడ లక్షణమును చెప్పినాడు.

గణనియమ విపర్యాసమా
శెడెపడె దొళ్పె సెమెమాత్రె సమానాగి గుణా
గ్రగణియ మతడింద తాళద
గణ నెగొండం ఒప్పెదరువె రఘటా బంధం (ఛందో — 3-222)

గణ నియమములో విపర్యాసము ఉండినను, మాత్రాసమతగల్గి తాళబద్ధమై నెగడునది రఘటాబంధమనినాడు. ఈతడు రగడ భేదములను కూడ తడవినాడు. రగడలకు తెలుగులో తలస్పర్శి లక్షణము విన్నకోట పెద్దనచే, సమగ్ర లక్షణము అనంతునిచే ఈయబడినది. కవిజనాశ్రయకారుడీ రగడను చెప్పలేదు. నన్నయ కాలములో రగడ ఉండినను (కోటమిల్లి శాసన ప్రమాణము) ఆతడు దీనికి కావ్య గౌరవము నీయ లేదు. కవులలో రగడను వాడిన ప్రథముడు పాల్కురికి సోమనాథయే అగుచున్నాడు. ఆవి గద్యలు, రగడలు అన్న కావ్యభేదములుగా అనాంధ్ర భాషీయములుగ సాహిత్య మున నిలిచినవి. అతడు వాడినవి.

1. పంచప్రకార గద్య — మధురగతి రగడతో
2. నమస్కార గద్య — ”
3. అక్షరాంక గద్య — ద్విరదగతి రగడతో

4. శరణు బసవ రగళె — తురగ వల్గనతో
5. సద్గురు రగళె — కన్నడ లలిత రగడతో
6. చెన్నబసవస్తోత్ర రగళె — " ఉత్సాహరగడతో

రగడ అచ్చమైన గేయచ్ఛందము. 'సమాన కాల సంపుటములు' సరి సంఖ్యలో గల్గి, పాదసంఖ్యానియమము లేక, సాధారణముగా సరిసంఖ్యలో ఉండి పాదాంతయతి, సమద్విఖండన యతి పాదమధ్యమున ఉండి గేయము సాగును. రగడల కీలక్షణములు సమగ్రముగా పట్టినవి.

1. గేయములలో పద్దెకావృత్తి రూపమున నుండు అంత్య ప్రాస రగడకు సైతము అలంకారముగా ఘటించుట.
2. మాత్రాగణ (కాలసంపుటులు) బద్ధము.
3. రెట్టింపు విధానములో పాదదైర్ఘ్యము పెంచుటకు వీలుకలిగి యుండుట.
4. అన్ని తాళములలో రగడల గమనముండుట.
5. కాలసంపుటులకు 'నిర్ణీత గణములు' అన్న నియమముకాక స్వేచ్ఛగా పెంచి, కుదించు అవకాశము కల్గియుండుట.
6. రగడలను గేయచ్ఛందములుగా ఆంధ్ర లాక్షణికులు సూచించుట.
7. యతి పాద సమద్విఖండన రూపము.

అన్నవి రగడలు గేయ ఛ్ఛందస్సులనుటకు బలమయిన సాక్ష్యములు. జయకీర్తి తన ఛందోనుశాసనమున రగడ లక్షణమున గేయ విధానమున్నట్లు చెప్పినాడు[15].

స్వచ్ఛందః సంజ్ఞా రఘటా
మాత్రాక్షర సమోదితాః
పాద ద్వంద్వ సమాకీర్ణా
సుశ్రావ్యాసైవ పద్ధతిః[15]

స్వచ్ఛంద లక్షణము, సమమాత్రాక్షరాలు కల్గియుండుట, సరిపాదాలు, పాదసంఖ్యా నియమ రాహిత్యము, సుశ్రావ్యత్వము అతడు చెప్పిన లక్షణము. ఈ లక్షణము గేయ చ్ఛందములకు స్వాభావికము.

దేశీయములైన ఉదాహరణ ప్రబంధములలో కళికోత్కళికల రూపములో రగడలు గేయ విధానములో నిలిచినవి. యక్షగానములలో వీనిని అదుక వచ్చునని అప్పకవి వీని గేయత్వమును వ్యక్తమొనర్చినాడు [16].

రగడలలోని కాలఖండములను గేయచ్ఛందములని భావించుటచే తెలుగు కవులు మాత్రాసంపుటులలో నిర్మించినారు. అనగా లాక్షణికులు చెప్పిన నిషేధ గణములు, దేశి గణములు, అక్కడక్కడ ఉల్లంఘించినారు. వీనిని విమర్శకులు గణ వైలక్షణ్యమనినారు[17]. కాని వీనిని గేయచ్ఛందములుగ భావించిన వైలక్షణ్య మనక స్వాభావికమనజెల్లును.

4 4 4 4

1) జయజయ **సహస్ర** లింగా లయదర్

4 4 4 4

శనమా త్రస్థిత మోదా పాదక

— కాళహస్తి మహాత్మ్యము (I-152)

నిషేధగణమైన జగణము (సహస్ర) ఈ హరిగతి రగడలో ప్రయోగింపబడినది.

4 4 4 4

2) పకడపు దీగెలు గోమేధికములు

4 4 8

పచ్చలు గెంపులు పుష్యరాగములు

— కవికర్ణ రసాయనము (3-195)

ఇచ్చట 'పుష్యరాగములు' అన్నచోట 4, 4 మాత్రలుగా ఉండవలసినది, ఒక కాల సంపుటిగా అనగా 8 మాత్రలతో నింపబడినది.

ఇంతి యెక్కడివి — యీ కోరకములు

చెంత నుండెని — చ్చెద కోరకములు

— శశాంక విజయము (II ఆ శ్వా॰)

పై పాదములలో 8 మాత్రల సంపుటిగా ఒక్కొ భాగము విభజింపబడినది. దీనిని 4 మాత్రలచే నిర్మితమైన రగడ భేదముగా చూపలేము. లక్షణము చెప్పబడని ఈ గతి గేయ విధితోనున్నది.

రగడలు కాలఖండములుగా (కాలసంపుటులుగా) కొలువబడుననుటకు హరిణగతి రగడ మరొక సాక్ష్యము. దీనిలో పాదమునకు రెండు సప్తమాత్రికములగు కాలసంపుటులుండును. దీనిని లాక్షణికులు 4+3 లేదా 3+4 మాత్రల గణములుగా

విభజించినారు. ఇట్లు విడిగా మాత్రలు విభజింపబడ వలయునని నియమము ఉండదు. మరియు 7 మాత్రల కాలసంపుటికి 3+4 లేదా 4+3 అని ఐచ్ఛికతను ఇచ్చుటయే దీని సంపుటత్వము తెలియ చెప్పుచున్నది. అందులో దీనికి మిశ్రగతి (Mixed Rhyme) అన్నపేరుంచుట గమనింపదగినది.

ఇట్లు పై ఆధారములన్నియు రగడలను జానపద గీతములనుండి గైకొన్న గేయఛందములుగ నిర్ధరింప జాలియున్నవి.

## రగడలు భేదములు :-

పాదములోని మాత్రాగణముల (కాలసంపుటుల) భిన్నత్వమును బట్టి రగడల భేదము లేర్పడుచున్నవి. అనగా త్రిమాత్రికా, చతుర్మాత్రికా, పంచమాత్రికా, సప్తమాత్రికా కాల సంపుటులను బట్టి రగడ భేదములేర్పడును. పాదమునకు గల మాత్రల మొత్తము సంఖ్య కూడా దీనితో మారుచుండును. ఇట్టి కాల సంపుటులు పాదమున కుండవలసిన వానిని రెట్టించగా మిగిలిన రగడలు ఏర్పడుచున్నవి.

ప్రసిద్ధముగా రగడలు 9 విధములుగా చెప్పబడినవి. అవి వరుసగా 1) హయ ప్రచార రగడ, 2) తురగ వల్గన రగడ, 3)విజయ మంగళ రగడ, 4) మధురగతి రగడ, 5) హరిగతి రగడ, 6) ద్విరదగతి రగడ, 7) విజయభద్ర రగడ,8) హరిణగతి రగడ, 9) వృషభగతి రగడ.

రగడలను భేదయుతముగా చెప్పిన వారిలో అనంతుడు మొదటి లాక్షణికు డగుచున్నాడు. అంతకుముందు విన్నకోట పెద్దన ఉత్సాహ రగడను మాత్రము చెప్పినాడు. భేదముల నాతడు తడవలేదు. దీనిచే ఇంతకుముందు రగడలు తెలుగు నాట లేవనలేము జానపదగీతములలో గల వీనిని లాక్షణికులు లాక్షణీకరింపరైరి. కన్నడ ఛందోగ్రంథములు ప్రాచీనకాలముననే రగడ భేదములను పేర్కొనినవి. కవిజనాశ్రయకారుడు వానినెందులకో వదిలివేసినాడు. కనీసము రగడనైనను పేర్కొనలేదు. అప్పకవి, చిత్రకవి పెద్దనలు రగడలకు తాళములను గూడ నిర్ధారించినారు.

సూక్ష్మముగా పరిశీలించినచో రగడల భేదములలో కేవలము నాలుగు మాత్రమే మౌలికమైనవిగా తోచును. అవి

1. హయప్రచార రగడ — 3 మాత్రలగణములతో త్ర్యస్రగతి గలది.
2. మధురగతి " — 4 " " చతురస్ర "
3. ద్విరదగతి " — 5 " " ఖండ "
4. హరిణగతి " — 7 " " మిశ్ర "

పై వానిలో నాలుగేసి గణములు పాదమునకుండును. చివరి హరిణగతిలో 7+7 మాత్రలగణములు రెండుండును. వానిని 3+4గా భావించిన మొత్తము దీనిలోకూడ 4 గణములన్నమాట. పాదమునకు 8 గణముల చొ॥న అనగా పై నాల్గింటిని రెట్టించగా మరి నాలుగు రగడలేర్పడును.

| | | |
|---|---|---|
| హయప్రచార | కు రెట్టింపు | తురగవల్గన రగడ |
| మధురగతి | కి " | హరిగతి " |
| ద్విరదగతి | " " | జయభద్ర " |
| హరిణగతి | " " | వృషభగతి " |

దీనితో మొత్తము 8 రగడలైనవి. తురగ వల్గనను తిరిగి రెట్టించగా విజయమంగళ మగును. అనగా దానిలో త్రిమాత్రికాల సంపుటములు 16 ఉండునన్నమాట. ఇది అతిదీర్ఘమైన పాదము, తక్కిన మూడింటికి ఇట్టి హరిగతి, జయభద్ర, వృషభగతి రగడలకు ద్విగుణీకృతత్వము చెప్పలేదు. కాన 'తురగవల్గన' కు రెట్టింపుచేయుటను బట్టి వీనికి రెట్టింపు చేసికొనవచ్చునని తెలిపినట్లయినది. లాక్షణికులు చెప్పకున్నను, కవులు ఇట్లు వాడుకొనినారు. శ్రీనాథుడు హరిణగతికి రెట్టింపుగా రగడను వ్రాసినాడు. తన శివరాత్రిమాహాత్మ్యములోని ఈ రగడను తాళ, విషమ రగడలను పేర్లతో రెండు వేరు వేరు పేర్లతో వేరువేరుగా వ్రాసినాడు.

హయప్రచార × 2 = తురగవల్గన. × 2 = విజయమంగళ
మధురగతి × 2 = హరిగతి. × 2 = తాళ(విషమ)రగడ

ఇట్లు తక్కిన రెంటికి కవుల ప్రయోగము లేకున్నను వాడుకొన్నచో రెట్టింపు విధానములో 4నకు గుణక సంఖ్యలో రగడలు సిద్ధమగును.

హరిణగతిలో ఒకమూడు మాత్రల గణము + ఒక నాలుగు మాత్రల గణము తీసికొనబడినది. అనగా ఒక హయప్రచార గణము, ఒక మధురగతి గణమన్నమాట. ఇట్లే ద్విరదగతి గణము (5 మాత్రల గణము) ఒకటి. హయప్రచార

గణము (3 మాత్రల గణము) ఒకటి తీసుకొని అవి రెండును, ఇవి రెకడుసు గణములతో చిత్రకవి పెద్దన తన లక్షణ గ్రంథమున (ల.సా.సం.) హంసగతికలిక యని లక్ష్యోదాహరణమున పేర్కొనినాడు. అనగా దానికి 5+5+3+3 గణము లన్నమాట. 3+4+4+3 వలె హరిణగతి కాగా. ఇది కొంచెము వేరుగానున్నది.

ఇట్లు గతిభేద ప్రియత్వముచే రగడలను అనంత సంఖ్యలో సృష్టించు కొనవచ్చునన్నమాట.

మాత్రాగణముల వాడుకలో స్వేచ్ఛ ఉన్నను కొన్ని నిషేధ గణములను లాక్షణికులు చెప్పినారు. త్ర్యస్రగతిలో లగ గణము, చతురస్ర గతిలో జగణము, ఖండగతిలో జల, యగణము, మిశ్రగతిలో లగ, జగ గణములు నిషేధములు.

| | రగడ పేరు | పాదమునకు గణములు | మొత్తము పాదమునకు మాత్రల సంఖ్య | గతి | నిషేధ గణములు |
|---|---|---|---|---|---|
| 1. | హయప్రచార | త్రిమాత్ర గణాలు నాల్గు | 12 | త్ర్యస్య | లగ గణము |
| 2. | తురగవల్గన | త్రిమాత్రాగణాలు ఎనిమిది | 24 | ” | |
| 3. | విజయమంగళ | త్రిమాత్రాగణాలు పదునారు | 48 | ” | |
| 4. | మధురగతి | చతుర్మాత్రాగణాలు నాలుగు | 16 | చతురస్ర | జగణము |
| 5. | హరిగతి | చతుర్మాత్రాగణాలు ఎనిమిది | 32 | ” | |
| 6. | తాళ(విషమ)రగడ | చతురాత్రాగణాలు పదునారు | 64 | ” | |
| 7. | ద్విరదగతి | పంచమాత్రికాగణాలునాలుగు | 20 | ఖండ | జల, యగణములు |
| 8. | (వి) జయభద్ర | పంచమాత్రికాగణాలుఎనిమిది | 40 | ” | |
| 9. | హరిణగతి | రెండు సప్త మాత్రికాగణాలు | 14 | మిశ్ర | లగ జగ గణాలు |
| 10. | వృషభగతి | నాలుగు సప్తమాత్రికాగణాలు | 28 | మిశ్ర | |
| 11. | హంసగతి | రెండు పంచమాత్రికాగణాలు + రెండు త్రిమాత్రికాగణాలు | 16 | — | |

6, 11 లాక్షణికులు చెప్పనివి. తక్కిన నవవిధ రగడలను లాక్షణికులు పేర్కొనినారు.

## 1. హయప్రచార రగడ :-

ద్వితీయాక్షర ప్రాసతో అంత్యప్రాసతో నాలుగు త్రిమాత్రాగణములు పాదమునకుండునవి.

3 3 3 3
రాజి తంబు * రత్న మయము
3 3 3 3
భ్రాజి తంబు * ప్రసవ మయము

— రామా. కల్ప. కిష్కింధ - నియమపాలన - 319

అన్ని రగడలకు యతి సమద్వేఖండన రూపము. అనగా సమానకాల సంపుటులు గల పాదములో నడుమకు పాదము విరుగవలయును. 4గణములతో 2 గణముల తర్వాత యతి. యతి విచ్ఛేదరూపము గేయ లక్షణము. సదృశాక్షర నియతి తెలుగు కావ్య సంప్రదాయము. ఉభయ విధానములు రగడలో పాటింపబడుట గమనింపదగినది. పై ఉదాహరణమున నిది స్పష్టము.

## 2. తురగ వల్గన రగడ :-

హయ ప్రచార రగడ పాదదైర్ఘ్యములో ఇది రెట్టింపు. అనగా త్రిమాత్రా గణములు 8 ఉండును. యతి 4 గణముల పిదప ఉండును.

రామ రామ వారి వారి * రామ రామ సదప తార
ధామ ధామ చైత్ర చిత్ర * ధామ ధామ విదళి తార

— ప్రబం. వేం. వి. వి. పద్య సం. 872

## 3. విజయ మంగళ రగడ :-

తురగ వల్గన రగడ పాద దైర్ఘ్యముతో నిది రెట్టింపు — హయ ప్రచారతో నాలుగు రెట్లుండును. అనగా త్రిమాత్రికా గణములు 16 ఉండును. యతి తురగ వల్గనలోవలె 4 గణములకొకమారుండును. అనగా 1వ గణాద్యక్షరముతో 5, 9, 13వ గణాద్యక్షరములకు యతి చెల్లును. అనగా 4 గణములకొక్క ఖండ ముగా భావించిన పాదము నాల్గు ఖండములై (అనగా 4 హయప్రచార రగడ పాదములై) ఖండ ఖండమునకు యతి ఉండును. ఈ విధానము ద్విపదజన్యమైన తరువోజలోని యతి విధానమును తలపింపజేయుచున్నది. ఇట్టి విధానము హయ ప్రచారమునకు ద్విగుణీకృతమైన తురగవల్గనలో సైతము ఉండవలసినది.

ఇది అతిదీర్ఘమగుట వలన ఆంధ్రకవులు దీనిని వాడినట్లు లేదు.

3 3 3 3 3 3 3 3
తురగ వల్గ నంబు రెంటి * తోడ విజయ మంగ ళంబు
3 3 3 3 3 3 3 3
ధూర్త కంస తూల దహన * తుహిన హీర సదృశ కీర్తి
3 3 3 3 3 3 3 3
పరగ దుగ్ధ సింధు మధ్య * భాసు రాంత రీప వర్తి
3 3 3 3 3 3 3 3
వారి వాహ సదృశ మూర్తి * భక్త జనహృ దబ్జ పూర్తి

— అప్ప. 4 - 483

**4. మధురగతి రగడ :-**

చతుర్మాత్రా కాల సంపుటులు నాల్గింటితో పాదసమద్వ్యఖండన రూప యతితో, ఆద్యంత ప్రాసలతో నడచునది మధురగతి రగడ.

సా రస పదనలు * సారప దమ్మున
గా రవ ముగళ్ళం * గారవ నమ్మున

— ప్ర. వేం. వి. వి. ప. 253

**5. హరిగతి రగడ :-**

మధురగతి పాదదైర్ఘ్యముతో రెట్టింపుగా ఇది ఉండును. అనగా పాదమునకు చతుర్మాత్రికా గణములు 8 ఉండును. విజయమంగళములోవలె 4 చోట్ల యతి మైత్రి వర్ణనిక్షేపము గాక — రెండుచోట్ల 4 గణముల పిదప యతి ఉన్నది. బహు. యతి నియతిని లాక్షణికులు చెప్పరైరి.

4 4 4 4 4 4 4 4
శ్రీమ త్కాశీ పుటభే దనల * క్ష్మక్రుతి మణిక ర్ణికమణి కర్ణిక
యామవ తీవర చూడామణికిని * హారక మలదీ ర్ఘికమణి కర్ణిక

— కాశీ ఖం VI. 125

**6. ద్విరదగతి రగడ :-**

రగడలలో అతి ప్రచురమైనది. బహుళ జానపద గేయములందు నడచును. ఖండగతి తెలుగునాట ప్రసిద్ధమైన నడక. పంచమాత్రికా కాల సంపుటులు నాలుగుండును. 2 గణముల పిదప యతి.

5 5 5 3
అనిపల్కు చెలులంత * సలుదదే నియవాక
5 5 5 5
కనసక్రో పులలోని * కనకపు నడుమోక
— యయాతి చరిత్ర 5-75

## 7. విజయభద్ర రగడ :-

ద్విరదగతి పాదముతో ద్విగుణీ కృత దైర్ఘ్యము గల్గినది. అనగా పాదమునకు 8 పంచమాత్రికా గణములు. ద్విరదగతిని రెట్టించిన విధానమును సూచించినట్లే నాలుగు చోట్ల యతి స్థలములు 2 గణముల కొక ఖండముగా యతి విడగొట్టును. 1, 3, 5, 7వ గణాద్యక్షరములు మైత్రీ వర్ణములు. తెలుగు యతి సంప్రదాయముననుసరించి మైత్రి కల్గియుండును. పాద దీర్ఘత్వము వలన కాబోలు ప్రాచీనకవి ప్రయోగములలో మృగ్యములు.

దారిప్ర క్కనధరా * ధరకోణ ఘనశిలా *
త్తవితర్ది కాపరి * స్తరణర మ్యంబైన
దారిమ ధ్యనధరా * ధరఘురీ సారణీ *
దరనీల పదిలఘూ * త్తమువారి మృదువైన
— రామా. కల్ప. కిష్కింధ. ని. పా. 323

## 8. హరిణగతి రగడ :-

సప్త మాత్రికాగణములు రెండు పాదమున కుండును. లక్షణ శిరోమణి కారుడు హరిణగతిని వృషభగతిలో సగమని చెప్పినాడు. వృషభగతియే ముందుగా చెప్పబడినది. అనగా రెట్టింపు విధానములోవలెగాక వరుస మార్చినాడు. ఉత్కళి కకు రెట్టింపు కళికయని చెప్పక, కళికలో సగము ఉత్కళిక అని చెప్పిన విధానము వంటిదిది చిన్న పాదములు రెట్టింపు విధానములో పెద్ద పాదములగుట సహజమై మైనను, వైచిత్రీ ప్రియత్వముచే పాదముచు అర్ధ దైర్ఘ్యములోనికి సంక్షిప్తీకరించుట కూడా జరుగవచ్చును. పొత్తపి రమణ కవి ప్రకారము ఇది అట్టిదే అనిపించు చున్నది. ఏలయన రెండు గణములు తక్కిన రగడలలో కనబడవు. కనీసము పాదము నకు నాల్గు గణములుండును. వృషభగతిలో యతి సైతము నాల్గుచోట్ల లేదు. యతి రెట్టింపు విధానమనుటకు అవకాశమీయలేదు. అంతేగాదు, కవిప్రయోగములో సైతమిది మృగ్యమే. రగడలను 4 లేదా 3 గణముల వానినే కవులు వాడుట గాంచనగును.

3 + 4 3 + 4
విషధి కన్యా * వినుత సార్థము
వృష ఖగతిలో * వెలయు నర్థము — ల.శి. III. 359

9. **వృషభగతి రగడ :-**

సప్తమాత్రికా గణములు నాలుగు పాదమునకుండును. యతి అర్ధమున కుండును.

3 + 4 3 + 4 3 + 4 3 + 4
కొమ్మ వేగిర యేటి కేకొన * గోర గోరట విరులు గిల్లుము
తమ్మి పువ్వుల మీద జలములు * దార దారక యుండ జల్లుము
— పారిజాతా 4-16

## విశేష రగడలు :-

**1) హంసగతి రగడ :-** ఈ పేరుతో గతి వైచిత్రీ ప్రియు లేర్పరచు కొన్న రగడ ఒకటున్నది. దానిలో పంచమాత్రికా గణములు రెండు, త్రిమాత్రికాగణములు రెండును పాదమునకుండును. అనగా ద్విరదగతి రగడ అర్ధ పాదమునకు మీద హయ ప్రచార రగడ అర్ధపాదము జోడించగా సిద్ధించును. మాత్రల క్రమము 5+5+3+2. ఇది లాక్షణికులచే చెప్పబడకున్నను ఉదాహరణ కావ్యములలో కాన వచ్చుచున్నది.

5 5 3 3
మరియునుగ టాక్షజిత * మారు నందు
తరిత్రాడు సొమ్మగును * దారు నందు
— త్రిపురాంత కోదాహరణము, సప్తమీ విభక్తి కళిక

లక్షణ సార సంగ్రహకర్త హంసగతి రగడ అని పేరు పెట్టిన ఈ రగడ తాళ్ళపాక పెద తిరుమలయ్య "వేంకటేశ్వరోదాహరణము"లో, చిత్రకవి పెద్దన హనుమదుదాహరణలో, అప్పకవి శ్రీకృష్ణోదాహరణములో, బాలకవి అనంతయ్య శేషాద్ర్యుదాహరణములో వాడినారు.

లక్ష. సార. సం. (పెద్దన) వాడినది
ఖాపసే వితరామ భద్రునందు
రావణము ఖాసహ్యా ౹౭ దునందు
— ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## 2. అర్ధ హంసగతి :-

రగడ అన్న పేరుతో త్రిపురాంత కోదాహరణములో పై హంసగతి రగడకే అర్థమగునట్లు వాడబడినది. అనగా ఒక పంచమాత్రికా గణము మీద నొక్క త్రిమాత్రాగణము మొత్తము 5+3=8 మాత్రలు పాదమునకుండును. గణమున కొక్క పాదము వాడకున్న, ఇది 2 చతుర్మాత్రికా గణములవలె స్వీకరింప వచ్చును ఇది త్రిపురాంత కోదాహరణలో ఉత్కళిక వలె వాడబడినది. ఉత్కళికకు యతిలేదు. కనుక 4+4గా విడిపోవుటలో యతి అడ్డురాదు.

5 + 3
ఇలయు సలి — లంబు
వెలుగునని — లంబు

## 3. తాళ రగడ :-

ఇది లాక్షణికుల నవవిధ రగడలలో లేనిది. శ్రీనాథుడు ద్విగుణీకృత విధానములో కల్పించుకొన్నది. త్ర్యస్రగతిలోని విజయ మంగళవలె చతురస్రలో రెట్టింపునకు రెట్టింపు విధానము నందలిది. ఇది వేరు కవులు వాడినట్లుగాని, లాక్షణికులు లాక్షణీకరించినట్లుగాని కానరాదు. శ్రీనాథుడు సైతము దీనిని ఒక్క శివరాత్రి మాహాత్మ్యములో మాత్రము చతుర్థాశ్వాసమున మూడుమార్లు (21, 88, 91, నం.) వాడినాడు. దీనికి 'తాళ' నామముతో బాటు 'విషము' నియమముంచబడనది. దీర్ఘపాదమైన ఇట్టి తాళ రగడ అన్యకవ్యుపయోగము లేదనుటకు దీని దైర్ఘ్యమే కారణమై ఉండును.

యతి దీనియందు బహుయతి నియతి పాటింపబడును. సమాన చతుష్ఖండములలో ఖండమున కొకపరి యతి.

4 4 4 4 4 4
దవుదొ, వులగాం, చెంగై, లాసము * తరుణేం, దుకళా
4 4
ధరునిని, వాసము

4 4 4 4 4 4 4
* దళహరి, నికట, స్థాన, స్థపుటిత * ధవళ, చ్ఛాయా, చ్ఛేదవి.
4
లాసము
(4-88)

## 4. మంజుల రగడ :-

అయ్యలరాజు నారాయణామాత్యుడు తన "హంసవింశతి"లో ఈ పేరుతో మధురగతి రగడను ప్రాసలేకుండ వ్రాసినాడు. జానపద గేయములలో ప్రాస, అంత్య ప్రాస నియతముకాదు. ప్రాస రహిత రగడకు ఈతనికి - చతురస్రగతి గేయము - ప్రేరణమై యుండును. దీనిలో అంత్యప్రాస సహితములేదు.

4 4 4 4
ధర్మపు రక్షే త్రముయో గానం
8 4 4
దస్వరూపునకు దాస్యము సలుపుచు
4 4 4 4
శ్రీకా కుళమున సిస్తుగ దోచిన
8 4 4
యాంధ్రనాయకున కర్చన మనుచును

— హంస వింశతి. IV. 213

5వ, 6వ గణములు 4 మాత్రల వొ॥ వ్రాయుటకు బదులు 8 మాత్రల కాలసంపుటిగా వ్రాయబడుట గమనింప దగినది.

## 5. మయూరగతి రగడ :-

తంజావూర్ మహారాష్ట్ర ప్రభువగు "శహాజి" 'విష్ణుపల్లకి సేవా ప్రబంధమున' మయూరగతి రగడ అన్న పేరుతో రగడ నొక దానిని వ్రాసినాడు. ఇది చివర ఒక్క మాత్ర తక్కువైనదిగాని ద్విరదగతియె అనగా 19 మాత్రలతో నడచును.

5 5 5 4
మారమణి పల్లవకు మారమణి మోదం
బారగరు జింపనుమ యూరగతి తోనే
తేదమది నిన్నయిటు దీర్ఘమగు దండెన్
భారముగ రాజిలెడు పల్లకియు వచ్చెన్ 18

"మహానవమి పద్యము" అన్న పేరుతో పొత్తపిరమణకవి తన ల.శి.లో (3-363) దీనికి లక్షణము చెప్పినాడు. అచ్చట లక్ష్యము మాత్రము ఇవ్వలేదు.

క. సురుచిరముగ ద్విరద (గతిన్)
జరణము పంచొమ్మిదేసి సరసపు మాత్రల్
పరగిన డిండిమ వృత్తమె
యరయ మహానవమి పద్యమది౦పె ధరిత్రిన్.

## 6. శృంఖలిత వచన రగడ :-

ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము నందు గణపవరపు వేంకట కవి శృంఖలిత వచన రగడఅన్న పేరుతో నొక 6 పాదముల రగడ వ్రాసినాడు. రగడగా బంధింపబడిన వచనమని యాతని భావమై యుండును. పాల్కురికి సోమ నాథుని కాలము నాటికే 'వచనము', 'రగడ' అన్న పేర్లతో స్తుతి (లఘు) కావ్యములు వెలసి నవగుటచే దీనిని నామద్వయమున ననుసంధానించి స్తోత్రముగా వ్రాసినాడు కాబోలు. ఇందు త్రిమాత్రాగణములు పెనిమిది కలవు. తురగవల్గన అన్నమాట. ఆద్యంత ప్రాసలు పెట్టలేదు.

శ్రీవి హార హార కీర్తి కీర్తి లబ్ధ లబ్ధ పుణ్య
పుణ్య కాంతి కాంతి ధామ ధామ గోత్ర గోత్ర భూమ
— 805 ప. (పుట 252)

ఆద్యంతములు ప్రాసలేని ఈ రగడను పాదమునకు 16 గణములుగ వ్రాసినను భేద మేమియును రాదు. కాని పాదముల సంఖ్య మూడే యగును.

రగడలకు గల పేర్లను పరిశీలింపగా నివి గతి వైవిధ్యమును సూచించు టకు చిత్రమయిన పేర్లతో సూచింపబడినవి. త్ర్యస్ర గతిలో నడచు హయ ప్రచార, తురగ వల్గన, విజయమంగళ నామములు గుఱ్ఱపు నడక అన్న అర్థము వచ్చునట్లు పేర్కొంచబడినవి. చతురస్రగతిలో నడచు మధురగతి - హరిగతులకు మాత్రము జంతునామముంచబడలేదు. పైగా పేర్లు వేర్వేరర్థములలోనున్నవి. గతిశబ్దమీ పేర్లలో సూచింపబడినది. తాళయన్న శ్రీనాథుని నామము వైశ్యతాసూచకము. ద్విరద విజయ భద్రములు ఏనుగు నడకను సూచించు పేర్లు. హరిణగతి, వృషభగతులు జింక పరుగు, ఎద్దు నడకలను సూచించుచు విచిత్రముగ నున్నవి. హంసగతి అంచనడకను మయూరగతి నెమలి నడకలను సూచించు పేర్లై వెలసినవి. మంజుల రగడ, మణి మంజరి వంటి పేర్లు ఇట్లే కల్పిత నామములై యున్నవి. సంగీత శాస్త్రమున రేచక మనగా శ్వాస విడుచుట, పూరకమనగా శ్వాస పీల్చుట. ఒక పర్యాయమిట్టి ఉచ్ఛ్వాస

నిశ్వాసముల ప్రమాణకాలమునకు హంసగతి కాలమని పేరు[19]. హంసగతి రగడకు గల పేరు ఉంచుట ఇట్టి కాలప్రమాణమేమైన సంబంధము కల్గియుండునేమో !

రగడల కిట్లు పేర్లు సూచించుటలో లాక్షణికులు పెట్టిన పేర్లుగాక పర్యాయ విషయమును బట్టి పేరుంచుట గూడ కాననగును. శ్రీనాథుడు కాశీఖండములోని రగడను మణికర్ణిక ప్రభావ రగడ అనినాడు. తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు సుదర్శన రగడ అనినాడు. పాల్కురికి సోమనాథుని రగడల చెన్నబసవరగడ, షట్స్థల రగడవంటి పేర్లుంచబడినవి. గణపవరపు వెంకటకవి చిత్రముగా రగడలకు పేర్లుంచినాడు. శృంఖలితరగడ అన్న దొకపేరు. "అచుంబిత చతుర్దశ యమకాంత్య నియమ భరణ చరణ గరిష్ఠ నిరోష్ఠ్య విరాజిత రగడ" అన్నది వేరొక్కపేరు. రగడలకున్న పేర్లలో ఇది అతిదీర్ఘ నామముగ భావింపవచ్చును.

## కళికోత్కళికలు :-

మాత్రా ఛందో నిర్మితములైన కళికోత్కళికలు రగడ వికారములే. రగడల లక్షణమునకు వీనికిని భేదమేమియులేదు. రగడల యొక్క క్లుప్తరూపములు కళికోత్కళికలు. కళికలో సగము ఉత్కళిక. అనగా ఇది మరింత లఘు పాదము కలది. ఆదిలో వీనికి మధ్య భేదము పాల్కురికి సోమనాటికి లేకున్నను, తర్వాత కావ్యములలో రగడలని ఉదాహరణ కావ్యములలో కళికోత్కళికలని వ్యవహరింప బడినవి.

"రగడ భేదములు మార్గములు గాగ
కళికలు నెనిమిది దళములు గావించి" అని అప్పకవి కళికలకు

రగడల మార్గములలోని వనినాడు. రగడలే కళికలనబేదు[21]. ఈ కళికోత్కళికల మూలముననే ఉదాహరణకావ్య ప్రక్రియ దేశీయమైనదిగా గుర్తింపబడినది. ఈ విధానము ఇతర భాషలలో లేనిది. ఉదాహరణ కావ్య ప్రక్రియ రగడల ఉపయోగము కల్గినదేమైనను, అచ్చమయిన దేశీయ ప్రక్రియ కాదు. సంస్కృత వృత్తములకు కళికోత్కళికలకు విభక్తికొకటి చొ॥న సార్వ విభక్తికముతో కల్పి మిశ్ర విధానమై ఉన్నది. దేశి ఛ్ఛందములందలి మక్కువ తీరని పండితకవులు ఉభయ (మార్గి-దేశి) విధానమునకు ఉదాహరణ కావ్యమును ప్రయోగ వేదిక చేసికొనినారు. ఈ విధానము సైతము శివకవుల కాలముననే తెలుగులో ప్రవేశపెట్టబడినది.

ఉత్కళిక అన్నది సంస్కృత భాషలో గద్యభేదముగా పేర్కొనబడినది. వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో ఉత్కళికను గద్యభేదముగా పేర్కొని అది చూర్ణమునకు విపరీతమైన లక్షణము కలదని, అనగా దీర్ఘ సమాస రచన గలదని పేర్కొనినాడు. కాబట్టి తెలుగులో గేయ చ్ఛందమైన ఉత్కళికకు దీనికి సంబంధము లేదనవచ్చును[20]. గద్యము, వచనము అన్న పేర్లతో స్తుతి కావ్యములుగ వాడబడిన వానికి, స్తోత్ర రూపముననున్న పాటలకు అభేదమును పాటించి ఈ పేరును తెలుగులో వాడుకొనియుండవచ్చును. రగడలు తద్వికృతులగు కళికోత్కళికలు గేయ వాఙ్మయమునుండి పుట్టినవని "తెలుగు భాషకు స్వతస్సిద్ధమగు నిట్టి జానపద గేయము నుండియే మన సంగీత సాహిత్యములు బయలు వెడలినవని తెలిసికొనదగును." అని నిడుదవోలు వారనిరి[22]. అట్టి స్తోత్ర రూప పాఠమునుండే 'ఉదాహరణ కృతి' పుట్టినది. ప్రాచీన రగడ ప్రయోగము కావ్యములందు స్తోత్ర పరముగనే తెలుగులో వాడబడినది. తర్వాత రగడ ప్రయోగము పుష్పాపచయాదికమున వాడబడినది.

విభక్తికొక్క మార్గి చ్ఛందము (వృత్తము)తోబాటు దానిక్రింద రగడను కళిక మరియు ఉత్కళిక పేర వాడుట ఉదాహరణ కావ్యములందలి సంప్రదాయము. అదే విభక్తిలో వీలైతే విభక్తి పదమే అంత్య (అనుప్రాస) ఆవృత్తి పదముగా కళిక నడచును. పిదప దానిలో అర్ధముగా ఉత్కళికనడచును. దీనిచే గతివైవిధ్యము లేక కళికోత్కళికలు రెండును సమతూకముతో ఒకేపోట ఉండును. ఇట్టి ఛందో మిశ్రణము యక్షగానములందును కానవగును. సీసార్ధములు, కందార్ధముల పేరిట వానిలో వాడబడు వానిలో 1 లేదా $1\frac{1}{2}$ పాదము సీస, కందములు వ్రాసి ఆపై గేయము నడచును. ఇచ్చట గణ వ్యవస్థకు, మాత్రావ్యవస్థకు మిశ్రణమన్నమాట.

రగడలు ఉదాహరణమందు భిన్న భిన్నగతులలోనైనను, ఒకే రగడ ఉదాహరణము చివర వరకైనను వాడబడును. తాళ్ళపాక తిరుమలయ్య వేంకటేశ్వరోదాహరణము మున్నగువానిలో 3, 4 విధముల గతులలో రగడలు కళికోత్కళికలుగా వాడబడినవి. 7 విభక్తులు + సంబోధనతో కల్పి మొత్తము 8 కళికలు, వెన్వెంబడి 8 ఉత్కళికలు వాడబడుటకు 'ఉదాహరణము'లో వీలున్నది కళిక మాత్రాగణములు నాల్గింటితో నిర్మితమై. ఉత్కళిక 2 గణముల పాదముతో సాధారణముగా నిలుచును. 8 పాదములు కళిక వ్రాయబడిన పిదప తిరిగి 8 అర్ధపాదముల ఉత్కళిక వ్రాయబడును.

పాల్కురికి సోముని బసవోదాహరణలోని ప్రథమా విభక్తి కళిక :

వెండియు త్రిభువన వినుతి సమేతుడు
మండిత - సద్గుణ మహిమోపేతుడు
సురుచిర - శివసమ సుఖసంధానుడు
పరమ - పరాపర భరిత జ్ఞానుడు
విదితానందా స్వీకృత మనస్కుడు
సదమల విపులవి శాల యశస్కుడు
శ్రీవిల సితసద చిరతర భద్రుడు
గావున సాక్షాత్ కలియుగ రుద్రుడు

ఉత్కళిక
భువనో పకార
భవమో దవీర
భక్తిసంయోగ
ముక్తి సంభోగ
సౌఖ్యా బ్ధిలోన
ముఖ్యుడైన
వెలయు శుభకరుడు
ఇలవి శ్వగురుడు

ఇది చతురస్రగతిలో పాదమునకు 4 మాత్రల గణములు నాల్గింటితో నడచు మధుర గతి రగడ. దీనిలో అర్ధము ఉత్కళిక - 2 గణములది. ఇచ్చట 8 మాత్రలకు 3, 4, 6 పాదములలో ఉత్కళికలో 2 చతుర్మాత్రా సంపుటులు గాక ఒకే 8మాత్రల అఖండ సంపుటిగా పాదము రచించబడుట కాంచనగును.

## రేకులు – రగడలు :

రేకులన్నవి గేయ ఫణితులుగ లాక్షణికులచే పేర్కొనబడినవి. ఇవి రగడ వికృతులు. "ఆయాయి రగడ భేదంబులు రేకులు పెక్కులమరు" అని లక్షణసార సంగ్రహకర్త (III-102) పేర్కొనినాడు. ఇవి వైతాళీయ జాతులని కావ్యాలంకార చూడామణి పేర్కొనినది (IV-40). వీనిని ఏయే రగడల నుండి, ఏయే తాళములకు సరిపడునో చెప్పి యక్షగానములలో వాడుకొనవలయునని అప్పకవి స్పష్టముగా చెప్పినాడు. "వీన యక్షగాని ప్రబంధంబు లతుకవచ్చు. రగడ భేదంబులవి యంద్రు రస గవీంద్రులు..." అని చెప్పినాడు[23]. త్రిపుటరేకు, జంపెరేకు, రచ్చరేకు అని ఇట్లు రేకు తాళసంబంధముగా చిత్రగవి పెద్దన చెప్పినాడు.

వృషభగతి 'త్రిపుటరేకం' ద్విపయుగమగు
దుదనేడు లఘువులు తొలగజేయ
'జంపెరేకు'నకు లక్షణము ద్విరదగతి
యగుగొననొక లఘువందు మాన
'రచ్చరేక'గును దురగవల్గనము గతి
మఱియేక తాళియా మధురగతిని
అటతాళమున మాత్రలంఘ్రికిర్వది నాల్గు
నాల్గిట విరతి పద్నాలుగిట
నిలుచు నర్థంపు నర్థచంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యులిడిన
రగడ భేదంబులివి యౌను రమ్య చర్య
యవిత నిజదాస సముదాయ యాంజనేయ — ల.సా.సం. II-141

దీనినిబట్టి రేకులనగా తాళబద్ధ గేయరచనలని తేలుచున్నది. రేకులకు అర్ధము (సగము) అర్థచంద్రిక యగునని గీతి మొదటి పాదమున చెప్పినాడు. అప్పకవి చెప్పిన లక్షణము ఇంచుమించుగా ఇదే విధముగానున్నది. యక్షగాన లక్షణమని అప్ప కవి చెప్పినదానికి ముద్రిత ప్రతులలో ఈవివరణమునకు శీర్షిక ఈయబడినదిగాని దాని రేకులక్షణమన్న శీర్షికతో నుంచవలయును.

వృషభగతి పాదమునకు తుద ఏడు లఘువులు తొలగించిన త్రిపుటరేక గునని ల. సా. సం. కర్త అనినాడు. వృషభగతిలో 7 మా. గణములు నాలుగు పాదములుండును. తుదనేడు మాత్రలు తీసివేయుటనగా సప్తమాత్రికా గణములు మూడుండిన త్రిపుట రేకమగునని యర్థము. త్రిపుటయన్న శబ్దము ఇచ్చట సార్థక మగుచున్నది. అప్పకవి (క్రీ.శ. 1656) చిత్రకవి పెద్దన క్రీ.శ. 1550) వ్రాసిన ఈ పద్యమును ప్రేరణగా గొని రేకుల లక్షణమును తన గ్రంథమున వ్రాసియుండును. అప్పకవి లక్షణము మాత్రము ఇందుకు కొంచెము భిన్నముగా నున్నది.

"తుదనేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము" అలినాడు — (4-490)

వృషభగతి పాదద్వయములో తుది ఏడు లఘువులు తొలగించగా త్రిపుటయగునని నాడు. వృషభగతి పాదయుగములో అనగా సప్త మాత్రికలు 8 గణములలో తీసి వేయగా (7×7మా) త్రిపుట యగునని అర్థమా ? లేదా వృషభగతి పాదయుగ

ములో ఒక్కొక్క పాదమునకు చివరి సప్తమాత్రికా గణము తీసివేయగా అనగా 3 సప్తమాత్రికా గణములు + 3 సప్తమాత్రికా గణములు కల్పి త్రిపుట రేకగునా? తెలియవచ్చుటలేదు. అంతేగాదు అప్పకవి త్రిపుట, జంపె అనినాడే గాని 'రేకు' శబ్దమును వాడలేదు. ఇవి మరి తాళములే అందుమా! సంగీత శాస్త్రములోని తాళములకు - వీనికి పొత్తు కుదరదు. రచ్చరేకునకు మాత్రము అప్పకవి లక్షణము పెద్దన లక్షణముతో సంవదించుచున్నది.

జంపెరేకునకు ద్విరదగతిలో ఒక లఘువు తక్కువగా ఉండును. అనగా పంచమాత్రికా గణములు నాల్గుగల $5 \times 4 = 20$ మాత్రల ద్విరదగతి రగడ పాదములో 1 మాత్ర తగ్గి జంపెరేకునకు 19 మాత్రలుండును. అప్పకవి దీనికి సైతము పైపలెనే,

"లలి గడపల నొక్క లఘువు మానినీ జంపె
మను ద్విరదగతిస పపదయుగము"

అని ద్విరదగతి పాదములు రెంటికి చివర ఒక లఘువు తగ్గించవలెననినాడు. రెండు ద్విరదగతి పాదములనగా $20+20=40$ మాత్రలలో చివరనొక మాత్ర తగ్గించి 39 మా. పాదము అనవలయునా? బహుశ ఇట్లు కాకపోవచ్చును. ఒకవేళ అప్పకవి అభిప్రాయము అట్లే ఐనచో ద్విరదగతి రెండు పాదములనక విజయభద్ర మునకొక మాత్ర తక్కువనెడివాడు. విజయభద్ర ద్విరదగతికి రెట్టింపు గదా! బహుశ పాదమునకు 19 మాత్రల చొప్పున రెండు పాదములని అప్పకవి కర్థము చెప్పికొన్నచో లక్షణము లెక్కగా సరిపోవును. అనగా ఒకమాత్ర తగ్గిన 2 ద్విరద గతి పాదములు 19-19 చొప్పున జంపెరేకు అగునని అర్థము వచ్చును. దీనినిబట్టి రేకులు రెండేసి పాదములుగా భావించవలయును.

రేకు అన్న శబ్దమును వాడని అట తాళమునకు రేకు అన్నపేరు తగిలించిన అటరేకు అగును. అపుడు రేకు నాల్గు విధములగును.

| | రేకుపేరు | సంబంధితరగడ | గతి | పాదమునకు మాత్రలు |
|---|---|---|---|---|
| 1. | త్రిపుటరేకు | వషభగతిరగడ | మిశ్ర | 21 |
| 2. | జంపెరేకు | ద్విరదగతి | ఖండ | 19 |
| 3. | రచ్చరేకు | తురగవల్గన | త్ర్యస్ర | 24 |
| 4. | ఏకతాళరేకు | మధురగతి | చతురస్ర | 16 |
| 5. | అటతాళరేకు | — | — | 24 |

అట తాళరేకునకు 24 మాత్రలనగా 6+6+6+6 అనుకొందమేని యతి 14 మాత్రల మీదనని చెప్పబడుటచే 14 మాత్రలొక ఖండముగా 10 మాత్రలొక ఖండముగా భావించవలయును. అప్పుడు మాత్రల విధానము 7+7+5+5గా ఉండ వచ్చును. ఇట్లు భావించుటకు కారణము గేయములు సమాన కాలఖండములుగా విభక్త మగుటయేగాక, వీని (రేకుల) అర్ధములు — అర్ధచంద్రికలని చెప్పుటయే. పైవిధముగా నున్నచో వాటిని తిరిగి సగముచేసి అర్ధచంద్రికల నేర్పకొనుటకు అవకాశమున్నది. ఈ సగభాగము చేయుటన్నది ఉత్కళికలో కూడా ఉండుటచే (కళిక × ½ = ఉత్కళిక) రేకులు, అర్ధచంద్రికలు కళికోత్కళికలే కావచ్చునేమో అనకుండ వానికిగల (పైపట్టికలో చూపిన) మాత్రాసంఖ్య అవి వేరని తెల్పుచున్నది. కళికోత్కళికలవలెనే ఇవియును రగడ వికారములైన గేయఫణితులుగ భావించ వలయును.

అర్ధచంద్రికలు :

కినుక రదనములు కిటగిట గీటువారు
మొగమెత్తువార బొమ ముడిపెట్టువారు
శివుని నిందింప వచ్చితె యనెడివారు
ఎటుల నీశ్వరు మహిమ లెఱుగుననువారు
ఇచట నితని ప్రతిష్ఠలేమి యనువారు

— కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాసము P - 22 (వావిళ్ళ. 1970)

## రగడలు – తాళములు :

రగడలకు వాని గతులనుబట్టి లాక్షణికులు తాళముల నేర్పరచిరి లక్షణ శిరోమణిలో రమణకవి

సీ॥ ప్రబలు హయప్రచారంబును దురగవ
ల్గనము విజయ మంగళ రగడలవి
రూపకంబున జెందు రూఢిచే మధురగ
తిరగడ యెకతాళి దివిరి నడచు
రహిమించ గాంచు ద్విరదగతి జయభద్ర
రగడలు ఝంపతాళమున మెలగు
హరిగతి రగడయు నటతాళమున బొందు
వృషభ హరిణగతుల్ వెలయుద్రిపుట III – 361

| మాత్రాగణములు | రగడలు | తాళము |
|---|---|---|
| 1. 3 మాత్రలవి | హయప్రచార<br>తురగవల్గన<br>విజయమంగళ | రూపకతాళము |
| 2. 4 " | మధురగతి<br>హరిగతి | ఏకతాళము |
| 3. 5 " | ద్విరదగతి<br>విజయభద్ర | జంపెతాళము |
| 2. 7 " | హరిణగతి<br>వృషభగతి | త్రిపుటతాళము |

ఐతే ప్రసిద్ధమైన గతులనుబట్టి ఇట్లు తాళములను 4 విధములైన రగడలకు నాల్గు తాళములతో చెప్పినను, రగడలలోవలె గాక సంగీత శాస్త్రములోని ఈ తాళములకు మాత్రల సంఖ్య విశేషమై ఉన్నది. సంగీత శాస్త్రములోని తాళములు సప్తవిధములు. తాళమునకు అంగములు మూడు. లఘువు, ద్రుతము, అను ద్రుతము. లఘువును 'I' గుర్తుతో, ద్రుతము 'O' గుర్తుతో, అనుద్రుతమును 'C' గుర్తుతో గుర్తిలతురు. లఘువునకు జాతిభేదముండును. అనగా త్ర్యస్య, చతురస్రాది జాతి భేదముండును. ద్రుతమనగా 'దెబ్బ, ఉసి'ల కలయిక. చేతిపై తాళము వేయుటకై మరొక చేతితో తట్టుట దెబ్బ, దానికి సమానకాలముగా గాలిలో చేతిని ఊపుట ఉసి ఈ రెంటి కలయిక ద్రుతము. దీనిలో సగము, అనుద్రుతము అనగా ఇందు దెబ్బ మాత్రము ఉండును. సప్తవిధ తాళములకు ద్రుత, అనుద్రుతములు ఒక్కతీరున ఉండవు. ఉన్న విధములో జాతి బేదము లేదు. ఉదాహరణకు త్రిపుట తాళమునకు లఘువు, రెండు ద్రుతములుండును. లఘువునకు జాతిభేదము అనగా త్ర్యస్రలో నడచిన లఘువునకు 3 మాత్రలుండును. ద్రుతమునకు దెబ్బ (1మాత్ర) ఉసి (1మాత్ర) = 2 మాత్రలు. అప్పుడు మాత్రా విధానము IOO అన్నగుర్తు 3 + 2 +2 = 7 మాత్రలు. ఒకవేళ చతురస్ర ఐనచో 4 + 2 + 2 = 8 మాత్రలు దీనిని చతురస్రజాతి త్రిపుట తాళమందురు. (దీనికే ఆదితాళమని ప్రసిద్ధ నామము). ఇట్లు ద్రుతములు నిర్ణీతములు. లఘువు మాత్రము జాతి భేదము కల్గియుండును.

## సప్తతాళముల మాత్రల పట్టిక

| తాళము | తాళాంగములు | త్ర్యస్యలో మాత్రా సంఖం | చతురస్రలో మాత్రా సంఖ్య | ఖండలో మాత్రా సంఖ్య | మిశ్రలో మాత్రా సంఖ్య | సంకీర్ణలో మాత్రా సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1. ఏకతాళము | 1 | 3 | 4 | 5 | 7 | 9 |
| 2. రూపక | O1 | 2+3 =5 | 2+4 =6 | 2+5 =7 | 2+7 =9 | 2+9 =11 |
| 3. త్రిపుట | 1OO | 3+2+2 =7 | 4+2+2 =8 | 5+2+2 =9 | 7+2+2 =11 | 9+2+2 =13 |
| 4. మఠ్య | 1O1 | 3+2+3 =8 | 4+2+4 =10 | 5+2+5 =12 | 7+2+7 =16 | 9+2+9 =20 |
| 5. జంపె | 1CO | 3+1+2 =6 | 4+1+2 =7 | 5+1+2 =8 | 7+1+2 =10 | 9+1+2 =12 |
| 6. అట | 11OO | 3+3+2+2 =10 | 4+4+2+2 =12 | 5+5+2+2 =14 | 7+7+2+2 =18 | 9+9+2+2 =22 |
| 7. ధ్రువ | 1O11 | 3+2+3+3 =11 | 4+2+4+4 =14 | 5+2+5+5 =17 | 7+2+7+7 =23 | 9+2+9+9 =29 |

ద్రుతమనగా 2 మాత్రలు. అనుద్రుతమనగా ఒక మాత్ర. లఘువు ఏ జాతిలో ఉన్నచో అన్ని మాత్రలుగా లెక్కింపబడవలయును. పైన సూచించిన విధము ననే ప్రతి తాళమునకు తాళాంగములు నిర్ణీతములగును. పై మాత్రా సంఖ్యను పరిశీలింపగా జాతులను బట్టి మారిన మాత్రల సంఖ్యలతో ఒక తాళమునందు వేరొక తాళము అంతర్భవించుచున్నది. ఉదాహరణమునకు చతురస్రజాతి త్రిపుట తాళము (8 మాత్రలది) త్ర్యస్రజాతి మఠ్యతాళము కాగలదు. అదే ఖండజాతి జంపెతాళము కాగలదు. ఒక్క ఏకతాళమున మాత్రము తాళాంగములు లఘువు తప్ప (1) ఇతరములు లేకుండుట వలన త్ర్యస్రాదిజాతిని బట్టియే మాత్రాసంఖ్య తెలియ వీలున్నది.

శాస్త్ర విషయముగా చెప్పునపుడు అత్యంత విస్తారమైన సమగ్రత్వముకై భేదప్రభేదములను చెప్పుట సహజము. ఛందశ్శాస్త్రములోని షడ్వింశతి ఛ్ఛందోజాతము లగు కోటానుకోట్ల వృత్తములు ప్రయోజకత్వము లేనివయ్యును చెప్పబడినట్లే ఇవియును చెప్పబడినవి. శాస్త్రీయ సంగీతములో ప్రసిద్ధమైన నడకలుగల వానిని మాత్రము స్వీకరించి పాడుకొందురు.

ఇంత సూక్ష్మమైన భేద ప్రభేదములుగల తాళములను తెలుగు లాక్షణికులు రగడల విషయమున జాతి భేదములను చెప్పక స్థూలముగా ఈ రగడ ఈ తాళమని వ్రాసినారు. కనీసము మధురగతి రూపక తాళమున నడచునది చెప్పినవారు హరిగతి రూపక తాళముననే చేర్చుట చెప్పరైరి. చిత్రకవి పెద్దన మొదట చెప్పగా, గతానుగతికముగా అప్పకవి, కస్తూరి రంగకవి, పొత్తపి రమణకవి వీనిని చెప్పిరేకాని విపులీకరింపలేదు.

హయప్రచార, తురగవల్గన, విజయ మంగళములు రూపకమున నడచునని చెప్పబడినవి. త్రిమాత్రికా గణ నిర్మితములైన వీనిలో హయప్రచార 3+3+3+3=12 మాత్రల పాదముగలది. 6+6గా విడగొట్టిన రూపక తాళములో చతురస్రజాతిలో 26 వృత్తులకు సరిపోవును. చతురస్రజాతి రూపకమునకు ఆవృత్తికి 6 మాత్రలుండును (పై పట్టికలో ఇవ్వబడినది). ఇట్లే మధురగతి హరిగతి ఏక తాళములో నడచునని చెప్పబడినది. 4 మాత్రల గణములుగల ఈరగడలు చతురస్ర జాతి ఏకతాళముగా భావింపవలయును. ద్విరదగతి విజయభద్ర రగడలు జంపె తాళమున నడచునని చెప్పబడినది. పంచమాత్రికా గణ నిర్మితములివి. ద్విరదగతిలో 4 గణములనగా 4×5=20 మాత్రలుండును. జంపె తాళమున మిశ్రజాతిలో 10

మాత్రలుండును 2 మిశ్రజాతి ఝంపె ఆవృత్తులలో ద్విరదగతి నడచును. 4 ఆవృత్తులలో విజయభద్రము నడచును. హరిణ వృషభగతులు త్రిపుట తాళములో నడచునని చెప్పబడినది. ఏడు మాత్రల గణములు రెండు గలది హరిణగతి రగడ. త్రిపుట తాళములో త్ర్యస్రజాతిలో 7 మాత్రలు ఆవృత్తికుండును. త్ర్యస్రజాతి త్రిపుట రెండు ఆవృత్తులలో హరిణగతి రగడ సరిపోవును. 4 ఆవృత్తులలో వృషభ గతి సరిపోవును.

1. హయప్రచార తురగవల్గన విజయమంగళములు
   చతురస్రజాతి రూపకముననే గాక
   1) త్ర్యస్రజాతి ఏక 2) ఖండజాతి మఠ్యలో
   3) సంకీర్ణజాతి ఝంపెలో 4) చతురస్రజాతి అటలో సరిపోవును

2. మధురగతి హరిగతి రగడలు
   చతురస్రజాతి ఏకతాళముననే గాక
   1) చతురస్రజాతి త్రిపుట 2) మిశ్రజాతి మఠ్యలో
   సరిపోవును.

3. ద్విరదగతి విజయభద్రలు
   మిశ్రజాతి ఝంపెతాళముననే గాక
   1) ఖండజాతి ఏకలో 2) త్ర్యస్రజాతి రూపక
   3) చతురస్రజాతి మఠ్య 4) సంకీర్ణజాతి మఠ్య
   5) త్ర్యస్రజాతి అటలో సరిపోవును.

4. హరిణగతి వృషభగతులు
   త్ర్యస్రజాతి త్రిపుటలోనే గాక
   1) మిశ్రజాతి ఏకలో 2) ఖండజాతి రూపకములో
   3) చతురస్రజాతి ఝంపెలో 4) ఖండజాతి అటలో
   5) చతురస్రజాతి ధ్రువలో నడచును.

పాదమునకుగల మాత్రల సంఖ్యనుబట్టి ఆ గుణిజములలో పై తాళములనునిర్ణయింప నైనది. కనుక ఇట్టి తాళ విధానమును అంగీకరించి శ్రమపడుటకన్న సులభముగా త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రజాతులని సాధారణగేయ గతులలో పొలుపుగాని పాడుకొనుట రచించుకొనుట లెస్స. ఈ సౌలభ్యమును లాక్షణికులు గుర్తించి చెప్పరైరి.

ఇంతచేసి మాత్రల సంఖ్యలు గణ విధానము చెప్పినను తాళబద్ధము గావించినను గణమునకొక్క పదము వ్రాయక మాత్రల కలగలుపుచేసి, పాదాంతయతి పాటింపక పాదోల్లంఘన గావించి రగడల గమనమును తెలుగులో కావ్యకవులు చెడ గొట్టినారు. వారికి పాదమునకు మాత్రల సంఖ్య సమమైన చాలును. గేయగతికి ఒదుగుచున్నదా లేదా పట్టించుకొనక కృతక మొనర్చిరి.

రామరాజ భూషణుడు వసుచరిత్రలో (3–149) వృషభగతి రగడలో

"...నీ కపలీల లీలల వీకలోజన

రామ!..."అని పాదోల్లంఘన గావించినాడు.

కాని యిట్టివి క్వాచిత్కములే. లాక్షణికులు చెప్పకున్నను కవులు పాదాంత విచ్ఛేదయతిని పాటించినారు. రామరాజభూషణుడు సైతము 3 మాత్రల పదము, 4 మాత్రల (7 మాత్రల వృషభగతిలో) పదము యమకమున ఘటించుటకై ఈ పని చేసినాడు.

మాత్రా సంపుట నిర్మిత రగడలలో గణము, గణము విడిగా కనబడ వలయును. దీనితో రగడ నడక తెలియును. గణమునకొక్క పదమిట్లు విరుగక— కలుపబడినచో నడక లుప్తమగును. అక్షరగణములతో చూచిన ప్రాచీనకవులు రగడ లను మాత్రాసమకములుగా భావించలేదు. లాక్షణికులు సైతము గణములలో వీనికి లక్షణము చెప్పినారు. హయ ప్రచారమునకు త్రిమాత్రాగణములు నాల్గుండునని చెప్పక సూర్యగణములు నాల్గనినారు. 'లగ'ము కూడా పనికి రావలసియుండగా దీనిచే కూడ దన్నట్లయినది.

అంతేగాదు, ఇట్టి గణ విధానముతోబాటు రగడల నడకలలో లాక్షణికుల లోనే భిన్నత్వము కన్పట్టుచున్నది. వృషభగతి రగడకు—

అప్పకవి : " ఇరువది యెనిమిది లఘువులు పది —

యేనిట విశ్రాంతియు గూర్చిన (4-489)

అనంత :- "శ్రీమనోహరు నంబుజోదరు -

జిత్తజాత గురుందలంచెద" (3-60)

ఇరువదీ యెనిమిది లఘువులే అన్న అప్పకవి లక్షణములో అన్ని లఘువులే అన్న (న+నల) అర్థము వచ్చుచున్నదీ. కాని యిది సరియైన గణనిర్దేశనము కాదు. అట్లే

హరిణగతికి

అప్పకవి : నరహరి పదియు - నాలుగులములు

అనంత : శ్రీనివాసుభ - జింతుసేనని అని చెప్పిన లక్షణ లక్ష్యములు భిన్నముగ నున్నవి. పై నడకలలో భిన్నత్వముకు కారణము అనంతుని లక్షణములో గణములు మాత్రాసంపుటులు చక్కగా కుదిరినవి. అప్పకవిలో పాద మాత్రా పరిమాణము కుదిరినదిగాని గణము కుదరలేదు.

రగడలలోని గణమును బట్టి పద ప్రయోగమన్నది వదిలివేసిన స్థలములు చాల ఉన్నవి. మాత్రాసంపుటులనిట్లు పదోల్లంఘన ద్వారా కలిపివేసిన నడక చెడును మధురగతిలో నాలుగు మాత్రల గణములు నాలుగు అన్నప్పుడు 4, 4, 4, 4గా విడిపోవాలి. కాని 4, 5 మాత్రలు ఒకేఅక్షరమైతే చతురస్రగతి కన్పట్టదు. ఒకే పాదములో త్రిమాత్రికా గణములు నాలుగు అన్నపుడు =12 మాత్రల కాలము పట్టును. చతుర్మాత్రికా గణములు మూడున్నచో 12 మాత్రలే. అప్పుడా పాదమును త్ర్యస్రగతి అనుటయా ? చతురస్రగతి అనుటయా అన్న సందేహమునకు, మాత్రల సంపుటులు ఎట్లు విడిపోవుయినచో అట్లే నడక (4, 4, 4 ఐనచో చతురస్ర అని, 3, 3, 3, 3 ఐనచో త్ర్యస్ర) అని చెప్పుదుము. అందులకే గణములు (గణముకొక పదముగ) విడిగా ఉండవలయుననుట, లేనిచో పాదమునకుగల మాత్రాప్రమాణము 12ఉండి, ఆదేగతిలో నడచునో చెప్పబడ శక్యము కాదు.

లకుమకు తోచెను రాయడు
ప్రకృతికి పురుషుని పోలిక (కర్పూర వసంతరాయలు)

ఈ ఉదాహృత పాదములలో చతురస్రగతియని చెప్పవీలగును.

లకుమ, కుతో, చెను రాయడు
ప్రకృతి, కిపురు, షుని పోలిక అని త్ర్యస్ర గతియని

(3×4గా) ఏల చెప్పరాదు అన్నపుడు 3 మాత్రలకొక్క పదముగా గాక, 4 మాత్రలకొక్క (గణమునకొక) పదముగా విరిగినదని. అందులకే అది చతురస్ర గతియని చెప్పవలయును. నడక యత్యనుగుణ్యమని ఇదే గ్రంథములో గణముల ప్రకరణమువద్ద నిరూపింపనైనది.

శ్రీమత్కాశీ పుటభే దనలక్ష్మి ప్రతిమణికర్ణిక మణికర్ణిక — కాశీ ఖం. ఇది హరిగతి రగడ. మొత్తము 32 మాత్రలు పాదమునకున్నవి కాని దీనియందు చతురస్రగతి కనబడుటలేదు. కారణము ఒక గణములోని పదము మరొక దానిలోనికి పోయినది. అది యిట్లు విడదీసి (అర్థము గొలకు చూడక) వ్రాసిన చతురస్రగతి కొంత గన్పట్టును.

శ్రీమత్, కాశీ, పుటభే, దనలక్
ష్మిప్రతి, మణికర్, ణికమణి , కర్ణిక

ఈ క్రింది రగడలో గణమునకొక పదము మొత్తము కాకున్నను కనీసము 2 గణములు కల్పి ఒక పదమైనను నడక చక్కగానున్నది.

జయజయ శంకర "సాధుప శంకర"
జయజయ రిపుభట చయనా శంకర — ఉత్త. రామా.III-92

శ్రీనాథుడే సృష్టించిన తాళగతి రగడలో గతి లుప్తమైనది.

జయజయ సచరాచర సర్వజగత్సర్గస్థితి సంహార
తిరోభావానుగ్రహలీల పంచవిధ వ్యవహార వినోదైకపరాయణ

గణమునకోపదము లేకుండుట, పాదయతి దీర్ఘమగుటచే దీని గతి లుప్తమైనది.

జయజయ సచరా చరసర్ వజగత్
సర్గస్ థితిసం హారతి రోభా
వానుగ్ రహలీ లాపం చవిధవ్
యవహా రవినో దైపక రాయణ
— శివరా. మా. 21ప. P. 142 - 143

అని యీ రీతి గణమునకొక్క మారు విశ్రాంతి నిచ్చుచు చదివిన గతి తెలియును.

కువలయాశ్వ చరిత్రమున సవరము చిననారాయణ నాయకుడు మధురగతి రగడ వాడి గణమునకొక పదముతో చక్కని లయను సాధించినాడు.

1) సరసను మొలచెను జాలుగు మొల్లలు
దొరసెను నచ్చట తుమ్మెద పిల్లలు

2) పలుకకు కోయిల పదువులు మూగెడు
పొలతిపె —రచితే పూబొద దాగెడు

3) పనితలు బడలిన వగకని పించెను
గొనకొని తుమ్మెద కొదమలు ముంచెను. 3-120

కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకము వృషభగతి రగడను బోలియున్నది. దానిలో 3, 4 మాత్రలకు సైతము వేర్వేరు పదములు వాడబడినవి.

| 3 | 4 | 3 | 4 | 3 | 4 | 3 | 4 |
|---|---|---|---|---|---|---|---|
| సిరులు | మించిన | పసిడి | బంగరు | జిలుగు | దుప్పటి | జార | గాఆ |
| చరణ | పద్మము | మీద | దేహము | చంద్ర | కాంతులు | దేర | గాఆ |
| మురువు | జూపగ | పచ్చి | నావో | మోహ | నాకృతి | మీర | గాఆ |
| గరుడ | వాహన | దనుజ | మర్దన | కందు | కూరిజ | నార్ద | నాఆ |

గణమున కొక్కపదము విరువక వేరుగా కన్పట్టునట్లు అనుప్రాసను గూర్చి రగడ నడకలు కవులు నడిపించినవికూడా ఉన్నవి. అనుప్రాస వలన, అర్థము గౌణమై, ఆవృత్త్యక్షరములు స్ఫుటముగ కన్పించి నడకలు చూపుట ఇందు కాననగును.

1. వృషభగతి రగడలో మూడవ గణములో 7 మాత్రలలో 3 మాత్రల పదము 4 మాత్రల పదములో సారూప్యము నొందుట చూడనగును.

కొమ్మవేగిర మేటికేకొన గోరగోరటు విరులుగిల్లుము
తమ్మిపువ్వుల మీదజలముల దారతారక యుండజల్లుము
— పారిజాతాపహరణము

ఇట్టిదే ప్ర. రా. వే. వి. వి. లో (ప. సం. 263) వాడబడినది.

2. 7 మాత్రలలోని 3 మాత్రల పదము 4 మాత్రల పదములోనికి తిరిగి ఆవృత్తి యగుట.

వృషభగతి రగడ :

| 3 4 | 3 | 4 | | 3 4 | 3 | 4 |
|---|---|---|---|---|---|---|
| బాల బాలర | సాల | మిదిపిక | * | పాలి పాలిటి | యమర | సాలము. |
| గేల గేలిడి | గ్రుచ్చ | గదురా | * | గిల్లుగిల్లుము | తత్ర్ప | వాళము |

— వసుచరిత్ర III - 149.

1, 3 గణములందు - గణములోని ఏడు మాత్రలలో 3 మాత్రల పదము 4 మాత్రల పదముగా కొనసాగినది. 34 పాదములిట్లే సాగినది.

ఇట్టిదే రసిక జన మనోభిరామమున (4-77) కూడ కలదు.

పూని పూనిలు..........పొన్న పొన్నల..........

మాని మానిసు..........మల్లి మల్లియ............

చంద్రికాపరిణయములో IV-63 వేరొకటి 42 పాదములు పాటింపబడినది.

3. వృషభగతి రగడలో సర్వగణములందు సప్తమాత్రికములు నాల్గింటి యందు ఈ విధిగా అనుప్రాస పాటింపబడినది. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసములో (255) గణపవరపు వేంకటకవి వ్రాసినాడు.

3 4 3 4 3 4 3 4

కలికి కలికిత నాన నానది * గట్టి గట్టిగ నంటి నంటిన

కలికి కలికిచ నిన్న నిన్నన * గాక గాకక కంటి గంటిని

32 పాదములలో ఈ నియమము పాటించబడినది.

4. మధురగతి రగడలో 4 గణములలో 2 గణముల ఒక్కొక్క-అర్ధమునకు అంత్యప్రాస (పాదాంత్య ప్రాసతోబాటు) పాటింపబడినది.

ఇంచుల నడలో — ఇభగమ నములో

కాంతల తొడలో — కదళీ తరులో

నతులపి రుందులో — సమపులినములో

అతివల నాభులో — ఆవర్తనములో

ఈ రగడ కన్యకాపురాణములోనిదని "రగడ లక్షణము" అన్న గ్రంథమున బండి వెంకటస్వామి ఉదాహరించినాడు[24].

5. తురగ వల్గన రగడలో మొదటి ఆరు గణములలో (చివరి గణములు 2 తప్ప) రెండేసి గణములకు జంటకొక అనుప్రాస పాటింపబడినది.

రామ రామ వారిచారి ధామ రామ సదపతార

ధామ ధామ చిత్ర చిత్ర ధామ ధామ విదళితార

— ప్ర రా. వేం. వి. వి. 872 ప.

16 పాదములలో 4 పాదములు తప్ప తక్కిన పాదములలో ఈ నియమము పాటింపబడినది. 3, 4 వగణములలో తక్కినవానిలోవలె గాక ఏకాక్షరముమాత్రము పాటింపబడినది.

6. ద్విరదగతి రగడలో 4 గణములలో చివరి రెండు గణములకు అంత్యప్రాస పాటింపబడినది.

కొలచెమధు లక్ష్మిసుర పొన్నలను బొన్నలను
దెలిసెపడి పువ్వొడుల తిన్నెలను జిన్నెలను
రంగుగద నర్చునా రంగముల సంగముల
బింగళత జెందెమద భృంగముల యంగముల

— రాఘవ పాండవీయము II - 6

ఇట్లు కొలది రగడలందు శబ్దాలంకార ప్రీతి హెచ్చిన ప్రబంధ యుగాంతమున నడకలు స్పష్టమగునట్లు అంత్యప్రాసలు సంధించబడినవి.

## రగడ - ఇతర సంవాద చ్ఛందములు :

రగడలకు మాత్రాగణ స్వేచ్ఛ, త్ర్యశ్రసాదిగతిపై శిష్ట్యము వలన తెలుగు లోని అనేక ఛందములు రగడలలో అంతర్లీనము కాగలవు. షట్పదులు రగడ జన్యములు. చౌపదకుగల సంబంధము ఇదివరకే వివరించబడినది. త్ర్యస్రగతిలో నడచు ఉత్సాహ, రగడ వికారమే. ఉత్సాహను విన్నకోట పెద్దన రగడగానే పేర్కొనినాడు.

ఉత్సాహ, చౌపదలు రగడలతో సంవదించునని వాని ఐక్యతను గూర్చి అప్పకవి చెప్పినాడు.

"కొదవలేని నైపుణుల జొ
పదచే నుత్సాహవృత్త పదయుగ్మముచే
దుదనాదిని బ్రాసంబులు
వదలక విరచింప వలయు బ్రాజ్ఞులు రగడల్ (4 - 480)

కళికోత్కళికలు రగడ వికృతులే. లయగ్రాహిఖండగతిలో నడచు ద్విరదగతిని పోలినది.

"రాధికాసాంత్వన" కృతికర్త్రి ముద్దుపళని 'తమిళ తిరుప్పావు'ను ఆంధ్రానువాద మొనర్చునపుడు వాడిన సప్తపది ఛందము విజయమంగళ రగడ వికారమే. ప్రాస నిర్బంధము లేక వియజమంగళ రగడ చివరి రెండు సూర్యగణము లకు బదులు ఒక్క గురువునుంచినచో సప్తపది సిద్ధమగును. ఇది అచ్చమైన గేయ చ్ఛందలక్షణము గల్గియున్నది.

| 1 | 2 | 3 | 4 | | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|---|
| న్యాయ | శాలి | మైన | నంద | * | నంద | సుందు | తోయ | జాక్షి |

| 9 | 10 | 11 | 12 | | 13 | 14 |
|---|---|---|---|---|---|---|
| శ్రీయ | శోద | కనని | సింహ | * | శిశుపు | గాడటే |

— ఛం. ప. కో - P. 230

నాగవర్మ చెప్పిన త్రివిధ కన్నడ రగడలు మందానిల, లలిత, ఉత్సవ (ఉత్సాహ) తెలుగులోని రగడలకు సరిపోయ్యెడివే. కర్ణాటక చతుష్పద కన్నడ లలితరగడకు అనగా తెలుగులోని ద్విరదగతికి, తెలుగు పాపది కన్నడ మందానిలకు సరిపోవును.

| కన్నడ రగడ | | — | తెలుగురగడ |
|---|---|---|---|
| 1. | మందానిల రగళె | = | మధురగతి |
| 2. | లలిత రగళె | = | ద్విరదగతి |
| 3. | ఉత్సాహ రగళె | = | తురగ వల్గన |

ఇట్లే రగడలు తమ నడకలచేత మార్గివృత్తములలో సైతము సంపదించును. అట్లనీ వీనికి వానితో సంబంధములేదు. హరిగతి రగడకు - మానిని, కవిరాజ విరాజితపు నడకలు, హరిణగతికి మత్తకోకిల, తరళవృత్త గమనము, మధురగతికి దోదక, తోటక, తోదక, స్రగ్విణి, రథోద్ధత, ప్రహరణ కలిత, పణవ, మణిగణ నికరముల నడకలు సరిపోవును.

ఇట్లు రగడలు అత్యంత ప్రాచీన కాలమునుండి ప్రయోగములో నుండి, నన్నయచే విసర్జితమై, తిరిగి శివకవులు ముఖ్యముగా పాల్కురికి సోమనాథుని చేతిలో సానదేరి, ప్రబంధ పూర్వయుగ కవులలో శ్రీనాథునిచే తిరిగి ప్రవేశపెట్టబడి, ప్రబంధ యుగ కవులెందరి చేతనో పుష్పాపచయాది విషయములలో ప్రయోగింపబడినవి. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము, రగడలు ఎక్కువగా ఉపయోగించిన ప్రబంధరాజమైనది. హరిగతి (39 ప.), మధురగతి (253 ప.), వృషభగతి (256-263), తురగవల్గన (369-808), ద్విరదగతి (877) దీనిలో వాడబడిన రగడలు. ఇట్లు ప్రారంభ దశనుండి వాడబడి, ఈ దేశీయమాత్రా చ్ఛందము సర్వతోముఖ వికాసమునందినది.

—x—

## అ థ స్సూ చి క లు

1. అప్పకవీయము IV - 477
2. శబ్దమణిదర్పణము (సంధి - 32)
3. దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలనము
   — డా. కె. సర్వోత్తమన్ పరిశోధక గ్రంథము
4. శబ్దార్థ చంద్రిక - మ. సుబ్బారాయుడు 1077 పు.
5. అప్ప. IV - 470
6. ఇదే గ్రంథమున చందోఽంగములు (పాౕిస) అన్న భాగమున వివరించబడినవి.
7. ఛందోఽనుశాసనము 3-73
8. ప్రా. పైం. 1-125
9. వీని వివరములు ఇదే పరిశోధక గ్రంథములో ఛందోఽంగములు (గణములు) అన్న భాగమున అధ్యాయము 4లో చౌపద అన్న భాగమున వివరించబడినవి.

10. ద. దే. భా. సా. దేశి - కోరాడ 172 P.
11. కా. చూడా (4-40)
12. ద. దే. భా. సా. దేశి కో. రా. పు. 169-170
13. ఇదే గ్రంథములో ప్రాజ్ఞన్నయ యుగపుశాసనములు అన్న భాగమున వివరించబడినది.
14. త్రిపురాంతకోదాహరణము - నిడు. వేం. రా. పు. 31, 32
15. ఛం. శా. 1-24
16. అప్ప 4-490
17. తె. భా. ఛం రీ - రావూరి పు. 183
18. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ఆచార్య యస్వీ జోగారావు P. 228
19. 'దశప్రాణ ప్రకరణము' – "మృదంగ తత్త్వము" — ధర్మాల రామమూర్తి
20. ప్రాజ్ఞన్నయ యుగము - డా. దివాకర్ల వెంకటావధాని P. 331
21. అప్పకవీయము IV - 491
22. ఉదాహ. వాఙ్మయ చరి - P. 73
23. అప్పకవీ. IV - 490
24. ఇది మద్రాస్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరిలోని అముద్రిత లిఖిత గ్రంథము. ఈ చిన్న రగడ లక్షణము సంఖ్య R. 1636



## తాళము (గతి)ని బట్టి

### రగడల పట్టిక

| వరుస సంఖ్య | గతి | మాత్రా సంఖ్య | గణ సంఖ్య | మొత్తం మాత్రలు | నిషేధ గణాలు | రగడ పేరు |
|---|---|---|---|---|---|---|
| 1. | త్ర్యస్ర | 3 | 4 | 12 | లగ | హయప్రచార |
| 2. | ” | ” | 8 | 24 | ” | తురగవల్గన |
| 3. | ” | ” | 16 | 48 | ” | విజయ మంగళ |
| 4. | చతురస్ర | 4 | 4 | 16 | జ | మధురగతి |
| 5. | ” | ” | 8 | 32 | ” | హరిగతి |
| 6. | ” | ,, | 16 | 64 | ” | తాళ |
| 7. | ఖండ | 5 | 4 | 20 | జల, య | ద్విరదగతి |
| 8. | ” | ” | 8 | 40 | ” | విజయభద్ర |
| 9. | మిశ్ర | 7 (3+4) | 2 | 14 | లగ, జగ | హరిణగతి |
| 10. | ” | ” | 4 | 28 | ” | వృషభగతి |
| 11. | — | 8 (5 +3) | 2 } 2 } | 16 | — | హంసగతి |

హంసగతి రగడలో మొదటి అర్ధభాగము ఖండగతి తర్వాతి అర్ధభాగము త్ర్యస్ర గతిలో నడచును. వీనిలో దీర్ఘ పాదములు గల రగడలు ఉపయోగములో లేనివి. త్ర్యస్ర, చతురస్ర, ఖండగతి రగడలు ప్రచురములు. మిశ్రగతివి తక్కువ, సంకీర్ణగతిలో రగడలు లేకుండుట గమనించదగినది.

# జానపద గేయ ఛందస్సులు

ఛందస్సు పుట్టుకకు పాట తల్లివంటిది ఆట (నృత్యము) పాట (సంగీతము), మాట (సాహిత్యము) ఈ మూడింటియందు సమానముగు ధర్మము లయ. పాట భౌతిక రూపముగా మాటం పొందికతో, లయ చెలిమిగల ఆటతో కూడి సంగీతమయమై హృదయానందదాయకమై, త్రిగుణాత్మకమై, భాసిల్లును. పాటలోని లయయే సంస్కరింపబడిన రూపములో సాహిత్యమున ఛందస్సు అగును. [1]

జానపద గీతము నాటి తొలినాళ్ళ నుండి, సర్వాపసరములలో సర్వాను మాతులలో తోడై, సాహిత్య సంస్కృతుల చారిత్రక క్రమ వికాసమునకు అద్దమై నిలుచును. అట్టి గీతములను పరిశీలించుట అనగ ఛందో మౌలికతను పరిశీలించుటయే

ప్రసంగవశమున తెలుగు దేశి ఛ్ఛందము పరిశీలనలో మెనుక జానపద గీతుల గతులు, వాని జనగత్వమును పరిశీలించుట జరిగినది పల్లెటూళ్ల పాటలపుట్టలు. కదిలించిన కొలది కమనీయమైన గతులు పందల కొలదిగా ఉరుకులు పరుగులెత్తును. వాటినన్నిటిని ఎత్తిచూపుట, అంచులో, లేఖన రూపమున కష్టసాధ్యమైనను గ్రంథ పరిపూర్ణత్వ దృష్టితో వాచవిగా తలస్పర్శి విశ్లేషణ మిచ్చుట జరుగుచున్నది.

**"... Songs, which are generally disregarded as worthless in comparision with the high class literature composed in vrithams, really presert to us the true form and nature of the old indigenious metrical compositions still preserved in Telugu"** అని కోరాడ రామకృష్ణయ్య గారన్నట్లు[2] ప్రాచీన ఛందో మౌలిక స్వరూపమునకు పాటనే పరిశీలింపవలయును. పాటలే దేశి ఛందస్సులకు మూలములని ఇట్లే పలువురు తెలుగు ఛందోవిమర్శకులు అభిప్రాయ పడినారు.

"లక్షణ కర్తలు వాతులు, ఉపవాదులుగా పేర్కొనినవి ఈ జానపద సాహిత్యమునందలివే. సంస్కృతమునందలి మాత్రాగణ పద్ధతి ప్రకారము తెలుగు నందును మాత్రాగణముల చేర్పాటుచుటవలన అట్టి పద్ధతికి ఇమిడిన వాటికి మాత్రమే లక్షణ గ్రంథములయందు స్థానము లభించినది. అదైనను సాహిత్యమునందు చేరిన

పరిణామమే [3] అదియు నిజమునకు దేశీయ పద్యములన్నియు జానపద గీతములనుండి రూపొందినవే" అనియు శ్రీ సంపత్కుమారగారి యభిప్రాయములు.

"గేయ సారస్వతము బాగుగా పరిణతి చెందిన తరువాత కాలముననే ఛందోబద్ధమగు పద్యకవిత యేర్పడుచున్నది దక్షిణదేశ సారస్వతమందలి మాత్రా ఛందస్సులన్నియు నిట్లు గేయముల నుండియే యేర్పడినవి. కావుననే అవి లయతో పాడుటకనువైయుండుననుట, నన్నయ్యకు పూర్వముననే ఇట్టి దేశీయమగు గేయ సారస్వతము వ్యాప్తి యందుండినది. ఈ గేయములనుండి యేర్పడిన మధ్యాక్కర, తరువోజ, సీసము మున్నగు దేశీయ ఛందస్సులు నన్నయ నాటికే యేర్పడి శాసనస్థములైయున్నవి" అని శ్రీ భూపతి లక్ష్మీనారాయణగారనిరి.[4]

"ఏదేశమందైనను, ఏ భాషలోనైనను పద్య రచనకు పూర్వము చాలా కాలము గేయ రచనయే యుండెనని చెప్పగలము. సవరలు మొదలైన ఆదివాసులకు ఇంకను పద్యరచన అలవడలేదు గేయ రచనావస్థలో ఉన్నారు...కొంత సంస్కృతి వృద్ధి పొందిన తర్వాత పాడుకొనుటకే కాక చదువుకొనుటకు తగినట్టి రచనలు గావించు ప్రయత్నముల ఫలితముగా పద్యములేర్పడినవని ఊహింపవచ్చును"— అని గిడుగు వారభిప్రాయము [5]

"ఈ కాలమున తెలుగు గ్రంథములు ప్రాచుర్యముగా సంస్కృత భాషలో నున్న పురాణవాఙ్మయ గ్రంథముల కనువాదములుగానే వెలయుటచే నాంధ్ర సహజములైన దేశి రచనల కాదరువు సన్నగిల్లెను. మన పూర్వులు పౌరాణికములైన మహాప్రబంధముల మీదను, సంస్కృత ఛందస్సుమీదను సంస్కృతప్రాయమయిన శిష్టుల వాఙ్మయముమీదను, అభిమానము గలవారై దేశీయేతివృత్తములను, దేశీయ ఛందస్సులను, దేశి భాషను చితుకద్రొక్కిరి నేడు మనము శ్రీ పామరాదుల గేయ రచనములని యనాదరించు జానపదరచనముల వరుసలే ద్రావిడ భాషలోని ప్రౌఢ కావ్యములందలి వృత్తములుగా నెలకొన్నవి. తరువోజ ద్విపద, అక్కర, గీతి, సీసము మొదలగు పరిమిత జాతులే దేశిచ్ఛందో జనితములు మన గ్రంథములందా దృతములయ్యెను" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయము.[6]

ఇట్టి జానపద గీతుల గేయత్వమును సంగీతత్వమును లాక్షణికులు కావ్య ప్రయోగ విషయమున కవులు నియమబంధమొనర్చి కృతకమొనర్చినారు. పదకవిత పట్ల వివిధములో చిన్నచూపు యేర్పడినది. లక్షణ బంధము, నియమ సహితము,

పండితైక సాధ్యమైన ఛందములను గౌరవించువారికి స్వేచ్ఛాయుతము, సహజము, సర్వజన సులభమైన గేయఛందము నిరాదరణ ప్రాయమైనది. ఐనను తెలుగు సాహిత్యములోని పెక్కురు కవులు ప్రసంగవశమున తమ కావ్యములందు జానపద గీతములను పేర్కొనినారు.

| | | |
|---|---|---|
| 1. నన్నె చోడుడు | కు. సం. (ఆ.3. ప.38) | అంకమాలికలు |
| | (ఆ.4. ప.89) | ఊయల పాటలు |
| | (ఆ.11. ప 112) | మంగళ హారతులు |
| | (ఆ.6. ప.46) | గౌడు గీతములు |
| | (ఆ.6. ప.47) | శబరకాంతల రోకటిపాటలు |
| | (ఆ 6. ప.48) | ఎరుకల స్త్రీల పాటలు |
| 2 శ్రీనాథుడు | శి. పు. (5-103) | జాజరిపాటలు |
| | క్రీడా. (116) | జాజరిపాటలు |
| | క్రీడా (117) | పరశురాముని కథలు |
| | క్రీడా. (130) | జక్కుల పాటలు |
| | క్రీడా (170) | గేయరామాయణము |
| 3. పోతన్న | భాగవతమున | ఏలలు గోపికల బృందావన గమన సందర్భమున |
| 4 కొరవి గోపరాజు | సింహా ద్వా. (9-11) | వెన్నెలగుడి పాటలు |
| 5 కృష్ణదేవరాయలు | ఆముక్తమాల్యద(2-55) | ఏతాము పాటలు |
| 6 అల్లసాని పెద్దన్న | మనుచరిత్ర (5-71) | పెండ్లిపాటలు |
| 7. రామరాజ భూషణుడు | వసు చరిత్ర (3-59, 5-17) | లక్ష్మీ కళ్యాణం పెండ్లి పాటలు |
| 8 తెనాలి రామకృష్ణుడు | పాం. రం. మా. (4-16) | పప్పుదులు |
| 9. గౌరన | హరిశ్చంద్రో. | మాతంగ స్త్రీలు పాడే సూలాదులు |
| 10 చేమకూర వెంకన్న | అ) విజయ విలాసం (3-76) | దరువులు |
| | (3-95) | ఐరేని పాటలు |
| | ఆ) సార. చ (1-76) | పుంపదులు |
| 11. కూచిమంచి తిమ్మకవి | శివలీలావిలాసం | ఏలలు |

పేర్కొనినారు. ఇట్టి గేయములు పదముల పేరిట అసంఖ్యాకములుగా నున్నవి. వీనిని అల్పబుద్ధులు మాత్రమే గ్రహింపలేరని మతంగుడు బృహద్దేశిలో

దేశికార ప్రబంధో ఽ యం హార పక్షాది నిర్గతః

అసంఖ్యాకాస్తు కథిత : సజ్ఞాయంతేఽల్ప బుద్ధిభిః అని వ్రాసినాడు.[7]

## (అ) ప్రకీర్ణక పదకవిత :

విశాల గేయ దృక్పథము గల లాక్షణికులకు మాత్రము రుచించునవి, దేశి వాఙ్మయములో సర్వత్ర ఉపయోగింపబడి పదకవితల నిచట నామ మాత్రముగా వివరించుట (లక్ష్య సహితముగా) జరుగుచున్నది

1. చిలుక పదములు :

1) ఏడుకొం డలవాడు ఏడిప మాయే చిలుకా రా మచిలుకా
అలివేలు మంగమ్మ ఆశతో వచ్చింది చిలుకా రామచిలుకా
(ఖండగతి గేయము)

2. నివాళి పదములు :

1) శ్రీమహా దేవమం దిరనీకు నివ్వాళి
కరుణాలం వాలశం కరనీకు నివ్వాళి [8]

3. తుమ్మెద పదములు :

1) శివ శివా యనమేలు తుమ్మెదా
శివ అంచె వికమేలు తుమ్మెదా
శివుని స ర్తులాకు తుమ్మెదా

2) పాండవులు పాండవులు తుమ్మెద
పంచ పాం డవులోయమ్మ తుమ్మెద

4. **a)** సువ్వి పదములు :

సువ్వి సువ్వి రామ చంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి సీ- తమ్మ మాకు
శుభము లీ- మ్మా- -
(త్ర్యస్రగతి) -

**b.** సువ్వాలే పదములు :

సువ్వాలే అని అప్పకవి దీనికే పేరు పెట్టినట్లున్నాడు.

రక్షక సురవిదు రద్విప రక్షా
రాక్షస విదళన ప్రరుచిర వక్షా
సువ్వీ సువ్వాలలే (4-612)

సువ్వి పదములు పెక్కుగీతులు దంపుడు పాటలలో కానవచ్చుచున్నవి.

5. గొబ్బి పదములు :

కొలని దో పరికిగొబ్బిళ్లో...
యదుకులా సామికీ గొబ్బిళ్లో...
(ఖండగతి)

6. జోల పదములు :

జో అచ్యు తానంద జోజోము కుందా ఆ
లాలిపర మానంద రారగో విందా ఆ
(ఖండగతి)

7. మేలుకొలుపు పదములు :

| | | | |
|---|---|---|---|
| **3** + | **4** | **3** + | **4** |
| మేలు | కొనవె | చంద్ర | శేఖర |
| మేలు | కొనవె | ఇంద్ర | వందిత |
| ఫాల | లోచన | పరమ | శివుడా |
| మేలు | కోట | మేలు | కో ట |

(మిశ్రగతి)

8. ఆనంద పదములు :

ఆనంద మానంద మా ఆయె నే-మన
శ్రీరాము పెళ్లి కొడు కాఆయె నే

9. మంగళములు :

రామ చం - ద్రాయ జనక
రాజ జామ నోహ రాయ
మామ కా- భీష్ట దాయ
మహిత మంగ ళం...
(త్ర్యస్రగతి)

10. ఉయ్యాల పదములు :

పెద రాసి పెద్దమ్మ కుయ్యాలో
ఎందరే కొడుక్కులూ ఉయ్యాలో

11. వెన్నెల పదములు :

పూరోయి పూరోయి ఎన్నీయ లో ఓ
దిరిసేన పూలోయి ఎన్నీయ లో ఓ

12. జాజర పాట :

చాలు చాలు నీజాజర
జాలి పరచె నీజాజర

(త్ర్యస్రగతి)

ప్రాచీన లాక్షణికులు పేర్కొన్న చర్చరీ గీతములే జాజరపాటలని విజ్ఞుల మతము. వెన్నెల రాత్రులందు స్త్రీలు వీణలు పట్టుకొని పాడు సామూహిక గేయములు కావచ్చును అని ఈ క్రింది పద్యమున సూచితము.

వీణా గానము వెన్నెలతేట
రాణ మీరగా రమణులపాట
ప్రాణమైన పిన బ్రాహ్మణువీట
జాణలు మెత్తురు జాజరపాట

'జగడపు చనవుల జాజర' అనుచు చతురస్రగతిలో నడచు అన్నమయ్య సంకీర్తన మొకటి జాజర పాటగా కానవచ్చుచున్నది

13. అలలొనేరెళ్లు ·

ఆకూప చనిచేలు అల్లోనే రెళ్లో ఓ
ఆపైస సూరీడు అల్లోనే రెళ్లో ఓ

14. దరువులు :

గోదా ! నామీద కృప
రాదా ! పద్మ స దృశ
పాదా ! పరిత ద్రావిడ
వేదా ! ఘనపాపస ప్ర
మోదా ! తులసీ దళ స
మ్మోదా ! నీదు పాదములు
నాదు శిరంబున
పాదు కొలిపి నన్నాదుకో రమ్మ తల్లీ !

15) రచ్చరేకులు :

రగడల ప్రకరణమున రేకుల గూర్చి కొంత చర్చించనైనది రేకులు - తాళయుక్త పదములుగా లాక్షణికులు పేర్కొన్నను వీనిని సరిగా గ్రహింపలేదని పలయును. దానికి వారి లాక్షణీకరణమే సాక్ష్యము రచ్చరేకులు తురగవల్గన రగడ రూపములని అప్పకవ్యాదులు యక్షగాన లక్షణము (రేకుల లక్షణమను పలయును)లో చెప్పినను ఈ క్రింది కంకంటి పాపరాజకృత విష్ణుమాయా విలాసమన్న యక్ష గానములోని రేకు త్ర్యస్రగతిలోగాక మిశ్రగతిలో అనగా హరిణగతి రగడగా నడచుచున్నది.

ఓంచు మోహము నించు మదిదమ
కించు లేమడ ంంచు నలుగుర
గాంచు తరిగా దంచు దమిమర
వించు దలయిటు పంచు చున్

చివరి రెండు మాత్రలు తక్కువగా కన్నట్టు హరిణగతిరగడ ఇది. తక్కువగా కన్నట్టుట అన్నది. లేఖన దృష్టితో మాత్రమే - గేయమునో అది నింపబడును. ఈ తక్కువ తనమే - అప్పక వ్యాదులకు తుద నేడు లఘువులు అన్న విధమున లాక్షణీకర కారణమై యుండును.

16. ధవళము :

జయ జయ దేవ ము కుందా
జయ జయ పర మా నందా
జయ జయ హరి గో విందా
జయ జయ మన గుణ బృందా

విష్ణుమాయా విలాసము పు. 69.

(దీనికి అప్పకవి కూడ లక్ష్యము నిచ్చినాడు 4-611)

17. శోభనము :

బంటు పంతము చెల్లె - భామ రూపమున ము
క్కంటి జక్కుల నిడిన - కమల నేత్రునకు "శోభనమె"
బాలుడాడిన యట్టి - పలుకు చేకూర్చుటకు
వేళమై కంబమున - వెడలు నరహరికి "శోభనమె"

విష్ణుమాయా విలాసము పు. 69

18. కందార్థములు, ద్విపదార్థములు, సీసార్థములు :

ఈ అర్థ పద్యములన్నవి యక్షగానములలో ప్రయుక్తములు. మొదలు చెప్పిన ఛందములు 2 పాదములు నడచిన పిదప అది గేయముగా మారిపోవును. అయితే శర్వారి పాటకు ఈ మొదటి రెండు పాదాలతో సంబంధముండదు. ఈ సంప్రదాయము యక్షగానముల అర్వాచీన దశలో కన్నట్టును.

యక్షగాన కర్తలు కందాదులను దేశీయ గేయ సంబంధులగు చందములుగా భావించినట్లు ఈ పద్ధతిని బట్టి తెలియును.

కందార్థము : కం. శ్రీమధు రాపరి వినవే
శేష గిరీశుద - నీదు కేళికాధామ
మునందు నింతపడి దర్పకలీలల
నుండి యంతలో వేమరు వెడలా
డఁని వేగమే వచ్చితి తల్పుతీయ
వేభామా సద్గుణ గుణధామా
లావణ్య చతుర సీమా అలువేలుమా
గనామా — [9]

రె గణముల వరకు కందము. పైన కంద లక్షణము పట్టదు. గేయముగ మారిపోవును ఇట్లే ద్విపద, సీసములు ముందు ప్రారంభింపబడి గేయములుగా మారుట ఈ అర్థముల లక్షణము.

19. ఏలలు :

ఏలలు మధుర గేయ రచనలు.

ఏలా నాదవతీ రమ్యా వర్ణాలంకార శోభితా
గీయతే మత్యా తాలేన నాదయుక్తా పదేపదే[10]

- సంగీతరత్నాకర లక్షణము -

శార్ఙ్గదేవుడు 356 ఏలా భేదములు చెప్పినాడు. వానిలో ఆంధ్రైలా ఒకటి కూడా ఉన్నది.

నాగవర్మ ఛందో ఒంబుధిలో 'ఏళె'కు లక్షణము చెప్పినాడు. 6 రు. గ. + 1 బ్ర.గ. కన్నడమున ఏళు అనగా ఏడు అని ఏడుగణములుండుటచే ఏళు-ఏళె యన్న పేర్గొంచబడి యుండునని డా. సర్వోత్తమన్ గారనిరి. [11]

పౌత్తపి రమణకవి తన లక్షణ శిరోమణిలో "ఏలలనగా పదములనిన్ని, మూడు చరణములకు ఖండికాశ్రయము అనిపేరు గలదనిన్ని, పల్లవము, ఉప పల్లవము అనిన్ని, ఇవి మాత్రాసమర నిబద్ధములై గణాదులతో గూర్చబడెననిన్ని, సూళాదుల కనుగుణముగా నుండవలెననిన్ని" ...లక్షణము చెప్పినాడు. ఇంకను వీనిగేయత్వమును స్థిరీకరించుచు" ఏళాస్స ప్త విధాజ్ఞేయా ప్రోక్తా మత్యాది తాళతః" అని సంగీత రీతిని తేటపడియుండును గాక, నీ సాహిత్య మార్గంబున లక్షణంబున జూరవు" అని నిర్దేశించినాడు.[2]

కోరాడ వారు ఏల హయ ప్రచార రగడకు సంబంధము గలదై నాలుగేసి సూర్యగణముల పాదములతో నన్న ద భోగషట్పది పంటిదని అనినారు. కాని ఇది ఛందస్సంబంధి కాదనవచ్చును. ఏలయనగా పాల్కురికి సోమనాథుడు "అరుదగు దాసయ్య అరువత్తు మూడు కిరిటంబులుమ బసవపురాణంబును "ఏలలు నెట్టుచు నింపారు సొంపార"చదువుదురనినాడు. ఏలలు పెట్టి చదువుట యనగా ఏదో ఒక పదావృత్తితో ఉన్న గేయమునే చదువుట అనవలయును. ఇది స్తుతి గేయమనవలెనని

"ఒకలె పాడ. విశ్వవిభున్
ఏలాది ప్రబంధములన్" అని విన్నకోట ప్రశంసించుటతో భావింపవలయును.

భాను వంశ మున బుట్టి
దాన వకా మిని గొట్టి
పూని మఖము నిర్వ హింప వా - ఓ - రామ - చంద్ర
మౌని వరులు సమ్మ తింప గా
(సుగ్రీవ విజయము)

"రెండేసి పాదములకో మూడేసి పాదములకో యొకసారి యేదేవుని పేరో రాగక్రమమున నుచ్చరించుచు జదువుట యేలలుపెట్టి చదువుటయని తోచుచున్నదని" శ్రీ దివాకర్ల వెం అవధానిగారనిరి.[13]

గౌరమ్మా ముదుల కొడుకా
గౌరీశం కరుని కొడుకా
పూలుప త్రా లూ దెచ్చేమూ శ్రీవినాయకా
నీపూజా ముందూ చేసేము

సుగ్రీవ విజయమునందేగాక కందుకూరి పాపరాజు విష్ణుమాయా విలాసము నందు సైతము ఇట్టి ఏలలన్న పేరుతో పై విధమగు సంబోధనతో (పంచబాణఅన్న పదావృత్తితో) రాయవచ్చుచున్నది

ఐతే పైన ఇన్ని సాక్ష్యములున్నను, ఏల అనగా-ఏలో, ఏలో అనుచు పాడుట కావచ్చునేమో అనిపించును.

వ్యాసుడు పీఠికాపురమునకు వచ్చినపుడు చేసిన దేవతాస్తుతిలో ఏల పాటలు ఒకటి శ్రీనాథుని భీమఖండములో వర్ణింపబడినది.

హేలా హేలా తరంగిణీ కూలనిలయ
బాలా బాలా రుణాశోక పల్లవోష్ఠి
వేలా వేలా వనోద్దేశ విహ్వాలిలోల
నేలా నేలా యనుచు బాడె బుషవరుండు (ద్వి. 59)

దీనిని బట్టి ఏదేని సంబోధన పదము పెట్టి చదువుట మాత్రమేగాక ఏలా ఏలాయని చదువుట గూడ ఏలా సంప్రదాయమేల కారాదనవచ్చును. ఇట్టి పద కవితలు దేశి వాఙ్మయమునందు పెక్కుగలవని లాక్షణికులు పేర్కొనిరి. వార్తాకవి రామపయ్య (క్రీ. శ 1600) లక్షణ దీపికలో కళికోత్కళికలు, ఉదాహరణలు, సప్తతాళ నటనలు, పట్టోట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రిక, అష్టభద్రికలు, బిరుదావళి, నాగావళి, భోగావళి మున్నగునవి, ఏలలు, లీలలు, ధవళములు, మంగళ హారతులు, శోభనములు, జక్కుల రేకులు, చందమామ సుద్దులు పెక్కింటిని పేర్కొనినాడు, యక్షగానములలో ఉపయోగింపబడు పదకవితలుగా రేకులు, దరువులు, పదములు, కీర్తనలు, ద్విపదలు, అర్ధ పద్యములు(కందార్ధములు, సీసార్ధములు) ఏలలు, ధవళములు, శోభనములు, జోలలు, సువ్వాలలు అలలోనేరెళ్లు, అనువులు, త్రిభంగులు, త్రిస్త్రబకములు, వెన్నెల పదములు మున్నగునవి లాక్షణికులచే స్మరింపబడినవి.

ఈ పదకవితలు అన్నియు త్ర్యశ్రాది గతులలో ఏదో ఒక దానికి సరి పడునవి. వీనికి పెట్టబడిన పేర్లు ఛందస్సంబంధులు కాకున్నను, అవి ఒక గేయ జాతి నామవాచకమైనవి. కంద పద్యమన్నట్లు ఏల పదము అనవచ్చును. పాటలోని అర్థాన్ని బట్టి, ఆ పాటపాడే సమయాన్ని బట్టి లేదా ఆ పాటలో వచ్చే పల్లవి లేక లశబ్ద పునరావృత్తిని బట్టి పేర్లు ఏర్పడ్డం జానపదగేయాల స్వభావం'' అని విజ్ఞుయభిప్రాయము [15] వీని కుంచబడిన పేర్లను.

| | |
|---|---|
| 1] పదము యొక్క అస్వృత్తిని బట్టి | ఉయ్యాల, చిలుక పదములు మొ॥ |
| 2] గేయ సందర్భమును బట్టి | పెళ్లిపాటలు, అప్పగింత పాటలు |
| 3] క్రియను బట్టి | దంపుడు పాటలు, కోలాటపు, జాజరపాటలు |
| 4] వృత్తి గాయకులను బట్టి | జక్కుల పాటలు, ఒగ్గుల కథలు |
| 5] వాద్యమును బట్టి | బుర్రకథ, జముకుల కథ |

అని విభజింపవచ్చును సుదీర్ఘ సమాసాలుండని కారణముగా, తెలుగు పదములు అలతియలతి పగుట వలన ఈ పై గీతములు త్ర్యస, చతురస్ర, ఖండ, గతులలోనే అధికముగా (గణమునకొక పదముగా) నడచును.

## (ఆ) గేయ నిర్మాణము :-

గేయ నిర్మాణము సైతము సులభమైనదే గేయ సాహిత్యమునకు గాయకునకొక శ్రోత ఉండును గాయకుడు ఒక చరణము చెప్పినపుడు శ్రోత తర్వాతి కథ యందలి ఉత్కంఠతో గాయకునకన్న ముందుగానే పరిగెత్తును. ఇందుకు కారణము రుటిలి రసస్ఫోరకమగు ఇతివృత్తము. ఈతని ఉత్కంఠకు తగ్గట్టు గాయకుడు సైతము తిరిగి అదే చరణమును ఆవృత్తమొనర్చును. శ్రోత ఉత్కంఠకు తోడు గాయకునకు తర్వాతి పాదము ఆశువుగా పేర్చుకొనుటకు మరింత అవకాశము లభించును. ఇక ఛందస్సు (పాటనడక) విషయములో ఒకటి రెండు పదములు గాయకుడు పాడగనే శ్రోతకు లయజ్ఞాన మబ్బును. తర్వాత పాట పూర్తియగు వరకు ఆ లయ శ్రోత హృదయమున స్థిరపడి యుండును. లయ జ్ఞానము కలుగుటచే అదే లయ మాటి మాటికి ఆవృత్తియగుచుండగా, గాయకుని లయతో సంపదించి శ్రోత అమేయ మగు ఆనందమును పొందును. పాఠకుని ఊహతో లయ హృదయములో సుఖ దుఃఖాను భూతులు గాయకుడు లేదా గేయ రచయిత పంచుకొనును.

**"It is happening in side us, an agitation (or an ordening) of our impulse, metre or more inclusively verse, is one feature of poems which has some times been conceived in that way, as a kind of game played with the reader's expectations and disappointments or perhaps a form of hypnosis or a rhythm of his verbal and mental responses"** అన్న అభిప్రాయ మిట్టిదే.[16]

గాయకునకు కూడా ఒక్కొక్కప్పుడు పాట రచన వలన గానము వలన దుఃఖభారము తగ్గును. ఛందోఽవిర్భావము నందీ విషయము వివరింపబడినది.

ఐట్బ్యారి పిగ్మీ స్త్రీ తన పిల్ల తప్పిపోయినపుడు రోదించుచు పాడినదని **C. M. Bowra** వ్రాసినాడు. ఆ పాటలో తన పిల్ల తప్పిపోయిన దుఃఖోపశమనముతో ఇతరులకు ఆ దుఃఖమును పంచి ఇష్టపడుచున్న తపన కనబడుననినాడు.

**She sings of trouble which is peculerily her own and sets her individual imprint on her song...... In singing she not only finds relief for herself but lets her neighbours know what has happened so that they may help her in her need.**[17]

ఇట్టి మహోన్నత ప్రయోజనకారియగు గేయము పాటగాని నోటినుండి లయలోనొదిగి స్వతఃప్రసూతముగా బయటకురికి వచ్చును. నియమరహితము, లక్షణమునకొదగని దీని స్వభావమును పెద్ద పెద్ద లాక్షణికులు ఉపేక్షించుటయో గేయ సంప్రదాయ దృష్టితోగాక అన్య విధముగా చూచి లాక్షణీకరించుటయో జరిగి నది తత్ఫలితమే నియమబంధములైన పెద్ద ఛందము ఆవిర్భావము. పద కవితలకు అన్నమయ్య పట్టము కట్టునటి వరకు ఇవి పల్లెలలో ఉండిపోయినది. తర్వాతనే లాక్షణిక లోకమునకెక్కినిగాని రాబడిన పదములకు లక్షణము చెప్పిన వారిలో అన్నమయ్య మొదటివాడు. అతని సంకీర్తన లక్షణమున

ఛందో గణముల నియతిం
బొందక తాళ ప్రమాణమున గడుజెలువై
కొందరిచే దద్భూర్ణం
బందముగా దాళ గంధియని బొగడొందున్ [18]

ఛందో గణముల నియతి లేక తాళ ప్రమాణమున నుండునది గేయము 'తాళ గంధి' యని లక్షణమొనర్పబడినది.

"పద కవిత్వంబునకుం దాళ ఫణితి యతులు
ప్రాసములుగాని గణము నిర్ణయము లేదు." అని ఫక్కి వెంకట నరసయ్య (క్రీ.శ. 1800) కవి దర్పణ ఛందమున పేర్కొనినాడు.

## (ఇ) గేయగణములు (కాలఖండములు) :

గురు లఘు స్వరూప నిర్దేశిత గణములు గేయమునకుండవు. తాళబద్ధమై పాదము హెగిపోవును. పాదమును మాత్రలలో లెక్కింపవచ్చును. గీతమును లెక్కించుటలో

తక, తక, తకిట, తకకిట, తకతకిట, యని త,క. అన్న అక్షరము
1 (మాత్ర) 2 3 4 5
లలో మాత్రలను లెక్కించుట తాళమును చూపుట జరుగును. పాదమునకిన్ని మాత్రలన్న నియమము ఉండును. నిర్దిష్ట కాలఖండములలో గేయము సాగిపోవును. పై లెక్కింపు కాలఖండములు కొలుచుటకే అసగా ఒక గీత పాదములో 4 కాల ఖండములున్న వనిన ఒక్కొక్క కాలఖండము ఎన్ని మాత్రలో పై విధానములో తెలియజేరుచబడును. ఒక పంచమాత్రికమైన కాలఖండమన్నచో, పాదమునకు 20 మాత్రలన్నమాట కాలఖండములు సాధారణముగా సమసంఖ్యలో, సమానమైన మాత్రంతో పాదమునకుండును. ఈ కాలఖండమే తర్వాత గణమన్న విధానమునకు దారి తీసినది. ఒక్కొక్క కాలఖండమును పేర్చుకొనుచు జానపదకవి పాదమును పూర్తి చేయును. కాలఖండములోనుండు పదము ఒకవేళ తుల్య మాత్రికముగాకున్న దానిని హ్రస్వీకరించియో, దీర్ఘీకరించియో కాలఖండమును నింపును. ఒక్కొక్కమారు కాలఖండములోనుండు పదము అత్యంత స్వల్పమైనచో 'నిశ్శబ్ద కాలము' ద్వారా నింపబడును. ఇది సాధారణముగా పాదాంత్య గణములో కన్పట్టును. దీనిని వ్రాతలో చూపుట సాధ్యపడదు. "గేయలిపి" విధానములో చూపవలెనన్న ... ఇట్లు మాత్రకొక చుక్క పెట్టుచు పోవలయును. కాలఖండమున కొక్క పదము నుండియే గణమునకొక్క పదమన్న పద్ధతి లయ సుప్యక్తమొనర్చుటకు శిష్టకవులు స్వీకరించినారు.

కాలఖండములు పేర్చుకొనుచు పోవుటలో జానపద కవికి సౌలభ్యము, లయాధీనత్వము సాధ్యమగును. ఈ క్రింది జానపద గీతము సమాన కాలఖండములు **(Time units)** గా 11 మాత్రలతో నడుచుచున్నది.

| 1వ కాలఖండము | 2వ కాలఖండము | 3వ కాలఖండము |
|---|---|---|
| సోడు సోళ్ళడ్లు దంచి | ముల్కా కూరండి | గోగుమల్లె సుందారి |
| మూడు సోళ్ళడ్లు దంచి | ముల్కా కూరండి | గోగుమల్లె సుందారి |
| బంతిలో పది మంది | బావలాకు పెడ్తే | గోగుమల్లె సుందారి |
| అత్తా మావకు నేను | ఓత్తొత్తి పెడ్తే | గోగుమల్లె సుందారి |
| పొత్ర మంత పెల్లోచ్చి | పొయ్యకాడావాడే | గోగుమల్లె సుందారి |

కాలఖండములు 11 మాత్రలుగా నింపుటకు ముల్కా ముల్కా అని

సుందరి-సుందారి అని దాపంచు-దాపలాచు వంటి దీర్ఘత్వమును 'హెూత్రమంత పెళ్లోచ్చి' వద్ద 'హెూత్రమంత' తేలికగా ఉచ్చరింపబడుటలో లఘుత్వమును పొందును. 11 మాత్రలకొకసారి విశ్రాంతి (విచ్ఛేద రూపయతి) ఉండును.

కాలఖండములు నింపుటపరకు నియమముండి పదమును హ్రస్వ / దీర్ఘీకరించుటలో గల స్వేచ్ఛ కారణముగా గేయము పుట్టుకనుండి కాలక్రమములో పెక్కు మార్పులకు లోనగును. పదములు పెక్కు రీతులుగా సాగదీయబడును.

గోరంత దీపమూ కొండలకు వెలుగూ
గోపాల కృష్ణమ్మా గోవులకు వెలుగూ

ఈ పాదాల్లో 4 గణములు - గణమునకొక్క పదము, 5 మా॥ కాల ఖండముగా నడచినది. గేయకర్త రచించునపుడు మనసులో కాలఖండములను గుర్తించుకొని వాని కనువుగా పదములను ఆయా కాలఖండములందు నిక్షేపించును. గాయకుడు దానిని పదము ఎట్లున్నను 5 మాత్రలకు హ్రస్వీకరణ/దీర్ఘకరణ ద్వారా సరిపుచ్చును. అపుడు గాయకుని గానంలో '5 మాత్రల సమత' దృష్టితో ఏ అక్షరమైనా సంస్కరించి సరిపుచ్చబడును. అపుడది 10 రకాలకుపైగా మార్చి చదవబడవచ్చు. గతి మాత్రము ఒక్కటే. మచ్చునకు.

గోరంత దీపమూ(1) కొండల్ల కె(2)లుగూ(3)
గోరంత దీపమ్ము(4) కొండల్కు(5) వెలుగూ
గోరంత దీపమ్(6) కొండలా(7) కెలుగూ
గోరంత దీపం-(8) కొండలకూ9 వెల్గూ(10)

పై పది అంకెలు పదాల మార్పును సూచించునవి.

గేయ ఛందములలోని అక్షరములకు కాలఖండముల కనుగుణమైన హ్రస్వ దీర్ఘతా నిరపేక్ష లక్షణం ప్రాకృత ఛందములందు లాక్షణీకరింపబడినది.

జయి దీహో వి అవణ్ణో
లహు జీహా పథ ఇ హో ఇ సో విలహూ
వణ్ణో వితురి అపథి ఓ
దాత్తాణ్ణి విపీక్క జాణేహూ - ప్రా.పైం. 1.8

నాలుక (జీహో) దీర్ఘవర్ణమును హ్రస్వముగా పలికిన అది లఘువుగా

చెప్పబడుతుంది. అందేరాసు వేగంగా చదివి మూడు నాలుగు వర్ణాలు ఏకవర్ణంగా ఉచ్చరిస్తే అది ఏకవర్ణమే అగును. అని పైదానిరర్థము.

"...A poet singer may take liberties with pronunciation of short and long letters or may squeez several letters with in a group of matras, which ordinarily would admit the pronunciation of only half of them, but in any case he would not do it in an awkward manner అని ఆచార్య వేలెంకర్ గారు కూడ ఇట్లే అభిప్రాయపడినారు. [19]

కవి జనాశ్రయకారుడు ఇట్టి హ్రస్వదీర్ఘతలను నిరసించి, పండితకవులకు గల అనాదరమును గ్రంధస్థము చేసినాడు. కవి జనాశ్రయములో దీనినిదోషాధికారమున కాకు దోషముగా గుర్తించి నిరసించి, నిషేధించినాడు.

వెలయగ జెజాకు విలుగొని
యలరమ్ముల జేతబట్టి యంగజుడు విరా
హుల' నేయనేర్పు కడిమిం
దొల మెలయగ నవిన గాకుదోషంబయ్యెన్

తెలిసి తెలిసి యెవ్వడు చెఱకును చెఱాకు అని విరహులను విరాహులని వ్రాయరు [20] ఛందస్సు కొరకై అట్లు వ్రాయబడును (లేదా పాడబడును). తెనాలి రామకృష్ణుడు తన కృతిభర్తను ఛందస్సులో ఇమడని కారణముగా పేరు కొంచెము మార్చి వేసినాడు గదా! ఇట్టి ధానిని రేచన వ్యతిరేకించినాడు. ఇట్టిది శిష్ట సాహిత్యమున దోషమైనను జానపద గేయ సాహిత్యమున అది కాలఖండ పూరణమునకు సర్వధా శరణ్యమే.

ప్రాకృత పైంగళములో చెప్పిన 'మూడు నాలుగు వర్ణములను ఏక వర్ణముగా చదువుట'యన్నది అచ్చమైన గేయ సంప్రదాయమే.

| 4 | 4 | 4 | 4 |
|---|---|---|---|
| ఏనుగు | నల్లా | నా- | వల్లో |
| కోరా | తెల్లా | నా- | వల్లో |
| ఎన్గుమీది | దొరగా | రూ- | వల్లో |
| ఎంతా | చక్కా | నా- | వల్లో |

జానపద గీతములలోని ఈ పదోచ్చారణ ప్రాకృతాంధ్రముతో బాటు అన్ని భాషలకు వర్తించు సమాన ధర్మమే. సోదర ద్రావిడ భాషలలో కూడా ఇది ఉన్నదే. దీనిని తమిళ లాక్షణికులు లాక్షణీకరించిరి. కన్నడిగుల దాసర పదములలో ఇవి గుర్తింపబడినవి. మలయాళమునందు సైతము ఈ విధానమున్నదని "The lengthening and shortening of vowels in a syllable are popular in malaylam also" అని కె. ఆర్ముగం అనినట్లు డా॥ కె. సర్వోత్తమన్ గారు వ్రాసినారు.[22] ఇట్టి విధానమును కూడా గమనింపకున్నచో మాత్రం లోపము కన్పించును. "దేశి రచనలలో గేయధర్మ సాధనలో దుడుకు లఘ్వం లఘువుం లజ్జు గుజ్జులు చాల సంఘటించును. ఆ లజ్జు గుజ్జులలో ఒక్కొక్కప్పుడు శబ్దాల స్వరూపాలే మారిపోవుచుండును. అందుచే పండితులు రచించిన యక్షగానాది కృతులలో గూడ వారు సహజముగా గాయకులు గారాచెరిచేను సందర్భములనేకములు గలవు. ఇట్టిది దేశి రచనల విలక్షణత."[23] అని ఆచార్య యస్వీ జోగారావుగారు, పండితులు యక్షగానాది దేశి రచనలలో దేశిసంప్రదాయమును మన్నించి గేయగతులలో హ్రస్వ దీర్ఘ నిరపేక్ష రూపమున రచించుటను కాలుజారుట యనిరి. పండితుల దృష్టిలో అది అట్టిదేకావచ్చును గాని, దేశి సాహిత్య రచనా సందర్భమున అది ఉచితమే.

మాత్రాసమత కొఱకు హ్రస్వదీర్ఘీకరణమేగాక కాలపూరణము కూడా కాల ఖండముల మాత్రా సమతకు వేరొక్క మార్గము. "గొబ్బిళ్ళ పాటలో పాదమున పెనిమిదేసి మాత్రలు గల రెండేసి గణములు గనిపించుచున్నవి. సరిపాదముల చివర గొబ్బిళ్ళో అని యుండుచోట మాత్రము గణమునకు రెండు మాత్రలు తక్కువగు చున్నవి" అని దివాకర్లవారు[24] వ్రాసిన దానినే గేయదృష్టితో చూచిన నింపుకొనుట ద్వారా ఈ మాత్రా సమత సాధ్యమని తెలియును. కొత్తపాదము అందుకునే వరకు మధ్యలో ఆపిన ఆ విరామ కాలము మాత్రాసమతను సాధించును. దీనినే నిశ్శబ్ద కాల ఖండమనవచ్చును. ఇది సాధారణముగా పాదాంతమున (శబ్దాంతమున) వచ్చును. పాదమధ్యములో ఇది క్వాచిత్కము.

1] పాద మధ్యమునకు :-

రామ చం– ద్రాయ జనక రాజ జామ నోహ రాయ
మామ కా- భీష్ట దాయ మహిత మంగ ళం...

చం, కా. అన్న (2 వగణము) చోట్ల ఏకమాత్రాకాలము నిశ్శబ్దముగా నింపబడును.[25]

2] పూరణములు :-

(a) స్వరమునే దీర్ఘీకరించుట

ఊగరా ఊగరా గంగే దా ఆ
ఉగ్గా పాటె గంగే దా ఆ
సోలీ ఊగే గంగే దా ఆ
సోటటి సాటి గంగే దా ఆ

(b) నిశ్శబ్దము పాటించుట ద్వారా పూరణము

5 5 5 5

1) ప్రొంచ్చి నీమహిమ లూ... గౌరమ్మ
నిత్రమై తోనుప మ్మా... (5 మాత్రం నిశ్శబ్దం)
2) గౌరిపు ప్రూద్రాని గంటలా బసనన్న
మండతం మేరేది మల్లన్న కొమరుడా
3) సెనగపూ లాసంత మే... గౌరమ్మ
సిన్నదే నీయంద మూ... (5 మాత్రం నిశ్శబ్దం)

అయితే కాలఖండములు సరి సంఖ్యలో నుండి సమాన మాత్రికములుగా నుండుట సాధారణ నియమమే. [పైన 5 + 5 + 5 + 5] ఐనను కొన్నిచోట్ల కాలఖండములు మాత్రా విషయమున భిన్నమై యుండును. పై విధముగా సన్నట్రిత్యస్రాదిగతులు చూపసాధ్యమగును. కాని కొన్నిసార్లు 4 + 4 + 4 లేదా 3 + 3 + 3 + 3 అన్న పద్ధతులతో బాటు అనగా సమాన కాలఖండములతో బాటు 5 + 5 + 2 **(Nonequal time patterns)** గా కూడా విడిపోవును. ఇది పద మునుబట్టి గణముగా లెక్కింపబడు విధానములోనిది. అయితే ఈ విధానము ఒక పాదములో నున్నట్లే తర్వాత అనేక పాదములలో సైతము అట్లే కాలఖండములు పేర్చబడును. అనగా 5 + 5 + 2 అన్న విధానము సర్వపాదములందు పాటింపబడును. దీనితో లయ సౌష్ఠవమగును. (మందాక్రాంత వృత్తములో 4 + 6 + 7 అన్న అక్షర విధానమును యతి నియమమున విచ్ఛేద రూపమున లయ సౌష్ఠవపడుటను ఇది వరలో సూచింపనైనది) ఇట్లు సర్వపాదములందే అనే విధముగా (12 మాత్రలు పాదమునందున్న చాలును, ఎట్లు విరిగిననేమి అనుకొనక 5 + 5 + 2 గా విడగొట్టి) లయను సాధించుటకు కారణము గేయకవి మనసులోనే కాలఖండము దృష్టితో

గణమునకొక్క పదముగా యోచించుచుపోవును. ఈ క్రింది జానపద గీతము ఉదాహరణీయము.

| | | |
|---|---|---|
| 5 | 5 | 2 |
| గొడ్డన్ను | నూరుకో | నీ |
| గొడ్డన్ను | నూరుకొ | నీ |
| గొంగట్లో | పెటిరికొడు | కో |
| కౌసల్యా | నాగుల | య్యా |
| కత్తుల్లు | నూరుకో | నీ |
| కత్తుల్లు | నూరుకో | నీ |
| కడకుల్ల | చెకిరికొడు | కో |
| కౌసల్యా | నాగుల | య్యా |

మొదటి కాలఖండములో ఆయుధములను, రెండవ కాలఖండములో వాటికి పదును పెట్టుటను కవి అకువుగా చెప్పుచుపోవును.

**పాదము :—**

జానపద గీతులలో పాద ప్రమాణము ఖచ్చితముగా పాటింపబడును. పాదాంత విచ్ఛేదము, పాద మాత్రాసంఖ్యా గణనము, అర్థ సమాప్తి గేయ లక్షణము. దీనినే పంజరీ ద్విపద లక్షణ సందర్భమున పొత్తపికవి ఏకపద మంజరి అనినాడు. పదము పదముగా జానపదకవి దొంతరగా పేర్చుకొనుచుబోవును. మధ్యలో ఆలోచనకు అవకాశము కొఱకు పేర్చిన పాదమునే తిరిగి పాడును. వ్యర్థ పదముల ప్రయోగ నిషేధము లేదు కనుక, పునరావృత్తి దోషము కాదు గనుక గేయ కావ్యములలో ఇవి ఒక అలంకారముగా భావింపబడును.[26] జానపద గీతమునందు ఏపాదమున కాపాదము వ్యస్తమే. అర్థ విషయమున సంపూర్ణము. అనగా ముక్తకము. తర్వాతి పాదముతో అన్వయము ఉండదు. ఉండకుండునట్లు కవి వ్రాయును. మార్గి చ్ఛందములందు చతుష్పాదవ్యవస్థలో 4 పాదములొకసమాహారము. అర్థమునంతయు 4 పాదములతో కలిపి చెప్పును. క్రియాపద మెక్కడో 4వ పాదములో నుండును. లేదా క్రియతో వాక్యము ప్రారంభమై తక్కిన వాక్యమంత తర్వాతి పద్యభాగమున ఉండును. "ప్రసన్నులయ్యోడిన్" అని క్రియ తుదిని నన్నయ భారతము ఉదంకోపాఖ్యానములో నున్నది. "కనిరియెంగృష్ణుడు" అని పోతన భాగ

పల పద్యములో క్రియ మొదలున్నది. కాని ముక్తక జానపద గీతిలో పాదములోనే అర్థసమాప్తి ఉండును. మరు జనక మమ్మేలు మత్స్యావతార అన్న విధమున నుండును.

ఒక పాదంతో మరో పాదానికి అతుకు ఉండదు. యతి విచ్ఛేదరూపములో పాదమధ్యమున, పాదాంతమున ఉండును. ఆశువుగా చెప్పుటలో గేయకారుడు ఏ పాదమున కాపాదమును పేర్చుటలో యోచించును. శిష్టకవి చతుష్పాద పద్య రచనలో భావమును ఎక్కువైన విరిచి చివర వరకు పూర్తిచేయును. జానపద గేయములో పాదమొక దానిని విడి. అట్లగా రెండవ దానిని వేరొకడు ఎత్తుకొనవచ్చును. కావ్య వాఙ్మయమున మధ్యచ్ఛందముండెడిది సాధ్యము కానిది. కనుకనే తెలుగులో జంట కవుల కావ్యగానము అపురూపమైనది. అష్టావధానములలో తిరుపతి వెంకటేశ్వర కవులు ఒకే పద్యమును కొన్ని పాదములుగా ఉభయులు వ్రాయుట అద్భుత విషయమైనది గేయములో పాదములు బహు కర్తృత్వము నందుటలో విషయము చెడదు. పాదములు కథా గేయములో తారుమారగుట, ఎక్కువ పాదములు వచ్చి చేరుట వల్ల గేయము చెడదు. మౌఖిక సాంప్రదాయములో మార్పు అనివార్యము. అయినను కథనము చెడకుండుటకు కారణ మీపాద వ్యవస్థయే. పాదాంత లఘువు యొక్క దీర్ఘకరణము, పాదమున కిన్ని మాత్రలని పాద ప్రమాణము, దీర్ఘపాదముల సమద్విఖండన రూప కాలసమత జానపద గీతిలోని పాదలక్షణము లోని మరికొన్ని విశేషములు. పాదప్రమాణమును సాధించిన మాత్రాగణనము దృష్టిలో పెట్టుకొని కొన్ని గేయములు.

1] అత్తా- వారింటికీ- ఈ (14 మాత్రలు)
అంపించేదామూ- నిన్నూ (14 మాత్రలు)

2] (5) దొడ్లొను (5) అబ్బాయి (5) దోగాడ (3) జూచి 18 మా॥
(5) దోస వం (5) డని తాత (5) ఎత్తి ము (3) ద్దాడు 18 మా॥

3] (5) అద్దుమ్మ (5) నాలిరి — (10) ఉయ్యాలో...(10 మా॥)
ఒక్క ని ద్దుర పొద్దు — ఉయ్యాలో...(10 మా॥)

5 5
తల్లి వా ఛే తల్లి — ఉయ్యాలో...10
3 4
పమ్ము గన్న తల్లి — ఉయ్యాలో...10

## (ఆ) జానపద గీతుల మాత్రా గణన లేఖన విధానములు :-

గేయము మౌఖిక సంప్రదాయమునకు చెందినది. లేఖనము లేనినాటిది. లేఖన విధానము కొద్దినాటిది. ఐనను లేఖన విధానము వచ్చిన పిదప దీనిని గ్రంథస్థ మొనర్చుటలో కొంత వరకు సౌలభ్యము మాత్రము సాధింపబడినది. ఐనప్పటికి గ్రంథములను బట్టి పాటలు (సంగీతము) నేర్చుట సాధ్యము కానట్టిది. గురువు విద్యార్థికి తోడై నేర్పవలయును. అందుచేతనే ఇది మౌఖిక సంప్రదాయమనుట. వేదములు గేయ సంప్రదాయమునకు చెందినవగుటచే "గురువుతోడ వేదము నభ్యసించెను" వంటి వాక్య నిర్మాణావశ్యకతను తెలుగు వ్యాకరణములు చెప్పినవి.[27] లేఖన సంప్రదాయమునకు గానము లొదుగకుండుటను సంగీత గ్రంథములందు చూడవచ్చును. మాత్రలు గుర్తింపులు, తాళ విధానములు, వ్రేలికి ఎన్ని అక్షరముల చొ॥న పాడవలయునన్నది, స్వర ఉదాత్తానుదాత్తస్వరితముల సంజ్ఞలతో సాధారణ వచన గ్రంథములను చదువ నెర్గినంత తేలికగా చదువలేకుండుటను, గేయ, సంగీత సంప్రదాయము తెలిసినవేగాని చదువ సాధ్యపడకుండుటను ఇందుకుదాహరింపవచ్చును.[28] ఇన్ని సంజ్ఞలిచ్చి లిఖించినను (అచ్చువేసినను) తిరిగి సంగీతము లేదా పాటను గురుముఖముననే నేర్వవలయునన్నది సర్వజనవిదితమే కదా !

అయినను గేయ విధానమును కొంత వరకు లేఖన సాధనములలో చూపవచ్చును. అట్లు తెలుగు సాహిత్యములో కొంత వరకు గేయములు అచ్చులో వచ్చినవి. పండితులు పరిష్కరించుట వలననేమి, గేయములు గానముచేయు పామరులకు చదువు రాకుండుట వలననేమి, గేయ సంప్రదాయము భంగమైనది. ఇట్టి చోట్ల 'గాన విధేయ లిపి'ని అనుసరింపబడలేదు. అట్టివి కొన్ని ఈ క్రింది సూచనంలో చూపబడుచున్నవి.

1) శబ్ద సాధుత్వ దృష్టితోగాక పాడుటలో గల పదస్వరూపమును పరిశీలించి వ్రాయుట :

చెమ్మ చెక్క చారె డేసి మొగ్గ

శబ్ద సాధుత్వ దృష్టిలో రాసిన ఇది 3 మాత్రల పదములుగా కన్నట్టును కాని పాటలో దీని స్వరూపము సంకీర్ణగతికి సరిపోవును.

| 5 | 4 | 5 | |
|---|---|---|---|
| చెమ్మ్మ్మ | చెక్కా | చేరదేసి | మొగ్గా |
| ఆట్లుపోయ్ | యంగా | ఆరగిం | చంగా |
| ముత్యాల | చెమచెక | ముగ్గులే | యంగా |
| రత్నాల | చెమచెక | రంగులే | యంగా |

చెమ్మచెక్క అన్నది ప్రారంభ పాదములో 9 మాత్రలు (5 + 4) కాగా 3, 4 పాదములలో 2వ గణముగా కేవలము నాలుగు మాత్రలకే ('చెమచెక'-పాడులో దీని పదస్వరూపమిట్లే ఉన్నది) పరిమితమగుట గేయలక్షణము గమనింపవలసిన అంశము.

పరార్క గీతమిట్లే వ్రాయబడుట గమనింపదగినది.

చందమామ రావె-ఇది కూడా వ్రాతలో త్రిస్రగతిలోనిది కనిపిట్టినను చతురస్రగతిలో పాడబడు గేయము.

చందా మామా రావే
జా– బిల్లి రావే
కోటస్ దెక్కి రావే
కోటి పూలు తేవే

దీనిని పిల్లలు వేగముగా గతి వైవిధ్యము కొరకై త్రిస్రగతిలో పాడుదురు అప్పుడు దీనిని

చంద మామ రావె
జా– బిల్లి రావె. అన్న విధములో రాయవచ్చును. ఇక్కడ రావె తర్వాత ఏ మాత్రము విశ్రాంతి నీయక జా బిల్లి అని తర్వాతి పాదము ఎత్తుకొనబడును. ఈ క్రింది జానపద గీతము వ్రాతలో 4 + 5 + 4 మాత్రలుగా సాగినట్లు అనిపించును.

సిరాము సింతల్లా వలలో
సిగురూ మామిల్లా వలలో
సితాని యెవ్వరూ వలలో
సెరగొ- న్నారమ్మా వలలో

కాని ఇది పాటలో ఇలా పద స్వరూపము ఉండును.

సిరామ సింతల్లాడిః వలలో 4 + 8 + 4
సిగురూ మామిల్లాడిః వలలో
సితాని యెవ్వారూడిః వలలో
సెరగా న్నారమ్మాఆ వలలో

2. మాత్రల సంఖ్యను గణము (కాలఖండము)నకు పాదము మొత్తము నకు సూచించుట.

| 4 | 4 | 4 | 6 | 6 | |
|---|---|---|---|---|---|
| కుమ్మా | రోల్లా | బట్టీ | - గురుగుల్లు | చెయ్యంగా | 12 + 12 మా॥ |
| కూలా | దన్నీ | వచ్చే | - మీవోటి | డూ డిః డిః | |
| ఏమ | మ్మాగో | పెమ్మా - | యాశోదా | మాయమ్మా | |
| ఎంతా | దుట్టూ | వోడూ - | మీవోటి | డూ డిః డిః | |
| మావో | డూగా | దమ్మా | మరియావా | డోగానీ | |
| మావో | డూమూ | మండీ- | లాన్నోటి | డూ డిః డిః | |

3. నిశ్శబ్ద కాలఖండములను, దీర్ఘీకరణ/లఘూకరణములను సూచించుట.

**a)** నిశ్శబ్ద కాలఖండములు

| 5 | 5 | 5 | 5 | |
|---|---|---|---|---|
| పేదరాలు | పెద్దమ్మ | కుయ్యాలో | ...... | (1) |
| ఎందరే | కొడుకులూ | ఉయ్యాలో | ఓఓఓ | (2) |

4వ, గణము నిశ్శబ్ద కాలఖండము. ఇది తర్వాతిపాదము ఎత్తుకునే వరకు గల మధ్యకాలము. దీనిని పైరెండు విధములుగా చూపవచ్చును.

**b)** దీర్ఘీకరణ :-

| 4 | 4 | 4 | 4 |
|---|---|---|---|
| చందమ | ఆఅమఅ | - ఓ చం | దమ్మాః ఘ |
| మామీ | ఈః డీ | - చెట్లా | ఆకూ |
| మద్దే | న్లూ ఉః | - కట్టీ | ఈఈ |
| మవుగో | ఓట్లా | - నేనుగో | ఓట్లా |

c) లఘూకరణ :-

మరుజనక మమ్మేలు మత్స్యావ తార
సురుతుగా కృపజూడు కూర్మావ తార
వరముల సిరివల్లు "వామనావ" తార

వామనావ = 6 మాత్రలు కాగా లఘూరింపబడి 5 మాత్రల కాలఖండము లోనికి పఠింపబడినది.

4. అర్థమును బట్టి కాక పాద ప్రమాణమునుబట్టి లిఖించుట.

జానపద గేయములు గురించి ప్రతుల్లో అచ్చైనవి పరిష్కరణలోపం వల్ల కొంత అస్తవ్యస్తమయ్యాయి. అచ్చు వేయించినందుకే ఆ సాహిత్యోద్ధారకులకు కృతజ్ఞులై ఉండాలి.

ఉ. ది. స్పెషల్ బుక్ డిపో మదరాసు-1 వారు అచ్చువేసిన (1956) శ్రీ కృష్ణ జననము పాట

అచ్చైన విధానము

కస్తూరి రంగిరంగా నాయన్న కావేటి రంగిరంగా
శ్రీరంగ రం 1వ పరుస
రంగా నిను బాసి యెట్లు నేమరచుందురా కంసుని
సంహారింప సద్గురుడు —2వ పరుస
అవతార మెత్తినపుడు దేవకీ గర్భమునను
కృష్ణావతారమై జన్మించెను —3వ పరుస

మాత్రాగణనము, కాలఖండముల విభజనము, నిర్బద్ధ కాలఖండముల సూచన, పాద విభాగముతో ఇట్లు లిఖింపవలయును.

కస్తూరి రంగరం గా... నాయన్న
కావేటి రంగరం గా...
శ్రీరంగ రంగరం గా... నినుబాసి
యెట్లునే మరచుందు రా...

5. "ఉచ్చారణ విధేయ లిపి"ని పాటించుట.

1) చిట్ల పొట్ల కాయ చీమ నెల్ల కాయ

గోడ పుచ్చ కాయ గోరు చిక్కుడుకాయ
చిక్కుడు అని అచ్చేయింది.[29]

2) చాకిరేవు బండెక్కి ఉయ్యాలో

ఖండగతిలో నడిచే ఈ గేయంలో మొదట చా|కేవ్ అని పలుకబడు తుంది.

3) పూరాన దంపతులు ఉయ్యాలో
బోదించి రీఇట్లు ఉయ్యాలో
సాతులా రామీరు ఉయ్యాలో
సద్బోధ వినరంది ఉయ్యాలో

4) నాగసారం పట్టూకోని
నాడి ఊళ్లెకు నువ్వొరాంగ
నాగసరం నాదుంకయ్యో ఓ దొరగారు
నడిచినట్టె అచ్చిరేమయ్యో ఓ దొరగారు

ఉచ్చారణ విధేయలిపిలో వ్రాయుట వలన గేయ సౌకుమార్యం, లయ, సహజత్వం దెబ్బతినదు. శిష్టులు పాడిన జానపదుల వలె పాడవచ్చు. శుద్ధిచేసి ఇలా పాడితే

3) పురాణ దంపతులు ఉయ్యాలో
బోధించరీ యిట్లు ఉయ్యాలో
సతులారా మీరు ఉయ్యాలో
సద్బోధ వినరండి ఉయ్యాలో

4) నాగస్వరం పట్టుకొని
నడి ఊళ్లోకి నువ్వేరాంగ

అన్న విధంగా జానపదత్వం లోపించును.

6. సంగీత శాస్త్రములో తాళాంగములలో శాస్త్రీయ కృతిని వ్రాసి చూపి నట్లు కాలఖండములలో చూపుట.

శాస్త్రీయ సంగీత గ్రంథములలో కీర్తనను తాళాంగములలో చూపుట పరి పాటి. అనగా ఆదితాళములోని కృతిని, లఘువు, ద్రుతము, అనుద్రుతము అన్న విధ

ముగా పాటను విభజించి చూపబడును. దీనితో గాయకునకు ఎక్కడెక్కడ తాళము నడచునో - పాట ఎంత వరకు సాగదీయ వలయునో మాత్రలతో సహా తెలియును. అట్లే జానపద గీతని కాలఖండములలో గణములలో విడిగా చూపవలయును.

గొల్ల వారి వాడలకు కృష్ణమూర్తి
నీవు యేమి పనిగ వచ్చినావు కృష్ణమూర్తి. అని అచ్చులో ఉన్న ఈ గేయమును-

గొల్ల వారి వాడలాకు కృష్ణమూ ర్తి నీవు
ఏమి పనిగ వచ్చినావు కృష్ణమూ- ర్తి ...

అని వ్రాసిన నడక చక్కగా తెలియును. 'నీవు' పదము పై ఆవృత్తిలోకి వ్రాయ వలయును.

7. నడక భేదమైనదో తెల్పుట.

1) గతి మారినపుడు :-

ఈ క్రింది సువ్వి (రోకటిపాట) పదం. 2 గతుల్లో త్రిస్ర, చతురస్రల్లో ఉంది. ఛేదములో విడిగా చూపాలి.

| | | |
|---|---|---|
| సూరీ తాఆ వేటీ రంగా | 4+4+4+4 | చతురస్ర |
| సువ్వా న్నాఆ లాఈ ఈఈ | 4+4+4+4 | |
| చింత కింద రోలు వేసి | 3+3+3+3 | త్రిస్ర |
| చీటె డాడ్ల ఆయి వోసి | 3+3+3+3 | |

గూడీ మాడీ దంచా రమ్మా
ముగురూ కన్నె యాడూ బామా చతురస్ర

మాను కింద రోలు వేసి
మానే డాడ్ల ఆయి వోసి త్రిస్ర

గూడీ మాడీ దంచారమ్మా
ముగురూ కన్నెయాడూ బామా చతురస్ర

2) అదే గతి విలంబిత ద్రుత గతులలో అనగా మెల్లగా లేదా వేగంగా నడచునప్పుడు :

కోలాటపు పాట :

ఎప్పుడెప్పుడను ప్పాటు సింహో ఓ 8+8 మాత్రలు
ఎటువొయ్యెపప్పర యే ఎంలో ఓ ,,
శ్రీరాముం డం టను రేసా డః ,,
సీతను వెదరా వొయ్యెదసా డః ,,

కోలలు వేగంగా వేస్తూ దీనికి మరో యెనిమిది మాత్రల తాలం కల్పి అంతా ఒకే పాదంగా (అంటే గంతువేయడంలో - ఉభయ పార్శ్వముల కోలలు అందించుటలో వేగం పెంచి)

(చల్) హోహోరా తుకోతీ - గుణమూ ఉ మానురా ఆ 12+12
ఎదెడంత లేవు నా న్నొడిపించేదనావూ డః 12+12

## ఈ) జానపద గేయపు నడకలు :-

త్ర్యస్రాది గతులలో నడచు జానపద గీతులన్నిటిని రగడలుగా చూప వచ్చును. తెలుగులోని రగడ భేదములలో అన్ని జానపద గీతులంతర్భవింప వీలున్నది. గమన వైవిధ్యమునం గీతులను, ఇతర మిశ్రాది ఛందములుగ చూపవచ్చును నిశ్శబ్దకాలఖండము వదలివైచి, శబ్ద సాధుత్వ దృష్టితో చూచి గేయగతులను శిష్ట కవులు దేశిఛ్ఛందములుగా మలచుకొనిరి. వానిని అయా సందర్భముల జన్య జనకత్వ సంబంధముతో చూపవైనని. స్థాలీపులాక న్యాయమున తక్కిన విశేషములను, నడకలు ఇప్పుడు చూపబడుచున్నవి.

(1) త్ర్యస్రగతి :-

శ్రీని వాస మూర్తి సేవ
జేసి వాని సన్ను తింతు
మాని తముగ తులసి దళము
మహిమ చెప్పెదా ...[30]

పాదము 8 త్రిమాత్రాగణములుంచె, 4 గణములకొక అర్ధమై యతి సరిరినను, పాట దైర్ఘ్యము గేయ సహజము కాకుండుటచే ఇట్లు విభాగము చేయబడినది. చివరి నాలుగు మాత్రలు- తర్వాతి పాదము ఎత్తుకొనుటకు ముందుంచబడు నిశ్శబ్ద కాల విరామము.

ఇది తురగ వల్గన రగడలతో సమానము.

3 3 3 3 3 3 3 3
బుర్ర పిట్ట బుర్ర పిట్ట తుర్ర మన్న దీఇ ఈ-
పడమ టింటి కాపు రం- చెయ్య నన్న దీఇ ఈ-
అత్త తెచ్చిన కొత్త చీర కట్ట నన్న దీఇ ఈ-
మొగుని చేత మొట్టికాయ తింట నన్న దీఇ ఈ-[31]

ఇది గూడా అట్టిదే. పాదాంతమున 4 మాత్రల కాలము దీర్ఘీకరింపబడినది. ప్రాతలో 6 గణములమీద నొక్క గురువుండినది. ఇట్టి విధానము నుండే 7 గణముల మీద నొక్క గురువుగల (దీర్ఘీకరణ విధానము పొడింపక) ఉత్సాహ పుట్టుక సంభవించి ఉండును.

(2) చతురస్ర గతి

రారం గం- తారం గం-
తాండవ కృష్ణా తారం గం-
వేణూ నాదా తారం గం-
వెన్న దొంగా తారం గం-

పాదమునకు రెండు గణములవలె కన్పట్టుచున్నది. కాని యిదిగూడా 4 గణములదే. ఐనను వాగ్గేయము కనుక బాలల శ్వాస క్రియానుగుణముగా చిన్నగా తుంప బడినది.

నిశ్శబ్ద కాలఖండములను గాని, మాత్రా పూరణమునకు గాని ఎన్ని మాత్రలు నింపవలయునో, తర్వాత పాదములోని మాతువును పరిశీలించిన ధాతువు తెలియగలదు. పైగేయములో "గం" వద్ద మరి రెండు మాత్రల మాత్రా పూరణము జరిగినది. రెండు మాత్రలనుటకు తర్వాతి పాదములోని (తాండవ కృష్ణా) రెండవ గణము "కృష్ణా"యన్న చతుర్మాత్రికమే ప్రబలాధారము. అనగా పాదములోని రెండవ కాలఖండము 4 మాత్రలదిగా గుర్తించి పై పాదములోని గం - పిదప గం - రెండు మాత్రలు - మిగిలిన 2 మాత్రల పూరణ కాలముని గుర్తింపవలెను.

భ్రమర జీవితు డూటీ సకలా
శ్రితటస పత్సలు డూటీ ....

నారా యణుడను నాలుగు పురుషుడు
నీయసలు పేరేమి చెప్పు ....

— బాలక్రీడలు స్త్రీల పాటలు

నవలా, పురుషుడు అందలి ప్రథమ పాదములోనివిగాక, రెండవ పాదమున కెత్తుగడలుగా గేయ సంకలన కర్తలు భావింపుట జరిగినది కారణము రెండవ జోడింపు పాదములో 3 గణములు ( 1] త్రిశ్రజాతి 2] పత్సలు 3] డగా డు) మాత్రమే రాక వచ్చుట కారణము. కాని ఆదియును పై పాదములో 4వ గణమే. రెండవ పాదము లోని 4వ గణము నిశ్శబ్దకాలఖండము.' పాడగా రాగము చూపిన తెలియగలదు. పైగా జానపదగీతి సాధారణముగా సరిసంఖ్యాగణములతో మీద మిక్కిలి 4 గణములతో నుండుట పరిపాటి. ఇది మధురగతి రగడయనవచ్చును.

పాదమునకు 8 చతుర్మాత్రాగణములుగల ఈ క్రీడ జానపదగేయము హరిగతి రగడ కాగలదు.

ముక్కు పుల్లా లేవాయె మామిడి మీనా నల్లా మామిడి మీనా
ముక్కెం తోసీ స్నవాయె మామిడి మీనా నల్లా మామిడి మీనా

చివరి మామిడి, మీనా అన్న ఆవృత్తి పదములు గేయమంత సాగును. అనగా పాదములోని 5 గణములు సిద్ధమే. ప్రతిపాదములో మొదటి మూడు గణములలోనే భావము మారుచుండును. అనగా జానపదకవి ఆశువుగా చెప్పు గీతములో ఇన్ని గణముల పేర్పుకై భావమును కొని తెచ్చుట అన్నది క్లిష్టమైన సాధ్యము లిఖిత వాఙ్మయములో వలె రేఖన సాధనములతో ఆలోచనామృత ఫలముగా పాట పుట్టదు. మొదటి మూడు గణముల పేర్పులో ఆశువుగా జానపద కవి గేయ మల్లుచు పోవును.

(3) ఖండగతి :-

తెలుగు గేయ సాహిత్యములో ఖండగతి బహు ప్రచలిత గతి. పెక్కు జానపద గీతులు ఖండగతిలోనడచునట్టివే. ఉపయుక్తములగు దేశిచ్ఛందోగణ వ్యవస్థ (ఛం. గ. ఉపయుక్తములు)లో ఇంద్రగణములు పెక్కు ఖండగతి బోధకములు. ఖండగతి బహుళ ప్రచారములోని దగుట, తెలుగు గేయముల నుండి మంచు కొన్ని దేశి ఛ్ఛందములలో అధికాంశము ఇంద్రగణములుగా పాదములలో ఒప్పునవైనవి.

పెక్కు జానపద గీతులు ద్విపద ఛ్ఛాయలో నడచును. మంజరీ ద్విపద ఛ్ఛందములో కావ్యములే వ్రాయబడినవి. వీరగాథలు ఖండగతిలోనే. దసరా పాటలు,

(ఐ) ఊదేటి తిత్తుయా ఉరుములా బోలు
వేసేటి సమ్మెట్టు పిడుగులా దోలు[40]

(ఒ) పదపదు ఏదపకు ఎక్రిదా గన్నా
పడిస్తే నీరజ్జ నీలాలు తారు.

(ఓ) అయ్యవా రికిచాలు ఐదుపర హోలు
పిల్లవా ళ్లపంచాలు పప్పుబె ల్లాలు[41]

(ఔ) తాటాకు వెలిగించి తలకింద బెట్టి
అయ్యయ్యో పంతులూ అయిపో తివా.

**(3) సీసము :** చివరి రెండు సూర్యగణములను పంచమాత్రికములుగనే భావించిన సీసము గేయమగుచు తెలియును. అనగా 8 పంచమాత్రికములనుసన్న మాట. ఇది విజయభద్రలగడను బోలును.

సీస ప్రకరణమున శ్రావణ మంగళారపు పాటతోబాటు మరికొన్ని జానపద గీతములు చూపబడినవి. క్రింద ఇంకొక పాట ఈయబడుచున్నది.

పంతాయ పందాను పరికూడు వార్చాను
తినమనీ చెప్పవే తడికో తడిక

పగలాడి మాటలకు వళ్ళంత మండింది
వద్దనీ చెప్పవే తడికో తడిక

పట్టుచీ (రె) తెచ్చాను పెట్టెలో పెట్టాను
కట్టమని చెప్పవే తడికో తడిక

చీర కంచులు లేవు చుట్టుచెం గులులేవు
వద్దనీ చెప్పవే తడికో తడిక[42]

తడికొ, తడిక, అన్నది గేయగతిలో తడికో, తడికా అని సాగదీయబడును. పట్టుచీరె వంటి (6 మాత్రల నుండి 5 మాత్రలకు) కుదింపులు, 'మాటలకు'

ఈ మిశ్రణమును బట్టి తే.గ. ఖండగతిగా నిర్ధారింపవచ్చును. సీసము మీద ఆర్వాచీన కాలములో ఆ.వె. బదులు తే.గి. వాడబడుటకు ఇది ఒక కారణము

## (4) మిశ్రగతి :-

      3      4      3      4
(అ) మేలు కొనవే చంద్ర శేఖర
మేలు కొనవే ఇంద్ర వందిత

(ఆ) మొనలు మీదగ తలలు క్రిందుగ
మొలచి యున్నది వృక్ష మూ ఊ

పైవి హరిణగతి, వృషభగతులకు వరుసగా ఉదాహరణములు కాజాలును.

తులసి చెట్టూ దేవుడై రే
మేర లెందుకు మేను రా ఆ.

అన్న పై కోలాటపు పాట సైతము ఇట్టిదే. సాధారణముగా జానపద గీతములు మిశ్రగతిలో సాగినవి రెండేసి గణములు పాదముగా గల్గినవి. జానపద గీతులు మిశ్రగతిలో లెక్కున వానితో పోల్చిన తక్కువే.

## (5) సంకీర్ణ గతి :-

**4+5** లేదా **5+4** అను రీతిలో సాగునవి గేయములు. మిశ్ర సంకీర్ణ గతులలో సాగు గేయములను కాలఖండమునకొక్క పదము ఉండదు. అంతేసి దీర్ఘ పదములు తెలుగు భాషకు సహజములు కావు. కనుక ఆ కాలఖండములలో రెండు పదములు **3+4** లేదా **4+3**గా విడిపోవుట పైన గాంచనగును. అట్లే సంకీర్ణ గతి పాదములకును భావింపవలెను.

      5      4      5      4
(అ) చెమ్మా - చెక్కా చేరడే సిమొగ్గ
అట్లుపో య్యంగా ఆరగిం పంగా

(ఆ) మొండిచె య్యక్కా మొగుడే డక్కా
దానిమ్మ చెటుకింద దాగున్న డక్కా
(పొడుపు కథ)

చెమచెక, చెటుకింద వంటివి 4 మాత్రలోనికి కుదింపబడినవి.

16. Foreword to "Versification" - major language types, p. vii & viii
17. 'Primetive song' - C. M. Bowra p. 35
18. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వేంకటేశ్వర వచనముల పీఠిక - ప్రాఙ్నన్నయ యుగమున ఉద్ధరింపబడినది
19. Apabhra metres - Prakrit Pingalam - Radhakumud - makharjee comm. p. 1068
20. 'వెతాకు', 'విరాహు' అన్న పదములను బట్టి ఆరుద్ర, నాటి శృంగార జానపద గేయములను చూసి రేచన ఇట్లు వ్రాసియుండునని భావించినారు. సమ. ఆ. సా. I. 228 p.
21. భారతి నవం. 1924
22. Rhymic adjustment in Tamil and Malayalam metres - DLA Seminar on metre 1974 (దాక్షి. దేశ. ఛం. రీ. తుల. అధ్య p. 93)
23. యక్షగాన వాఙ్మయ చరిత్ర పు. 63
24. ప్రాఙ్నన్నయ యుగము పు. 330
25 మంగళంపల్లి బాలమురళీకృష్ణ 'రామదాసు కీర్తనలు' L.P రికార్డు. (కోనసీమ దాని ఆధారముగా పాడబడినది)
26. పు. 261లో ఇది వివరించబడింది
27. 'ఉపయోగము సందాఖ్యాతకు తోడ వర్ణకంబగు' నియమపూర్వక విద్యా స్వీకారము ఉపయోగమనాబడు. "రామకృష్ణులు సాందీపని తోడ వేదంబులు చదివిరి. సాందీపని వలనని యర్థము." బాలవ్యాకరణము కారక-4 సూ.
28. శాస్త్రీయ సంగీతములో ఆధునిక పరీక్షా విధానములో పరీక్షార్థుల పట్ల పరీక్షల కొఱకు రచింపబడిన కొత్త సంగీత విద్యాదర్పణము (రచయిత ఏకా సుబ్బారావు) వంటి గ్రంథములు ఇట్టి కోవకు చెందినవే
29. మున్నీరు - నేదునూరి గంగాధరం పు. 36
30. తులాభారము - స్త్రీల పాటలు
31. బాల గేయములు
32. బాల్య క్రీడలు - స్త్రీల పాటలు
33. పెండ్లి పాట - మున్నీరు - నేదునూరి గంగాధరంగారు

34. జానపద గేయ గాథలు - డా॥ నాయని కృష్ణకుమారి p. 226
35. పాము పాట (చర్మాంగద చరిత్రము)-నారాయణరాజు (ముద్రితము)
36. తెలుగు కన్నడ జానపద గేయాలు - డా॥ ఆర్. వి.ఎస్. సుందరం. పు. 114
37. పల్లెపదాలు - కృష్ణశ్రీ సంపాదనము పు. 141
38. ” ” ” పు. 80
39. త్రివేణి పు. 103
40. త్రివేణి పు. 56
41. దసరా పద్యములు (వావిళ్ళ ప్రచురణ)
42 పల్లెపదాలు - కృష్ణశ్రీ సం. పు. 92
43. ప్రాఁదెలుగు యతి - ఉమాపతి పద్మనాభ శర్మ భారతి, ఆగష్టు, 1967
44. తె. క. జా. గేయాలు - ఆర్వీయస్. సుందరం పు. 113
45. త్రివేణి
46. పల్లెపదాలు - కృష్ణశ్రీ సం. పు. 39
47. ” ” పు. 47

* * *

# దేశి చ్ఛందస్సులలో చిత్ర కవిత

ఆంధ్ర సాహిత్యములో ప్రారంభమునుండియు కవిత్వము చతుర్విధములని పేర్కొనబడినది. అవి ఆశు, మధుర, చిత్ర, విస్తారము లనబడినవి. నన్నయ మృదు మధుర చిత్ర విస్తర నవరస భావ భాసుర కవితా రచనా విశారదులైన మహాకవులు రాజరాజనరేంద్రుని సభ నలంకరించి రనినాడు. చిత్ర కవిత ఆదికాలము నుండియే ఉండెననుట కిది సాక్ష్యమైనను ప్రబంధ యుగము నాటికి మాత్రమే దీనికి అధిక ప్రాశస్త్యము లభించినది. ఈ చతుర్విధ కవిత్వములోని చిత్ర కవిత్వము వైచిత్రీ ప్రియులగు పాఠకుల, ప్రయోగ పరులగు కవుల మూలమున వృద్ధి లోనికి వచ్చినది.

చిత్ర కవిత రసాపకర్షకము. మెదడునకు మేతపెట్టునే గాని రసస్ఫోరకము గాదు. తెలుగులో ఇది అతివేలమై, ఆధునిక యుగారంభమునాటికి కవిత్వము అతి ఘోరమగు 'రసహీన' స్థితికి గొనివచ్చినది. చిత్ర కవిత్వము వలన తానెంతో శుష్కించినట్లు ఆంధ్ర సరస్వతి భావించినట్లు చమత్కారముగా కందుకూరి వీరేశ లింగం పంతులుగారు చిత్ర కవిత్వము యొక్క నాటి స్థితిని తెలుపుచు పద్యము వ్రాసినాడు.

దయమాలి తుదముట్ట తలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించునొకడు
పాదంబు లోపల పాదంబు లిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లడరించి
పోటు బంటయి నన్ను పొడుచు నొకడు
పెండు పల్కులు గూర్చి నిండైన నగలంచు
దిట్టయై చెవులు వేధించునొకడు

ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి
వర్ణముల్ మార్చి నను చిక్కు పరచునారు
కుకవులౌదరల్ల విరిచి ప్రాణములు తీయ
ఒదరి వనరేక రక్షించి యున్నదాన.

—సరస్వతీ నారద సంవాదము.

రసస్ఫోరకము కాకుండుటచే సంస్కృత సాహిత్య శాస్త్రజ్ఞు లందరును చిత్ర కవిత్వమును అధమ కవిత్వమని ముక్తకంఠముతో చెప్పినారు. ఇప్పటికిని ఈ కవిత్వ మెందుకు వృద్ధి చెందిన దన్నచో పాండిత్య ప్రదర్శ కొరకే. పండిత పరివేష్టితమైన రాజసభాంతరాళములో కవి తన కవిత్వ పాండిత్య మేధా పటుత్వములను విశేషముగా చూపుటకే చిత్ర కవిత్వమును వాడుకొన్నాడు. గేయసాహిత్యము ఆశుకవిత్వము బంధమై, శృంఖలయుక్తమైన గణఛందస్సులందు సైతము ఆశు కవిత్వము - అప్పటికప్పుడు అల్లిచెప్పుటలో కవి మేధస్సును గ్రహణధారణశక్తులను ప్రదర్శింపుటలో చిత్రకవిత్వము గోచరమే కదా! సాధారణముగా రసస్రష్టలైన మహాకవులు ఈ చిత్రకవిత్వము జోలికి పోరు. ఇదే అభిప్రాయమును C. P. బ్రౌన్ వ్యక్తము చేసినాడు. "As connected with such fancies I will just mention that the Telugus, who value every thing io proportion to its intricracy, have a number of poems (worthless in themselves) composed in the shapes of weapons, birds, trees, serpan s, and other figures. None of these idle contrivences are found in the works of the great poets"[1] అట్లైనను మహాకవులు సైతము రసనిర్భర కవిత్వముతోబాటు స్వల్పముగా వైచిత్రీప్రియులై చిత్ర కవిత్వమును తమ కావ్యములలో అక్కడక్కడ ప్రవేశపెట్టినారు. తెలుగులో చిత్రకవిత్వమును ప్రవేశపెట్టిన కవులలో నన్నెచోడుడు ఆద్యుడగుచున్నాడు. ఈతడైనను తెలుగున నాటికి లేని ఈ సంప్రదాయమును ప్రవేశపెట్టుటకు కన్నడ కవిత్వము ప్రేరణమై ఉండవచ్చును.[2] కన్నడమున ఈ చిత్ర కవిత్వము నాటికి ప్రచారములోనికి వచ్చినది.[3] విన్నకోట పెద్దన దీనిని లక్షణబద్ధమొనర్చిన ఆద్య లాక్షణికుడన జెల్లును.

## (ఆ) చతుర్విధ కవితలు

చతుర్విధ కవితలలో విస్తారకవిత కావ్య వాఙ్మయమునకు, ఆశుకవిత కవిమేధో శక్తికి సంబంధించినది. ఇక మిగిలిన రెండు మధుర చిత్ర కవితలు. వీనిని

మాత్రము లాక్షణికులు విపరించినారు. చిత్రకవితలో సైతము గర్భకవిత స్వల్పము గనే విపరించబడినది. ఆయన లక్షణ వివేచనములలో గాక లక్ష్యములలో ప్రదర్శితము. గర్భ కవిత్వము కవి పాండిత్యమునకు సంబంధించినదని, ఎవరి పాండిత్య ప్రాగల్భ్యత ననుసరించి వారు గర్భకవితలు వ్రాయుదురని చెప్పుచు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రబంధరాజు వేంకటేశ్వర విజయవిలాసములోని "అరవదినాల్గు చందములు గర్భితమైన పద్యమును" గూర్చి చెప్పుచు "బంధ కవిత్వ చిత్ర కవిత్వాదులకు కొన్ని లక్షణములు గన్పట్టుచున్నవి గాని గర్భ కవిత్వాదులకు లక్షణము బొత్తిగ కన్పింపదు...ఈ గ్రంథములోని గర్భిత పద్యములు వ్రాయుటకీ కవి లక్షణ మెట్లుండునని యూహ జేయగలము? అరువదినాలుగు గర్భితములు మాత్రము వ్రాయవలసినట్లు లక్షణముండునా? ఉండదు. కాబట్టి వారి వారి పాండిత్య ప్రాగల్భ్యము ననుసరించి గర్భకవిత్వము వ్రాయవచ్చునని ఊహాజేయుచున్నారము" అని ఆ గ్రంథమునకు పీఠిక వ్రాయుచు పేర్కొనిరి.[9]

చతుర్విధ కవితలను గూర్చి వార్తాకవి రాఘవయ్య తన లక్షణదీపికలో వివరముగా వ్రాసినాడు. చిత్ర కవిత్వమును గూర్చి ఆతడు (1) పాదగోపనంబును, 2) పద్య భ్రమకంబును, 3) నామ గోపనంబును, 4) అనులోమ విలోమ గతి పద్యంబులు, 5) కందగీత గర్భిత వృత్తంబులును, కందద్వయ గర్భిత మణి గణ నికరంబును, క్రౌంచపద గర్భిత కందద్వయంబును, ద్విపద చౌపది లాలి సువ్వాల మంగళహారతులు ధవళంబులు శోభనార్థ చంద్రికాది పదదర్వులాది లయగర్భిత సీసంబులును, 6) కంక పటహ మండూక తురంగనట ఖేరీనినాదనాటక రంగ వృత్తంబులును, 7) ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకర జిహ్వాచలజిహ్వా వృత్తంబులును, 8) వగడ భేదంబులును, తాళగతులును, దండక వృత్తంబులు, 9) అష్టదళ షోడశ దళ ద్వాత్రింశద్దళ పద్మ బంధంబులును, నవావరణ ద్వాదశావరణ చక్ర బంధంబులును, రథనాగద్వినాగ కులాల చక్ర ఆందోళికా ఛత్ర బంధంబులును, గోమూత్రికా పుష్పమాలికా షట్పుగుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల కంకణ సర్వతో భద్ర కవి కల్పిత కల్పవల్లరి నివియాదిగా గల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబుల రచించుటం జేసినది చిత్ర కవిత్వము" అని వ్రాసినాడు.

అప్పకవి సైతము చిత్ర కవిత్వమునిట్లే విపరించుటతోబాటు లక్ష్యములను కూడా ఇచ్చినాడు. వీనిలో అధికాంశము ఛందస్సంబంధితాలు. కొన్ని గణితాంశముల చమత్కృతులు (తలకట్టు ఇత్యాది) కొన్ని అక్షర స్థానాస్యత్వ సంబంధులు (ఓష్ఠ్య

నిరోష్ఠ్యాదులు), కొన్ని శబ్దాలంకార సంబంధులు (భ్రమకాదులు, ఏకాక్షరాదులు), కొన్ని ఆశు కవిత్వ అవధాన కవిత్వ సంబంధులు (ఇచ్చే వాక్య సంఘట్టనాదులు), వార్తాకవి రామయ్య రగడాదులను చిత్ర కవిత్వ సంబంధులుగా పేర్కొనుట చిత్ర మైన విషయము. ఆతడగ్గల భావించెనో తెలియరాదు.

వీటినన్నిటిని పరిశీలించిన ఈ చిత్రకవిత్వము మూడు విధములుగా భావింప వచ్చును.[4] (1) శబ్దాక్షర చిత్రకవిత-ఇది ఛందస్సంబంధిగాదు. (2) బంధ కవిత-పద్మచక్రాది ఆకారములందు సరిపడునట్లు వ్రాయుట. ఇది వ్యస్తసంబంధి. (3) గర్భ కవిత- ఇది గణ సంబంధి.

## (1) శబ్దాక్షర చిత్రకవి :—

ఇందు భ్రమకము, అనులోమ విలోమములు దేశిచ్ఛందస్సంబంధులు.

### అ) భ్రమకము :—

భ్రమకమనగా తలక్రిందులుగా చదివినను రూపుమారకుండుట. 'తోరమూరలో 'రంగనగరం', 'లకోంకోం', 'ఒం బీర బీఒం', 'మందారదామం', 'వికటకవి', 'పంచాస్యచాపం', 'నందనదనం' వంటి పదములు తలక్రిందులుగా వ్రాసినను అట్లే రూపుచెడకుండ ఉండును. ఈ విధానముననే పాదమునకో పద్యమునకో పాటించుట పాట, పద్య భ్రమకములనబడును. ఇవిసాధారణముగా దేశి ఛ్ఛందములందే సాధ్యము దేశి ఛ్ఛందస్సులు గణస్వేచ్ఛ గలవి. మార్గఛ్ఛందములలో ఇట్లులాదుమారు గావించగా గణములు కుదరవు. ప్రత్యక్షరము గురు లఘువులు సరిపోవలెను అనగా ఒక ఉత్పల మాలలో పాదక్రమములో

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 2 3 | 4 5 6 | 7 8 9 | 10 11 12 | 13 14 15 | 16 17 18 | 19 20 |
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |

తలక్రిందులుగా వ్రాసినచో

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 2 3 | 4 5 6 | 7 8 9 | 10 11 12 | 13 14 15 | 16 17 18 | 19 20 |
| U I U | I U I | I U I | I U I | I I U | I U I | I U |

గురులఘు స్థానములు సరిపోవుట లేదుకదా! ఇది మార్గి ఛ్ఛందములలో అసాధ్యము దేశిఛ్ఛందములలో ముఖ్యముగా మాత్రికాసమఛ్ఛందములలో కందాదులలో ఇది సాధ్యము. కనుక ఇది దేశి ఛ్ఛందోగను బంధ చిత్రకవిత అన వచ్చును.

4) ప్రథమాక్షరము దీర్ఘాక్షరమే వాడవలయును. చతుర్థ పాదాంత్యమున అది హ్రస్వ దీర్ఘాంతమ్ముగను ఉపయోగపడును.

5) 1వ, 4వ గణములలోని ప్రాసాక్షరము క్రమముగా వచ్చునట్లే తర్వాతి రెండు పాదములలోని ప్రాసస్థానమున రావలసిన 8, 5వ గణములలో సైతము అదే ప్రాసాక్షరమును చూచుకొని తొలి అర్ధమును వ్రాయవలయును. పైకందములోని ప్రథమార్ధములోని 5, 8వ గణములు "తనయా", "వనదా" అన్నది ప్రాసాక్షరము "న" తో కూడుకొన్నవి. గణము ఏదైనను గణములోని అక్షరములలో ఉపోత్తమ వర్ణము (చివరిదాన్కి ముందు వర్ణము) ప్రాసాక్షరమై ఉండవలయును. దాని క్రింది దైనవది రెండవ స్థానములోనికి రావలయును గదా! "నగ" అనునది తొలివర్ణము, "నల" అనునది మూడవ వర్ణము, ఛ, నదైనచో మధ్యవర్ణము జాగ్రత్తగా పెట్టవలయును.

6) యతిలో క్రమమునందు అనగా ద్వితీయార్థమునందు 5వ,2వ గణములు యతి స్థానీయములు (పై కందము చూడుము) కనుక తొలి అర్ధములోనే 2వ గణాంత్యాక్షరములు సవర్ణమేదా సామాన్య వర్ణములు యతికి సరిపడునవి వాడవలయును. అదియును గణాంతమునందే తప్పక ఉండవలయును. "ఘటనయ" (2వ గణము). "తనయా" (5వ గణము)లలో ఇది చూడవచ్చును. ఇచ్చట 'య' అంత్యాక్షరము, క్రమములో అనగా ఉత్తరార్థములో ఆద్యక్షరమగును. ఇచ్చట హ్రస్వదీర్ఘములను పనిలేదు. స్వరమైత్రి (అఆఐఔ, ఇఈఋౠఎఏ, ఉఊఒఓ) కలిసిన చాలును.

పై నియమములు దృష్టిలో పెట్టుకొని అర్థము చెడకుండ వ్రాసిన పద్యక్రమము అగును. ఇది బహుధా కంద పద్యమునందే కానవచ్చును. తక్కిన దేశి ఛందములలో సూర్యేంద్ర చంద్ర గణవ్యవస్థలో సాధ్యమైనను కందమునకుగల చతుర్మాత్రికా గణవిధానము సులభమైనది. కందములో ఇది పద్యక్రమముతోబాటు అర్ధపాదక్రమము, పాదైకక్రమములు కూడా సాధ్యమే. పాదక్రమములో వేసి గణ సంఖ్యలో ఇది మరింత సులభము. ఇందు జగణ ప్రయోగ నిషేధము లేదు.

## (ఇ) అనులోమ విలోమములు :-

ఇదియును క్రమము వంటిదే. కాని క్రమములో పద్యము తలక్రిందులైనను మారనట్లుగా ఇందు అక్షరములు మారిపోవును. అనగా క్రొత్త పద్యము క్రొత్త అర్థముగా సంక్రమించును. వికట కవి తల క్రిందులుగా వికట కవియే. 'పలక' అం

క్రిందుయుగా "కలప" వనట్లు ఇది ఉండును అట్లయ్యును గణవిధానము, పై ఇతర నియమములు దానివలెనే దీనికుండును.

అనులోమము

| | | | | |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | |
| దామో | దరసా | మతసధ | | |
| 4 | 5 | 6 | 7 | 8 |
| రామా | సరసా | కరదళ | రథహారి | రాధా |
| 9 | 10 | 11 | | |
| రామా | సదయా | రమపర | | |
| 12 | 13 | 14 | 15 | 16 |
| ధామా | పరయా | దమకుల | దారక | రాసా |

(అప్ప కవీయము)

ఇదే విలోమముగా

| | | | | |
|---|---|---|---|---|
| 16 | 15 | 14 | | |
| సారా | కరదా | లకుమద | | |
| 13 | 12 | 11 | 10 | 9 |
| యారప | మాధా | రపమర | యాదస | మారా |
| 8 | 7 | 6 | | |
| ధారా | రిహారథ | ళదరక | | |
| 5 | 4 | 3 | 2 | 1 |
| సారస | మారా | ధసతమ | సారద | మోదా |

చిత్ర కవిత్వములో కవిత్వమంతయు సంస్కృతమయమే. తెలుగు భాష మచ్చునకును రానరాదు. అర్థము కొఱకు వీరాక్షర, నానార్థ నిఘంటువుల ఆశ్రయము ఆవశ్యకము. తెలుగు ఛందముతో తెలుగు కావ్యములలో తెలుగు మాతృభాషగాగల సంస్కృత పండితులు వ్రాసిన సంస్కృత కవిత్వమని చిత్రకవిత్వమును గూర్చి వ్యాఖ్యానించినదోషమేమిలేదు. ఈ శబ్దాలంకార చిత్ర కవిత్వముతోపాటు బంధకవిత్వం గూడ ఇట్టిదే. కొంతవరకింక గర్భకవిత్వములో తెలుగు భాష రానవచ్చును. అదియును క్వాచిత్కమే.

## (2) బంధ కవిత :

[illegible] ఆకారమునకు దగ్గరట్లు వ్రాయబడును. దేశిమార్గి ఛందములందు విషయము యోగ్యమే. విశేషములు లేకుండుటచే వివరింపబడదు.

## (3) గర్భ కవిత :-

గర్భ కవిత గణ సంబంధి. ఒక పద్యములో మరొక పద్యము ఇముడ్చుట గర్భకవిత లక్షణము. పెద్ద పద్యములోని గణములు ఏ ఒక్క ఛందమో లేదా సంపూర్ణ పద్యమో మరొక పద్యముగా (ఛందముగా) రూపాంతరము చెందుట చిత్రమైన అంశము. ఇది సాధారణముగా మార్గిఛ్ఛందములందు చిత్రమైన విషయముకాదు. కారణము అప్పుడు పద్యాంతర ఛందోవిన్యాసములో ఇది సాధ్యమే. 26 అక్షరముల దాక పాదములోని ఎన్ని అక్షరములైనను తీసికొనిన అది ఏదో ఒక ఛందములోని ఏదో ఒక వృత్తమై తీరును. సరసిజ వృత్తమునందు మొదటి మూడు గణములు విడిచిన మణిగణ నికరమగును. వసంత తిలకమున 1వ అక్షరము పాదాంత్య వర్ణ ద్వయము తొలగించిన స్వాగత వృత్తమగును. ఉత్పలమాల మొదటి గురువుకు బదులు రెండు లఘువులుంచిన చంపకమాల అగును అట్లే శార్దూలము మత్తేభమగును. స్రగ్ధరలోని చివరి రెండక్షరములు మొదట చేర్చిన ఆది భుజంగ ప్రయాతమగును. షడ్వింశతివర్ణ వృత్తములో ఇట్లెన్నియైనను సంభవమే. దేశి ఛ్ఛందములందే ఇది విశేషము. పైగా దేశి చ్ఛందములందుగల గణ స్వేచ్ఛ కారణముగా అదిమార్గిఛ్ఛందములనో గర్భితమైనపుడు మరింత చిత్రమైనదిగ తోచును. అధికాంశ గర్భకవిత మార్గిలోని దేశియో, లేదా దేశిలోని మార్గివృత్తమో అగుట కానవగును. అనగా గర్భ కవిత్వమున్నది. ఒక విధముగా మార్గి - దేశి ఛ్ఛందముల మేళనమనవచ్చును.

గర్భకవితకు లక్షణమిట్లుండునని చెప్పరాదు. కవి గణములను పరిశీలించి యతి ప్రాస స్థలములను వదలకుండ ఏ పెద్ద పద్యమున ఏ చిన్న పద్యము ఇముడునో చూడవలయును. అది కవి ప్రతిభకు నిశిత పరిశీలనకు సంబంధించినది. గణపవరపు వేంకటకవి 'ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము'లో చౌషష్టి పద్య గర్భిత సీసమును (808 ప.) పరిశీలించిన ఇన్ని పద్యములు గర్భితమగునని ఏలాక్షణికుడు చెప్పలేదన్నది స్పష్టము. లాక్షణికులు మాత్రము కొన్నిటిని తాము పరిశీలించిన వాటిని గర్భిత శక్తిగల వృత్తములను పేర్కొనినారు.

అప్పకవి తన గ్రంథమునందు

సీ. గాంగేయ కౌశేయ ఘనకంద గీత స
ద్గర్భ చంపక మాలికయు పరిష్క
కంద పద్య ద్వయ కమలం విలసితరు
గ్మపరి కా గర్భిత క్రౌంచపదము
గీత మత్తేభ విక్రీడితం బంప గ
ర్భంబు సీసమునందు షడ్వృత్త గర్భ
రోత్పల మాలికయును సుకల్పిత కల్ప
వల్లియు సీసరూ పద్మపదయు
స్రగ్విణీ గర్భ భుజంగ ప్రయాతంబు
కంద గర్భిత మణిగణ నికరము
కవిత చతుర్విధ కంద పద్యము నష్ట
విధ కందములు బంచ విధసువృత్త
మాదిగా గల కొన్ని పద్యములు పెక్కు
సరవి పద్యము లిట్టి దోషములు లేక
కానవచ్చిన నవియెల్ల గర్భకవిత
ధరణి నొప్పారు నీరీతి దనరి కృష్ణ! (IV-594)

అని గర్భకవిత్వమునకు సాధ్యపడు ఛందములను పేర్కొని పదికి పైగా లక్ష్యముల నిచ్చినాడు.

ఇవిగాక గీతి గర్భిత ఉత్పలమాల, కంద గర్భిత సరసిజ, మత్తేభ గర్భిత సీసము వంటివి పెక్కులు వ్రాయవచ్చును. నన్నెచోడుని కుమార సంభవములో 'మురిసెడి రూపులున్' అన్న పద్యము (11-129)న త్రివిధాక్కరయున్న నని దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారనినారు.[5] గర్భకవిత వ్రాయునపుడు కవులు పైన పద్యమునకు ముందు వివరముగా చెప్పుదురు. ఇచ్చట అట్టి సంప్రదాయము పాటింపబడలేదు. ఇది యాదృచ్ఛికమేమో.

(1)పెద్దన ముకుంద విలాసములో వృత్తకంద గర్భిత సీసము, ద్విపద, చౌపద, లాలీ, శోభన, మంగళారతి సువ్వాల ధవళాది వివిధ పదచ్ఛంద

గర్భిత సీసము, కంద ద్వయ గర్భిత చంపకమాలావృత్తము. (2) కనుపర్తి అబ్బయామాత్యుని కవిరాజ మనోరంజనములో కంద ద్వయ చంద్రపతి కమలం విలసిత గర్భ క్రౌంచపద వృత్తము; (3) భట్టుమూర్తి నరసభూపాలీయములోని వృత్తకంద గర్భిత సీసము; (4) పారిజాతాపహరణమున మత్తేభ మణిగణ నికరవృత్త ద్వయ గర్భిత సీసము, కంద పద్య గర్భిత చంపకము; (5) సూరయ వెంగన గారి రామరాజీయమున ద్వికంద గర్భ క్రౌంచ పద వృత్తము; (6) కూచిమంచి తిమ్మన రసికజన మనోభిరామమున కంద గర్భిత మణిగణ నికరము, స్రగ్విణీ భుజంగ ప్రయాత ద్రుతవిలంబిత గర్భిత సీసము సగర్భ మత్తేభ కంద సీసము; (7) పిండిప్రోలు లక్ష్మణకవి లంకా విజయమున కంద గర్భ మణిగణ నికరము; (8) అడిదము సూరకవి కవిజన రంజనము నందు చతుర్విధ కంద గర్భిత మణిగణ నికరము చతుర్విధ కంద గర్భిత ప్రమితాక్షర వృత్తము; (9) ముప్ప వేంకట కవిగారి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచనకుశరాట్చరిత్రమున కంద గర్భ చంపకమాల; (10) కంకంటి పాపరాజుగారి ఉత్తర రామాయణమున మత్తేభ గర్భిత సీసము; (11) నంది, ఘంట జంట కవుల ప్రబోధ చంద్రోదయమున కంద గర్భిత మణిగణ నికరము; (12) పుష్పగిరి తిమ్మన సమీర కుమార విజయమున కందగర్భిత శార్దూలము, కందగర్భిత మణిగణ నికరము, కంద ద్వయ గర్భిత సరసిజ వృత్తము, కంద ద్వయ గర్భిత భాస్కర విలసితము, మత్తేభ కంద గర్భిత సీసము; - మున్నగునవి గర్భ వృత్త ప్రయోగములు.[6]

ఇక చిత్ర కవిత్వమునకు ఆంధ్ర సాహిత్యమునందే శిఖరాయమానమైన గణపవరపు వేంకటకవి (17వ శ.) ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము నందు 808వ పద్యము సీసము నందు 64 బంధములున్నవి. వానిలో గర్భిత పద్యములు 41. బంధములు 20 + అనులోమ విలోమాదులు 3 = మొత్తము 64. అనగా ఈ పద్యములో చిత్రకవితా భేదములైన శబ్దాలంకార, బంధ, గర్భ కవితలు మూడు చెప్పబడియున్న మాట. 41 పద్యములు గర్భితమైన పద్యము ఆంధ్ర సాహిత్యములో ఇది ఒక్కటియే. ఆ పద్యమునందే సైతము పదబంధములుండుట విశేషమైన అంశము. కవి చెప్పకున్నచో గర్భిత పద్యములు శోధించుట కష్టమయ్యెడిదే. సీసముపై గీతిని కూడా ఇముడ్చుటను స్వీకరించుట ఇందలి విశేషము. సర్వపాదములు మార్గ వృత్తములలోపల ఒకే గణక్రమము కల్గియుండుట (ఛ, భ, సల, సగ, సల

ఘ, సః); వృత్తములలో నిది ప్రాస (వృత్త ప్రాస సీసము షట్పాదములు) పాదములు, సర్వలఘు గీతము ఇందలి మరి కొన్ని విశేషములు.

సారాగ్ర్య సారస సమనేత్ర యుగళ వా
　　రదరుచి వాంఛిత రఘుప పనిర
సారాగ ధీర విరద వీర తురగ రై
　　వఘన జైత్రతట సురవరణ
సారాది హార విసర చారణ హరిసా
　　రసహిత చంద్రదశరథ జయసుర
వారాశి నారద వరపూజిత పద గౌ
　　రవకటి బద్ధ గరళ గళ సఖ
హరిసగ నిలయ గిరిధర యసుర దళన
మణిమయ మకుట సురమణి మధు విశరణ
కరి వరదకు వరరుచిరతర వసన స
రహరి లసిత దరనిగమ విహరణ హరి.

ఇందలి గర్భిత దేశి పద్యములు (1) ద్విపద, (2,3) కందములు రెండు, (4,5) మహాసవమి చౌపదులు రెండు, (6) ఆట వెలది, (7) తేటగీతి, (8) అష్టకము, (9) ధవళము, (10) శోభాన, (11) హారతి, (12) ఝంపె, (13) త్రిపుట రేకులు, (14) అర్ధ చంద్రిక, (15) సువ్వాల, (16) లాలి, (17) ఏల, (18) మంజరి, (19) తురగ వల్గన రగడ, (20) ఉత్కళికార్థము, (21) ఉత్కళికార్థము, (22,23,24,25,26,27,28,29) దరువులు ఎనిమిది, (30,31,32) చిత్రకందములు తిరిగి మూడు, (33) గీతిలోని కందము, (34) గీతిలోని ఆట వెలది గాక తక్కిన 7 విధములగు మార్గ వృత్తములు మొత్తము 41 ఇందు గర్భితములు.

**చతుర్విధ, అష్టవిధ కందములు :-**

గర్భ కవితలో దేశి ఛందముగా కందమునకు విశిష్ట స్థానమున్నది. అను లోమాదులకు వాడుకొన్నట్లే గర్భకవితలో కందమును లాక్షణికులను వాడుకొన్నారు. పొత్తపి రమణకవి కంద భేదములలో ద్వివిధ కందము మొదలుగా వివిధ చిత్ర కవిత్వపు పోకడలను కంద భేదములుగా పేర్కొనినాడు.[7]

2వ కందము— పై కందములోని దీర్ఘపాద (ద్వితీయపాద) ద్వితీయ గణముతో ప్రారంభించి తిరిగి అంతవరకు వ్రాయవలయును. అనగా పై 5వ గణముతో పద్యము ప్రారంభమై, 4వ గణముతో ముగియునన్నమాట.

5 6 7
ఖగరా జగమన నతదే
8 9 10 11 12
వగణా కుందా ఖరదన వరదము కుందా
13 14 15
అగణిత చరిత్ర గురుతర
16 1 2 3 4
సుగుణా నందా త్మజాత సుజనా నందా

3వ కందము— పై కందములో దీర్ఘపాద ద్వితీయ గణము (కుందా)తో ప్రారంభించి తిరిగి అంతవరకు రాపలయును.

9 10 11
కుందా ఖరదన వరదము
12 13 14 15 16
కుందా అగణిత చరిత్ర గురుతర సుగుణా
1 2 3
నందా త్మజాత సుజనా
4 5 6 7 8
నందా ఖగరాజ గమన నతదే వగణా

4వ కందము- పై కందములో దీర్ఘ పాద ద్వితీయగణము (అగణిత)తో ప్రారంభించి తిరిగి అంతవరకు రావలయును.

13 14 15
అగణిత చరిత్ర గురుతర
16 1 2 3 4
సుగుణా నందా త్మజాత సుజనా నందా
5 6 7
ఖగరా జగమన నతదే
8 9 10 11 12
వగణా కుంధా ఖరదన వరధము కుంధా

పై చతుర్విధ కందమును పరిశీలించిన ఈ క్రింది అంశములు (లక్షణము లుగా) క్రోడీకరింపవచ్చును.

(అ) 1వ, 5వ, 9వ, 13వ గణములు ప్రారంభ గణములుగా 4 కందములు సిద్ధమగును.

(ఆ) 5వ, 8వ, 13వ, 16వ గణముల ద్వితీయాక్షరములు ఒక ప్రాసాక్షరముతో
1వ, 4వ, 9వ, 12వ గణముల ద్వితీయాక్షరములు ఒక ప్రాసాక్షరముతో
సంధింపవలయును.

(ఇ) 4వ, 7వ గణములకు; 12వ, 15వ గణములకు | గణాద్యక్షరములకు
8వ, 11వ గణములకు; 3వ, 16వ గణములకు | యతి సంధింపవలెను.

(ఈ) 1వ కందము యొక్క పూర్వోత్తరార్ధములు 3వ కందము యొక్క ఉత్తర పూర్వార్ధములుగా, 2వ కందము యొక్క పూర్వోత్తరార్ధముల వ్యుత్క్రమమున 4వ కందము యొక్క ఉత్తర పూర్వార్ధములుగా సంఘటిల్లును.

(ఉ) ప్రతిపాదాది గణము, సరిపాదముల చివర గుర్వంత గణము అనగా గగ, స గణములలో ఏదో ఒకటి ఉండవలయును.

(ఊ) బేసి పాదముల రెండవ గణము నల|జ లలో ఏదో ఒకటి ఉండవలయును. నలగణమున్నచో నలచతుష్కందమని జగణమే ఉన్నచో జగణ చతుష్కందమని పిలువబడును ఇది షష్ఠ స్థానమునకు వచ్చునట్లై వేయబడును. చిత్రకవి పెద్దన, పొత్తపి రఘునకవి మొ॥ వారు ఈ కందములను రెంటిని కందభేదములుగా చెప్పినారు. (వీనిని కందభేదములుగా భావింపకుండుటచే గర్భ కవిత్వ సంబంధియగుటచే అక్కడ "కందమన్న భాగమున" వ్రాయబడలేదు).

అష్ట విధ కందమునకు అప్పకవి లక్షణము చెప్పినాడు.

రెండేసి గణంబులపై
నుండిన గణమాదిగాగ నొనరగ జదువన్
ఖండిత సౌభర ఘోటకీ
తాండజ యష్టవిధ కంద మనగా బరగున్ (4–631)

2 గణములు దాటి 8 విధముల కందములగును. అనగా 3వ, 5వ, 7వ, 9వ, 11వ, 13వ, 15వ, 1వ గణారంభములతో మొత్తము 8 కందము లగు నన్నమాట.

| 1 | 2 | 3 | | |
|---|---|---|---|---|
| తనకిరు | గెలనను | కనలుచు | | |
| 4 | 5 | 6 | 7 | 8 |
| గొనబయి | గిలిపెడు | కనుగొలు | కులదగు | బెలుచన్ |
| 9 | 10 | 11 | | |
| ఘనులను | గలయం | బెనకువ | | |
| 12 | 13 | 14 | 15 | 16 |
| గనుచుం | గలుముల | దనిపెను | ఖలుశ్చం | ఖలమై |

(4-631)

ద్వితీయ కందము కనలుచు అన్న 3వ గణముతో

తృతీయ ,, గిలిపెడు అన్న 5వ ,,
చతుర్ధ ,, కులదగు అన్న 7వ ,,
పంచమ ,, ఘనులను అన్న 9వ ,,
షష్ఠ ,, పెనకువ అన్న 11వ ,,
సప్తమ ,, కలుముల అన్న 13వ ,,
అష్టమ ,, ఖలుశ్చం అన్న 15వ ,, ప్రారంభమగును.

(i) 1వ, 4వ, 9వ, 12వ గణమునకు
(ii) 3వ, 6వ, 11వ, 14వ గణమునకు
(iii) 5వ, 8వ, 13వ, 16వ గణమునకు
(iv) 7వ, 10వ, 15వ, 2వ గణమునకు
} ద్వితీయాక్షరము ప్రాస పాటింప వలయును.

i) 4వ – 7వ గణముల
ii) 12వ – 15వ ,,
iii) 6వ – 9వ ,,
iv) 14వ – 1వ ,,
v) 8వ – 11వ ,,
vi) 16వ – 3వ ,,
vii) 10వ – 13వ ,,
viii) 2వ – 5వ ,,
} అద్యాక్షరములకు యతి పాటింప వలయును.

మొదటి నాలుగు కందములలోని ఉభయార్ధములే, తర్వాతి నాలుగు కందములలోనికి వ్యుత్క్రమమున ఉభయార్ధములు చతుర్విధ కందములలోవలె అగును. ఇట్టి అష్టవిధ కందము కవి ప్రయోగములో కానరాదు.

ఇట్లు గర్భకవిత సంస్కృత భాషలో కానరాక తెలుగువారి స్వంతమై,

స్వతంత్రమై, వైచిత్రీప్రియతా సూచకమై, మార్గిదేశి సంగమమై వరలినది.

బంధ కవిత్వము దేశి ఛందస్సంబంధిగాదు. చక్ర గో మూత్రికాష్ట దళ పద్మ నాగబంధాదులలో వ్రాయబడు పద్యములు మార్గి వృత్తములు, మీదు మిక్కిలి తెలుగు పదములు మచ్చుకైనను కానరానివి.

చిత్రకవిత్వమంతయు రసస్ఫూర్తి కొఱకుగాక వైచిత్రీ ప్రియత్వమునకు పాండిత్య ప్రకర్షకు, కవి మేధశ్శక్తికి సాక్ష్యముగా నిలచినది. దీనివలన సాహిత్యమునకు గలుగు ప్రయోజనమేమియులేదు. ఆంధ్ర సాహిత్య చరిత్రలో పండిపెద్ది కృష్ణస్వామి ప్రణీతమని ప్రఖ్యాతమైన "బిల్హణీయ" కావ్యము చక్రబంధ కారణముగా (షష్ఠా వృత్తిలోని అక్షరములను పేర్చగా, చిత్రకవి సింగరాచార్యులు వ్రాసిరన్న విషయమును వెలికి తీసి పెట్టినది ఇట్టిదొక ప్రయోజనము.

కాని ఛందో మార్గమును భంగమొనర్చి భాషా ప్రపంచకి చెలియలి కట్టయై, మేటిస్సూరు విపరీత క్రమము ఆపాదించునదై, నిరర్థకమన్నదే అత్యధికుల అభిప్రాయము.

## అధఃసూచికలు

1. ఆంధ్ర గీర్వాణ ఛందము – **C. P.** బ్రౌన్ పు. 77.
2. కుమార సంభవము (వావిళ్ళ ప్ర.) – పీఠిక – నిడుదవోలు వేం. రా.
3. తెలుగు ఛందో వికాసము పు. 222
4. తె. బా, సం. **రీ.** – రావూరి దొరసామి శర్మ
5. **భారతి, 1948** (11 సంచిక)
6. వేదం వెంకటరాయశాస్త్రి (ఎం.ఏ) గారు ప్ర. రా. వేం. వి. పీఠికలో ఇచ్చినవి. పు. 33 నుండి 36 వరకు.
7. లక్షణ శిరోమణి పు. 194
8. గ్రంథాంత అనుబంధము **III** లో చూచునది.
9. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర – ఆచార్య ఎస్. వి. జోగారావుగారు పు. 266

# ఆధునిక యుగములో దేశి చ్ఛందస్సుల రూపురేఖలు

దేశమునందు ఆంగ్ల భాషా జ్ఞానము అధికమైన కొలది భారతీయ భాష లలో సాహిత్య శాఖలలో పలు మార్పులు ప్రవేశ పెట్టబడినవి. తెలుగులో సైతము కావ్య వాఙ్మయములో ప్రబంధ ధోరణి వీడి భావ, భావములో సంక్షిప్తత, నైశిత్యము, నవ్యత్వము రాజొచ్చినవి. ఇక్కడి నుండి ఆధునిక యుగము ప్రారంభమైనదన వచ్చును. భారతీయ భాషలలో సైతము పాండిత్యము సంపాదించిన తెలుగువారు సోదర భాషలలోని సాహిత్య నవ్యత్వము ప్రేరణగా కావ్యములు వ్రాయ జొచ్చిరి. 19వ శతాబ్ది ఉత్తరార్ధమే దీనికి సరియైన కాలమైనను తెలుగు కవిత్వములో ఛంద స్సులో నవ్యత్వము గురజాడ నుండియే స్వీకరింపబడెను.

## (అ) దేశిచ్ఛందస్సుల ప్రయోగ బాహుళ్యము

భావ వ్యావహారికమై, భావము సంక్షిప్తము, స్నిగ్ధమై వ్యక్తీకరణలో నైశిత్యము హెచ్చిన కొలది తెలుగునాట ఛందః ప్రయోగములో దేశీయత్వము ప్రాబల్యము హెచ్చినది. గురజాడ గేయ సౌందర్యమునకు ముగ్ధుడై, పాటలను మాత్రా ఛందస్సులను ప్రవేశపెట్టినాడు. ఆతని తర్వాత గేయము యొక్క ప్రాధాన్యము తగ్గినను, భావకవులు ఉపజాతి (దేశి) ఛందములను వాడ జొచ్చిరి. భావకవులు తేట గీతి ప్రయోగమును అధికము గావించినారనవచ్చును. భావకవులకు నవ్యత్వముతో బాటు ప్రయోగ ప్రియత్వము హెచ్చినది.

ఆధునిక యుగమున యతి ప్రాసల నిర్బంధము లేని ఉపజాతి ఛంద ములు, గేయ ఛందమైన ద్విపద, లయబద్ధమైన మాత్రా ఛందస్సులు, రగడలు మిక్కిలిగా ఉపయోగము లోనికి వచ్చినవి. పాదాంత విచ్ఛేదముతో ఏ పాదమున కాపాదము తెగిపోవుట, యతి ప్రాసల నిర్బంధము వీడుట, గణముల ప్రయోగ ములో స్వేచ్ఛ, భావమాగిన చోట్ల పద్యము (ఛందము ముగియకున్నను) ముగిం చుట మున్నగు ఛందో మౌలికస్వరూపమునుపరిరక్షించుమార్పులు తీసికొనిరాబడినవి.

## (ఆ) ఆధునిక యుగములోని ఛందో నవ్యత :-

దీనిని మూడు విధములుగా వర్గీకరింపవచ్చును.

**(I)** పాత ఛందములలో నవ్యతాపాదనము.

**(II)** కొత్త ఛందముల సృష్టి.

**(III)** ఛందో రహిత వచన పద్యము.

## 1. నవ్యతాపాదనము :-

**A)** ప్రసిద్ధమైన పాత పద్యములలో యతిప్రాసలు నిర్బంధములుగా భావింపబడి తొలగింపబడినవి. దీనికి కారణము సంస్కృత చ్ఛందస్సులలో సదృశాక్షరయతి, ద్వితీయాక్షర ప్రాస నిర్బంధము లేక రచనా సౌలభ్యముండుట గమనింపబడినది. అక్కడ సౌలభ్యమును గుర్తించి ఆధునిక కవులు నవ్యతాప్రియులై కరాడ్లుగా వచ్చుచున్న యతి ప్రాసలను తొలగించి రనవచ్చును. రాయప్రోలు సుబ్బారావుగారు దూత పత్త్రేభమన్న గ్రంథమున మత్తేభవిక్రీడితములు యతి ప్రాసలు లేకుండ వ్రాసినారు[1]. అనగా దేశిచ్ఛందస్సులలోని సౌలభ్యము మార్గి వృత్తముల కాపాదింపబడినదన్న మాట. సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి పద్యము లిదివరకే సూచింపబడెను.

**(B)** మాత్రాఛందస్సుల ప్రయోగము:- ఆధునిక కవిత్వములో గణ నిర్బంధము నుండి మాత్రా ఛందస్సుల స్వేచ్ఛారచనము అధికమైనది. దేశి జాత్యుపజాతుల కన్నను వీని ప్రయోగము ఎక్కువగనే ఉన్నది. భావ కవితాయుగము ఉపజాతులది కాగా తర్వాతి అభ్యుదయ కవిత్వమంతయు మాత్రా చందో ప్రయోగమే యెక్కుటముగా గలది. ఈ స్థితి విప్లవ కవిత్వము వచ్చి వచన కవిత్వము ప్రబలు వరకు అత్యధికముగా నున్నది. వచన కవులు సైతము కవితల మధ్యలలో వీలున్నచోట్ల సమమాత్రలతో పాదములు నడిపినారు. "గణ బద్ధాలు కృత్రిమ ఛందస్సులనీ, నైసర్గిక గమనం లయ వల్లనే నిరూపమవుతుందనీ కావున మాత్రా ఛందస్సులు స్వాభావికమైనవని నేను విశ్వసిస్తున్నాను" అని చెప్పిన శ్రీశ్రీ మాటలు నాటి కవుల అభిప్రాయమునను దర్పణము వంటివి. [2]

**(C)** పాద సంఖ్యలో ఎక్కువ తక్కువలు కూడా నవ్యవిధానమే. ప్రసిద్ధమైన చతుష్పాద వ్యవస్థ కల దేశి పద్యములందు అవసరమున్న మేరకు పద్యము వ్రాసి అది ఏపాదములో అంతమైనచో అక్కడికే పద్యమును వదిలివేయుటయన్నది.

ఇది ముఖ్యముగా భావకవితా యుగమునందలిది. ఇది ఒక రకముగా మంచి లక్షణము ప్రాచీన కాలమున చతుష్పాద వ్యవస్థ నియతమై, భావము ముగిసినను నాలుగు పాదములు ముగియుటకు వ్యర్థపదములతో నింపుచున్నది పద్ధతి. దానిని నవ్య యుగపు కవులు తొలగించినారు. పాద సంఖ్యతోబాటు పాదము కూడ పూర్తి చేయక మధ్యలో వదలి వేయుట వంటివి భావకవులు గావించినారు. పాదమును మధ్యలో నుండి ప్రారంభించుటయన్నది వేరొక విధానము. వీటికి కృష్ణశాస్త్రి కృష్ణ పక్షము వంటి కావ్యములలో ఉదాహరణలు గలవు. [3]

**(D)** గేయముల ప్రాచుర్యము ఆధునిక యుగమునందు ఎక్కువైనది. గురజాడ అప్పారావు పంతులుగారు దీనికి ఆద్యుడనవచ్చును. ఆయన గేయ కవితా విప్లవము తర్వాతి భావకవులకు మార్గదర్శకము కాలేకున్నను, కవులు నైతము గేయమునకు తక్కిన ఛందములకు వలెనే ప్రాధాన్యము నిచ్చినారు. గురజాడ, అతని తర్వాత అతని అడుగు జాడలో నడచిన బసవరాజు అప్పారావు, తర్వాతి నండూరి సుబ్బారావు గేయకవులుగానే ప్రసిద్ధి గాంచినారు. వారితో బాటు కిన్నెరసాని పాటతో విశ్వనాథ, పెన్నేటి పాటతో విశ్వం, శివతాండవముతో పుట్టపర్తివారు, పెనుగొండ పాటతో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు, కర్పూర వసంత రాయని కళాకాంక్ష గానముతో సి. నారాయణరెడ్డి ప్రభృతులు గేయకవులుగా ప్రసిద్ధి గాంచినారు. చింతచింత నడకలతో, అచ్చమైన తెలుగు భాషా మాధుర్యముతో గేయమునకు పట్టము కట్టి నవ్యాంధ్రకవులు వన్నె కెక్కినారు. తమ కావ్యములను స్వీయ గానముతో సభల నారట్టుకొనినారు. శ్రీశ్రీ, సి.నా.రె.లు తమ గేయములను, గేయ కావ్యములను తమ స్వంతగొంతుకతోపాడి శబ్ద గ్రహణ యంత్రములలో శాశ్వత మొనర్చినారు. 20వ శతాబ్దారంభమునందలి నాటకములలోని పాటలు, తర్వాత వచ్చిన చలనచిత్రములు, గేయ కవులకు ఊపిరిపోసినవి. చలన చిత్రములలో జానపద గేయములు, గేయసరణులు చోటు చేసికొని జనజిహ్వాగ్రముల నాట్యమాడినవి. చలన చిత్ర గేయములనే పలువురు గేయకవులు గేయ కవితా సంపుటులుగా అచ్చు వేయించినారన్నచో గేయమునకు నవ్యాంధ్రకవులిచ్చిన ప్రాధాన్యమునుచక్కగా నిర్ధరింపవచ్చును.[4] నవ్యాంధ్రకవుల గేయ వాఙ్మయమును పరిశీలింతుమేని, వాని నడకలు, వాటికిగల జనాదరణనుబట్టి గేయము బతికి నన్నాళ్ళు ఛందస్సు(నడకలు) బతుకునని భావింపవచ్చును.

## 2. కొత్త ఛందముల సృష్టి :

ప్రాచ్యప్రాచీన పద్యములలో ప్రసిద్ధమైన వానిని అనుసరించుచు ఆధునికయుగమున కవులు కొత్త ఛందములు వెలయింపజేసినారు. అట్టివారిలో కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు ముఖ్యులు. వీరు తమ బిల్వేశ్వరీయమున తేటగీతి పాదమున కొక చంద్ర గణమును చేర్చి 'రేటి' యన్న ఛందమును, ఆట వెలది సరిపాద లక్షణముతో నాల్గు పాదములు, రెండు బేసి పాదలక్షణముతోనే నలుగు పాదములు వ్రాసి ప్రతి పాదాంతమున చంద్రగణము చేర్చి 'రేటిబోటి' యన్న ఛందమును సీస పాదము చివర చంద్రగణమును చేర్చి నాల్గు పాదములు పిదప ఎత్తుగీతిగా పై 'రేటి' లేదా 'రేటిబోటి' చేర్చి 'బంగారము' అన్న పద్యమును, ఆటవెలది నాల్గు పాదముల చివరనొక చంద్రగణమునుచేర్చి 'ఆటబోటి' అన్న ఛందమును సృష్టించిరి. ఇవన్నియు చంద్రగణమును చేర్చి కూర్చినవి. పై 'బంగారము' మీద సాధారణ ఆటవెలది లేక తేటగీతి వ్రాసిన 'వెండి' యన్న ఛందమును కూర్చిరి. కందములలో మాకందము (పథ్యాకంద లక్షణములో షష్ఠస్థాన జగణము కలది), రమాకందము (సమ పాదములలో మొదట జగణ నియమములేని చపలాకందము), మహాకందము (రెండు కందములో నుండు ప్రాసపూర్వాక్షర గురులతో నియమము లేనిది) వంటి ఛందములను సృష్టించిరి. ఆధునిక యుగములో నవ్యాంధ్రకవులలో సి. నా. రె. గారు కొక్కొండ వారివలెనే మాకందములు వ్రాసిరిగాని అవి పై లక్షణమునకుగాక కురుచ పాదములు (3 గణములవి) రెండు వరుసగా, దీర్ఘ పాదములు (5 గణములవి) రెండు వరుసలు వరుసలుగా వ్రాసిన సాధారణ కందములే. అంతే తప్ప కొక్కొండవారు లక్ష్యలక్షణ సహితముగా బిల్వేశ్వరీయములో చూపిన నవ్యచ్ఛందముల తర్వాత వారు స్వీకరింపలేదు.

నవ్య చ్ఛందముగా భావింప జాలకున్నను గురజాడవారి 'ముత్యాలసరము' పేరొక్క దానిని ఇట్టివానిలో చేర్చదగును. పాదమునకు 14 మాత్రలతో, 4 పాదములు వ్రాసిన మిశ్రగతిలో నడచు గేయ చ్ఛందమిది. చివరి పాదములో మాత్రము 7 నుండి 14 మాత్రల వరకెన్నైనను ఉండవచ్చును. ఇది పార్శీ గజల్ నడకనాధారముగాని గురజాడ వారు రాసినట్లు చెప్పికొన్నను ఇది హరిణ గతి రగడగనో, భామినీ షట్పది యొక్క అర్ధ భాగముగనో గ్రహింపవచ్చును. ఈ ముత్యాలసరము గురజాడవారే అన్నట్లు కొత్తపాత ఛందముల మేలు కలయికగా భావింపవచ్చును. దీనిని తర్వాత రాయప్రోలు, శివశంకరశాస్త్రి, కొడవటిగంటి,

విశ్వనాథ, అబ్బూరి రామకృష్ణారావు, కృష్ణశాస్త్రి వంటి కవులుపాడుకొని దానికి స్థిరగమనము నాపాదించినారు.

ఇట్లే పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు తమ ఆంధ్ర ధ్వన్యాలోకములో కలువతీగె, బంగారు గొలుసు, కెన్నెల, చామంతి మున్నగు పేర్లతో మాత్రా ఛందస్సులను వాడినారు, ఇవన్నియు ఏదో ఒక విధముగా రగడలలో అంతర్భవింప జేయవచ్చును.

ఇట్లు దేశిచ్ఛందము ఆధునిక కవితలో సౌలభ్యముతో బాటు నవ్యతాప్రీతిచే గొనిరాబడి వింత ప్రయోగములకు నెలవైనది.

**(3) వచన పద్యము :-**

ఆంగ్ల భాషా ప్రభావము వలన ఛందస్సు కవిత్వమునకు అక్కరలేదన్న భావము బలపడి కవిత వచనములో వ్రాయుట ప్రారంభమైనది. ఇది తెలుగులో విప్లవ కవితా యుగముతో ప్రారంభమైన దనవచ్చు. దీనికి వచన పద్యము అన్న పేరుంచుటలో, లాక్షణీకరించుటలో ఛందో విమర్శకులు, భాషా శాస్త్రజ్ఞులు పెక్కు తీరుల ప్రయత్నించినారు.[6] వచనమును పద్యమనుటలో పేరు విశేషముగా కన్పట్టినను అక్షరగణ, మాత్రాగణ, పాదసంఖ్యాదులు లేని ఇట్టి కవిత వ్యాసము వ్రాసిన విధముగా గాక అర్థవంతమైన పాదముల ప్రమాణముతో, పాదాంత విచ్ఛేదముతో, భావవ్యక్తీకరణకొరకు వింత శైలిని ఆపాదించునది. సమకాలములో పాటింపబడి, తద్వారా వ్యక్తమగు ఛందస్సంబంధియగు లయ మాత్రము ఇందు మచ్చుకైనను కానరాదు.

ఇట్లు ఆధునికయుగమందు దేశిచ్ఛందముల ప్రయోగము ప్రాచీన కాలమున కన్న అధికమై, కవ్యుక్తి సహకారియై భాసించినది. భావ వ్యక్తీకరణకు ఛందమే పని లేదన్న అత్యంతాధునిక ఆంధ్రకవి భావికాలములో వ్యక్తీకరణ విధానములో మరెన్ని పోకడలు పోగలడో ఊహింపలేము.

## అథస్సూచికలు

1. భారతి-డిశం. 1957 నుండి మార్చి 1958 సంచికలో ప్రచురితము
2. శ్రీశ్రీ - సాహిత్యము - వచన విభాగము (II), పు. 432
3. తెలుగు ఛందో వికాసము - కోవెల సంపత్కుమారాచార్య పు. 275
4. సి. నా. రె. (పగలే వెన్నెల), ఆరుద్ర (కొండగాలి తిరిగింది), శ్రీశ్రీ (పాడవోయి భారతీయుడా!) ఇట్టివారు
5. వ్యాస చంద్రిక - గురజాడ పు. 25
6. కోవెల సంపత్కుమార, చేకూరి రామారావు గారల లాక్షణీకరణ వ్యాసముల సంకలనముగా 'వచన పద్యం' అన్న గ్రంథము వెల్వడినది.

* * *

# సింహావలోకనము

ప్రాఙ్నన్నయ యుగపు శాసనములు నాటినాటి దేశి ఛ్ఛందో ప్రయోగ బాహుళ్యమునకు సాక్ష్యములై నిలిచినవి. మధ్య యుగములలో సైతము కవులు తమ చంపూ కావ్యములందు సంస్కృత పురాణకావ్యమార్గమున నడచెనను, మార్గివృత్తము లను ద్విగుణీకృతముగా దేశి ఛ్ఛందములను ప్రయోగించినారు. ఆధునిక యుగపు ఆంధ్ర కవులు ప్రయోగించిన దేశి ఛ్ఛందములు తిరిగి పూర్వ ప్రాభవమును గడించు కొన్నావని భావింపవచ్చును.

లాక్షణికుల చేతిలో దేశి ఛ్ఛందములు తమగేయత్వమును వీడి, వింతరూపము సంతరించుకొన్న విధము, ద్విగుణీకృత ప్రయుక్తములైన దేశిఛ్ఛందములనుసైతము కవులు మార్గ సంప్రదాయాను సంధానము చేసిన విధానము, తెలుగు సాహిత్యములో వివిధ దేశి ఛ్ఛందములు తమ స్థానమును స్థిరపరచుకున్న వైనము, కాలగర్భములో జారిపోయిన క్వాచిత్క దేశి ఛ్ఛందో క్రమము ఈ గ్రంథమున అవతరణ వికాసము లన్న పేర కాలక్రమాను గత విధానముతో కవి లాక్షణిక ప్రయోగ సాయమున విపులముగా చర్చించబడినది.

గేయ మాతృకలై, సంస్కృత భిన్నములై, సహజ స్నిగ్ధములై, సోదర ద్రావిడ భాషాసామ్యముగల దేశి ఛ్ఛందస్సుల విలువను గుర్తించి, గౌరవించుట సర్వాంధ్ర సాహిత్యజ్ఞుల కర్తవ్యము. లేనిచో దేశి సాహిత్యపు ఇంపుసొంపులు, భావి తరముల తెలుగువారికి అందని మ్రాని పండ్లు కాగలవు. దేశి ఛ్ఛందముల వన్నె చిన్నెలు పాలుకురికి మున్నగువారు మనకందించగా తెలుగు గుండెలలో భద్రమైనవి కదా !

# అనుబంధము I
## చౌపదలు

సతత భక్తియుత సన్ముని జాలా
కృతనుతులను రాగిలు పృధుశీలా
కృతయుగమునను సుకృతమయి లీలా
క్షితి వృషగిరి యన జెలగును జాలా

సీతావరు డూర్జితముగ జేరున్
రతి గనిన దారిన్ బొల్పారున్
త్రేతను హరిని ధరించిన చారున్
ఖ్యాతిని గరుడ నగంబున మీరున్

వెంయు జవ్వనపు త్రేతల పొందు
గలిగిన కృష్ణుని కతలెందెందు
దశము కొగనగు ద్వాపరమందు
నం శేషాచలమున జెలువొందు

కలియుగమున జేకొన్కల నలరు
గొంచి యిచ్చున కోర్కలందిసి సిరులు
బలువిడి నొసగెడు బహువైఖరులు
నలువుగ వేంకట నగమున వడలు

— ప్రబం. రా. వేం. వి. విలాసము ౩6 స పు. ౩1

# అనుబంధము II
## త్రిభంగులు

గురుమత సహితులు - దురిత విరహితులు
సురుచిర సజ్జన పర్తుల్ ధృవకీర్తుల్ శాంత సుమూర్తుల్

పంహృత వికృతులు - నిరవధి సుకృతులు
మరణ పునర్భవ కూడల్ సువిచారుల్ భక్తి విచారుల్

౭]

పరమ హృదయులు - నిరుపమ సదయులు
పరసమయప్రవిఘాలుర్ గుణశీలుర్ దాససుశీలుర్

పరహిత చరితులు - పరగుణ భరితులు
పరమ పరాద్యను షక్తుర్ శివభక్తుర్ శాంతి నియుక్తుర్

— అనుభవసారము (పాలుకురికి సోమన) 194 పద్యము

# అనుబంధము III

## చతుర్విధ కంధములు

1) నన్నెచోడుని కుమార సంభవములోనిది (XII 217)

*1 సుజ్ఞాన యోగ తత్త్వవి
ధిజ్ఞుల్ *2 భవబంధనముల ద్రెంచుచు భువిలో
*3 నజ్ఞాన పదము బొందరు
ప్రాజ్ఞుల్ *4 శివుగొల్తు రచల భావన దవులన్

*1 = 1వ కందము ప్రారంభము (సుజ్ఞాన పదముతో)
*2 = 2వ ,, ,, (భవబంధ - పదముతో)
*3 = 3వ ,, ,, ("నజ్ఞాన"- ,, )
*4 = 4వ ,, ,, ("శివుగొ"- ,, )

2) పాలుకురికి సోమన అనుభవసారము లోనిది (234 ప.)

*1 శ్రీరుద్ర నీలకంఠ ద్రపు
రారిం *2 గౌయువంగ భవభయాదుల దెలియున్
*3 దారుద్రుడైన త్రిపురవి
దారిం *4 దలపంగ దలపు దానై కలియున్

*1 = 1వ కందము ప్రారంభము ("శ్రీరుద్ర" పదముతో)
*2 = 2వ ,, ,, ("గౌయువం" ,, )
*3 = 3వ ,, ,, ("దారుద్రు" ,, )
*4 = 4వ ,, ,, ("తలపంగ" ,, )

[ఇట్టివే ప్రౌఢకవిమల్లన రుక్మాంగద చరిత్రలో కూడ కలవు.]

# సంప్రతించిన గ్రంథాలయములు

1. ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయము, హైదరాబాద్
2. డా॥ వి. ఎస్. కృష్ణ మెమోరియల్ గ్రంథాలయము, ఆంధ్ర విశ్వవిద్యాలయము వాల్తేరు.
3. శ్రీ వేంకటేశ్వర విద్యాలయపు రెఫరెన్సు గ్రంథాలయము, తిరుపతి.
4. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, ”
5. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ గ్రంథాలయము. హైదరాబాద్
6. ఆంధ్ర సారస్వత పరిషత్తు (భారతి సంపుటలు) గ్రంథాలయము, హైదరాబాద్
7. ఆం. ప్ర. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, తార్నాకా ”
8. స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, హైదరాబాద్
9. సిటీ సెంట్రల్ లైబ్రరీ, ”
10. సెమినార్ లైబ్రరీ, ఆర్ట్సు కళాశాల, ఉస్మా. విశ్వ. వి., హైదరాబాద్
11. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము, ”
12. శ్రీ రాజరాజ నరేంద్ర గ్రంథాలయము, వరంగల్లు
13. అమెరికన్ స్టడీస్ రిసెర్చి సెంటర్, హైదరాబాద్

ఆచార్య బిరుదురాజు రామరాజుగారి గృహ గ్రంథాలయము
” చేకూరి రామారావ్ గారి ” ”
డా॥ కోవెల సంపత్కుమారాచార్య గారి వ్యాసములు
విద్వాన్ రావూరి దొరసామిశర్మగారి గృహగ్రంథాలయము

# సంప్రతించిన పత్రికలు, సంచికలు

**పత్రికలు**

అముద్రిత గ్రంథ చింతామణి
ఆంధ్ర ప్రభ
ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
కళ
కృష్ణా పత్రిక

జాగృతి
జనధర్మ
పరిశోధన
భారతి
తెలుగు
త్రిలింగ
సాహితి
శారద

**సంచికలు**

1) ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు
2 కాకతీయ సంచిక (సం. మారేమండ రామారావు)
3) గిడుగు రామమూర్తి పంతులు సప్తతితమ జన్మదినోత్సవ సంచిక (సం. తెలికిచర్ల వెంకటరత్నము-1953)
4) గురజాడ సంస్మరణ సంచిక (సం. ఎం. చలపతిరావు) దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘ ప్రచురణ
5) పరిశోధన — పాల్కురికి సోమన ప్రత్యేక సంచిక
6) త్రిలింగ రజతోత్సవ సంచిక
7) రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. (సం భావరాజు వేంకట కృష్ణారావు) (1922)
8) శాతవాహన సంచిక. (సం. మారేమండ రామారావు)
9) శారదా మందిరము - గోలి ఈశ్వరయ్య వ్యాపార సంస్థ రజతోత్సవ సంచిక (1971)
10) **Annals of Oriental Research (Madras University)**

# సంకేత వర్ణ వివరణ

**గ్రంథములు :**

| | |
|---|---|
| 1. అప్ప | అప్పకవీయము |
| 2. ఆం.మ.భా.సం.ము | ఆంధ్ర మహాభారతము-సంశోధిత ముద్రణము |
| 3. ఆం.మ.భా.ఛం.శి | ఆంధ్ర మహాభారతము-ఛందశ్శిల్పము |
| 4. ఆం.మ.భాగ | ఆంధ్ర మహాభాగవతము (పోతన) |
| 5. క.జ. | కవిజనాశ్రయము |
| 6. కా.చూ. | కావ్యాలంకార చూడామణి |
| 7. కాశీ | కాశీ ఖండము |
| 8. కు.సం | కుమార సంభవము [నన్నెచోడుడు] |
| 9. ఛం.ద. | ఛందో దర్పణము [అనంతుడు] |
| 10. ఛం.శా. | ఛందోऽనుశాసనము |
| 11. ఛం.ప.కో. | ఛందః పదకోశము |
| 12. తె.ఛం.రీ. | తెలుగులో ఛందో రీతులు [గిడుగు వారిది] |
| 13. తె.భా.ఛం.రీ. | తెలుగు భాషలో ఛందోరీతులు [రావూరి వారిది] |
| 14. తె.ఛం.వి. | తెలుగు ఛందో వికాసము (సంపత్కుమార) |
| 15. ద.దే.భా.సా.దేశి | దక్షిణ దేశ భాషా సారస్వతములు-దేశి |
| 16. నా.శా. | నాట్యశాస్త్రము |
| 17. పం.చ. | పండితారాధ్య చరిత్రము |
| 18. ప.వీ.చ. | పల్నాటి వీర చరిత్రము |
| 19. పిం.ఛం. | పింగళ చ్ఛందమ్ |
| 20. ప్ర.రా.వేం.వి.వి. | ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము |
| 21. ప్రా.పైం. | ప్రాకృత పైంగళమ్ |
| 22. ల.శి. | లక్షణ శిరోమణి |
| 23. ల.సా.సం. | లక్షణ సార సంగ్రహము |
| 24. వృ.ర. | వృత్త రత్నాకరము |
| 25. శృం.నై. | శృంగార నైషధము |

**గ్రంథేతరములు:**

| | |
|---|---|
| 26. ఆ. | ఆశ్వాసము |
| 27. ఆం.సా.ప.ప్ర. | ఆంధ్ర సాహిత్య పరిషత్ ప్రచురణ |

| | |
|---|---|
| 28. ఆం.ప్ర.ప్ర.ప్రా.వి.పు.భాం. | ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము |
| 29 ఆం.ప్ర.సా.అ. | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ |
| 30. ఆ.వె. | ఆటవెలది |
| 31. ఇం.గ. | ఇంద్ర గణము (లు) |
| 32. కో.రా. | కోరాడ రామకృష్ణయ్య |
| 33. గ. | గణములు |
| 34. గి.వెం.సీ. | గిడుగు వెంకట సీతాపతిగారు |
| 35. చి.పె. | చిత్రకవి పెద్దన |
| 36. చూ. | చూడుము |
| 37. చం.గ. | చంద్ర గణము (లు) |
| 38. డా. | డాక్టర్ |
| 39. తే.గీ | తేటగీతి |
| 40 ప. | పద్యము |
| 41. పు. | పుట |
| 42. పూ.భా. | పూర్వభాగము |
| 43. పొ.వేం.ర.క. | పొత్తపి వేంకట రమణ కవి |
| 44. ప్ర. | ప్రచురణ |
| 45. బం.నా. | బండి నాగరాజుగారు |
| 46. బి.రా.రా. | ఆచార్య బిరుదురాజు రామరాజుగారు |
| 47. బ్ర.గ. | బ్రహ్మగణములు |
| 48. మా | మాత్రలు |
| 49. రా.దొ.సా.శ. | రావూరి దొరస్వామి శర్మగారు |
| 50. రు.గ. | రుద్ర గణములు |
| 51. వి.గ. | విష్ణు గణములు |
| 52. వి.పె. | విన్నకోట పెద్దన |
| 53. సం. | సంచిక |
| 54. సంపు. | సంపుటి |
| 55. సంపా | సంపాదకులు/సంపాదనము |
| 56. సూ.గ. | సూర్యగణములు |
| 57. శా.ప.మం. | శాసన పద్యమంజరి |
| 58. శ్లో. | శ్లోకము |

# సంప్రతించిన గ్రంథాలు

## (అ) తెలుగు

| | | |
|---|---|---|
| అనుభవ సారము | పాల్కురికి సోమనాథుడు | వావిళ్ల (1955) |
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి | (1) వావిళ్ళ (1970)<br>(2) పమ్మి అరుణాచలం ముసెట్టి (1902) |
| ఆంధ్ర తమిళ ఛ్ఛంద స్సామ్యములు | పంగిపురం కృష్ణమాచార్యులు | వావిళ్ళ (1941) |
| ఆంధ్ర మహాభారతము ఛందః శిల్పము | డా॥ పాటిబండ మాధవశర్మ | అభినవ భారతి (1966) |
| ఆంధ్ర మహాభారతము (సంశోధిత ముద్రణము) | కవిత్రయము | ఉస్మానియా విశ్వవిద్యా. ప్రచురణ (1968-73) |
| ఆంధ్ర మహాభాగవతము | పోతన | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (1968) |
| ఆంధ్ర గీర్వాణ ఛందము | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | శ్రీ వేం. విశ్వవి. (1977) |
| ఆంధ్ర భాషా భూషణము | కేతన | వడ్లమూడి సం. |
| ఆనంద రంగ ఛందము (రంగరాట్ఛందము) | కస్తూరి రంగకవి | వావిళ్ళ (1952) |
| ఉదాహరణ వాఙ్మయచరిత్ర | నిడుదవోలు వేంకటరావు | విజయభాస్కర హైదరాబాద్ (1968) |
| ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు | సి.వి. కృష్ణా బుక్ డిపో |
| కవిజనాశ్రయము | మల్లియరేచన | (1) వావిళ్ళ (1969)<br>(2) ఆం. సా. పరిషత్<br>(3) మహతీ గ్రంథమాల (1969) |
| కరీంనగర జిల్లా శాసనములు | ఆం. ప్ర. ప్ర. పురావస్తు విభాగము | |
| కవి చింతామణి | వెల్లంకి తాతంభట్టు | ఆం. ప్ర. ప్ర. ప్రా లి.పు.భాం. (1982. |

| | | |
|---|---|---|
| కన్నడ సాహిత్య చరిత్ర | ఆర్వియస్. సుందరం | ఆం. ప్ర. సా. అ. (1977) |
| కళాపూర్ణోదయము | పింగళిసూరన | |
| కవి జన సంజీవని | ముద్దరాజు రామన | |
| కాశీఖండము | శ్రీనాథుడు | |
| కుమార సంభవము | నన్నిచోడుడు | 1) వావిళ్ళ 2) మద్రాస్ విశ్వవిద్యా. ప్రచు. |
| కువలయాశ్వ చరిత్రము | సవరము చిన నారాయణ | ఆం. ప్ర. సా. అ. |
| కావ్యాలంకార చూడామణి | విన్నకోట పెద్దన | వేదం వారి ప్ర. |
| గురజాడ | శ్రీశ్రీ | |
| గరళపురీ ఛ్ఛందము | | |
| ఛందః పదకోశము | కోవెల సంపత్కుమారాచార్య దువ్వూరి వేం. రమణశాస్త్రి | తెలుగు అకాడమీ (1977) |
| ఛందస్సు | వేదం వేంకట రాయశాస్త్రి | వేదంవారి ప్ర. (1930) |
| ఛందశ్శాస్త్రము | జేకుసుళ్ళ రాజగోపాలరావు | |
| ఛందో దర్పణము | అనంతామాత్యుడు | 1) వావిళ్ల (1968) 2) తత్త్వదర్శిని వ్యాఖ్య (1968) |
| ఛందో దర్పణము | వెల్లంకి తాతంభట్టు | ఆంధ్ర విశ్వవిద్యా. లిఖిత ప్రతి సం. 713 |
| ఛందో నిరంకుశము | పైడిపాటి? పైన సుబ్రహ్మణ్య కవి | శ్రీ వే ప్రా వి. పు. భాం. తిరుపతి సం. 616 |
| ఛందో హంసి | బుర్రాకమలాదేవి | విశాఖ సాహితి |
| జానపద గేయ గాథలు | డా॥ నాయని కృష్ణకుమారి | |
| జాను తెలుగు | వడ్లమూడి గోపాలకృష్ణయ్య | రసార్గృష్ణ (1972) |
| తెలంగాణ పల్లెపాటలు | బి. రామరాజు | |
| తెలుగు కవుల చరిత్ర | నిడుదవోలు వేంకటరావు | |

| | | |
|---|---|---|
| తెలుగు కన్నడ జానపద గేయములు | డా॥ ఆర్. పీ. యస్. సుందరం | |
| తెలుగులో కవితా విప్లవాల స్వరూపం | వెల్చేరు నారాయణరావ్ | (1978) |
| తెలుగు ఛందో వికాసము | కోవెం సంపత్కుమారాచార్య | కులపతి సమితి వరంగల్ (1962) |
| తెలుగు జానపద గేయ సాహిత్యము | డా॥ బిరుదు రాజు రామరాజు | |
| తెలుగు భాషలో ఛందోరీతులు | విద్వాన్ రావూరి దొరసామిశర్మ | (1962) |
| తెలుగు మెరుగులు | వేటూరి ప్రభాకరశాస్త్రి | ఆంధ్ర గ్రంథమాల |
| తెలుగులో ఛందోరీతులు | గిడుగు వేంకట సీతాపతి | విశాల ప్రచ్లి. (1961) |
| తెలుగు శాసనములు | జి. పరబ్రహ్మశాస్త్రి | ఆం. ప్ర. సా. అ. (4975) |
| త్రివేణి | జానపద గేయ సంకలనము | |
| దక్షిణ దేశ భాషా సార స్వతములు-దేశి | కోరాడ రామకృష్ణయ్య | (1970) |
| దక్షిణాత్య దేశిచ్ఛందో రీతులు-తులనాత్మక పరిశీలనము | డా॥ కే. సర్వోత్తమన్ | తిరుపతి శ్రీ వేం. విశ్వ విద్యాలయము |
| ద్విపద వాఙ్మయము | డా॥ జి. నాగయ్య | (1967) |
| నరసింహ శతకము | శేషప్పకవి | |
| పాటలలో ఛంధస్సు | పి. రాజగోపాలనాయుడు | భారతీ ప్ర. చిత్తూరు |
| పల్నాటి వీర చరిత్రము | సంపా. పింగళి లక్ష్మికాంతం | విశాలాంధ్ర (1961) |
| పండితారాధ్య చరిత్రము | పాలుకురికి సోమనాధుడు | ఆంధ్ర గ్రంథమాల |
| పారిజాతాపహరణము | నంది తిమ్మన | వావిళ్ల |
| ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము | గణపవరపు వేంకట కవి | ఆం. ప్ర. సా. అ. హైదరాబాద్ |

| | | |
|---|---|---|
| ప్రబంధ రత్నావళి | సంపా. వేటూరి ప్రభాకరశాస్త్రి | |
| ప్రాఙ్నన్నయ యుగము | డా॥ దివాకర్ల వేంకట అవధాని | |
| ప్రాఙ్నన్నయ యుగపు శాసన ఛందస్సులు [అముద్రిత సిద్ధాంత గ్రంథము] | డా॥ తంగిరాల నారాయణశాస్త్రి | ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సమర్పణము |
| ప్రాచీనాంధ్ర శాసనాలు | డా॥ బూదరాజు రాధాకృష్ణ సం. | ఆం.ప్ర.సా అ. |
| బసవ పురాణము | పాల్కురికి సోమన (సంపా. బండారు తమ్మయ్య) | వావిళ్ల (1966) |
| బాల వ్యాకరణము | పరవస్తు చిన్నయసూరి | |
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకట రత్నము పంతులు | (1893) |
| మార్గ – దేశి | పడ్లమూడి గోపాలకృష్ణయ్య | |
| మిన్నేరు | నేదునూరి గంగాధరం | ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి |
| మీగడ తరకలు | వేటూరి ప్రభాకరశాస్త్రి | మణిమంజరి, ముక్త్యాల (1951) |
| మృదంగ తత్త్వము | ధర్మాల రామమూర్తి | రాజమండ్రి (1960) |
| మొల్లరామాయణం | ఆతుకూరి మొల్ల కవయిత్రి | |
| యక్షగాన వాఙ్మయ చరిత్ర | డా॥ యస్వీ జోగారావు | |
| లక్షణ నవరత్న మాలిక | చిరుమర్రి నరసింహం | |
| రగడల లక్షణము (అముద్రితము) | బండి వేంకటస్వామి | శ్రీ వేంకటేశ్వర లిఖిత పుస్తక భాండాగారము |
| లక్షణ రాజీయము | | సంఖ్య 1636 |
| లక్షణ విలాసము | పెనుమర్తి వేంకటాచార్యుడు | సంఖ్య 1024 |
| లక్షణ సార సంగ్రహము | చిత్రకవి పెద్దన | ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ |
| లక్షణ సార సంగ్రహము | కూచిమంచి తిమ్మకవి | |
| లక్షణ శిరోమణి | పొత్తపి వేంకట రమణకవి (సంపా. రావూరి దొ.సా.శర్మ) | ఆం. ప్ర. సా. అ. (1979) |

| | | |
|---|---|---|
| వచన పద్యం-లక్షణ చర్చ | కోవెల సంపత్కుమార<br>చేకూరి రామారావు | దేశిబుక్ హౌస్ (1978) |
| వరంగల్ జిల్లా శాసనములు | ఆం. ప్ర. ప్రభు. పురా. విభాగ డైరెక్టరేటు | |
| వసు చరిత్ర | రామరాజ భూషణుడు | వావిళ్ల |
| విజ్ఞాన సర్వస్వము 3, 4, 6 సంపుటులు | తెలుగు భాషా సమితి ప్రచురణ | |
| విశ్వనాథ మధ్యాక్కరలు | విశ్వనాథ సత్యనారాయణ | |
| విష్ణుమాయా విలాసము | కంకంటి పాపరాజు | వావిళ్ల |
| వ్యాస చంద్రిక | గురజాడ అప్పారావు | |
| వ్యాస రచనల సూచి (1875-1972) | సంపా. సే. శ్రీ. కృష్ణమూర్తి | ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ |
| సకల లక్షణ సార సంగ్రహ చింతామణి | ఉప్పులూరి వేంకటరెడ్డి | శ్రీ వేం. ప్రా. లి. పు. భం. సం. 466 |
| సమగ్రాంధ్ర సాహిత్యము | ఆరుద్ర | ఎం. శేషాచలం అండ్ కో |
| సమీరకుమార విజయము | పుష్పగిరి తిమ్మన | |
| సారంగధర చరిత్రము | చేమకూర వేంకట కవి | ఆం.ప్ర.సా అకాడమీ |
| సారస్వత వ్యాసములు (1,2,3,4 సంపు.) | | ఆం.ప్ర.సా.అకాడమీ, హైద్రాబాద్ |
| సాహితీ జగతి | కాశూరి వ్యాసమూర్తి | |
| శివరాత్రి మహాత్మ్యము | శ్రీనాథుడు | ఆంధ్ర సారస్వత పరిషత్తు (1968) |
| శృంగార నైషధము | ,, | వేదంవారి ప్రచురణ |
| శ్రీ మద్రామాయణ కల్ప వృక్షము | విశ్వనాథ సత్యనారాయణ | |

| | | |
|---|---|---|
| సులక్షణ సారము | లింగమగుంటి తిమ్మన | బాలసరస్వతీబుక్ డిపో |
| కాపస పద్యమంజరి | (రెండు భాగములు) | ఆం. సా. ప. |
| హంస వింశతి | అయ్యలరాజు నారాయణా మాత్యుడు | ఆం. ప్ర. సా. అకాడమీ |

[ఇంకా పెక్కు ప్రాచీనాంధ్ర కావ్యములు (ముద్రితములు) దేశి ఛందో ప్రయోగ పరిశీలనములో ఉపయోగించుకొనబడినవి సందర్భవశమున ఇవ్వబడినవి.]

## (ఆ) ప్రాకృతము

| | | |
|---|---|---|
| కవిదర్పణమ్ | అజ్ఞాత కర్తృకం | రాజస్థాన్ ప్రాచ్య విద్యాప్రతిష్ఠాన్, జోధ్‌పూర్ (1962) |
| గాథాలక్షణమ్ | నందితాడ్యుడు | |
| ఛందః కోశమ్ | రత్నశేఖరుడు | |
| ప్రాకృత పైంగళమ్ [vol I & II] | | ప్రాకృత్ టెక్స్ట్ సొసైటి, వారణాసి (1959) |
| వృత్తజాతి సముచ్చయ్ | విరహాంకుడు | రాజ. ప్రా.వి.ప్ర. జోధపూర్ (1962) |
| స్వయంభూ ఛందస్ | స్వయంభువు | ,, ,, |

## (ఇ) హిందీ

| | | |
|---|---|---|
| అదునిక్ హిందీ కావ్య మేం ఛంద్ యోజనా | డా॥ పుత్తూలాల్ శుక్ల | లక్నో విశ్వవిద్యాలయ్ |
| ఛందో దర్పణ్ (అభినవ్ హిందీ చందః శాస్త్ర) | డా॥ గౌరీశంకర్ మిశ్ర ద్విజేంద్ర | అనుపమ ప్రకాశన్ (1977) |
| ఛందః ప్రభాకర్ | జగన్నాధ ప్రసాద్ భాను | హిందీ పుస్తక్ ఏజన్సీ, కాశీ |
| మాత్రిక్ ఛందోంకా వికాస్ | డా॥ శివానంద్ ప్రసాద్ | బీహార్ రాష్ట్ర భాషా పరిషత్, పాట్నా (1964) |

## (ఈ) సంస్కృతము

| | | |
|---|---|---|
| ఆంధ్ర శబ్ద చింతామణి | నన్నయ (?) | వావిళ్ళ |
| ఉత్తర రామ చరితమ్ | భవభూతి | ఆం. ప్రసా. అ. |
| కావ్యాదర్శమ్ | దండి | చౌకంబా |
| ఛందో ఽనుశాసనమ్ | హేమ చంద్రా చార్యః | సింఘి జైన శాస్త్ర విద్యాపీఠ్ (భారతీయ విద్యాభవన్, బొంబాయి) (1961) |
| ఛందో ఽనుశాసనమ్ | జయకీర్తి | జయదామన్ |
| ఛందో మంజరి | గంగాదాసః | చౌకంబా, వారణాసి (1976) |
| జనాశ్రయీ | మాధవవర్మ | హేమ చంద్రుని ఛందోఽనుశా.కు అనుబంధముగా ప్రచురితము |
| జయదామన్ | సంపా. హెచ్.డి. వేలంకర్ | హరితోషి గ్రంథమాల బొంబాయి, (1949) |
| జయదేవ ఛందమ్ | జయదేవుడు | |
| ధ్వన్యాలోకమ్ | ఆనంద వర్ధనా చార్యః (లోచన వ్యాఖ్యతో) | చౌకంబా |
| నాట్యశాస్త్రమ్ | భరతముని [అభినవ భారతి వ్యాఖ్య] | ,, |
| నృత్త రత్నావళి | జాయప సేనాని | ఆం.ప్ర.సంగీత్ నాటక అకాడమీ [1966] |
| నిరుక్తమ్ | యాస్కముని | |
| ప్రతాపరుద్రీయమ్ | విద్యానాథుడు | మోతీలాల్ బనారసీదాస్ |

| | | |
|---|---|---|
| పింగళ ఛందశ్శాస్త్రమ్ | పింగళముని | 1) చౌకంబా 2) పరిమళ్ పబ్లికే. ఢిల్లీ [1975] |
| మేఘ సందేశము | కాళిదాసు | చౌకంబా |
| వాణీ భూషణమ్ | దామోదర మిశ్రుడు | నిర్ణయసాగర్ బొంబాయి [1895] |
| వాగ్వల్లభః | దుఃఖ భంజనరవి | చౌకంబా [1933] |
| వృత్త రత్నాకరమ్ | కేదారభట్టు | మోతీలాల్ బనారసీదాస్ |
| వృత్త రత్నావళి | వేంకటేశకృతం | అడయార్ లైబ్రరీ మద్రాస్ [1952] |
| వృత్త మౌక్తికమ్ | భట్ట చంద్రశేఖరః | రాజ.ప్రా.వి.ప్ర. జోధపూర్ [1965] |
| సంగీత రత్నాకరమ్ | శార్ఙ్గదేవుడు | ఆం.ప్ర.సం నా.అ. [1966] |
| సాహిత్య దర్పణము | విశ్వనాథ కవిరాజు | మోతీలాల్ బనారసీదాస్ [1974] |
| సువృత్త తిలకమ్ | క్షేమేంద్రుడు [వ్రజమోహన్‌దాస్ వ్యాఖ్య] | చౌకంబా [1968] |
| శ్రీమద్రామాయణమ్ (బాలకాండమ్) | వాల్మీకి మహర్షి | జయలక్ష్మి ప్రచురణ హైదరాబాద్ |
| శ్రుతబోధమ్ | కాళీదాసః [ ? ] | చౌకంబా [1972] |


## (ఉ) ఆంగ్లము


| | | |
|---|---|---|
| A history of Malayalam metres | N. V. Krishna Warrior | Dravidian linguistic Association, Trivendrum. |
| A Comparative prosody of dravidian languages | J. Rajagopala Rao | 1913 |
| A Study of metre | J. S. Omond | |

| | | |
|---|---|---|
| A Theory of metre | Chatman Seymour | muton & Co. London (1965) |
| Chandombudhi of Nagavarma | Editor Rev. F. Kittel | Mangalore Basel mission book trust depositors (1875) |
| Enjoyment of Poetry | Max eastman | New York (1689) |
| Epigraphica Indica XVII Vol. | | |
| History of English rhythm | E. Gwest | |
| History of Sanskrit language | S. K. De | Calcutta Univ. |
| Illusion and Reality | Christopher candwel | |
| Primitive Song | C. M. Bowra | Weidenfeld & Nicolson (London) |
| South Indian Inscriptions X Vol | | |
| The Commonness in the metres of Dravidian language | S. Subrahmaniam | D.L.A. Trivendrum (1977) |
| The Telugu literature outside the telugu country | Korada Rama Krishnayya | Madras University (1947) |
| The nature of poetry | Stauffex, Donald, A. | |
| Versification | W. K. Wimsaf | New York Univesrity |


[శేషించిన ఉపజీవ్య గ్రంథములు సందర్భాను సారముగా గ్రంథములో ప్రతి ప్రకరణాంతమున సంకేత పూర్వకముగా సూచింపబడినవి].

* * *

# తప్పొప్పుల పట్టిక

| అధ్యా | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| I | 9 | 13 | పరిజ్ఞ్యాన | పరిజ్ఞాన |
| | 17 | 8 | పరిమణా | పరిణామ |
| | | 13 | ప్రభానితుడైన | ప్రభావితుడైన |
| | 18 | 17 | కల | కాక |
| | 19 | 1 | ఆసువు | ఆశువు |
| | | 38 | నిచ్ఛేద | విచ్ఛేద |
| | **21** | **10** | **Listered** | **Listened** |
| | | **11** | **Hard** | **Heard** |
| | 26 | 1 | జుసంత్త | సంజుత్త |
| | 29 | 22 | పైనొక్క | పైనొక్క |
| | 31 | 8 | దుర్యారో | దుర్వారో |
| | 32 | 13 | జాదము | జూదము |
| | | 16 | ఏదము | పదము |
| | 36 | 1 | సగణ | నగణ |
| | | 2 | నవ | నల |
| | | 4 | నల | నవ |
| | 41 | 27 | సంపూర్ణణ | సంపూర్ణ గణ |
| | 42 | 19 | గణములన | గణములిన |
| | 43 | 19 | సల | నల |
| | 44 | 5 | సురేంద్ర | సూర్యేంద్ర |
| | | 23 | కానవచ్చును | కావనవచ్చును |
| | 45 | 3 | లేనియో | లేవియో |
| | 48 | 23 | 1 నగ. | 1 వగ. |
| | 50 | 6 | విసర్గ | నిసర్గ |
| | 54 | 23 | తకకట | తకకిట |
| | **58** | **15** | **Movrae** | **Morae** |
| | 86 | 12 | స్వరసంవ | స్వరసంధి |
| | 88 | 8 | దేఛంద | దేశిచ్ఛంద |
| | 93 | 1 | నరరాజు | సురరాజు |
| | 102 | 17 | ఆద్యఛాంద | ఆద్యచ్ఛాంద |
| | 103 | 22 | యోన్న చరితా | యోన్న తచరితా |
| | 107 | 23 | జహ్మా, ముఖాఘ | జిహ్మా, ముఖౌఘ |
| | 110 | 24 | ప్రాససీమన | ప్రాససీసమన |
| **II** | **131** | **21** | **Carese** | **Canarese** |

| అధ్యా | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| III | 138 | 28 | గల్గి | గల |
| | 146 | 10 | పెండ్డాంబు | పెణ్డమ్ము |
| | 147 | 21 | దుగ్గఁ | దుగ్గౕ |
| IV | 183 | 17 | చేసి | బేసి |
| | 187 | 22 | గుణ | గణ |
| | 191 | 24 | పెద్దగల | పెద్ద అక్షరములుగల |
| | 194 | 15 | పైచిత్రి | వైచిత్రి |
| | 196 | 14 | పుష్ఠ | షష్ఠ |
| | 203 | 6 | చేద్ధ | చే ఉద్ధ |
| | 208 | 14 | మారి | మార్గి |
| | 243 | 18 | అంతరా | అంతా |
| | 269 | 21 | చెప్పినా | చెప్పెనా |
| | 275 | 2 | నిర్మాతము | నిర్మితము |
| | 281 | 1 | షడ్వింతిచ్ఛ | షడ్వింశచ్ఛ |
| | 282 | 12 | సేడుకాక | నేడగాగ |
| | 288 | 10 | ప్రాయము | ప్రాయము[12] |
| | 302 | 22 | త్రిదతేంద్ర | త్రిదశేంద్ర |
| | 317 | 16 | చేసి | బేసి |
| | | 27 | అనగా | అనక |
| V | 9 | 1 | యేంఽ | యేఽం |
| | 25 | 18 | కాత్స్థ | కాకుత్స్థ |
| | 29 | 18 | గణాంత్యే | గణాంత్యప్రాస |
| | 38 | 21 | సరసిరూహ | సరసిరుహ |
| | 57 | 8 | వీసము | సీసము |
| | 77 | 9 | వగుట | వగుట[6] |
| | 84 | 7 | ప్రాపయతి | ప్రాసయతి |
| VI | 24 | 3 | మొగ్గా | మొ[4]గ్గా |
| | “ | 12 | ఇదికూడ | అన్న గేయము |
| | 36 | 10 | (స్వకీయం) | (స్వకీయం-గ్రంథముఖచిత్రం) |
| VII | 42 | 26 | వచ్చినది[2] | పచ్చినది |
| | 44 | 9 | చిత్రకవి | చిత్రకవిత |
| | 49 | 12 | కవిత | కలిత |
| | “ | 18 | సాధ్వ | సాధ్య |
| | “ | 23 | నని | వని |
| VIII | 62 | 20 | కొక్కొంచ | కొక్కొండ |
| | 64 | 16 | సంప్రథా | సంప్రదా |